





శ్రీ గురుభ్యోనమః.

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః.

దేవతాప్రార్థనా.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే
రఘునాధాయ నాధాయ సీతాయాః పతయేనమః.

వాల్మీకిప్రార్థనా.

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్
వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః
శృణ్వ న్రామకథానాదం కోనయాతి పరాంగతిమ్.

ఆంజనేయ ప్రార్థనా.

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్.
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్
రామాయణమహామాలారత్నం వందే౽నిలాత్మజమ్.
మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి.

శ్రీరామాయణ ప్రశంసా.

శ్రీమద్బ్రహ్మతదేవ బీజమమలం యస్యాఙ్కురశ్చిన్మయః,
కాండైస్సప్తభిరన్వితో౽తివితతో ఋష్యాలవాలోదితః;
పత్రైస్త త్త్వసహస్రకై స్సువిలసచ్ఛాఖాశతైః షణ్ముఖి,
శ్చాత్మప్రాప్తిఫలప్రదో విజయతే రామాయణస్స్వస్తరుః.
యఃకర్ణాంజలిసంపుటై రహరహ స్సమ్యక్పిబత్యాదరా,
ద్వాల్మీకేర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు;
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యన్తసోపద్రవమ్,
సంసారంసవిహాయ గచ్ఛతి పుమాన్విష్ణోఃపదంశాశ్వతమ్.
వాల్మీకిగిరిసంభూతా రామాంభోనిధిసంగతా
శ్రీమద్రామాయణీగంగా పునాతు భువనత్రయమ్,



శ్రీ

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# శ్రీమదారణ్యకాండప్రారంభః.

ప్రవిశ్యతు మహారణ్యం దండకారణ్య మాత్మవాన్
దదర్శ రామో దుర్ధర్ష స్తాపసాశ్రమమండలమ్. ౧

అవతారిక.— అయోధ్యాకాండమునందు, అవిద్యాలేపంబులేమియు, నిత్యానందపరిపూర్ణతయు, నిరతిశయప్రకాశరూపతయు, ధర్మప్రవర్తకతయు, మొదలుగాఁగల, వేదాంతవేద్యుండగుశ్రీరామునికల్యాణగుణంబులు వర్ణింపఁబడినవి. ఇంకనద్దేవదేవుని, సజ్జనసంరక్షణరూపంబగుధర్మవిశేషంబు దెలుపుటకై యారణ్యకాండం బారంభింపఁబడుచున్నది. లేక; పితృవచనపరిపాలనంబు పరమధర్మంబనియయోధ్యాకాండంబునం దెలుపఁబడినది. సజ్జనసంరక్షణరూపధర్మవిశేషంబుఁబ్రతిపాదింప నారణ్యకాండం బారంభింపఁబడుచున్నది.

టీక॥ ఆత్మవాన్=అధికమయినధైర్యముగలవాఁడును; దుర్ధర్షః= ఎదిరింపనలవిగానివాఁడునగు ; రామః = రాముండు; మహారణ్యం= గొప్పయడవియగు; దండకారణ్యం=దండకారణ్యమును; ప్రవిశ్యతు=ప్రవేశించియు; తాపసాశ్రమమండలం= ఋష్యాశ్రమములసమూహమును ; దదర్శ = చూచెను.

మహాధైర్యశాలియు దుర్ధర్షుండునగురాముండు, భయంకరాకారంబయినదండకారణ్యంబుఁబ్రవేశించి, యచ్చటనుండుఋష్యాశ్రమంబులం జూచెను. అని, తాత్పర్యము.

కుశచీరపరిక్షిప్తం బ్రాహ్మ్యా లక్ష్మ్యా సమావృతమ్




యథా ప్రదీప్తం దుర్దర్శం గగనే సూర్యమండలమ్. ౨

టీక॥ కుశచీరపరిక్షిప్తం = దర్భలచేతను నారచీరలచేతనువ్యాపింపఁబడినదియు; బ్రాహ్మ్యా=బ్రహ్మసంబంధినియగు; లక్ష్మ్యా=కాంతిచేత; సమావృతం=చుట్టఁబడినదియు; గగనే= ఆకాశమునందు; ప్రదీప్తం=ప్రకాశించుచున్న; దుర్దర్శం= చూడఁగూడని, సూర్యమండలంయథా ( స్థితం ) = సూర్యమండలమువలె నున్నదియు నగు ; తాపసాశ్రమ మండలం , రామః, దదర్శ(అధ్యాహృతము ఇట్లు , ముందును నెఱుంగునది) = ఋష్యాశ్రమములసమూహమునుజూచెను.

హోమధూమ్యర్థమయితీసికొనివచ్చి నదర్భలచేతను దడిపియారవేయఁబడిన వల్కలంబులచేతను ఒప్పుచున్నదియుఁ దపోబలజన్యంబగుబ్రహ్మవర్చస్సుచేవ్యాపింపఁబడినదియు నాకాశంబునదుర్దర్శంబై వెలుంగు మధ్యాహ్నసూర్యమండలమంబోలెఁజూపట్టుచున్నదియు నగు, నాశ్రమసమూహమును రాముండు చూచెను. అని, తాత్పర్యము.

శరణ్యం సర్వభూతానాం సుసమ్మృష్టాజిరం తథా
మృగై ర్బహుభి రాకీర్ణం పక్షిసంఘై స్సమావృతమ్. ౩

టీక॥ సర్వభూతానాం= సమస్తప్రాణులకును; శరణ్యం = వాసయోగ్యంబును; తథా=అట్లు ; సుసమ్మృష్టాజిరం = చక్కఁగా నలుకఁబడినభూమిగలదియు; బహుభిః= పెక్కులయిన; మృగైః = జింకలచేత ; ఆకీర్ణం=వ్యాపింపఁబడినదియు; పక్షిసంఘైః=పక్షులసమూహములచేత ; సమావృతం=చుట్టఁబడినదియునగు; తాపసాశ్రమమండలం, రామః , దదర్శ= ఋష్యాశ్రమసమూహమును, రాముండు, చూచెను.

సమస్తప్రాణులకును వాసయోగ్యంబును జక్కఁగానలుకఁబడినభూములుగలదియుఁ బెక్కుమృగంబులతోను మధురంబులగుపక్షులతోనుం గూడినదియునగు నాశ్రమసమూహమును రాముండు, చూచెను. అని, తాత్పర్యము.

పూజితంచ ప్రనృత్తంచ నిత్య మప్సరసాం గణైః

టీక॥ నిత్యం=ఎల్లప్పుడును; అప్సరసాం=అప్సరస్త్రీలయొక్క; గణైః=సమూహములచేతను; పూజితం=పూజింపఁబడినదియు; ప్రనృత్తం=అధికమయినయాడుటగలదియునగు; తాపసాశ్రమమండలం, రామః, దదర్శ= ఋష్యాశ్రమ సమూహమును, రాముఁడు చూచెను

ఎల్లప్పుడును, అత్యతిశయంబున నర్తనంబుసేయుచున్న యప్సరలచేఁ బూజింపఁబడుచున్నయాశ్రమ సమూహముంజూచెను. అని, తాత్పర్యము.

విశాలై రగ్నిశరణై స్స్రుగ్భాండై రజినైః కుశైః ౪
సమిద్భి స్తోయకలశైః ఫలమూలైశ్చ శోభితమ్.

టీక॥విశాలైః=వెడల్పులయిన; అగ్నిశరణైః=అగ్నిహోత్రగృహములచేతను; స్రుగ్భాండైః=యజ్ఞపాత్రలచేతను; అజినైః= కృష్ణాజినములచేతను; కుశైః=దర్భలచేతను; సమిద్భిః= సమిత్తులచేతను; తోయకలశైః = నీటిపాత్రములచేతను ; ఫలమూలైశ్చ=పండ్లచేతనుగడ్డలచేతను ; శోభితం=ప్రకాశించుచున్న; తాపసాశ్రమమండలం, రామః,దదర్శ= ఋష్యాశ్రమసమూహమును రాముఁడుచూచెను.

విశాలంబులగు నగ్నిహోత్రగృహంబులచేతను యాగపాత్రలచేతను కృష్ణాజినములచేతను, దర్భలచేతను సమిత్తులచేతను జలకలశంబులచేతనుఫలమూలంబులచేతను ఒప్పుచున్న ఋష్యాశ్రమములను రాముండు చూచెను. అని, తాత్పర్యము.

ఆరణ్యైశ్చ మహావృక్షైః పుణ్యై స్స్వాదుఫలై ర్వృతమ్. ౫

టీక॥ఆరణ్యైః= అడవియందుఁబుట్టినవియు; స్వాదుఫలైః= రుచ్యములగుఫలములుగలవియు;పుణ్యైః=పవిత్రములునగు; మహావృక్షైశ్చ= పెద్దవృక్షములచేతను; వృతం= చుట్టఁబడినదియునగు; తాపసాశ్రమమండలం, రామః, దదర్శ= ఋష్యాశ్రమసమూహమును, రాముండు, చూచెను.

మంచిఫలంబులుగలవియుఁ,బవిత్రంబులునగు గొప్పయడవి వృక్షంబులతో

గూడిన,యాశ్రమసమూహమును, రాముండు,చూచెను.అని,తాత్పర్యము.

బలిహోమార్చితం పుణ్యం బ్రహ్మఘోషనినాదితమ్
పుష్పై ర్వన్యైః పరిక్షిప్తం పద్మిన్యాచ సపద్మయా. ౬

టీక॥బలిహోమార్చితం= బలులచేతను హోమములచేతను సత్కరింపఁబడినదియు; పుణ్యం=పవిత్రమును; బ్రహ్మఘోషనినాదితం = వేదధ్వనిచే ధ్వనింపఁజేయఁబడినదియు; వన్యైః= అడవియందుఁబుట్టిన; పుష్పైః=పూలచేత; పరిక్షిప్తం= వ్యాపింపఁబడినదియు; సపద్మయా=కమలంబులతోఁగూడిన; పద్మిన్యా=తామరకొలనుతో; సహితం (అధ్యాహృతము)= కూడినదియునగు; తాపసాశ్రమ మండలం , రామః, దదర్శ=ఋష్యాశ్రమ సమూహమును, రాముండు, చూచెను.

భూతబల్యాదిబలులతోను వైశ్వదేవాదిహోమములతోనుంగూడినదియుఁ బుణ్యంబును వేదపారాయణధ్వనితోఁ గూడినదియు, దేవతార్చనకుసుమంబులతో నొప్పుచున్నదియుఁగమలశోభితంబగు కమలాకరముతోఁ గూడినదియు నగుఋష్యాశ్రమసమూహమును , రాముండుచూచెను. అని,తాత్పర్యము.

ఫలమూలాశనై ర్దాంతై శ్చీరకృష్ణాజినాంబరైః
సూర్యవైశ్వానరాభైశ్చ పురాణై ర్మునిభి ర్వృతమ్. ౭

టీక॥ఫలమూలాశనైః=పండ్లును గడ్డలునుఆహారముగాఁగలవారలును;దాంతైః = ఇంద్రియనిగ్రహముగలవారలును; చీరకృష్ణాజినాంబరైః= నారచీరలును కృష్ణాజినంబులునె వస్త్రములుగాఁ గలవారలును; సూర్యవైశ్వానరాభైః = సూర్యునియొక్కయునగ్నిహోత్రునియొక్కయుఁ గాంతి వంటి కాంతిగలవారలును;పురాణైః= వృద్ధులునగు; మునిభిః= ఋషులచేత; వృతం=చుట్టఁబడినదియునగు;తాపసాశ్రమమండలం, రామః,దదర్శ= ఋష్యాశ్రమసమూహమును రాముండు చూచెను.

ఫలమూలంబు లాహారంబుగాఁగొనువారలును జితేంద్రియులును వల్క-

లంబులను కృష్ణాజినంబులను ధరించియుండువారలును సూర్యునకు సరి వచ్చువారలును అగ్నిహోత్రసమానులు నగువృద్ధమునులతోఁగూడిన,ఋష్యాశ్రమసమూహమును, రాముండుచూచెను. అని, తాత్పర్యము.

పుణ్యైశ్చ నియతాహారై శ్శోభితం పరమర్షిభిః

టీక॥పుణ్యైః=పరిశుద్ధులును;నియతాహారైః=నిగ్రహింపఁబడిన యాహారముగలవారలునగు; పరమర్షిభిః = ఉత్తములయిన ఋషులచేత;శోభితం= ప్రకాశించుచున్న ; తాపసాశ్రమమండలం , రామః , దదర్శ = ఋష్యాశ్రమసమూహమును రాముండు, చూచెను.

పరిశుద్ధులును జితాహారులునగు, మున్నుచెప్పఁబడినమునులకును బూజనీయులయిన, మహర్షులతోనుంగూడిన, యాశ్రమసమూహమున, రాముండు,చూచెను. అని, తాత్పర్యము.

తద్బ్రహ్మభవనప్రఖ్యం బ్రహ్మఘోషనినాదితమ్. ౮
బ్రహ్మవిద్భి ర్మహాభాగై ర్బ్రాహ్మణై రుపశోభితమ్
స దృష్ట్వా రాఘవ శ్శ్రీమాన్ తాపసాశ్రమమండలమ్. ౯
అభ్యగచ్ఛ న్మహాతేజా విజ్యం కృత్వా మహద్ధనుః

టీక॥ మహాతేజాః= అధికమయిన పరాక్రమముగల; శ్రీమాన్= అధికమయినకాంతిగల; సః=ఆ; రాఘవః = రాముఁడు; బ్రహ్మభవనప్రఖ్యం=బ్రహ్మలోకంబుతోసమానమయినదియు; బ్రహ్మఘోషనినాదితం=వేదధ్వనిచేధ్వనింపఁజేయఁబడినదియు; బ్రహ్మవిద్భిః = బ్రహ్మమునెఱింగినవారలును ; మహాభాగైః= పూజ్యమయినయదృష్టముగలవారలునగు; బ్రాహ్మణైః=బ్రాహ్మణులచేత; ఉపశోభితం=ప్రకాశించుచున్నదియునగు; తత్= ఆ; తాపసాశ్రమమండలం = ఋష్యాశ్రమ సమూహమును; దృష్ట్వా=చూచి; మహత్ =గొప్పదగు; ధనుః=ధనుస్సును; విజ్యం=అల్లెత్రాడులేనిదానిఁగా; కృత్వా = చేసి; అభ్యగచ్ఛత్=పోయెను.

మహాతేజుండును శ్రీమంతుండునగు




రాముండు, బ్రహ్మలోకంబువంటిదియు వేదఘోషంబుచే నలంకరింపఁబడినదియు, బ్రహ్మవేత్తలగునుత్తమబ్రాహ్మణులతోనొప్పుచున్నదియునగు, నయ్యాశ్రమమండలంబుఁజూచి, ధనుస్సువిజ్యంబుగావించి, యయ్యాశ్రమంబులకుం బోయెను. అని, తాత్పర్యము.

దివ్యజ్ఞానోపపన్నా స్తే రామం దృష్ట్వా మహర్షయః. ౧౦
అభ్యగచ్ఛం స్తథా ప్రీతా వైదేహీంచ యశస్వినీమ్

టీక॥ దివ్యజ్ఞానోపపన్నాః= దివ్యజ్ఞానముతోఁగూడిన; తే=ఆ,మహర్షయః=మహర్షులు; రామం= రాముని; తథా=అట్లు; యశస్వినీం=అధికమయినకీర్తిగల; వైదేహీంచ=సీతాదేవిని; దృష్ట్వా=చూచి, ప్రీతాః=సంతసించినవారలయి; అభ్యగచ్ఛన్= ఎదుర్కొనిరి.

దివ్యజ్ఞానసహితులగుటంజేసి, రాముండునారాయణావతారరూపుండగుటయు, సీతాలక్ష్మణులమహాత్త్వంబునెఱింగినవారలగునమ్మహర్షులు, సీతారామలక్ష్మణులంజూచి, పరమసంతోషంబుననెదుర్కొనిరి.

అని, తాత్పర్యము.

తే తం సోమ మివోద్యంతం దృష్ట్వావై ధర్మచారిణః, ౧౧
లక్ష్మణంచైవ దృష్ట్వాతు వైదేహీంచ యశస్వినీమ్
మంగళాని ప్రయుంజానాః ప్రత్యగృహ్ణన్ దృఢవ్రతాః. ౧౨

టీక॥ధర్మచారిణః= ధర్మమునాచరించువారలును; దృఢవ్రతాః= స్థిరములయిననియమము గలవారలునగు, తే=ఆమునులు; ఉద్యంతం= ఉదయించుచున్న; సోమమివ(స్థితం)=చంద్రునివలెనున్న; తం=ఆరామునిః దృష్ట్వా వై =చూచినంతనె; లక్ష్మణంచైవ=లక్ష్మణుని; యశస్వినీం=అధికమయినకీర్తిగల; వైదేహీంచ=సీతను; దృష్ట్వాతు =చూచినంతనె; మంగళాని=మంగళంబులను; ప్రయుంజానాః= ప్రయోగించుచు; ప్రత్యగృహ్ణన్=ప్రతిగ్రహించిరి.

ధార్మికులును దృఢవ్రతులు నగునమ్మహర్షులు, ఉదయించుచంద్రుని




బోలెనున్న రాముని , సీతాలక్ష్మణులనుంజూచి, వారలకు మంగళాశీర్వాదంబులంగావించుచు, బ్రతిగ్రహించిరి. అని, తాత్పర్యము.

రూపసంహననం లక్ష్మీం సౌకుమార్యం సువేషతామ్
దదృశు ర్విస్మితాకారా రామస్య వనవాసినః. ౧౩

టీక॥ వనవాసినః= వనంబుననుండునట్టిఋషులు;విస్మితాకారాః = ఆశ్చర్యముతోఁగూడిన యాకారము గలవారలయి; రామస్య = రామునియొక్క; రూపసంహననం= రూపమును దేహమును; లక్ష్మీం= కాంతిని; సౌకుమార్యం = సుకుమారతను ; సువేషతాం = మంచివేషముగల్గుటను; దదృశుః=చూచిరి.
వనవాసులు,రామునిరూపంబును శరీరంబును,లక్ష్మినిసౌకుమార్యంబునుసౌందర్యంబునుంజూచి, యాశ్చర్యంబునొందిరి.అని, తాత్పర్యము.

వైదేహీం లక్ష్మణం రామం నేత్రై రనిమిషైరివ
ఆశ్చర్య భూతం దదృశు స్సర్వే తే వనచారిణః. ౧౪

టీక॥ తే=ఆ; వనచారిణః=వనవాసులు; సర్వే=అందఱును;వైదేహీం=సీతాదేవిని; లక్ష్మణం=లక్ష్మణుని;రామం=రాముని; ఆశ్చర్యభూతం=ఆశ్చర్యమగునట్లుగా; అనిమిషైః = ఱెప్పపాటులేని; నేత్రైః=కన్నులచేత(“ఇవ”అనునదివాక్యాలంకారార్థము); దదృశుః=చూచిరి.
వనవాసులందఱు, సీతాదేవిని,రామలక్ష్మణులను,ఱెప్పపాటువిడిచి, పరమాశ్చర్యంబునఁజూచిరి.అని, తాత్పర్యము.

తత్రైనంహి మహాభాగా స్సర్వభూతహితే రతమ్
అతిథిం పర్ణశాలాయాం రాఘవం సన్న్యవేశయన్. ౧౫

టీక॥ తత్ర= ఆయాశ్రమములందు;మహాభాగాః= పూజ్యమయినయదృష్ట

ముగలఋషులు ; సర్వభూతహితే= సమస్తప్రాణులమేలునందు;రతం= ఆసక్తుఁడయిన; అతిథిం=అతిథియగు ; ఏనం=ఈ; రాఘవం=రామునిః;పర్ణశాలాయాం=పర్ణశాలయందు ; సన్యవేశయన్ హి=విడియఁజేసిరిగదా!

అయ్యాశ్రమమండలంబున , మహాభాగులగుమునులు , సమస్తప్రాణిహితాసక్తుండగు రాముండతిథిగావచ్చుటకుసంతసించి , యాయనను బర్ణశాలకుఁదీసికొనిపోయిరి.

అని, తాత్పర్యము.

తతో రామస్య సత్కృత్య విధినా పావకోపమాః
ఆజహ్రుస్తే మహాభాగా స్సలిలం ధర్మచారిణః. ౧౬

టీక॥తతః=అటుపిమ్మట; పావకోపమాః= అగ్నిహోత్రునితోఁబోలికగల; మహాభాగాః=పూజ్యమయినయదృష్టముగల; ధర్మచారిణః = ధర్మమునాచరించునట్టి; తే=ఆమునులు;రామస్య=రామునకు; సత్కృత్య= పూజించి; సలిలం=జలమును;ఆజహ్రుః= తెచ్చిరి.

అంత , నగ్నిహోత్రతుల్యులును మహాభాగులును బరమధార్మికులునగు నమ్మునులు , రామునకుస్వాగతంబుఁజెప్పి, పూజార్థమయి, జలంబుఁదెచ్చిరి. అని, తాత్పర్యము.

పుష్పం మూలం ఫలం వన్య మాశ్రమంచ మహాత్మనః
నివేదయిత్వా ధర్మజ్ఞా స్తతః ప్రాంజలయోఽబ్రువన్.౧౭

టీక॥ ధర్మజ్ఞాః= ధర్మమునెఱింగినట్టిమునులు; మహాత్మనః= పూజ్యమయిన స్వభావముగల రామునకు; వన్యం=అడవియందుఁబుట్టిన; పుష్పం = పూలను; మూలం=గడ్డలను; ఫలం = పండ్లను; ఆశ్రమంచ=ఆశ్రమమును; నివేదయిత్వా(నివేద్య)=నివేదించి;తతః= అంత;ప్రాంజలయః=మంచిచేమోడ్పుగలవారలయి; అబ్రువన్=చెప్పిరి.

దివ్యజ్ఞానోపపన్నులగునాఋషులు, మహాత్ముండగు రామునకు,వనంబునందుఁగలిగిన పుష్పంబులను ఫలమూలంబులను నివేదించి, తమయాశ్రమంబును ఆయనకొప్పగించి, రామునినారాయ

ణావతారత నెఱింగినవార లగుటచే భక్తిపూర్వకంబుగా, నితరరాజుల కన్న నధికుండును భగవంతుండుననుభావనచే, జేమోడ్పుగీలించి, యిట్లని,విన్నవించిరి. అని, తాత్పర్యము.

ధర్మపాలో జనస్యాస్య శరణ్యస్త్వం మహాయశః
పూజనీయశ్చ మాన్యశ్చ రాజా దండధరో గురుః. ౧౮

టీక॥ మహాయశః = అధికమయినకీర్తిగలరాముఁడా! త్వం=నీవు; ధర్మపాలః= ధర్మమునాచరించువాఁడవు. అస్య=ఈ; జనస్య = జనమునకు; శరణ్యః = శరణు పొందఁదగిన వాఁడవును.పూజనీయశ్చ= పూజింపఁదగినవాఁడవును. మాన్యశ్చ=గౌరవింపఁదగినవాఁడవును. రాజా=రాజు; దండధరః= శిక్షనుధరించువాఁడు (కావున); గురుః= తండ్రి.

మహాయశుండవగురాముఁడా! నీవుధర్మమును పాలించువాఁడ వగుటచే,మాకందఱకును శరణ్యుండవు; పూజింపను గౌరవింపనుందగినవాఁడవు; ఏలయిన, రాజుదుష్టులశిక్షించుఁగావున, దండ్రివంటివాఁడు.అని, తాత్పర్యము.

ఇంద్రస్యేహ చతుర్భాగః ప్రజా రక్షతి రాఘవ
రాజా తస్మాద్వరాన్ భోగాన్ భుఙ్క్తే లోకనమస్కృతః. ౧౯

టీక॥ రాఘవ=రాముఁడా! ఇహ= ఈభూమియందు; ఇంద్రస్య = దేవేంద్రునియొక్క; చతుర్భాగః= నాలవభాగమయిన; రాజా=రాజు;ప్రజాః= జనులను;రక్షతి= కాపాడుచున్నాఁడు. తస్మాత్=అందువలన; లోకనమస్కృతః=జనముచే నమస్కరింపఁబడినవాఁడై; వరాన్=శ్రేష్ఠములయిన ; భోగాన్ = భోగములను; భుఙ్క్తే=అనుభవించుచున్నాఁడు.

రాముఁడా! రాజు, దేవేంద్రుని నాలవభాగంబునను, నితరదిక్పాలురయంశంబులను, నిర్మింపఁబడినవాఁడు;ప్రజలనురక్షించును; కావున, నతనికి, సమస్తభోగంబుల ననుభవించుట యుక్తముగానున్నది. అని, తాత్పర్యము.

తే వయం భవతా రక్ష్యా భవద్విషయవాసినః
నగరస్థో వనస్థో వా త్వం నో రాజా జనేశ్వరః. ౨౦

టీక॥ భవద్విషయవాసినః= నీదేశంబుననుండునట్టి; తే=అట్టి; వయం=మేము; భవతా=నీచేత; రక్ష్యాః=కాపాడఁదగినవారలము; జనేశ్వరః= జనులకుఁ బ్రభుండవైన; త్వం= నీవు; నగరస్థో వా= పట్టణంబుననున్నవాఁడవుగాని; వనస్థో వా= అడవియందున్నవాఁడవుగాని; నః=మాకు; రాజా=రాజవు.

మేమందఱము, నీదేశంబుననుండువారలముకావున, నీవెమాకురక్షకుండవు; పట్టణంబుననున్నను, వనంబుననున్నను, నీవెమాకు రాజవు.

అని, తాత్పర్యము.

న్యస్తదండా వయం రాజన్ జితక్రోధా జితేంద్రియాః
రక్షితవ్యా స్త్వయా శశ్వ ద్గర్భభూతా స్తపోధనాః. ౨౧

టీక॥ రాజన్=రాజవగు రాముఁడా! న్యస్తదండాః=విడువఁబడినశిక్షించుటగలవారలమును; జితక్రోధాః= జయింపఁబడినకోపముగలవారలమును; జితేంద్రియాః= జయింపఁబడిన యింద్రియములుగలవారలమును; గర్భభూతాః= బిడ్డలవంటివారలమును; తపోధనాః= తపస్సేధనముగాఁగలవారమునగు; వయం=మేము; త్వయా=నీచేత; శశ్వత్ =ఎల్లప్పుడును; రక్షితవ్యాః= రక్షింపఁబడవలసినవారలము.

రాజవగురాముఁడా! మేము, ఎవ్వరెంత యపకారముగావించినను వారి నిశిక్షించుటనువిడిచి, కోపంబుఁ బరిత్యజించి, జితేంద్రియులమయి, తపంబుగావించుచుండువారలము, బిడ్డలవంటివారలము; కావున, నీవుమమ్మెల్లప్పుడునుదప్పకరక్షింపుచుండవలెను. అని, యమ్మునులు, రామునితోఁ జెప్పుకొనిరి.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా ఫలై ర్మూలైః పుష్పై ర్వన్యైశ్చ రాఘవమ్
వన్యైశ్చ వివిధాహారై స్సలక్ష్మణ మపూజయన్. ౨౨

టీక॥ తే (అధ్యాహృతము)=ఆమునులు; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; సలక్ష్మణం=లక్ష్మణునితోఁగూడిన ; రాఘవం=రాముని; వన్యైః=అడవియందుఁబుట్టిన; ఫలైః=పండ్లచేతను; మూలైః=గడ్డలచేతను; పుష్పైః=పుష్పములచేతను; వన్యైః= అడవియందుఁబుట్టిన ; వివిధాహారైశ్చ = నానావిధములయినయాహారములచేతను ; అపూజయన్=పూజించిరి.

అమ్మహర్షులీప్రకారంబునంబ్రార్థించి, వన్యంబులగు, పుష్పములచేతను ఫలమూలంబులచేతను మఱియు వనంబునం గలుగు నానావిధంబులయినయితరాహారములచేతను, రామలక్ష్మణులంబూజించిరి. అని, తాత్పర్యము.

యథాన్యే తాపసా స్సిద్ధా రామం వైశ్వానరోపమాః
న్యాయవృత్తా యథాన్యాయం తర్పయామాసు రీశ్వరమ్. ౨౩

టీక॥ యథా=ఎట్లు; వైశ్వానరోపమాః = అగ్నిహోత్రునితోఁబోలికగల; న్యాయవృత్తాః= న్యాయానుసారియగునాచారముగల ; సిద్ధాః= తపస్సిద్ధినొందిన ; అన్యే=ఇతరులయిన; తాపసాః=ఋషులు ; ఈశ్వరం=ప్రభుండగు ; రామం=రామునిః యథాన్యాయం= న్యాయమునతిక్రమింపక, తర్పయామాసుః= తృప్తినొందించిరి.

అట్లగ్నిహోత్ర సమానులును, శాస్త్రోక్తాచార సంపన్నులును దపస్సిద్ధులునగు నితరమహర్షులును , యథాన్యాయంబుగ, రాముంబూజించిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే, ప్రథమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండ ప్రథమసర్గటీక ,
ముగిసినది.

శ్రీ.

ద్వితీయసర్గప్రారంభః.

కృతాతిథ్యో౽థ రామస్తు సూర్యస్యోదయనం ప్రతి
ఆమన్త్ర్య స మునీన్ సర్వాన్ వనమేవాన్వగాహత. ౧

టీక॥అథ=పిమ్మట; కృతాతిథ్యః=చేయఁబడినయతిథిసత్కారముగల; సః=ఆ; రామస్తు=రాముండును; సూర్యస్య=సూర్యునియొక్క; ఉదయనంప్రతి=ఉదయకాలమునందు; మునీన్=ఋషులను; సర్వాన్=అందఱను; ఆమన్త్ర్య=వీడుకొని; వనమేవ=అడవినే; అన్వగాహత=ప్రవేశించెను.

అంత, నట్లు, రాముండు, వారలవలననాతిథ్యంబువడసి, సూర్యోదయంబునను మునులనందఱ వీడ్కొని, యరణ్యంబునకుంబోయెను. అని, తాత్పర్యము.

నానామృగగణాకీర్ణం శార్దూలవృకసేవితమ్
ధ్వస్తవృక్షలతాగుల్మం దుర్దర్శసలిలాశయమ్. ౨
నిష్కూజనానాశకుని ఝిల్లికాగణనాదితమ్
లక్ష్మణానుగతో రామో వనమధ్యం దదర్శహ. ౩

టీక॥లక్ష్మణానుగతః=లక్ష్మణుని చేత వెంబడింపఁబడిన; రామః=రాముఁడు; నానామృగగణాకీర్ణం=నానావిధములగుమృగములచే వ్యాపింపఁబడినదియు; శార్దూలవృకసేవితం=పెద్దపులులచేతను తోడేళ్లచేతను సేవింపఁబడినదియు; ధ్వస్తవృక్షలతాగుల్మం=నశించినవృక్షములునుతీఁగెలునుబోదెలేనిచెట్లునుగలదియు; దుర్దర్శసలిలాశయం=చూడఁగూడనికొలంకులుగలదియు; నిష్కూజనానాశకుని=ధ్వనిలేనినానావిధములయిన పక్షులుగలదియు; ఝిల్లికాగణనాదితం=ఈలపురుగుల సమూహముచే ధ్వనిం

పఁజేయఁబడినదియునగు; వనమధ్యం=అడవినడిమిప్రదేశమును ; దదర్శ=చూచెను. ("హ" అనునది పాదపూరణార్థము).

రాముండు, లక్ష్మణసహితుండై, నానామృగంబులతోఁగూడినదియుఁ, బెద్దపులులు మున్నగుక్రూరజంతువులు గలదియు, నలఁగినవృక్షంబులునులతలును గుల్మములునుగలదియు జూడనసహ్యంబులయినకోలంకులతోఁ గూడినదియు భయంబునంజేసి ధ్వనింపక నిశ్చలంబులయియుండు నానావిధపక్షులు గలదియు, అధికసూక్ష్మరూపంబులగుట వలననిర్ఝరయంబుగధ్వనించుచున్న యీలవురుగులతోనొప్పుచున్నదియునగు నరణ్యమధ్యంబుఁజూచెను.

అని, తాత్పర్యము.

సీతయాసహ కాకుత్థ్స స్తస్మిన్ ఘోరమృగాయుతే
దదర్శ గిరిశృంగాభం పురుషాదం మహాస్వనమ్. ౪
గంభీరాక్షం మహావక్త్రం వికటం విషమోదరమ్
భీభత్సం విషమం దీర్ఘం వికృతం ఘోరదర్శనమ్. ౫
వసానం చర్మ వైయాఘ్రం వసార్ద్రం రుధిరోక్షితమ్
త్రాసనం సర్వభూతానాం వ్యాదితాస్య మివాంతకమ్. ౬
త్రీన్ సింహాం శ్చతురో వ్యాఘ్రాన్ ద్వౌ వృకౌ పృషతాన్దశ
సవిషాణం వసాదిగ్ధం గజస్యచ శిరోమహత్. ౭
అవసజ్యాయసే శూలే వినదంతం మహాస్వనమ్

టీక॥ కాకుత్థ్సః=రాముఁడు ; సీతయాసహ=సీతతోఁగూడ ; ఘోరమృగాయుతే = భయంకరమయినమృగములతోఁగూడిన ; తస్మిన్=ఆయడవియందు ; గిరిశృంగాభం=పర్వతశిఖరముయొక్క-కాంతివంటికాంతిగలవాఁడును ; మహాస్వనం = అధికమయినధ్వనిగలవాఁడును ;గంభీరాక్షం=లోఁతయిన కండ్లుగలవాఁడును ; మహావక్త్రం= పెద్దనోరుగలవాఁడును ; వికటం= విశాలమయినదేహముగలవాఁడును ; విషమోదరం=ఎచ్చుతక్కువ




లుగలకడుపుగలవాఁడును; భీభత్సం=అసహ్యతగలిగించువాఁడును; విషమం=ఎచ్చుతక్కువలుగలవాఁడును; దీర్ఘం=నిడుపైనవాఁడును; వికృతం=వికారముగలవాఁడును; ఘోరదర్శనం=భయంకరమయిన చూచుటగలవాఁడును; వసార్ద్రం=మాంసముచేఁదడిసినదియును; రుధిరోక్షితం=నెత్తురుచేఁదడుపఁబడినదియునగు; వైయాఘ్రం=పెద్దపులిదగు; చర్మ=తోలును; వసానం=ధరించియున్నవాఁడును; సర్వభూతానాం=సమస్తప్రాణులయొక్కయు; త్రాసనం=భయముగలిగించువాఁడును; వ్యాదితాస్యం=తెఱవఁబడినముఖముగల; అంతకమివ(స్థితం)=యమునివలెనున్నవాఁడును; సింహాన్=సింహంబులను; త్రీన్=మూఁడిటిని; వ్యాఘ్రాన్=పులులను; చతురః=నాలుగిఁటిని; వృకౌ=తోఁడేళ్లను; ద్వౌ=రెండిఁటిని; పృషతాన్=జింకలను; దశ=పదింటిని; సవిషాణం=కొమ్ముతోఁగూడినదియు; వసాదిగ్ధం=క్రొవ్వుచేఁ బూయఁబడినదియునగు; మహత్=గొప్పదగు; గజస్య=ఏనుంగుయొక్క; శిరశ్చ=తలను; ఆయసే=ఇనుపదైన; శూలే=శూలమునందు; అవసజ్య=గ్రుచ్చుకొని; మహాస్వనం=పెద్దధ్వనిగల్గునట్లుగా; వినదంతం=అఱచుచున్నవాఁడునగు; పురుషాదం=రాక్షసుని; దదర్శ=చూచెను.

రాముండు, సీతాలక్ష్మణులతోఁగూడఁబోవుచుఁ బర్వతశిఖరాకారుండును, మహానాదుండును, గంభీరనయనుండును పెద్దనోరుగలవాఁడును, మహాకాయుండునువిషమోదరుండును, చూపరులకుఅసహ్యతగలిగించు వాఁడును విషమదేహుండును, దీర్ఘగాత్రుండును, వికృతుండును భయంకరాకారుండును, రక్తమాంసంబులనార్ద్రంబయిన వ్యాఘ్రచర్మంబు ధరించి యున్నవాఁడును, సమస్తభూత భయంకరుండును నోరుదెఱచుకొనియున్న యముంబగిది జూపట్టుచున్న వాఁడును, మూఁడుసింహంబులనునాలుగుపెద్దపులులను రెండుతోఁడేళ్లను బదిజింకలను వసాదిగ్ధంబగుగొప్పయేనుంగుతల యొక్కటియునుఆయసశూలంబునంగ్రుచ్చి పట్టుకొని, భయంకరంబుగా నఱచుచున్నవాఁడునగు నొక్క రాక్షసుం జూచెను.

అని, తాత్పర్యము.




స రామం లక్ష్మణంచైవ సీతాం దృష్ట్వాచ మైథిలీమ్. ౮
అభ్యధావత సంక్రుద్ధః ప్రజాః కాల ఇవాంతకః

టీక॥ సః = ఆరాక్షసుఁడు; రామం=రాముని; లక్ష్మణంచైవ = లక్ష్మణుని; మైథిలీం= మిథిలయందుఁబుట్టిన; సీతాం= సీతాదేవిని ; దృష్ట్వాచ = చూచియు; సంక్రుద్ధః=కోపించినవాఁడై; కాలే = సంహారకాలమునందు ; ప్రజాః=జనులనుగూర్చి ; అంతక ఇవ=యముఁడువలె; అభ్యవధావత = ఎదురొరనిపరుగెత్తెను.

ఆరాక్షసుండు, సీతారామలక్ష్మణులంజూచి,క్రుద్ధుండై,సంహారకాలంబునయముండు ప్రజలపైకివచ్చునట్లు, వారలపైకివచ్చెను.

అని, తాత్పర్యము.

స కృత్వా భైరవం నాదం చాలయన్నివ మేదినీమ్. ౯
అంకే నాదాయ వైదేహీ మపక్రమ్య తతో௨ బ్రవీత్

టీక॥ సః = ఆరాక్షసుఁడు; మేదినీం=భూమిని; చాలయన్నివ= కదలించువాఁడువలె; భైరవం=భయంకరమయిన; నాదం=ధ్వనిని; కృత్వా = చేసి; వై దేహీం=సీతను; అంకేన=మొలచేత; ఆదాయ=గ్రహించి ; అపక్రమ్య=ఆవలికిఁబోయి; తతః=అంత;అబ్రవీత్=చెప్పెను.

ఆరాక్షసుండు,భూమియంతయుఁగదలునట్లు భయంకర నాదంబుఁగావించి, సీతనెత్తిచంకలోనుంచుకొని, యావలికింబోయి, రామలక్ష్మణులంజూచి, యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

యువాం జటాచీరధరౌ సభార్యౌ క్షీణజీవితౌ. ౧౦
ప్రవిష్టౌ దండకారణ్యం శరచాపాసిధారిణౌ

టీక॥ క్షీణజీవితౌ= నశించినయాయుస్సుగల ; యువాం= మీరలు; జటాచీరధరౌ = జటలనునారచీరలను దాల్చినవారలయి ; సభార్యౌ=భా

ర్యతోఁగూడినవారలయి ; శరచాపాసిధారిణౌ = బాణంబులనువింటినిఖడ్గమును ధరించినవారలయి ; దండకారణ్యం = దండకారణ్యమును ; ప్రవిష్టౌ=ప్రవేశించినారలు.

మీరలు , జటాచీరంబులుధరించి, భార్యాసహితులరయి,ధనుర్బాణంబులను ఖడ్గంబునుధరించి , యీదండకారణ్యంబునకు వచ్చినారుకావున , మీయాయుస్సుదీఱినట్లున్నది.

అని, తాత్పర్యము.

కథం తాపస యో ర్వాంచ వాసః ప్రమదయాసహ. ౧౧

టీక॥తాపసయోః=మునులరయిన; వాంచ=మీకును; ప్రమదయాసహ = స్త్రీలతోఁగూడ; వాసః=ఉనికి;కథం=ఎట్లు.

మీరలు , ఋషులుగదా! స్త్రీతోనెట్లున్నారు? అని, తాత్పర్యము.

అధర్మచారిణౌ పాపౌ కౌయువాం మునిదూషకౌ

టీక॥ అధర్మచారిణౌ= అధర్మమునాచరించువారలును ; మునిదూషకౌ= మునులనుదూషించువారలును ; పాపౌ=పాపిష్ఠులునగు; యువాం = మీరలు; కౌ=ఎవ్వరు?

ఇట్లు, మునివేషంబువేసికొని, మఱలమునిజనవిరుద్ధంబుగా ధనుర్బాణాద్యాయుధంబులుధరించి, యధర్మంబాచరించుచున్న, మీరలెవ్వరు?

అని, తాత్పర్యము.

అహం వన మిదం దుర్గం విరాధో నామరాక్షసః. ౧౨

చరామి సాయుధో నిత్య మృషిమాంసాని భక్షయన్

టీక॥ విరాధోనామ= విరాధుండను పేరుగల; రాక్షసః=రాక్షసుండనైన ; అహం=నేను ; ఋషిమాంసాని=ఋషులమాంసములను;భక్షయన్=తినువాఁడనై ; సాయుధః=ఆయుధముతోఁగూడినవాఁడనై ; నిత్యం=ఎల్లప్పుడును ; ఇదం=ఈ;వనం=అడవిని; చరామి=పొందియున్నాను.

విరాధుండనుపేరుగల రాక్షసుండ నగునేను , ఋషిమాంసంబులం దినుట కై , యాయుధంబుధరించి , యెల్లప్పుడును,ఈవనం బునం దిరుగుచుందును. అని, తాత్పర్యము.

ఇయం నారీ వరారోహా మమభార్యా భవిష్యతి. ౧౩
యువయోః పాపయోశ్చాహం పాస్యామి రుధిరం మృధే

టీక॥ వరారోహా= శ్రేష్ఠములయి నపిఱుఁదులుగల ; ఇయం=ఈ,నారీ= స్త్రీ ; మమ=నాయొక్క;భార్యా= భార్య ; భవిష్యతి=కాఁగలదు ; అహం=నేను;మృధే= యుద్ధమునందు ; పాపయోః=దుష్టులరయిన;యువయోః=మీయొక్కయు , రుధిరం=నెత్తురును ; పాస్యామి=త్రాఁగెదను.

సుందరములయిన పిఱుందులు గల యీవనితయు నాకుభార్యగాఁగలదు; యుద్ధంబునఁబాపిష్ఠులరగు మీరక్తంబు దనివిదీరంద్రావెదను . అని, విరాధుండు రామలక్ష్మణులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తస్యైవం బ్రువతో దుష్టం విరాధస్య దురాత్మనః. ౧౪
శ్రుత్వా సగర్వితం వాక్యం సంభ్రాంతా జనకాత్మజా
సీతా ప్రావేపతోద్వేగా త్ప్రవాతే కదళీ యథా. ౧౫

టీక॥ ఏవం=ఇట్లు;దుష్టం =దుష్టముగా;బ్రువతః=చెప్పుచున్న ; దురాత్మనః= దుష్టబుద్ధిగల ; విరాధస్య=విరాధునియొక్క ; సగర్వితం= గర్వముతోఁగూడిన ; వాక్యం=మాటను ; శ్రుత్వా=విని;జనకాత్మజా = జనకమహారాజుకూఁతురయిన; సీతా=సీతాదేవి ;సంభ్రాంతా=తొట్రుపాటునొందినదై ; ఉద్వేగాత్=భయమువలన; ప్రవాతే=పెనుగాలియందు ;కదళీయథా= అరఁటిచెట్టువలె; ప్రావేపత= వడఁకెను.

అతిదుష్టంబుగాఁ బలికినదురాత్ముండగు విరాధునిగర్వంపుమాటలనువిని ,

జనకమహారాజు కూఁతురయిన సీతాదేవి, తొట్రుపాటునొంది, మిక్కిలి యుభయముపడి, పెనుగాలినరఁటిచెట్టువలెఁ, జలించెను. అని, తాత్పర్యము.

తాం దృష్ట్వా రాఘవ స్సీతాం విరాధాంకగతాం శుభామ్
అబ్రవీ ల్లక్ష్మణం వాక్యం ముఖేన పరిశుష్యతా. ౧౬

టీక॥ రాఘవః=రాముండు; విరాధాంకగతాం = విరాధునిచంకనొందిన; శుభాం=మంగళకరియగు; తాం=ఆ; సీతాం= సీతాదేవిని; దృష్ట్వా= చూచి; పరిశుష్యతా= ఎండుచున్న; ముఖేన=నోటిచేత; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

రాముండు, విరాధునిచంకంజిక్కియున్నసీతాదేవింజూచి, పరమదుఃఖంబున, నోరెండ, లక్ష్మణుంజూచి, యీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

పశ్య సౌమ్య నరేంద్రస్య జనకస్యాత్మసంభవామ్
మమ భార్యాం శుభాచారాం విరాధాంకే ప్రవేశితామ్. ౧౭
అత్యంతసుఖసంవృద్ధాం రాజపుత్రీం యశస్వినీమ్

టీక॥ సౌమ్య=తిన్ననివాఁడవగు లక్ష్మణుఁడా! నరేంద్రస్య= మనుష్యులకుఁబ్రభుండగు; జనకస్య= జనకమహారాజుయొక్క; ఆత్మసంభవాం=కూఁతురును; శుభాచారాం = మంగళకరమయిన యాచారముగలదియు; అత్యంతసుఖసంవృద్ధాం=మిక్కిలియునుఖముగాఁబెరిఁగినదియు; రాజపుత్రీం = రాచకొమార్తెయు; యశస్వినీం= అధికమయిన కీర్తిఁగలదియు; విరాధాంకే=విరాధునిచంకయందు; ప్రవేశితాం=ఉంచఁబడినదియునగు; మమ= నాయొక్క; భార్యాం= భార్యను; పశ్య=చూడుము.

సౌమ్యుండవగులక్ష్మణుఁడా! జనకమహారాజుకూఁతురును మంచియాచారంబుగలదియుమిక్కిలి సుఖంబునం బెరిఁగినదియురాచకొమార్తెయుఁ,

పతివ్రతయానునధికకీర్తిని వహించినదియునగునాభార్య, సీత, విరాధునిచేఁ కంజిక్కియున్నది. చూడుము.

అని, తాత్పర్యము.

యదభిప్రేత మస్మాసు ప్రియం వరవృతం చ యత్. ౧౮
కైకేయ్యాస్తు సుసంవృత్తం క్షిప్ర మద్యైవ లక్ష్మణ

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా!అస్మాసు = మనవిషయమునందు ; కైకేయ్యాః=కైకేయియొక్క ; యత్=ఏది ; అభిప్రేతం=అభిప్రాయమో; యత్=ఏ, ప్రియంచ= ఇష్టమును ; వరవృతం=వరముచేఁగోరఁబడినదో ; తత్ (అధ్యాహృతము) తు = అదిమాత్రము ; క్షిప్రం=శీఘ్రముగా ; అద్యైవ= ఇప్పుడె ; సుసంవృత్తం = సిద్ధించినది.

లక్ష్మణుఁడా ! మనవిషయముయి కైకేయి యేమి యభిప్రాయపడినదో, ఏయిష్టమును బొందుటకై వరవ్యాజంబునసడిగెనో, అదియంతయునిప్పుడె, శీఘ్రమున,సిద్ధించినది.

అని, తాత్పర్యము.

యా న తుష్యతి రాజ్యేన పుత్రార్థే దీర్ఘదర్శినీ. ౧౯
యయాహం సర్వభూతానాం హితః ప్రస్థాపితో వనమ్
అద్యేదానీం సకామా సా యా మాతా మమ మధ్యమా. ౨౦

టీక॥ దీర్ఘదర్శినీ= దూరదృష్టిగల,యా=ఏబిడ; పుత్రార్థే= పుత్రుని ప్రయోజనమునిమిత్తమయిన ; రాజ్యేన=రాజ్యముచేత;నతుష్యతి= సంతోషింపదో;యయా=ఏబిడచేత; సర్వభూతానాం= సమస్తప్రాణులకును; హితః= మేలుసేయునట్టి;అహం= నేను;వనం=అడవినిగూర్చి; ప్రస్థాపితః= పంపఁబడితినో;యా=ఏబిడ;మమ=నాయొక్క;మధ్యమా=నడిమిదగు ; మాతా=తల్లియో;సా=ఆకైకేయి;అద్య= ఈదినమునందు; ఇదానీం= ఇప్పుడు; సకామా=కోర్కితోఁగూడినది.

ఏబిడ,“భరతునకురాజ్యంబువచ్చుట మాత్రమేచాలదు,రాముండు, సర్వలోకప్రియుండుగావున, నతండుండునేని

జనులందఱు నతనికె యనుకూలురగుదురు" అని దూరదృష్టితో నాలోచించి, భరతునకు రాజ్యంబు వచ్చినంతం దృప్తిఁ జెందక "రాముఁడడవికిఁ బోయినచో, సీతయు నతని వెంబడించును. సీత సౌందర్యవతిగావున రాక్షసులాబిడ నపహరింతురు. అంత సీతయందతి మోహానురాగంబులుగల రాముండు, తోడనే ప్రాణంబులు విడుచును. లేక విరక్తుండై మఱల నయోధ్యకు రానొల్లకుండును" అని, చక్కఁగా నాలోచించి, సమస్తభూతహితుండనగు నన్నునడవికిఁ బంపెనో, అట్టి నామధ్యమాంబయగు కైకేయి కోరిక, యీదినంబున నీక్షణము నందు ఫలించినది. అని, తాత్పర్యము.

పరస్పర్శాత్తు వై దేహ్యా న దుఃఖతర మస్తిమే
పితు ర్వియోగా త్సౌమిత్రే స్వరాజ్యహరణా త్తథా. ౨౧

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! మే=నాకు; వైదేహ్యాః=సీతయొక్క; పరస్పర్శాత్తు=పరపురుష స్పర్శనమువలనమాత్రము; యథా(అధ్యాహృతము)=ఎట్లు; దుఃఖతరం=అధికదుఃఖము; అస్తి=కలదో; తథా=అట్లు; పితుః=తండ్రియొక్క; వియోగాత్=మరణమువలనఁగాని; స్వరాజ్యహరణాత్=నారాజ్యంబునపహరించుటవలనఁగాని; న=లేదు.

లక్ష్మణుఁడా! నాకుసీతను బరపురుషుఁడుస్పృశించుటవలనం గలుగునంత దుఃఖము, పితృమరణంబునంగాని, రాజ్యంబుపోవుటచేఁగాని, గలుగలేదు. అని, రాముండులక్ష్మణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి బ్రువతి కాకుత్థ్సే బాష్పశోకపరిప్లుతే
అబ్రవీ ల్లక్ష్మణః క్రుద్ధో రుద్ధో నాగ ఇవ శ్వసన్. ౨౨

టీక॥ బాష్పశోకపరిప్లుతే=కన్నీటితోఁగూడినదుఃఖముచేఁదడుపఁబడిన; కాకుత్థ్సే=రాముఁడు; ఇతి=ఇట్లు; బ్రువతి=చెప్పుచుండఁగా; లక్ష్మణః=లక్ష్మణుఁడు; క్రుద్ధః=కోపించినవాఁడై; రుద్ధః=అడ్డగింపఁబడిన; నాగఇవ=సర్ప

మువలెఁ; శ్వసన్=ఊర్పులువుచ్చుచు; అబ్రవీత్= చెప్పెను.

ఇట్లురాముండు, పరమ దుఃఖంబునం గన్నీళ్లువిడుచుచుఁ జెప్ప,లక్ష్మణుండురామశోకంబుఁ జూచి పరమక్రుద్ధుండై, మంత్రవేగ బద్ధంబగు సర్పంబు పగిది,వేఁడిని ట్టూర్పులువుచ్చుచు,నిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

అనాథ ఇవ భూతానాం నాథస్త్వం వాసవోపమః
మయా ప్రేష్యేణ కాకుత్థ్స కిమర్థం పరితప్యసే. ౨౩

టీక॥ కాకుత్థ్స=రాముఁడా! భూతానాం=సమస్తభూతంబులకును;నాధః=ప్రభుండవు; వాసవోపమః= దేవేంద్రునితోఁబోల్కి-గలవాఁడవు; ప్రేష్యేణ=పరిచారకుఁడనగు; మయా = నాతో; సహితః(అధ్యాహృతము) = కూడినవాఁడవునగు;త్వం=నీవు; అనాధఇవ=నాథుండు లేనివాఁడువలెఁ; కిమర్థం=ఎందుకొఱకు;పరితప్యసే=పరితపించుచున్నావు?

రాముడా!నీవు, సమస్తలోకంబులకును ప్రభుండవయి దేవేంద్రునకుసరివచ్చువాఁడవయి,ప్రేష్యుండనగు నేనునుసన్నిధానంబుననుండఁగా, నిట్లనాథపగిదిఁబరితపించెదవేల?

అని,తాత్పర్యము.

శరేణ నిహతస్యాద్య మయా క్రుద్ధేన రక్షసః
విరాధస్య గతాసోర్హి మహీ పాస్యతి శోణితమ్. ౨౪

టీక॥ అద్య=ఇప్పుడు;క్రుద్ధేన=కోపించిన;మయా=నాచేత;శరేణ=బాణముచేత; నిహతస్య=చంపఁబడిన ;గతాసోః=పోయినప్రాణములుగల; విరాధస్య=విరాధుండను;రక్షసః= రాక్షసునియొక్క-;శోణితం= నెత్తురును; మహీ=భూమి; పాస్యతిహి=త్రాఁగఁగలదుగదా.

ఇప్పుడు, క్రుద్ధుండనగునేనుబాణంబుననీవిరాధునింజంపి,యితనిరక్తమును భూమిత్రావునట్లుగావించెదను.

అని, తాత్పర్యము.

రాజ్యకామే మమ క్రోధో భరతే యో బభూవహ
తం విరాధే ప్రమోక్ష్యామి వజ్రీ వజ్రమివాచలే. ౨౫

స ౨

టీక॥ రాజ్యకామే= రాజ్యముగోరునట్టి, భరతే=భరతునియందు; యః= ఏః; క్రోధః=కోపము, మమ=నాకు; బభూవ=ఉండెనో ("హ" అనునది పాదపూరణార్థము), తం= ఆకోపమును; విరాధే=విరాధునియందు; వజ్రీ=దేవేంద్రుఁడు; అచలే= పర్వతమునందు; వజ్రమివ=వజ్రాయుధమునువలె, ప్రమోక్ష్యామి=విడిచెదను.

రాజ్యంబుఁగోరినభరతునిపైనాకుఁ గలిగినకోపమునంతయు, దేవేంద్రుండు పర్వతముపై వజ్రాయుధమును బ్రయోగించునట్లు, విరాధునిపైవిడిచెదను. అని, తాత్పర్యము.

మమ భుజబలవేగవేగితః
పతతు శరోஉస్యమహాన్ మహోరసి
వ్యపనయతు తనోశ్చ జీవితం
పతతు తతస్స మహీం విఘూర్ణితః. ౨౬

టీక॥మమ=నాయొక్క; భుజబలవేగవేగితః = బాహుబల వేగముచే వేగమునొందిన; మహాన్=గొప్పదగు; శరః=బాణము; అస్య= ఈవిరాధుని యొక్క; మహోరసి=గొప్పఱొమ్మునందు; పతతు=పడుఁగాక. తనోః= దేహమునుండి; జీవితంచ=ప్రాణంబును గూడ; వ్యపనయతు=పోఁగొట్టుఁగాక. తతః=అంత, సః=ఆవిరాధుఁడు; విఘూర్ణితః= తిరుగుడునొందినవాఁడై; మహీం=భూమిని; పతతు= పొందుఁగాక.

నేను, నాభుజబలంబుకొలఁది, నాకర్ణాంతముగఁ దూరించివిడిచిన మహాబాణము, ఈవిరాధునివిశాల వక్షస్థలంబుఁజొచ్చి, ప్రాణంబులదేహమునుండిపోఁద్రోల, నీవిరాధుండు, గిఱగిఱందిరిగి, నేలంబడుఁగాక. అని లక్ష్మణుండు, రామునకుంజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, ద్వితీయస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

స 3

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండ ద్వితీయసర్గటీక, ముగిసినది.

---

౩.

తృతీయసర్గప్రారంభః.

ఇత్యుక్త్వా లక్ష్మణ శ్శ్రీమా న్రాక్షసం ప్రహసన్నివ

టీక॥ శ్రీమాన్=అధికమయినకాంతిగల; లక్ష్మణః=లక్ష్మణుడు; ఇతి=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; రాక్షసం=రాక్షసునిగూర్చి; ప్రహసన్నివ=నవ్వుచునే; ఉవాచ(అధ్యాహృతము)=చెప్పెను.

శ్రీమంతుండగులక్ష్మణుండు, ఇట్లు రామునకుం జెప్పి, విరాధుంజూచినవ్వుచు, నిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

కో భవా న్వన మభ్యేత్య చరిష్యసి యథాసుఖమ్. ౧

టీక॥ భవాన్=నీవు; కః= ఎవ్వఁడవు; వనం=అడవిని; అభ్యేత్య=పొంది; యథాసుఖం= సుఖమునతిక్రమింపక; చరిష్యసి=తిరుగుచున్నావు.

ఈవనంబున సుఖంబుగాఁ దిరుగుచున్నావే; నీవెవ్వఁడవు?

అని, తాత్పర్యము.

అథో వాచ పున ర్వాక్యం విరాధః పూరయ న్వనమ్

టీక॥ అథ=అంత; విరాధః= విరాధుఁడు; వనం=అడవిని; పూరయన్=నిండించుచు; పునః=మఱల; వాక్యం=మాటను=ఉవాచ=చెప్పెను.

అంత, విరాధుండు, వనంబునందంతయుఁబ్రతిధ్వనిగలుగ, మఱలనిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

స ౩

ఆత్మానం పృచ్ఛతే బ్రూతం కౌ యువాం క్వ గమిష్యథః. ౨

టీక॥ ఆత్మానం=మీస్వరూపమును; పృచ్ఛతే = అడుగుచున్ననాకొఱకు; బ్రూతం=చెప్పుఁడు.యువాం= మీరలు;కౌ=ఎవ్వరు?క్వ=ఎచ్చట; గమిష్యథః=పోఁగలరు.

మీసంగతి నేనడుగుచున్నానే ; చెప్పుఁడు;మీరలెవ్వరు? ఎచ్చటికిఁబోవుచున్నారు? అని, విరాధుండుచెప్పెను.

అని, తాత్పర్యము.

త మువాచ తతో రామో రాక్షసం జ్వలితాననమ్
పృచ్ఛంతం సుమహాతేజా ఇక్ష్వాకుకుల మాత్మనః. ౩

టీక॥ తతః= అంత ; సుమహాతేజాః= మిక్కిలియునధికమయినకాంతిగల;రామః=రాముఁడు ; జ్వలితాననం=మండుచున్నముఖముగల; పృచ్ఛంతం=అడుగుచున్న;తం=ఆ;రాక్షసం=విరాధునిగూర్చి ; ఆత్మనః=తనయొక్క;ఇక్ష్వాకుకులం=ఇక్ష్వాకువంశమును;ఉవాచ=చెప్పెను.

అంత, మహాతేజుండగు రాముండు, తన్నడుగుచున్న , జ్వలితముఖుండగు విరాధుంజూచి, తనయిక్ష్వాకువంశము మొదలగుసంగతింజెప్పెను.

అని, తాత్పర్యము.

క్షత్రియౌ వృత్తసంపన్నౌ విద్ధి నౌ వనగోచరౌ
త్వాం తు వేదితు మిచ్ఛావః క స్త్వం చరసి దండకాన్. ౪

టీక॥నౌ=మమ్ములను; క్షత్రియౌ= క్షత్రియులనుగాను; వృత్తసంపన్నౌ= ఆచారముతోఁగూడినవారలనుగాను; వనగోచరౌ = వనంబుననుండువారలనుగాను; విద్ధి= ఎఱుంగుము. త్వాం తు=నిన్నుమాత్రము; వేదితుం=ఎఱుంగుటకు; ఇచ్ఛావః= కోరుచున్నాము. త్వం=నీవు;కః=ఎవ్వఁడవు?దండకాన్= దండకారణ్యమును; చరసి= పొందుచున్నావు.

మేము,క్షత్రియులము , సదాచారసంపన్నులము,అడవినుండువారలము ;

ఇంకనీసంగతి దెలియఁగోరెదము; నీవె వ్వఁడవు? ఈదండకారణ్యంబునం దిరుగుచున్నావు. అని, రాముండు, విరాధునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

త మువాచ విరాధస్తు రామం సత్యపరాక్రమమ్

టీక॥ విరాధస్తు=విరాధుండును; సత్యపరాక్రమం= సత్యమయినపరాక్రమముగల; తం=ఆ; రామం= రామునిగూర్చి; ఉవాచ=చెప్పెను.

అంత, విరాధుండు, సత్యపరాక్రముండగురాముంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

హంత వక్ష్యామి తే రాజన్ నిబోధ మమ రాఘవ. ౫

టీక॥ రాజన్=రాజవయిన; రాఘవ=రాముఁడా! హంత=ఆ! తే=నీకు; వక్ష్యామి= చెప్పెదను. మమ = (పంచమ్యర్థమునందు షష్ఠి) నావలన; నిబోధ=ఎఱుంగుము.

రాముఁడా! ఆ! చెప్పెదను; నాసమాచారమునువినుము.

అని, తాత్పర్యము.

పుత్రః కిల జయస్యాహం మమ మాతా శతహ్రదా

విరాధఇతి మా మాహుః పృథివ్యాం సర్వరాక్షసాః. ౬

టీక॥ అహం=నేను; జయస్య=జయుని యొక్క; పుత్రఃకిల= కొడుకునుగదా! మమ=నాయొక్క; మాతా= తల్లి; శతహ్రదా=శతహ్రదయనుపేరుగలది. పృథివ్యాం=భూమియందు; సర్వరాక్షసాః=సమస్తరాక్షసులును; మాం=నన్ను; విరాధఇతి= విరాధుండని; ఆహుః=చెప్పుచున్నారు.

నేను, జయునికొడుకును; నాతల్లి పేరుశతహ్రద; నన్నుభూమియందు, రాక్షసులందఱు విరాధుండని పిలుతురు. అని, తాత్పర్యము.

తపసాచాపి మే ప్రాప్తా బ్రహ్మణోహి ప్రసాదజా

శస్త్రేణా వధ్యతా లోకే చ్ఛేద్యాభేద్యత్వ మేవచ. ౭

టీక॥ అపిచ=మఱియు ; మే=నాకు; తపసా=తపస్సుచేత ; బ్రహ్మణః=బ్రహ్మదేవునియొక్క; ప్రసాదజా=అనుగ్రహమువలనఁగలిగిన; లోకే=లోకమునందు; శస్త్రేణ= ఆయుధముచేత; అవధ్యతా= చంపఁగూడకుండుట; ప్రాప్తా=పొందఁబడినది. అచ్ఛేద్యాభేద్యత్వమేవచ= ఛేదింపఁగూడకుండుటయు భేదింపఁగూడకుండుటయు; ప్రాప్తం(అధ్యాహృతము)=పొందఁబడినది

మఱియు, నేనుమహాతపంబుగావించి, బ్రహ్మదేవుననుగ్రహంబున, నాయుధంబునఁజంపనలవిగాకుండుటయు, ఛేదింపనలవిగాకుండుటయు , నభేద్యతయుంబొందినాను.

అని, తాత్పర్యము.

ఉత్సృజ్య ప్రమదా మేనా మనపేక్షౌ యథాగతమ్
త్వరమాణౌ పలాయేథాం న వాం జీవిత మాదదే. ౮

టీక॥ యువాం(అధ్యాహృతము)=మీరలు; ఏనాం=ఈ; ప్రమదాం= స్త్రీని; ఉత్సృజ్య=విడిచి ; అనపేక్షౌ=అపేక్షలేనివారలయి ; యథాగతం=వచ్చినట్లుగా; త్వరమాణౌ= వేగిరపడుచున్నవారలయి; పలాయేథాం= పరుగెత్తుదురుగాక. వాం=మీయొక్క; జీవితం = ప్రాణమును ; నాదదే=గ్రహింపను.

మీరలు, ఈస్త్రీనివిడిచి, దీనియపేక్షనువదలుకొని , వచ్చినదారింబట్టి శీఘ్రంబునఁబరుగెత్తిపొండు; మీప్రాణంబులతో నాకుఁ బనిలేదు . అనివిరాధుండు, రామలక్ష్మణులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తం రామః ప్రత్యువాచేదం కోపసంరక్తలోచనః
రాక్షసం వికృతాకారం విరాధం పాపచేతసమ్. ౯

టీక॥ రామః=రాముఁడు; కోపసంరక్తలోచనః= కోపముచేనెఱ్ఱనైనకన్నులుగలవాఁడై; వికృతాకారం= వికృతమయినయాకారముగల; పాపచేతసం=పాపిష్ఠమయినమనస్సుగల; రాక్షసం=రాక్షసుండయిన; విరాధం=విరా

స ౩




ధునిగూర్చి; ఇదం=ఈమాటను; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

రాముండు, కోపంబునొంది, కన్నులనెఱ్ఱఁదనంబుగదుర, వికృతాకారుండును, పాపబుద్ధియునగు విరాధుం జూచి, యీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

క్షుద్ర ధిక్త్వాం తు హీనార్థం మృత్యు మన్వేషసే ధ్రువమ్
రణే సంప్రాప్స్యసే తిష్ఠ న మే జీవన్ గమిష్యసి. ౧౦

టీక॥ క్షుద్ర=అల్పుఁడా! హీనార్థం=నీచమయిన ప్రయోజనముగల; త్వాం=నిన్నుఁగూర్చి; ధిక్=దహింపఁబడుటయగుఁగాక. త్వం (అధ్యాహృతము)=నీవు; ధ్రువం= నిశ్చయముగా; మృత్యుం=మరణమును; అన్వేషసే= వెదకుచున్నావు. రణే= యుద్ధమునందు; సంప్రాప్స్యసే=పొందఁగలవు. తిష్ఠ=నిలువుము. మే=నాయొక్క; పురతః (అధ్యాహృతము)=ముందట; జీవన్=బ్రతికియున్నవాఁడవై; నగమిష్యసి=పోఁజాలవు.

అల్పుఁడా! అతినీచమయిన పరస్త్రీహరణముఁదలపెట్టినావు; నీవు, మరణముఁగోరివచ్చినట్లున్నది; యీయుద్ధంబున నేనట్లె గావించెదను; నిలువు; నాముందటఁ, బ్రాణంబులతోఁ బోఁజాలవు. అని, రాముండు చెప్పెను.

అని, తాత్పర్యము.

తత స్సజ్యం ధనుః కృత్వా రామ స్సునిశితాన్ శరాన్
సుశీఘ్ర మభిసంధాయ రాక్షసం నిజఘాన హ. ౧౧

టీక॥ తతః=అటుపిమ్మట; రామః=రాముఁడు; ధనుః=వింటిని; సజ్యం=అల్లెత్రాటితోఁగూడినదానిఁగా; కృత్వా=చేసి; సునిశితాన్=మిక్కిలియుఁ గలుకులయిన; శరాన్=బాణములను; సుశీఘ్రం= మిక్కిలియుశీఘ్రముగా; అభిసంధాయ=సంధించి; రాక్షసం=రాక్షసుని; నిజఘాన=కొట్టెను. "హ" అనునది పాదపూరణార్థము.

అంత, రాముండు, ధనుస్సు సజ్యంబు




గావించి, కఱకుబాణంబులసంధించి, విరాధునిపైఁ బ్రయోగించెను.

అని, తాత్పర్యము.

ధనుషా జ్యాగుణవతా స ప్తబాణా న్ముమోచహ
రుక్మపుంఖా న్మహావేగాన్ సుపర్ణానిలతుల్యాన్. ౧౨

టీక॥ రామః(అధ్యాహృతము) = రాముండు ; జ్యాగుణవతా = అల్లెత్రాడనుత్రాడుగల;ధనుషా= వింటిచేత; రుక్మపుంఖాన్= బంగారముపింజలందుఁగలవియు;మహావేగాన్=అధికమయినవేగముఁగలవియు;సుపర్ణానిలతుల్యాన్=గరుత్మంతునితోను వాయువుతోను సమానముగాఁబోవునవియునగు; బాణాన్=బాణములను;స ప్త=ఏడింటిని; ముమోచ=విడిచెను"హ" అనునది పాదపూరణార్థము.

రాముండు , అట్లుధనువునెక్కువెట్టి, బంగారుపింజలందుఁగలవియుగరుడానిలసమానవేగంబులునగు, స ప్తబాణంబులం బ్రయోగించెను.

అని, తాత్పర్యము.

తే శరీరం విరాధస్య ఛిత్త్వా బర్హిణవాససః
నిపేతు శ్శోణితా దిగ్ధా ధరణ్యాం పావకోపమాః. ౧౩

టీక॥పావకోపమాః= అగ్నిహోత్రునితోఁబోలికగల ; బర్హిణవాససః=నెమిలిఱెక్కలు పత్రములుగాఁగల;తే=ఆబాణములు; విరాధస్య= విరాధునియొక్క; శరీరం=దేహమును; ఛిత్త్వా=ఛేదించి;శోణితాదిగ్ధాః = నెత్తురుచేఁగప్పఁబడినవై ; ధరణ్యాం= నేలయందు;నిపేతుః=పడినవి.

నెమిలిఱెక్కలు గట్టిన నిప్పువంటియాబాణంబులు విరాధుని దేహంబు ఛేదించి నెత్తురుతోఁగూడ నేలంబడినవి.

అని, తాత్పర్యము.

స విద్ధో న్యస్య వై దేహం శూల ముద్యమ్య రాక్షసః
అభ్యద్రవ త్సుసంక్రుద్ధ స్తదా రామం సలక్ష్మణమ్. ౧౪

టీక॥ సః=ఆ; రాక్షసః=విరాధుఁడు; విద్ధః=కొట్టఁబడినవాఁడై; వైదేహీం=సీతాదేవిని; న్యస్య=ఉంచి; శూలం=శూలమును; ఉద్యమ్య=పట్టుకొని; సుసంక్రుద్ధః=మిక్కిలియుఁ గోపించినవాఁడై; తదా=అప్పుడు; సలక్ష్మణం=లక్ష్మణునితోఁగూడిన; రామం=రామునిగూర్చి; అభ్యద్రవత్= పరుగెత్తెను.

అవ్విరాధుండు, ఆమేదుబాణంబులచేతను నొచ్చి పరమకుపితుండై, సీతాదేవిని నేలనుంచి, శూలంబుచేఁ బూని, రామలక్ష్మణులపైకిఁబరుగెత్తెను.

అని, తాత్పర్యము.

స వినద్య మహానాదం శూలం శక్రధ్వజోపమమ్
ప్రగృహ్యాఽ శోభత తదా వ్యాత్తానన ఇవాంతకః. ౧౫

టీక॥ తదా=అప్పుడు; సః=ఆవిరాధుఁడు; మహానాదం= అధికమయినధ్వనిగల్గునట్లుగా; శక్రధ్వజోపమం= ఇంద్రధ్వజంబుతోఁబోలికగల; శూలం=శూలమును; ప్రగృహ్య= పట్టుకొని; వ్యాత్తాననః= తెఱవఁబడిననోరుగల; అంతక ఇవ= యముండువలె; అశోభత=ప్రకాశించెను.

అప్పుడావిరాధుండు, మహాధ్వనిగలుగునట్లు సింహనాదంబు గావించి, ఇంద్రధ్వజంబువలె నత్యున్నతంబయిన శూలంబుచేఁబూని, నోరుదెఱచుకొనియుండుయముండువలెఁ జూపరులకు భయంబుగలిగించుచుండెను.

అని, తాత్పర్యము.

అథ తౌ భ్రాతరౌ దీప్తం శరవర్షం వవర్షతుః
విరాధే రాక్షసే తస్మిన్ కాలాంతకయమోపమే. ౧౬

టీక॥ అథ=అంత; తౌ=ఆ; భ్రాతరౌ=తోఁబుట్టువులగు రామలక్ష్మణులు; కాలాంతకయమోపమే= ప్రళయకాలమునందునశింపఁజేయునట్టి యమునితోఁబోలికగల; తస్మిన్=ఆ; విరాధే=విరాధుఁడను; రాక్షసే=రాక్షసునియందు; దీప్తం=మండుచున్న=శరవర్షం=బాణంబులవానను; వవర్షతుః =




కురిసిరి.

అంత, నా రామలక్ష్మణులిర్వురును, విరాధుండుసీతనువిడిచివచ్చుటచే , నిర్భయంబుగాఁ బ్రళయకాలంబునసమస్తభూతసంహారంబుగావించు యమునింబోలియున్నయవ్విరాధునిపై, బాణవర్షంబుగురిపించిరి.

అని, తాత్పర్యము.

స ప్రహస్య మహారౌద్ర స్థిత్వా జృంభత రాక్షసః
జృంభమాణస్య తే బాణాః కాయాన్నిష్పేతు రాశుగాః. ౧౭

టీక॥ మహారౌద్రః=మిక్కిలియుభయంకరుండగు; సః=ఆ; రాక్షసః = విరాధుఁడు; ప్రహస్య=నవ్వి; స్థిత్వా = నిలిచి; అజృంభత=ఆవలించెను. తే = ఆ ; ఆశుగాః = వేగంబునం బోవునట్టి; బాణాః = బాణములు ; జృంభమాణస్య = ఆవలించుచున్నవిరాధుని యొక్క , కాయాత్= దేహముననుండి; నిష్పేతుః=వెడలినవి.

మహాభయంకరుండగునావిరాధుండు, వీరలెంతమాత్రమనినవ్వి, నిలుచుండి దేహమునంతయువిఱుచుకొనెను; అప్పుడు, మహావేగంబులగునాబాణంబులన్నియునతని దేహంబుననుండి వెలువడి నేలంబడినవి. అని, తాత్పర్యము.

స్పర్శాత్తు వరదానేన ప్రాణాన్ సంరోధ్య రాక్షసః
విరాధ శ్శూల ముద్యమ్య రాఘవా వభ్యధావత. ౧౮

టీక॥ రాక్షసః = రాక్షసుండగు; విరాధః=విరాధుండు; వరదానేన=వరమునొసంగుటతో; స్పర్శాత్తు = సంబంధంబమువలననే; ప్రాణాన్= ప్రాణవాయువులను; సంరోధ్య = బిగించుకొని; శూలం=శూలమును; ఉద్యమ్య= పట్టుకొని; రాఘవౌ= రామలక్ష్మణులను; అభ్యధావత=ఎదురొ్ఱనిపరుగెత్తెను.

అంత, నవ్విరాధుండు, వరమహిమవలన, మహాబలంబువహించి, శూలంబుచేఁబూని, రామలక్ష్మణులపైకిఁ బరుగెత్తెను. అని, తాత్పర్యము.




తచ్ఛూలం వజ్రసంకాశం గగనే జ్వలనోపమమ్
ద్వాభ్యాం శరాభ్యాం చిచ్ఛేద రామశ్శస్త్రభృతాం వరః. ౧౯

టీక॥ శస్త్రభృతాం=ఆయుధధారులలోపల;వరః=శ్రేష్ఠుండగు ; రామః=రాముండు;గగనే=ఆకాశమునందు;జ్వలనోపమం = అగ్నిహోత్రముతోఁబోల్కి-గలదియు;వజ్రసంకాశం=వజ్రాయుధముతోసమానమునగు;తత్ ఆ;శూలం=శూలమును; ద్వాభ్యాం = రెండయిన=శరాభ్యాం = బాణములచే;చిచ్ఛేద=నఱికెను.

ఆయుధధారులలోనుత్తముండగు రాముఁడు,ఆకాశంబున నగ్నిహోత్రంబుపగిది వెలుంగుచున్నదియు వజ్రసమానంబునగునాశూలంబును, రెండుబాణంబులఖండించెను.

అని, తాత్పర్యము.

తద్రామవిశిఖచ్ఛిన్నం శూలం తస్య కరాద్భువి
పపాతాశనినా చ్ఛిన్నం మేరోరివ శిలాతలమ్. ౨౦

టీక॥ రామవిశిఖచ్ఛిన్నం=రాముని బాణంబులచేనఱకఁబడిన;తత్ = ఆ, శూలం=శూలము; తస్య= ఆవిరాధుని యొక్క,కరాత్=చేతనుండి;భువి= నేలయందు;అశనినా= వజ్రాయుధముచేత;ఛిన్నం=నఱకఁబడిన;మేరోః= మేరు పర్వతముయొక్క;శిలాతలమివ= తాయివలె;పపాత=పడెను.

రామునిబాణంబులచేత ఖండింపఁబడినయాశూలము,వజ్రాయుధముచేన అఱకఁబడిన మేరుశిలాతలంబువలె , విరాధునిహస్తముననుండి, నేలంబడెను.

అని, తాత్పర్యము.

తౌ ఖడ్గౌ క్షిప్ర ముద్యమ్య కృష్ణసర్పోపమౌ శుభౌ
తూర్ణ మాపతత స్తస్య తదా ప్రహరతాం బలాత్. ౨౧

టీక॥ తస్య=ఆవిరాధుండు ; తూర్ణం=శీఘ్రముగా;ఆపతతః=వచ్చుచుండఁగా;తౌ=ఆరామలక్ష్మణులు;కృష్ణసర్పోపమౌ= కృష్ణసర్పములతోఁబో

లిగలవియు;శుభౌ= మంగళకరములునగు;ఖడ్గౌ=కత్తులను;క్షిప్రం=శీఘ్రముగా;ఉద్యమ్య=ఎత్తి=తదా= అప్పుడు; బలాత్ =బలిమివలన ; ప్రహరతాం (ప్రాహరతాం)=కొట్టిరి.

విరాధుండుశీఘ్రంబునఁ బైకివచ్చుటంజూచి,యారామలక్ష్మణులు, కృష్ణసర్పములవంటివియు జయావహములునగుఖడ్గంబులంబూని,మిక్కిలియుం బ్రహరించిరి. అని,తాత్పర్యము.

స వధ్యమాన స్సుభృశం బాహుభ్యాం పరిరభ్య తౌ
అప్రకంప్యౌ నరవ్యాఘ్రౌ రౌద్రః ప్రస్థాతు మైచ్ఛత. ౨౨

టీక॥ రౌద్రః= భయంకరుండగు; సః=ఆవిరాధుఁడు;సుభృశం= మిక్కిలియునధికముగా;వధ్యమానః= కొట్టఁబడుచున్నవాఁడై;అప్రకంప్యౌ= కదలింపఁగూడనివారలును;నరవ్యాఘ్రౌ= పురుషశ్రేష్ఠులునగు;తౌ = ఆరామలక్ష్మణులను;బాహుభ్యాం= చేతులచేత; పరిరభ్య=కవుఁగిలించుకొని; ప్రస్థాతుం=పోవుటకు;ఐచ్ఛత=కోరెను.

భయంకరుండగువిరాధుండు , అల్లింతకొట్టినను,వదలక, పురుషశ్రేష్ఠులును గదలింపనలవిగానివారలునగునా రామలక్ష్మణులపైఁబడివారలంజేతులఁ గవుఁగిలించుకొని, యెత్తుకొనిపోఁగోరెను. అని,తాత్పర్యము.

తస్యాభిప్రాయ మాజ్ఞాయ రామో లక్ష్మణ మబ్రవీత్

టీక॥ రామః=రాముఁడు; తస్య= ఆవిరాధునియొక్క;అభిప్రాయం=కోరికని;ఆజ్ఞాయ= తెలిసికొని;లక్ష్మణం= లక్ష్మణునిగూర్చి; అబ్రవీత్= చెప్పెను.

రాముండతని యభిప్రాయంబు నెఱింగి, లక్ష్మణుంజూచి, యిట్లని, చెప్పెను. అని,తాత్పర్యము.

వహ త్వయ మలం తావ త్పథానేనతు రాక్షసః. ౨౩

టీక॥ అయం=ఈ;రాక్షసః= రాక్షసుఁడు; అనేన=ఈ;పథా=తు=మార్గముచేతనే; అలం=చక్కఁగా; వహతు తావత్ =తీసికొనిపోవుఁగాక.

ఈతండు, ఈదారినే మనలందీసికొనిపోవుఁగాక. అని, తాత్పర్యము.

యథా చేచ్ఛతి సౌమిత్రే తథా వహతు రాక్షసః
అయమేవహి నః పంథా యేన యాతి నిశాచరః. ౨౪

టీక॥సౌమిత్రే=లక్ష్మణుఁడా! రాక్షసః=రాక్షసుఁడు;యథాచ = ఎట్లును;ఇచ్ఛతి=కోరుచున్నాఁడో; తథా=అట్లు;వహతు=తీసికొనిపోవుఁగాక. నిశాచరః=రాక్షసుఁడు;యేన=ఏమార్గముచేత;యాతి=పోవుచున్నాఁడో; అయమేవ=ఇదియె;నః= మనయొక్క; పంథాహి=మార్గముగదా!

లక్ష్మణుఁడా! ఈతనికెట్లుకోరికయున్నదో, అట్లేతీసికొనిపోవుఁగాక ; ఈ రాక్షసుండుపోవునదే, మనముపోవలసినదారిగానున్నది. అని, రాముండు లక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

సతు స్వబలవీర్యేణ సముత్క్షిప్య నిశాచరః
బాలావివ స్కంధగతౌ చకారాతిబలౌ తతః. ౨౫

టీక॥తతః=అంత;సః=ఆ;నిశాచరస్తు=రాక్షసుఁడుమాత్రము ; స్వబలవీర్యేణ=తనబలపరాక్రమముచేత; అతిబలౌ = అధికమయినబలముగలరామలక్ష్మణులను;బాలావివ= పిన్నవాండ్రనుంబోలె;సముత్క్షిప్య=ఎత్తి; స్కంధగతౌ=మూఁపులనొందినవారలనుగా, చకార=చేసెను.

అంత, నవ్విరాధుండు, తనభుజబలంబున, మహాబలశాలులగునారామలక్ష్మణులనుబిడ్డలంబోలెనెత్తి తనభుజంబులపైనుంచుకొనెను.

అని, తాత్పర్యము.

తావారోప్య తత స్స్కంధం రాఘవౌ రజనీచరః
విరాధో నినదన్ ఘోరం జగామాభిముఖో వనమ్. ౨౬

టీక॥రజనీచరః=రాక్షసుండగు; విరాధః=విరాధుండు; తౌ=ఆ; రాఘవౌ=రామలక్ష్మణులను ; స్కంధం=మూఁపును; ఆరోప్య=ఎక్కించుకొని;

తతః=అంత; ఘోరం=భయంకరము గా; వినదన్=అఱచుచు; వనం=అడవిని గూర్చి; అభిముఖః=ఎదురుమొగము గలవాఁడై; జగామ=పోయెను.

అట్లు, విరాధుండు, రామలక్ష్మణుల నిర్వురను భుజముపైనెక్కించుకొని, భయంకరంబుగానఱచుచు, నరణ్యాభిముఖుండై పోయెను. అని, తాత్పర్యము.

వనం మహామేఘ నిభం ప్రవిష్టో
ద్రుమై ర్మహద్భి ర్వివిధై రుపేతమ్
నానావిధైః పక్షిశతై ర్విచిత్రం
శివాయుతం వ్యాళమృగై ర్వికీర్ణమ్. ౨౭

టీక॥సః(అధ్యాహృతము)=ఆవిరాధుఁడు; మహామేఘనిభం=గొప్పమేఘముతో సమానమయినదియు; వివిధైః=నానావిధములగు; మహద్భిః=గొప్పవయిన; ద్రుమైః=వృక్షములతో; ఉపేతం=కూడినదియు; నానావిధైః=పలువిధములయిన; పక్షిశతైః=పక్షుల నూఱులచేత; విచిత్రం=నానావర్ణమును; శివాయుతం=నక్కలతోఁగూడినదియు; వ్యాళమృగైః=దుష్టమృగములచేత; వికీర్ణం=వ్యాపింపఁబడినదియునగు; వనం=అడవిని; ప్రవిష్టః=ప్రవేశించినాఁడు.

అంత, నవ్విరాధుండు, మహామేఘంబువలెదట్టముగానుండునదియు నానావిధంబులగు గొప్పవృక్షములతో నిండినదియు, నానావిధంబులగుపక్షులతో నొప్పుచున్నదియు, నక్కలును బెద్దపులులుమున్నగు క్రూరమృగంబులును మెండుగాఁగలదియునగుమహావనముం బ్రవేశించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే, తృతీయస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండ తృతీయసర్గ టీక,
ముగిసినది.

శ్రీ

చతుర్థసర్గప్రారంభః.

హ్రియమాణౌతు తౌ దృష్ట్వా వైదేహీ రామలక్ష్మణౌ
ఉచ్చైస్స్వరేణ చుక్రోశ ప్రగృహ్యా సుభుజా భుజౌ. ౧

టీక॥ సుభుజా=మంచిచేతులుగల; వైదేహీ= సీతాదేవి =హ్రియమాణౌ=అపహరింపఁబడుచున్న; తౌ= ఆ; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను, దృష్ట్వాతు=చూచినంతనె; భుజౌ= చేతులను; ప్రగృహ్యా=పట్టుకొని; ఉచ్చైస్స్వరేణ=ఉన్నతమగుధ్వనిచేత; చుక్రోశ=అఱచెను.

సుందరములగుభుజంబులుగలసీతాదేవి, ఆట్లు రాక్షసుండు, రామలక్ష్మణులంగొనిపోవుటంజూచి నంతనె పరమదుఃఖితయయి, చేతులుపట్టుకొని, పెద్దెలుంగున, యిట్లని, విలపించెను. అని, తాత్పర్యము.

ఏష దాశరథీ రామ స్సత్యవాక్ శీలవాక్ శుచిః
రక్షసా రౌద్రరూపేణ హ్రియతే సహలక్ష్మణః ౨

టీక॥ దాశరధిః= దశరధునికుమారుండును; సత్యవాక్=సత్యముగలవాఁడును; శీలవాక్ = సదాచారముగలవాఁడును; శుచిః=పరిశుద్ధుండునగు; సహలక్ష్మణః= లక్ష్మణునితోఁగూడిన ; ఏషః = ఈ; రామః= రాముండు; రౌద్రరూపేణ=భయంకరమయినరూపముగల; రక్షసా = రాక్షసునిచేత; హ్రియతే = అపహరింపఁ బడుచున్నాఁడు.

దశరధమహారాజ కుమారుండును సత్యవాదియుసదాచారసంపన్నుండును బరిశుద్ధుండునగు, రాముని, అతని తమ్మునిలక్ష్మణుని, భయంకరాకారుండగు రాక్షసుండుకొనిపోవుచున్నాఁడు! అని, తాత్పర్యము.

మాం వృకా భక్షయిష్యంతి శార్దూలల ద్వీపిన స్తధా

టీక॥ వృకాః = తోడేళ్లును ; తథా = అట్లు ; శార్దూలద్వీపినః= పెద్దపులులును జిఱుత పులులును ; మాం=నన్ను ; భక్షయిష్యంతి= తినఁగలవు.

నన్ను, తోడేళ్లును పెద్దపులులును జిఱుతపులులును భక్షించును.

అని, తాత్పర్యము.

మాం హరోత్సృజ్య కాకుత్స్థౌ నమస్తే రాక్షసోత్తమ. ౩

టీక॥ రాక్షసోత్తమ = రాక్షసశ్రేష్ఠుఁడా! కాకుత్స్థౌ = రామలక్ష్మణులను; ఉత్సృజ్య=విడిచి ; మాం=నన్ను; హర=తీసికొనిపొమ్ము. తే= నీకొఱకు, నమః=నమస్కారము.

రాక్షసోత్తముఁడా! నీకునమస్కారముచేసెదను; రామలక్ష్మణులను విడిచి,నన్నుఁదీసికొనిపొమ్ము. అని , సీతాదేవివిలపించెను.

అని, తాత్పర్యము.

తస్యాస్తద్వచనం శ్రుత్వా వైదేహ్యా రామలక్ష్మణౌ
వేగం ప్రచక్రతు ర్వీరా వధే తస్య దురాత్మనః. ౪

టీక॥వీరౌ= పరాక్రమశాలులగు; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు ; తస్యాః=ఆ;వైదేహ్యాః= సీతాదేవియొక్క; తత్=ఆ;వచనం=మాటను; శ్రుత్వా=విని;తస్య=ఆ;దురాత్మనః=దుష్టస్వభావుండగువిరాధునియొక్క; వధే=చంపుటయందు;వేగం = వేగమును;ప్రచక్రతుః=చేసిరి.

పరాక్రమవంతులగునారామలక్ష్మణులు,సీతాదేవిరోదనంబువిని , దురాత్ముండగునవ్విరాధుని శీఘ్రంబుగా వధింపఁదలంపుగొనిరి.

అని, తాత్పర్యము.

తస్య రౌద్రస్య సౌమిత్రి ర్బాహుం సవ్యం బభంజహ
రామస్తు దక్షిణం బాహుం తరసా తస్య రక్షసః. ౫

స ౪

టీక॥సౌమిత్రిః=లక్ష్మణుండు; రౌద్రస్య=భయంకరుండగు;తస్య= ఆవిరాధుని యొక్క, సవ్యం= ఎడమదగు; బాహుం=చేతిని;బభంజ = నఱకెను ("హ")అనునది పాదపూరణార్థము). రామస్తు= రాముండుమాత్రము, తరసా=వేగముచేత; తస్య=ఆ; రక్షసః=రాక్షసుని యొక్క;దక్షిణం= కుడిదైన;బాహుం=చేతిని;బభంజ(అధ్యాహృతము)=నఱకెను.

భయంకరాకారుండగు నావిరాధుని యెడమచేతిని లక్ష్మణుండు ఖండించెను;రాముండు, దక్షిణబాహువునుఖండించెను. అని,తాత్పర్యము.

స భగ్నబాహు స్సంవిగ్నో నిపపాతాశు రాక్షసః
ధరణ్యాం మేఘసంకాశో వజ్రభిన్న ఇవాచలః. ౬

టీక॥ మేఘసంకాశః = మేఘముతో సమానుండగు;సః=ఆ;రాక్షసః=విరాధుండు;భగ్నబాహుః= విఱిగినచేతులుగలవాండై;సంవిగ్నః = భయపడినవాండై;ఆశు=శీఘ్రముగా;వజ్రభిన్న ఇవ=వజ్రాయుధముచేవిఱిగిన; అచల ఇవ=పర్వతమువలె;ధరణ్యాం= భూమియందు;నిపపాత=పడెను.

మేఘసమానుండగు నావిరాధుండు, చేతులువిఱిగి,భయపడి, శీఘ్రంబున, వజ్రాయుధముచేతఖండితంబగు పర్వతముంబోలె, నేలంబడెను.

అని, తాత్పర్యము.

ముష్టిభి ర్జానుభిః పద్భి స్సూదయంతౌ తు రాక్షసమ్
ఉద్యమ్యోద్యమ్య చాప్యేనం స్థండిలే నిష్పిపేషతుః. ౭

టీక॥ తౌ (అధ్యాహృతము) = ఆ రామలక్ష్మణులు; ఏనం = ఈ; రాక్షసం= విరాధుని;ఉద్యమ్యోద్యమ్యచాపి=ఎత్తియెత్తియు; ముష్టిభిః=పిడికిళ్లచేతను;జానుభిః= మోంకాళ్లచేతను; పద్భిః=పాదములచేతను ; సూదయంతౌ తు=కొట్టుచును; స్థండిలే= భూమియందు; నిష్పిపేషతుః=పిసికిరి.

అంతరామలక్ష్మణులు,విరాధుని నేలంబడవైచి,పిడికిళ్లను మ్రోంకాళ్లనుగా

స ౪

ఖ్లని, నానావిధంబులం గ్రమ్ముచు, నెముకలన్నియువిఱిచి, ముద్దగాఁగావించిరి.

అని, తాత్పర్యము.

స విద్ధో బహుభి ర్బాణైః ఖడ్గాభ్యాంచ పరిక్షతః
నిష్పిష్టో బహుధా భూమౌ న మమార స రాక్షసః. ౮

టీ॥ సః = ఆవిరాధుఁడు ; బహుభిః = పెక్కులయిన ; బాణైః = బాణములచేత ; విద్ధః = బాధింపఁబడినవాఁడయ్యు, ఖడ్గాభ్యాం = కత్తులచేతను, పరిక్షతశ్చ = గాయముల నొందినవాఁడయ్యు ; బహుధా = పెక్కువిధములను ; భూమౌ = నేలయందు ; నిష్పిష్టః = పిసుకఁబడినవాఁడైయ్యు, సః = ఆ, రాక్షసః = విరాధుఁడు ; నమమార = చావఁడయ్యె.

ఆవిరాధుండు, పెక్కుబాణంబుల బాధింపఁబడియు, ఖడ్గంబులనఱుకంబడియు, నేలపైఁ బెక్కువిధంబులం ద్రొక్కఁబడియు, మృతిపొందఁడయ్యె.

అని, తాత్పర్యము,

తం ప్రేక్ష్య రామ స్సుభృశ మవధ్య మచలోపమమ్
భయే ష్వభయద శ్శ్రీమా నిదం వచన మబ్రవీత్. ౯

టీక॥ భయేషు = భయంబులుగలుగఁగా ; అభయదః = భయంబులేమినొసంగువాఁడును ; శ్రీమాన్ = అందఱికన్న నధికుఁడునగు ; రామః = రాముండు ; అవధ్యం = చంపనలవిగానివాఁడును ; అచలోపమం = పర్వతంబుతోఁబోలికగలవాఁడునగు ; తం = ఆవిరాధుని ; సుభృశం = చక్కగా ; ప్రేక్ష్య = చూచి ; ఇదం = ఈ ; వచనం = మాటను ; అబ్రవీత్ = చెప్పెను.

ఎట్టిభయంబులు వచ్చినను, అభయం బొసంగునట్టి మహాపురుషుండు శ్రీమంతుండునగు రాముండుపర్వతాకారుండగు నవ్విరాధుండు, ఆయుద్ధంబుననవధ్యుండగుటఁ జక్కఁగా నెఱింగి లక్ష్మణుంజూచి యిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

తపసా పురుషవ్యాఘ్ర రాక్షసోఽయం నశక్యతే
శస్త్రేణ యుధి నిర్జేతుం రాక్షసం నిఖనావహే. ౧౦

టీక॥ పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుండవగు లక్ష్మణుఁడా! తపసా=తపస్సుచేత; అయం=ఈ; రాక్షసః=రాక్షసుఁడు; యుధి=యుద్ధమునందు; శస్త్రేణ= ఆయుధముచేత ; నిర్జేతుం=జయించుటకు; నశక్యతే= అలవిగాదు. రాక్షసం= రాక్షసుని; నిఖనావహే=పాఁతిపెట్టుదము.

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! ఈరాక్షసుండు, తపసు గావించి వరంబువడసియున్నాఁడు, కావున,నీతనినాయుధంబునంజంప నలవిగాకున్నది; అందువలన,నితనినేలం బాఁతి పెట్టుదము. అని,రాముండు, లక్ష్మణుని తోఁజెప్పెను. అని,తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా రాఘవేణోక్తం రాక్షసఃప్రశ్రితం వచః
ఇదం ప్రోవాచ కాకుత్థ్సం విరాధః పురుషర్షభమ్. ౧౧

టీక॥ రాక్షసః=రాక్షసుఁడగు; విరాధః=విరాధుండు; రాఘవేణ=రాముని చేత; ఉక్తం=చెప్పఁబడిన;తత్= ఆమాటను; శ్రుత్వా=విని ; పురుషర్షభం=పురుషశ్రేష్ఠుండగు ; కాకుత్థ్సం=రామునిఁగూర్చి; ఇదం=ఈ; ప్రశ్రితం=వినయముతోఁగూడిన ; వచః=మాటను; ప్రోవాచ= చెప్పెను.

విరాధుండు , రాముండు చెప్పిన మాటనువిని పురుషోత్తముండగు రాముంజూచి,వినయంబుననామాటం జెప్పెను. అని,తాత్పర్యము.

హతోస్మి పురుషవ్యాఘ్ర శక్రతుల్యబలేన వై
మయాతు పూర్వం త్వం మోహాన్న జ్ఞాతః పురుషర్షభః. ౧౨

టీక॥ పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా ! శక్రతుల్యబలేన=దేవేంద్రునిబలముతోసమానమయినబలముగల ("వై"అనునది పాదపూరణార్థము); త్వయా (అధ్యాహృతము)=నీచేత; హతః = చంపఁబడిన

వాఁడను; అస్మి = అగుచున్నాను. మయా = నాచేతనుమాత్రము; మోహాత్ = అజ్ఞానమువలన; పురుషర్షభః = పురుషశ్రేష్ఠుండవగు; త్వం = నీవు; నజ్ఞాతః = తెలియఁబడలేదు.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! దేవేంద్రతుల్యపరాక్రముండవగునీవునన్ను వధించితివి; నేను, అజ్ఞానంబునంజేసి, నీవు, సాక్షాత్పురుషోత్తముండవని యెఱుంగనైతి. అని, తాత్పర్యము.

కౌసల్యా సుప్రజా రామ తాత త్వం విదితో మయా
వైదేహీచ మహాభాగా లక్ష్మణశ్చ మహాయశాః. ౧౩

టీక॥ తాత = నాయనా! రామ = రాముఁడా! కౌసల్యాసుప్రజాః = కౌసల్యయొక్క సత్పుత్రుఁడవయిన; త్వం - నీవు; మయా = నాచేత; విదితః = తెలియఁబడినావు. మహాభాగా = పూజ్యమయినభాగ్యముగల; వైదేహీచ = సీతాదేవియు; విదితా (అధ్యాహృతము) = యఁబడినది. మహాయశాః = అధికమయినకీర్తిగల; లక్ష్మణశ్చ = లక్ష్మణుండును; విదితః (అధ్యాహృతము) తెలియఁబడినాఁడు.

నాయనా! నీవు, సాక్షాన్నారాయణుండవు, కౌసల్యాగర్భంబునజన్మించినావని నాకిప్పుడు తెలిసినది; మహాభాగయగుసీతాదేవి స్వరూపంబును మహాకీర్తిశాలియగులక్ష్మణునిస్వరూపంబును, దెలియవచ్చినది.
అని, తాత్పర్యము.

అభిశాపా దహం ఘోరాం ప్రవిష్టో రాక్షసీం తనుమ్
తుంబురునామ గంధర్వ శ్శప్తో వైశ్రవణేన హ. ౧౪

టీక॥ తుంబురునామ = తుంబురు వనుపేరుగల; గంధర్వః = గంధర్వుఁడనయిన; అహం = నేను; వైశ్రవణేన = కుబేరునిచేత ("హ" అనునదిపాదపూరణార్థము); శప్తః = శపింపఁబడినాను; అభిశాపాత్ = పాడుశాపమువలన; ఘోరాం = భయంకరమయిన; రాక్షసీం = రాక్షససంబంధినియగు; తనుం = దేహమును; ప్రవిష్టః = ప్రవేశించినాను.

నేనుతుంబురువను గంధర్వుఁడను,

కుబేరునిశాపంబున, నిట్లుభయంకరం బగురాక్షసదేహంబునొందితిని.

అని, తాత్పర్యము.

ప్రసాద్యమాన శ్చ మయా సో బ్రవీ న్మాం మహాయశాః

టీక॥ మహాయశాః= అధికమయినకీర్తిఁగల; సః=ఆకుబేరుఁడు ; మయా=నాచేత ; ప్రసాద్యమానశ్చ= ఊఱడింపఁబడుచును; మాం= నన్నుఁగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

అంత,మహాయశుండగునాకుబేరుండు,నేను[illegible]డుకొనంగరుణించి,యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

యదా దాశరథీ రామ స్త్వాం వధిష్యతి సంయుగే. ౧౫
తదా ప్రకృతి మాపన్నో భవాన్ స్వర్గం గమిష్యతి

టీక॥ యదా=ఎప్పుడు;దాశరథిః=దశరథునికొడుకైన;రామః= రాముఁడు; సంయుగే = యుద్ధమునందు ; త్వాం=నిన్ను; వధిష్యతి=చంపఁగలఁడో;తదా=అప్పుడు;భవాన్=నీవు;ప్రకృతిం=స్వభావమును; ఆపన్నః=పొందినవాఁడవయి ; స్వర్గం=స్వర్గమును;గమిష్యతి=పొందఁగలవు.

దశరథపుత్రుండగురాముండు,నిన్ను యుద్ధంబునవధింపఁగలఁడు; అప్పుడునీవుశాపవిముక్తుండవయి,స్వర్గంబునొందంగలవు.అని,కుబేరుండుచెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి వైశ్రవణో రాజా రంభాసక్తం పురానఘ. ౧౬
అనుపస్థీయ మానో మాం సంక్రుద్ధో వ్యాజహారహ

టీక॥అనఘ= పాపరహితుండవగు రాముఁడా! ఇతి=ఇట్లు;రాజా=రాజయిన; వైశ్రవణః=కుబేరుఁడు; అనుపస్థీయమానః = సేవింపఁబడనివాఁడయి;రంభాసక్తం=రంభయందుఁదగిలియుండిన;మాం=నన్నుఁగూర్చి ; సంక్రుద్ధః=కోపించినవాఁడై;పు[illegible] ను న్ను; వ్యాజహార=చెప్పెను;("హ" అ

నునది పాదపూరణార్థము).

పాపరహితుండవగు రాముఁడా! నేనుమున్నురంభాసక్తుండనై కొలువునకుఁబోమింజేసి, కుబేరుండుమిక్కిలి యుఁగోపించి, నాకీప్రకారమున శాపంబునొసంగెను.

అని, తాత్పర్యము.

తవ ప్రసాదా న్ముక్తోహ మభిశాపా త్సుదారుణాత్. ౧౭
భువనం స్వం గమిష్యామి స్వస్తి వోస్తు పరంతప

టీక॥ పరంతప= శత్రువులఁదపింపఁజేయునట్టి రాముఁడా! అహం= నేను; తవ= నీయొక్క; ప్రసాదాత్=అనుగ్రహమువలన; సుదారుణాత్= మిక్కిలియుభయంకరమగు; అభిశాపాత్= పాడుశాపముననుండి ; ముక్తః=విడువఁబడినాను. స్వం=నాదైన; భువనం= లోకమును; గమిష్యామి=పొందెదను. వః=మీకు; స్వస్తి=మంగళము; అస్తు= అగుఁగాక.

శత్రువులఁ దపింపఁజేయునట్టి రాముఁడా! నీయనుగ్రహంబునంజేసి, నన్నీ భయంకరశాపంబు వదలినది ; ఇంక నాస్థానంబునకుంబోయెదను ; మీకు మంగళంబుగలుగుఁగాక.

అని, తాత్పర్యము.

ఇతో వసతి ధర్మాత్మా శరభంగః ప్రతాపవాన్. ౧౮
అధ్యర్ధయోజనే తాత మహర్షి స్సూర్యసన్నిభః

టీక॥ తాత=నాయనా! ఇతః=ఇచ్చటనుండి; అధ్యర్ధయోజనే=అఱామడయధికముగాఁగల యొకామడ దూరమునందు; ధర్మాత్మా= ధర్మస్వభావుండును; ప్రతాపవాన్= అధికమయినతపస్సుగలవాఁడును; సూర్యసన్నిభః=సూర్యునితోసమానుఁడునగు; శరభంగః=శరభంగుఁడను; మహర్షిః= మహర్షి; వసతి=ఉన్నాఁడు.

నాయనా ! ఇచ్చటకొకటియున్నఱామడదూరంబున, ధర్మాత్ముండునుమహాతపశ్శాలియుసూర్యసమానతేజుండునగుశరభంగుండనుమహాముని నివసించుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

తం శీఘ్ర మభిగచ్ఛ త్వం స తే శ్రేయో విధాస్యతి. ౧౯

టీక॥ త్వం=నీవు; శీఘ్రం=శీఘ్రము గా; తం= ఆశరభంగుని; అభిగచ్ఛ = పొందుము. సః = ఆశరభంగుఁడు ; తే=నీకొఱకు; శ్రేయః= మేలును; విధాస్యతి=చేయఁగలఁడు.

నీవు, శీఘ్రంబున నాశరభంగునొద్దకుఁ బొమ్ము; ఆయననీకు మేలుగావించును. అని, తాత్పర్యము.

అవటే చాపి మాం రామ ప్రక్షిప్య కుశలీ వ్రజ
రక్షసాం గతసత్త్వానా మేషధర్మ స్సనాతనః. ౨౦

టీక॥ రామ=రాముఁడా! మాం= నన్ను; అవటే = పల్లమునందు ; నిక్షిప్యచ = ఉంచియు ; కుశలీ = క్షేమముగలవాఁడవై ; వ్రజ = పొమ్ము. గతసత్త్వానాం= పోయినప్రాణములుగల; రక్షసాం=రాక్షసులకు; ఏషః=ఇది; సనాతనః= పురాతనమయిన; ధర్మః=ధర్మము.

రాముఁడా! నన్నుఁబల్లముద్రవ్వి పూడ్చియటుపిమ్మటసుఖంబునంబొమ్ము; భూమింబూడ్చుట, మృతులగు రాక్షసులకుముఖ్యధర్మము.

అని, తాత్పర్యము.

అవటే యే నిధీయంతే తేషాం లోకా స్సనాతనాః

టీక॥ యే=ఏరాక్షసులు ; అవటే= పల్లమునందు; నిధీయంతే= ఉంచఁబడుచున్నారో; తేషాం=వారలకు ; సనాతనాః=పురాతనములగు; లోకాః= లోకములు; స్యుః(అధ్యాహృతము)= కలుగును.

రాక్షసులకళేబరములను భూమింబూడ్చిపెట్టినచో వారలకుఁబుణ్యాలోకంబులుగలుగును. అని, విరాధుండు, రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము!

ఏవ ముక్త్వాతు కాకుత్థ్సం విరాధ శ్శరపీడితః. ౨౧

బభూవ స్వర్గసంప్రాప్తో న్యస్తదేహో మహాబలః

టీక॥ మహాబలః=అధికమయినబలముగల; శరపీడితః=బాణములచేతఁబీడింపఁబడిన; విరాధః = విరాధుఁడు; కాకుత్థ్సం=రామునిగూర్చి; ఏవం= ఇట్లు; ఉక్త్వాతు=చెప్పినంతనే; న్యస్తదేహః= విడువఁబడినదేహముగలవాఁడై; స్వర్గసంప్రాప్తః= స్వర్గమును బొందినవాఁడు; బభూవ= అయ్యెను.

మహాబలుండగు విరాధుండు, బాణపీడితుండై, రాముంజూచియీప్రకారమునంజెప్పి, యంతదేహంబువిడిచి, స్వర్గంబునొందెను.

అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా రాఘవో వాక్యం లక్ష్మణం వ్యాదిదేశహ. ౨౨

టీక॥ రాఘవః=రాముఁడు; తత్= ఆ; వాక్యం = మాటను; శ్రుత్వా = విని; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; వ్యాదిదేశ= ఆజ్ఞాపించెను. "హ" అనునది పాదపూరణార్థము.

రాముండు, విరాధునిమాటనువిని, లక్ష్మణుంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

కుంజరస్యేవ రౌద్రస్య రాక్షసస్యాస్య లక్ష్మణ
వనేఽస్మిన్ సుమహాచ్ఛ్వభ్రం ఖన్యతాం రౌద్రకర్మణః. ౨౩

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! రౌద్రస్య=భయంకరమగు; కుంజరస్యేవ= ఏనుంగునకుంబోలె; రౌద్రకర్మణః= భయంకరమయిన కార్యము గల ; అస్య=ఈ; రాక్షసస్య=రాక్షసునకు; అస్మిన్=ఈ; వనే=అడవియందు; సుమహాత్ = మిక్కిలియుగొప్పదగు; శ్వభ్రం=బొక్క; ఖన్యతాం= త్రవ్వఁబడుఁగాక.

లక్ష్మణుఁడా! పెద్దయేనుంగునకుంబోలె, భయంకర కర్ముండగు నీరాక్షసునకుఁబెద్దపల్లమొకటి యీవనమునంద్రవ్వుము. అని, రాముండు లక్ష్మణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా లక్ష్మణం రామః ప్రదరః ఖన్యతామితి
తస్థౌ విరాధ మాక్రమ్య కంఠే పాదేన వీర్యవాన్. ౨౪

టీక॥వీర్యవాన్ = అధికమయినపరాక్రమముగల; రామః= రాముఁడు; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; ఇతి=ఇట్లు; ప్రదరః=పల్లము; ఖన్యతాం= త్రవ్వఁబడుఁగాక. ఇతి=అని; ఉక్త్వా = చెప్పి; పాదేన=పాదముచేత; కంఠే= మెడయందు; విరాధం=విరాధుని ; ఆక్రమ్య=అదిమిపట్టి; తస్థౌ= ఉండెను.

మహాపరాక్రమశాలియగురాముండు, ఇట్లుపల్లంబుద్రవ్వుమని లక్ష్మణునకుంజెప్పి, విరాధునిఁ గదలనీయక కంఠంబునంగాలిచే నదిమిపెట్టి, నిలుచుండియుండెను. అని, తాత్పర్యము.

తతః ఖనిత్ర మాదాయ లక్ష్మణ శ్శ్వభ్ర ముత్తమమ్
అఖన త్పార్శ్వత స్తస్య విరాధస్య మహాత్మనః. ౨౫

టీక॥తతః=అంతట; లక్ష్మణః= లక్ష్మణుఁడు; ఖనిత్రం= పాఱచిప్పను; ఆదాయ=తీసికొని; మహాత్మనః= పెద్దమేనుగల; తస్య=ఆ; విరాధస్య=విరాధునియొక్క; పార్శ్వతః= ప్రక్కను; ఉత్తమం=మిక్కిలియుఁ బెద్దదగు; శ్వభ్రం = బొక్కను; అఖనత్=త్రవ్వెను.

అంతట, లక్ష్మణుఁడు, పాఱచిప్పఁదీసికొని, మహాకాయుండగు విరాధుని పార్శ్వభాగంబునం బెద్దబిలంబు ద్రవ్వెను. అని, తాత్పర్యము.

తం ముక్త కంఠం నిష్పిష్య శంకుకర్ణం మహాస్వనం
విరాధం ప్రాక్షిప చ్ఛ్వభ్రే నదంతం భైరవస్వనమ్. ౨౬

టీక॥ నిష్పిష్య = పిసికి; ముక్తకంఠం=విడువఁబడిన కంఠముగల వాఁడును; శంకుకర్ణం=మేకులవంటిచెవులుగలవాఁడును; మహాస్వనం=పెద్దకంఠధ్వనిగలవాఁడును; భైరవస్వనం= భయంకరమయినధ్వనిగలుగునట్లు గా; న




దంతం=అఱచుచున్నవాఁడునగు, తం=ఆ; విరాధం=విరాధుని, శ్వభ్రే=బొక్కయందు; ప్రాక్షిపత్=పడవైచెను.

అంత, రాముండు కాలం దొక్కి, విడిచిన కంఠరము గలవాఁడును మేకులవంటిచెవులుగలవాఁడునగు నా విరాధుని, బిలంబునం బడవైచిరి.

అని, తాత్పర్యము.

తమాహవే నిర్జిత మాశువిక్రమౌ
స్థిరా వుభౌ సంయతి రామలక్ష్మణౌ
ముదాన్వితౌ చిక్షిపతు ర్భయావహం
నదంత ముత్క్షిప్య బలేన రాక్షసమ్. ౨౭

టీక॥ ఆశువిక్రమౌ=శీఘ్రమయిన పరాక్రమముగలవారలును; సంయతి=యుద్ధమునందు; స్థిరౌ=నిలుకడగలవారలునగు; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు; ఉభౌ=ఇద్దఱును; ముదా=సంతోషముతో; అన్వితౌ=కూడిన వారలయి; ఆహవే=యుద్ధమునందు; నిర్జితం=జయింపఁబడినవాఁడును; భయావహం=భయముకలిగించువాఁడును; నదంతం=అఱచుచున్నవాఁడునగు; తం=ఆ; రాక్షసం=రాక్షసుని; చిక్షిపతుః=వేసిరి-

శీఘ్రపరాక్రములును, యుద్ధంబున వెనుదీయనివారలునగు రామలక్ష్మణులు, సంతోషంబున భయంకరుండగు విరాధుని యుద్ధంబున జయించి, యతని, బిలంబునం బడవైచిరి.

అని, తాత్పర్యము.

అసహ్యతాం ప్రేక్ష్య మహాసురస్య తౌ
శితేన శస్త్రేణ తదా నరర్షభౌ
సమర్థ్య చాత్యర్థ విశారదా వుభౌ
బిలే విరాధస్య వధం ప్రచక్రతుః. ౨౮

టీక॥ తదా=అప్పుడు; అత్యర్థవిశారదౌ=మిక్కిలియుఁబండితులగు; నరర్షభౌ=పురుషశ్రేష్ఠులయిన; తౌ=ఆరామలక్ష్మణులు; ఉభౌ=ఇద్దఱును;




మహాసురస్య=గొప్పయసురుండగు; విరాధస్య=విరాధునియొక్క; శితేన=తీక్ష్ణమయిన; శస్త్రేణ = ఆయుధముచేత; అసహ్యతాం= ఓర్వఁజాలమిని; ప్రేక్ష్య=చూచి; సమర్థ్య=నిశ్చయించి ; బిలే=బొక్కయందు; వధం=చంపుటను; ప్రచక్రతుః=చేసిరి.

కార్యంబులందు మిక్కిలియుఁబండితులును బురుషశ్రేష్ఠులునగు నారామలక్ష్మణులు, విరాధుండు ఆయుధంబునకసాధ్యుండగుటనుజూచి, యతనిపూడ్చివేయుటయెయుక్తంబని యాలోచించి, యట్లు బిలంబుద్రవ్వి, యతనింబూడ్చిపెట్టిరి. అని, తాత్పర్యము.

స్వయాం విరాధేన హి మృత్యు రాత్మనః
ప్రసహ్య రామేణ వధార్థ మీప్సితః
నివేదితః కాననచారిణా స్వయం
నమే వధ శ్శస్త్ర కృతో భవే దితి. ౨౫

టీక॥కాననచారిణా = అడవియందుఁ దిరుగునట్టి; రామేణ= రామునిచేత; ప్రసహ్య=బలాత్కారముగా; స్వయం=తనకుఁదానె; వధార్థం=చంపుటకొఱకు; ఈప్సితః = కోరఁబడిన; ఆత్మనః= తనయొక్క; మృత్యుః= మరణము , వధోపాయమనుట; "మే=నాకు; శస్త్రకృతః= ఆయుధముచేతఁజేయఁబడిన ; వధః = చంపుట ; నభవేత్=కలుగదు" ఇతి=అని;విరాధేన=విరాధునిచేత; స్వయం= తనచేతనె; నివేదితోహి= తెలుపఁబడినదిగదా!

వనవాసియగు రాముండు బలాత్కారమునందన్నుఁ జంపఁదలంపుగొని, నానావిధంబుల నతనిం బ్రహరింపుచుండుటనుజూచి యావిరాధుండు, తానె, తనకు ఆయుధంబునంజావు గలుగదనియుఁ దన్నుఁ బూడ్చిపెట్టవలె ననియు, రామునకుంజెప్పెను.

అని, తాత్పర్యము.

తదేవ రామేణ నిశమ్య భాషితం
కృతా మతి స్తస్య బిలప్రవేశనే
బిలంచ రామేణ బలేన రక్షసా

ప్రవేశ్య మానేన వనం వినాదితమ్. ౩౦

టీక॥రామేణ=రామునిచేత ; తత్=ఆ; భాషితం=మాటను;నిశమ్యైవ=వినియె; తస్య = ఆవిరాధునియొక్క; బిలప్రవేశనే=బిలముయొక్కప్రవేశించుటయందు;మతిః=బుద్ధి;కృతా=చేయఁబడినది. రామేణ=రామునిచేత; బలేన=బలముచేత;బిలం=బిలమును;ప్రవేశ్యమానేన=ప్రవేశింపఁజేయఁబడుచున్న;రక్షసాచ= రాక్షసునిచేతను ; వనం=అడవి; వినాదితం= ధ్వనింపఁజేయఁబడినది.

రాముండు,ఆవిరాధునిమాటను వినియె, యతనిబిలంబునంబూడ్వఁదలంచెను;రాముండుబలాత్కారంబున, నవ్విరాధునిబిలంబునం బూడ్చునప్పుడు, ఆరాక్షసుండడవియంతయు మహాధ్వనిగలుగునట్లు,అఱచెను.

అని, తాత్పర్యము.

ప్రహృష్టరూపా వివ రామలక్ష్మణౌ
విరాధ ముర్వ్యాః ప్రదరే నిహత్య తౌ
ననందతు ర్వీతభయౌ మహావనే
శిలాభి రంత ర్దధతుశ్చ రాక్షసమ్. ౩౧

టీక॥తౌ=ఆ;రామలక్ష్మణౌ= రామలక్ష్మణులు; విరాధం=విరాధుని;ఉర్వ్యాః=భూమియొక్క ; ప్రదరే=బిలమునందు; నిహత్య=చంపి; ప్రహృష్టరూపౌ=గగుపాటునొందినదేహముగలవారలయి; మహావనే= కాఱడవియందు; వీతభయౌ= విడువఁబడినభయముగలవారలయి; ననందతుః=సంతోషించిరి. శిలాభిః= ఱాళ్లచేత; రాక్షసం=రాక్షసుని ; అంతర్దధతుశ్చ=మూసిరియు.

రామలక్ష్మణులు, అట్లు,విరాధుని, భూమిబిలంబునవైచి, పులకితగాత్రులయి, యమ్మహావనంబున నెంతమాత్రమునుభయంబులేక , యవ్విరాధుని,కళేబరమును ఱాళ్లచేఁగప్పిరి.

అని, తాత్పర్యము.

తతస్తు తౌ కాంచన చిత్రకార్ముకౌ
నిహత్య రక్షః పరిగృహ్య మైథిలీమ్
విజహ్రతు స్తౌ ముదితౌ మహావనే
దివి స్థితౌ చంద్రదివాకరావివ. ౩౨

టీక॥ తతస్తు=అంతను; కాంచనచిత్రకార్ముకౌ= బంగారముచేఁ జిత్రములయినధనుస్సులుగలవారలగు;తౌ= ఆరామలక్ష్మణులు; రక్షః=విరాధుని ; నిహత్య=చంపి; మైథిలీం=సీతాదేవిని; పరిగృహ్య=తీసికొని; తౌ= ఆరామలక్ష్మణులు; ముదితౌ=సంతసించినవారలయి; దివి=ఆకాశమునందు; స్థితౌ= ఉన్న; చంద్రదివాకరావివ = చంద్రసూర్యులువలె; మహావనే= పెద్దఅడవియందు; విజహ్రతుః=విహరించిరి.

అంత, దివ్యధనుర్ధరులగు నారామలక్ష్మణులు, విరాధుంజంపి, సీతాదేవింజేకొని, పరమసంతుష్టులయి యమ్మహావనంబున , నాకాశంబునం జంద్రసూర్యులపగిది. విహరించుచుండిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే,చతుర్థస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండ చతుర్థసర్గ టీక,
ముగిసినది.



శ్రీ

## పంచమసర్గప్రారంభః.

హత్వాతు తం భీమబలం విరాధం రాక్షసం వనే
తత స్సీతాం పరిష్వజ్య సమాశ్వాస్యచ వీర్యవాన్. ౧
అబ్రవీ ల్లక్ష్మణం రామో భ్రాతరం దీప్తతేజసమ్

టీక॥ వీర్యవాన్ = అధికమయినపరాక్రమముగల; రామః = రాముఁడు; వనే = అడవియందు; భీమబలం = భయంకరమయినబలముగల; తం = ఆ ; విరాధం = విరాధుండను; రాక్షసం = రాక్షసుని; హత్వాతు = వధించినంతనె ; తతః = అంత; సీతాం = సీతాదేవిని; పరిష్వజ్య = కవుఁగిలించుకొని ; సమాశ్వాస్యచ = ఊఱడించియు; దీప్తతేజసం = వెలుంగుచున్నకాంతిగల ; భ్రాతరం = తమ్ముఁడయిన; లక్ష్మణం = లక్ష్మణునిగూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

మహాపరాక్రమశాలియగు రాముండు, అరణ్యంబున , భయంకరపరాక్రముండగు విరాధుంజంపి, యంత, సీతం గవుఁగిలించి, మంచిమాటలం దేర్చి, మహాతేజుండగు తమ్ముని లక్ష్మణునిం జూచి, యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

కష్టం వన మిదం దుర్గం నచస్మ వనగోచరాః. ౨
అభిగచ్ఛామహే శీఘ్రం శరభంగం తపోధనమ్

టీక॥ ఇదం = ఈ; వనం = అడవి ; కష్టం = అపాయముగలది. దుర్గం = ప్రవేశింపరానిది. వనగోచరాశ్చ = అడవినుండువారలమును; నస్మ (నస్మః) = కాము. శీఘ్రం = శీఘ్రముగా; తపోధనం = తపస్సేధనముగాఁగల; శరభంగం = శరభంగమహామునిని; అభిగచ్ఛామహే = పొందెదము.

ఈయడవి మిక్కిలియు నపాయకరముగానున్నది; మనము అడవిలోనుండి మెదిగిన వారలము కాము; కావుననిందుండఁదగదు; శీఘ్రంబునశరభంగమహాముని యొద్దకుఁ బోయెదము. అని , రాముండు లక్ష్మణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

స ౫

ఆశ్రమం శరభంగస్య రాఘవోఽభి జగామహ. 3
తస్య దేవప్రభావస్య తపసా భావితాత్మనః

టీక॥ రాఘవః=రాముఁడు;దేవప్రభావస్య = దేవతయొక్క ప్రభావము వంటిప్రభావముగలవాఁడును;తపసా= తపస్సుచేత,భావితాత్మనః= ధ్యానింపఁబడినపరమాత్మగలవాఁడునగు; తస్య=ఆ;శరభంగస్య= శరభంగునియొక్క;ఆశ్రమం=తపోవనమునుగూర్చి; అభిజగామ=పోయెను "హ" అనునది పాదపూరణార్థము.

అంత, రాముండు, దేవప్రభావుండునుదపంబునంబరమాత్మనుధ్యానించువాఁడునగునాశరభంగమహాముని యాశ్రమంబునకుంబోయెను.

అని, తాత్పర్యము.

సమీపే శరభంగస్య దదర్శ మహ వద్భుతమ్. ర
విభ్రాజమానం వపుషా సూర్యవైశ్వా నరోపమమ్

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు;శరభంగస్య= శరభంగమహామునియొక్క;సమీపే=సమీపమునందు;వపుషా=దేహముచేత ; విభ్రాజమానం= ప్రకాశించుచున్నదియు,సూర్యవైశ్వానరోపమం=సూర్యునితోను అగ్నిహోత్రునితోనుబోల్కిగలదియు ; అద్భుతం=ఆశ్చర్యకరమును;మహత్= గొప్పదియునగువస్తువును ; దదర్శ= చూచెను.

రాముండు, శరభంగునిసమీపంబున,సూర్యాగ్నిసదృశంబును , మహాతేజంబునగు, నాశ్చర్యావహమయినయొకగొప్పవస్తువుంజూచెను.

అని, తాత్పర్యము.

అవరుహ్య రథోత్సంగా దాకాశే విబుధానుగమ్. ౫
అసంస్పృశంతం వసుధాం దదర్శ విబుధేశ్వరమ్

టీక॥ ఆకాశే=ఆకాశమునందు;రథోత్సంగాత్=రథతటముననుండి; అవరుహ్య=దిగి;విబుధానుగం= దేవతలువెంబడించు వారలుగాఁ గలవాఁడు

ను; వసుధాం=భూమిని; అసంస్పృశం తం=తాఁకకున్నవాఁడునగు, విబుధేశ్వరం=దేవేంద్రుని; రామః (అధ్యాహృతము)= రాముఁడు; దదర్శ=చూచెను.

అంత, సమీపంబునకువచ్చుటం జేసి, రథంబుడిగ్గి, భూమినిస్పృశింపక, దేవతాపరివృతుండై యాకాశంబునశరభంగునొద్దకుఁబోవుచున్న దేవేంద్రుని, రాముండు, చూచెను.

అని, తాత్పర్యము.

సుప్రభాభరణం దేవం విరజోంబరధారిణమ్. ౬
తద్విధై రేవ బహుభిః పూజ్యమానం మహాత్మభిః

టీక॥ సుప్రభాభరణం = మిక్కిలి యుఁగాంతిగల యాభరణంబులు గలవాఁడును; విరజోంబరధారిణం= దుమ్ములేని వస్త్రము గట్టుకొన్నవాఁడును; తద్విధైరేవ= అట్టివారలెయయిన; మహాత్మభిః= అధికమయినప్రభావము గల; బహుభిః=పెక్కండ్రచే; పూజ్యమానం= పూజింపఁబడుచున్నవాఁడునగు; దేవం=ఇంద్రుని; రామః (అధ్యాహృతము)=రాముఁడు; దదర్శ (అధ్యాహృతము)=చూచెను.

కాంతిమంతంబులగు నాభరణంబులుధరించి యున్నవాఁడును స్వచ్ఛములయినవస్త్రంబులం గట్టుకొని యున్నవాఁడును, తనయట్టివారలగు పెక్కండ్రుమహాత్ములచేఁబూజింపఁ బడుచున్నవాఁడునగు దేవేంద్రుని, రాముండు, దూరంబుననుండిచూచెను.

అని, తాత్పర్యము.

హరిభి ర్వాజిభి ర్యుక్త మంతరిక్షగతం రథం. ౭
దదర్శా దూరత స్తస్య తరుణాదిత్యసన్నిభమ్

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు; అదూరతః= సమీపమునందు; హరిభిః=పచ్చని; వాజిభిః= గుఱ్ఱములతో; యుక్తం=కూడినదియు; అంతరిక్షగతం=ఆకాశమును బొందినదియు; తరుణాదిత్యసన్నిభం = మధ్యాహ్నసూర్యునితో సమానమయినదియునగు; తస్య = ఆయింద్రునియొ

కః; రథం=రథమును; దదర్శ= చూచెను.

రాముండు, అయ్యాశ్రమంబునకు సమీపంబున, నాకాశంబునఁబచ్చని గుఱ్ఱంబులతోఁగూడినదియు మధ్యాహ్న సూర్యుండుం బోలె వెలుంగుచున్నదియునగు నాయింద్రునియరదంబుఁ గనెను. అని, తాత్పర్యము.

పాండురాభ్రఘనప్రఖ్యం చంద్రమండలసన్నిభమ్. ౮

అపశ్య ద్విమలం ఛత్రం చిత్రమాల్యోప శోభితమ్

టీక॥ పాండురాభ్రఘన ప్రఖ్యం= తెల్లని మేఘంబునకుంబోలె నధికమయి, నకాంతిగలదియు; చంద్రమండలసన్నిభం= చంద్రమండలముతో సమానమయినదియు; విమలం=స్వచ్ఛమును; చిత్రమాల్యోపశోభితం = నానావర్ణములయినపుష్పమాలికలచేఁ బ్రకాశించుచున్నదియునగు; ఛత్రం=గొడుగును; అపశ్యత్ =చూచెను.

రాముండు తెల్లని మేఘంబువలె నుండునదియుఁ, జంద్రమండలసమానంబును బుష్పమాలికా లంకృతంబునగు దేవేంద్రుని శ్వేతచ్ఛత్రంబునుంజూచెను. అని, తాత్పర్యము.

చామరవ్యజనే చాగ్ర్యే రుక్మదండే మహాధనే. ౯

గృహీతే వరనారీభ్యాం ధూయమానేచ మూర్ధని

టీక॥ అగ్ర్యే=శ్రేష్ఠములును; రుక్మదండే=బంగారుదండములుగలవియు; మహాధనే = అధికమయినవిలువగలవియు; వరనారీభ్యాం= ఉత్తమస్త్రీలచేత; గృహీతే=పట్టుకొనఁబడినవియు; మూర్ధని=తలయందు; ధూయమానేచ=వీవఁబడుచున్నవియునగు; చామరవ్యజనేచ=వింజామరలను; రామః(అధ్యాహృతము)=రాముఁడు; దదర్శ(అధ్యాహృతము)=చూచెను.

ఉత్తమంబులును, గాంచనదండములును గొప్పవెలగలవియునుత్తమస్త్రీలచేఁగ్రహించివీవంబడుచున్నవియునగు, వింజామరలంజూచెను. అని తాత్పర్యము

గంధర్వామరసిద్ధాశ్చ బహవః పరమర్షయః. ౧౦
అంతరిక్షగతం దేవం వాగ్భిరగ్ర్యాభి రీడిరే

టీక॥ గంధర్వామరసిద్ధాశ్చ= గంధర్వులును దేవతలునుసిద్ధులును ; పరమర్షయః=ఉత్తములగుఋషులును ; బహవః=పెక్కుం డ్రు ;అంతరిక్షగతం= ఆకాశమునుబొందినట్టి; దేవం = ఇంద్రుని; అగ్ర్యాభిః=ఉత్తమములగు; వాగ్భిః=మాటలచేత; ఈడిరే = స్తుతించిరి.

గంధర్వులును సిద్ధులును దేవతలును బరమర్షులును , ఆకాశంబునను న్న దేవేంద్రుని, వేదవాక్యంబులం బ్రస్తుతించిరి. అని, తాత్పర్యము.

సహ సంభాషమాణేతు శరభంగేణ వాసవే. ౧౧
దృష్ట్వా శతక్రతుం తత్ర రామో లక్ష్మణ మబ్రవీత్
రామోథ రథ ముద్దిశ్య లక్ష్మణాయ ప్రదర్శయన్. ౧౨

టీక॥ అథ=అంత; రామః = రాముఁడు; వాసవే= వేదేంద్రుఁడు; శరభంగేణసహ = శరభంగునితోఁగూడ; సంభాషమాణేతు = మాటలాడుచుండఁగానే; తత్ర= అచ్చట;శతక్రతుం= దేవేంద్రుని; దృష్ట్వా=చూచి;రామః= రాముఁడు; రథం=రథమును; ఉద్దిశ్య= ఉద్దేశించి;లక్ష్మణాయ=లక్ష్మణునికొఱకు;ప్రదర్శయన్=చూపుచు;లక్ష్మణం= లక్ష్మణునిగూర్చి; అబ్రవీత్ =చెప్పును.

అంత, దేవేంద్రుండు శరభంగ మహామునితో మాటలాడుచుండఁగా రాముండు, దేవేంద్రుం జూచి, లక్ష్మణునకు, దేవేంద్రునిరథంబుఁజూపుచు, నిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

అర్చిష్మంతం శ్రియాజుష్ట మద్భుతం పశ్య లక్ష్మణ
ప్రతపంత మివాదిత్య మంతరిక్ష గతం రథమ్. ౧౩

టీ॥లక్ష్మణ=లక్ష్మణుఁడా!అర్చిష్మంతం= అధికమయినతేజస్సు గలదియు ; శ్రియా=కాంతితో, జుష్టం = కూడినదియు; అద్భుతం = ఆశ్చర్యకరమును;

ప్రతపంతం=తపింపఁజేయుచున్న; ఆదిత్యమివ(స్థితం)= సూర్యునివలెనున్నదియు ; అంతరిక్షగతం=అంతరిక్షమును బొందినదియునగు; రథం=రథమును ; పశ్య=చూడుము.

లక్ష్మణుఁడా! ఆకాశంబున, శ్రీమంతంబును గాంతిమంతంబును మధ్యాహ్నసూర్యసమానంబును ఆశ్చర్యకరంబున గురథంబునుజూడుము.

అని, తాత్పర్యము.

యే హయాః పురుహూతస్య పురా శక్రస్య న శ్ర్శుతాః
అంతరిక్షగతా దివ్యా స్తఇమే హరయో ధ్రువమ్. ౧౪

టీక॥ పురా=మున్ను; పురుహూతస్య=మిక్కిలియుఁబిలువఁబడునట్టి; శక్రస్య=ఇంద్రునియొక్క; యే= ఏగుఱ్ఱములు; నః=మనకు, మనచేతననుట; శ్రుతాః=వినఁబడినవో; అంతరిక్షగతాః= ఆకాశమునుబొందినవియు; దివ్యాః= శ్రేష్ఠములునగు; ఇమే=ఇవి; తే=ఆ; హరయః=పచ్చనిగుఱ్ఱములు. ధ్రువం= నిశ్చయము.

మున్నుమనము , యాగముచేయువాండ్రచేసభక్తికంబుగాఁబిలువంబడునట్టిదేవేంద్రునిగుఱ్ఱములనువినియున్నామే ; ఆపచ్చనిగుఱ్ఱములు, ఇదిగో యాకాశంబునవచ్చియున్నవి; చూడుము.

అని, తాత్పర్యము.

ఇమేచ పురుషవ్యాఘ్రా యే తిష్ఠంత్యభితో రథమ్
శతం శతం కుండలినో యువానః ఖడ్గపాణయః. ౧౫
విస్తీర్ణవిపులోరస్కాః పరిఘాయతబాహవః
శోణాంశువసనా స్సర్వే వ్యాఘ్రాఇవ దురాసదాః ౧౬

టీక॥ కుండలినః= పోఁగులుగలవారలును; యువానః=యౌవనముగలవారలును; ఖడ్గపాణయః= కత్తులుచేతులంగల వారలును ; విస్తీర్ణవిపులోరస్కాః= మిక్కిలియు విశాలము లగు ఱొమ్ములుగలవారలును ; పరిఘాయతబాహవః=ఇనుపగుదియలువలె నిడుపులయిన చేతులు గలవారలును ; శోణాంశువసనాః=ఎఱ్ఱనికాంతులుగల వస్త్రములుగలవారలును ; వ్యాఘ్రాఇవ=పెద్దపులులువలె; దురాసదాః = చెనకనలవిగానివారలునగు; యే = ఎ

వ్వరు; రథం = రథమును, రథముయొ
క్క-యనుట; అభితః = చుట్టును; శ
తంశతం=నూఱునూఱుగా; తిష్ఠంతి =
ఉన్నారో; ఇమే=ఈ;పురుషవ్యాఘ్రా
శ్చ=పురుషశ్రేష్ఠులును; సర్వే= అంద
ఱును; దేవాః(అధ్యాహృతము)=దేవ
తలు.

కుండలాలంకృతులును యౌవనవం తులునుఖడ్గపాణులును అత్యంతవిశాల వక్షులునుఇనుపగుదియలవంటి బాహువులుగలవారలును ఎఱ్ఱనివస్త్రములు ధరించినవారలును బెద్దపులులుంబోలెదురాసదులునగు నీపురుషశ్రేష్ఠులు, రథంబుచుట్టును ఒకొకదిక్కున నూఱుఱు నూఱుఱుగా నిలుచున్నారే; వీరలందఱుదేవతలు. అని, తాత్పర్యము.

ఉరోదేశేషు సర్వేషాం హారా జ్వలనసన్నిభాః

టీక॥ సర్వేషాం = అందఱియొక్క-యు; ఉరోదేశేషు= వక్షఃప్రదేశముల యందు; జ్వలనసన్నిభాః=అగ్నిహోత్రముతోసమానములయిన; హారాః= హారములు; సంతి(అధ్యాహృతము) = ఉన్నవి.

వీరలకందఱకును, ఱొమ్ములపై,దివ్యతేజంబులగు హారంబులుగలవు చూడుము. అని, తాత్పర్యము.

రూపం బిభ్రతి సౌమిత్రే పంచవింశతి వార్షికమ్. ౧౭

టీక॥ సౌమిత్రే= లక్ష్మణుఁడా! ఏతే(అధ్యాహృతము)= వీరలు; పంచ వింశతివార్షికం = ఇరువదియయిదు సంవత్సరముల పరిమాణముగల; రూపం=ఆకారమును; బిభ్రతి=ధరించుచున్నారు.

లక్ష్మణుఁడా! వీరలందఱు,ఇరువదియయిదుసంవత్సరములవయసుకుమించకున్నారు.అని, తాత్పర్యము.

ఏతద్ధి కిల దేవానాం వయో భవతి నిత్యదా
యథేమే పురుషవ్యాఘ్రా దృశ్యంతే ప్రియదర్శనాః. ౧౮

టీక॥ పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుండవగు లక్ష్మణుఁడా! ఏతత్ =

స ౫

ఈః=వయోహి=వయస్సు; దేవానాం=దేవతలకు; నిత్యదా=ఎల్లప్పుడును;భవతికిల=అగుచున్నదిగదా! ఇమే=వీరలు; యథా=ఎట్లు; ప్రియదర్శనాః=సంతోషకరమయిన చూచుటగలవారలుగా; దృశ్యంతే = చూడఁబడుచున్నారో.

దేవతలకు,ఎప్పకిని,ఈయిరువదినైదు సంవత్సరములవయస్సుమించదు; వీరలెంతసుందరాకారులో! చూడుము. అని, తాత్పర్యము.

ఇహైవ సహ వైదేహ్యా ముహూర్తం తిష్ఠ లక్ష్మణ
యావ జ్జానా మ్యహం వ్యక్తం క ఏష ద్యుతిమా న్రథే. ౧౯

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! అహం=నేను;రథే=రథమునందు; ద్యుతిమాన్=కాంతిమంతుండగు;ఏషః= ఇతండు;కః=ఎవ్వఁడు ? ఏతత్(అధ్యాహృతము)=దీనిని;యావత్= ఎంతలోపల;వ్యక్తం= స్పష్టముగా ; జానామి=తెలుసుకొందునో ; తావత్(అధ్యాహృతము)= అంతవఱకు ; ముహూర్తంతు = కొంచెముసేపుమాత్రము;ఇహైవ=ఇచ్చటనె; వైదేహ్యా సహ=సీతాదేవితోఁగూడ;తిష్ఠ= ఉండుము.

లక్ష్మణుఁడా! నీవిచ్చటనెసీతతోఁగూడఁగొంచెముసేపు,ఉండుము; నేనుబోయికాంతిమంతుండగు నీతండెవ్వఁడో, స్పష్టముగాఁ దెలిసికొనివచ్చెదను.అనిరాముండు, లక్ష్మణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

తమేవ ముక్త్వా సౌమిత్రి మిహైవ స్థీయతా మితి
అభిచక్రామ కాకుత్థ్స శ్శరభంగాశ్రమం ప్రతి. ౨౦

టీక॥ కాకుత్థ్సః=రాముఁడు ; ఏవం=ఇట్లు;తం=ఆ;సౌమిత్రిం= లక్ష్మణునిగూర్చి=ఇహైవ=ఇచ్చటనె ;స్థీయతాం=ఉండుటయగుఁగాక. ఇతి= అని;ఉక్త్వా=చెప్పి ; శరభంగాశ్రమం ప్రతి = శరభంగునియాశ్రమమునుగూర్చి;అభిచక్రామ=పోయెను.

రాముఁడు, ఇట్లులక్ష్మణునకిచ్చట




నెయుండుమని చెప్పి, తాను, శరభంగమహామునియాశ్రమముతట్టుపోయెను,

అని, తాత్పర్యము.

తత స్సమభిగచ్ఛంతం ప్రేక్ష్య రామం శచీపతిః
శరభంగ మనుప్రాప్య వివిక్త ఇద మబ్రవీత్. ౨౧

టీక॥ తతః=అంత; శచీపతిః=దేవేంద్రుఁడు; సమభిగచ్ఛంతం=వచ్చుచున్న; రామం=రాముని; ప్రేక్ష్య=చూచి; శరభంగం=శరభంగమహామునిని ; అనుప్రాప్య=సమీపమునుఁబొంది; వివిక్తే=ఏకాంతమునందు; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, దేవేంద్రుండు, రాముండువచ్చుటనుజూచి, శరభంగమహామునిసమీపంబునకుంబోయి, యేకాంతంబున , నాయనతోనిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇహోపయాత్య సౌ రామో యావన్మా మభిభాషతే
నిష్ఠాం నయతు తావత్తు తతో మాం ద్రష్టు మర్హతి. ౨౨

టీక॥ అసౌ=ఈ; రామః=రాముఁడు; ఇహ=ఇచ్చటికి; ఉపయాతి= వచ్చుచున్నాఁడు. అయం (అధ్యాహృతము)=ఈతఁడు; యావత్= ఎంతవఱకు; మాం= నన్నుఁగూర్చి; నాభిభాషతే=మాటలాడకున్నాఁడో; తావత్తు=అంతలోపలనే; నిష్ఠాం=సమాప్తిని ; నయతు=పొందించుఁగాక. తతః=అటుపిమ్మట; మాం=నన్ను ; ద్రష్టుం=చూచుటకు; అర్హతి=తగును.

ఇదుగో రాముండు వచ్చుచున్నాఁడు; ఇతండు నాతోమాటలాడుటకుమున్నెకార్యంబు సాధింపవలయును; కార్యసాధనంబయినపిమ్మట, నన్నుఁజూడవచ్చును. అని, తాత్పర్యము.

జితవంతం కృతార్థంచ ద్రష్టాహ మచిరా దిమమ్

టీక॥ అహం=నేను; జితవంతం= జయించినవాఁడును; కృతార్థంచ=చేయఁబడిన దేవతాకార్యము గలవాఁడునగు; ఇమం=ఈ రాముని; అచిరాత్=




శీఘ్రముననే; ద్రష్టా(ద్రష్టాస్మి)=చూడఁగలను.

ఈతండు రావణునివధించి దేవతాకార్యంబుసాధించినపిమ్మట, శీఘ్రంబుననే,నీతనింజూచెదను.

అని, తాత్పర్యము.

కర్మ హ్యనేన కర్తవ్యం మహదన్యై స్సుదుష్కరమ్. ౨౩
నిష్పాదయిత్వా తత్కర్మ తతో మాం ద్రష్టు మర్హతి

టీక॥అన్యైః=ఇతరులచేత; సుదుష్కరం=ఎంతమాత్రముచేయనలవిగానిదియు;మహత్=గొప్పదియునగు; కర్మ=కార్యము; అనేన= ఈరామునిచేత; కర్తవ్యంహి=చేయఁబడవలసినదిగదా! తత్=ఆ; కర్మ= కార్యమును; నిష్పాదయిత్వా(నిష్పాద్య)=చేసి; తతః=అటుపిమ్మట; మాం=నన్ను;ద్రష్టుం = చూచుటకు; అర్హతి=తగును.

ఇతండు, వఱిమెవ్వరికిని అసాధ్యమగుగొప్పకార్యమునొకటిఁ జేయవలసియున్నదిగదా! దానిఁగావించిన పిమ్మట,నన్నుఁజూచుటమంచిది. అని, యింద్రుండు,శరభంగునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి వజ్రీ త మామన్త్ర్య మానయిత్వాచ తాపసమ్. ౨౪
రథేన హరియుక్తేన యయౌ దివ మరిందమః

టీక॥ఇతి=ఇట్లు;అరిందమః= శత్రువులవణఁగఁ ద్రొక్కునట్టి ; వజ్రీ=ఇంద్రుండు;తం=ఆ;తాపసం= శరభంగమహామునిని; మానయిత్వా= పూజించి; ఆమన్త్ర్యచ=వీడుకొనియు; హరియుక్తేన=గుఱ్ఱములతోఁగూడిన ; రథేన=రథముచేత; దివం=స్వర్గమును ; యయౌ=పొందెను.

ఇట్లుశత్రువులనణఁగఁద్రొక్కునట్టి దేవేంద్రుండు, ఆశరభంగ మహామునికిం జెప్పి యాయనంబూజించి,వీడ్కొని,రథంబారోహించి స్వర్గంబునకుఁబోయెను. అని,తాత్పర్యము.

స ౫

ప్రయాతేతు సహస్రాక్షే రాఘవ స్సపరిచ్ఛదమ్. ౨౫
అగ్నిహోత్ర ముపాసీనం శరభంగ ముపాగమత్

టీక॥ సహస్రాక్షే=దేవేంద్రుండు; ప్రయాతేతు=పోఁగానే; రాఘవః = రాముఁడు ; సపరిచ్ఛదం=పరివారము తోఁగూడునట్లుగా, అగ్నిహోత్రం = అగ్నిహోత్రమును;ఉపాసీనం= ఉపా సించుచున్న; శరభంగం= శరభంగమ హామునిని,ఉపాగమత్=పొందెను.

అంత, దేవేంద్రుండుపోయినంతనె రాముండు, సీతాలక్ష్మణులతోఁగూడ, నగ్ని ప్రవేశార్థమయి యగ్నిహో త్రము నుపాసించుచున్నశరభంగమహా మునియొద్దకుఁబోయెను.

అని, తాత్పర్యము.

తస్య పాదౌచ సంగృహ్య రామ స్సీతాచ లక్ష్మణః. ౨౬
నిషేదు స్సమనుజ్ఞాతా లబ్ధవాసా నిమంత్రితాః

టీక॥రామః= రాముండును ; సీతా=సీతయును; లక్ష్మణశ్చ = లక్ష్మ ణుండును;తస్య = ఆశరభంగమహా మునియొక్క; పాదౌచ= పాదముల ను;సంగృహ్యచ=పట్టుకొనియు; సమ నుజ్ఞాతాః=అనుమతింపఁబడిన వారల యి; లబ్ధవాసాః= పొందఁబడినయా సనముగలవారలయి ; నిమంత్రితాః= ఆతిథ్యస్వీకరణార్థమువరింపఁ బడిన వారలయి;నిషేదుః=కూర్చుండిరి.

రాముండునుసీతాలక్ష్మణులును, ఆ శరభంగమహామునిపాదంబులకు నమ స్కరించి, యాయనయాసనంబాసం గియాతిథ్యంబుగ్రహింపుఁడనినుడువం, గూర్చుండిరి. అని, తాత్పర్యము.

తత శ్శక్రోపయానంతు పర్యపృచ్ఛ త్స రాఘవః. ౨౭

టీక॥ తతః=అంత;సః=ఆ ; రాఘ వః=రాముఁడు ; శక్రోపయానంతు= దేవేంద్రునియొక్క వచ్చుటనుగూర్చి యె;పర్యపృచ్ఛత్=అడిగెను.

అంత,రాముండు, శరభంగమహా మునిని, దేవేంద్రుండువచ్చినసంగతిం గు

టించియడిగెను. అని, తాత్పర్యము.

శరభంగశ్చ తత్సర్వం రాఘవాయ న్యవేదయత్

టీక॥శరభంగశ్చ = శరభంగుఁడును;తత్ = దాని; సర్వం = అంతయు; రాఘవాయ = రామునికొఱకు; న్యవేదయత్ = తెలిపెను.

శరభంగుండాసంగతియంతయు, రామునకుం జెప్పెను.
అని, తాత్పర్యము.

మా మేష వరదో రామ బ్రహ్మలోకం నినీషతి. ౨౮
జిత ముగ్రేణ తపసా దుష్ప్రాప మకృతాత్మభిః

టీక॥ రామ = రాముఁడా! వరదః = వరమునిచ్చునట్టి;ఏషః = ఈయింద్రుఁడు;ఉగ్రేణ = తీక్ష్ణమయిన; తపసా = తపస్సుచేత; జితం = జయింపఁబడినదియు; అకృతాత్మభిః = తెలియఁబడనియాత్మగలవారలచేత; దుష్ప్రాపం = పొందఁగూడనిదియునగు ; బ్రహ్మలోకం = బ్రహ్మలోకమును; నినీషతి = కొనిపోఁగోరుచున్నాఁడు.

రాముఁడా! వరంబులొసంగునట్టి యీదేవేంద్రుండు, నేఁగావించినయుగ్రతపస్సుచేఁబ్రాప్తమయినదియు నాత్మవేత్తలుగానివారలకుఁ బొందనలవిగానిదియునగు బ్రహ్మలోకంబునకు, నన్నుఁదీసికొనిపోఁదలంచియున్నాఁడు.
అని, తాత్పర్యము.

అహం జ్ఞాత్వా నరవ్యాఘ్ర వర్తమాన మదూరతః. ౨౯
బ్రహ్మలోకం న గచ్ఛామి త్వా మదృష్ట్వా ప్రియాతిథిమ్

టీక॥నరవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుండవగురాముఁడా! త్వాం(అధ్యాహృతము) = నిన్ను;అదూరతః = సమీపమునందు;వర్తమానం = ఉన్నవానిఁగా; జ్ఞాత్వా = ఎఱింగి;ప్రియాతిథిం = ప్రియుఁడైనయతిథివగు ; త్వాం = నిన్ను; అదృష్ట్వా = చూడక; బ్రహ్మలోకం = బ్రహ్మలోకమును; నగచ్ఛామి = పొందను

న్నాను.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! నీ విచ్చటదగ్గిఱనేయున్నావని యెఱింగి, ప్రియాతిథివగు నిన్నుఁజూడక పోఁగూడదని బ్రహ్మలోకంబునకుం బోకున్నాను. అని, తాత్పర్యము.

త్వయాహం పురుషవ్యాఘ్ర ధార్మికేణ మహాత్మనా. ౩౦
సమాగమ్య గమిష్యామి త్రిదివం దేవసేవితమ్

టీక॥పురుషవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! ధార్మికేణ = ధర్మమునాచరించు వాఁడవును; మహాత్మనా= పూజ్యమయినస్వభావముగల వాఁడవునగు; త్వయా=నీతో; సమాగమ్య=సమాగమముచేసి; దేవసేవితం= దేవతలచేసేవింపఁబడిన;త్రిదివం= బ్రహ్మలోకమును; గమిష్యామి= పొందెదను.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! ధార్మికుండవు మహాత్ముండవునగు నిన్నుఁజూచి, యటుపిమ్మట దేవసేవితంబగు బ్రహ్మలోకంబునకుఁ బోయెదనని యుంటిని. అని, తాత్పర్యము.

అక్షయా నరశార్దూల మయా లోకా జితా శ్శుభాః. ౩౧
బ్రాహ్మ్యాశ్చ నాకపృష్ఠ్యాశ్చ ప్రతిగృహ్ణీష్వ మామకాన్

టీక॥నరశార్దూల=పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! మయా = నాచేత; బ్రాహ్మ్యాశ్చ= బ్రహ్మలోకంబునం గలిగినవియు; నాకపృష్ఠ్యాశ్చ= స్వర్గలోకమునం గలిగినవియునగు ; అక్షయాః=నాశములేని; శుభాః= మంగళకరములయిన; లోకాః = భోగభూములు ; జితాః=జయింపఁబడినవి. మామకాన్=నాలోకములను; ప్రతిగృహ్ణీష్వ=స్వీకరింపుము.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! నేనుఅక్షయంబులగు బ్రహ్మలోక స్వర్గలోకంబులను, సాధించి యున్నాను; వానినన్నింటినినీకు సమర్పించెదను; ప్రతిగ్రహింపుము. అని,శరభంగమహాముని, చెప్పి, తానుగావించిన సమస్త కర్మంబులను, ఈశ్వరునకుసమర్పించెను. అని, తాత్పర్యము,

ఏవ ముక్తో నరవ్యాఘ్ర స్సర్వశాస్త్రవిశారదః. ౩౨
ఋషిణా శరభంగేణ రాఘవో వాక్య మబ్రవీత్

టీక॥ నరవ్యాఘ్రః= పురుషశ్రేష్ఠుండును; సర్వశాస్త్రవిశారదః= సమస్తశాస్త్రంబులందుండిటుండునగు; రాఘవః=రాముండు ; శరభంగేణ=శరభంగుండను; ఋషిణా=ఋషి చేత; ఏవం= ఇట్లు; ఉక్తః = చెప్పంబడినవాండై; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

పురుషశ్రేష్ఠుండునుసమస్తశాస్త్రంబులు దెలిసినవాండునగు రాముండు, శరభంగమహామునిచెప్పినమాటనువిని, యాయనతోనిట్లని, చెప్పెను.
అని, తాత్పర్యము.

అహమేవా హరిష్యామి సర్వలోకా న్మహామునే. ౩౩
ఆవాసం త్వహ మిచ్ఛామి ప్రదిష్ట మిహ కాననే

టీక॥మహామునే=పూజ్యుండవయినమునివగుశరభంగుండా! అహమేవ = నేనే; సర్వలోకాన్=సమస్తలోకంబులను; ఆహరిష్యామి=సాధించెదను. ఇహ=ఈ; కాననే=అడవియందు; ప్రదిష్టం=చూడంబడిన; ఆవాసంతు= వాసస్థానమునుమాత్రము; ఇచ్ఛామి=కోరుచున్నాను.

శరభంగమహామునీ! సమస్తలోకంబులను నేనెసాధించుకొనం గోరియున్నాను ; నాకీయడవియందువాసంబు సేయుటకుం దగినస్థలంబునుమాత్రము జూపుము. అని, రాముండు , శరభంగమహామునితోంజెప్పెను.
అని, తాత్పర్యము.

రాఘవేణైవ ముక్తస్తు శక్రతుల్యబలేన వై. ౩౪
శరభంగో మహాప్రాజ్ఞః పునరేవాఽబ్రవీ ద్వచః

టీక॥ మహాప్రాజ్ఞః = మహాపండితుండగు; శరభంగః= శరభంగమహాముని; శక్రతుల్యబలేన= దేవేంద్రునిబలముతోసమానమయినబలముగల("వై" అనునది పాదపూరణార్థము); రాఘవేణ=రామునిచేత; ఏవం= ఇట్లు; ఉక్తస్తు=చెప్పంబడినవాఁడైనంతనె; పునరేవ=మఱలనె; వచః=మాటను; అబ్రవీత్=చెప్పెను.

మహాపండితుండగు శరభంగమహాముని, రామునిమాటనువిని, మఱలరామునింజూచి, యిట్లని,పలికెను.

అని, తాత్పర్యము.

ఇహ రామ మహాతేజా స్సుతీక్ష్ణో నామ ధార్మికః. ౩౫
వసత్య రణ్యే ధర్మాత్మా స తే శ్రేయో విధాస్యతి

టీక॥ రామ=రాముఁడా! ఇహ= ఈ; అరణ్యే= అడవియందు; మహాతేజాః= అధికమయినప్రభావముగలవాఁడును; ధార్మికః= ధర్మమునాచరించువాఁడును; ధర్మాత్మా= ధర్మబుద్ధిగలవాఁడునగు;సుతీక్ష్ణో నామ=సుతీక్ష్ణుండనిప్రసిద్ధుఁడైనవాఁడు;వసతి=ఉన్నాఁడు.సః=అతఁడు; తే=నీకొఱకు;శ్రేయః=మేలును;విధాస్యతి=చేయఁగలఁడు.

రాముఁడా' ఈయడవియందిచ్చటికి సమీపంబుననె మహాప్రభావుండును ధార్మికుండును ధర్మాత్ముండునగు సుతీక్ష్ణుండను మహర్షియున్నాఁడు;ఆయననీకు మేలుగావించును.

అని, తాత్పర్యము.

సుతీక్ష్ణ మభిగచ్ఛ త్వం శుచౌ దేశే తపస్వినమ్. ౩౬
రమణీయే వనో ద్దేశే స తే వాసం విధాస్యతి

టీక॥ త్వం=నీవు; తపస్వినం=అధికమయినతపస్సుగల; సుతీక్ష్ణం= సుతీక్ష్ణుని; అభిగచ్ఛ=పొందుము, సః= ఆయన; రమణీయే= సుందరమును; శుచౌ=పరిశుద్ధమునగు; వనోద్దేశే=అరణ్యప్రదేశమయిన ; దేశే=స్థలమునందు; తే=నీకొఱకు; వాసం=వాసస్థానమును; విధాస్యతి=చేయఁగలఁడు.

నీవుసుతీక్ష్ణమహర్షియొద్దకుఁ బొమ్ము; ఆయన,నీకు, రమణీయంబును బరిశుద్ధంబునగు ప్రదేశంబునవాసస్థానంబేర్పఱచును? అని,తాత్పర్యము.

ఇమాం మందాకినీం రామ ప్రతిస్రోతా మనువ్రజ. ౩౭
నదీం పుష్పోడుపవహాం తత్రతత్ర గమిష్యసి

టీక॥రామ=రాముఁడా!ఇమాం=ఈ; మందాకినీనదీం=మందాకినీనదిని(ఇందువలన,ఋషులు, పుణ్యానదులన్నిటినిగంగానదీసామ్యబుద్ధిచే, "మందాకినీనది" అనఁగాగంగానదియని, వ్యవహరించుచుండినట్లు తెలియవచ్చెడిని. అదేప్రకారంబున,నిప్పుడు కావేరీతీరవాసులేనదినేనికావేరియనియే చెప్పెదరు.)ప్రతిస్రోతాం(ప్రతిస్రోతసం)=ఎదురుప్రవాహముగలదానిఁగా; అనువ్రజ= వెంబడింపుము.తత్ర తత్ర=అచ్చటచ్చట; పుష్పోడుపవహాం = పూలవంటితెప్పలనువహించునట్టి; నదీం=ఏటిని; గమిష్యసి=పొందఁగలవు.

రాముఁడా! ఈయేటిగట్టుననె, పశ్చిమాభిముఖంబుగా మార్గమొకటియున్నది; అదికొంతదూరము, ఏటికి సమీపంబుగను, గొంతదూరము, ఏటికిదూరంబుగను, ఉండును; ఏటిలోఁబుష్పాకారంబులగు తెప్పలగపడుచుండును; నీవాదారింబట్టిపొమ్ము.

అని, తాత్పర్యము.

ఏష పంథా నరవ్యాఘ్ర ముహూర్తం పశ్య తాత మామ్.౩౮
యావజ్జహామి గాత్రాణి జీర్ణాం త్వచ మివోరగః

టీక॥ నరవ్యాఘ్ర= పురుషశ్రేష్ఠుఁడా! తాత=నాయనా! ఏషః=ఇది; పంథాః=మార్గము. యావత్=ఎంతలోపల; ఉరగః = సర్పము ; జీర్ణాం=శిథిలమయిన;త్వచమివ=కుబుసమునువలె;గాత్రాణి= అవయవములను; జహామి = విడిచెదనో.తావత్(అధ్యాహృతము)=అంతవఱకు;ముహూర్తం=కొంచెముసేపు; మాం=నన్ను; పశ్య=చూడుము.

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! నీవుకొంచెముసేపిచ్చటనన్నుఁజూచుచుం

డుము, సర్వముకుబుసమునువిడుచునట్లు, నేజీర్ణదేహమునువిడిచెదను.

అని, తాత్పర్యము.

తతో౽గ్నిం సుసమాధాయ హుత్వాచాజ్యేన మంత్రవిత్. ౩౯
శరభంగో మహాతేజాః ప్రవివేశ హుతాశనమ్

టీక॥ తతః=అంత; మహాతేజాః= అధికమయినకాంతిగల; మంత్రవిత్ = మంత్రంబులఁదెలిసిన; శరభంగః= శరభంగమహాముని; అగ్నిం=అగ్నిహోత్రమును; సుసమాధాయ = ప్రజ్వలింపఁజేసి; ఆజ్యేన = నేతిచేత; హుత్వా చ=వ్రేల్చియు; హుతాశనం = అగ్నిహోత్రమును; ప్రవివేశ=ప్రవేశించెను.

అంత, మహాతేజుండును సమస్తమంత్రజ్ఞుండునగు శరభంగమహాముని, యగ్నింబ్రజ్వలింపఁజేసి, యాజ్యంబు వ్రేల్చి, యయ్యగ్నిహోత్రముం బ్రవేశించెను. అని, తాత్పర్యము.

తస్య రోమాణి కేశాంశ్చ దదాహాగ్నిర్మహాత్మనః. ౪౦
జీర్ణాంత్వచం తథాస్థీని యచ్చ మాంసం సశోణితమ్

టీక॥ అగ్నిః=అగ్నిహోత్రము; మహాత్మనః= అధికమయినప్రభావము గల; తస్య= ఆశరభంగమహామునియొక్క; రోమాణి = దేహమునందలివెంట్రుకలను; కేశాంశ్చ = తలవెండ్రుకలను; జీర్ణాం=శిథిలమయిన; త్వచం = చర్మమును; తథా=అట్లు; అస్థీని= ఎముకలను; సశోణితం=నెత్తురుతోఁగూడిన; మాంసం=మాంసము ; యత్(అస్తి)=ఏదిగలదో ; తత్ (అధ్యాహృతము) చ=దానిని; దదాహ=కాల్చెను.

అంత, నయ్యగ్నిహోత్రంబున; మహాత్ముండగు నాశరభంగుని వెండ్రుకలును శిథిలంబగుచర్మంబును అస్థులును మాంసంబును దగ్ధమయ్యెను.

అని, తాత్పర్యము.

రామస్తు విస్మితో భ్రాత్రా భార్యయాచ సహాత్మవాన్. ౪౧

టీక॥ ఆత్మవాన్= పూజ్యమయినమనస్సుగల; రామస్తు = రాముఁడును;

భ్రాత్రా=తమ్మునితోను ; భార్యయా చసహ= భార్యతోనుఁగూడ ; విస్మితః=ఆశ్చర్యపడినాఁడు

అట్లుశరభంగునిశరీరం బగ్నిహోత్రంబునదగ్ధంబగుటనుజూచి , మహాత్ముండగు రాముండును సీతయులక్ష్మణుండును,బరమాశ్చర్యంబునొందిరి

అని, తాత్పర్యము.

సచ పావకసంకాశః కుమార స్సమపద్యత
ఉత్థాయాఽగ్నిచయా త్తస్మా చ్ఛరభంగో వ్యరోచత. ౪౨

టీక॥సః=ఆ ; శరభంగశ్చ= శరభంగుఁడును; పావకసంకాశః= నిప్పుతోఁబోల్కిగల, కుమారః= ముప్పది సంవత్సరములకులోనుగాగల వయస్సుగలవాఁడు; సమపద్యత = ఆయెను; తస్మాత్=ఆ; అగ్నిచయాత్=అగ్నిసమూహమునుండి; ఉత్థాయ= లేచి; వ్యరోచత=ప్రకాశించెను.

అంత, నాశరభంగుఁడు, అగ్నిహోత్రుండుంబోలె వెలుంగునట్టి , ముప్పదియేండ్లకులోనయిన వయస్సుతోఁగూడిన, రూపముగలవాఁడయి , మహాతేజంబున వెలుంగుచు, నయ్యగ్నిహోత్రంబుననుండివెలువడెను.

అని, తాత్పర్యము.

స లోకా నాహితాగ్నీనా మృషీణాంచ మహాత్మనామ్
దేవానాం చ వ్యతిక్రమ్య బ్రహ్మలోకం వ్యరోహత. ౪౩

టీక॥ సః=ఆశరభంగుఁడు; ఆహితాగ్నీనాం = ఆహితాగ్నులయొక్కయు; మహాత్మనాం= అధికమయినప్రభావముగల; ఋషీణాంచ= ఋషులయొక్కయు; దేవానాంచ= దేవతలయొక్కయు; లోకాన్ = లోకములను; వ్యతిక్రమ్య=అతిక్రమించి; బ్రహ్మలోకం=బ్రహ్మలోకమును; వ్యరోహత=ఆరోహించెను.

ఆశరభంగమహర్షి,ఆహితాగ్నిలోకంబులను మహాత్ములగుఋషులుచేరులోకంబులను దేవలోకంబులను అతిక్రమించి, బ్రహ్మలోకంబుఁజేరెను.

అని, తాత్పర్యము.

స ౫

స పుణ్యకర్మా భవనే ద్విజర్షభః
పితామహం సానుచరం దదర్శహ
పితామహ శ్చాపి సమీక్ష్య తం ద్విజం
ననంద సుస్వాగత మిత్యువాచ హ. ౪౪

టీక॥ పుణ్యకర్మా = పుణ్యప్రదములగుకర్మములుగలః;సః=ఆ ; ద్విజర్షభః=బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు శరభంగమహార్షి;భవనే=లోకమునందు;సానుచరం=సేవకులతోఁగూడిన ; పితామహం=బ్రహ్మదేవుని;దదర్శ = చూచెను "హ"అనునది పాదపూరణార్థము.పితామహశ్చాపి= బ్రహ్మదేవుఁడును;తం=ఆ;ద్విజం=బ్రాహ్మణుని; సమీక్ష్య=చూచి;ననంద= సంతోషించెను. సుస్వాగతం= సుఖముతోడిరాకయనుటను;ఉవాచ=చెప్పెను "హ"అనునది పాదపూరణార్థము.

పుణ్యకర్మఁడును బ్రాహ్మణోత్తముండునగు నాశరభంగమహాముని , యాబ్రహ్మలోకంబున,సపరివారుండగు బ్రహ్మదేవుంజూచెను; బ్రహ్మదేవుండును, శరభంగునింజూచిసంతోషించి , స్వాగతంబుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే, పంచమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండ పంచమసర్గటీక ,
ముగిసినది.

(శ్రీ)

షష్ఠ సర్గ ప్రారంభః.

శరభంగే దివం యాతే మునిసంఘా స్సమాగతాః
అభ్యగచ్ఛంత కాకుత్థ్సం రామం జ్వలితతేజసమ్. ౧

టీక॥ శరభంగే = శరభంగమహాముని; దివం=స్వర్గమును ; యాతే= పొందినవాఁడుకాఁగా; మునిసంఘాః= మునిసమూహములు; సమాగతాః=చేరినవై; జ్వలితతేజసం = మండుచున్న కాంతిగల; కాకుత్థ్సం=కకుత్థ్సవంశంబునంబుట్టిన; రామం=రాముని ; అభ్యగచ్ఛంత=పొందిరి.

శరభంగుండు మృతిఁబొందినవెనుక, మునులందఱునొక్కటియయి, తేజంబున వెలుంగుచుండు రామునొద్దకు వచ్చిరి. అని, తాత్పర్యము.

వైఖానసా వాలఖిల్యా స్సంప్రక్షాళా మరీచిపాః
అశ్మకుట్టాశ్చ బహవః పత్రాహారాశ్చ ధార్మికాః. ౨
దంతోలూఖలినశ్చైవ తథైవోన్మజ్జకాః పరే
గాత్రశయ్యా అశయ్యాశ్చ తథైవాఽభ్రావకాశకాః. ౩
మునయ స్సలిలాహారా వాయుభక్షా స్తథా పరే
ఆకాశనిలయాశ్చైవ తథాస్థండిలశాయినః. ౪
వ్రతోపవాసినో దాంతా స్తథార్ద్రపటవాససః
సజపాశ్చ తపోనిత్యా స్తథాపంచ తపోన్వితాః. ౫
సర్వే బ్రాహ్మ్యాశ్రియా జుష్టా దృఢయోగా స్సమాహితాః
శరభంగాశ్రమే రామ మభిజగ్ముశ్చ తాపసాః. ౬

టీక॥ వైఖానసాః= బ్రహ్మదేవుని నఖంబులవలనఁ బుట్టినవారలును; వా

స ౬

లఖిల్యాః=బ్రహ్మదేవునిరోమంబుల వలనఁబుట్టినవారలును; సంప్రక్షాళాః=దేహమంతయు లోపలఁ గడుగుకొనువారలును; మరీచిపాః=రవిచంద్రకిరణంబులను, ద్రాఁగువారలును, అశ్మకుట్టాశ్చ=ఱాళ్లచేదేహమును గొట్టుకొనువారలును; బహవః=పెక్కండ్రు; పత్రాహారాశ్చ=ఆకులెయాహారముగాఁ గలవారలును; ధార్మికాః= ధర్మము నాచరించువారలును; దంతోలూఖలినశ్చైవ = దంతములె ఱోళ్లుగాగల వారలును; తథైవ=అట్లె ; ఉన్మజ్జకాః= ఆకంఠము జలములనుండునట్టి ; పరే=ఇతరులును ; గాత్రశయ్యాః = దేహమునం దేపడకగలవారలును; అశయ్యాశ్చ = పడక యె లేనివారలును; తథైవ=అట్లె; అభ్రావకాశకాః= బయలెవాసప్రదేశముగాఁ గల వారలును; సలిలాహారాః=జలమెయాహారముగాఁగల; మునయః= మునులును; తథా=అట్లు; వాయుభక్షాః= వాయువెయాహారముగాఁగల; పరే= ఇతరులును; ఆకాశనిలయాశ్చైవ= ఆకాశమునందునికిగలవారలును; తథా= అట్లు; స్థండిలశాయినః= నేలయందుఁ బరుండువారలును; వ్రతోపవాసినః= వ్రతములచే నుపవాసములు గావించువారలును; దాంతాః=ఇంద్రియనిగ్రహముగలవారును; తథా=అట్లు; ఆర్ద్రపటవాససః=తడిసినవస్త్రము లెకట్టువస్త్రములుగాఁగలవారలును; సజపాశ్చ= జపముతోఁగూడినవారలును ; తపోనిత్యాః=తపస్సునందుస్థిరులును; తథా= అట్లు, పంచతపోన్వితాః=పంచాగ్నులనడుమనుండిచేయుఁ తపస్సుతోఁ గూడినవారలును; సర్వే = అందఱును; బ్రాహ్మ్యా = బ్రహ్మసంబంధినియగు; శ్రియా=కాంతితో ; జుష్టాః=కూడినవారలును; దృఢయోగాః=దృఢమయినయోగముగలవారలును ; సమాహితాః = సమాధినిష్ఠులునగు ; తాపసాః=ఋషులు; శరభంగాశ్రమే= శరభంగునియాశ్రమమునందు ; రామం= రాముని; అభిజగ్ముః=పొందిరి.

బ్రహ్మనఖంబుల వలనంబుట్టిన వైఖానసులను మునులును బ్రహ్మరోమంబులజన్మించినట్టివాలఖిల్యులనుమునులును, దేహంబులోపలి భాగము నంతయునీటిచేఁ గడుగుకొనునట్టి ఋషులును, చంద్రసూర్యుల కిరణంబులం ద్రాఁగియుండు వారలును, దేహ మంతయుఱాళ్లచేఁ గొట్టుకొను వారలును

బద్ధాహారులును, వడ్లు మొదలగు ధాన్యంబుల దంచుటకు బదులుగా దంతముల చేత నేనమిలిపొట్టునువిడిచి గింజలను మాత్రము దినువారలును, కంఠములోఁతునీళ్లలోనుండి తపముసేయు వారలును, దేహమునందేఱొమ్ముమీఁదఁగానిభుజముమీఁదఁగానితలయుంచుకొని నిద్రించివారలును, నిద్రింపక మేయుండువారలును, శీతకాలంబునబయలనుండితపముసల్పువారలును, జలమాత్రాహారులును, వాయుమాత్రాహారులును, అనాధారంబుగనాకాశంబుననుండువారలును, నేలంబరుండు వారలును, వర్తాధర్ణముఖు నిత్యోపవాసములుండువారలును, జితేంద్రియులును, ఎల్ల ప్పుడునుదడిబట్టలంగట్టుకొనియుండు వారలును, వివిధమంత్రజపంబులుసేయువారలును, స్వాధ్యాయపరాయణులును, గ్రీష్మకాలంబునఁ బంచాగ్నిమధ్యంబుననుండితపంబు గావించువారలును, ఇట్లు అందఱునుబ్రహ్మతేజస్సంపన్నులును దృఢయోగాభ్యాసశీలురును, సమాధినిష్ఠులునగునానావిధానుష్ఠాన సంపన్నులయినమునులందఱు శరభంగునియాశ్రమంబునకువచ్చి, రాముని, సందర్శించిరి. అని, తాత్పర్యము.

అభిగమ్యచ ధర్మజ్ఞా రామం ధర్మభృతాం వరమ్
ఊచుః పరమధర్మజ్ఞ మృషిసంఘా స్సమాహితాః. ౭

టీక॥ ధర్మజ్ఞాః= ధర్మముఁదెలిసిన; ఋషిసంఘాః=ఋషిసమూహములు; సమాహితాః = ఎచ్చరికగలవై; ధర్మభృతాం = ధర్మమునుధరించువారలలోపల, లేక, ధనుర్ధరులలోపల; వరం=శ్రేష్ఠుండును; పరమధర్మజ్ఞం= మిక్కిలియు ధర్మముఁదెలిసినవాఁడు నగు; రామం=రాముని; అభిగమ్యచ= పొందియు; ఊచుః=చెప్పిరి.

ధర్మజ్ఞులగునామహర్షులు, పరమధర్మవేత్తయు ధనుర్ధరవరుండునగు రామునిం జూచి, యిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

త్వ మిక్ష్వాకుకులస్యాస్య పృథివ్యాశ్చ మహారథ
ప్రధానశ్చాసి నాథశ్చ దేవానాం మఘవానివ. ౮

స౬




టీక॥ మహారథ= నిన్నుసారథినిగుఱ్ఱంబులనుగాపాడుకొనుచు యుద్ధంబుసేయునట్టి రాముఁడా! త్వం = నీవు; దేవానాం= దేవతలకు; మఘవానివ= ఇంద్రుఁడువలె; అస్య=ఈ ; ఇక్ష్వాకుకులస్య=ఇక్ష్వాకువంశమునకును; పృథివ్యాశ్చ=భూమికిని ; ప్రధానశ్చ=ముఖ్యుఁడవును; నాథశ్చ=ప్రభుఁడవును ; అసి=అగుచున్నావు.

మహారథుండవగు రాముఁడా! దేవేంద్రుండుస్వర్గంబునకును దేవతలకును బ్రభుండునుముఖ్యుండునై యుండునట్లు,నీవు, భూమండలంబునకును ఇక్ష్వాకుకులంబునకును నాథుండవు.

అని, తాత్పర్యము.

విశ్రుత స్త్రిషు లోకేషు యశసా విక్రమేణచ
పితృభక్తిశ్చ సత్యంచ త్వయి ధర్మశ్చ పుష్కలః. ౯

టీక॥ త్వం (అధ్యాహృతము)=నీవు;త్రిషు=మూడైన;లోకేషు = లోకములయందు;యశసా = కీర్తిచేతను; విక్రమేణచ=పరాక్రమముచేతను ; విశ్రుతః=ప్రసిద్ధుండవు.త్వయి= నీయందు;పితృభక్తిశ్చ = తండ్రియందలిభక్తియు;సత్యంచ=సత్యమును;పుష్కలః= అధికమయిన;ధర్మశ్చ = ధర్మమును;అస్తి (అధ్యాహృతము)=కలదు.

నీవును , పరోపకారకీర్తిచేతనుబలపరాక్రమంబునను, ముల్లోకంబులయందునుప్రసిద్ధుండవు;మఱియు , నీవు,పితృభక్తియుసత్యంబునుగలవాఁడవు, పరమధార్మికుండవు.

అని, తాత్పర్యము.

త్వా మాసాద్య మహాత్మానం ధర్మజ్ఞం ధర్మవత్సలమ్
అర్థిత్వా న్నాథ వక్ష్యామ స్తచ్చ నః శ్రోతు మర్హసి. ౧౦

టీక॥నాథ= నాథుండవగు రాముఁడా!వయం(అధ్యాహృతము)= మేము; మహాత్మానం = పూజ్యమయినస్వభావముగలవాఁడవును; ధర్మజ్ఞం = ధర్మము దెలిసినవాఁడవును; ధర్మవత్సలం= ధర్మమునందతిప్రీతిగలవాఁడవునగు; త్వాం=నిన్ను; ఆసాద్య= పొంది; అర్థిత్వాత్=యాచనమువలన; వ




త్ప్యామః=చెప్పెదము. నః = మాయొక్క; తచ్చ=దానినిమాత్రము ; క్షంతుం=ఓర్చుటకు;అర్హాసి=తగుదువు.

నాధుఁడా! మహాత్ముండవు ధర్మజ్ఞుండవుధర్మవత్సలుండవునగు నీయొద్దకువచ్చి, యాచనబుద్ధిచే; నొకటిఁజెప్పెదము;క్షమించవలయును.

అని, తాత్పర్యము.

అధర్మస్తు మహాంస్తాత భవేత్తస్య మహీపతేః
యో హరే ద్బలిషడ్భాగం నచ రక్షతి పుత్రవత్. ౧౧

టీక॥ తాత=నాయనా;యః= ఏ రాజు;బలిషడ్భాగం= పన్నురూపమయినయాఱవభాగమును; హరేత్ =తీసికొనునో,పుత్రవత్ = కొడుకువలె; నరక్షతిచ = రక్షింపకమాత్రముండునో;తస్య=ఆ;భూపతేః = రాజుయొక్క;అధర్మస్తు= అధర్మముమాత్రముఁ;మహత్ =గొప్పది.

నాయనా! ఎవ్వఁడు,ఆఱవభాగము పన్నుదీసికొని, ప్రజలఁగొడుకులంబోలెరక్షింపకుండునో , ఆరాజునకుమితిలేనియధర్మముగలుగును.

అని, తాత్పర్యము.

యుంజాన స్స్వా నివప్రాణాన్ ప్రాణై రిష్టాన్ సుతానివ
నిత్యయుక్త స్సదారక్షన్ సర్వా న్విషయవాసినః. ౧౨
ప్రాప్నోతి శాశ్వతీం రామ కీర్తిం స బహువార్షికమ్
బ్రహ్మణ స్థ్సాన మాసాద్య తత్రచాపి మహీయతే. ౧౩

టీక॥ రామ=రాముఁడా;యః (అధ్యాహృతము)=ఎవ్వఁడు ; యుంజానః= యత్నముసేయుచు ; నిత్యయుక్తః= ఎల్లప్పుడునుఎచ్చరికగలవాఁడై; విషయవాసినః= దేశములోనున్నజనులను;సర్వాన్=అందఱను;స్వాన్= తనవైన;ప్రాణానివ = ప్రాణములనువలె;ప్రాణైః = ప్రాణములచేత ; ఇష్టాన్= ప్రియములయిన; సుతానివ= కొడుకులనువలె;సదా= ఎల్లప్పుడును; రక్షన్=రక్షించుచు ; భవేత్ (అధ్యాహృతము)= అగునో;సః=ఆరాజు; బహువార్షికం= పెక్కుసంవత్సరములను;శాశ్వతీం=అనువర్తించినట్టి ; కీ




ర్తిం=కీర్తిని; ప్రాప్నోతి= పొందును. బ్రహ్మణః=బ్రహ్మయొక్క; స్థానం=స్థానమును; ఆసాద్య=పొంది; తత్రచాపి=అచ్చటను; మహీయతే= పూజితుండగును.

రాముఁడా! ఎవ్వఁడు, నానావిధయత్నంబు సేయుచు, నెల్లప్పుడునునవహితుండై, స్వదేశవాసులనందఱను దనప్రాణంబులంబోలెఁ బ్రాణంబులకన్ననధికులగు కొడుకులం బోలెఁ బరిపాలింపుచుండునో, ఆరాజు, శాశ్వతంగు కీర్తిం బొందును; అంతంబున బ్రహ్మలోకంబుఁబొంది, యచ్చటను బూజితుండై వెలుంగును. అని, తాత్పర్యము.

యః కరోతి పరం ధర్మం ముని ర్మూలఫలాశనః
తత్ర రాజ్ఞ శ్చతుర్భాగః ప్రజా ధర్మేణ రక్షితః. ౧౪

టీక॥ యః=ఏ; మునిః= ముని; మూలఫలాశనః=గడ్డలునుపండ్లును ఆహారముగాఁగలవాఁడై; పరం= అధికమయినది; ధర్మం=ధర్మమును; కరోతి= చేయునో; తత్ర=అందు; ప్రజాః= జనులను; ధర్మేణ=ధర్మముచేత; రక్షితః= రక్షించుచున్న; రాజ్ఞః=రాజునకు; చతుర్భాగః=నాలవభాగము; అస్తి (అధ్యాహృతము)=కలదు.

ప్రజలందఱు, నాలవభాగమునొసంగుటం జేసివారలరక్షింపవలెను; ఋషులేమియునిచ్చువారలు కారే; వారినేలరక్షింపవలయుననవలదు; ఋషులుఫలమూలంబుల నాహారంబుగాఁగొనుచుఁ, గావించుమహాధర్మంబులోఁగూడ, ధర్మంబునఁబ్రజలరక్షించుచుండు రాజునకు, నాలవభాగంబుగలదు.

అని, తాత్పర్యము.

సోయం బ్రాహ్మణభూయిష్ఠో వానప్రస్థగణో మహాన్
త్వన్నాథో నాథవ ద్రామ రాక్షసై ర్వధ్యతే భృశమ్. ౧౫

టీక॥ రామ=రాముఁడా! త్వన్నాథః=నీవునాథుండవుగాఁగల; బ్రాహ్మణభూయిష్ఠః= బ్రాహ్మణులె యధికులుగాఁగల; మహాన్=గొప్పదగు; సః=అట్టి; అయం=ఈ; వానప్రస్థగణః = వానప్రస్థులసమూహము; అనాథవత్= నాథుండులేనిదివలె; భృశం= మిక్కిలియు; రాక్షసైః=రాక్షసులచేత; వ




ధ్యతే=వధింపఁబడుచున్నది.

రాముఁడా! తలచుగానందఱుబాహ్మ ణులెయయినయీవానప్రస్థులందఱు,నీవునాథుండవుండియు, అనాథలుంబోలె,రాక్షసులచేవధింపఁబడుచున్నారు.

అని, తాత్పర్యము.

ఏహి పశ్య శరీరాణి మునీనాం భావితాత్మనామ్
హతానాం రాక్షసై ర్ఘోరై ర్బహూనాం బహుధా వనే. ౧౬

టీక॥ఏహి=రమ్ము.వనే=అడవియందు;బహుధా= పెక్కువిధంబులను;ఘోరైః=భయంకరులగు;రాక్షసైః=రాక్షసులచేత;హతానాం=చంపఁబడిన;భావితాత్మనాం=ధ్యానింపఁబడినయాత్మగల;బహూనాం = పెక్కండ్రయిన; మునీనాం= మునులయొక్క ; శరీరాణి=దేహములను;పశ్య= చూడుము.

ఇదిగోరమ్ము;వనంబుననానావిధంబులభయంకరులగురాక్షసులచేఁజంపఁబడినపరమాత్మవేత్తలగు మునుల దేహంబులుపడియున్నవి;చూడుము.

అని, తాత్పర్యము.

పంపానదీనివాసానా మనుమందాకినీ మపి
చిత్రకూటాలయానాంచ క్రియతే కదనం మహత్. ౧౭

టీక॥ అనుమందాకినీమపి= మందాకినీనదిని మొదలుకొని ; పంపానదీనివాసానాం = పంపానదీతీరముననుండువారలయొక్కయు;చిత్రకూటాలయానాంచ = చిత్రకూటపర్వతమువాసస్థానముగాఁగలవారలయొక్కయు;మహత్=అధికమయిన;కదనం = హింసక్రియతే=చేయఁబడుచున్నది.

మందాకినీనదీతీరంబునందేమిపంపానదీతీరంబునందేమిచిత్రకూటపర్వతంబునందేమి వాసముసేయుఋషులనందఱనువధించుచున్నారు.

అని, తాత్పర్యము.

ఏవం వయం నమృష్యామో విప్రకారం తపస్వినామ్
క్రియమాణం వనే ఘోరం రక్షోభి ర్భీమకర్మభిః. ౧౮

టీక॥ వయం=మేము; ఏవం=ఇట్లు; వనే=అడవియందు; కర్మభిః= భయంకరమయినకార్యముగల; రక్షోభిః= రాక్షసులచేత; క్రియమాణం= చేయఁబడుచున్న; ఘోరం = భయంకరమయిన; తపస్వినాం=ఋషులయొక్క; విప్రకారం=విరోధమును; నమృష్యామః= ఓర్వలేము.

ఇట్లడవియందు, భయంకరముగా ఋషులనువధించుటను , మేముసహింపఁజాలము. అని, తాత్పర్యము.

తత స్త్వాం శరణార్థంచ శరణ్యాం సముపస్థితాః
పరిపాలయ నో రామ వధ్యమానా న్నిశాచరైః. ౧౯

టీక॥ రామ=రాముఁడా! తతః=అందువలన; వయం(అధ్యాహృతము)=మేము; శరణార్థం=రక్షణార్థమయి ; శరణ్యాం = శరణుపొందఁదగినట్టి ; త్వాం=నిన్ను; సముపస్థితాః= పొందినాము. నిశాచరైః=రాక్షసులచేత; వధ్యమానాన్=చంపఁబడుచున్న; నః= మమ్ము; పరిపాలయ=పాలింపుము.

రాముఁడా! అందువలన, మేము, రక్షణార్థమయిశరణ్యుండగునిన్ను శరణుపొందినాము; రాక్షసులచేవధింపఁబడుచున్నమమ్ము రక్షింపుము. అని, తాత్పర్యము.

పరా త్వత్తో గతి ర్వీర పృథివ్యాం నోపపద్యతే
పరిపాలయ న స్సర్వాన్ రాక్షసేభ్యో నృపాత్మజ. ౨౦

టీక॥వీర=పరాక్రమశాలివగు; నృపాత్మజ=రాచకొమరుండవయిన రాముఁడా! త్వత్తః=నీకన్న; పరా= ఇతరమయిన; గతిః=గతి; పృథివ్యాం= భూమియందు; నోపపద్యతే = పొందఁబడదు ; రాక్షసేభ్యః= రాక్షసులవలన; నః=మమ్ము; సర్వాన్=అందఱను; పరిపాలయ=పాలింపుము.

పరాక్రమశాలివి రాచకొమరుండవగు రాముఁడా! నీకన్నమాకు వేఱెగతి భూమండలంబున నెచ్చటనులేదు ; మమ్ము ఈరాక్షసబాధం దొలఁగించిరక్షింపుము. అని, ఋషులు, రామునితోఁజెప్పుకొనిరి. అని, తాత్పర్యము.

స ౬

ఏత చ్ఛ్రుత్వాతు కాకుత్థ్స స్తాపసానాం తపస్వినామ్
ఇదం ప్రోవాచ ధర్మాత్మా సర్వానేవ తపస్వినః. ౨౧

టీక॥ ధర్మాత్మా= ధర్మబుద్ధిగలి=కాకుత్థ్సః=రాముఁడు; తపస్వినాం=అధికమయినతపస్సుగల; తాపసానాం=ఋషులయొక్క; ఏతత్ = ఈ మాటను; శ్రుత్వాతు=విన్నంతనే; తపస్వినః=ఋషులను; సర్వానేవ= అందఱినుగూర్చియు; ఇదం = ఈమాటను; ప్రోవాచ=చెప్పెను.

ధర్మాత్ముండగు రాముండు, మహాతప స్సంపన్నులగు నాఋషులు చెప్పినమాటనువిని, యాఋషులనందఱంజూచి, యీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము,

నైవ మర్హథ మాం వక్తు మాజ్ఞాప్యోహం తపస్వినామ్
కేవలే నాత్మకార్యేణ ప్రవేష్టవ్యం మయా వనమ్. ౨౨

టీక॥మాం=నన్నుఁగూర్చి; ఏవం = ఇట్లు; వక్తుం=చెప్పుటకు; నార్హథ = తగరు. తపస్వినాం=ఋషులకు; ఆజ్ఞాప్యః=ఆజ్ఞాపింపఁదగినవాఁడను. ఆత్మకార్యేణ కేవలేన = నాకార్యముచేతనే; వనం=అడవి; మయా=నాచేత; పవేష్టవ్యం= ప్రవేశింపఁబడవలసినది.

మీరలునావిషయమయి యిట్లు చెప్పవలదు; నన్నుమీర లాజ్ఞాపింప వలయునుగాని పరిపాలింపుమని చెప్పరాదు; నాకార్యముచేత నేనీయడవికి రావలసియుండినది; ఇప్పుడు, తపస్విజనరక్షణము రెండవఫలమగుచున్నది.

అని, తాత్పర్యము.

విప్రకార మపాక్రష్టుం రాక్షసై ర్భవతా మిమమ్
పితుస్తు నిదేశకరః ప్రవిష్టోహ మిదం వనమ్. ౨౩

టీక॥అహం= నేను; పితుః = తండ్రియొక్క; నిదేశకరస్తు= ఆజ్ఞచేయువాఁడనైయు; రాక్షసైః= రాక్షసులచేత(కలిగిన); భవతాం= మీయొక్క;

ఇమం=ఈ ; విప్రకారం= అపకారమును; అపాక్రష్టుం= పోఁగొట్టుటకై ; ఇదం=ఈ; వనం=అడవిని; ప్రవిష్టః=ప్రవేశించినాను.

ఇప్పుడు, నేను, తండ్రియాజ్ఞను నెఱవేర్చుటకును; మీకిప్పుడు రాక్షసుల చేఁ గలిగినకష్టమునునివారించుటకై యును, ఈయడవికివచ్చినవాఁడనై తిని.

అని, తాత్పర్యము.

భవతా మర్థసిద్ధ్యర్థ మాగతోహం యదృచ్ఛయా
తస్య మేయం వనే వాసో భవిష్యతి మహాఫలః. ౧౨

టీక॥ అహం= నేను ; యదృచ్ఛయా=దబ్బాటుచేత; భవతాం = మీయొక్క; అర్థసిద్ధ్యర్థం= కార్యసిద్ధికొఱకు; ఆగతః=వచ్చినాను. తస్య=అట్టి, మే=నాకు; అయం=ఈ ; వనే=అడవియందు; వాసః=ఉనికి ; మహాఫలః=అధికమయినఫలముగలది; భవిష్యతి=కాఁగలదు.

నేను, యాదృచ్ఛికంబుగామీకార్యసిద్ధియగుటకై, నేనిచ్చటికివచ్చినాను; కావున, నాకీవనంబుననుండుటవలన, మహాఫలంబుగలుగును.

అని, తాత్పర్యము.

తపస్వినాం రణే శత్రూన్ హంతు మిచ్ఛామి రాక్షసాన్
పశ్యంతు వీర్య మృషయ స్సభ్రాతు మే తపోధనాః. ౧౩

టీక॥అహం (అధ్యాహృతము) = నేను; తపస్వినాం= ఋషులయొక్క; శత్రూన్=శత్రువులగు; రాక్షసాన్= రాక్షసులను; రణే=యుద్ధమునందు ; హంతుం=చంపుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను. తపోధనాః=తపస్సే ధనముగాఁగల; ఋషయః=ఋషులు ; సభ్రాతుః=తమ్మునితోఁగూడిన; మే = నాయొక్క; వీర్యం=పరాక్రమమును ; పశ్యంతు=చూతురుగాక.

నేను, ఋషులకుశత్రువులుగానుండు రాక్షసులనందఱను యుద్ధంబునవధింపఁగోరియున్నాను; తపోధనులగుఋషులందఱుయుద్ధంబున, నాపరాక్రమంబును నా తమ్మునిపరాక్రమంబునుం జూడఁ గలరు- అని, రాముండు, ఋషులకుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

స ౬

దత్త్వాఽ భయం చాపి తపోధనానాం
ధర్మే ధృతాత్మా సహలక్ష్మణేన
తపోధనై శ్చాపి సభాజ్యవృ త్త
స్సుతీక్ష్ణమేవా భిజగామ వీరః. ౨౬

టీక॥ వీరః= పరాక్రమశాలియు; ధర్మే=ధర్మమునందు; ధృతాత్మా= నిశ్చలమయినబుద్ధిగలవాఁడును; తపోధనైశ్చాపి=ఋషులచేతనుంగూడ ; సభాజ్యవృత్తః= పూజింపఁదగినయాచారముగలవాఁడునగు రాముండు; తపోధనానాం=ఋషులకు;అభయం = అభయమును;దత్త్వాచాపి=ఇచ్చియు ; లక్ష్మణేనసహ=లక్ష్మణునితోఁగూడ; సుతీక్ష్ణమేవ=సుతీక్ష్ణునిగూర్చియె ; అభిజగామ=పోయెను.

వీరుండునుధర్మంబునందుఁ జలనములేని వాఁడును ఋషులకుఁ గూడఁ బూజనీయంబగునాచారంబు గలవాఁడునగురాముండు , ఋషులకు, అభయంబొసంగి,లక్ష్మణుంగూడి, సుతీక్ష్ణమహామునియొద్దకుఁబోయెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే,శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, షష్ఠస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండషష్ఠసర్గటీక,
ముగిసినది.



శ్రీ

## సప్తమసర్గప్రారంభః.

రామస్తు సహితో భ్రాత్రా సీతయాచ పరంతపః
సుతీక్ష్ణస్యాశ్రమపదం జగామ సహ తై ర్ద్విజైః. ౧

టీక॥ పరంతపః= శత్రువులఁదపింపఁజేయునట్టి; రామస్తు=రాముఁడును; భ్రాత్రా=తమ్మునితోను; సీతయాచ=సీతతోను;సహితః = కూడినవాఁడై; తైః=ఆ;ద్విజైస్సహ=బ్రాహ్మణులతోఁగూడ=;సుతీక్ష్ణస్య= సుతీక్ష్ణమహామునియొక్క;ఆశ్రమపదం=ఆశ్రమస్థానమును;జగామ=పొందెను.

శత్రువులఁ దపింపఁజేయునట్టి రాముఁడు , సీతాలక్ష్మణసహితుండై, యావైఖానసాదిబ్రాహ్మణులు వెంబడింప , సుతీక్ష్ణమహాముని యాశ్రమపదంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

స గత్వా దూర మధ్వానం నదీ స్తీర్త్వా బహూదకాః
దదర్శ విపులం శైలం మహామేఘ మివోన్నతమ్. ౨

టీక॥ సః= ఆరాముఁడు ; దూరం=దూరమయిన;అధ్వానం = మార్గమును;గత్వా=పొంది ; బహూదకాః=అధికమయినజలముగల;నదీః=నదులను;తీర్త్వా=దాఁటి; మహామేఘమివ (స్థితం) = గొప్పమేఘమువలెనున్న;ఉన్నతం=పొడవైన;విపులం=విశాలమగు;శైలం=పర్వతమును;దదర్శ=చూచెను.

రాముండట్లుదూరముగాఁబోయి, అధికజలముగలనదులనుదాఁటి, మహామేఘమువలెనున్నయత్యున్నతంబగునొక్కపర్వతముంగనెను.

అని, తాత్పర్యము.

తత స్త దిక్ష్వాకువరౌ సంతతం వివిధై ర్ద్రుమైః
కాననం తౌ వివిశతు స్సీతయాసహ రాఘవౌ. ౩

టీక॥ తతః=అంత; తౌ=ఆ; ఇక్ష్వాకువరౌ = ఇక్ష్వాకువంశమునందుఁబుట్టినవారలలో శ్రేష్ఠులగు ; రాఘవౌ=రామలక్ష్మణులు; సీతయా సహ= సీతతోఁగూడ, వివిధైః = నానావిధములగు; ద్రుమైః=వృక్షములచేత; సంతతం=వ్యాపింపఁబడియున్న; తత్=ఆ ; కాననం=అడవిని ; వివిశతుః= ప్రవేశించిరి.

అంత , ఇక్ష్వాకువంశమునంబుట్టినవారలలో నుత్తములగు నారామలక్ష్మణులు, సీతాసంయుతులయి , నానావృక్షసమూహ సంకులంబగునాపవఁతసమీపమందలి యరణ్యంబుఁబ్రవేశించిరి. అని, తాత్పర్యము.

ప్రవిష్టస్తు వనం ఘోరం బహుపుష్పఫలద్రుమమ్
దదర్శాశ్రమ మేకాంతే చీరమాలాపరిష్కృతమ్. ౪

టీక॥ సః (అధ్యాహృతము)= ఆ రాముఁడు; ఘోరం= భయంకరమయినదియు; బహుపుష్పఫలద్రుమం= అధికమయినపూలునుఫలమునుగలవృక్షములుగలదియునగు; వనం=అడవిని ; ప్రవిష్టస్తు=ప్రవేశించినవాఁడైనంతనె; ఏకాంతే=వివిక్తస్థలమునందు ; చీరమాలాపరిష్కృతం = నారచీరల సమూహముచే నలంకరింపం బడిన ; ఆశ్రమం = ఆశ్రమమును; దదర్శ= చూచెను.

అట్లు, రాముఁడు , భయంకరంబును , బుష్పఫలంబులునుఫలవంతంబులునగు వృక్షములతోఁగూడినదియునగునాయడవింజొచ్చి, యచ్చటనొకవివిక్తభాగంబున, నారచీరలసమూహతోఁగూడినయాశ్రమముంజూచెను.

అని, తాత్పర్యము.

తత్ర తాపస మాసీనం మలపంకజటాధరమ్
రామ స్సుతీక్ష్ణం విధివ త్తపోవృద్ధ మభాషత. ౫

టీక॥తత్ర=ఆయాశ్రమమునందు; రామః= రాముఁడు; ఆసీనం=కూచుండినవాఁడును ; మలపంకజటాధరం= మురికితోఁగూడిన జటల ధరించుచున్న

స ౭

వాఁడును; తపోవృద్ధం = తపస్సుచేవృద్ధుండునగు; సుతీక్ష్ణం=సుతీక్ష్ణమహాముని నిగూర్చి; విధివత్ = యథాశాస్త్రముగా; అభాషత=చెప్పెను.

ఆయాశ్రమమందు సుఖాసీనుండును ముటికితోఁగూడినజటలు గలవాఁడును మహాతపశ్శాలియునగుసుతీక్ష్ణమహాముని నింజూచి, యిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

రామోఽహ మస్మి భగవన్ భవంతం ద్రష్టు మాగతః
త్వం మాఽభివద ధర్మజ్ఞ మహర్షే సత్యవిక్రమ. ౬

టీక॥ భగవన్= మాహాత్మ్యముగలవాఁడవు; ధర్మజ్ఞ=ధర్మముదెలిసినవాఁడవు; సత్యవిక్రమ= సత్యమయినతపఃప్రభావముగలవాఁడవునగు ; మహర్షే=సుతీక్ష్ణమహామునీ! అహం = నేను; రామః= రాముండను ; అస్మి= అగుచున్నాను. భవంతం=నిన్ను; ద్రష్టుం=చూచుటకు; ఆగతః= వచ్చినాను. త్వం=నీవు; మా = నన్నుఁగూర్చి; అభివద=ఆశీర్వదింపుము.

భగవంతుండవు ధర్మవేత్తవును మోఘతపఃప్రభావుండవునగు సుతీక్ష్ణమహామునీ! నేను రాముండనువాఁడ; నిన్నుఁజూడవచ్చినాను; నీకు నమస్కరించెదను; ఆశీర్వదింపుము. అని, రాముండు, సుతీక్ష్ణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

స నిరీక్ష్య తతో వీరం రామం ధర్మభృతాం వరమ్
సమాశ్లిష్య చ బాహుభ్యా మిదం వచన మబ్రవీత్. ౭

టీక॥ తతః=అంత; సః= ఆసుతీక్ష్ణమహర్షి; వీరం= పరాక్రమవంతుండును; ధర్మభృతాం=ధర్మమునుధరించువారలలో; వరం=ఉత్తముఁడునగు రామం=రాముని; నిరీక్ష్య=చూచి; బాహుభ్యాం=చేతులచేత ; సమాశ్లిష్య చ=కవుఁగిలించుకొనియు; ఇదం=ఈ; వచనం = మాటను; అబ్రవీత్= చెప్పెను.

అంత, నాసుతీక్ష్ణమహాముని, మహాపరాక్రమశాలియుఁ బరమధార్మికుండునగు నారామునింజూచి, దృఢంబుగా

జేతులంగవుఁగిలించుకొని,యీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

స్వాగతం ఖలు తే వీర రామ ధర్మభృతాం వర
ఆశ్రమోఽయం త్వయా క్రాంత స్సనాథ ఇవ సాంప్రతమ్. ౮

టీక॥ వీర=పరాక్రమశాలివి; ధర్మభృతాం = ధర్మమునుధరించువారలలో; వర=ఉత్తముండవునగు; రామ=రాముఁడా! తే=నీకు; స్వాగతం=సుఖముతోడిరాక ; అస్తు (అధ్యాహృతము)=అగుఁగాక. ("ఖలు" అనునదివాక్యాలంకారార్థము). త్వయా= నీచేత; ఆక్రాంతః= అధిష్ఠింపఁబడిన ; అయం=ఈ; ఆశ్రమః= ఆశ్రమము; సాంప్రతం=ఇప్పుడు; సనాథఇవ= నాథునితోఁగూడినదివలె; ఆసీత్ (అధ్యాహృతము)=అయినది.

వీరుండవుఁబరమధార్మికుండవునగురాముఁడా! నీకుస్వాగతంబగుఁగాక; నీవువచ్చుటంజేసి, యీయాశ్రమంబుసనాథంబయినది.

అని, తాత్పర్యము.

ప్రతీక్షమాణ స్త్వామేవ నారోహేఽహం మహాయశః
దేవలోక మితో వీర దేహం త్యక్త్వా మహీతలే. ౯

టీక॥ మహాయశః= అధికమయినకీర్తిగల; వీర= పరాక్రమశాలివగురాముఁడా! అహం=నేను; త్వామేవ=నిన్నే; ప్రతీక్షమాణః= ఎదురుచూచుచున్నవాఁడనై; ఇతః=ఇచ్చటనుండి ; మహీతలే=భూతలమునందు ; దేహం=దేహమును; త్యక్త్వా=విడిచి; దేవలోకం=స్వర్గలోకమును; నారోహే = ఆరోహింపకున్నాను.

మహాయశుండవువీరుండవునగురాముఁడా! నీవువత్తువు,నీదర్శనముసేయవలెనని యెదురుచూచుచునే, యింకను ఈదేహమునువిడిచిస్వర్గమునకుఁబోవకున్నాను.అని, తాత్పర్యము.

చిత్రకూట ముపాదాయ రాజ్యభ్రష్టోసి మే శ్రుతః

స ౭

టీక ॥ త్వం (అధ్యాహృతము)= నీవు; రాజ్యభ్రష్టః= రాజ్యమునుండిజాఱినవాఁడవు; అసి= అయితివి. ఇతి (అధ్యాహృతము)= అని; చిత్రకూటం= చిత్రకూటపర్వతమును; ఉపాదాయ= ఆరంభించి; మే (మయా)= నాచేతః శ్రుతః= వినఁబడినావు.

నీవు రాజ్యభ్రష్టుండవై వనంబునకు వచ్చినావని, నేను జిత్రకూటంబుననుండి వినుచున్నాను. అని, తాత్పర్యము.

ఇహోపయాతః కాకుత్థ్స దేవరాజ శ్శతక్రతుః. ౧౦

టీక॥ కాకుత్థ్స= రాముఁడా! దేవరాజః= దేవతలకుఁ బ్రభుండగు; శతక్రతుః= ఇంద్రుఁడు; ఇహ= ఇచ్చటికి; ఉపయాతః= వచ్చినాఁడు.

రాముఁడా! దేవరాజుండగు నింద్రుండిచ్చటికివచ్చిపోయినాఁడు.

అని, తాత్పర్యము.

ఉపగమ్యచ మాం దేవో మహాదేవ స్సురేశ్వరః
సర్వాన్ లోకాన్ జితా నాహ మమ పుణ్యేన కర్మణా. ౧౧

టీక॥ మహాదేవః= గొప్పదేవుఁడగు; సురేశ్వరః= దేవతలకుఁ బ్రభుండయిన; దేవః= ఇంద్రుఁడు; మాం= నన్ను; ఉపగమ్యచ= పొందియు; మమ= నాయొక్క; పుణ్యేన= పవిత్రమయిన, కర్మణా= కార్యముచేత; సర్వాన్= సమస్తములయిన; లోకాన్= లోకములను; జితాన్= జయింపఁబడిన వానిఁగా; ఆహ= చెప్పినాఁడు.

దేవదేవుండగు నా దేవేంద్రుండు, నాయొద్దకువచ్చి, నాతపస్సుచేత, సమస్తలోకంబులునుజయింపఁబడినట్లు, చెప్పినాఁడు. అని, తాత్పర్యము.

తేషు దేవర్షి జుష్టేషు జితేషు తపసా మమ
మత్ప్రసాదా త్సభార్య స్త్వం విహరస్వ సలక్ష్మణః. ౧౨

టీక॥ సభార్యః= భార్యతోఁగూడినవాఁడవును; సలక్ష్మణః= లక్ష్మణునితోఁ

కూడినవాఁడవునగు;త్వం=నీవు; మత్ప్రసాదాత్ = నాయనుగ్రహమువలన ; మమ=నాయొక్క;తపసా=తపస్సుచేత;జితేషు=జయింపఁబడిన; దేవర్షిజుష్టేషు=దేవతలచేతను ఋషులచేతను సేవింపఁబడిన; తేషు=ఆలోకములయందు;విహరస్వ=క్రీడింపుము.

నీవు,నాప్రసాదంబున,తపస్సుచేనే నార్జించిన దేవర్షిసేవితంబులగు నా దివ్యలోకంబులయందు , సీతనులక్ష్మణునింగూడి,సుఖంబునవిహరింపుచుండుము. అని, సుతీక్ష్ణుండు,రామునితోఁ జెప్పెను. అని,తాత్పర్యము.

త ముగ్రతపసా యుక్తం మహర్షిం సత్యవాదినమ్
ప్రత్యువాచా త్మవా న్రామో బ్రహ్మాణమివ కాశ్యపః.౧౩

టీక॥ఆత్మవాన్=మహాత్ముండగు ; రామః=రాముండు;ఉగ్రతపసా = భయంకరమయినతపస్సుతో; యుక్తం=కూడినవాఁడును; మహర్షిం= పూజ్యుఁడయినఋషియును;సత్యవాదినం=సత్యముఁ జెప్పువాఁడునగు; తం=ఆసుతీక్ష్ణమహామునినిగూర్చి ; బ్రహ్మాణం = బ్రహ్మదేవునిగూర్చి;కాశ్యపఇవ=కాశ్యపుఁడువలె; ప్రత్యువాచ = బదులుచెప్పెను.

మహాత్ముండగురాముండు, కాశ్యపుఁడుబ్రహ్మదేవునితోఁజెప్పునట్లు, మహాతపశ్శాలియు సత్యవాదియు నగు నాసుతీక్ష్ణమహామునింజూచి,యిట్లని చెప్పెను. అని,తాత్పర్యము.

అహమేవా హరిష్యామి స్వయం లోకా న్మహామునే
ఆవాసం త్వహమిచ్ఛామి ప్రదిష్టమిహ కాననే. ౧౪

టీక॥మహామునే=పూజ్యుఁడవయిన మునివగుసుతీక్ష్ణుఁడా!అహం=నేను;స్వయమేవ=నేనె=లోకాన్= లోకములను;ఆహరిష్యామి=సంపాదించెదను.అహం=నేను;ఇహ=ఈ; కాననే=అడవియందు;ఆవాసంతు=నివాసస్థానమును మాత్రము;ప్రదిష్టం= చెప్పఁబడినదానిఁగా; ఇచ్ఛామి=కోరుచున్నాను.

సుతీక్ష్ణమహామునీ! నేనేనాకులోకంబులసంపాదించుకొనెదను; ఈయడవి

యందుమాకుఁదగిన నివాసస్థానమును మాత్రముచెప్పఁగోరినాను.

అని, తాత్పర్యము.

భవాన్ సర్వత్ర కుశల స్సర్వభూతహితే రతః
ఆఖ్యాత శ్శరభంగేన గౌతమేన మహాత్మనా. ౧౫

టీక॥ భవాన్=నీవు; సర్వత్ర= అన్నిటియందును; కుశలః= సమర్థుఁడవుగాను; సర్వభూతహితే= సమస్తప్రాణులమేలునందు, రతః= ఆసక్తుండవుగాను; మహాత్మనా= పూజ్యమయినస్వభావముగల; గౌతమేన = గౌతమవంశమునంబుట్టినవాఁడగు; శరభంగేణ=శరభంగునిచేత; ఆఖ్యాతః=చెప్పఁబడినావు.

నీవు, మహాత్ముండవనియు సర్వభూతహితకరుండవనియు మహాత్ముండును గౌతమవంశ్యుండునగు శరభంగమహాముని చెప్పినాఁడు. అని, రాముండు, సుతీక్ష్ణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు రామేణ మహర్షి ర్లోకవిశ్రుతః
అబ్రవీ న్మధురం వాక్యం హర్షేణ మహతాప్లుతః. ౧౬

టీక॥ లోకవిశ్రుతః= లోకప్రసిద్ధుండగు; మహర్షిః=సుతీక్ష్ణమహాముని; రామేణ=రామునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తస్తు=చెప్పినవాఁడైనంతనె; మహతా=అధికమయిన; హర్షేణ= సంతోషముచేత; ఆప్లుతః = నింపఁబడినవాఁడై; మధురం= మనోహరమయిన; వాక్యం = మాటను; అబ్రవీత్= చెప్పెను.

లోకప్రసిద్ధుండగు నాసుతీక్ష్ణమహాముని, రాముండు చెప్పినమాటనువిని, పరమానందంబునొంది, మధురవచనంబుననిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

అయ మే వాశ్రమో రామ గుణవా న్రమ్యతా మిహ
ఋషిసంఘానుచరిత స్సదా మూలఫలాన్వితః. ౧౭

టీక॥ రామ=రాముఁడా! ఋషిసంఘానుచరితః=ఋషిసమూహములచే సంచరింపఁబడినదియు; సదా=ఎల్లప్పుడును; మూలఫలాన్వితః=గడ్డలతోను ఫలములతోను కూడినదియునగు; అయం=ఈ; ఆశ్రమఏవ=ఆశ్రమమె; గుణవాన్=మంచిది. ఇహ=ఇచ్చట; రమ్యతాం=క్రీడించుటయగుఁగాక.

రాముఁడా! ఋషిసేవితంబును ఎల్లప్పుడును ఫలమూల సమృద్ధంబై యుండునదియునగు నీయాశ్రమమె మంచిది; ఇచ్చటనె విహరింపుచుండుము.

అని, తాత్పర్యము.

ఇమ మాశ్రమ మాగమ్య మృగసంఘా మహాయశః

అటిత్వా ప్రతిగచ్ఛంతి లోభయిత్వాఽ కుతోభయాః. ౧౮

టీక॥ మహాయశః=అధికమయిన కీర్తిగల రాముఁడా! మృగసంఘాః=మృగసమూహములు; అకుతోభయాః=ఎందునను భయములేనివై; ఇమం=ఈ; ఆశ్రమం=ఆశ్రమమును; ఆగమ్య=పొంది; అటిత్వా=సంచరించి; లోభయిత్వా=మోసపుచ్చి; ప్రతిగచ్ఛంతి=మఱలఁబోవుచున్నవి.

మహాయశుండవగు రాముఁడా! మృగంబులు నిర్భయముగా నీయాశ్రమమునకువచ్చి, సంచరించి, ఋషులనుబాధపెట్టి, పోవుచున్నవి.

అని, తాత్పర్యము.

నా న్యద్దోషం భవే దత్ర మృగేభ్యో న్యత్ర విద్ధివై

టీక॥ అత్ర=ఈయాశ్రమమునందు; మృగేభ్యోన్యత్ర=మృగంబులుతప్ప; అన్యత్=ఇతరమయిన; దోషం=దోషము; నభవేత్=లేదు. ఇతి (అధ్యాహృతము)=అని; విద్ధి=ఎఱుంగుము ("వై" అనునది పాదపూరణార్థము).

ఈయాశ్రమమునందు, ఈమృగబాధయొకటె, మఱివేఱెదోషమేదియు లేదని యెఱుంగుము. అని, సుతీక్ష్ణుండు రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా వచనం తస్య మహర్షే ర్లక్ష్మణాగ్రజః. ౧౯

స ౭

ఉవాచ వచనం ధీరో విక్‌ృష్య సశరం ధనుః

టీక॥ ధీరః=ధైర్యవంతుండగు; లక్ష్మణాగ్రజః = లక్ష్మణునియన్నయయినరాముండు;తస్య = ఆ; మహర్షేః=సుతీక్ష్ణమహామునియొక్క; తత్= ఆ;వచనం=మాటను;శ్రుత్వా = విని; సశరం=బాణముతోఁగూడిన; ధనుః= ధనుస్సును;విక్‌ృష్య=ఈడ్చి ; వచనం= మాటను;ఉవాచ=చెప్పెను.

ధీరుండగునారాముండు, ఆసుతీక్ష్ణమహామునిమాటనువిని , ధనువునెక్కువెట్టియాకర్షించుచునిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

తానహం సుమహాభాగ మృగసంఘాన్ సమాగతాన్. ౨౦
హన్యాం నిశితధారేణ శరేణాశనివర్చసా

టీక॥సుమహాభాగ= మిక్కిలియుఁబూజ్యమయిన భాగ్యముగల సుతీక్ష్ణుఁడా! అహం=నేను; సమాగతాన్ = వచ్చిన; తాన్=ఆ; మృగసంఘాన్ = మృగసమూహములను; నిశితధారేణ= కఱకైనయంచుగల; అశనివర్చసా=వజ్రాయుధముయొక్క కాంతివంటికాంతిగల; శరేణ= బాణముచేత ; హన్యాం=చంపుదునుగాక.

మహాభాగుండవగుసుతీక్ష్ణుఁడా! నేను,ఇచ్చటనున్నయెడ , నామృగంబులువచ్చినప్పుడు,వానినన్నింటిని, కఱకుబాణంబులజంపుదును.

అని, తాత్పర్యము.

భవాం స్తత్రాభిషజ్యేత కిం స్యాత్కృచ్ఛ్రతరం తతః. ౨౧

టీక॥ తత్ర = ఆవిషయమునందు; భవాన్=నీవు;అభిషజ్యేత = తిరస్కృతుండవగుదువు.తతః=అంతకన్నను;కృచ్ఛ్రతరం=మికిలియుఁగష్టము;కిం = ఏమి;స్యాత్=అగును?

అట్లునీయాశ్రమంబుననుండుమృగంబులఁజంపుటచేనీకుఁగోపమువచ్చును ; అంతకన్ననాకుఁగష్టమేమియున్నది?

అని, తాత్పర్యము.

ఏతస్మి న్నాశ్రమే వాసం చిరంతు న సమర్థయే

టీక॥ ఏతస్మిన్=ఈ;ఆశ్రమే = ఆశ్రమమునందు;చిరం= బహుకాలము; వాసంతు=ఉనికినిమాత్రము ; నసమర్థయే=కోరను.

అట్లుకావున, నీయాశ్రమంబునబహుకాలముండుటకునాకిష్టములేదు. అని, రాముండు, సుతీక్ష్ణమహామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

త మేవ ముక్త్వా వరదం రామ స్సంధ్యా ముపాగమత్. ౨౨

టీక॥ రామః=రాముఁడు;వరదం=వరమునొసంగునట్టి,తం= ఆసుతీక్ష్ణమహామునినిగూర్చి;ఏవం = ఇట్లు; ఉక్త్వా=చెప్పి;సంధ్యాం=సంధ్యను ; ఉపాగమత్=పొందెను.

రాముండు, వరప్రదుండగునాసుతీక్ష్ణమహామునితో నీప్రకారమునం జెప్పి,సంధ్యనుపాసించుటకై, సరస్తీరంబునకుంబోయెను. అని,తాత్పర్యము.

అన్వాస్య పశ్చిమాం సంధ్యాం తత్ర వాస మకల్పయత్
సుతీక్ష్ణ స్యాశ్రమే రమ్యే సీతయా లక్ష్మణేనచ. ౨౩

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముండు;పశ్చిమాం = సాయంకాలమునందలి;సంధ్యాం=సంధ్యను ; అన్వాస్య=ఉపాసించి;తత్ర = ఆ; రమ్యే=రమణీయమయిన ; సుతీక్ష్ణస్య=సుతీక్ష్ణునియొక్క;ఆశ్రమే= ఆశ్రమమునందు;సీతయా=సీతతోను; లక్ష్మణేనచ=లక్ష్మణునితోను;వాసం = నివాసమును;అకల్పయత్=చేసెను.

రాముండు, సాయంసంధ్యనుపాసించి, రమణీయంబగునాసుతీక్ష్ణమహామునియాశ్రమంబున, సీతాలక్ష్మణులతో,నారాత్రివాసంబుగావించెను. అని,తాత్పర్యము.

తత శ్శుభం తాపసభోజ్య మన్నం
స్వయం సుతీక్ష్ణః పురుషర్షభాభ్యామ్
తాభ్యాం సుసత్కృత్య దదౌ మహాత్మా
సంధ్యానివృత్తౌ రజనీ మవేక్ష్య. ౨౪

టీక॥ తతః=అంత; మహాత్మా=పూజ్యమయినస్వభావముగల; సుతీక్ష్ణః=సుతీక్ష్ణుఁడు; సంధ్యానివృత్తౌ=సంధ్యాకాలముయొక్క గడచుటకాఁగా; రజనీం=రాత్రిని; అవేక్ష్య = చూచి; స్వయం=తానె; పురుషర్షభాభ్యాం=పురుషశ్రేష్ఠులగు; తాభ్యాం= ఆరామలక్ష్మణులకొఱకు; సుసత్కృత్య = చక్కఁగాఁబూజించి; శుభం = మంగళకరమయినదియు; తాపసభోజ్యం=ఋషులచేఁదినఁదగినదియునగు; అన్నం=అన్నమును; దదౌ=ఇచ్చెను.

అంత, మహాత్ముండగుసుతీక్ష్ణమహాముని, సంధ్యాకాలంబుగడచిరాత్రియగుటంజూచి, పురుషశ్రేష్ఠులగురామలక్ష్మణులంబూజించి, తాపసులుదినునట్టియన్నంబును,వారలకొసంగెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే, సప్తమస్సర్గః
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండసప్తమసర్గటీక,
ముగిసినది.

---

౸౨

అష్టమసర్గప్రారంభః

రామస్తు సహసౌమిత్రి స్సుతీక్ష్ణే నాభిపూజితః
పరిణామ్య నిశాం తత్ర ప్రభాతే ప్రత్యబుధ్యత. ౧

టీక॥ సహసౌమిత్రిః = లక్ష్మణునితోఁగూడిన; రామస్తు=రాముండును; సుతీక్ష్ణేన = సుతీక్ష్ణునిచేత; అభిపూజితః=పూజింపఁబడినవాఁడై; తత్ర=అయ్యాశ్రమమునందు; నిశాం=రాత్రిని; పరిణామ్య=కడపి; ప్రభాతే = ఉషఃకాలమునందు; ప్రత్యబుధ్యత = మేలుకొనెను.

రాముండునులక్ష్మణుండును, సుతీక్ష్ణమహామునిచేఁ బూజింపఁబడినవారలయి, యయ్యాశ్రమంబుననారాత్రియందయుండి, యుషఃకాలంబుననె మేలుకొనిరి. అని, తాత్పర్యము.

ఉత్థాయతు యధా కాలం రాఘవ స్సహసీతయా
ఉపాస్పృశ త్సుశీతేన జలేనో త్పలగంధినా. ౨

టీక॥ రాఘవః= రాముఁడు, సీతయాసహ=సీతతోఁగూడ ; యధాకాలం=కాలమునతిక్రమింపక; ఉత్థాయతు=లేచినంతనె; సుశీతేన= మిక్కిలియుఁజల్లనయిన; ఉత్పలగంధినా= నల్లకలువలయొక్కగంధముగల;జలేన=జలముచేత; ఉపాస్పృశత్ = స్నానముచేసెను.

రాముఁడు, యుక్తకాలంబుననె మేలుకొని, సీతతోఁగూడఁ, గలువలసంబంధంబునసుగంధియయియుండుచల్లనినీటస్నానంబుగావించెను.

అని, తాత్పర్యము.

అధ తేగ్నిం సురాంశ్చైవ వైదేహీ రామలక్ష్మణౌ
కాల్యం విధివ దభ్యర్చ్య తపస్విశరణే వనే. ౩
ఉదయంతం దినకరం దృష్ట్వా విగతకల్మషాః
సుతీక్ష్ణ మభిగమ్యేదం శ్లక్ష్ణం వచన మబ్రువన్. ౪

టీక॥ అధ = అంత; తపస్విశరణే=ఋషులనివాసస్థానమయిన;వనే=అడవియందు; విగతకల్మషాః=పోయినపాపముగల; తే=ఆ; వైదేహీ= సీతయు; రామలక్ష్మణౌ= రాముండునులక్ష్మణుండును;కాల్యం= ప్రాతఃకాలమునందు; అగ్నిం= అగ్నిహోత్రమును; సురాంశ్చైవ=దేవతలను ; విధివత్ = యధాశాస్త్రముగా; అభ్యర్చ్య=పూజించి;ఉదయంతం=ఉదయించుచున్న;దినకరం=సూర్యుని; దృష్ట్వా=చూచి; సుతీక్ష్ణం=సుతీక్ష్ణమహామునిని ; అభిగమ్య=పొంది; శ్లక్ష్ణం= మధురమయిన; ఇదం=ఈ; వచనం=మాటను;

అబ్రువన్=చెప్పిరి.

అంత, ఋషినిలయంబగువనంబున, పాపరహితులగుసీతాదేవియు రామలక్ష్మణులును, ప్రాతఃకాలంబున, యథావిధిగ, నగ్నిహోత్రకార్యంబులు గావించి, దేవతలంబూజించి, సూర్యుం డుదితుండగుటనుజూచి, సుతీక్ష్ణమహామునియొద్దకుంబోయి, మధురవచనంబున, నిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

సుఖోషితాస్స్మ భగవన్ త్వయా పూజ్యేన పూజితాః
ఆపృచ్ఛామః ప్రయాస్యామో మునయ స్త్వరయంతి నః. ౫

టీక॥ భగవన్=మాహాత్మ్యముగల సుతీక్ష్ణుండా! వయం (అధ్యాహృతము)=మేము; పూజ్యేన= పూజింపందగినట్టి; త్వయా=నీచేత; పూజితాః= పూజింపంబడిన వారలమయి; సుఖోషితాః= సుఖముగానున్నవారలము, స్మ(స్మః)=అగుచున్నాము. ఆపృచ్ఛామః=వీడుకొనెదము. ప్రయాస్యామః; పోయెదము. మునయః=మునులు; నః=మమ్ము; త్వరయంతి=వేగిరపఱచుచున్నారు.

భగవంతుండ వగు సుతీక్ష్ణుండా! పూజ్యుండవగునీచే నానావిధపూజలం బొంది, మేము, రాత్రియంతయు సుఖంబుగనుంటిమి; చెప్పిపోవుటకు వచ్చినాము; మా వెంబడివచ్చిన మునులు, మమ్ముందొందరచేయుచున్నారు.

అని, తాత్పర్యము.

త్వరామహే వయం ద్రష్టుం కృత్స్నమాశ్రమమండలమ్
ఋషీణాం పుణ్యశీలానాం దండకారణ్యవాసినామ్. ౬

టీక॥ వయం=మేము; పుణ్యశీలానాం=పుణ్యస్వభావులగు; దండకారణ్యవాసినాం=దండకారణ్యంబున నుండునట్టి; ఋషీణాం= ఋషులయొక్క; ఆశ్రమమండలం=ఆశ్రమసమూహము; కృత్స్నం=అంతయును; ద్రష్టుం= చూచుటకు; త్వరామహే= వేగిరపడుచున్నాము.

ఈదండకారణ్యంబుననుండునట్టిపుణ్యవంతులగుఋషులయాశ్రమముల న

న్నియుఁజూడవలెననిమాకెచ్చుగాఁద్వరగలిగియున్నది. అని, తాత్పర్యము.

అభ్యనుజ్ఞాతు మిచ్ఛామ స్సహైభి ర్మునిపుంగవైః
ధర్మనిత్యై స్తపోదాంతై ర్విశిఖై రివ పావకైః. ౭

టీక॥వయం(అధ్యాహృతము)=మేము;ధర్మనిత్యైః= ధర్మమునందుస్థిరులును ; తపోదాంతైః = తపంబుచేనింద్రియ నిగ్రహముగలవారలును ; విశిఖైః = జ్వాలలులేని;పావకైరివ ( స్థితైః )= నిప్పువలె నున్నవారలు నగు;ఏభిః=ఈ; మునిపుంగవైస్సహ= మునిశ్రేష్ఠులతోఁ గూడ ; అభ్యనుజ్ఞాతుం=అనుమతించుటకు;ఇచ్ఛామః=కోరుచున్నాను.

మేమును,బరమధార్మికులును మహాతపశ్శాలులును జితేంద్రియు లును జ్వాలలులేని యగ్నిహోత్రములవంటివారలునగు ఈమునివరులును, నీయనుమతింగోరియున్నాము.

అని,తాత్పర్యము.

అవిషహ్యాతపో యావ త్సూర్యో నాతివిరాజతే
అమార్గేణా గతాం లక్ష్మీం ప్రాప్యేవాన్వయవర్జితః. ౮
తావ దిచ్ఛామహే గంతుం

టీక॥ యావత్=ఎంతలోపల, అవిషహ్యాతపః= ఓర్వఁగూడనియెండగలః;సూర్యః=సూర్యుఁడు ; అమార్గేణ=తప్పుమార్గముచేత;ఆగతం= వచ్చిన;లక్ష్మీం= సంపదను ; ప్రాప్య= పొంది; అన్వయవర్జితఇవ = మంచివంశముచేవిడువఁబడిన వాఁడువలె ; నాతివిరాజతే= ప్రకాశింపకుండునో; తావత్=అంతలోపల;గంతుం = పోవుటకు ; ఇచ్ఛామహే = కోరుచున్నాము.

నీచకులంబునంబుట్టినవాఁడు, తప్పుమార్గంబున రాజ్యలక్ష్మినిసంపాదించివిఱ్ఱవీఁగునట్లు, సూర్యుండు , మఱియు నెండగాయనారంభించుటకు మున్నె,పోవలయుననియున్నాము . అని, సీతారామలక్ష్మణులు,సుతీక్ష్ణమహామునితోఁజెప్పిరి. అని, తాత్పర్యము.

సర్గ

ఇత్యుక్త్వా చరణౌ మునేః
వవందే సహసౌమిత్రి స్సీతయా సహ రాఘవః. ౯

టీక॥ రాఘవః=రాముఁడు; సహసౌమిత్రిః= లక్ష్మణునితోఁగూడినవాఁడై; సీతయాసహ=సీతతోఁగూడ ; ఇతి=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; మునేః = సుతీక్ష్ణమహామునియొక్క; చరణౌ = పాదములను; వవందే=నమస్కరించెను.

ఆసీతారామలక్ష్మణులు, ఈప్రకారమునం జెప్పి, యాసుతీక్ష్ణమహామునిచరణంబులకునమస్కరించిరి.

అని, తాత్పర్యము.

తౌ సంస్పృశంతౌ చరణౌ వుత్థాప్య మునిపుంగవః
గాఢ మాలింగ్య సస్నేహ మిదం వచన మబ్రవీత్. ౧౦

టీక॥మునిపుంగవః= మునిశ్రేష్ఠుండగుసుతీక్ష్ణుండు; చరణౌ= పాదములను; సంస్పృశంతౌ=తాఁకుచున్న; తౌ= ఆరామలక్ష్మణులను; ఉత్థాప్య= ఎత్తి; సస్నేహం=చెలిమితోఁగూడునట్లుగా; గాఢం=గట్టిగా; ఆలింగ్య= కవుఁగిలించుకొని; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

మునిశ్రేష్ఠుండగు నాసుతీక్ష్ణమహామని, తనపాదంబులకునమస్కరింపుచున్న యారామలక్ష్మణులనులేవనెత్తి స్నేహాతిశయఁబొప్ప, దృఢముగఁ గవుఁగిలించుకొని, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అరిష్టం గచ్ఛ పంథానం రామ సౌమిత్రిణాసహ
సీతయా చానయాసార్థం ఛాయయేవానువృత్తయా. ౧౧

టీక॥రామ=రాముఁడా! సౌమిత్రిణా సహ=లక్ష్మణునితోఁగూడను; ఛాయయేవ=నీడయుంబోలె; అనువృత్తయా= అనుసరించియుండునట్టి ; అనయా= ఈ; సీతయాచసార్థం=సీతతోనుంగూడ; అరిష్టం=ఉపద్రవములేనట్టి; పంథానం=మార్గమును; గచ్ఛ= పొందుదువుగాక.

రాముఁడా! ఛాయయుంబోలె ననువర్తించియుండునట్టి యీసీతను ,

లక్ష్మణునింగూడి, నీవుపోవుచుండునప్పుడు, నీమార్గము, ఉపద్రవరహితమయియుండుఁగాక, అని, తాత్పర్యము.

పశ్యాశ్రమపదం రమ్యం దండకారణ్యవాసినామ్
ఏషాం తపస్వినాం వీర తపసా భావితాత్మనామ్. ౧౨

టీక॥వీర=పరాక్రమశాలివగు రాముఁడా! తపసా=తపస్సుచేత; భావితాత్మనాం=ధ్యానింపఁబడిన పరమాత్మగల; దండకారణ్యవాసినాం= దండకారణ్యమునందుండునట్టి;ఏషాం=ఈ; తపస్వినాం = ఋషులయొక్క; రమ్యం=సుందరమయిన; ఆశ్రమపదం=ఆశ్రమస్థానమును;పశ్య=చూడుము.

పరాక్రమశాలివగు రాముఁడా! తపస్సుచేఁ బరమాత్మను ధ్యానింపుచుండునట్టి, యీదండకారణ్యమునను౦డుమహర్షుల యాశ్రమములంజూడుము. అని , తాత్పర్యము.

సప్రాజ్యఫలమూలాని పుష్పితాని వనానిచ
ప్రశస్తమృగయూధాని శాంతపక్షిగణానిచ. ౧౩
ఫుల్లపంకజషండాని ప్రసన్నసలిలానిచ
కారండవవికీర్ణాని తటాకాని సరాంసిచ. ౧౪
ద్రక్ష్యసే దృష్టిరమ్యాణి గిరిప్రస్రవణానిచ
రమణీయా న్యరణ్యాని మయూరాభిరుతాని చ. ౧౫

టీక॥ సప్రాజ్యఫలమూలాని = అధికములయినపండ్లతోను గడ్డలతోను గూడినవియు; పుష్పితాని=పూచినవియు; ప్రశస్తమృగయూధాని = శ్రేష్ఠములయినమృగములసమూహముగలవియు; శాంతపక్షిగణానిచ = శాంతిగలపక్షిసమూహములుగలవియునగు; వనానిచ=వనములను; ఫుల్లపంకజషండాని=వికసించినతామరపూల సమూహములుగలవియు; ప్రసన్నసలిలానిచ = నిర్మలములయిన జలములుగలవియు ; కారండవవికీర్ణాని= నీరుకోళ్లచేవ్యా

పింపఁబడినవియునగు;తటాకాని= చెఱువులను;సరాంసిచ=కొలనులను; దృష్టిరమ్యాణి = చూచుటకురమణీయములయిన;గిరిప్రస్రవణానిచ=పర్వతములయందలిసెలయేఱులను; మయూరాభిరుతాని= నెమిళ్లధ్వనులుగల; రమణీయాని=మనోహరములగు , అరణ్యానిచ=అడవులను; ద్రక్ష్యసే (దక్ష్యసి)=చూడఁగలవు.

ఫలమూల సమృద్ధంబులును మంచి మృగంబులుగలవియుఁబరస్పరవైరంబు విడిచిశాంతంబులయియుండు పక్షులతోఁగూడినవియునగు పుష్పితవనంబులను , వికసితంబులగుకమలంబులునునీరుకోడిలునుగలిగి నిర్మలంబగు జలముతోఁగూడిన తటాకంబులను సరస్సులను , నేత్రానందకరంబులగు సెలయేఱులను,మధురంబుగాఁగూయు చుండు మయూరంబులతోఁగూడినమనోహరంబులగునడవులను,నీవుచూడఁగలవు.

అని, తాత్పర్యము.

గమ్యతాం వత్స సౌమిత్రే భవానపిచ గచ్ఛతు
ఆగంతవ్యం త్వయా తాత పునరేవా శ్రమం మమ. ౧౬

టీక॥ వత్స=బిడ్డఁడవగు ; సౌమిత్రే=లక్ష్మణుఁడా!గమ్యతాం = పొందఁబడుఁగాక.భవానపిచ=నీవును ; గచ్ఛతు=పొమ్ము.తాత = నాయనా! త్వయా=నీచేత;పునరేవ = మఱలనే; మమ=నాయొక్క;ఆశ్రమం= ఆశ్రమము; ఆగంతవ్యం = పొందఁబడవలసినది.

లక్ష్మణుఁడా!నీవునుబొమ్ము ; రాముఁడా!నీవునుబొమ్ము;అయితే , మీరు, మఱలనాయాశ్రమంబునకొకమాఱు రావలయును. అని,సుతీక్ష్ణమహాముని,రామాదులకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవముక్త స్తథే త్యుక్త్వా కాకుత్థ్సస్సహలక్ష్మణః
ప్రదక్షిణం మునిం కృత్వా ప్రస్థాతు ముపచక్రమే. ౧౭

టీక॥ కాకుత్థ్సః=రాముఁడు ; ఏవం=ఇట్లు;ఉక్తః = చెప్పఁబడినవాఁడై;తథేతి=అట్లేయని;ఉక్త్వా= చెప్పి; సహలక్ష్మణః= లక్ష్మణునితోఁగూడిన

స ౮

వా(ౕ)డై;మునిం=సుతీక్ష్ణు నిగూర్చి; ప్రదక్షిణం=ప్రదక్షిణమును;కృత్వా=చేసి;ప్రస్థాతుం=బయలు దేఱుటకు; ఉపచక్రమే=ఆరంభించెను.

అట్లు రాముండు , సుతీక్ష్ణు నిమాటలువిని, అట్లైయనిచెప్పి , లక్ష్మణసహితుండై , యమ్మునివరునకుఁబ్రదక్షిణముగావించి,పయనంబయ్యెను.

అని, తాత్పర్యము.

తత శ్శుభతరే తూణీ ధనుషీ చాయ తేక్షణా
దదౌ సీతా తయోర్భ్రాత్రోః ఖడ్గౌచ విమలత్సరూ. ౧౭

టీక॥ తతః = అంత; ఆయ తేక్షణా= దీర్ఘములయినకండ్లుగల ; సీతా=సీతాదేవి;తయోః = ఆ; భ్రాత్రోః=అన్నదమ్ములకు;శుభతరే= మిక్కిలియుమంగళకరములగు; తూణీ= అమ్ములపొదులను; ధనుషీచ= ధనుస్సులను;విమలత్సరూ= నిర్మలములయినపిడులుగలఁ;ఖడ్గౌచ=కత్తులను;దదౌ= ఇచ్చెను.

అంత , విశాలములగుకండ్లుగలసీతాదేవి, యారామలక్ష్మణులకిర్వురకును, మంచియమ్ములపొదులనుధనుస్సులనునిర్మలంబగుపిడిగలకత్తులను, ఇచ్చెను. అని, తాత్పర్యము.

ఆబధ్యచ శుభే తూణీ చాపేచాదాయ సస్వనే
నిష్క్రాంతౌ వాశ్రమా ద్గంతు ముభౌ తౌ రామలక్ష్మణౌ. ౧౮

టీక॥ తౌ=ఆ;రామలక్ష్మణౌ= రామలక్ష్మణులు;ఉభౌ = ఇద్దఱును; శుభే=మంగళకరములగు;తూణీ=అమ్ములపొదులను; ఆబధ్యచ = కట్టుకొనియు;సస్వనే=ధ్వనితోఁగూడిన ; చాపే=ధనుస్సులను ; ఆదాయచ=గ్రహించియు;గంతుం=పోవుటకు; ఆశ్రమాత్ =ఆశ్రమముననుండి; నిష్క్రాంతౌ=వెడలినారు.

అంతనారామలక్ష్మణులు , తూణీరంబులబంధించుకొని, ధనుస్సులనుగ్రహించి, యాశ్రమంబుననుండిబయలువెడలిరి. అని, తాత్పర్యము.

శ్రీమంతౌ రూపసంపన్నౌ దీప్యమానౌ స్వతేజసా
ప్రస్థితౌ ధృతచాపౌ తౌ సీతయాసహ రాఘవౌ. ౨౦

టీక॥ శ్రీమంతౌ = అధికమయిన కాంతిగలవారలును; రూపసంపన్నౌ= మంచిరూపముతోఁగూడినవారలును ; స్వతేజసా=తమకాంతిచేత; దీప్యమానౌ = ప్రకాశించుచున్నవారలునగు, తౌ=ఆ; రాఘవౌ = రామలక్ష్మణులు; ధృతచాపౌ= ధరింపఁబడినవిల్లుగలవారలయి;సీతయాసహ= సీతతోఁగూడ; ప్రస్థితౌ=వెడలిరి.

శ్రీమంతులును, మహాసౌందర్యశాలులునగు నారామలక్ష్మణులు, నిజదేహకాంతిచేవెలుంగుచు,ధనుర్ధరులయి, సీతతోఁగూడఁబోయిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే,అష్టమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,అరణ్యకాండాష్టమసర్గటీక,
ముగిసినది.

శ్రీః

నవమసర్గప్రారంభః.

సుతీక్ష్ణేనాభ్యనుజ్ఞాతం ప్రస్థితం రఘునందనమ్
హృద్యయా స్నిగ్ధయా వాచా భర్తారమిద మబ్రవీత్. ౧

టీక॥ సీతా(అధ్యాహృతము)= సీతాదేవి; సుతీక్ష్ణేన= సుతీక్ష్ణమహాముని చేత; అభ్యనుజ్ఞాతం= అనుమతింపఁబడినవాఁడును;ప్రస్థితం=బయలువెడలినవాఁడును ; భర్తారం = పెనిమిటియునగు ; రఘునందనం = రాముని గూర్చి; హృద్యయా= మనోహరమగు; స్నిగ్ధయా = స్నేహముతోఁగూడిన;

వాచా=మాటచేత; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

సీతాదేవి,సుతీక్ష్ణమహాముని యనుమతింబొంది బయలు వెడలిన పెనిమిటిని రాముంజూచి, మధురంబును స్నేహయుక్తంబునగువచనంబున,నిట్లని , చెప్పెను. అని,తాత్పర్యము.

అయం ధర్మ స్సుసూక్ష్మేణ విధినా ప్రాప్యతే మహాన్
నివృత్తేన తు శక్యోయం వ్యసనా త్కామజా దిహ. ౨

టీక॥మహాన్=గొప్పదగు;అయం=ఈ;ధర్మః=మునిధర్మము; సుసూక్ష్మేణ=మిక్కిలియుసూక్ష్మమయిన;విధినా=మార్గముచేత ; ప్రాప్యతే=పొందఁబడుచున్నది. ఇహ=ఇచ్చట ; అయం=ఇది;కామజాత్=కామమువలనఁబుట్టిన;వ్యసనాత్=వ్యసనమునునుండి;నివృత్తేన=విడివడినవానిచేత;శక్యః=సంపాదింపఁదగినది.

ఈమునిధర్మముమిక్కిలియు గొప్పది; అతిసూక్ష్మమార్గంబునసంపాదింపఁదగినది ; కామజవ్యసనములను విడిచినవానికే దీనిసంపాదింపశక్యము గునుగాని, యితరునికలవిగాదు.

అని,తాత్పర్యము.

త్రీణ్యేవ వ్యసనా న్యత్ర కామజాని భవం త్యుత

టీక॥ అత్ర=ఇందు; ఉత= మిక్కిలియు; కామజాని= కామమువలనంబుట్టిన; వ్యసనాని=వ్యసనములు; త్రీణ్యేవ=మూఁడే; భవంతి= అగుచున్నవి.

కామజవ్యసనములు మూఁడు గలవు. అని,తాత్పర్యము.

మిథ్యా వాక్యం పరమకం తస్మా ద్గురుతరా వుభౌ. ౩
పరదారాభిగమనం వినా వైరంచ రౌద్రతా

టీక॥మిథ్యావాక్యం= అబద్ధముచెప్పుట;పరమకం= ఉత్కృష్టమయినది. పరదారాభిగమనం= పరస్త్రీగమనమును;వైరంవినా=వైరములేకయె; రౌద్రతాచ=కోపముగలుగుటయు ; ఉభౌ=రెండును;తస్మాత్=అబద్ధమునకన్న

ను; గురుతరౌ=అధికములయినవి.

అబద్ధము చెప్పుటగొప్పదికి పరస్త్రీగమనమును వైరకారణములేకయె కోపం బవలంబించుటయు, నవి రెండును, దానికన్నను గొప్పవి. అని, తాత్పర్యము.

మిథ్యావాక్యం న తే భూతం నభవిష్యతి రాఘవ. ౪

టీక॥ రాఘవ=రాముఁడా! తే=నీకు; మిథ్యావాక్యం=అబద్ధపుమాట; న భూతం=కలుగలేదు. నభవిష్యతి=కలుగఁబోదు.

రాముఁడా! నీవిదివఱకెన్నఁడును అబద్ధముఁజెప్పినవాఁడవుకావు; ఇంకనుం జెప్పఁబోవునదియులేదు.

అని, తాత్పర్యము.

కుతో భిలాషణం స్త్రీణాం పరేషాం ధర్మనాశనమ్

టీక॥ ధర్మనాశనం= ధర్మమును నశింపఁజేయునట్టి; పరేషాం= ఇతరుల యొక్క; స్త్రీణాం=స్త్రీలయొక్క; అభిలాషణం=కోరిక; కుతః= ఎక్కడిది?

అధర్మకారణంబగు, పరస్త్రీలయందలియభిలాషనీకెక్కడిది?

అని, తాత్పర్యము.

తవ నాస్తి మనుష్యేంద్ర నచాభూత్తే కదాచన. ౫
మనస్యపి తథా రామ నచైత ద్విద్యతే క్వచిత్

టీక॥ మనుష్యేంద్ర= మనుష్యులకుఁబ్రభుఁడవయిన; రామ=రాముఁడా! తవ=నీకు; నాస్తి=లేదు. తే =నీకు; కదాచన చ=ఒకానొకప్పుడును; నాభూత్= కలుగలేదు. తథా=అట్లు; ఏతత్= ఇది; మనస్యపి=మనస్సునందును; క్వచిత్=ఒకానొకప్పుడును; నవిద్యతేచ=లేదును.

మనుష్యేశ్వరుండవగు రాముఁడా! పరస్త్రీవాంఛమాత్రము, నీకులేదు; ఇదివఱకెప్పుడునులేదు; మనస్సునందుఁగూడ, నీకట్టిసంకల్ప మెప్పుడును గలుగదు. అని, తాత్పర్యము.

స్వదారనిరత స్త్వంచ నిత్యమేవ నృపాత్మజ. ౬

ధర్మిష్ఠ స్సత్యసంధశ్చ పితు ర్నిర్దేశకారకః

టీక॥ నృపాత్మజ = రాచకొమరుండవగు రాముఁడా! త్వం=నీవు; నిత్యమేవ=ఎల్లప్పుడునే; స్వదారనిరతశ్చ = నీభార్యయందాసక్తుండవు. ధర్మిష్ఠః= అధికముగాధర్మముగలవాఁడవు. సత్యసంధశ్చ = సత్యప్రతిజ్ఞుండవును. పితుః=తండ్రియొక్క; నిర్దేశకారకః= ఆజ్ఞం జేయువాఁడవు.

రాచకొమరుండవగు రాముఁడా! నీవు, ఎల్లప్పుడునుస్వభార్యయందె, యాసక్తుండవు; పరమధార్మికుండవు; సత్యసంధుండవు; తండ్రియాజ్ఞకుజవదాఁటవు. అని, తాత్పర్యము.

సత్యసంధ మహాభాగ శ్రీమన్ లక్ష్మణపూర్వజ. ౭
త్వయి ధర్మశ్చ సత్యంచ త్వయి సర్వం ప్రతిష్ఠితమ్

టీక॥ సత్యసంధ=సత్యప్రతిజ్ఞుండవు; మహాభాగ= పూజ్యమయినభాగ్యముగలవాఁడవు ; శ్రీమన్ = అధికమయినకాంతిగలవాఁడవు ; లక్ష్మణపూర్వజ= లక్ష్మణునియన్నవునగురాముఁడా! త్వయి=నీయందు; ధర్మశ్చ=ధర్మమును; సత్యంచ=సత్యమును; త్వయి=నీయందు; సర్వం = అంతయు; ప్రతిష్ఠితం=ప్రతిష్ఠింపఁబడినది.

సత్యసంధుండవు మహాభాగుండవు శ్రీమంతుండవులక్ష్మణుని యన్నవునగు రాముఁడా! నీయందు, ధర్మంబునుసత్యంబును, అన్నిసద్గుణంబులును, ప్రతిష్ఠితములయియున్నవి. అని, తాత్పర్యము.

తచ్చ సర్వం మహాబాహో శక్యం ధర్తుం జితేంద్రియైః. ౮
తవ వశ్యేంద్రియత్వంచ జానామి శుభదర్శన

టీక॥ మహాబాహో=పెద్దచేతులుగలరాముఁడా! తత్=అది; సర్వం= అంతయు; జితేంద్రియైః=జయింపఁబడినయింద్రియములుగలవారిచేత ; ధర్తుం=ధరించుటకు; శక్యం=అలవియగును. శుభదర్శన=మంగళకరమయినచూచుటగలరాముఁడా! తవ=నీయొక్క; వశ్యేంద్రియత్వంచ= స్వాధీనము

సర్గ

లయినయింద్రియములుగలుగుటను;జా నామి=ఎఱుంగుదును.

మహాబాహుండవగు రాముఁడా! అట్టిపరమధార్మికత మొదలగు గుణంబులు,జితేంద్రియులయందుండును గాని,మఱి యెవ్వరియందును, ఉండవు; నీవు,జితేంద్రియుండవనినాకుఁ జక్కఁగాఁ, దెలియును.అని,తాత్పర్యము.

తృతీయం యదిదం రౌద్రం పరప్రాణాభిహింసనమ్. ౯
నిర్వైరం క్రియతే మోహా త్తచ్చ తే సముపస్థితమ్

టీక॥నిర్వైరం = వైరములేనట్లుగా; పరప్రాణాభిహింసనం = ఇతర ప్రాణములహింసించుటయును;యత్= ఏ; ఇదం=ఈ; రౌద్రం= రౌద్రమను; తృతీయం=మూఁడవవ్యసనము ; మోహాత్=అజ్ఞానమువలన; క్రియతే=చేయఁబడుచున్నదో;తచ్చ= అదిమాత్రము; తే=నీకు;సముపస్థితం=వచ్చినది.

వైరములేకయె ప్రాణిహింససేయుటయనురౌద్రవ్యసనము, అజ్ఞానంబునఁబామరులచేఁ జేయఁబడును; అది నీకిప్పుడు,తటస్థించియున్నది.

అని,తాత్పర్యము.

ప్రతిజ్ఞాత స్త్వయా వీర దండకారణ్యవాసినామ్. ౧౦
ఋషీణాం రక్షణార్థాయ వధ స్సంయతి రక్షసామ్

టీక॥వీర=పరాక్రమశాలివగు రాముఁడా!త్వయా=నీచేత; దండకారణ్యవాసినాం= దండకారణ్యమునందుండునట్టి;ఋషీణాం=ఋషులయొక్క; రక్షణార్థాయ = రక్షించుటకొఱకు; సంయతి= యుద్ధమునందు;రక్షసాం= రాక్షసులయొక్క;వధః=చంపుట; ప్రతిజ్ఞాతః=ప్రతిజ్ఞ చేయఁబడినది.

పరాక్రమశాలివగురాముఁడా! నీవు,దండకారణ్యంబుననుండుఋషుల రక్షించుటకై , రాక్షసులనందఱ యుద్ధంబునవధించెదనని , ప్రతిజ్ఞగావించినావు. అని,తాత్పర్యము.

ఏతన్నిమిత్తంచ వనం దండకా ఇతి విశ్రుతమ్. ౧౧

ప్రస్థిత స్త్వం సహభ్రాత్రా ధృతబాణశరాసనః

టీక ॥త్వం=నీవు;ఏతన్నిమి త్తంచ=దీనికొఱకె; దండకాఇతి = దండకల నిఃవిశ్రుతం=ప్రసిద్ధమయిన;వనం=వనమునుగూర్చి; భ్రాత్రాసహ = తమ్మునితోఁగూడ;ధృతబాణశరాసనః=ధరింపఁబడినబాణమునువిల్లును గలవాఁడవై;ప్రస్థితః=వచ్చినావు.

నీవు,ఇందుకొఱకె,తమ్మునితోఁగూడ,ధనుర్బాణంబులుధరించి, యీదండకారణ్యంబునకువచ్చినావు.

అని,తాత్పర్యము.

తత స్త్వాం ప్రస్థితం దృష్ట్వా మమ చింతాకులం మనః. ౧౨
త్వద్వృత్తం చింతయంత్యా వై భవే న్నిశ్శ్రేయసం హి తత్

టీక॥ తతః=అంత;ప్రస్థితం = బయలుదేఱిన;త్వాం=నిన్ను; దృష్ట్వా=చూచి;త్వద్వృత్తం = నీయాచారమును; తత్=ఆ; నిశ్శ్రేయసం=మంగళిమును;చింతయంత్యాః = ఆలోచించుచున్న ("వై" అనునదిపాదపూరణార్థము); మమ=నాయొక్క;మనః= మనస్సు;చింతాకులం= చింతచేవ్యాకులమయినది;భవేద్ధి=అగునుగదా!

అంత , నీవట్లుబయలువెడలుటంజూచి, నీసత్యప్రతిజ్ఞతయునీక్షేమంబునుంగుఱించియాలోచింప, నామనస్సునకుమిక్కిలియుఁజింతయగుచున్నది.

అని,తాత్పర్యము.

నహి మే రోచతే వీర గమనం దండకాన్ ప్రతి. ౧౩
కారణం తత్ర వక్ష్యామి వదంత్యా శ్శ్రూయతాం మమ

టీక॥ వీర=పరాక్రమశాలివగురాముఁడా!దండకాన్ప్రతి = దండకారణ్యమునుగూర్చి;గమనం = పోవుట; మే=నాకు;నరోచతేహి= రుచింపదుగదా!తత్ర=అచ్చట;కారణం= కారణమును;వక్ష్యామి=చెప్పెదను . వదంత్యాః=చెప్పుచున్న;మమ (మత్)=నావలన ; శ్రూయతాం = వినఁబడుఁగాక.

పరాక్రమశాలివగురాముఁడా! దం

డకారణ్యమునకుఁబోవుటయందు, నా కిష్టములేదు; అందుకుఁగారణంబుఁజెప్పెదను; నామాటనువినుము.

అని, తాత్పర్యము.

త్వం హి బాణధనుష్పాణి ర్భ్రాత్రాసహ వనం గతః. ౧౪
దృష్ట్వా వనచరాన్ సర్వాన్ కచ్చి త్కుర్యా శ్శరవ్యయమ్

టీక॥ బాణధనుష్పాణిః=బాణంబునుధనుస్సును జేతంగలవాఁడవును; భ్రాత్రాసహ=తమ్మునితోఁగూడ; వనం= అడవిని; గతః = పొందినవాఁడవునగు; త్వం=నీవు; వనచరాన్ = అడవియందుఁదిరుగునట్టివారలగు ; సర్వాన్ = అందఱినుగూర్చి; శరవ్యయం=బాణమోక్షమును; కుర్యాః కచ్చిత్ = చేయుదువుగదా?

ధనుర్బాణంబులు దాల్చి తమ్మునితోఁగూడవనంబునకువచ్చిననీవు, వనంబుననుండు రాక్షసులంజూచినప్పుడు, బాణంబులువిడుతువుగదా?

అని, తాత్పర్యము.

క్షత్రియాణాంచ హి ధను ర్హుతాశస్యేం ధనానిచ. ౧౫
సమీపత స్థ్సితం తేజో బల ముచ్ఛ్రియ తే భృశమ్

టీక॥ క్షత్రియాణాం= క్షత్రియులకు; ధనుశ్చ=ధనుస్సును; హుతాశస్య= అగ్నిహోత్రునికి; ఇంధనానిచ = కట్టెలును; సమీపతః= సమీపమునందు; స్థితం=ఉన్నదై; తేజోబలం = తేజస్సుయొక్క బలమును; భృశం = మిక్కిలియు; ఉచ్ఛ్రయతేహి = వృద్ధిఁబొందించునుగదా!

అగ్నిహోత్రునకుసమీపంబునఁ గట్టెలున్నయెడ తేజస్సు వృద్ధిఁబొందునట్లు, క్షత్రియులకు, సమీపంబునధనుస్సున్నయెడఁదేజస్సువృద్ధిఁబొందును.

అని, తాత్పర్యము.

పురాకిల మహాబాహో తపస్వీ సత్యవా క్ఛుచిః ౧౬
కస్మింశ్చి దభవ త్పుణ్యే వనే రతమృగద్విజే




టీక॥ మహాబాహో= పెద్దచేతులుగలరాముఁడా! పురా కిల= మున్ను; పుణ్యే=పవిత్రమయిన; రతమృగద్విజే= సంతసించిన మృగంబులును బక్షులును గల; కస్మింశ్చిత్=ఒకానొక; వనే= అడవియందు; సత్యవాక్= సత్యమయిన మాటగల; శుచిః=పరిశుద్ధుండగు; తపస్వీ=ఋషి; అభవత్=ఉండెను.

మహాబాహుండవగు రాముఁడా! మున్ను, పుణ్యంబును ఎల్లప్పుడు సంతుష్టంబులయి యుండు మృగపక్షులతోఁ గూడినదియునగు నొకవనంబున, సత్యవాదియుఁ బరిశుద్ధుండునగు నొకమునివరుండుండెను. అని, తాత్పర్యము.

తస్యైవ తపసో విఘ్నం కర్తు మింద్ర శ్శచీపతిః. ౧౭
ఖడ్గపాణి రథా గచ్ఛ దాశ్రమం భటరూపధృత్

టీక॥ అథ=అంత; శచీపతిః= శచీదేవి పెనిమిటియయిన; ఇంద్రః = ఇంద్రుఁడు; తస్యైవ=ఆమునియొక్కయె; తపసః= తపస్సునకు; విఘ్నం= విఘ్నమును; కర్తుం=చేయుటకు; భటరూపధృత్ = భటునిరూపమును దాల్చినవాఁడై; ఖడ్గపాణిః = కత్తిచేతఁగలవాఁడై; ఆశ్రమం= ఆశ్రమమునుగూర్చి; ఆగచ్ఛత్=వచ్చెను.

అంత, దేవేంద్రుండు, ఆముని కేతపోవిఘ్నంబు సేయుటకై, భటరూపంబుఁ దాల్చి, కత్తి చేతంబూని, యమ్ముని యాశ్రమమునకు వచ్చెను.
అని, తాత్పర్యము.

తస్మిం స్తదాశ్రమపదే నిశితః ఖడ్గ ఉత్తమః. ౧౮
స న్యాసవిధినా దత్తః పుణ్యే తపసి తిష్ఠతః

టీక॥ తదా=అప్పుడు; తస్మిన్= ఆ; ఆశ్రమపదే= ఆశ్రమస్థానమునందు; నిశితః=కఱకైన; ఉత్తమః=శ్రేష్ఠమయిన; సః=ఆ; ఖడ్గః=కత్తి; పుణ్యే=పవిత్రమైన; తపసి=తపస్సునందు; తిష్ఠతః= ఉన్నట్టియామునికు, న్యాసవిధినా = న్యాసమార్గము చేత, దాఁచియుంచి నేనడిగినప్పుడిమ్మని చెప్పియిచ్చువిధంబున ననుట; దత్తః=ఇవ్వఁబడినది-

అట్లు, భటవేషధారియగు నింద్రుండు, అయ్యాశ్రమంబున, మహాతపస్సు గావించుచున్న యామహర్షికిఁ దీని




దాఁచియుంచి నేనడిగినప్పుడిమ్మనితీక్ష్ణం బగునాఖడ్గంబునొసంగెను. అని, తాత్పర్యము.

స తచ్ఛస్త్ర మనుప్రాప్య న్యాసరక్షణతత్పరః. ౧౯
వనే తం విచరత్యేవ రక్షన్ ప్రత్యయ మాత్మనః

టీక॥సః=ఆమహర్షి ; తత్=ఆ ; శస్త్రం= ఆయుధమును ; అనుప్రాప్య=పొంది; న్యాసరక్షణతత్పరః= తనయొద్ద దాఁచనుంచఁబడినదాని రక్షించుటయందాసక్తుఁడై; ఆత్మనః= తనయొక్క; ప్రత్యయం=నమ్మకమునకుఁ గారణమయిన; తం=ఆఖడ్గమును; రక్షన్నేవ= రక్షించుచునే; వనే=అడవియందు; విచరతి=సంచరించుచున్నాఁడు.

ఆమునివరుండు, తనయొద్ద దాఁచనుంచినదానిరక్షించుట యందాసక్తుఁడై, తననమ్మకమును గాపాడుకొనుటకై యాఖడ్గము నేమఱక రక్షించుచునే యడవిం దిరుగుచుండెను.

అని, తాత్పర్యము.

యత్ర గచ్ఛత్యుపాదాతుం మూలానిచ ఫలానిచ. ౨౦
న వినా యాతి తం ఖడ్గం న్యాసరక్షణతత్పరః

టీక॥న్యాసరక్షణతత్పరః=తనయొద్ద దాఁచనుంచఁబడిన దాని రక్షించుటయందాసక్తుఁడయినయాముని ; మూలానిచ=గడ్డలను, ఫలానిచ=పండ్లను; ఉపాదాతుం= సంగ్రహించుకొనుటకు; యత్ర=ఎచ్చటికి; గచ్ఛతి = పోవుచున్నాఁడో; తం=ఆ; ఖడ్గం వినా= కత్తినివిడిచి; నయాతి=పోఁడు.

అమ్మునివరుండు, తనయొద్ద దాఁచనుంచినదానిరక్షించుటకై, ఫలమూలంబులను సంగ్రహించుటకై యెచ్చటికిఁ బోయినను, ఆఖడ్గమునువిడిచి పోవఁడు. అని, తాత్పర్యము.

నిత్యం శస్త్రం పరివహన్ క్రమేణ స తపోధనః. ౨౧
చకార రౌద్రీం స్వాం బుద్ధిం త్యక్త్వా తపసి నిశ్చయమ్

టీక॥సః=ఆ;తపోధనః=ఋషి; నిత్యం=ఎల్లప్పుడును;శస్త్రం= ఆయుధమును;పరివహన్=ధరించుచు ; క్రమేణ=వరుసచేత;స్వాం=తనదైన ; తపసి=తపస్సునందు;నిశ్చయం= దార్ఢ్యరూపమయిన;బుద్ధిం=బుద్ధిని,త్యక్త్వా= విడిచి,రౌద్రీం=భయంకరమయిన బుద్ధి నిః;చకార=చేసెను.

ఆఋషి,యిట్లుఎల్లప్పుడునుఆయుధమునుధరించుటచేతఁ, దనతపస్సునువదలి, హింసారూపమయిన రౌద్రబుద్ధిం బొందెను. అని, తాత్పర్యము.

తత స్స రౌద్రే ఽ భిరతః ప్రమత్తో ఽ ధర్మకర్శితః. ౨౨
తస్య శస్త్రస్య సంవాసా జ్జగామ నరకం మునిః

టీక॥తతః=అంత;సః=ఆ; మునిః= ఋషి;తస్య=ఆ;శస్త్రస్య=ఆయుధము యొక్క;సంవాసాత్=సహవాసమువలన;రౌద్రే=రౌద్రవ్యసనమునందు; అభిరతః=ఆసక్తుఁడై;ప్రమత్తః= మదించినవాఁడై; అధర్మకర్శితః=అధర్మముచేఁబీడింపఁబడినవాఁడై;నరకం= నరకమును;జగామ=పొందెను.

అంత,నమ్మహర్షి, యాయాయుధసంసర్గమువలనఁ, బ్రాణిహింసారతుండై, యొడలుదెలియక యధర్మంబాచరించుచుండి,తుదకు , నరకంబునొందెను. అని, తాత్పర్యము.

ఏవ మేత త్పురా వృత్తం శస్త్రసంయోగకారణమ్. ౨౩

టీక॥ఏవం=ఇట్లు;ఏతత్=ఈ ; శస్త్రసంయోగకారణం=ఆయుధసంపర్కమే కారణముగాఁగలయధర్మ ప్రవర్తనము; పురా=మున్ను;వృత్తం= నడచినది.

ఇట్లు, మున్నుఆయుధసంపర్కంబున,నమ్మునివరునకు, అధర్మబుద్ధిగలిగి,నాశముగలిగినది.

అని,తాత్పర్యము.

అగ్నిసంయోగవ ద్ధేతు శ్శస్త్రసంయోగ ఉచ్యతే

టీక॥అగ్నిసంయోగవత్ = నిప్పుతోటిసంబంధమువలె; శస్త్రసంయోగః= ఆయుధసంబంధము; హేతుః= వికారమునకుఁగారణముగా; ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

ఆయుధసంసర్గము, అగ్నిసంపర్కమువంటిదని పెద్దలుచెప్పెదరు.

అని, తాత్పర్యము.

స్నేహాచ్చ బహుమానాచ్చ స్మారయే త్వాం నశిక్షయే. ౨౮

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; స్నేహాచ్చ=స్నేహమువలనను; బహుమానాచ్చ= గౌరవమువలనను; త్వాం=నిన్ను; స్మారయే= జ్ఞాపకపఱచెదను. నశిక్షయే=శిక్షింపను.

నేనునీయందలిస్నేహంబునను, నీవునాయందుంచియుండు గౌరవంబునను, నీకుఁదెలిసినధర్మము నేజ్ఞాపక పఱచుచున్నానుగాని, శిక్షించుటకుఁ జెప్పలేదు. అని, తాత్పర్యము.

న కథంచన సా కార్యా గృహీతధనుషా త్వయా
బుద్ధి ర్వైరం వినా హంతుం రాక్షసాన్ దండకాశ్రితాన్. ౨౯

టీక॥గృహీతధనుషా=పట్టుకొనఁబడినధనుస్సుగల; త్వయా = నీచేత; వైరంవినా = వైరములేక; దండకాశ్రితాన్ = దండకారణ్యమునుబొందిన; రాక్షసాన్=రాక్షసులను ; హంతుం= చంపుటకు; సా=ఆ; బుద్ధిః=రౌద్రబుద్ధి ; కథంచన = ఎట్లయినను; నకార్యా=చేయఁదగినదికాదు.

నీవుధనుర్ధరుండవయి , నిరపరాధులగు దండకారణ్యమునందుండు రాక్షసులనెట్లయినను, వధింపవలదు.

అని, తాత్పర్యము.

అపరాధం వినా హంతుం లోకాన్ వీర నకామయే

టీక॥వీర=పరాక్రమశాలివగు రాముఁడా! లోకాన్=జనులను; అపరాధంవినా=అపరాధములేక; హంతుం= చంపుటకు; నకామయే=కోరను.

పరాక్రమశాలివగురాముఁడా! అపరాధములేక , వ్యర్థముగాఁ ప్రాణులంజంప, నాకిష్టములేదు.

అని, తాత్పర్యము.

స ౯

క్షత్రియాణాంతు వీరాణాం వనేషు నిరతాత్మనామ్. ౨౬
ధనుషా కార్య మేతావ దార్తానాం త్వభిరక్షణమ్

టీక॥వీరాణాం= పరాక్రమశాలులగు; క్షత్రియాణాం=క్షత్రియులకు; ఆర్తానాం=ఆపన్నులగు; వనేషు=అడవులయందు; నిరతాత్మనాం=ఆసక్తమయినమనస్సుగలఋషులయొక్క; అభిరక్షణం=రక్షించుట; ఏతావత్తు = ఇంతమాత్రమె; ధనుషా=ధనుస్సుచేత;కార్యం=చేయఁదగినది.

వీరులగు,క్షత్రియులకు, తమ యెదుట రాక్షసులచేఁ బీడింపఁ బడుచున్న ఋషులనురక్షించుటయె, ధనుస్సుతోఁ జేయవలసినపని; రాక్షసుల నందఱను హింసించుటగాదు.అని, తాత్పర్యము.

క్వచ శస్త్రం క్వచవనం క్వచక్షాత్రం తపః క్వచ. ౨౭
వ్యావిద్ధ మిద మస్మాభి ర్దేశధర్మస్తు పూజ్యతామ్

టీక॥ శస్త్రంచ = ఆయుధమును; క్వ= ఎచ్చట? వనంచ = అడవియు; క్వ=ఎచ్చట? క్షాత్రంచ = క్షత్రియధర్మమును; క్వ=ఎచ్చట? తపశ్చ=తపస్సును; క్వ=ఎచ్చట? ఇదం=ఇది; వ్యావిద్ధం=పరస్పరవిరుద్ధమయినది. అస్మాభిః=మనచేత; దేశధర్మస్తు = దేశధర్మముమాత్రము; పూజ్యతాం=పూజింపఁబడుఁగాక.

ఆయుధమెచ్చట? అరణ్యవాసమెచ్చట? క్షత్రియధర్మమెచ్చట? తపంబెచ్చట? ఇవన్నియుఁబరస్పరవిరుద్ధములు, కాఁబట్టి, మనము , ఈయరణ్యప్రదేశమునందుఁజేయఁ దగినతపస్సనెడుధర్మమునె చేయుదము.అని, తాత్పర్యము.

తదార్య కలుషా బుద్ధి ర్జాయతే శస్త్రసేవనాత్. ౨౮
పునర్గత్వా త్వయోధ్యాయాం క్షత్రధర్మం చరిష్యసి

టీక॥ ఆర్య= పూజ్యుండవగు రాముఁడా! తత్ = అందువలన; శస్త్రసేవనాత్ =ఆయుధధారణమువలన ; కలుషా=పాపిష్ఠమయిన ; బుద్ధిః=రో

ప్రబుద్ధి జాయతే = పుట్టుచున్నది. వనిః=మఱల ; గత్వాతు = పోయిమాత్రము;అయోధ్యాయాం= అయోధ్యాపురమునందు; క్షత్రధర్మం= క్షత్రియధర్మమును;చరిష్యసి=ఆచరింపఁగలవు

పూజ్యుండవగు రాముఁడా! అట్లగుటవలన, శస్త్రధారణముచేఁబాపబుద్ధి గలుగునుగాన, దానివదలితపంబు గావింతమ ;మఱలనయోధ్యకుఁబోయి యచ్చట క్షత్రియధర్మంబునాచరింప వచ్చును.అని, తాత్పర్యము.

అక్షయా తు భవే త్ప్రీతి శ్శ్వశ్రూ శ్శ్వశురయో ర్మమ. ౨౯
యది రాజ్యం పరిత్యజ్య భవే స్త్వం నిరతో మునిః

టీక॥ త్వం=నీవు;రాజ్యం= రాజ్యమును;పరిత్యజ్య=విడిచి;నిరతః= ఆసక్తుఁడవైన;మునిః=ఋషివి ; భవేద్యది=అగుదువేని;మమ=నాయొక్క; శ్వశ్రూ శ్వశురయోః = అత్తమామలకు;అక్షయా=నాశములేని; ప్రీతిస్తు= సంతోషమును;భవేత్ =అగును.

నీవింక నెప్పటికిని రాజ్యమే యక్కఱలేదనిముని వైయెయున్నచో , నాకైకేయీదశరధుల కక్షయంబగు సంతోషంబునుంగలుగును.

అని, తాత్పర్యము.

ధర్మా దర్థః ప్రభవతి ధర్మా త్ప్రభవతే సుఖమ్. ౩౦
ధర్మేణ లభతే సర్వం ధర్మసార మిదం జగత్

టీక॥ ధర్మాత్ =ధర్మమువలన; అర్థః=ధనము;ప్రభవతి = పుట్టుచున్నది.ధర్మాత్ =ధర్మమువలన;సుఖం=సుఖము;ప్రభవతే=కలుగుచున్నది; ధర్మేణ=ధర్మముచేత;సర్వం=అన్నింటిని; లభతే=పొందుచున్నాఁడు.ఇదం=ఈ; జగత్= ప్రపంచము;ధర్మసారం = ధర్మమెసారముగాఁగలది.

ధర్మమువలనధనముగలుగును; ధర్మమువలనసుఖంబునుంగలుగును; అట్లుధర్మంబువలననె సర్వంబునుం గలుగును ; కావునఁ బ్రపంచమునకంతయుధర్మమెముఖ్యము.

అని, తాత్పర్యము.

సర్గ

ఆత్మానం నియమై స్తైస్తైః కర్శయిత్వా ప్రయత్నతః. ౩౧
ప్రాప్యతే నిపుణైః ధర్మో న సుఖా ల్లభ్యతే సుఖమ్

టీక॥ నిపుణైః = సమర్థులచేత ; ఆత్మానం=శరీరమును ; తైస్తైః = ఆయా; నియమైః=వ్రతములచేత;ప్రయత్నతః = ప్రయత్నముచేత; కర్శయిత్వా=కృశింపఁజేసి; ధర్మః = ధర్మము; ప్రాప్యతే= పొందఁబడుచున్నది. సుఖాత్ =సుఖమువలన; సుఖం= సుఖము; నలభ్యతే=పొందఁబడదు.

సమర్థులగువారలు , నానావిధప్రయత్నములచేఁ జాంద్రాయణాదివ్రతంబుల దేహంబుఁగృశింపఁజేసి, ధర్మమునుబొందెదరు; ఎన్నటికినిసుఖంబునసుఖంబుదొరకొనదు. అని, తాత్పము.

నిత్యం శుచిమతి స్సౌమ్య చర ధర్మం తపోవనే. ౩౨
సర్వం హి విదితం తుభ్యం త్రైలోక్య మపి తత్త్వతః

టీక॥ సౌమ్య= శాంతుండవగు రాముఁడా!నిత్యం=ఎల్లప్పుడును; శుచిమతిః= పరిశుద్ధమయినబుద్ధిగలవాఁడవై; తపోవనే=తపోవనమునందు; ధర్మం= ధర్మమును;చర = ఆచరింపుము.తుభ్యం=నీకొఱకు;తత్త్వతః= యాథార్థ్యముచేత;సర్వం=అంతయు ; త్రైలోక్యమపి=ముల్లోకములును ; విదితంహి= తెలిసినదిగదా.

శాంతుండవగు రాముఁడా ! అట్లు కావునఁ , దపోవనంబుననుండిధర్మంబునాచరింపుము ; ముల్లోకంబులయందును,నీకుఁదెలియనిదేదియులేదు.

అని, తాత్పర్యము.

స్త్రీచాపలా దేత దుదాహృతం మే
ధర్మంచ వక్తుం తవ క స్సమర్థః. ౩౩
విచార్య బుద్ధ్యాతు సహానుజేన
య ద్రోచతే త త్కురు మాచిరేణ

టీక॥ఏతత్ =ఇది; మే(మయా)=నాచేత;స్త్రీచాపలాత్ = స్త్రీకిఁగలచాంచల్యమువలన;ఉదాహృతం - చెప్పఁబడినది.తవచ=నీకును;ధర్మం=ధర్మ

ముని; వక్తుం=చెప్పుటకు; కః = ఎవ్వఁడు; సమర్థః=సమర్థుఁడు? అనుజేనసహ=తమ్మునితోఁగూడ; బుద్ధ్యా= బుద్ధిచేత; విచార్యతు = ఆలోచించియు; యత్=ఏది; రోచతే = రుచించుచున్నదో; తత్=దాని; మాచిరేణ= శీఘ్రముగా; కురు=చేయుము.

నేను స్త్రీచాపలంబుననీమాటం జెప్పినాను; నీకుఁగూడధర్మంబుపదేశింపనెవ్వఁడుసమర్థుండు? నీవు, లక్ష్మణునితోఁగూడఁ, జక్కఁగానాలోచించి, నీకేదియిష్టమో దాని శీఘ్రముగాఁగావింపుము. అని, సీతాదేవిరామునకుంజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే, నవమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండనవమసర్గటీక,
ముగిసినది.

శ్రీ.

దశమసర్గప్రారంభః.

వాక్య మేత త్తు వైదేహ్యా వ్యాహృతం భర్తృభక్తయా
శ్రుత్వా ధర్మే స్థితో రామః ప్రత్యువాచాథ మైథిలీమ్. ౧

టీక॥ ధర్మే= ధర్మమునందు; స్థితః=ఉన్న; రామః= రాముఁడు; భర్తృభక్తయా= పెనిమిటియందుభక్తిగల; వైదేహ్యా = సీతాదేవిచేత; వ్యాహృతం=చెప్పఁబడిన; ఏతత్=ఈ; వాక్యం=మాటను; శ్రుత్వాతు= విన్నంతనె; అథ=అంత; మైథిలీం= సీతను గూర్చి; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

ధార్మికుండగు రాముండు, పెనిమిటియందధికభక్తిగల సీతాదేవి చెప్పిన మాటనువిని, యాబిడంజూచి యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

స ౧౦

హిత ముక్తం త్వయా దేవి స్నిగ్ధయా సదృశం వచః
కులం వ్యపదిశంత్యాచ ధర్మజ్ఞే జనకాత్మజే. ౨

టీక॥ధర్మజ్ఞే= ధర్మముఁదెలిసిన దానవు; జనకాత్మజే=జనకమహారాజుకొమార్తెవునగు; దేవి = సీతాదేవీ! స్నిగ్ధయా= స్నేహముగలదానవును;కులం=వంశమును;వ్యపదిశంత్యాచ= ప్రసిద్ధము సేయుదానవునగు;త్వయా= నీచేత;హితం=మేలు సేయునదియు;సదృశం=సమానమునగు;వచః=మాట;ఉక్తం=చెప్పఁబడినది.

ధర్మజ్ఞురాలవు జనక మహారాజుకొమార్తెవునగుసీతా! నీకునాయందుంగల స్నేహమునకును నీకులంబునకును,దగునట్లు,హితంబగు, మాటంజెప్పితివి. అని,తాత్పర్యము.

కిన్ను వక్ష్యామ్యహం దేవి త్వయైవోక్త మిదం వచః
క్షత్రియై ర్ధార్యతే చాపో నార్తశబ్దో భవేదితి. ౩

టీక॥దేవి=సీతాదేవీ! అహం= నేను; కిన్నువక్ష్యామి = ఏమిచెప్పుదును? త్వయైవ=నీచేతనె;ఇదం=ఈ;వచః = మాట ; ఉక్తం=చెప్పఁబడినది;ఆర్తశబ్దః=ఆర్తధ్వని; నభవేదితి=కలుగఁగూడదని; క్షత్రియైః = క్షత్రియులచేత; చాపః=ధనుస్సు;ధార్యతే= ధరింపఁబడుచున్నది.

సీతాదేవీ! నేనేమిచెప్పవలయును? ఎవ్వరును,ఆర్తులుకాఁగూడదని,క్షత్రియులుధనుస్సు ధరింతురని, నీవె చెప్పితివి గదా! అని,తాత్పర్యము.

తే చార్తా దండకారణ్యే మునయ స్సంశితవ్రతాః
మాం సీతే స్వయ మాగమ్య శరణ్యా శ్శరణం గతాః. ౪

టీక॥ సీతే=సీతా!దండకారణ్యే= దండకారణ్యమునందు;సంశితవ్రతాః= తీక్ష్ణమయినవ్రతముగలవారలును; శరణ్యాః = శరణుపొందఁదగినవారలునగు; తే=ఆ;మునయశ్చ=మునులును; ఆర్తాః=పీడితులయి;స్వయం = తామె;ఆగమ్య=వచ్చి;మాం=నన్ను; శరణం=రక్షకునిఁగా; గతాః = పొంది

నారు.

సీతా ! తీక్ష్ణములగువ్రతములు సేయువారలును, శరణ్యులునగు, నాదండకారణ్యమునందలిమునులు, వారలై యేనాయొద్దకువచ్చి, శరణుచొచ్చినారు. అని, తాత్పర్యము.

వసంతో ధర్మనిరతా వనే మూలఫలాశనాః
న లభంతే సుఖం భీతా రాక్షసైః క్రూరకర్మభిః. ౫

టీక॥ధర్మనిరతాః= ధర్మమునందాసక్తులును; మూలఫలాశనాః=గడ్డలునుఫలములునే యాహారముగాఁగలవారలును; వనే=అడవియందు; వసంతః= వాసముసేయుచున్నవారలునగు మునులు; క్రూరకర్మభిః= క్రూరములయినకార్యములుగల; రాక్షసైః= రాక్షసులచేత, భీతాః=భయపడినవారలయి ; సుఖం=సుఖమును; నలభంతే=పొందరు.

ధర్మపరాయణులై వనంబున ఫలమూలంబులనాహారంబుగాఁ గొనుచునివాసముసేయుచుండుమునులు, క్రూరకర్ములగురాక్షసులకు భయపడి, సుఖంబునొందఁజాలకున్నారు.

అని, తాత్పర్యము,

కాలేకాలేచ నిరతా నియమైర్వివిధైర్వనే
భక్ష్యంతే రాక్షసైర్భీమైర్నరా మాంసోపజీవిభిః. ౬

టీక॥వనే=అడవియందు; కాలేకాలేచ=అన్యోన్యకాలమునందు; వివిధైః= నానావిధములయిన ; నియమైః=వ్రతములచేత; నిరతాః = ఆసక్తులగు; నరాః=మునులు; మాంసోపజీవిభిః = మాంసమునాశ్రయించి జీవించునట్టి ; భీమైః=భయంకరులయిన; రాక్షసైః= రాక్షసులచేత; భక్ష్యంతే= తినఁబడుచున్నారు.

మాంసాహారులగు భయంకరాకారులయినరాక్షసులు; అడవియందు, నానావిధవ్రతములుగావించుకొనుచుఁదపస్సుచేయుచుండుమునులను, బట్టిభక్షించుచున్నారు. అని, తాత్పర్యము.

తే భక్ష్యమాణా మునయో దండకారణ్యవాసినః

అస్మా నభ్యవపద్యేతి మా మూచు ర్ద్విజసత్తమాః. ౭

టీక॥ దండకారణ్యావాసినః= దండకారణ్యమునందుండునట్టి; ద్విజసత్తమాః=బ్రాహ్మణశ్రేష్ఠులగు; తే=ఆ; మునయః=మునులు; భక్ష్యమాణాః=భక్షింపఁబడుచున్నవారలయి; మాం=నన్నుఁగూర్చి; అస్మాన్ = మమ్ము; అభ్యవపద్య=అనుగ్రహింపుము. ఇతి= అని; ఊచుః= చెప్పిరి.

దండకారణ్యమునను౦డు, బ్రాహ్మణోత్తములయినయామునులు, అట్లు రాక్షసులచేభక్షింపఁబడుచు, బాధపడఁజాలక, నాయొద్దకువచ్చి, "మమ్మనుగ్రహింపుము" అని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

మయాతు వచనం శ్రుత్వా తేషా మేవమ్ముఖా చ్చ్యుతమ్
కృత్వా చరణశుశ్రూషాం వాక్య మేత దుదాహృతం. ౮

టీక॥ఏవం=ఇట్లు; తేషాం= వారలయొక్క; ముఖాత్=నోటివలన; చ్యుతం=జాఱిన; వచనం=మాటను; శ్రుత్వాతు=విన్నంతనే; మయా=నాచేత, చరణశుశ్రూషాం=పాదసేవను; కృత్వా=చేసి; ఏతత్=ఈ; వాక్యం= మాట; ఉదాహృతం=చెప్పఁబడినది.

నేను, వారలుచెప్పిన మాటను విని, వారలపాదంబులకువందనంబు గావించి, యీమాటంజెప్పినాను.

అని, తాత్పర్యము.

ప్రసీదంతు భవంతో మే హ్రీరేషా హి మమాతులా
యదీదృశై రహం విప్రై రుపస్థేయై రుపస్థితః. ౯

టీక॥ భవంతః=మీరలు; మే= నాకొఱకు; ప్రసీదంతు= ప్రసన్నులగుదురుగాక. అహం=నేను; ఈదృశైః= ఇట్టి; ఉపస్థేయైః=ఉపాసింపఁదగిన; విప్రైః = బ్రాహ్మణులచేత; ఉపస్థితః(ఇతి)యత్= పొందఁబడినాననునది యేదిగలదో; ఏషా=ఇది; మమ=నాకు; అతులా=సరిలేని, హ్రీహి = సిగ్గుగదా!

మీరలు నాయపచారమును క్షమిం

పుఁడు; నేనుమీయొద్దకువచ్చి సేవసేయవలసియుండఁగా, నట్టిమహనీయులరగు మీరలునాయొద్దకువచ్చి ప్రార్థించుచున్నారనునదినాకుమిక్కిలియుసిగ్గుగానున్నది. అని, తాత్పర్యము.

కింకరో౽మీతి చ మయా వ్యాహృతం ద్విజసన్నిధౌ

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; కిం= దేనిని; కరోమి = చేయుదును? ఇతిచ= అనియు; మయా= నాచేత; ద్విజసన్నిధౌ= బ్రాహ్మణులసన్నిధానమునందు; వ్యాహృతం = చెప్పఁబడినది.

నేనేమిసేయవలయును? చెప్పుఁడు. అని, యామునులయెదుట నేనుజెప్పినాను. అని, తాత్పర్యము.

సర్వై రేతై స్సమాగమ్య వాగియం సముదాహృతా. ౧౦

టీక॥ ఏతైః= ఈమునులచేత ; సర్వైః= అందఱిచేతను ; సమాగమ్య= చేరి; ఇయం= ఈ; వాక్ = మాట; సముదాహృతా= చెప్పఁబడినది.

అంత , నామునులందఱును జేరి , యీమాటంజెప్పిరి.

అని, తాత్పర్యము.

రాక్షసై ర్దండకారణ్యే బహుభిః కామరూపిభిః
అర్దితా స్స్మ దృఢం రామ భవా న్న స్తత్ర రక్షతు. ౧౧

టీక॥ రామ= రాముఁడా ! వయం (అధ్యాహృతము)= మేము; దండకారణ్యే= దండకారణ్యమునందు; కామరూపిభిః= ఇచ్ఛాధీనమగురూపముగల ; బహుభిః= పెక్కండ్రయిన; రాక్షసైః= రాక్షసులచేత; దృఢం= మిక్కిలియు; అర్దితాః= పీడింపఁబడినవారలము ; స్మ(స్మః)= అగుచున్నాము. భవాన్= నీవు; తత్ర= ఆవిషయమునందు; నః= మమ్ము; రక్షతు= కాపాడుము.

రాముఁడా! దండకారణ్యంబునఁ, గామరూపులగు రాక్షసులు పెక్కండ్రు

వచ్చి, మమ్ముఁజాల బాధించుచున్నారు;నీవుమమ్ము రక్షింపుము.

అని, తాత్పర్యము.

హోమకాలేషు సంప్రాప్తాః పర్వకాలేషు చానఘ
ధర్షయంతి సుదుర్ధర్షా రాక్షసాః పిశితాశనాః. ౧౨

టీక॥అనఘ= పాపరహితుండవగు రామఁడా! సుదుర్ధర్షాః=ఎదిరింపనలవిగానివారలును; పిశితాశనాః = మాంసమె యాహారముగాఁగలవారలునగు;రాక్షసాః=రాక్షసులు; హోమకాలేషు= హోమసమయములందును; పర్వకాలేషు = దర్శపౌర్ణమాసాదికాలముల యందును ; సంప్రాప్తాః=వచ్చినవారలయి ; ధర్షయంతి=బెదరించుచున్నారు.

పాపరహితుండవగు రామఁడా! దుర్ధర్షులును మాంసాశనులు నగు నారాక్షసులు, హోమ సమయంబుల యందునుదర్శపౌర్ణమాసాది యాగ సమయములయందును వచ్చి, యాగంబులంజెఱచి, మమ్ము బెదరించెదరు.

అని, తాత్పర్యము.

రాక్షసై ర్ధర్షితానాంచ తాపసానాం తపస్వినామ్
గతిం మృగయమాణానాం భవా న్నః పరమా గతిః. ౧౩

టీక॥ రాక్షసైః=రాక్షసులచేత ; ధర్షితానాం = పీడింపఁబడినవారలమును; తపస్వినాం= కరుణింపఁదగినవారలమును; గతిం=రక్షకుని; మృగయమాణానాం = వెదకుచున్నవారలమునగు; నః=మాకు; భవాన్=నీవు ; పరమా=శ్రేష్ఠమయిన;గతిః=గతివి.

రాక్షసులచేనానావిధములుగ బాధింపఁబడుచున్నవారలము శోచనీయులముదిక్కులేనివారలమునగు, మాకు, నీవెపరమగతివి. అని, తాత్పర్యము.

కామం తపఃప్రభావేన శక్తాహంతుం నిశాచరాన్
చిరార్జితంతు నేచ్ఛామ స్తపః ఖండయితుం వయమ్. ౧౪




టీక॥ వయం=మేము; తపఃప్రభావేన = తపోమహిమచేత ; నిశాచరాన్=రాక్షసులను,హంతుం = చంపుటకు;శక్తాఃకామం= సమర్థులమే. తు=అయితే;చిరార్జితం = బహుకాలముగాసంపాదింపఁబడిన; తపః= తపస్సును;ఖండయితుం = నశింపఁజేయుటకు,నేచ్ఛామః=కోరము.

మేము , తపోమహిమచేరాక్షసులంజంపఁగలము,వాస్తవమె ; అయితే, బహుకాలముగాఁగష్టపడిసంపాదించినతపస్సునశించునేయని యూరకున్నాము. అని, తాత్పర్యము.

బహువిఘ్నం తపో నిత్యం దుశ్చరం చైవ రాఘవ
తేన శాపం నముంచామో భక్ష్యమాణాశ్చ రాక్షసైః. ౧౫

టీక॥రాఘవ=రాముఁడా! తపః= తపస్సు; నిత్యం=ఎల్లప్పుడును; బహువిఘ్నం=పెక్కువిఘ్నములుగలది. దుశ్చరంచైవ=చేయనలవిగానిదియు. తేన= అందుచేత;రాక్షసైః=రాక్షసులచేత; భక్ష్యమాణాశ్చ= భక్షింపఁబడుచున్నవారలమయ్యు;శాపం= శాపమును;నముంచామః=విడువకున్నాము.

రాముఁడా!తపస్సుసేయుట మిక్కిలియుఁగష్టము;దానికివేయివిఘ్నములు; అందువలన,నింతకష్టపడి చేసినతపస్సుధారపోయంజాలక, రాక్షసులు భక్షించినను,వారలశపింపకున్నాము. అని, తాత్పర్యము.

తదర్ద్యమానాన్రక్షోభి ర్దండకారణ్యవాసిభిః
రక్షనస్త్వం సహభ్రాత్రా త్వన్నాథాహి వయం వనే. ౧౬

టీక॥తత్=అందువలన; భ్రాత్రా సహ=తమ్మునితోఁగూడ ; దండకారణ్యవాసిభిః=దండకారణ్యమునందుండునట్టి; రక్షోభిః=రాక్షసులచేత;అర్ద్యమానాన్=పీడింపఁబడుచున్న; నః = మమ్ము;రక్ష=కాపాడుము. వయం= మేము; వనే= అడవియందు; త్వన్నాథాహి=నీవెనాథుండవుగాఁగల వారలముగదా!

అందువలన, నీవు, లక్ష్మణుండును,




స ౧౦

అట్లు, దండకారణ్యవాసులచే(బీడింప(బడుచున్నమమ్ము రక్షింపు(డు; ఈయడవియందు, మాకుమీరేక దానాథులరు; మీరుదక్క(గ మఱియెవ్వరున్నారు? అని, ఋషులందఱునాతో(జెప్పినారు.

అని, తాత్పర్యము.

మయాచైత ద్వచ శ్శ్రుత్వా కార్త్స్న్యేన పరిపాలనమ్
ఋషీణాం దండకారణ్యే సంశ్రుతం జనకాత్మజే. ౧౭

టీక॥ జనకాత్మజే= జనకమహారాజుకొమారితెవగుసీతా! మయాచ= నాచేతను;ఏతత్=ఈ,వచః= మాటను;శ్రుత్వా=విని;దండకారణ్యే = దండకారణ్యమునందు;ఋషీణాం= ఋషులయొక్క;కార్త్స్న్యేన=సాకల్యముచేత;పరిపాలనం=పాలించుట ; సంశ్రుతం=ప్రతిజ్ఞచేయ(బడినది.

జనకమహారాజుకొమారితెవగు సీతాదేవీ! నేను,ఆఋషులమాటనువిని , దండకారణ్యంబునందలిఋషులను, అన్నివిధంబులనురక్షించెదనని, ప్రతిజ్ఞగావించినాను. అని, తాత్పర్యము.

సంశ్రుత్యచ నశక్ష్యామి జీవమానః ప్రతిశ్రవమ్
మునీనా మన్యథాకర్తుం సత్య మిష్టం హి మే సదా. ౧౮

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను;సంశ్రుత్యచ = ప్రతిజ్ఞచేసియు; జీవమానః = బ్రతికియున్నవాడనై; మునీనాం = మునులయొక్క, మునులకు(గా(జేయబడినయనుట ; ప్రతిశ్రవం=ప్రతిజ్ఞను;అన్యథాకర్తుం= వేఱువిధముగా(జేయుటకు;నశక్ష్యామి= చాలను. మే=నాకు; సదా = ఎల్లప్పుడు ; సత్యం = సత్యవచనము;ఇష్టం హి=ప్రియముగదా!

నేనుబ్రతిజ్ఞచేసియుయినవెనుక బ్రతికియుండు వఱకును , మునులకు(గా(జేసిన యీప్రతిజ్ఞ(దప్ప(జాలను ; నాకుసత్యము ,సర్వకాలావస్థలయందును బ్రియమని నీకుందెలియును గదా! అని, తాత్పర్యము.

అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్

నతు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః. ౧౯

టీక॥ సీతే=సీతా! అహం= నేను; జీవితమపి=ప్రాణమునైనను ; సలక్ష్మణాం=లక్ష్మణునితోఁగూడిన ; త్వాం వా=నిన్నుఁగాని;జహ్యాం= విడుతును. సంశ్రుత్య=ప్రతిజ్ఞ చేసి; ప్రతిజ్ఞాంతు= ప్రతిజ్ఞనుమాత్రము;నజహ్యాంతు=విడువను.విశేషతః=విశేషించి ; బ్రాహ్మణేభ్యః=బ్రాహ్మణులకొఱకు ; సంశ్రుత్య తాంనజహ్యాంతు = ప్రతిజ్ఞ చేసియా ప్రతిజ్ఞనుయెంతమాత్రమువిడువను.

సీతాదేవీ! నేనునాప్రాణమునుగా నినిన్నుఁగానిలక్ష్మణునిగానివిడుతును;ఎవ్వనికేనిప్రతిజ్ఞ చేసి యాప్రతిజ్ఞనుమాత్రమువిడువను ; అందునువిశేషించి, బ్రాహ్మణులకుఁగావించినప్రతినను, ఎంతమాత్రమువిడువను.

అని, తాత్పర్యము.

త దవశ్యం మయా కార్య మృషీణాం పరిపాలనమ్

అను క్తేనాపి వై దేహి ప్రతిజ్ఞాయతు కిం పునః. ౨౦

టీక॥వైదేహి=సీతాదేవీ! తత్= అందువలన;అవశ్యం=అవశ్యము; అనుక్తేనాపి=చెప్పఁబడకున్నను; మయా= నాచేత;ఋషీణాం=ఋషులయొక్క; పరిపాలనం=పాలించుట;కార్యం=చేయఁదగినది. ప్రతిజ్ఞాయతు=పతినచేసియు;కింపునః (వక్తవ్యం)= చెప్పవలయునాయేమి?

సీతాదేవీ!అందువలన, ఋషులన న్నడుగకపోయినను, నేనవశ్యము వారలఁబరిపాలింపవలసినది; అట్లుండఁగా, వారలునన్నుఁబ్రార్థించి , నేనురక్షించెదనని ప్రతిజ్ఞ చేసియుండఁగాఁ, జెప్పవలసినదేమియున్నది?

అని, తాత్పర్యము.

మమ స్నేహాచ్చ సౌహార్దా దిద ముక్తం త్వయాఽనఘే

పరితుష్టో స్మ్యహం సీతే న హ్యనిష్టోనుశిష్యతే. ౨౧

టీక॥అనఘే=పాపములేని; సీతే=సీతా!మమ = నావిషయమయి; స్నేహాచ్చ= చెలిమివలనను; సౌహార్దాత్ = మంచిమనస్సుగలుగుటవలనను; త్వయా=నీచేత; ఇదం=ఈమాట; ఉక్తం=చెప్పఁబడినది. అహం=నేను, పరితుష్టః=సంతోషించినవాఁడను; అస్మి=అగుచున్నాను. అనిష్టః= ప్రియుఁడుగానివాఁడు; నానుశిష్యతేహి= ఉపదేశింపఁబడఁడుగదా!

పాపరహితవగు సీతాదేవీ! నీవు నాయందలిస్నేహంబువలనను సౌహార్దంబువలనను, ఈమాటం జెప్పినావు; నాకుమిక్కిలియుసంతోషంబు గలిగినది; అందఱుఁబ్రియుఁడైనవాని కుపదేశింతురుగాని, యప్రియున కుప దేశింపరుగదా! అని, తాత్పర్యము.

సదృశం చాను రూపంచ కులస్య తవ చాత్మనః
సధర్మచారిణీ మే త్వం ప్రాణేభ్యోపి గరీయసీ. ౨౨

టీక॥ ఇదం(అధ్యాహృతము)=ఈమాట; తవ=నీయొక్క; కులస్య= కులమునకు; సదృశం=సరియయినది. ఆత్మనశ్చ = మనసునకును; అనురూపం చ = సరియయినదియు. సధర్మచారిణీ=కూడధర్మమునాచరించుదానవగు; త్వం=నీవు; మే=నాకు ; ప్రాణేభ్యోపి=ప్రాణంబులకన్నను ; గరీయసీ=అధికురాలవు.

నీమాట,నీకులంబునకును నీమనంబునకునుఅనురూపముగానున్నది; నీవునాకుప్రాణంబులకన్న నధికురాలవు.అని, రాముండు,సీతతోఁజెప్పెను.

అని,తాత్పర్యము.

ఇత్యేవ ముక్త్వా వచనం మహాత్మా
సీతాం ప్రియాం మైథిలరాజపుత్రీమ్
రామో ధనుష్మాన్ సహలక్ష్మణేన
జగామ రమ్యాణి తపోవనాని. ౨౩

టీక॥మహాత్మా= అధికమయినధైర్యముగలవాఁడును; ధనుష్మాన్= ధనుర్ధరుండునగు; రామః=రాముండు ; మైథిలరాజపుత్రీం = జనకమహారాజు

కౌసల్యాతేః=యును; ప్రియాం=ప్రియురాలునగు; సీతాం= సీతనుగూర్చి; ఇతి=అని; ఏవం=ఇట్లు; వచనం=మాటను; ఉక్త్వా=చెప్పి; లక్ష్మణేనసహ=లక్ష్మణునితోఁగూడ ; రమ్యాణి= రమణీయములయిన; తపోవనాని= తపోవనములను; జగామ= పోయెను.

మహాత్ముఁడగు రాముఁడు , జనకమహారాజు కౌసల్యాతేఃయును ప్రియురాలునగు సీతాదేవికిట్లుప్రకారమునంజెప్పి, ధనుర్ధరుండై, లక్ష్మణునితోఁగూడ, రమణీయంబులగుతపోవనంబులకుఁబోయెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే , దశమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండదశమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

ఏకాదశసర్గప్రారంభః.

అగ్రతః ప్రయయౌ రామ స్సీతా మధ్యే సుమధ్యమా
పృష్ఠతస్తు ధనుష్పాణి ర్లక్ష్మణోను జగామహ. ౧

టీక॥ రామః=రాముఁడు ; అగ్రతః=ముందట; ప్రయయౌ= పోయెను. సుమధ్యమా = మంచినడుముగల; సీతా=సీతాదేవి; మధ్యే=నడుమ; ప్రయయౌ=పోయెను. పృష్ఠతస్తు = వెనుకమాత్రము; లక్ష్మణః = లక్ష్మణుఁడు; ధనుష్పాణిః=విల్లుచేతంగలవాఁడై; అనుజగామ = వెంబడించెను("హ"అనునది పాదపూరణార్థము).

రాముఁడు , ముందటంబోయెను; సీతాదేవినడుమనడచెను; అటువెనుక, లక్ష్మణుండుధనుర్ధరుండై, వెంబడించెను. అని,తాత్పర్యము.

స ౧౧

తౌ పశ్యమానౌ వివిధాన్ శైలప్రస్థాన్ వనానిచ
నదీశ్చ వివిధా రమ్యా జగ్మతు స్సీతయాసహ. ౨
సారసాం శ్చక్రవాకాంశ్చ నదీపులినచారిణః
సరాంసిచ సపద్మాని యుక్తాని జలజైః ఖగైః. ౩
యూథబద్ధాంశ్చ పృషతాన్ మదోన్మత్తాన్ విషాణినః
మహిషాంశ్చ వరాహాంశ్చ నాగాంశ్చ ద్రుమవైరిణః

టీక॥తౌ=ఆరామలక్ష్మణులు; వివిధాన్=నానావిధములయిన ; శైలప్రస్థాన్=పర్వతంబులచఱియలను; వనానిచ=అడవులను;వివిధాః= నానావిధములును;రమ్యాః=రమణీయములునగు; నదీశ్చ=ఏఱులను;నదీపులినచారిణః=ఏటియొకయిసుకదిబ్బలయందుఁ, దిరుగుచున్న;సారసాంశ్చ =హంసపక్షులను;చక్రవాకాంశ్చ = చక్రవాకపక్షులను;సపద్మాని=కమలములతోఁ గూడినవియు;జలజైః=నీటఁబుట్టిన;ఖగైః = పక్షులతో;యుక్తాని=కూడినవియునగు : సరాంసి= కొలంకులను ; యూథబద్ధాన్=గుంపుగాఁగట్టుకొనియున్న; పృషతాంశ్చ=జింకలను; మదోన్మత్తాన్=మదముచేమిక్కిలియు మదించినవియు; విషాణినః=కొమ్ములుగలవియునగు;మహిషాన్=ఎనుపోతులను ; వరాహాంశ్చ= అడవిపందులను;ద్రుమవైరిణః= వృక్షములకుశత్రువులగు; నాగాంశ్చ= ఏనుంగులను;పశ్యమానౌ= చూచుచు; సీతయాసహ = సీతతోఁగూడ; జగ్మతుః=పోయిరి.

ఆరామలక్ష్మణులు, నానావిధపర్వతసానువులను వనంబులను నానావిధంబులును రమణీయంబులునగు నేఱులను నదులయిసుకదిబ్బలపైఁ దిరుగుచున్న హంసపక్షులను జక్రవాకంబులను, నానావిధజలపక్షులతోఁ గూడిన తామర కొలంకులను , గుంపులుగుంపులుగాఁ గట్టియుండుజింకలను, మత్తములగు నెనుపోతులను వరాహంబులను వృక్షంబులన్నియు విఱుచునట్టి యేనుంగులనుంజూచుచు, సీతతోఁగూడఁ బోయిరి. అని, తాత్పర్యము.

తే గత్వా దూర మధ్వానం లంబమానే దివాకరే

దదృశు స్సహితా రమ్యం తటాకం యోజనాయతమ్. ౫
పద్మపుష్కరసంబాధం గజయూథై రలంకృతమ్
సారసై ర్హంసకాదంబై స్సంకులం జలచారిభిః. ౬

టీక॥ తే= ఆసీతారామలక్ష్మణులు; సహితాః=కూడినవారలయి; దూరం=దూరమయిన; అధ్వానం = మార్గమును; గత్వా=పొంది; దివాకరే= సూర్యుఁడు; లంబమానే = వంగుచుండఁగా; రమ్యం = సుందరమయినదియు; యోజనాయతం= ఆమడప్రమాణమువైశాల్యముగలదియు ; పద్మపుష్కరసంబాధం= ఎఱ్ఱనితామరపూలచేతను దెల్లనితామరపూలచేతను నిండినదియు; గజయూథైః = ఏనుంగులసమూహములచేత; అలంకృతం= అలంకరింపఁబడినదియు; జలచారిభిః = నీటందిరుగునట్టి; సారసైః = బెగ్గురుపక్షులచేతను; హంసకాదంబైః = రాజహంసలచేతనుకలహంసలచేతను; సంకులం=నిండినదియునగు ; తటాకం= కొలనును; దదృశుః=చూచిరి.

ఆసీతారామలక్ష్మణులు , అట్లుబహుదూరముపోయి , సూర్యుండస్తమింపఁబోవుసమయంబున, రమణీయంబును , నాలుగుక్రోసులనుయోజనప్రమాణవైశాల్యముగలదియునెఱ్ఱదామరలచేతను దెల్లదామరలచేతనునిండియుండునదియు , తీరప్రదేశంబులగజయూథంబులతోఁ గూడినదియు మధురంబుగాఁగూయుసారసపక్షులతోను రాజహంసలతోనుగలహంసలతోనుఒప్పుచున్నదియునగు , నొకతటాకముంజూచిరి. అని,తాత్పర్యము.

ప్రసన్న సలిలే రమ్యే తస్మిన్ సరసి శుశ్రువే
గీతవాదిత్రనిర్ఘోషో నతు కశ్చన దృశ్యతే. ౭

టీక॥ప్రసన్నసలిలే= నిర్మలమయినజలముగల; రమ్యే= రమణీయమగు; తస్మిన్=ఆ; సరసి=కొలనునందు; గీతవాదిత్రనిర్ఘోషః = పాటలయొక్కయు వాద్యములయొక్కయుధ్వని ; శుశ్రువే=వినఁబడినది. కశ్చనతు= ఒకానొకండును; నదృశ్యతే=చూడఁబడఁడు.

నిర్మలజలముగలరమణీయమయిన

యాకొలంకునుండి, గీతవాద్యధ్వనివినఁబడుచుండినది; అందొకండును గానంబడఁడయ్యెను. అని, తాత్పర్యము.

తతః కౌతూహలా ద్రామో లక్ష్మణశ్చ మహాబలః
మునిం ధర్మభృతన్నామ ప్రష్టుం సముపచక్రమే. ౮

టీ॥తతః=అంత; కౌతూహలాత్=కౌతుకమువలన; రామః= రాముఁడును; మహాబలః= అధికమయినబలముగల; లక్ష్మణశ్చ = లక్ష్మణుండును ; ధర్మభృతన్నామ = ధర్మభృత్తనుపేరుగల, మునిం=ఋషిని; ప్రష్టుం= అడుగుటకు ; సముపచక్రమే = ఆరంభించిరి.

అంత, రాముండును, మహాబలుండగులక్ష్మణుండును, కౌతుకంబునంజేసి, యాతటాకంబునుగుఱించి, ధర్మభృత్తనుమునినడిగిరి.

అని, తాత్పర్యము.

ఇద మత్యద్భుతం శ్రుత్వా సర్వేషాం నో మహామునే
కౌతూహలం మహజ్జాతం కి మిదం సాధు కథ్యతామ్. ౯

టీక॥మహామునే=పూజ్యుఁడవయిన మునివరుధర్మభృత్తా! అత్యద్భుతం=అత్యాశ్చర్యకరమయిన ; ఇదం=దీనిని; శ్రుత్వా=విని; నః= మాకు ; సర్వేషాం=అందఱకును;మహత్ = అధికమయిన, కౌతూహలం=వేడుక; జాతం=కలిగినది. ఇదం=ఇది; కిం=ఏమి; సాధు=లెస్సగా; కథ్యతాం=చెప్పఁబడుఁగాక.

ధర్మభృత్తా ! అత్యాశ్చర్యకరంబగునీగీతవాద్యధ్వనినివిని, మాకందఱకునుదీనిసంగతినివినవేడుకగలిగియున్నది; ఇదియేమి? దీనిసంగతిం జక్కఁగాఁజెప్పుము. అని, తాత్పర్యము.

వక్తవ్యం యదిచే ద్విప్ర నాతిగుహ్య మపి ప్రభో

టీక॥ప్రభో=ప్రభుండవగు; విప్ర= బ్రాహ్మణుండవయినధర్మభృత్తా! నా

తిగుహ్యమపి యదిచేత్=మిక్కిలియురహస్యముగాకుండునేని, వక్తవ్యం=చెప్పఁబడవలయును.

పరిఘుండవగుధర్మభృత్తా! ఇది, చెప్పఁగూడనంత యతిరహస్యము గాకుండునేని, చెప్పుము. అని, రామలక్ష్మణులు, ధర్మభృత్తునడిగిరి.

అని, తాత్పర్యము.

తేనైవ ముక్తో ధర్మాత్మా రాఘవేణ మునిస్తదా. ౧౦
ప్రభవం సరసః కృత్స్న మాఖ్యాతు ముపచక్రమే

టీక॥ ధర్మాత్మా= ధర్మబుద్ధిగలః; మునిః = ధర్మభృత్తనుముని; తదా=అప్పుడు; తేన=ఆ ; రాఘవేణ= రామునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తః= చెప్పఁబడినవాఁడై, సరసః= కొలనుయొక్క, ప్రభవం=పుట్టుకను; కృత్స్నం= అంతయు; ఆఖ్యాతుం=చెప్పుటకు; ఉపచక్రమే=ఆరంభించెను.

ధర్మాత్ముండగుధర్మభృత్తు రాముండు చెప్పినమాటనువిని, ఆసరస్సు పుట్టినవిధమంతయుఁ జెప్పనారంభించెను.

అని, తాత్పర్యము.

ఇదం పంచాప్సరో నామ తటాకం సార్వకాలికమ్. ౧౧
నిర్మితం తపసా రామ మునినా మాండకర్ణినా

టీక॥ రామ=రాముఁడా! ఇదం = ఈ; తటాకం=కొలను ; పంచాప్సరోనామ=పంచాప్సరస్సను పేరుగలది. సార్వకాలికం= సర్వకాలమునందునుండునది. మాండకర్ణినా=మాండకర్ణియను; మునినా = ఋషిచేత ; తపసా=తపస్సుచేత; నిర్మితం=నిర్మింపఁబడినది.

రాముఁడా! ఈతటాకము, పంచాప్సరస్సని పేరుగలది; ఇది యెల్లప్పుడును, ఇట్లు గీతవాద్యధ్వనితో నొప్పుచుండును; ఇది, మాండకర్ణియనుమహాముని చేఁ దపోబలంబుననిర్మితంబయ్యె.

అని, తాత్పర్యము.

స హి తేపే తపస్తీవ్రం మాండకర్ణి ర్మహామునిః. ౧౨
దశవర్షసహస్రాణి వాయుభక్షో జలాశ్రయః

టీక॥ సః = ఆ; మాండకర్ణిః = మాండకర్ణియను;మహాముని= పూజ్యుఁడైనముని; దశవర్షసహస్రాణి= పదిసంవత్సరములవేలు ; వాయు భక్షః=వాయువె యాహారముగాఁ గలవాఁడై; జలాశ్రయః = జలమెస్థానము గాఁగలవాఁడై; తీవ్రం=తీక్ష్ణమయిన;తపః=తపస్సును; తేపేహి = చేసెను గదా!

ఆమాండకర్ణిమహాముని , పదివేలసంవత్సరములు, వాయువె యాహారంబుగా జలంబుననుండి,తీవ్రంబగు తపంబుగావించెను.

అని, తాత్పర్యము.

తతః ప్రవ్యథితా స్సర్వే దేవా స్సాగ్నిపురోగమాః. ౧౩
అబ్రువ న్వచనం సర్వే పరస్పరసమాగతాః

టీక॥ తతః=అంత; సాగ్నిపురోగమాః = అగ్నియనుముందునడచువానితోఁగూడిన ; దేవాః = దేవతలు;సర్వే=అందఱును; ప్రవ్యథితాః= దుఃఖితులయి; పరస్పరసమాగతాః= ఒండొరులతోఁగూడినవారలయి ; సర్వే=అందఱును;వచనం= మాటను; అబ్రువన్=చెప్పిరి.

అంత , అగ్నిహోత్రుండుమున్నుగాసమస్తదేవతలును, బరమదుఃఖితులయి , యొండొరులంగూడి , యిట్లని , చెప్పుకొనిరి.

అని, తాత్పర్యము.

అస్మాకం కస్యచి త్స్థాన మేవ ప్రార్థయతే మునిః. ౧౪

టీక॥ ఏషః=ఈ;మునిః=ఋషి; అస్మాకం=మనలో;కస్యచిత్ = ఒకానొకనియొక్క;స్థానం = పదమును;ప్రార్థయతే=కోరుచున్నాఁడు.

ఈమాండకర్ణిమహాముని , మనలోనొకని స్థానమును బొందఁగోరుచున్నాఁడు.అని , దేవతలుపరస్పరముచెప్పుకొనిరి. అని, తాత్పర్యము.

ఇతి సంవిగ్నమనస స్సర్వే తే త్రిదివౌకసః

టీక॥ తే=ఆ; త్రిదివౌకసః = దేవతలు; సర్వే=అందఱును; ఇతి = ఇట్లు; సంవిగ్నమనసః = భయమునొందిన మనస్సుగలవారలు; అభవన్ (అధ్యాహృతము)=అయిరి.

ఆ దేవతలందఱు, ఇట్లు, ఒండొరులతోఁ జెప్పుకొని, మిక్కిలియు భయముఁజెందిరి. అని, తాత్పర్యము.

తత్ర కర్తుం తపోవిఘ్నం దేవై స్సర్వై ర్నియోజితాః. ౧౫
ప్రధానాప్సరసః పంచ విద్యుచ్చలితవర్చసః

టీక॥ దేవైః=దేవతలచేత; సర్వైః= అందఱిచేతను; తత్ర=ఆయనయందు; తపోవిఘ్నం = తపోవిఘ్నమును; కర్తుం=చేయుటకు; విద్యుచ్చలితవర్చసః= మెఱపులువలెఁ దళుకుకొను కాంతిగల; ప్రధానాప్సరసః= ముఖ్యలయినయప్సరసలు; పంచ=అయిదుగురు; నియోజితాః=పంపఁబడినారు.

అప్పుడు, దేవతలందఱును, మెఱపులుంబోలెఁ దళుకుతళుకుకొను దేహకాంతిగలయుత్తమలయినయయిదుగురప్సరస్త్రీలనమ్మాండకర్ణికిఁదపోవిఘ్నంబుసేయ నియోగించిరి.

అని, తాత్పర్యము.

అప్సరోభి స్తత స్తాభి ర్ముని ర్దృష్టపరావరః. ౧౬
నీతో మదనవశ్యత్వం సురాణాం కార్యసిద్ధయే

టీక॥ తతః=అంత; తాభిః=ఆ; అప్సరోభిః=అప్సరసలచేత; సురాణాం= దేవతలయొక్క; కార్యసిద్ధయే = పనియీడేఱుటకొఱకు; దృష్టపరావరః= చూడఁబడినమంచిచెడులుగల; మునిః= ముని; మదనవశ్యత్వం= మన్మథాధీనతను; నీతః=పొందింపఁబడినాఁడు.

అంత, నాయప్సరసలు, దేవకార్యసిద్ధ్యర్థమయి, యమ్మాండకర్ణిని, మన్మథాధీనుంగావించిరి.

అని, తాత్పర్యము.

తా శ్చైవా ప్సరసః పంచ మునేః పత్నీత్వ మాగతాః. ౧౭

టీక॥ తాః=ఆ;అప్సరసః= అప్సరసలు;పంచచైవ=అయిదుగురును;మునేః= మాండకర్ణిమహామునియొక్క;పత్నీత్వం=భార్యాత్వమును;ఆగతాః=పొందిరి.

ఆయప్సరసలయిదుగురును , అమ్మాండకర్ణిమహామునికి, భార్యలయిరి. అని, తాత్పర్యము.

తటాకే నిర్మితం తాసా మస్మి న్నంతర్హితం గృహమ్

టీక॥అస్మిన్=ఈ;తటాకే=సరస్సునందు; తాసాం=ఆయప్సరసలకు ;గృహం=ఇల్లు; అంతర్హితం= మఱుఁగుపడినదిగా; నిర్మితం = నిర్మింపఁబడినది.

ఈతటాకములోన; ఆయప్సరసలకుగృహంబు , అంతర్హితంబుగానిర్మింపఁబడినది.అని, తాత్పర్యము.

తథైవా ప్సరసః పంచ నివసంత్యో యథాసుఖమ్. ౧౮
రమయంతి తపోయోగా న్మునిం యౌవన మాస్థితమ్

టీక॥ తథైవ=అట్లె; అప్సరసః=అప్సరసలు;పంచ = అయిదుగురును; యథాసుఖం= సుఖమునతిక్రమింపక; తపోయోగాత్ = తపోబలమువలన; యౌవనం=యౌవనమును ; ఆస్థితం=అవలంబించిన;మునిం=మునిని;రమయంతి=రమింపఁజేయుచున్నారు.

అట్లు, ఆయయిదుగు రప్సరసలును , ఈతటాకాంతర్గృహంబులసుఖంబుగానివసించుచుఁ, దపోబలంబునయౌవనరూపంబు దాల్చియున్న యమ్మాండకర్ణికి, సంతోషంబుసేయుచున్నారు. అని, తాత్పర్యము.

తాసాం సంక్రీడ మానానా మేష వాదిత్రనిస్స్వనః. ౧౯
శ్రూయతే భూషణో న్మిశ్రో గీతశబ్దో మనోహరః

టీక ॥ తాసాం = ఆయప్సరసలు; సంక్రీడమానానాం= క్రీడింపుచుండఁగా; మనోహరః=మధురమును;భూషణోన్మిశ్రః= భూషణధ్వనితోఁగలసిన




దియునగు; ఏషః = ఈ; వాదిత్రనిస్స్వనః = వాద్యధ్వనియు; గీతశబ్దః = పాటలధ్వనియు; శ్రూయతే = వినఁబడుచున్నది.

అప్సరస్త్రీలుక్రీడింపుచుండుటవలన, మనోహరంబును భూషణధ్వని మిశ్రంబునగు నీగీతవాద్య ధ్వని వినఁబడుచున్నది. అనిధర్మభృత్తు, రామలక్ష్మణులకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఆశ్చర్య మితి తస్యైతద్వచనం భావితాత్మనః. ౨౦
రాఘవః ప్రతిజగ్రాహ సహభ్రాత్రా మహాయశాః

టీక॥ మహాయశాః = అధికమయిన కీర్తిగల; రాఘవః = రాముఁడు; భ్రాత్రాసహ = తమ్మునితోఁ గూడ; భావితాత్మనః = ధ్యానింపఁబడిన యాత్మగల; తస్య = ఆధర్మభృత్తుయొక్క; ఏతత్ = ఈ; వచనం = మాటను; ఆశ్చర్యమితి = ఆశ్చర్యమని; ప్రతిజగ్రాహ = గ్రహించెను.

మహాయశుండగు రాముండును, లక్ష్మణుండును, బరమాత్మవేత్త యగు నాధర్మభృత్తుచెప్పినమాటనువిని, మిక్కిలియు నాశ్చర్యపడిరి.

అని, తాత్పర్యము.

ఏవం కథయమానస్య దదర్శాశ్రమమండలమ్. ౨౧
కుశచీరపరిక్షిప్తం బ్రాహ్మ్యా లక్ష్మ్యా సమావృతమ్

టీక॥ ఏవం = ఇట్లు; కథయమానస్య = చెప్పుచుండఁగా; రామః (అధ్యాహృతము) = రాముఁడు; కుశచీరపరిక్షిప్తం = దర్భలచేతను నారచీరలచేతను వ్యాపింపఁబడినదియు; బ్రాహ్మ్యా = బ్రాహ్మణసంబంధియగు; లక్ష్మ్యా = కాంతిచేత; సమావృతం = చుట్టఁబడినదియునగు; ఆశ్రమమండలం = ఆశ్రమసమూహమును; దదర్శ = చూచెను.

ఇట్లాధర్మభృత్తుచెప్పుచుండఁగానే, రాముండు, దర్భలతోను నారచీరలతోనుఒప్పుచున్నదియు బ్రాహ్మణసమృద్ధంబునగు నాశ్రమసమూహముం జూచెను. అని, తాత్పర్యము.

ప్రవిశ్య సహ వైదేహ్యా లక్ష్మణేనచ రాఘవః. ౨౨




ఉవాస మునిభి స్సర్వైః పూజ్యమానో మహాయశాః

టీక॥మహాయశాః = అధికమయిన కీర్తిగలఃరాఘవః=రాముఁడు; వైదేహ్యా=సీతతోను;లక్ష్మణేనసహ=లక్ష్మణునితోనుంగూడ;ప్రవిశ్య= ప్రవేశించి;మునిభిః=మునులచేత;సర్వైః= అందఱిచేతను;పూజ్యమానః= పూజింపఁబడుచు;ఉవాస=ఉండెను.

మహాయశుండగు రాముండు,సీతాలక్ష్మణసహితుండై యయ్యాశ్రమంబులం బ్రవేశించి,సమస్తమునుల చేతనుం బూజితుండై,సుఖంబుననుండెను.

అని, తాత్పర్యము.

తదా తస్మిన్ స కాకుత్స్థ శ్శ్రీమ త్యాశ్రమమండలే. ౨౩
ఉషిత్వాతు సుఖం తత్ర పూజ్యమానో మహర్షిభిః
జగామ చాశ్రమాం స్తేషాం పర్యాయేణ తపస్వినామ్. ౨౪
యేషా ముషితవాన్ పూర్వం సకాశే స మహాస్త్రవిత్

టీక॥తదా=అట్లు;సః=ఆ;కాకుత్స్థః=రాముఁడు;తస్మిన్=ఆ;శ్రీమతి=అధికమయినకాంతిగల;ఆశ్రమమండలే= ఆశ్రమసమూహమునందు;సుఖం = సుఖముగా;ఉషిత్వాతు=నివసించియు; తత్ర=అచ్చట;మహర్షిభిః=మహర్షులచేత;పూజ్యమానః = పూజింపఁబడుచున్నవాఁడై;మహాస్త్రవిత్ = గొప్పయస్త్రములఁదెలిసిన;సః= ఆరాముఁడు;పూర్వం=మున్ను;యేషాం = ఎవ్వరియొక్క;సకాశే = సమీపమునందు;ఉషితవాన్ = ఉండినాఁడో; తేషాం=ఆ;తపస్వినాం= ఋషులయొక్క;ఆశ్రమాన్ = ఆశ్రమములను;పర్యాయేణచ= రెండవపర్యాయమునను;జగామ=పొందెను.

మహాస్త్రవేత్తయగు రాముండు, శ్రీమంతంబగు నయ్యాస్త్రమమండలంబున , మహర్షులచేఁబూజింపఁబడుచు, సుఖంబుననుండి , రాక్షసబాధఁ బోఁగొట్టుటకై, యొక్కొకమహర్షియాశ్రమమునకును రెండేసిమాఱులు , పోయి,వాసంబుగావించెను.

అని, తాత్పర్యము.

క్వచి త్పరిదశా న్మాసా నేకం సంవత్సరం క్వచిత్. ౨౫

క్వచిచ్చ చతురో మాసాన్ పంచ షట్చాపరాన్ క్వచిత్
అపరత్రాధికం మాసా దప్యర్థమధికం క్వచిత్. ౨౨
త్రీ న్మాసా నష్టమాసాంశ్చ రాఘవో న్యవస త్సుఖమ్

టీక॥ రాఘవః = రాముఁడు; క్వచిత్ = ఒకానొకచోట; పరిదశాన్ = చుట్టినపదియయినట్టి; మాసాన్ = మాసములను, పదుమూఁడు మాసములననుట; క్వచిత్ = ఒకానొకచోట; ఏకం = ఒకటియైన; సంవత్సరం = సంవత్సరమును; క్వచిత్ = ఒకానొకచోట; చతురః = నాలుగయిన; మాసాంశ్చ = మాసములను; క్వచిత్ = ఒకానొకచోట; పంచ = అయిదు మాసములను; షట్చ = ఆఱుమాసములను; అపరాన్ = ఏడుమాసములను; అపరత్ర = మఱియొకచోట ; మాసాత్ = మాసమునకన్న; అధికం = అధికముగాను; క్వచిత్ = ఒకానొకచోట; అధికం = అధికమయిన; అర్ధమపి = అర్ధమాసమును; క్వచిత్ (అధ్యాహృతము) = ఒకానొకచోట; త్రీన్ = మూఁడైన ; మాసాన్ = మాసములను ; అష్టమాసాంశ్చ = ఎనిమిదిమాసములను; సుఖం = సుఖముగా; న్యవసత్ = నివసించెను.

రాముండొకయాశ్రమంబునఁ బదుమూఁడుమాసంబులును ఒకయాశ్రమంబున నొకసంవత్సరంబును, ఒకచోట, నాలుగుమాసంబులును , ఒకచోటనైదుమాసంబులును, నొక యాశ్రమంబుననాఱుమాసంబులును, ఒకయాశ్రమంబుననేడుమాసంబులును, ఒకచోటనొకటియుఁ బాతికమాసంబునుమఱియొకచోట ముప్పాతికమాసంబును వొకచోటమూఁడు మాసంబులును , మఱియొకయాశ్రమంబున, నెనిమిదిమాసంబులును, సుఖంబుగా, నివసింపుచుండెను. అని, తాత్పర్యము.

తథా సంవసత స్తస్య మునీనా మాశ్రమేషు వై. ౨౩
రమత శ్చానుకూల్యేన యయు స్సంవత్సరా దశ

టీక॥ తథా = అట్లు; తస్య = ఆరాముఁడు; మునీనాం = మునులయొకరి; ఆశ్రమేషు = ఆశ్రమములయందు; ("వై" అనునది పాదపూరణార్థము;) సంవస

తః=వాసము సేయుచుండఁగా ; అనుకూల్యేన=ఆనుకూల్యముచేత; రమతః=క్రీడింపుచుండఁగా; దశ = పది; సంవత్సరాః=సంవత్సరములు; యయుః = పోయినవి.

అట్లు, ఆ రాముండు, ఆమునుల ప్రతియాశ్రమమునందును, రెండేసిమాలుఁగువాసము సేయుచు, సంతోషంబునంగ్రీడింపుచుండఁగాఁ , బది సంవత్సరములయినవి. అని, తాత్పర్యము.

పరిసృత్యచ ధర్మజ్ఞో రాఘవ స్సహ సీతయా. ౪౮
సుతీక్ష్ణస్యాశ్రమం శ్రీమాన్ పున రేవా జగామ హ

టీక॥ ధర్మజ్ఞః= ధర్మముదెలిసినవాఁడును ; శ్రీమాన్=అధికమయినకాంతిగలవాఁడునగు ; రాఘవః=రాముఁడు;సీతయాసహ = సీతతోఁగూడ; పరిసృత్యచ=తిరిగియు; పునరేవ=మఱల;సుతీక్ష్ణస్య = సుతీక్ష్ణమహాముని యొక్క;ఆశ్రమం=ఆశ్రమమును; ఆజగామ= పొందెను ("హ" అనునది పాదపూరణార్థము).

ధర్మవేత్తయు శ్రీమంతుండునగు రాముండు, సీతతోఁగూడ , నయ్యాశ్రమంబులన్నియుఁదిరిగి, మఱల , సుతీక్ష్ణమహామునియాశ్రమంబునకువచ్చెను.
అని, తాత్పర్యము.

స త మాశ్రమ మాసాద్య మునిభిః ప్రతిపూజితః. ౪౯
తత్రాపి న్యవసద్రామః కంచిత్కాల మరిందమః

టీక॥ సః=ఆ;అరిందమః= శత్రువులనడఁగద్రొక్కునట్టి; రామః = రాముఁడు ; తం=ఆ;ఆశ్రమం= ఆశ్రమమును;ఆసాద్య=పొంది;మునిభిః= మునులచేత;ప్రతిపూజితః = పూజింపఁబడినవాఁడై;తత్రాపి = అచ్చటను;కంచిత్=కొంత;కాలం=కాలమును;న్యవసత్ =ఉండెను.

శత్రువులనడంగఁ ద్రొక్కఁజాలినట్టియారాముండు , ఆసుతీక్ష్ణమహామునియాశ్రమంబునకువచ్చి , మునులచేఁబూజితుండై , యచ్చటనుగొంతకాలమునివసించెను. అని, తాత్పర్యము.

అథాశ్రమస్థో వినయా త్కదాచి త్తం మహామునిమ్. ౩౦
ఉపాసీన స్స కాకుత్స్థ స్సుతీక్ష్ణ మిదమబ్రవీత్

టీక॥ అథ=అంత; ఆశ్రమస్థః = ఆశ్రమముననుండిన; సః=ఆ; కాకుత్స్థః= రాముఁడు; కదాచిత్ = ఒకానొకప్పుడు; ఉపాసీనః= కూర్చుండినవాఁడై; వినయాత్=వినయమువలన ; తం= ఆ; మహామునిం= పూజ్యుఁడైనమునియగు; సుతీక్ష్ణం=సుతీక్ష్ణునిగూర్చి; ఇదం= ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, రాముండు, అయ్యాశ్రమంబుననుండి, యొకానొకప్పుడు , వినయంబున , నాసుతీక్ష్ణమహామునింజూచి, యిట్లని , చెప్పెను.

అని, తాత్పర్యము.

అస్మి న్నరణ్యే భగవా నగస్త్యో మునిస త్తమః. ౩౧
వసతీతి మయా నిత్యం కథాః కథయతాం శ్రుతమ్

టీక॥అస్మిన్=ఈ, అరణ్యే= అడవియందు; భగవాన్= మాహాత్మ్యముగలు; మునిసత్తమః=మునిశ్రేష్ఠుండగు; అగస్త్యః=అగస్త్యుఁడు; వసతీతి=ఉన్నాఁడని; మయా=నాచేత; నిత్యం= ఎల్లప్పుడును; కథాః=మాటలను; కథయతాం (కథయద్భ్యః)= చెప్పుచుండువారివలన; శ్రుతం=వినఁబడినది.

ఈయరణ్యమునందె, భగవంతుండగునగస్త్యుండున్నాఁడని, వారువారుచెప్పుకొనుమాటలవలన, విన్నాను.

అని, తాత్పర్యము.

న తు జానామి తం దేశం వనస్యాస్య మహ త్తయా. ౩౨

టీక॥అస్య=ఈ; వనస్య= అడవియొక్క; మహత్తయా=గొప్పతనముచేత; తం దేశంతు=ఆప్రదేశమునుమాత్రము; నజానామి=ఎఱుంగను.

ఈవనంబు, మిక్కిలియుగొప్పదిగావున, ఆప్రదేశమేదోనాకుఁ దెలియదు.

అని, తాత్పర్యము.

కుత్రాశ్రమ మిదం పుణ్యం మహర్షే స్తస్య ధీమతః

టీక॥ధీమతః=బుద్ధిమంతుండగు; తస్య=ఆ;మహర్షేః= అగస్త్యమహర్షి యొక్క ;పుణ్యం=పవిత్రమయిన;ఇదం=ఈ;ఆశ్రమపదం= ఆశ్రమస్థానము;కుత్ర=ఎచ్చట?

బుద్ధిమంతుండగు నాయగస్త్యమహర్షియాశ్రమమెచ్చటనున్నది?

అని, తాత్పర్యము.

ప్రసాదా త్తత్ర భవత స్సానుజ స్సహ సీతయా. ౩౩
అగస్త్య మభిగచ్ఛేయ మభివాదయితుం మునిమ్

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను;భవతః = నీయొక్క;ప్రసాదాత్=అనుగ్రహమువలన;సానుజః= తమ్మునితోఁగూడినవాఁడనై ; సీతయాసహ=సీతతోఁగూడ;అగస్త్యం = అగస్త్యుఁడను;మునిం = మునిని;అభివాదయితుం=నమస్కరించుటకు;తత్ర= అచ్చటికి;అభిగచ్ఛేయం=పోవలయును.

నీవనుగ్రహించి, యాయగస్త్యాశ్రమంబుండుప్రదేశముం జెప్పితివేని , నేను,సీతాలక్ష్మణులతోఁగూడ. నాయగస్త్యమహామునికివందనంబు గావించుటకై,యచ్చటికిఁబోయెదను.

అని, తాత్పర్యము.

మనోరథో మహా నేష హృది మే పరివర్తతే. ౩౪
యద్వ్యహం తం మునివరం శుశ్రూషేయ మపి స్వయమ్

టీక॥అహం=నేను;స్వయం=నేనే; తం=ఆ;మునివరం= మునిశ్రేష్ఠుండగు నగస్త్యుని;అపిశుశ్రూషేయం యది=సేవింతునేని;సమ్యక్ స్యాత్ (అధ్యాహృతము)=చక్కఁగానుండును . ఏషః= ఈ;మహాన్=గొప్పదగు; మనోరథః= కోర్కి ; మే=నాయొక్క;హృది= మనస్సునందు;సంపరివర్తతే = తిరుగుడు పడుచున్నది.

ఆయగస్త్యమహామునికిశుశ్రూషసేయవలయునని,నామనంబున, పెద్దకోరికయున్నది . అని, రాముండు,సుతీక్ష్ణమహామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి రామస్య స మునిశ్శ్రుత్వా ధర్మాత్మనో వచః. ౩౫

సుతీక్ష్ణః ప్రత్యువాచేదం ప్రీతో దశరథాత్మజమ్

టీక॥ సః=ఆ; సుతీక్ష్ణః = సుతీక్ష్ణుఁడను; మునిః=ఋషి; ఇతి=ఇట్లు; ధర్మాత్మనః=ధర్మబుద్ధిగల; రామస్య=రామునియొక్క; వచః = మాటను; శ్రుత్వా=విని; ప్రీతః=సంతసించినవాఁడై; దశరథాత్మజం=దశరథమహారాజుకొడుకైనరామునిగూర్చి; ఇదం = ఈ మాటను; ప్రత్యువాచ = బదులుచెప్పెను.

సుతీక్ష్ణమహాముని, ధర్మాత్ముండగు రాముండు చెప్పినమాటనువిని, సంతుష్టుండై, రాముంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అహ మప్యేతదేవ త్వాం వక్తుకామ స్సలక్ష్మణమ్. ౩౮
అగస్త్య మభిగచ్ఛేతి సీతయా సహ రాఘవ

టీక॥ రాఘవ= రాముఁడా! అహమపి= నేనును; "సీతయాసహ=సీతతోఁగూడ; అగస్త్యం= అగస్త్యమహామునిని; అభిగచ్ఛ=పొందుము" ఇతి = అని; ఏతదేవ= ఈమాటనే ; సలక్ష్మణం= లక్ష్మణునితోఁగూడిన; త్వాం= నిన్నుఁగూర్చి; వక్తుకామః = చెప్పఁగోరినవాఁడను.

రాముఁడా నేనును, " సీతతోఁగూడ నగస్త్యమహామునియొద్దకుఁ బొండని యెనీకును లక్ష్మణునకును జెప్పవలెనని తలంచియుంటిని. అని, తాత్పర్యము.

దిష్ట్యా త్విదానీ మర్థేస్మిన్ స్వయమేవ బ్రవీషి మామ్. ౩౯
అహ మాఖ్యామి తే వత్స యత్రాగస్త్యో మహామునిః

టీక॥ దిష్ట్యా = భాగ్యముచేతనె ; ఇదానీం=ఇప్పుడు; అస్మిన్= ఈ ; అర్థే= విషయమునందు; స్వయమేవ= నీవే; మాం=నన్నుఁగూర్చి; బ్రవీషి= చెప్పుచున్నావు; అడుగుచున్నావనుట. వత్స=బిడ్డఁడవగు రాముఁడా! యత్ర= ఎచ్చట; మహామునిః = పూజ్యుఁడయిన మునియగు; అగస్త్యః=అగస్త్యుఁడు; అస్తి(అధ్యాహృతము) = ఉన్నాఁడో; తం(అధ్యాహృతము) = ఆప్రదేశము

ను; తే=నీకొఱకు;అహం=నేను; ఆఖ్యామి=చెప్పుచున్నాను.

భాగ్యవశంబుననీవెయిప్పుడునన్నడిగితివి;కాబట్టి,అగస్త్యమహాముని యొుండుప్రదేశమును,నీకుంజెప్పెదనువినుము. అని, తాత్పర్యము.

యోజనా న్యాశ్రమా దస్మా త్తథా చత్వారి వై తతః. ౩౮
దక్షిణేన మహాన్ శ్రీమా నగస్త్య భ్రాతు రాశ్రమః

టీక॥అస్మాత్=ఈ;ఆశ్రమాత్=ఆశ్రమంబుననుండి;దక్షిణేన = దక్షిణపువైపున;చత్వారి=నాలుగయిన ("వై" అనునది పాదపూరణార్థము); యోజనాని=ఆమడలు;గంతవ్యాని ( అధ్యాహృతము ) = పొందఁబడ వలయును . తతః = అంత;మహాన్ = గొప్పదియు; శ్రీమాన్ = అధికమయిన కాంతిగలదియునగు; అగస్త్యభ్రాతుః=అగస్త్యునితమ్మునియొక్క; ఆశ్రమః=ఆశ్రమము; అస్తి (అధ్యాహృతము)=ఉన్నది.

ఇచ్చటనుండి , దక్షిణపుదిక్కువైపున , నాలుగామడల దూరము పోయినవెనుక,నచ్చట,అగస్త్యునితమ్ముండగుసుదర్శనమహాముని యాశ్రమంబున్నది. అని, తాత్పర్యము.

స్థలప్రాయే వనోద్దేశే పిప్పలీవనశోభితే. ౩౯
బహుపుష్పఫలే రమ్యే నానాశకునినాదితే

టీక॥ సః (అధ్యాహృతము)= ఆ యాశ్రమము;బహుపుష్పఫలే= అధికమయినపూలునుబండ్లునుగలదియు; రమ్యే=రమణీయంబును ; నానాశకునినాదితే= నానావిధపక్షులచేతధ్వనింపఁజేయఁబడినదియు ; పిప్పలీవనశోభితే = పిప్పలీవనముచేఁబ్రకాశించుచున్నదియు;స్థలప్రాయే= తఱుచుగా మెట్టభూమియయినదియునగు ; వనోద్దేశే=వనప్రదేశమునందు; వర్తతే (అధ్యాహృతము)=ఉన్నది.

ఆయాశ్రమము , పెక్కుపుష్పములునుఫలములునుగలదియు, రమణీయంబును , మధురంబుగాఁగూయుచుండు

నానావిధపక్షులుగలదియుఁ బిప్పలీవనశోభితంబునగు స్థలప్రాయవనప్రదేశంబుననున్నది. అని, తాత్పర్యము.

పద్మిన్యో వివిధా స్తత్ర ప్రసన్నసలిలా శ్శివాః. ౪౦
హంసకారండవాకీర్ణా శ్చక్రవాకోపశోభితాః

టీక॥ తత్ర=అచ్చట; వివిధాః= నానావిధములయినవియు ; ప్రసన్నసలిలాః=నిర్మలములయినజలములు గలవియు; శివాః = మంగళకరములయినవియు; హంసకారండవాకీర్ణాః= హంసలచేతనునీరుకోళ్ల చేతనువ్యాపింపఁబడినవియు; చక్రవాకోపశోభితాః=చక్రవాకములచేఁ బ్రకాశించుచున్నవియునగు; పద్మిన్యః=తామరకొలంకులు; సంతి(అధ్యాహృతము)=ఉన్నవి.

అచ్చట, నిర్మలంబులగు జలంబులు గలవియు హంసలు నీరుకోళ్లు చక్రవాకంబులు మొదలగు పక్షులచే నొప్పుచున్నవియునగు నానావిధంబులయిన తామరకొలంకులు గలవు. అని, తాత్పర్యము.

తత్రైకాం రజనీం వ్యుష్య ప్రభాతే రామ గమ్యతామ్. ౪౧

టీక॥ రామ=రాముఁడా! తత్ర= ఆసుదర్శనాశ్రమమునందు; ఏకాం= ఒక్కటియున; రజనీం = రాత్రియంతయు; వ్యుష్య=ఉండి; ప్రభాతే = ప్రాతఃకాలమునందు; గమ్యతాం= పోవుటయగుఁగాక.

రాముఁడా! ఆసుదర్శనాశ్రమమునందు, ఒకరాత్రియుండి , ప్రాతఃకాలంబునఁబొమ్ము.

అని, తాత్పర్యము.

దక్షిణాం దిశ మాస్థాయ వనషండస్య పార్శ్వతః
తత్రాఽగస్త్యాశ్రమపదం గత్వా యోజన మంతరమ్. ౪౨

టీక॥ దక్షిణాం=దక్షిణపు; దిశం= దిక్కును; ఆస్థాయ=అవలంబించి; వనషండస్య= వనసమూహముయొక్క ; పార్శ్వతః=ప్రక్కను ; యోజనం = ఆమడయయిన; అంతరం= దూరమును; గత్వా=పొంది; తత్ర= అచ్చట ;

అగస్త్యాశ్రమపదం=అగస్త్యాశ్రమస్థానము.

అచ్చటనుండి, దక్షిణదిక్కుఁబట్టి, వనసమూహమునకుఁ బ్రక్కన, నొకామడదూరముపోయిన, నచ్చట నగస్త్యాశ్రమమున్నది. అని, తాత్పర్యము.

రమణీయే వనోద్దేశే బహుపాదపసంవృతే
రంస్యతే తత్ర వైదేహీ లక్ష్మణశ్చ సహ త్వయా. ౪౩

టీక॥తత్ర=ఆయగస్త్యాశ్రమమునందు;రమణీయే=మనోహరమును;బహుపాదపసంవృతే=పెక్కువృక్షములచేఁగప్పఁబడినదియునగు; వనోద్దేశే=వనప్రదేశమునందు; త్వయాసహ=నీతోఁగూడ;వైదేహీ=సీతాదేవియు;లక్ష్మణశ్చ=లక్ష్మణుండును; రంస్యతే (రంస్యతే)=క్రీడింపఁగలరు.

ఆయగస్త్యాశ్రమంబున,రమణీయంబును బెక్కువృక్షములతోఁగూడినదియునగువనంబునందు, నీవునుసీతయును లక్ష్మణుండునుగ్రీడింపుచుండఁగలరు. అని, తాత్పర్యము.

స హి రమ్యో వనోద్దేశో బహుపాదపసంకులః

టీక॥ బహుపాదపసంకులః=పెక్కు వృక్షములచే నిండిన ; సః=ఆ;వనోద్దేశః=వనప్రదేశము;రమ్యోహి=రమణీయముగదా!

ఆవనప్రదేశము , పెక్కు వృక్షములతోఁగూడి,రమణీయములయియుండును. అని, తాత్పర్యము.

యది బుద్ధిః కృతా ద్రష్టు మగస్త్యం తం మహామునిమ్
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహాయశః. ౪౪

టీక॥ మహాయశః=అధికమయినకీర్తిఁగలరాముఁడా ! మహామునిం=పూజ్యుఁడైనమునియగు;తం=ఆ;అగస్త్యం=అగస్త్యుని;ద్రష్టుం=చూచుటకు;బుద్ధిః=తలంపు ; కృతాయది=చేయఁబడినదగునేని;అద్యైవ= ఇప్పు

డే;గమనే=పోవుటయందు; బుద్ధిం=బుద్ధిని; రోచయస్వ=ఇచ్ఛింపుము.

మహాయశుండవగు రాముఁడా! ఆ యగస్త్యమహామునిం జూడఁ గోర్కెయుండు నేని, ఇప్పుడే యచ్చటికిబయలు దేఱిపొమ్ము. అని, సుతీక్ష్ణమహాముని, రామునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి రామో మునేశ్శ్రుత్వా సహభ్రాత్రా భివాద్య చ
ప్రతస్థే ఽ గస్త్య ముద్దిశ్య సానుజ స్సీతయా సహ. ౪౫

టీక॥ రామః=రాముఁడు; ఇతి=అని; మునేః=సుతీక్ష్ణమహామునివలన; శ్రుత్వా=విని; భ్రాత్రాసహ = తమ్మునితోఁగూడ; అభివాద్యచ= నమస్కరించియు; సానుజః = తమ్మునితోఁగూడినవాఁడై; సీతయాసహ=సీతతోఁగూడ; అగస్త్యముద్దిశ్య= అగస్త్యునిగూర్చి; ప్రతస్థే=బయలుదేఱెను.

రాముండు, సుతీక్ష్ణమహాముని చెప్పినమాటనువిని, లక్ష్మణునితోఁగూడనాయనకునమస్కరించి, యంతసీతాలక్ష్మణులంగూడి, యగస్త్యాశ్రమంబును గూర్చిపోయెను. అని, తాత్పర్యము.

పశ్య న్వనాని రమ్యాణి పర్వతాం శ్చాభ్రసన్నిభాన్
సరాంసి సరిత శ్చైవ పధి మార్గవశానుగాః. ౪౬
సుతీక్ష్ణే నోపదిష్టేన గత్వా తేన పధా సుఖమ్
ఇదం పరమసంహృష్టో వాక్యం లక్ష్మణ మబ్రవీత్. ౪౭

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; రమ్యాణి= రమణీయములగు; వనాని=అడవులను ; అభ్రసన్నిభాన్= మేఘములతోసమానములైన; పర్వతాంశ్చ=కొండలను; సరాంసి=సరస్సులను; మార్గవశానుగాః=మార్గవశముచే వెంబడింపఁబడుచున్న; సరితశ్చైవ=నదులను; పధి=మార్గమునందు; పశ్యన్=చూచుచు; సుతీక్ష్ణేన=సుతీక్ష్ణునిచేత; ఉపదిష్టేన=ఉపదేశింపఁబడిన; తేన=ఆ; పధా= మార్గముచేత; సుఖం=సుఖముగా, గత్వా=పోయి;

పరమసంహృష్టః=మిక్కిలియు సంతోషించినవాఁడై;లక్ష్మణం = లక్ష్మణుని గూర్చి;వాక్యం=మాటను;అబ్రవీత్ = చెప్పెను.

రాముండు,మార్గంబున నుండునట్టి,రమణీయంబులగువనంబులను , మేఘంబులవంటిపర్వతంబులను, కొలంకులను,నదులనుంజూచుచు, సుతీక్ష్ణమహామునిచెప్పిన మార్గంబుననె సుఖంబుగాఁబోయి,పరమసంతుష్టుండై , లక్ష్మణుంజూచి,యీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏతదేవా శ్రమపదం నూనం తస్య మహాత్మనః
అగస్త్యస్య మునే ర్భ్రాతు ర్దృశ్యతే పుణ్యకర్మణః. ౪౧

టీక॥ మహాత్మనః= పూజ్యమయిన స్వభావముగలవాఁడును ; పుణ్యకర్మణః= పుణ్యకర్మములుగలవాఁడును;అగస్త్యస్య=అగస్త్యుండను ; మునేః=మునియొక్క;భ్రాతుః= తమ్ముండునగు;తస్య = ఆసుదర్శనమునియొక్క;ఆశ్రమపదం = ఆశ్రమస్థానము; ఏతదేవ = ఇదియే నూనం = నిశ్చయము.

మహాత్ముండును బుణ్య కర్ముండును అగస్త్యమహాముని తమ్ముండునగు నాసుదర్శన మహాముని యాశ్రమంబిదే;ఇందుకుసందేహములేదు.

అని, తాత్పర్యము.

యథా హి మే వనస్యాస్య జ్ఞాతాః పథి సహస్రశః
సన్నతాః ఫలభారేణ పుష్పభారేణచ ద్రుమాః. ౪౨

టీక॥యథా=ఎట్లు; మే(మయా)=నాచేత;అస్య= ఈ;వనస్య=వనమునకు;చిహ్నం;శ్రుతం(అధ్యాహృతము)=గుఱుతుగావినఁబడినదో;తథా(అధ్యాహృతము)=అట్లు;ఫలభారేణ = పండ్లబరువుచేతను;పుష్పభారేణచ= పూలబరువుచేతను;సన్నతాః = వంగిన; ద్రుమాః=వృక్షములు;పథి= మార్గమునందు;సహస్రశః = వేనవేలుగా; జ్ఞాతాః= తెలియఁబడినవి.

సుతీక్ష్ణమహామునినాకుగుఱుతుచెప్పినట్లు, మార్గంబున,ఫలపుష్పభారంబు

న న్రమంబులయినపిప్పలీవృక్షంబులు, కనుపట్టుచున్నవి. అని, తాత్పర్యము.

పిప్పలీనాంచ పక్వానాం వనా దస్మా దుపాగతః
గంధోయం పవనోత్క్షిప్త స్సహసా కటుకోదయః. ౫౦

టీక॥అస్మాత్=ఈ; వనాత్=అడవినుండి; పక్వానాం= పండిన; పిప్పలీనాం=పిప్పలీఫలములయొక్క; కటుకోదయః= వగరురసముయొక్క అభివ్యక్తి గల, అయం=ఈ, గంధః=వాసన; పవనోత్క్షిప్తః=గాలిచేఁ గొట్టఁబడినదై; సహసా=వేగమున; ఉపాగతః= వచ్చినది.

మఱియునీవనంబుననుండి, చక్కఁగాఁ బండియుండుపిప్పలీ ఫలంబులు వగరు వాసనయు, గాలికిఁగొట్టుచున్నది. అని, తాత్పర్యము.

తత్ర తత్రచ దృశ్యంతే సంక్షిప్తాః కాష్ఠసంచయాః
లూనాశ్చ పథి దృశ్యంతే దర్భా వైడూర్యవర్చసః. ౫౧

టీక॥తత్రతత్ర=అచ్చటచ్చట; సంక్షిప్తాః=సంగ్రహింపఁబడిన; కాష్ఠసంచయాశ్చ=కట్టెలసమూహములును; దృశ్యంతే= మాడఁబడుచున్నవి. పథి=మార్గమునందు; లూనాః= కోయఁబడిన; వైడూర్యవర్చసః=వైడూర్యమణుల యొక్క కాంతివంటి కాంతిగల; దర్భాశ్చ=దర్భలును; దృశ్యంతే= చూడఁబడుచున్నవి.

అచ్చటచ్చట, ఋషులచే సంగ్రహింపఁబడినకట్టెలు రాసులుగఁబడియున్నవి; మార్గంబున, ఋషులచేఁ గోయఁబడిన, వైడూర్యమణులకాంతివంటికాంతిగల, దర్భలు మొక్కలుగనుపడుచున్నవి. అని, తాత్పర్యము.

ఏతచ్చ వనమధ్యస్థం కృష్ణాభ్రశిఖరోపమమ్
పావకస్యాశ్రమస్థస్య ధూమాగ్రం సంప్రదృశ్యతే. ౫౨

టీ॥కృష్ణాభ్రశిఖరోపమం=నల్లని మేఘముయొక్క శిఖరముతోఁబోలిక గల; వనమధ్యస్థం=వనమునడుమనుండునట్టి; ఆశ్రమస్థస్య = ఆశ్రమంబుననుండునట్టి;

పావకస్య=అగ్నిహోత్రముయొక్క; ఏతత్=ఈ; ధూమాగ్రంచ=పొగయొక్కకొనయును; సంప్రదృశ్యతే=చూడఁబడుచున్నది.

నల్లనిమేఘంబువంటిదగు, నాశ్రమాగ్నిహోత్రధూమంబును, ఈవనమధ్యంబుననుండియగుపడుచున్నది.

అని, తాత్పర్యము.

వివిక్తేషు చ తీర్థేషు కృతస్నానా ద్విజాతయః
పుష్పోపహారం కుర్వంతి కుసుమైస్స్వయమార్జితైః. ౫౩

టీక॥ ద్విజాతయశ్చ= బ్రాహ్మణులును; వివిక్తేషు = పవిత్రములయిన; తీర్థేషు=తీర్థములయందు ; కృతస్నానాః = చేయఁబడినస్నానముగలవారలయి; స్వయం=తమచేత; ఆర్జితైః=తేఁబడిన; కుసుమైః = పూలచేత; పుష్పోపహారం=పుష్పబలిని; కుర్వంతి=చేయుచున్నారు.

బ్రాహ్మణులు , అవ్వైపుణ్యతీర్థములందుస్నానముగావించి , తమచేతులారఁగోసుకొన్న పూలచేఁబుష్పబలింగావింపుచున్నారు.

అని, తాత్పర్యము.

తత్సుతీక్ష్ణస్య వచనం యథా సౌమ్య మయా శ్రుతమ్
అగస్త్యస్యాశ్రమో భ్రాతు నూన మేష భవిష్యతి. ౫౪

టీక॥ సౌమ్య=శాంతుండవగులక్ష్మణుఁడా! యథా=ఎట్లు; తత్=ఆ; సుతీక్ష్ణస్య=సుతీక్ష్ణునియొక్క; వచనం = మాట; మయా=నాచేత; శ్రుతం=వినఁబడినదో; తథా(అధ్యాహృతము)=అట్లు; ఏషః=ఇది; అగస్త్యస్య= అగస్త్యమహామునియొక్క; భ్రాతుః= తమ్మునియొక్క; ఆశ్రమః= ఆశ్రమము ; భవిష్యతి=కాఁగలదు. నూనం= నిశ్చయము.

శాంతుండవగులక్ష్మణుఁడా! సుతీక్ష్ణమహామునిచెప్పినమాటలప్రకారము, ఇదియె, యగస్త్యమహాముని తమ్ముండగుసుదర్శనమహామునియాశ్రమము; నిశ్చయము. అని, తాత్పర్యము.

నిగృహ్య తపసా మృత్యుం లోకానాం హితకామ్యయా
యస్య భ్రాత్రా కృతేయం దిక్ఛరణ్యా పుణ్యకర్మణా. ౫౫

టీక॥ యస్య = ఏసుదర్శనునియొక్క; భ్రాత్రా = అన్నయయిన; పుణ్యకర్మణా = పుణ్యకార్యములుగలయగస్త్యమహామునిచేత; లోకానాం = లోకములయొక్క; హితకామ్యయా = మేలునందలికోర్కిచేత; తపసా = తపస్సుచేత; మృత్యుం = మరణమును; నిగృహ్య = నిగ్రహించి; ఇయం = ఈ; దిక్ = దక్షిణదిక్కు; శరణ్యా = నివాసయోగ్యమయినదిగా; కృతా = చేయఁబడినది.

ఏసుదర్శనునియన్నపుణ్యాత్ముండగునగస్త్యమహాముని, లోకహితంబుఁ బొంది, తపోబలంబున, మరణంబునుగూడనిగ్రహించి, యిల్వలవాతాపులనురాక్షసులవధించి, యీదక్షిణదిక్కును, ఋషులకువాసయోగ్యముగావించెను. అని, తాత్పర్యము.

ఇహైకదా కిల క్రూరో వాతాపి రపిచేల్వలః
భ్రాతరౌ సహితౌ వాస్తాం బ్రాహ్మణఘ్నౌ మహాసురౌ. ౫౬

టీక॥ ఇహ = ఇచ్చట; ఏకదా = ఒకప్పుడు; బ్రాహ్మణఘ్నౌ = బ్రాహ్మణులఁజంపువారలును; భ్రాతరౌ = అన్నదమ్ములునగు; క్రూరః = కఠినుండగు; వాతాపిః = వాతాపియు; ఇల్వలోపిచ = ఇల్వలుండునను; మహాసురౌ = గొప్పయసురులు; సహితౌ = కూడినవారలయి; ఆస్తాం = ఉండిరి.

ఇచ్చట, మున్ను, ఇల్వలవాతాపులనునన్నదమ్ములిద్దఱురాక్షసులు, బ్రాహ్మణులంజంపుచుండిరి.
అని, తాత్పర్యము.

ధారయన్ బ్రాహ్మణం రూప మిల్వల స్సంస్కృతం వదన్
ఆమంత్రయతి విప్రాన్ స్మ శ్రాద్ధ ముద్దిశ్య నిఘృణః. ౫౭

టీక॥ నిఘృణః = దయలేని; ఇల్వలః = ఇల్వలుఁడు; బ్రాహ్మణం = బ్రాహ్మణసంబంధియగు; రూపం = ఆకారమును; ధారయన్ = ధరించుచు; సంస్కృతం =

సంస్కృతమును; వదన్ = చెప్పుచు; శ్రాద్ధం=శ్రాద్ధమును;ఉద్దిశ్య=ఉద్దేశించి;విప్రాన్=బ్రాహ్మణులను; ఆమంత్రయతిస్మ=పిలుచుచుండెను.

నిదఁయుండగునిల్వలుండు,బ్రాహ్మణరూపముధరించి,సంస్కృతభాషమాటలాడుచు,శ్రాద్ధమని పేరుచెప్పి, బ్రాహ్మణులంబిలుచును. అని,తాత్పర్యము.

భ్రాతరం సంస్కృతం కృత్వా తత స్తం మేషరూపిణమ్
తాన్ ద్విజాన్ భోజయామాస శ్రాద్ధదృష్టేన కర్మణా. ౫౭

టీక॥తతః=అంత;సః (అధ్యాహృతము)=ఆయిల్వలుఁడు;భ్రాతరం= తమ్ముండగువాతాపిని;సంస్కృతం= పక్వముగా;కృత్వా=చేసి; శ్రాద్ధదృష్టేన= శ్రాద్ధమునందుఁజూడఁబడిన; కర్మణా=కార్యముచేత;తాన్=ఆ;ద్విజాన్=బ్రాహ్మణులను; భోజయామాస=భుజింపఁజేసెను.

అంత,నాయిల్వలుండు, మేకరూపమునొందిన తనతమ్మునివాతాపిని వండి,శ్రాద్ధముసేయువిధంబుననె , యాబ్రాహ్మణులకుఁ జక్కఁగాఁ దినిపించును. అని,తాత్పర్యము.

తతో భుక్తవతాం తేషాం విప్రాణా మిల్వలోఽబ్రవీత్
వాతాపే నిష్క్రమస్వేతి స్వరేణ మహతా వదన్. ౫౮

టీక॥తతః=అంత;తేషాం=ఆ ; విప్రాణాం= బ్రాహ్మణులు ; భుక్తవతాం=తిన్నవారలుకాఁగా; ఇల్వలః=ఇల్వలుఁడు;మహతా= అధికమయిన; స్వరేణ=ధ్వనిచేత;వదన్= చెప్పుచు; "వాతాపే=వాతాపీ! నిష్క్రమస్వ=వెడలిరమ్ము." ఇతి=అని;అబ్రవీత్ =చెప్పెను.

అంత,నాబ్రాహ్మణులందఱుభుజించియయినపిమ్మట,నిల్వలుండు , "వాతాపీ!నీవింకరమ్ము" అని, పేరెలుంగునంజెప్పెను.

అని,తాత్పర్యము.

తతోభ్రాతు ర్వచ శ్శ్రుత్వా వాతాపి ర్మేషవన్నదన్

భిత్వాభిత్వా శరీరాణి బ్రాహ్మణానాం వినిష్పతత్. ౬౦

టీక॥ తతః=అంత; వాతాపిః= వాతాపి; భ్రాతుః=అన్నయొక్క; వచః= మాటను; శ్రుత్వా = విని; మేషవత్= మేకవలె; నదన్ = అఱచుచు; బ్రాహ్మణానాం=బ్రాహ్మణులయొక్క ; శరీరాణి= దేహములను ; భిత్వాభిత్వా= భేదించిభేదించి; వినిష్పతత్ (వినిరపతత్)=బయలువెడలెను.

అంత, వాతాపి, యిల్వలునిమాటనువిన్నంతనె , మేకయుంబోలెనఱచుచు, బ్రాహ్మశరీరంబులఁజీల్చుకొని , వెడలివచ్చును. అని, తాత్పర్యము.

బ్రాహ్మణానాం సహస్రాణి తై రేవం కామరూపిభిః
వినాశితాని సంహత్య నిత్యశః పిశితాశనైః. ౬౧

టీక॥ ఏవం = ఇట్లు; కామరూపిభిః=ఇచ్ఛాధీనమగురూపముగల ; పిశితాశనైః=మాంసాహారులగు ; తైః= ఆపరివారసహితులగు నాయిల్వలవాతాపులచేత; నిత్యశః = ఎల్లప్పుడును; సంహత్య=చేరి; బ్రాహ్మణానాం= బ్రాహ్మణులయొక్క; సహస్రాణి= వేలు; వినాశితాని = నశింపఁజేయఁబడినవి.

కామరూపులును మాంసాశనులునగునాయిల్వలవాతాపులు, ఇట్లు, వట్టుకుఁ బెక్కువేలబ్రాహ్మణులం జంపియున్నారు. అని, తాత్పర్యము.

అగస్త్యేన తదా దేవైః ప్రార్థితేన మహర్షిణా
అనుభూయ కిల శ్రాద్ధే భక్షిత స్సమహాసురః. ౬౨

టీక॥ తదా=అప్పుడు; దేవైః= దేవతలచేత; ప్రార్థితేన=ప్రార్థింపఁబడిన; మహర్షిణా = పూజ్యుఁడైన ఋషియగు; అగస్త్యేన=అగస్త్యునిచేత; అనుభూయ= అనుభవించి; శ్రాద్ధే=శ్రాద్ధమునందు; సః=ఆ; మహాసురః=వాతాపి; భక్షితఃకిల= భక్షింపఁబడినాఁడుగదా!

అంతనగస్త్యమహాముని, దేవతా ప్రార్థితుండై, యిల్వలుని యామంత్రణంబున కియ్యకొని, క్రమ ప్రకారంబున వాతాపినిభక్షించెను.

అని, తాత్పర్యము.

తత స్సంపన్న మిత్యుక్త్వా దత్వా హస్తావసేచనమ్
భ్రాతరం నిష్క్రమస్వేతి చేల్వల స్సోభ్యభాషత. ౬౩

టీక॥ తతః=అంత; సః=ఆ; ఇల్వలశ్చ=ఇల్వలుండును; సంపన్నం=సమృద్ధమా? ఇతి=అని; ఉక్త్వా=చెప్పి; హస్తావసేచనం=ఉత్తరాపోశనమును; దత్వా=ఇచ్చి; భ్రాతరం=తమ్ముని గూర్చి; నిష్క్రమస్వేతి= వెడలుమని; అభ్యభాషత=చెప్పెను,

అంత, శ్రాద్ధాంతంబున, నాయిల్వలుండును, తృప్తియయినదా! యని యగస్త్యునడిగి, యయినదని యమ్మహర్షి వచించుడు, నాయనకుత్తరాపోశనంబొసంగి, తమ్ముండగువాతాపిని నీవింకరమ్మని, యథాక్రమముగాఁబిలిచెను. అని, తాత్పర్యము.

స తం తథా భాషమాణం భ్రాతరం విప్రఘాతినమ్
అబ్రవీ త్ప్రహసన్ ధీమా నగస్త్యో మునిసత్తమః. ౬౪

టీక॥ ధీమాన్=బుద్ధిమంతుండగు; మునిసత్తమః=మునిశ్రేష్ఠుఁడయిన; సః=ఆ; అగస్త్యః=అగస్త్యుఁడు; తథా=అట్లు; భ్రాతరం=తమ్మునిగూర్చి; భాషమాణం= పలుకుచున్న; విప్రఘాతినం=బ్రాహ్మణులంజంపునట్టి; తం =ఆ యిల్వలునిగూర్చి; ప్రహసన్=నవ్వుచు; అబ్రవీత్ =చెప్పెను.

బుద్ధిమంతుండగు నాయగస్త్యమహాముని , యిట్లుతమ్మునింజీరుచున్న బ్రాహ్మణఘాతియగు నాయిల్వలుంజూచి, నవ్వుచు, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

కుతో నిష్క్రమితుం శక్తి ర్మయా జీర్ణస్య రక్షసః
భ్రాతు స్తే మేషరూపస్య గతస్య యమసాదనమ్. ౬౫

టీక॥మయా=నాచేత; జీర్ణస్య=జీర్ణించినవాఁడును; రక్షసః= రాక్షసుండును;యమసాదనం= యమునిగృహమును;గతస్య = పొందినవాఁడును; మేషరూపస్య=మేకరూపము గలవాఁడునగు; తే=నీయొక్క;భ్రాతుః = తమ్ముఁడగువాతాపికి ; నిష్క్రమితుం=వెడలుటకు;శక్తిః=సామర్థ్యము ; కుతః=ఎక్కడిది?

మేకరూపముధరించిన నీతమ్ముఁడు వాతాపి, నాయుదరంబున జీర్ణించి, యమునిగృహంబుఁ జేరియున్నాఁడే ; ఇంకనతం డెట్లు వెడలివచ్చును ? అని , యగస్త్యమహాముని,యిల్వలునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

అథ తస్య వచ శ్శ్రుత్వా భ్రాతు ర్నిధనసంశ్రయమ్
ప్రధర్షయితు మారేభే మునిం క్రోధా న్నిశాచరః. ౬౬

టీక॥ అథ=అంత;నిశాచరః= రాక్షసుఁడగు నిల్వలుఁడు; భ్రాతుః = తమ్మునియొక్క;నిధనసంశ్రయం =చావువిషయము గాఁగల;తస్య= ఆయగస్త్యునియొక్క;వచః=మాటను; శ్రుత్వా=విని;క్రోధాత్ = కోపమువలన; మునిం=అగస్త్యుని ; ప్రధర్షయితుం=బెదరించుటకు ; ఆరేభే= ఆరంభించెను.

అంత,నాయిల్వలుండు , ఆయగస్త్యుండుతమ్మునిచావుఁజెప్పుటనువిని , పరమకుపితుండై , యగస్త్యునిపైకుఱికెను. అని,తాత్పర్యము.

సో భిద్రవ న్మునిశ్రేష్ఠం మునినా దీప్తతేజసా
చక్షుషా నలకల్పేన నిర్దగ్ధో నిధనం గతః. ౬౭

టీక॥సః=ఆయిల్వలుఁడు; మునిశ్రేష్ఠం=మునివర్యుండగునగస్త్యుని గూర్చి; అభిద్రవన్= పరుగెత్తుచు ; దీప్తతేజసా=ప్రకాశించుచున్నకాంతిగల; మునినా=అగస్త్యమహామునిచేత;అనలకల్పేన=నిప్పువంటి;చక్షుషా= కంటిచేత;నిర్దగ్ధః=దహింపఁబడినవాఁడై;నిధనం=చావును;గతః=పొందినాఁడు.

ఆయిల్వలుండు, మునివరుండగు నయ్యగస్త్యునిపైకిఁబోయి, మహాతేజుం

డగునమ్మునిచే నేత్రాగ్నిచే నలంబునదగ్ధుండై,మృతిఁబొందెను. అని, తాత్పర్యము.

తస్యాయమాశ్రమో భ్రాతు స్తటాకవనశోభితః
విప్రానుకంపయా యేన కర్మేదం దుష్కరం కృతమ్. ౭౮

టీక॥తటాకవనశోభితః= కొలనుల చేతనువనముల చేతను ప్రకాశించుచున్న;అయం=ఇది;యేన= ఏయగస్త్యుని చేత;విప్రానుకంపయా= బ్రాహ్మణుల యందలిదయచేత;ఇదం=ఈ; దుష్కరం=చేయనలవిగాని;కర్మ = కార్యము;కృతం=చేయఁబడినదో;తస్య= ఆ యగస్త్యమహాముని యొక్క ; భ్రాతుః=తమ్ముఁడైనసుదర్శన మహాముని యొక్క;ఆశ్రమః=ఆశ్రమము.

తటాకవనసంపన్నంబగు నీయాశ్రమము,ఏమహాత్ముండు , బ్రాహ్మణుల యందుదయచే,నిట్టిదుష్కర కార్యంబు గావించెనో,అట్టియగస్త్య మహాముని తమ్ముఁడు సుదర్శనమునియాశ్రమము. అని,రాముండు, లక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం కథయమానస్య తస్య సౌమిత్రిణాసహ
రామస్యాస్తం గత స్సూర్య స్సంధ్యా కాలో భ్యవర్తత. ౭౯

టీక॥ తస్య=ఆ;రాఘవస్య = రాముఁడు;సౌమిత్రిణాసహ= లక్ష్మణుని తోఁగూడ;ఏవం=ఇట్లు ; కథయమానస్య=చెప్పుచుండఁగా;సూర్యః= సూర్యుఁడు;అస్తంగతః = అస్తమించెను. సంధ్యాకాలః= సంధ్యాసమయము; అభ్యవర్తత=వచ్చెను.

అట్లు , రాముండులక్ష్మణునితో, మాటలాడుచుండఁగానే , సూర్యుండస్తమించెను ; సంధ్యాసమయంబును వచ్చినది. అని, తాత్పర్యము.

ఉపాస్య పశ్చిమాం సంధ్యాం సహ భ్రాత్రా యథావిధి
ప్రవివేశాశ్రమపదం త మృషిం సోభ్యవాదయత్. ౮౦

టీక॥ సః=ఆరాముఁడు; భ్రాత్రా సహ=తమ్మునితోఁగూడ ; యథావిధి=యథాశాస్త్రముగా; పశ్చిమాం=సాయంకాలమునందుఁగలిగిన ; సంధ్యాం=సంధ్యను;ఉపాస్య = ఉపాసించి,ఆశ్రమపదం = ఆశ్రమస్థానమును;ప్రవివేశ = ప్రవేశించెను. తం=ఆ;ఋషిం=సుదర్శనమహర్షిని;అభ్యవాదయత్=నమస్కరించెను.

రాముండు, లక్ష్మణునితోఁగూడ, సాయంసంధ్యావందనము యథావిధిగఁ గావించి,యయ్యాశ్రమంబుఁబ్రవేశించి, యాసుదర్శనమహర్షికి నమస్కరించెను.అని,తాత్పర్యము.

సమ్యక్ప్రతిగృహీతశ్చ మునినా తేన రాఘవః
న్యవసత్తాం నిశామేకాం ప్రాశ్య మూలఫలానిచ. ౭౧

టీక॥ రాఘవః=రాముఁడు; తేన=ఆ; మునినా= సుదర్శనమునిచేత; సమ్యక్=చక్కఁగా; ప్రతిగృహీతశ్చ = స్వీకరింపఁబడినవాఁడునై ; మూలఫలాని=గడ్డలనుపండ్లను;ప్రాశ్యచ = తినియు; తాం=ఆ;ఏకాం=ఒకటయిన, నిశాం=రాత్రిని; నివసత్=ఉండెను.

రాముండు,సుదర్శనమహామునిచేఁజక్కఁగాఁబూజింపఁబడినవాఁడై,యాయనయొసంగిన ఫలమూలంబులభుజించి, యారాత్రియంతయునచ్చటనుండెను. అని,తాత్పర్యము.

తస్యాం రాత్ర్యాం వ్యతీతాయాం విమలే సూర్యమండలే
భ్రాతరం తమగస్త్యస్యహ్యామంత్రయతి రాఘవః. ౭౨

టీక॥ తస్యాం=ఆ;రాత్ర్యాం= రాత్రి;వ్యతీతాయాం=కడవఁగా; సూర్యమండలే=సూర్యమండలము; విమలే=స్వచ్ఛముకాఁగా;రాఘవః = రాముఁడు;అగస్త్యస్య = అగస్త్యమహామునియొక్క;భ్రాతరం=తమ్ముఁడైన; తం=ఆసుదర్శనమహామునిని ; ఆమంత్రయతిహ=వీడ్కొనెనుగదా!

అంతఁదెల్లవాఱినవెనుక,సూర్యుం డుస్వచ్ఛముగాఁబ్రకాశింప , రాముఁడు , అగస్త్యమహామునితమ్ముండగు సుదర్శనమహామునితోఁబోయివచ్చెదనని చెప్పెను.అని,తాత్పర్యము.

అభివాదయే త్వాం భగవన్ సుఖమధ్యుషితో నిశామ్
ఆమంత్రయే త్వాం గచ్ఛామి గురుం తే ద్రష్టుమగ్రజమ్. ౭౩

టీక॥ భగవన్= అధికమయినమాహాత్మ్యముగల సుదర్శనమహాముసీ ! త్వాం=నిన్ను;అభివాదయే= నమస్కరించెదను.నిశాం = రాత్రియంతయు; సుఖం=సుఖముగా,అధ్యుషితః = ఉంటిని. త్వాం=నిన్ను; ఆమంత్రయే=వీడుకొనెదను. తే=నీయొక్క;గురుం = ఆచార్యుఁడగు;అగ్రజం = అన్నను; ద్రష్టుం=చూచుటకు;ఇచ్ఛామి= కోరుచున్నాను.

భగవంతుఁడవగు సుదర్శనమహామునీ , నీకునమస్కారంబుగావించెదను ; రాత్రియంతయునిచ్చటసుఖంబుగనుంటిని; నీయాచార్యుండునుఅన్నయునగునగస్త్యమహామునిం జూడఁగోరెదను; పోయివచ్చెదనుసెలవొసంగుము. అని , రాముండగస్త్యునితమ్మునితోఁజెప్పెను. అని. తాత్పర్యము.

గమ్యతా మితి తే నోక్తో జగామ రఘునందనః
యథో ద్దిష్టేన మార్గేణ వనం తచ్చా వలోకయన్. ౭౪

టీక॥రఘునందనః=రాముఁడు; తేన = ఆసుదర్శనమహామునిచేత; గమ్యతామితి=పోవుటయగుఁగాకయని; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; తత్ = ఆ; వనం=అడవిని; అవలోకయంశ్చ=చూచుచును ; యథోద్దిష్టేన=సుతీక్ష్ణమహర్షిచేఁ జెప్పఁబడినట్లు ; మార్గేణ=మార్గముచేత; జగామ=పోయెను.

ఆసుదర్శనమహాముని, పొమ్మనియనుజ్ఞయొసంగ, నారాముండు , ఆయడవింజూచుచు , సుతీక్ష్ణమహామునిచెప్పినమార్గంబునంబోయెను.

అని, తాత్పర్యము.

నీవారాన్ పనసాం స్తాలాం స్తిమిశాన్ వంజులాన్ ధవాన్
చిరిబిల్వాన్ మధూకాంశ్చ బిల్వానపిచ తిందుకాన్. ౭౫
పుష్పితాన్ పుష్పితాగ్రాభి ర్లతాభి రనువేష్టితాన్
దదర్శ రామ శ్శతశ స్తత్రకాంతారపాదపాన్. ౭౬

హస్తిహస్తై ర్విమృదితా న్వానరై రుపశోభితాన్
మత్తై శ్శకునిసంఘైశ్చ శతశశ్చ ప్రణాదితాన్. ౭౭

టీక॥ రామః=రాముఁడు; తత్ర = అచ్చట; హస్తిహస్తైః = ఏనుఁగుల తొండములచేత; విమృదితాన్=నలపఁబడినవియు; వానరైః=కోఁతులచేత; ఉపశోభితాన్ = ప్రకాశించుచున్నవియు; శతశః = నూఱునూఱులుగాను న్ను; మత్తైః=మదించిన; శకునిసంఘైశ్చ=పక్షిసమూహములచేతను, ప్రణాదితాంశ్చ = ధ్వనింపఁజేయఁబడినవియు; పుష్పితాన్ = పూచినవియు; పుష్పితాగ్రాభిః = పూచినకొనలుగలు; లతాభిః = తీఁగెలచేత; అనువేష్టితాన్ = చుట్టఁబడినవియు నగు; కాంతారపాదపాన్ అడవివృక్షములను;శతశః=నూఱులునూఱులుగా ; నీవారాన్=నీవారపుపైరులను ; పనసాన్=పనసచెట్టులను;తాలాన్=తాటిచెట్లను,తిమిశాన్ = తినాసపుచెట్లను;వంజులాన్= పొగడచెట్లను ; ధవాన్=చంద్రచెట్లను;చిరిబిల్వాన్=గానుగుచెట్లను;మధూకాంశ్చ= ఇప్పచెట్లను;బిల్వానపిచ=మారేడుచెట్లను; తిందుకాన్= తుమ్మికిచెట్లను;దదర్శ = చూచెను.

రాముం డడవియందు , ఏనుంగు తొండంబులవిఱువఁబడినవియు , గోఁతులతోనొప్పుచున్నవియు, మదించిమధురంబుగాఁ గూయుచుండు పక్షులతోఁగూడినవియుఁ, బుష్పితంబులునుబుష్పితాగ్రంబులగులతలచే వేష్టితంబులునగు నడవివృక్షంబులను మఱియునీవారంబులను బనసవృక్షంబులను దాటిచెట్లను దినాసపుచెట్లను బొగడచెట్లను జంద్రవృక్షంబులను , గానుగుచెట్లను ఇప్పచెట్లను బిల్వవృక్షంబులను దుమ్మికిచెట్లనుంజూచెను.అని,తాత్పర్యము.

తతో బ్రవీ త్సమీపస్థం రామో రాజీవలోచనః
పృష్ఠతోనుగతం వీరం లక్ష్మణం లక్ష్మివర్ధనమ్. ౭౮

టీక॥ తతః = అంత;రాజీవలోచనః=కమలములవంటికన్నులుగలః రామః=రాముఁడు;సమీపస్థం= సమీపంబుననున్నవాఁడును;పృష్ఠతః = వెనుకనుండి;అనుగతం= వెంబడించినవాఁడును;వీరం=పరాక్రమశాలియు; లక్ష్మివ

ర్ధనం= సంపదనువృద్ధిఁబొందించువాఁడునగు;లక్ష్మణం= లక్ష్మణునిగూర్చి, అబ్రవీత్=చెప్పెను.

అంతఁ, దామరపూలవంటినేత్రంబులుగలరాముండు, తనసమీపంబుననున్నవాఁడును దనవెంబడి వచ్చినవాఁడును బరాక్రమవంతుండును సంపద్వర్ధనుండునగులక్ష్మణుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

స్నిగ్ధపత్రా యథా వృక్షా యథా క్షాంతా మృగద్విజాః
ఆశ్రమో నాతిదూరస్థో మహర్షేః భావితాత్మనః. ౭౯

టీక॥యథా=ఎట్లు;వృక్షాః = చెట్లు;స్నిగ్ధపత్రాః=నునుపులయిన ఆకులుగలవో;యథా= ఎట్లు ; మృగద్విజాః=మృగములునుబక్షులును ; క్షాంతాః=శాంతములో;తథా(అధ్యాహృతము)=అట్లు;భావితాత్మనః=ధ్యానింపఁబడినయాత్మగల;మహర్షేః = అగస్త్యమహామునియొక్క;ఆశ్రమః=ఆశ్రమము;నాతిదూరస్థః= మిక్కిలిదూరంబుననున్నదికాదు.

వృక్షంబులన్నియు స్నిగ్ధంబులయిన యాకులుగలిగియుండుటయు, మృగపక్షులు శాంతంబులయి యుండుటయుం జూడఁగా,భావితాత్ముండగు నయ్యగస్త్యమహాముని యాశ్రమంబు సమీపించినదనితోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

అగస్త్యఇతి విఖ్యాతో లోకే స్వేనైవ కర్మణా
ఆశ్రమో దృశ్యతే తస్య పరిశ్రాంతశ్రమాపహః. ౮౦
ప్రాజ్యధూమాకులవనశ్చీరమాలాపరిష్కృతః
ప్రశాంతమృగయూథశ్చ నానాశకునినాదితః. ౮౧

టీక॥యః (అధ్యాహృతము)= ఎవ్వఁడు; లోకే=లోకమునందు ; స్వేన=తనదైన; కర్మణానైవ= వింధ్యపర్వతమును స్తంభించుటయనుకార్యముచేతనే ; అగస్త్యఇతి = అగస్త్యుండని ( పర్వతమును స్తంభించువాఁడని; ) విఖ్యాతః=ప్రసిద్ధుఁడో; తస్య=అమ్మహామునియొక్క ; పరిశ్రాంత శ్రమాప




హః= అలసినవారలశ్రమమునుబోఁగొట్టునదియు; ప్రాజ్యధూమాకులవనః= అధికమయినపొగచేనిండినయడవి గలదియు; చీరమాలాపరిష్కృతః=నారచీరలసమూహముచే నలంకరింపఁబడినదియు; ప్రశాంతమృగయూధః= మిక్కిలియు శాంతములయిన మృగముల సమూహము గలదియు; నానాశకునినాదితః=నానావిధములయిన పక్షులచేధ్వనింపఁజేయఁబడినదియునగు; ఆశ్రమః=ఆశ్రమము ; దృశ్యతే=చూడఁబడుచున్నది.

ఎవ్వఁడు, వింధ్యపర్వతమును స్తంభించుటంజేసి యగస్త్యుఁడని లోకంబులంబ్రసిద్ధుఁడయ్యెనట్టి మహామునిదైన, పరిశ్రాంతులశ్రమమును బోఁగొట్టునదియునధికమయినపొగచేవ్యాప్తమగు వనముగలదియు నారచీరలచే నొప్పుచున్నదియు ప్రశాంతములగు మృగములు గలదియునానావిధపక్షి నాదితంబునగునాశ్రమంబు,చూపట్టుచున్నది.

అని, తాత్పర్యము.

తస్యేద మాశ్రమపదం ప్రభావాద్యస్య రాక్షసైః
దిగియం దక్షిణా త్రాసా ద్దృశ్యతే నోపభుజ్యతే. ౮౨

టీక॥ ఇదం=ఇది; యస్య= ఏమహామునియొక్క; ప్రభావాత్ = మహిమవలన; రాక్షసైః = రాక్షసులచేత, ఇయం=ఈ; దక్షిణా= దక్షిణపు; దిక్= దిక్కు; త్రాసాత్ = భయమువలన; దృశ్యతే= చూడఁబడుచున్నదో.నోపభుజ్యతే=అనుభవింపఁబడదో; తస్య= ఆయగస్త్యమహామునియొక్క ; ఆశ్రమపదం=ఆశ్రమస్థానము.

ఏమహామునిప్రభావమువలన, రాక్షసులు , ఈదక్షిణపుదిక్కునుభయంబునంజూతురుగానియుపభోగింపరో, అట్టియగస్త్య మహాముని యాశ్రమంబిది అని, తాత్పర్యము.

యదాప్రభృతి చాక్రాంతా దిగియం పుణ్యకర్మణా
తదాప్రభృతి నిర్వైరాః ప్రశాంతా రజనీచరాః. ౮౩

టీక॥యదాప్రభృతి= ఎప్పుడుమొదలుకొనియు;పుణ్యకర్మణా= పవిత్రములయినకర్మములుగల యగస్త్యమహర్షిచేత,ఇయం=ఈ, దిక్ =దిక్కు;




ఆక్రాంతా=అధిష్ఠింపఁబడినదో; తదా ప్రభృతి=అప్పుడు మొదలుకొని ; రజనీచరాః=రాక్షసులు, నిర్వైరాః= వైరము లేనివారలయి, ప్రశాంతాః=శాంతులయిరి.

పుణ్యాకర్ముఁడగు నగస్త్య మహర్షి యీదక్షిణదిక్కు నివసింప నారంభించినది మొదలు, రాక్షసులు, ఋషుల పై వైరంబు విడిచి, శాంతులయిరి.

అని, తాత్పర్యము.

నామ్నా చేయం భగవతో దక్షిణా దిక్ప్రదక్షిణా
ప్రథితా త్రిషు లోకేషు దుర్ధర్షా క్రూరకర్మభిః. ౮౪

టీక॥ ఇయం=ఈ; దక్షిణా= దక్షిణపు; దిక్=దిక్కు; భగవతః= భగవంతుండగు నగస్త్యమహాముని యొక్క; నామ్నాచ=పేరు చేతను; ప్రసిద్ధా (అధ్యాహృతము)= ప్రసిద్ధమును, ప్రదక్షిణా=సమర్థమును; క్రూరకర్మభిః= క్రూరములయిన కర్మములుగల రాక్షసుల చేత; దుర్ధర్షా= ఎదిరింపఁగూడనిదియునై, త్రిషు = మూఁడైన; లోకేషు = లోకములయందు; ప్రథితా= ప్రసిద్ధమయినది.

ఈదక్షిణదిక్కు, భగవంతుండగు నగస్త్యనామంబున, నగస్త్యదిక్కని పేరుఁబొంది, రాక్షసులకు దుర్ధర్షమయి, మల్లోకంబులను బ్రసిద్ధిఁబొందినది. అని, తాత్పర్యము.

మార్గం నిరోద్ధుం నిరతో భాస్కరస్యాచలోత్తమః
నిదేశం పాలయ న్యస్య విన్ధ్యశ్శైలో నవర్ధతే. ౮౫
అయం దీర్ఘాయుష స్తస్య లోకే విశ్రుతకర్మణః
అగస్త్య స్యాశ్రమ శ్శ్రీమా న్వినీతజన సేవితః. ౮౬

టీక॥ శ్రీమాన్= కాంతిమంతుఁడును; వినీతజనసేవితః=వినయముగలవారల చేత సేవింపఁబడినదియునగు ; అయం=ఈయాశ్రమము; భాస్కరస్య= సూర్యుని యొక్క; మార్గం = మార్గమును ; నిరోద్ధుం = అడ్డగించుటకు; నిరతః=ఆసక్తుఁడయిన ; అచలోత్తమః=పర్వతశ్రేష్ఠమయిన; విన్ధ్యశ్శై

లః=వింధ్యపర్వతము, యస్య= ఏమహామునియొక్క; నిదేశం=ఆజ్ఞను; పాలయన్=పాలించుచు; నవర్ధతే= వృద్ధిఁబొందకున్నదో; తస్య=అట్టి; లోకే=లోకమునందు; విశ్రుతకర్మణః=ప్రసిద్ధమయినకార్యములుగల; దీర్ఘాయుషః = దీర్ఘమయినయాయుస్సుగల; అగస్త్యస్య= అగస్త్యమహామునియొక్క; ఆశ్రమః=ఆశ్రమము.

శ్రీమంతంబును వినీతజనసేవితంబునగు నీయాశ్రమము, సూర్యమార్గంబునిరోధింపనుద్యుక్తమయిన పర్వతశ్రేష్ఠమగువింధ్యపర్వతము, ఎవ్వనియాజ్ఞచేవృద్ధిఁబొందకనిలిచెనో, అట్టిసుప్రసిద్ధకర్ముండును జిరంజీవియునగు నగస్త్యమహామునియాశ్రమము.

అని, తాత్పర్యము.

ఏష లోకార్చిత స్సాధు ర్హితే నిత్యరత స్సతామ్
అస్మా నభిగతా నేష శ్రేయసా యోజయిష్యతి. ౮౭

టీక॥ ఏషః=ఈయగస్త్యుఁడు; లోకార్చితః=లోకంబులచేఁ బూజింపఁబడినవాఁడు. సాధుః= సత్పురుషుఁడు. సతాం=సత్పురుషులయొక్క; హితే= మేలునందు; నిత్యరతః= ఎల్లప్పుడు నాసక్తుండు. ఏషః=ఇమ్మహాముని; అభిగతాన్=పొందిన; అస్మాన్ = మనలను; శ్రేయసా=మంచితో; యోజయిష్యతి=కూర్పఁగలఁడు.

ఈయగస్త్యుండు, సమస్తలోకపూజితుండు, సత్పురుషుండు; ఎల్లప్పుడును సత్పురుషులకుహితంబు గావించువాఁడు; మనమతనింబొందినచో, మనకుశ్రేయస్సు గావించును. అని, తాత్పర్యము.

ఆరాధయిష్యా మ్యత్రాహ మగస్త్యం తం మహామునిమ్
శేషంచ వనవాసస్య సౌమ్య వత్స్యా మ్యహం ప్రభో. ౮౮

టీక॥ ప్రభో=ప్రభుండవగు; సౌమ్య= శాంతుండవగులక్ష్మణుఁడా! అత్ర=ఇచ్చట; అహం=నేను; మహామునిం=పూజ్యుఁడైనమునియగు; తం=అట్టి, అగస్త్యం=అగస్త్యుని; ఆరాధయిష్యామి=పూజించెదను; అహం = నేను; వనవాసస్య=వనవాసముయొక్క; శేషంచ = మిగతను; వత్స్యామి=

ఉండెదను.

శాంతుండవగులక్ష్మణుఁడా! కావున, ఈయాశ్రమంబుననెయియ్యగస్త్య మహామునినారాధింపుచు, నిచ్చటనే,వనవాసశేషకాలంబుండెదను.

అని, తాత్పర్యము.

అత్ర దేవా స్సగంధర్వా సిద్ధాశ్చ పరమర్షయః
అగస్త్యం నియతాహారం సతతం పర్యుపాసతే. ౮౯

టీక॥ అత్ర= ఈయాశ్రమమందు; సగంధర్వాః= గంధర్వులతోఁగూడిన; దేవాః=దేవతలును; సిద్ధాశ్చ=సిద్ధులును;పరమర్షయః = పరమర్షులును; నియతాహారం=నిగ్రహింపఁబడినయాహారముగల;అగస్త్యం = అగస్త్యమహామునిని;సతతం=ఎల్లప్పుడును; పర్యుపాసతే=ఉపాసించుచున్నారు.

ఈయాశ్రమంబున, దేవతలునుగంధర్వులును సిద్ధులును మహర్షులును ఆహారంబునిగ్రహించి తపస్సు గావించుచున్న యగస్త్యమహాముని నెల్లప్పుడు నుపాసించుచున్నారు.

అని, తాత్పర్యము.

నాత్రజీవే న్మృషావాదీ క్రూరోవా యదివా శఠః
నృశంసః కామవృత్తోవా మునిరేష తథావిధః. ౯౦

టీక॥అత్ర= ఈయాశ్రమమునందు; మృషావాదీ = అబద్ధముఁజెప్పువాఁడుగాని;క్రూరోవా=క్రూరుఁడుగాని; శఠోయదివా=వంచకుఁడుగాని ; నృశంసః=ఘాతుకుఁడుగాని;కామవృత్తోవా=యథేచ్ఛ మయిన యాచారము గలవాఁడుగాని;నజీవేత్=బ్రతుకఁడు. ఏషః=ఈ;మునిః=అగస్త్యమహాముని;తథావిధః=అట్టివాఁడు.

అసత్యముఁజెప్పువాఁడు గాని క్రూరుండుగానివంచకుండుగాని ఘాతుకుండుగాని, శాస్త్రనియమంబువిడిచి యథేచ్ఛముగానాచరించువాఁడుగాని,ఈయాశ్రమంబునజీవింపఁడు ; ఈయగస్త్యునిమహిమయట్టిది.

అని, తాత్పర్యము,

అత్ర దేవాశ్చ యక్షాశ్చ నాగాశ్చ పతగై స్సహ

వసంతి నియతాహారా ధర్మమారాధయిష్ణవః. ౯౧

టీక॥ అత్ర = ఈయాశ్రమమునందు; దేవాశ్చ=దేవతలును; యక్షాశ్చ= యక్షులును; నాగాశ్చ = సర్పములును, పతగైస్సహ = పక్షులతోఁగూడ; ధర్మం=ధర్మమును ; ఆరాధయిష్ణవః=ఆరాధించువారలయి ; నియతాహారాః = నిగ్రహింపఁబడినయాహారముగలవారలయి; వసంతి= వసించుచున్నారు.

దేవతలును యక్షులును నాగములు నుపక్షులునుయాహారమువర్జించి, ధర్మమునారాధింపుచు,నీయాశ్రమంబునవాసముసేయుచున్నారు.

అని, తాత్పర్యము.

అత్ర సిద్ధా మహాత్మానో విమానై స్సూర్యసన్నిభైః
త్యక్తదేహా నవై ర్దేహై స్స్వర్యాతాః పరమర్షయః. ౯౨

టీక॥అత్ర= ఈయాశ్రమమునందు; మహాత్మానః = అధికమయినప్రభావముగల; పరమర్షయః=మహర్షులు; సిద్ధాః=తపస్సిద్ధిఁబొందినవారలయి ; త్యక్తదేహాః=విడువఁబడినదేహముగలవారలయి; నవైః=నూతనములయిన; దేహైః = దేహములతో; సహితాః(అధ్యాహృతము)= కూడినవారలయి; సూర్యసన్నిభైః= సూర్యునితో సమానములయిన; విమానైః=విమానములచేత ; స్వర్యాతాః=స్వర్గము నొందినారు.

మహాత్ములగు మహర్షులు పెక్కండ్రు,ఈయాశ్రమంబునఁ దపస్సుగావించిసిద్ధులయి, మానుషదేహంబు విడిచి నూతనమయిన దేవతాదేహంబుదాల్చి, సూర్యసమానంబులగు విమానంబుల నారోహించి, స్వర్గంబు నొందిరి

అని, తాత్పర్యము.

యక్షత్వ మమరత్వంచ రాజ్యాని వివిధానిచ
అత్ర దేవాః ప్రయచ్ఛంతి భూతై రారాధితా శ్శుభైః. ౯౩

టీక॥ అత్ర = ఈయాశ్రమమునందు; దేవాః=దేవతలు; శుభైః=మంగళకరులగు; భూతైః=ప్రాణులచేత ; ఆరాధితాః=ఆరాధింపఁబడినవారలై;

యక్షత్వం = యక్షుఁడగుటను; అమరత్వంచ=దేవత్వమున ;వివిధాని=నానావిధములయిన; రాజ్యానిచ=రాజ్యములను ; ప్రయచ్ఛంతి = ఇచ్చుచున్నారు.

ఈయాశ్రమమునఁనారాధించువారలకు, దేవతలుయక్షత్వమును దేవత్వమునునానావిధ రాజ్యాధిపత్యములను, ఇచ్చెదరు.॥ అని, తాత్పర్యము.

ఆగతా స్స్మాశ్రమపదం సౌమిత్రే ప్రవిశాగ్రతః
నివేదయే హ మాం ప్రాప్త మృషయే సీతయాసహ. ౯౪

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! ఆశ్రమపదం = ఆశ్రమస్థానమును;ఆగతాః=పొందినవారలయి;స్మ (స్మః)=అగుచున్నారము.అగ్రతః =ముందఱ; ప్రవిశ=ప్రవేశింపుము.ఇహ= ఇచ్చటికి;సీతయాసహ=సీతతోఁగూడ; ప్రాప్తం=వచ్చిన;మాం = నన్ను; ఋషయే=అగస్త్యమహర్షికొఱకు ; నివేదయ=తెలుపుము.

లక్ష్మణుఁడా ! అగస్త్యాశ్రమమునకువచ్చినాము;నీవుముందుపోయి , ఇచ్చటికిసీతతోఁగూడ నేనువచ్చియుండుటను , అమ్మహర్షికిం దెలుపుము.అని, రాముండు,లక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
ఆరణ్యకాండే, ఏకాదశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,ఆరణ్యకాండైకాదశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః

## ద్వాదశసర్గ ప్రారంభః

స ప్రవిశ్యాశ్రమపదం లక్ష్మణో రాఘవానుజః
అగస్త్యశిష్య మాసాద్య వాక్య మేత దువాచ హ. ౧

టీక॥ రాఘవానుజః = రామునితమ్ముండగు; సః = ఆ; లక్ష్మణః=లక్ష్మణుఁడు; ఆశ్రమపదం= ఆశ్రమస్థానమును; ప్రవిశ్య = ప్రవేశించి; అగస్త్యశిష్యం=అగస్త్యునియొక్క శిష్యుని; ఆసాద్య=పొంది; ఏతత్=ఈ; వాక్యం= మాటను; ఉవాచ= చెప్పెను ("హ" అనునది పాదపూరణార్థము.)

రామునితమ్ముండగు లక్ష్మణుండు, అగస్త్యాశ్రమంబుఁ బ్రవేశించి , యగస్త్యుని శిష్యునియొద్దకుఁబోయి యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

రాజా దశరథో నామ జ్యేష్ఠ స్తస్య సుతో బలీ
రామః ప్రాప్తో మునిం ద్రష్టుం భార్యయా సహ సీతయా. ౨

టీక॥ దశరథో నామ= దశరథుఁడను పేరుగల; రాజా= రాజు; అస్తి (అధ్యాహృతము)=కలఁడు. తస్య= అతనియొక్క; జ్యేష్ఠః = పెద్దవాఁడైన; సుతః=కొడుకును; బలీ= అధికమయినబలముగలవాఁడునగు; రామః= రాముఁడు; మునిం=అగస్త్యమహామునిని ; ద్రష్టుం=చూచుటకు; భార్యయా = భార్యయయిన; సీతయాసహ = సీతతోఁగూడ; ప్రాప్తః=వచ్చినాఁడు.

దశరథుండను రాజొకండుగలఁడు; అతనిజ్యేష్ఠకుమారుండు బలవంతుండునగు రాముండు , అగస్త్యమహాముని౦జూచుటకై , భార్యయగుసీతతోఁగూడవచ్చినాఁడు. అని, తాత్పర్యము,

లక్ష్మణో నామ తస్యాహం భ్రాతా త్వవరజో హితః
అనుకూలశ్చ భక్తశ్చ యది తే శ్రోత్ర మాగతః. ౩

స ౧౨

టీక॥ అహంతు=నేను;లక్ష్మణోనామ=లక్ష్మణుఁడనుపేరుగలవాఁడను. తస్య=అతనికి;అవరజః=వెనుకఁబుట్టిన;భ్రాతా=తోఁబుట్టువును.హితః=ఇష్టుండను.అనుకూలశ్చ=అనుకూలుండను.భక్తశ్చ=భక్తుండను. తే=నీయొక్క;శ్రోత్రం=చెవిని; ఆగతోయది=పొందినవాఁడనే.

నేను, లక్ష్మణుండనుపేరుగలవాఁడను; ఆ రామునికిఁదమ్ముండను,ఇష్టుండను, అనుకూలుండనుభక్తుండను, నీవునువినియుందువు.

అని,తాత్పర్యము.

తే వయం వన మత్యుగ్రం ప్రవిష్టాః పితృశాసనాత్
ద్రష్టు మిచ్ఛామహే సర్వే భగవంతం నివేద్యతామ్. ౪

టీక॥ తే=అట్టి;వయం=మేము; పితృశాసనాత్=తండ్రియాజ్ఞవలన; అత్యుగ్రం=మిక్కిలియుభయంకరముగు;వనం=అడవిని;ప్రవిష్టాః=ప్రవేశించినాము. సర్వే=అందఱమును; భగవంతం=అధికమయినమాహాత్మ్యముగలయగస్త్యుని;ద్రష్టుం=చూచుటకు; ఇచ్ఛామహే (ఇచ్ఛామః)=కోరుచున్నాము నివేద్యతాం=తెలుపఁబడుఁగాక.

మేముమువ్వురమును, మాతండ్రియాజ్ఞవలన,భయంకరంబగునరణ్యమునకువచ్చినాము; మేమందఱమును, భగవంతుండగునగస్త్యుఁజూడఁగోరియున్నాము,ఆయనకుందెల్పుము. అని,లక్ష్మణుండగస్త్యశిష్యునకుఁజెప్పెను.

అని,తాత్పర్యము.

విశేషార్థము.— ఈశ్లోకమునందు, "తేవయం"అనుస్థలముననుండు "య"అనునక్షరముచేత, గాయత్రియెనిమిదవ యక్షరము గ్రహింపఁబడినది. ఏడువేలశ్లోకంబులయినవి.

తస్య తద్వచనం శ్రుత్వా లక్ష్మణస్య తపోధనః
తథేత్యుక్త్వాగ్నిశరణం ప్రవివేశ నివేదితుమ్. ౫

టీక॥ తపోధనః=ఋషి;తస్య=ఆ; లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క; తత్=ఆ;వచనం=మాటను;శ్రుత్వా=విని;తథేతి=అట్లెయని;ఉక్త్వా=చెప్పి;

నివేదితుం=తెలుపుటకు; అగ్నిశరణం= అగ్నిహోత్రగృహమును ; ప్రవివేశ= ప్రవేశించెను.

అగస్త్యశిష్యుఁడు, ఆలక్ష్మణునిమా టనువిని, అట్లేయనిచెప్పి, అగస్త్యునకు విన్నవించుటకై, యగ్నిహోత్రగృహములోనికిం బోయెను. అని, తాత్పర్యము.

స ప్రవిశ్య మునిశ్రేష్ఠం తపసా దుష్ప్రధర్షణమ్
కృతాంజలి రువాచేదం రామాగమన మంజసా. ౬
యథోక్తం లక్ష్మణేనైవ శిష్యో౽గస్త్యస్య సమ్మతః

టీక॥ సః=ఆ; అగస్త్యస్య= అగస్త్యునియొక్క; సమ్మతః= ప్రియుండగు; శిష్యః=శిష్యుఁడు; ప్రవిశ్య= చొచ్చి; కృతాంజలిః=చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై, తపసా=తపస్సుచేత, దుష్ప్రధర్షణం = ఎదిరింపఁబలవిగానట్టి; మునిశ్రేష్ఠం = మునివరుండగునగస్త్యునిగూర్చి; లక్ష్మణేన= లక్ష్మణునిచేత; యథోక్తమేవ = చెప్పఁబడినట్లే, అంజసా=శీఘ్రంబున; రామాగమనం=రాముని రాకనుగూర్చి ; ఇదం= ఈమాటను;ఉవాచ=చెప్పెను.

ఆయగస్త్యప్రియశిష్యుండు, అట్లు, అగ్నిహోత్రగృహంబుఁజొచ్చి, శీఘ్రంబున, మహాతపశ్శాలియగు నగస్త్యమహామునింజూచి, లక్ష్మణుఁడు చెప్పినపద్ధతిని, రామాగమనంబునుగుఱించి, యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

పుత్త్రౌ దశరథస్యేమౌ రామో లక్ష్మణ ఏవచ. ౭
ప్రవిష్టా వాశ్రమపదం సీతయాసహ భార్యయా

టీక॥దశరథస్య=దశరథమహారాజుయొక్క;పుత్త్రౌ=కొడుకులయిన ; ఇమౌ=ఈ; రామః=రాముండును;లక్ష్మణఏవచ=లక్ష్మణుండును; భార్యయా= భార్యయయిన,సీతయాసహ = సీతతోఁగూడ;ఆశ్రమపదం= ఆశ్రమస్థానమును;ప్రవిష్టౌ=ప్రవేశించినారు.

దశరథమహారాజకుమారులగు రామలక్ష్మణులిర్వురు, రామభార్యయగుసీతతోడంగూడి, మనయాశ్రమంబునకు వచ్చియున్నారు. అని, తాత్పర్యము.

ద్రష్టుం భవంత మాయాతౌ శుశ్రూషార్థ మరిందమౌ. ౮
యదత్రానంతరం తత్త్వ మాజ్ఞాపయితు మర్హసి

టీక॥ అరిందమౌ=శత్రువులనణఁగఁదొక్కునట్టి రామలక్ష్మణులు; శుశ్రూషార్థం=సేవకొఱకు; భవంతం = నిన్ను; ద్రష్టుం=చూచుటకు, ఆయాతౌ= వచ్చినారు. అత్ర= ఈవిషయమునందు; యత్=ఏది; అనంతరం= అవ్వలిదగు; కార్యం= పనియో; తత్=దానిని; త్వం=నీవు; ఆజ్ఞాపయితుం= ఆనతిచ్చుటకు; అర్హసి=తగుదువు.

శత్రువుల నణఁగఁద్రొక్కఁజాలిన యీ రామలక్ష్మణులు, నిన్నుఁజూచి సేవింపవలెనని వచ్చినారు. ఇఁకనీవిషయమునందుఁ జేయవలసినది నానతిమ్ము. అని, శిష్యుఁడగస్త్యునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తత శ్శిష్యా దుపశ్రుత్య ప్రాప్తం రామం సలక్ష్మణమ్. ౯
వైదేహీంచ మహాభాగా మిదం వచన మబ్రవీత్

టీక॥ తతః=అంత; సః(అధ్యాహృతము)=ఆయగస్త్యమహర్షి; శిష్యాత్=శిష్యునివలన; ప్రాప్తం=వచ్చిన; సలక్ష్మణం=లక్ష్మణునితోఁగూడిన; రామం=రామునిని; ప్రాప్తాం(అధ్యాహృతము)= వచ్చిన; మహాభాగాం= పూజ్యమయిన యదృష్టముగల; వైదేహీంచ=సీతను; ఉపశ్రుత్య=విని; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్= చెప్పెను.

అంతనయ్యగస్త్యమహర్షి, రామలక్ష్మణులును, మహాభాగయగు సీతాదేవియు వచ్చుటను శిష్యునివలన విని, శిష్యుఁజూచి, యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

దిష్ట్యా రామ శ్చిరస్యాద్య ద్రష్టుం మాం సముపాగతః. ౧౦
మనసా కాంక్షితం హ్యస్య మయాప్యాగమనం ప్రతి

టీక॥ దిష్ట్యా=భాగ్యముచేత; రామః=రాముఁడు; చిరస్య = బహుకాల




మునకు; మాం=నన్ను, ద్రష్టుం= చూచుటకు; సముపాగతః= వచ్చినాఁడు. అస్య=ఈతనియొక్క. ఆగమనం= వచ్చుట; మయాపి=నాచేతనుంగూడ; మనసా=మనస్సుచే; ప్రతికాంక్షితంహి= ఎదురుచూడఁబడినదిగదా!

నాభాగ్యవశంబున బహుకాలంబునకు, రాముండునన్నుఁజూడ నిచ్చటికివచ్చెను; నేను, రాముండువచ్చునని, బహుకాలముగా మనంబున నెదురు చూచుచుంటిని. అని, తాత్పర్యము.

గమ్యతాం సత్కృతో రామ స్సభార్య స్సహలక్ష్మణః. ౧౧
ప్రవేశ్యతాం సమీపం మే కించా సౌ న ప్రవేశితః

టీక॥ గమ్యతాం= పోవుటయగుఁగాక. సభార్యః = భార్యతోఁగూడినవాఁడును; సహలక్ష్మణః=లక్ష్మణునితోఁగూడినవాఁడునగు; రామః= రాముఁడు; సత్కృతః = పూజితుండు. మే=నాయొక్క; సమీపం= సమీపమును; ప్రవేశ్యతాం=పొందింపఁబడుఁగాక. కించ=ఎందుకు; అసౌ = ఈరాముండు ; నప్రవేశితః = పొందింపఁబడఁడయ్యె?

నీవు, పొమ్ము; సీతయులక్ష్మణుండును రాముండును,వీరలుపూజార్హులు;వారలరానిమ్ము ; ఇంతకుమునుపే యేలనీవురానివ్వక జాగుచేసినావు? అని,యగస్త్యుండు, శిష్యునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు మునినా ధర్మజ్ఞేన మహాత్మనా. ౧౨
అభివాద్యా బ్రవీ చ్ఛిష్య స్తథేతి నియతాంజలిః

టీక॥ శిష్యః= శిష్యుఁడు; మహాత్మనా= అధికమయినప్రభావముగల; ధర్మజ్ఞేన = ధర్మము నెఱింగిన; మునినా= అగస్త్యమహామునిచేత; ఏవం= ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడైనంతనే; అభివాద్య=నమస్కరించి; నియతాంజలిః= గ్రహింపఁబడినచేమోడ్పుగలవాఁడై; తథేతి=అట్లేయని ; అబ్రవీత్ =చెప్పెను.

మహాత్ముండును ధర్మజ్ఞుండునగు




నయ్యగస్త్యమహామునిచెప్పినమాటను విని, శిష్యుఁడు, నమస్కరించి, చేతు లు మొగుడ్చుకొని, అట్లెయనిచెప్పెను.
అని, తాత్పర్యము.

తతో నిష్క్రమ్య సంభ్రాంత శ్శిష్యో లక్ష్మణ మబ్రవీత్. ౧౩

టీక॥తతః=అంత; శిష్యః= శిష్యుఁడు;సంభ్రాంతః=త్వరితుండై; నిష్క్రమ్య=వెడలి; లక్ష్మణం = లక్ష్మణునిగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

అంతశిష్యుండు, వేగంబునంబోయి, లక్ష్మణుంజూచి, యిట్లనిచెప్పెను.
అని; తాత్పర్యము.

క్వాసౌ రామో మునిం ద్రష్టు మేతు ప్రవిశతు స్వయమ్

టీక॥అసౌ=ఈ;రామః= రాముఁడు;క్వ=ఎచ్చటః?మునిం=అగస్త్యమహామునిని;ద్రష్టుం=చూచుటకు,ఏతు = వచ్చుఁగాక,స్వయం=తానె;ప్రవిశతు=ప్రవేశించుఁగాక.

రాముండెచ్చటనున్నాఁడు ? అగస్త్యమహామునిఁజూచుటకు, ఆయనవచ్చుఁగాక, శీఘ్రముగారానిమ్ము. అని, శిష్యుఁడులక్ష్మణునితోఁజెప్పెను.
అని, తాత్పర్యము.

తతో గత్వా శ్రమద్వారం శిష్యేణ సహ లక్ష్మణః. ౧౪
దర్శయామాస కాకుత్థ్సం సీతాంచ జనకాత్మజామ్

టీక॥తతః=అంత;సః=ఆ ; లక్ష్మణః=లక్ష్మణుఁడు;శిష్యేణసహ=శిష్యునితోఁగూడ;ఆశ్రమద్వారం = ఆశ్రమద్వారమును;గత్వా= పొంది ; కాకుత్థ్సం=రామునిః;జనకాత్మజాం= జనకమహారాజుకూఁతురయిన; సీతాంచ= సీతాదేవిని; దర్శయామాస = చూపెను.

అంత,లక్ష్మణుండు,శిష్యునితోఁగూడనాశ్రమద్వారంబు నొద్దకుఁబోయి, సీతారాములనతనికిఁజూపెను.
అని, తాత్పర్యము.

తం శిష్యః ప్రశ్రితో వాక్య మగస్త్యవచనం బ్రువన్. ౧౫

ప్రావేశయ ద్యథాన్యాయం సత్కారార్హం సుసత్కృతమ్

టీక॥ శిష్యః=శిష్యుఁడు; ప్రశ్రితః=వినయముగలవాఁడై; సత్కారార్హం=పూజార్హుఁడగు; తం=ఆరామునిః; అగస్త్యవచనం=అగస్త్యునిచేఁ జెప్పఁబడిన; వాక్యం=మాటను; బ్రువన్ = చెప్పుచు; యథాన్యాయం=న్యాయమునతిక్రమింపక; సుసత్కృతం = మిక్కిలియు గౌరవముగలుగునట్లుగా; ప్రావేశయత్=ప్రవేశింపఁజేసెను.

శిష్యుఁడు, వినయంబునఁ, బూజార్హుఁడగు రామునియథాన్యాయంబుగా, గౌరవంబేర్పడ, నాశ్రమంబు లోనికిందీసికొనిపోయెను.

అని, తాత్పర్యము.

ప్రవివేశ తతో రామ స్సీతయా సహలక్ష్మణః ౧౬
ప్రశాంత హరిణాకీర్ణ మాశ్రమం హ్యవలోకయన్

టీక॥ తతః=అంత; సీతయా = సీతతో; సహలక్ష్మణః = లక్ష్మణునితోఁ గూడినవాఁడై ; ప్రశాంత హరిణాకీర్ణం= మిక్కిలియు శాంతములగుజింకలచేవ్యాపింపఁబడిన; ఆశ్రమం = ఆశ్రమమును; అవలోకయన్ = చూచుచు; ప్రవివేశహి=ప్రవేశించెనుగదా!

అంత, రాముండు , సీతాలక్ష్మణసహితుండై , శాంతంబులగుజింకలతోఁగూడిన , యయ్యాశ్రమంబుఁజూచుచుఁ, బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

స తత్ర బ్రహ్మణ స్థ్సాన మగ్నే స్థ్సానం తథైవచ. ౧౭
విష్ణో స్థ్సానం తథేంద్రస్య స్థానంచైవ వివస్వతః
సోమస్థానం భగస్థానం స్థానం కౌబేర మేవచ. ౧౮
ధాతు ర్విధాతు స్థ్సానేచ వాయో స్థ్సానం తథైవచ
నాగరాజస్యచ స్థాన మనంతస్య మహాత్మనః. ౧౯
స్థానం తథైవ గాయత్ర్యా వసూనాం స్థానమేవచ
స్థానంచ పాశహ స్తస్య వరుణస్య మహాత్మనః. ౨౦
కార్తికేయస్యచ స్థానం ధర్మస్థానంచ పశ్యతి

స ౧౨

టీక॥ తతః=అచ్చట; సః=ఆ ; తత్ర=ఆయగస్త్యాశ్రమమునందు ; బ్రహ్మణః= బ్రహ్మదేవునియొక్క; స్థానం= స్థానమును; అగ్నేః = అగ్నియొక్క; స్థానంతథైవచ=స్థానమును; విష్ణోః= విష్ణుదేవునియొక్క; స్థానం= స్థానమును;తథా=అట్లు;ఇంద్రస్య = ఇంద్రుని యొక్క, స్థానం=స్థానమును ; వివస్వతః=సూర్యునియొక్క ; (స్థానం) చైవ=స్థానమును;సోమస్థానం = చంద్రునియొక్క స్థానమును ; భగస్థానం = భగునిస్థానమును ; కౌబేరం = కుబేరునిసంబంధియగు ; స్థానమేవచ= స్థానమును;ధాతుః = ధాతయొక్కయు;విధాతుః= విధాతయొక్కయు; స్థానేచ=స్థానములను;వాయోః= వాయువుయొక్క;స్థానంతథైవచ = స్థానమును;నాగరాజస్య= ఆదిశేషునియొక్క;స్థానంచ=స్థానమును ; మహాత్మనః = అధికమయినప్రభావముగల,అనంతస్య = అనంతునియొక్క;స్థానంచ (అధ్యాహృతము)= స్థానమును;తథైవ=అట్లె;గాయత్ర్యాః= గాయత్రియొక్క;స్థానం = స్థానమును;వసూనాం=వసువులయొక్క; స్థానమేవచ= స్థానమును;పాశహస్తస్య = పాశము చేతియందుఁగల;మహాత్మనః = అధికమయినప్రభావముగల;వరుణస్య= వరుణునియొక్క;స్థానంచ = స్థానమును;కార్తికేయస్య = కుమారస్వామియొక్క;స్థానంచ=స్థానమును; ధర్మస్థానంచ = ధర్మునియొక్కస్థానంబును;పశ్యతి=చూచుచున్నాఁడు.

ఆయగస్త్యాశ్రమమునందు ; బ్రహ్మదేవునిస్థానంబును అగ్నిస్థానంబును, విష్ణుస్థానంబును ; దేవేంద్రస్థానంబును, సూర్యస్థానంబును , చంద్రస్థానంబును, భగస్థానంబును , కుబేరస్థానంబును, ధాతృస్థానంబును , విధాతృస్థానంబును,వాయుస్థానంబును ; శేషస్థానంబును , మహాత్ముండగునవంతునిస్థానంబును, గాయత్రీస్థానంబును , వసుస్థానంబును, మహాత్ముండును పాశహస్తుండునగు వరుణునిస్థానంబును, కుమారస్వామి స్థానంబును ధర్మస్థానంబును జూచుచుఁబోయెను.

అని, తాత్పర్యము.

తత శ్శిష్యైః పరివృతో ముని రప్యభినిష్పతత్. ౨౧
తం దదర్శాగ్రతో రామో మునీనాం దీప్తతేజసామ్

టీక॥ తతః = అంతట; మునిరపి = అగస్త్యమహామునియు; శిష్యైః = శిష్యుల చేత; పరివృతః = పరివేష్టింపఁబడినవాఁడై; అభినిష్పతత్ = ఎదురుకొనివచ్చెను. రామః = రాముఁడు; దీప్తతేజసాం = ప్రకాశించుచున్న కాంతిగల; మునీనాం = మునులయొక్క; అగ్రతః = ముందట; తం = ఆయగస్త్యమహామునిని; దదర్శ = చూచెను.

అంతటనగస్త్యమహామునియు, శిష్యులతోఁగూడ రామునెదురుకొని వచ్చెను; రాముండు, మహాతేజస్సంపన్ను లగుమునుల యగ్రభాగంబునవచ్చుచున్నయగస్త్యమహామునింజూచెను.

అని, తాత్పర్యము.

అబ్రవీ ద్వచనం వీరో లక్ష్మణం లక్ష్మివర్ధనమ్. ౨౨

టీక॥ వీరః = పరాక్రమశాలియగు రాముండు; లక్ష్మివర్ధనం = సంపదను వృద్ధిఁబొందించునట్టి; లక్ష్మణం = లక్ష్మణునిగూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

పరాక్రమవంతుఁడగు రాముఁడు, సంపద్వర్ధనుండయినలక్ష్మణుఁజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఏష లక్ష్మణ నిష్కామ త్యగస్త్యో భగవా నృషిః
ఔదార్యేణా వగచ్ఛామి నిధానం తపసా మిమమ్. ౨౩

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! భగవాన్ = అధికమయినమాహాత్మ్యముగల; ఋషిః = ఋషియగు; ఏషః = ఈ; అగస్త్యః = అగస్త్యుఁడు; నిష్క్రామతి = వెడలివచ్చుచున్నాఁడు. ఔదార్యేణ = తేజోతిశయముచేత; తపసాం = తపస్సులయొక్క; నిధానం = నిధియయిన; ఇమం = ఈ యగస్త్యుని; అవగచ్ఛామి = తెలిసికొనుచున్నాను.

లక్ష్మణుఁడా! ఇదిగో భగవంతుండగునగస్త్యుండువచ్చుచున్నాఁడు; ఈతని తేజోవిశేషముచేత, నితండుతపోనిధియగునగస్త్యుండనిగనుఁగొంటిని. అని, రాముండులక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మహాబాహు రగస్త్యం సూర్యవర్చసమ్

జగ్రాహ పరమప్రీత స్తస్య పాదౌ పరంతపః. ౨౪

టీక॥ పరంతపః=శత్రువులనుదపింపఁజేయునట్టి; మహాబాహుః=పెద్దచేతులుగలరాముఁడు; సూర్యవర్చసం=సూర్యుని తేజస్సువంటి తేజస్సుగల; అగస్త్యం=అగస్త్యునిగూర్చి; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; పరమప్రీతః=మిక్కిలియుసంతోషించినవాఁడై, తస్య=అగస్త్యునియొక్క; పాదౌ=పాదములను; జగ్రాహ=పట్టుకొనెను.

ఇట్లు, శత్రువులదపింపఁజేయునట్టి మహాబాహుండగు రాముండు సూర్యునింబోలె దేజస్సుగల యగస్త్యుంగుఱించినుడువుచు, బరమసంతుష్టుండై, యమ్మహామునింబొంది, యాయనపాదంబులకభివందనంబు గావించెను.

అని, తాత్పర్యము.

అభివాద్యతు ధర్మాత్మా తస్థౌ రామః కృతాంజలిః
సీతయాసహ వైదేహ్యా తదా రామ స్సలక్ష్మణః. ౨౫

టీక॥ తదా = అప్పుడు; ధర్మాత్మా= ధర్మస్వభావుండును; సలక్ష్మణః=లక్ష్మణునితోఁగూడినవాఁడునగు; రామః=రాముడు; వైదేహ్యా = విదేహదేశమునందుఁబుట్టిన; సీతయాసహ=సీతతోఁగూడ; అభివాద్యతు = నమస్కరించియు; రామః = రాముఁడు; కృతాంజలిః = చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై; తస్థౌ=నిలిచెను.

అప్పుడు, ధర్మాత్ముండగు రాముండు, సీతాలక్ష్మణులతోఁగూడ, నయ్యాగస్త్యమహామునికి నమస్కరించి. చేతులు మొగుడ్చుకొని, నిలుచుండెను.

అని, తాత్పర్యము,

ప్రతిజగ్రాహ కాకుత్థ్స మర్చయిత్వాఽసనోదకైః
కుశలప్రశ్న ముక్త్వాచ హ్యాస్యతా మితి చాబ్రవీత్. ౨౬

టీక॥సః(అధ్యాహృతము)=ఆయగస్త్యుఁడు; కాకుత్థ్సం=రామునిఁ; ప్రతిజగ్రాహ=ప్రతిగ్రహించెను. ఆసనోదకైః=ఆసనముచేతను పాద్య జలము



లచేతను; అర్చయిత్వా = పూజించి; కుశలప్రశ్నం = క్షేమప్రశ్నమును; ఉక్త్వా చ = చెప్పియు; ఆస్యతాం = కూర్చుండుట యగుఁగాక; ఇతి చ = అనియు; అబ్రవీద్ధి = చెప్పెనుగదా!

ఆయగస్త్యుండు, రాముని నతిథిగాఁ బ్రతిగ్రహించి, ఆసనంబొసంగి, యర్ఘ్యపాద్యంబులఁ బూజించి కుశలం బడిగి, కూర్చుండుమని చెప్పెను.

అని, తాత్పర్యము.

అగ్నిం హుత్వా ప్రదాయార్ఘ్య మతిథీన్ ప్రతిపూజ్య చ
వానప్రస్థేన ధర్మేణ స తేషాం భోజనం దదౌ. ౨౭

టీక॥ సః = ఆయగస్త్యుఁడు; అగ్నిం = అగ్నిహోత్రమును; హుత్వా = వేల్చి; అర్ఘ్యం = అర్ఘ్యమును; ప్రదాయ = ఇచ్చి; అతిథీన్ = అతిథులను; ప్రతిపూజ్య చ = పూజించియు; వానప్రస్థేన = వానప్రస్థులకు యోగ్యమయిన; ధర్మేణ = ధర్మముచేత; తేషాం = వారలకు; భోజనం = ఆహారమును; దదౌ = ఇచ్చెను.

ఆయగస్త్యుఁడు, వైశ్వదేవముగావించి, యాయతిథుల నర్ఘ్యాదులఁ బూజించి, వారలకు వానప్రస్థధర్మం బైన ఫలమూలాద్యాహారములొసంగెను. అని, తాత్పర్యము.

ప్రథమం చోపవిశ్యాథ ధర్మజ్ఞో మునిపుంగవః
ఉవాచ రామ మాసీనం ప్రాంజలిం ధర్మకోవిదమ్. ౨౮

టీక॥ అథ = అంత; ధర్మజ్ఞః = ధర్మము నెఱింగిన; మునిపుంగవః = ఋషిశ్రేష్ఠుండగు నగస్త్యుండు; ప్రథమం = మొదల; ఉపవిశ్య చ = కూర్చుండియు; ఆసీనం = కూర్చుండినవాఁడును; ప్రాంజలిం = మంచి చేమోడ్పుగలవాఁడును; ధర్మకోవిదం = ధర్మంబులం బండితుండునగు; రామం = రాముని గూర్చి; ఉవాచ = చెప్పెను.

అంత, ధర్మజ్ఞుండగు నగస్త్యమహర్షి, యందఱును గూర్చుండిన పిమ్మట, చేతులు మొగుడ్చుకొని కూర్చుండియున్న ధర్మకోవిదుండగు రాముం జూచి, యిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.





అగ్నింహుత్వా ప్రదాయార్ఘ్య మతిధిం ప్రతిపూజయేత్

టీక॥ అగ్నిం = అగ్నిహోత్రమును; హుత్వా=వ్రేల్చి; అర్ఘ్యం= అర్ఘ్యమును, ప్రదాయ = ఇచ్చి; అతిథిం=అతిధిని, ప్రతిపూజయేత్ = పూజింపవలయును.

వైశ్వదేవముచేసి, యర్ఘ్యమునొసంగి, యతిధినిబూజింపవలయును. అని. తాత్పర్యము.

అన్యధాఖలు కాకుత్స్థ తపస్వీ సముదాచరన్. ౨౮
దుస్సాక్షీవ పరే లోకే స్వాని మాంసాని భక్షయేత్

టీక॥ కాకుత్స్థ = రాముఁడా! తపస్వీ=ఋషి; అన్యధా = వేఱువిధముగా; సముదాచరన్ = ఆచరించుచు; దుస్సాక్షీవ=దుష్టసాక్షివలె, పరే= ఇతరమయిన; లోకే = లోకమునందు; స్వాని=తనవైన; మాంసాని= మాంసములను; భక్షయేత్ =భక్షించును.

రాముఁడా! ఋషియగువాఁడు, అట్లు అతిధిపూజ గావింపఁడేని, తప్పుసాక్ష్యము చెప్పినవాఁడువలెఁ, బరలోకంబునఁ, దనమాంసంబు దానే భక్షించును. అని, తాత్పర్యము.

రాజా సర్వస్య లోకస్య ధర్మచారీ మహారథః. ౩౦
పూజనీయశ్చ మాన్యశ్చ భవాన్ ప్రాప్తః ప్రియాతిథిః

టీక॥ సర్వస్య = సమస్తమయిన; లోకస్య = లోకమునకు; రాజా=ప్రభుఁడవును; ధర్మచారీ=ధర్మమునాచరించువాఁడవును; మహారథః=తన్ను సారధిని గుఱ్ఱంబులనుం గాపాడుకొనుచుఁ బదునొకండువేల విలుకాండ్రతోఁ బోరువాఁడవును; పూజనీయశ్చ=పూజింపఁదగినవాఁడవును; మాన్యశ్చ = గౌరవింపఁబడినవాఁడవును; ప్రియాతిథిః=ప్రియాతిధివియునగు; భవాన్=నీవు; ప్రాప్తః= వచ్చితావు.

సమస్తలోకంబునకును ప్రభుండవును, ధార్మికుండవును, మహారధుండవును, బూజనీయుండవు మాన్యుండవునగు. ప్రియాతిధివైననీవువచ్చినప్పుడు, విశేషించిపూజింపవలయునని చెప్పనే

లు; అని, యగస్త్యుండు, రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా ఫలై ర్మూలైః పుష్పై ర న్యైశ్చ రాఘవమ్. ౩౧
పూజయిత్వా యథా కామం పునరేవ తతో బ్రవీత్

టీక॥ సః(అధ్యాహృతము)=ఆయగస్త్యుఁడు; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; ఫలైః=పండ్లచేతను, మూలైః=గడ్డలచేతను; పుష్పైః=పూలచేతను; అన్యైశ్చ=ఇతరములచేతను; రాఘవం=రాముని; యథాకామం=యథేచ్ఛముగా; పూజయిత్వా=పూజించి; తతః=అంత; పునరేవ=మఱలనే; అబ్రవీత్=చెప్పెను.

ఆయగస్త్యుండు, ఈప్రకారమునం జెప్పి, ఫలములమూలంబులనుబుష్పంబులను ఇతరంబులగువన్యద్రవ్యంబులను యథావిధిగ రాముంబూజించి, మఱలనిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము,

ఇదం దివ్యం మహచ్చాపం హేమరత్న విభూషితమ్. ౩౨
వైష్ణవం పురుషవ్యాఘ్ర నిర్మితం విశ్వకర్మణా

టీక॥పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! హేమరత్న విభూషితం = బంగారముచేతనురత్నములచేతను అలంకరింపఁబడినదియు; దివ్యం=శ్రేష్ఠమును; మహత్ = పూజ్యంబునగు; ఇదం=ఈ; చాపం=ధనుస్సు; వైష్ణవం = విష్ణుదేవునిది. విశ్వకర్మణా = విశ్వకర్మచేత ; నిర్మితం= నిర్మింపఁబడినది.

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! రత్నకాంచనాలంకృతంబును దివ్యంబును బూజ్యంబునగు నీధనుస్సు, విష్ణుదేవునిది; విశ్వకర్మచే నిర్మింపఁబడినది. అని, తాత్పర్యము.

అమోఘ స్సూర్యసంకాశో బ్రహ్మదత్త శ్శరోత్తమః. ౩౩

టీక॥అయం (అధ్యాహృతము) = ఈ; సూర్యసంకాశః=సూర్యునితో సమానమగు; శరోత్తమః= బాణశ్రేష్ఠము; అమోఘః=వ్యర్థముకానిది; బ్రహ్మ

దత్తః=బ్రహ్మదేవునిచేనివ్వఁబడినది. సూర్యసమానంబగునీబాణోత్తమము,అమోఘమయినది ; బ్రహ్మదేవునిచేనివ్వఁబడినది. అని,తాత్పర్యము.

దత్తౌ మమ మహేంద్రేణ తూణీ చాక్షయసాయకౌ
సంపూర్ణౌ నిశితై ర్బాణై ర్జ్వలద్భి రివ పావకైః. ౩౪

టీక॥జ్వలద్భిః = మండుచున్న ; పావకైరివ (స్థితైః)=అగ్నులుచేనున్న; నిశితైః=తీక్ష్ణములగు; బాణైః = బాణములచేత, సంపూర్ణౌ= నిండిన;ఇమౌ(అధ్యాహృతము)= ఈ; అక్షయసాయకౌ= నాశములేనిబాణములుగల; తూణీచ=అమ్ములపొదులును; మమ=నాకు; మహేంద్రేణ = దేవేంద్రునిచేత; దత్తౌ=ఇయ్యఁబడినవి.

మండుచున్నయగ్నిహోత్రమువంటి బాణంబుల నిండిన యీయక్షయ బాణతూణీరంబులు రెండును, నాకు దేవేంద్రుండొసంగినవి,

అని, తాత్పర్యము,

మహారజతకోశో యమసి ర్హేమవిభూషితః

టీక॥అయం=ఈ ; మహారజతకోశః=బంగారువికారమయినయొరగలదియు; హేమవిభూషితః= బంగారముచేనలంకరింపఁబడినదియునగు ; అసిః=ఖడ్గము;మహేంద్రేణదత్తః(అధ్యాహృతము)= ఇంద్రునిచేనియ్యఁబడినది.

బంగారుతోఁజేయఁబడిన యొరగలదియు బంగారముతోనలంకరింపఁబడినదియునగు నీఖడ్గమునునాకు దేవేంద్రుం డొసంగెను.అని,తాత్పర్యము.

అనేన ధనుషా రామ హత్వా సంఖ్యే మహాసురాన్. ౩౫
ఆజహార శ్రియం దీప్తాం పురా విష్ణు ర్దివౌకసామ్

టీక॥ రామ=రాముఁడా! పురా= మున్ను;విష్ణుః=విష్ణుదేవుఁడు; అనేన= ఈ;ధనుషా=వింటిచేత;సంఖ్యే= యుద్ధమునందు;మహాసురాన్ = పెద్దయసురులను;హత్వా = చంపి;దీప్తాం= ప్రకాశించుచున్న;దివౌకసాం = దేవ

తలయొక్క; శ్రియం=లక్ష్మిని, ఆజహార=తీసెను.

రాముఁడా! మున్నువిష్ణుదేవుఁడు, ఈధనుస్సునను యుద్ధంబున నసురులవధించి, దేవతలకురాజ్యలక్ష్మినిగలుగఁ జేసెను. అని, తాత్పర్యము.

తద్ధనుస్తౌ చ తూణీరౌ శరం ఖడ్గంచ మానద. ౩౫
జయాయ ప్రతిగృహ్ణీష్వ వజ్రం వజ్రధరో యథా

టీక ॥ మానద = మానమువొసంగునట్టి రాముఁడా!; తత్ = ఆ; ధనుః = ధనుస్సును; తౌ = ఆ; తూణీరౌచ = అమ్ములపొదులను; శరం = బాణమును, ఖడ్గంచ = ఖడ్గమునను; వజ్రం = వజ్రాయుధమును; వజ్రధరో యథా = దేవేంద్రుండువలె, జయాయ = జయముకొఱకు; ప్రతిగృహ్ణీష్వ = పుచ్చుకొనుము.

ఆశ్రితమానమునుకాపాడునట్టి రాముఁడా! ఆధనుస్సును, ఆయమ్ముల పొదులను, అదేఖడ్గమును; బాణంబును దేవేంద్రుండువజ్రాయుధంబుం బోలె, శత్రువిజయార్థమయి, ప్రతిగ్రహింపుము. అని, యగస్త్యుండు రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

విశేషార్థము.— దేవేంద్రుండు తనవజ్రాయుధమునుగ్రహించునట్లు, అనిచెప్పుటచే, "ఇంద్రునకువజ్రాయుధముంబోలె, నీకునీధనుర్బాణతూణీరంబులునుఖడ్గంబును స్వీయంబులు నీవ విష్ణుదేవుండవు; మున్ను దేవతలకుజయంబుగలిగించుటకై, యీధనుర్బాణాదులధరించియుద్ధముగావించినట్లు, ఇప్పుడును, దేవకార్యార్థమయినీవుయుద్ధముచేయవలసియున్నదికావున, వీనిగ్రహింపుము" అని, సూచింపఁబడినది.

ఏవముక్త్వా మహాతేజాస్సమస్తం తద్వరాయుధమ్. ౩౬
దత్వా రామాయ భగవానగస్త్యః పునరబ్రవీత్

టీక॥ మహాతేజాః = అధికమయినతేజస్సుగలవాఁడును; భగవాన్ = అధికమయినమాహాత్మ్యముగల వాఁడునగు; అగస్త్యః = అగస్త్యమహాముని; ఏవం = ఇట్లు; ఉక్త్వా = చెప్పి; తత్ = ఆ; వరాయుధం = శ్రేష్ఠమయినయాయుధ

మును; సమస్తం=అంతను ; రామాయ=రామునికొఱకు; దత్వా=ఇచ్చి ; పునః=మఱల; అబ్రవీత్=చెప్పెను.

మహాతేజుండును భగవంతుండునగు నగస్త్యమహాముని, ఇట్లుచెప్పి, రామునకాయుత్తమాయుధంబుల నొసంగి, మఱలనిట్లని, పలికెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే, ద్వాదశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండ ద్వాదశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

త్ర యో ద శ స ర్గ ప్రా రం భః.

రామ ప్రీతోస్మి భద్రంతే పరితుష్టోస్మి లక్ష్మణ
అభివాదయితుం యన్మాం ప్రాప్తౌ స్థ స్సహసీతయా. ౧

టీక॥ యత్ = ఏకారణమువలన; మాం=నన్ను; అభివాదయితుం = నమస్కరించుటకు; సీతయాసహ = సీతతోఁగూడ; ప్రాప్తౌ=వచ్చినవారలు; స్థః = అగుచున్నారో; తత్ (అధ్యాహృతము) = అందువలన; రామ = రాముఁడా ! ప్రీతః = సంతోషముగలవాఁడను; అస్మి= అయితిని. తే = నీకు; భద్రం=మంగళము; అస్తు (అధ్యాహృతము)= అగుఁగాక. లక్ష్మణ=లక్ష్మణుఁడా! పరితుష్టః = సంతోషించినవాఁడను; అస్మి=అగుచున్నాను.

రాముఁడా! లక్ష్మణుఁడా! మీరలుసీతతోఁగూడ, నన్నునమస్కరించుటకై

యిచ్చటికివచ్చినారలుకావున , నేను మిక్కిలియు; సంతోషించితిని. మీకుమంగళమగుఁగాక. అని, తాత్పర్యము.

అధ్వశ్రమేణ వాం ఖేదో బాధతే ప్రచురశ్రమః
వ్యక్తముత్కంఠతే చాపి మైథిలీ జనకాత్మజా. ౨

టీక॥ అధ్వశ్రమేణ= మార్గాయాసముచేత; ప్రచురశ్రమః= అధికమయిన చెమటగల; ఖేదః=అలసట; వాం=మిమ్ము=బాధతే=బాధించుచున్నది. జనకాత్మజా = జనకమహారాజుకొమార్తెయగు; మైథిలీ=సీతాదేవి; వ్యక్తం=స్పష్టముగా; ఉత్కంఠతేచాపి=విశ్రాంతిఁగోరుచున్నది.

మీకుమార్గాయాసంబున మిక్కిలియుఁజెమటపోసియెచ్చుగానలసట గలిగియున్నది; జనకపుత్రియగు సీతాదేవి, మఱియునలసి, విశ్రాంతి నపేక్షించుచున్నది. అని, తాత్పర్యము.

ఏషాహి సుకుమారీచ దుఃఖైశ్చ న విమానితా
ప్రాజ్యదోషం వనం ప్రాప్తా భర్తృస్నేహప్రచోదితా. ౩

టీక॥ సుకుమారీచ=సుకుమారమయిన దేహముగలదియు; దుఃఖైః = దుఃఖములచేత; నవిమానితాచ= పీడింపఁబడనిదియునగు; ఏషా=ఈసీత; భర్తృస్నేహప్రచోదితా = పెనిమిటియందలి స్నేహముచేఁ బ్రేరింపఁబడినదై; ప్రాజ్యదోషం=అధికమయినదోషముగల; వనం=అడవిని; ప్రాప్తాహి= పొందినదిగదా!

సుకుమారమయిన దేహము గలదియు నెప్పుడును దుఃఖము నెఱుంగనిదియునగునీసీత , పెనిమిటివగునీయందలి స్నేహంబున, నానావిధదుఃఖాకరంబగునడవికివచ్చినది. అని, తాత్పర్యము.

యథైషా రమతే రామ ఇహ సీతా తథా కురు
దుష్కరం కృతవత్యేషా వనే త్వామనుగచ్ఛతీ. ౪

టీక॥ రామ = రాముఁడా! యథా=ఎట్లు;ఏషా=ఈ;సీతా = సీత; ఇహ=ఈయాశ్రమమునందు; రమతే= సంతోషమునుబొందునో;తథా = అట్లు;కురు=చేయుము.ఏషా= ఈసీత; వనే=అడవియందు;త్వాం= నిన్ను;అనుగచ్ఛతీ=వెంబడించుచు; దుష్కరం= చేయనలవిగానికార్యమును ; కృతవతీ=చేసినది.

రాముఁడా! అట్టియీగాసీతాదేవి, యీయాశ్రమంబునందెట్లు సంతోషంబు నొందునో,అట్లుగావింపుము ; ఈబిడనీతోనడవికివచ్చుటచే దుష్కరంబగు కార్యంబుగావించినది.

అని, తాత్పర్యము.

ఏషాహి ప్రకృతి స్త్రీణా మాసృష్టే రఘునందన
సమస్థ మనురంజంతి విషమస్థం త్యజంతిచ. ౫

టీక॥రఘునందన=రాముఁడా! స్త్రీయాః(అధ్యాహృతము)=స్త్రీలు ; సమస్థం=చక్కఁగానున్నపెనిమిటినిగూర్చి: అనురంజంతి= అనురక్తులగుదురు. విషమస్థం=దుర్దశనున్నవానిని; త్యజంతి చ= విడుతురును. ఏషా= ఇది; ఆసృష్టేః=సృష్టిమొదలుకొని; స్త్రీణాం= స్త్రీలయొక్క;ప్రకృతిః=స్వభావము.

రాముఁడా! స్త్రీలు, పెనిమిటి చక్కఁగానుండునప్పుడు , అతనిపైనను రక్తులయియుందురు; దుర్దశం బొందునేని, యతనింబరిత్యజింతురు; ఇది, సృష్టియైనది మొదలు, స్త్రీలస్వభావముగానున్నది. అని, తాత్పర్యము.

శతహ్రదానాం లోలత్వం శస్త్రాణాం తీక్ష్ణతాం తథా
గరుడానిలయో శ్శైఘ్ర్య మనుగచ్ఛంతి యోషితః. ౬

టీక॥యోషితః=స్త్రీలు; శతహ్రదానాం= మెఱపులయొక్క ; లోలత్వం=చాంచల్యమును;తథా=అట్లు; శస్త్రాణాం=ఆయుధములయొక్క; తీక్ష్ణతాం=కలుకుఁదనమును ; గరుడానిలయోః= గరుత్మంతునియొక్కయు వాయువుయొక్కయు;శైఘ్ర్యం= వేగమును;అనుగచ్ఛంతి=వెంబడింతురు.

స్త్రీలు, మెఱపులకుంబోలెఁ జాంచల్యంబుగలిగియుందురు; ఖడ్గాద్యాయు

ధంబులతైక్ష్ణ్యముంబోని క్రౌర్యంబునబహుకాలము గాఁగల్గియుండు స్నేహబంధమం దెంచుకొందురు; గరుడానిలవేగమువంటివేగంబున, విచారింపక సాహసించి, కార్యంబులు సేయుదురు.

అని, తాత్పర్యము.

ఇయంతు భవతో భార్యా దోషై రేతై ర్వివర్జితా
శ్లాఘ్యాచ వ్యపదేశ్యాచ యథా దేవీ హ్యరుంధతీ ౭

టీక॥ భవతః = నీయొక్క; భార్యా=భార్యయయిన,ఇయంతు= ఈ సీతమాత్రము;ఏతైః = ఈ,దోషైః=దోషములచేత;వివర్జితా = విడువఁబడినదై, దేవీ= దేవియగు;అరుంధతీవ=అరుంధతివలె,శ్లాఘ్యాచ = కొనియాడఁదగినదియు;వ్యపదేశ్యాచ = మొదలగణింపఁదగినదియుఁగా; భవతి (అగ్న్యాహృతము) హి = అగుచున్నది గదా!

నీభార్యయగు నీసీతాదేవి మాత్రము,అట్టిదోషంబులేవియులేనిదై, యరుంధతీ దేవియుంబోలె, శ్లాఘనీయయుఁ, బతివ్రతాగ్రగణ్యయునై యున్నది. అని,తాత్పర్యము.

అలంకృతోయం దేశశ్చ యత్ర సౌమిత్రిణాసహ
వైదేహ్యా చానయా రామ వత్స్యసి త్వ మరిందమ. ౮

టీక॥ అరిందమ= శత్రువులనడఁగద్రొక్కునట్టి ; రామ = రాముఁడా! యత్ర=ఎచ్చట;త్వం=నీవు; సౌమిత్రిణా = లక్ష్మణునితోను;అనయా= ఈ;వైదేహ్యాచసహ = సీతాదేవితోనుగూడ;వత్స్యసి= నివసింపఁగలవో ; అయం=ఈ; దేశశ్చ = దేశమును;అలంకృతః=అలంకరింపఁబడినది.

శత్రువులనడఁగఁ ద్రొక్కఁజాలిన రాముఁడా!నీవులక్ష్మణునితోను, ఇట్టిపతివ్రతా శిరోమణియగు సీతాదేవితోనుంగూడ, నివాసముగావించుటంజేసి,యీదేశము, అలంకృతమగుచున్నది. అని, యగస్త్యుండు రామునితోఁ జెప్పెను.అని,తాత్పర్యము.

ఏవ ముక్త స్సమునినా రాఘవ స్సంయతాంజలిః

ఉవాచ ప్రశ్రితం వాక్య మృషిం దీప్త మివానలమ్. ౯

టీక॥సః=ఆ; రాఘవః= రాముఁడు; మునినా=అగస్త్యమహాముని చేత; ఏవం=ఇట్లు; ఉక్తః= చెప్పఁబడినవాఁడై, సంయతాంజలిః= కట్టఁబడిన చేమోడ్పుగలవాఁడై; దీప్తం=మండుచున్న; అనలమివ(స్థితం)= అగ్నిహోత్రుఁడువలెనున్న; ఋషిం= అగస్త్యమహాఋషినిగూర్చి; ప్రశ్రితం= వినయముతోఁగూడునట్లు; వాక్యం = మాటను; ఉవాచ=చెప్పెను.

రాముండు, అగస్త్య మహాముని మాటనువిని, చేమోడ్పుగిలించి, దీప్తాగ్నిహోత్రుండు వలె నున్న యమ్మహర్షిఁజూచి, వినయంబున నిట్లని, చెప్పెను.అని, తాత్పర్యము.

ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి యస్యమే మునిపుంగవః
గుణైః సభ్రాతృభార్యస్య వరదః పరితుష్యతి. ౧౦

టీక॥యస్య=ఏ ; సభ్రాతృభార్యస్య=తమ్మునితోను భార్యతోనుంగూడిన; మే=నాయొక్క; గుణైః= గుణముల చేత;వరదః=వరంబుల నొసంగువాఁడవును;మునిపుంగవః=మునిశ్రేష్ఠుఁడవునగునీవు! పరితుష్యతి = సంతోషించుచున్నావో,సః(అధ్యాహృతము)= అట్టి; అహం(అధ్యాహృతము)=నేను ; ధన్యః=పుణ్యవంతుఁడను;అస్మి= అయితిని,అనుగృహీతః= అనుగ్రహింపఁబడినవాఁడను; అస్మి=అయితిని.

నాతమ్మునిగుణంబులను నాభార్యగుణంబులనునాగుణంబులనుఁజూచి, వరదుండవుమునిశ్రేష్ఠుండవునగునీవు మెచ్చుకొంటివికావున , నేనుధన్యుండను ఈశ్వరానుగ్రహంబు గలవాఁడనైతిని. అని,తాత్పర్యము.

కింతు వ్యాదిశ మే దేశం సోదకం బహుకాననమ్
యత్రాశ్రమపదం కృత్వా వసేయం నిరత స్సుఖమ్. ౧౧

టీక॥ కింతు=మఱియేమన్ననుయత్ర= ఎచ్చట; ఆశ్రమపదం = ఆశ్రమ




స్థానమును; కృత్వా = చేసికొని, నిరతః = ఏకాగ్రుండవై; సుఖం = సుఖముగా; వసేయం = వసింతునో; తం (అధ్యాహృతము) = అట్టి, సోదకం = జలముతోఁగూడినదియు, బహుకాననం = అధికములయిన యడవులుగలదియును అగు; దేశం = ప్రదేశమును; మే = నాకు; వ్యాదిశ = చెప్పుము.

ఇఁకనేమన్నను; ఎచ్చట, నాశ్రమంబు కావించుకొని, యేకాగ్రంబుగ సుఖంబున నుండఁగలనో, అట్టి జలసమృద్ధంబును బహువనసమేతంబునగు ప్రదేశమును నాకుఁజెప్పుము. అని, రాముండు, అగస్త్యునితోఁజెప్పెను అని, తాత్పర్యము.

తతో ఽబ్రవీన్మునిశ్రేష్ఠ శ్శ్రుత్వా రామస్య తద్వచః
ధ్యాత్వా ముహూర్తం ధర్మాత్మా ధీరో ధీరతరం వచః. ౧౨

టీక॥ ధర్మాత్మా = ధర్మస్వభావుండును; ధీరః = బుద్ధిమంతుండునగు; మునిశ్రేష్ఠః = మునివరుండయిన యగస్త్యుఁడు; రామస్య = రామునియొక్క; తత్ = ఆ, వచః = మాటను; శ్రుత్వా = విని; తతః = అంత; ముహూర్తం = కొంచెముసేపు; ధ్యాత్వా = ధ్యానించి; ధీరతరం = మిక్కిలియు ధైర్యము గల్గునట్లుగా; వచః = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత, ధర్మాత్ముండును బుద్ధిమంతుండును మునిశ్రేష్ఠుండునగు నగస్త్యమహాముని, రామునిమాటను విని, జరగవలసిన విశేషంబులను గుఱించికొంచెముసేపుధ్యానించి, నిశ్చయించి, యీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

ఇతో ద్వియోజనే తాత బహుమూల ఫలోదకః
దేశో బహుమృగ శ్శ్రీమాన్ పంచవట్యభివిశ్రుతః. ౧౩

టీక॥ తాత = నాయనా! ఇతః = ఇచ్చటనుండి; ద్వియోజనే = రెండుయోజనములందు; బహుమూలఫలోదకః = అధికములయినగడ్డలునుఫలములును జలమునుగలదియు; బహుమృగః = అధికములయిన మృగములుగలదియు; శ్రీమాన్ = అధికమయినకాంతిగలదియును అగు; పంచవటీ = పంచవటియని; అభివిశ్రుతః = ప్రసిద్ధమయిన, దేశః = ప్రదేశము; అస్తి (అధ్యాహృతము) = ఉ




న్నది.

నాయనా! ఇచ్చటికి రెండుయోజనంబులదూరంబున, నెచ్చుగామూలఫలోదకంబులుగలదియు, నధికముగా మృగంబులుగలదియు శ్రీమంతంబునగు పంచవటియనుప్రదేశమొకటిగలదు.

అని, తాత్పర్యము.

తత్ర గత్వా శ్రమపదం కృత్వా సౌమిత్రిణా సహ
రంస్యసే త్వం పితు ర్వాక్యం యథోక్త మనుపాలయన్. ౧౪

టీక॥ త్వం=నీవు; తత్ర= అచ్చటికి; సౌమిత్రిణా సహ= లక్ష్మణునితోఁగూడ; గత్వా=పోయి; ఆశ్రమపదం= ఆశ్రమస్థానమును; కృత్వా=చేసి; పితుః=తండ్రియొక్క; వాక్యం=మాటను; యథోక్తం = చెప్పఁబడినట్లు; అనుపాలయన్=పాలించుచు; రంస్యసే - క్రీడింపఁగలవు.

నీవు, సీతాలక్ష్మణులంగూడి, యచ్చటికిఁబోయి, యాశ్రమంబు గావించుకొని, తండ్రియాజ్ఞనుబాలింపుచుఁ, గ్రీడింపుచుండఁగలవు. అని, తాత్పర్యము.

కాలోఽయం గత భూయిష్ఠో యః కాల స్తవ రాఘవ
సమయో యో నరేంద్రేణ కృతో దశరథేన తే. ౧౫

టీక॥ రాఘవ=రాముఁడా! యః= ఏ; సమయః=ఆజ్ఞ; నరేంద్రేణ= మనుష్యులకుఁబ్రభువైన; దశరథేన = దశరథమహారాజుచేత; తే = నీకొఱకు; కృతః=చేయఁబడినదో; సః (అధ్యాహృతము)= అట్టి; తవ=నీయొక్క; కాలః= కాలము; యః=ఏదో; అయం = ఈ; కాలః=కాలము; గతభూయిష్ఠః=చాలమట్టుకుఁగడచినది.

రాముఁడా! నీకుదశరథమహారాజు గావించినయాజ్ఞపద్ధతిని, నీవువనవాసముచేయవలసినపదునాలుగుసంవత్సరములలోఁ, జాలమట్టుకుఁగడచినది.

అని, తాత్పర్యము.

తీర్ణప్రతిజ్ఞః కాకుత్స్థ సుఖం రాజ్యే నివత్స్యసి

టీక॥ కాకుత్స్థ=రాముఁడా! త్వం(అధ్యాహృతము)= నీవు ; తీర్ణప్రతి

జ్ఞః=కడపఁబడిన ప్రతిజ్ఞగలవాఁడవై; రాజ్యే=రాజ్యమునందు; సుఖం= సుఖముగా; నివత్స్యసి = నివసింపఁగలవు.

రాముఁడా! నీవు, ప్రతిజ్ఞం దీర్చుకొని రాజ్యంబునకుఁబోయి, సుఖముగా నుండఁగలవు. అని, తాత్పర్యము.

ధన్య స్తే జనకో రామ స రాజా రఘునందన. ౧౬
య స్త్వయా జ్యేష్ఠపుత్రేణ యయాతి రివ తారితః

టీక॥ రఘునందన= రఘువంశమునం బుట్టినవారలసంతోషింపఁ జేయునట్టి, రామ= రాముఁడా! యః=ఎవ్వఁడు; జ్యేష్ఠపుత్రేణ=పెద్దకుమారుండవగు; త్వయా=నీచేత; యయాతిరివ= యయాతియుంబోలె; తారితః= తరింపఁజేయఁబడినాఁడో; సః=అట్టి; తే=నీయొక్క; జనకః=తండ్రియయిన; రాజా=దశరథమహారాజు; ధన్యః=పుణ్యవంతుఁడు.

నీతండ్రిదశరథమహారాజు జ్యేష్ఠపుత్రుండవగునీచేత, యయాతియుంబోలె, సత్యప్రతిజ్ఞుండుగాఁ జేయఁబడియెఁగావునఁ, బుణ్యవంతుం డయ్యె. అని, తాత్పర్యము.

విదితో హ్యేషవృత్తాంతో మమ సర్వస్తు వానఘ. ౧౭
తపసశ్చ ప్రభావేన స్నేహా ద్దశరథస్యచ

టీక॥ అనఘ= పాపరహితుండవగు రాముఁడా! తవ=నీయొక్క; ఏషః = ఈ; వృత్తాంతః=సమాచారము; సర్వః=అంతయు; తపసః=తపస్సుయొక్క; ప్రభావేనచ=మహిమచేతను; దశరథస్య=దశరథునియొక్క; స్నేహాచ్చ=స్నేహమువలనను; మమ=నాకు, విదితోహి= తెలిసినదిగదా!

పాపరహితుండవగు రాముఁడా! నాకుదశరథునిపైనుండుస్నేహంబునం జేసి, తపోమహిమవలన, నీవృత్తాంతము నంతయుఁ దెలిసికొనియే యున్నాను. అని, తాత్పర్యము.

హృదయస్థశ్చ తే ఛందో విజ్ఞాత స్తపసా మయా. ౧౮
ఇహావాసం ప్రతిజ్ఞాయ మయాసహ తపోవనే

టీక॥ మయా=నాచేత; మయాసహ=నాతోఁగూడ; ఇహ =ఈ; తపోవనే=ఆశ్రమమునందు; ఆవాసం=ఉనికిని; ప్రతిజ్ఞాయ=చెప్పి; తపసా=తపస్సుచేత; తే=నీయొక్క; హృదయస్థః=మనస్సునందునట్టి; ఛందశ్చ=అభిప్రాయమును; విజ్ఞాతః= తెలియఁబడినది.

నేను, నిన్నునాతోఁగూడనీయాశ్రమంబుననె యుండవలయునని చెప్పినాను గదా? అయినను, దపఃప్రభావంబున, నీవు వేఱేయెచ్చట నేనిరమ్య ప్రదేశంబుననివసింపఁగోరియున్నావని, నీమన్సునందలియభిప్రాయంబుఁదెలిసికొంటిని. అని, తాత్పర్యము.

అతశ్చ త్వా మహం బ్రూమి గచ్ఛ పంచవటీ మితి. ౧౯

టీక॥ అతశ్చ = ఇందువలననె; అహం=నేను ; త్వాం = నిన్నుఁగూర్చి; "పంచవటీం=పంచవటినిగూర్చి ; గచ్ఛ= పొమ్ము." ఇతి=అని ; బ్రూమి (బ్రవీమి)=చెప్పుచున్నాను.

ఇందువలననె , నేను "పంచవటికిఁబొ"మ్మనినీకుఁజెప్పినాను. అని, తాత్పర్యము.

సహి రమ్యో వనోద్దేశో మైథిలీ తత్ర రంస్యతే
స దేశ శ్లాఘనీయశ్చ నాతిదూరేచ రాఘవ. ౨౦

టీక॥ రాఘవ=రాముఁడా! సః=అ; వనోద్దేశః=అరణ్యప్రదేశము ; రమ్యోహి=రమణీయమయినదిగదా!తత్ర=అచ్చట; మైథిలీ=సీతాదేవి ; రంస్యతే=క్రీడింపఁగలదు. సః=ఆ; దేశః=ప్రదేశము; శ్లాఘనీయశ్చ= కొనియాడఁదగినదియు; నాతిదూరేచ=సమీపంబునందును ; వర్తతే (అధ్యాహృతము)=ఉన్నది.

రాముఁడా! ఆవనప్రదేశముమిక్కిలియురమణీయమయినది ; సీతయచ్చటసంతోషంబుననుండఁగలదు; ఆప్రదేశముశ్లాఘనీయమెగాక , యిచ్చటికిసమీపంబుననున్నది.అని,తాత్పర్యము.

గోదావర్యా స్సమీపేచ మైథిలీ తత్ర రంస్యతే

 

టీక॥ సః (అధ్యాహృతము)= ఆప్రదేశము;గోదావర్యాః= గోదావరియొక్క;సమీపేచ = సమీపమునందును; వర్తతే (అధ్యాహృతము)= ఉన్నది.తత్ర=అచ్చట;మైథిలీ= సీత;రంస్యతే=క్రీడింపఁగలదు.

మఱియునాప్రదేశము, గోదావరీనదిసమీపంబుననున్నదికావున, సీతాదేవికచ్చటమిక్కిలియుసంతోషంబు గలుగుచుండును. అని, తాత్పర్యము.

ప్రాజ్యమూలఫలైశ్చైవ నానాద్విజగణాయుతః. ౨౧
వివిక్తశ్చ మహాబాహో పుణ్యో రమ్య స్తథైవచ

టీక॥ మహాబాహో= పెద్దచేతులుగలరాముఁడా ! సః (అధ్యాహృతము) = ఆప్రదేశము;ప్రాజ్యమూలఫలైశ్చైవ = అధికములయినగడ్డలతోనుఫలములతోను ; ఆయుతః (అధ్యాహృతము)= కూడినదియు; నానాద్విజగణాయుతః = నానావిధపక్షులసమూహములతోఁగూడినదియు. వివిక్తశ్చ=విజనమును.పుణ్యః= పవిత్రమును;తథా=అట్లు;రమ్యఏవచ=రమణీయంబును.

మహాబాహుండవగు రాముఁడా! ఆప్రదేశము , ఎచ్చుగాఫలమూలంబులుగలది; నానావిధమధురపక్షులతోఁగూడినది;జనసంఘములేనిది ; పవిత్రము;సుందరమయినది.

అని, తాత్పర్యము.

భవానపి సదారశ్చ శక్తశ్చ పరిరక్షణే. ౨౨
అపి చాత్ర వసన్ రామ తాపసాన్ పాలయిష్యసి

టీక॥ రామ= రాముఁడా!భవానపి= నీవును; సదారశ్చ = భార్యతోఁగూడినవాఁడవును. పరిరక్షణే= రక్షించుటయందు; శక్తశ్చ= సమర్థుండవును. అపిచ=మఱియు; అత్ర = ఈ పంచవటియందు; వసన్=ఉన్నవాఁడవై; తాపసాన్= ఋషులను; పాలయిష్యసి= పాలింపఁగలవు.

ఈపంచవటి మిక్కిలియు రమణీయప్రదేశముకావున, భార్యా సహితుండవగు నీకుఁదగియుండును; మఱియునాపన్నులరక్షించుటయందు సమ

 

ధుఃడవుకావున, నిచ్చటనుందువేని, తాపసులరక్షింపవచ్చును.

అని, తాత్పర్యము.

ఏత దా లక్ష్యతే వీర మధూకానాం మహద్వనమ్. ౨౩
ఉ త్తరే ణాస్య గంతవ్యం న్యగ్రోధ మభిగచ్ఛతా

టీక॥వీర=పరాక్రమశాలివగు రాముఁడా! ఏతత్=ఈ;మధూకానాం= ఇప్పచెట్లయొక్క; మహత్= గొప్పదగు; వనం=అడవి; ఆలక్ష్యతే= చూడఁబడుచున్నది. న్యగ్రోధం= మఱ్ఱిచెట్టునుగూర్చి ; అభిగచ్ఛతా= పోవుచున్నవానిచేత; అస్య=ఈయిప్పచెట్ల వనమునకు; ఉ త్తరేణ=ఉత్తరపుదిక్కుచేత; గంతవ్యం= పోవుటకావలసినది.

పరాక్రమ వంతుఁడవగు రాముఁడా! ఇదిగో,ఇప్పచెట్లగుంపగపడు చున్నది; ఆమధుకవనంబున కుత్తరపు దిక్కునఁ బోయిన నొకఱ్ఱ మఱ్ఱిచెట్టునొద్దకుఁబోవుచున్నది.

అని, తాత్పర్యము.

తత స్థ్సల ముపారుహ్య పర్వతస్యా విదూరతః. ౨౪
ఖ్యాతః పంచవటీత్యేవ నిత్య పుష్పిత కాననః

టీక॥తతః=అంత; స్థలం=మిట్టను; ఉపారుహ్య=ఎక్కి ; పర్వతస్య=పర్వతముయొక్క; అవిదూరతః=సమీపమునందు; నిత్యపుష్పితకాననః= ఎల్లప్పుడునుబూచినయడవులుగల ప్రదేశము, పంచవటీత్యేవ = పంచవటియనియే; ఖ్యాతః=ప్రసిద్ధమయినది.

అంత,నా దారిలో నేపోయిన నొక మిట్ట ప్రదేశముకనుపట్టును;దానినారోహింపఁగా,కనఁబడునట్టిపర్వతముసమీపంబునఁ , బంచవటి యున్నది; అది యెల్లప్పుడునుబుష్పితములయిన వనంబులతో నొప్పుచుండును. అని, యగస్త్యుండు,రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

అగస్త్యే నైవ ముక్తస్తు రామ స్సౌమిత్రిణా సహ. ౨౫

సత్కృత్యా మంత్రయామాస తమృషిం సత్యవాదినమ్

టీక॥ రామః=రాముఁడు; అగస్త్యేన=అగస్త్యునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడైనంతనే; సౌమిత్రిణాసహ=లక్ష్మణునితోఁగూడ; సత్యవాదినం=సత్యమును జెప్పునట్టి; తం=ఆ, ఋషిం=అగస్త్యమహర్షిని; సత్కృత్య=పూజించి; ఆమంత్రయామాస=వీడుకొనెను.

రాముండగస్త్యునిమాటనువిని, లక్ష్మణునితోఁగూడ, సత్యవాదియగు నమ్మహర్షిం బూజించి, పోయివచ్చెదమని చెప్పెను. అని, తాత్పర్యము.

తౌతు తే నాభ్యనుజ్ఞాతౌ కృతపాదాభి వందనౌ. ౨౬
తదాశ్రమా త్పంచవటీం జగ్మతు స్సహసీతయా

టీక॥ తౌతు=ఆ రామలక్ష్మణులును; కృతపాదాభివందనౌ = చేయఁబడిన పాదనమస్కారముగలవారలయి; తేన=ఆయగస్త్యునిచేత; అనుజ్ఞాతౌ= అనుమతింపఁబడినవారలయి; సీతయాసహ=సీతతోఁగూడ; తదాశ్రమాత్= ఆయగస్త్యాశ్రమంబుననుండి, పంచవటీం=పంచవటినిగూర్చి; జగ్మతుః= పోయిరి.

ఆరామలక్ష్మణులు, అగస్త్యునిపాదంబులకునమస్కరించియాయననుమతింబొంది, సీతాసమేతులయి, యగస్త్యాశ్రమంబుననుండి, పంచవటికిం బోయిరి. అని, తాత్పర్యము.

గృహీతచాపౌతు నరాధిపాత్మజౌ
విషక్తతూణౌ సమరే ష్వకాతరౌ. ౨౭
యథోపదిష్టేన పథా మహర్షిణా
ప్రజగ్మతుః పంచవటీం సమాహితౌ

టీక॥ సమరేషు=యుద్ధములయందు, అకాతరౌ = భయములేనివారలగు; నరాధిపాత్మజౌ= రాజపుత్రులగు రామలక్ష్మణులు; గృహీతచాపౌ= పట్టుకొనఁబడిన ధనుస్సుగల వారలైయే; విషక్తతూణౌ= ధరింపఁబడినయ

స ౧౪

మ్ములపొదులుగలవారలయి ; సమాహితౌ = ఏకాగ్రులయి; మహర్షిణా=అగస్త్యమహర్షిచేత; యథోపదిష్టేన=ఉపదేశింపఁబడినట్లున్న; పథా = మార్గముచేత ; పంచవటీం=పంచవటినిగూర్చి; ప్రజగ్మతుః= పోయిరి.

యుద్ధములందు భయములేనట్టియీ రామలక్ష్మణులు , ధనుర్బాణతూణీరంబులు దాల్చి , సమాహితమనస్కులయి, యగస్త్యమహామునిచెప్పినమార్గంబునఁ, బంచవటికిం బోయిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే, త్రయోదశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండత్రయోదశసర్గటీక,
ముగిసినది.



౧౪

చతుర్దశసర్గప్రారంభః.

అథ పంచవటీం గచ్ఛ న్నంతరా రఘునందనః
ఆససాద మహాకాయం గృధ్రం భీమపరాక్రమమ్. ౧

టీక॥ అథ=అంత; రఘునందనః = రాముఁడు; పంచవటీం = పంచవటిని గూర్చి;గచ్ఛన్=పోవుచు;అంతరా = నడుమ; మహాకాయం= గొప్పదేహముగలవాఁడును; భీమపరాక్రమం=భయంకరమయినపరాక్రమముగలవాఁడునగు; గృధ్రం=గద్దను; ఆససాద= సమీపించెను.

అంతనట్లు, రాముండుపంచవటికిం బోవుచు, దారినడుమ , భయంకరప




రాక్రమంబునుమహాకాయంబునగునొకగృధ్రముంజూచెను. అని, తాత్పర్యము.

తం దృష్ట్వా తౌ మహాభాగౌ వటస్థం రామలక్ష్మణౌ
మేనాతే రాక్షసం పక్షిం బ్రువాణౌ కోభవానితి. ౨

టీక॥ మహాభాగౌ= పూజ్యమయిన యదృష్టముగల; తౌ=ఆ ; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, వటస్థం= మఱ్ఱిచెట్టుననున్న; తం=ఆ; పక్షిం ( పక్షిణం)=గృధ్రమును; దృష్ట్వా = చూచి; "భవాన్=నీవు, కః=ఎవ్వఁడవు" ఇతి=అని; బ్రువాణౌ=చెప్పుచు; రాక్షసం= రాక్షసునిగా; మేనాతే=తలంచిరి.

మహాభాగులగు నారామలక్ష్మణులు, ఆగృధ్రముంబూచి, యతని రాక్షసుంగాఁదలఁచి, "నీవెవ్వఁడవు" వని యడిగిరి. అని, తాత్పర్యము.

స తౌ మధురయా వాచా సౌమ్యయా ప్రీణయన్నివ
ఉవాచ వత్స మాం విద్ధి వయస్యం పితు రాత్మనః. ౩

టీక॥ సః=ఆగృధ్రము ; మధురయా=తియ్యనిదియు ; సౌమ్యయా= శాంతమునగు; వాచా = మాటచేత; ప్రీణయన్నివ = సంతోషింపఁజేయుచునే; తౌ = ఆరామలక్ష్మణులనుగూర్చి; వత్స=బిడ్డఁడా! మాం = నన్ను; ఆత్మనః=నీయొక్క; పితుః= తండ్రియొక్క, వయస్యం=స్నేహితునిఁగా; విద్ధి = ఎఱుంగుము. ఇతి (అధ్యాహృతము)= అని; ఉవాచ=చెప్పెను.

ఆగృధ్రము, మధురంబును సౌమ్యంబునగువాక్యంబున, నారామలక్ష్మణులకు సంతోషంబుగలిగించుచు , "రాముఁడా ! నేనునీతండ్రిదశరథమహారాజునకు స్నేహితుండను." అని, చెప్పెను. అని, తాత్పర్యము.

స తం పితృసఖం బుద్ధ్వా పూజయామాస రాఘవః

టీక॥ సః=ఆ; రాఘవః=రాముఁడు; తం=ఆగృధ్రమును; పితృసఖం = తండ్రియొక్క స్నేహితునిగా ; బుద్ధ్వా=ఎఱింగి; పూజయామాస=పూ




జించెను.

రాముండు,ఆగృధ్రమునుదనతండ్రి స్నేహితుంగా నెఱింగి, పూజించెను.

అని, తాత్పర్యము.

స తస్య కుల మవ్యగ్ర మథ పప్రచ్ఛ నామచ. ౪

టీక॥ అథ=అంత; సః=ఆరాముం డును; అవ్యగ్రం=ఏమఱుపాటులేనట్లు గా;తస్య=అగృధ్రముయొక్క,కులం= వంశమును; నామచ=పేరును ; పప్ర చ్ఛ=అడిగెను.

అంత, రాముండు,ఆగృధ్రముయొ క్క కులంబును పేరును,అడిగెను.

అని, తాత్పర్యము.

రామస్య వచనం శ్రుత్వా సర్వభూత సముద్భవమ్
ఆచచక్షే ద్విజ స్తస్మై కుల మాత్మాన మేవచ. ౫

టీక॥ ద్విజః=గృధ్రము;రామస్య= రామునియొక్క; వచనం=మాటను ; శ్రుత్వా=విని;సర్వభూతసముద్భవం= సమస్తప్రాణులయొక్క యుం బుట్టుక ను; కులం=వంశమును ; ఆత్మానమేవ చ=తన్నును; తస్మై = ఆరామునికొ అను; ఆచచక్షే=చెప్పెను.

ఆగృధ్రము, రామునిమాటనువిని, ఆరామునికి, జగత్సృష్టివిధానంబుం జెప్పుచుం,దనకులంబును పేరునంజెప్పెను.

అని, తాత్పర్యము.

పూర్వకాలే మహాబాహో యే ప్రజాపతయో భవన్
తాన్మే నిగదత స్సర్వా నాదిత శ్శృణు రాఘవ. ౬

టీక॥ మహాబాహో= పెద్దచేతు లుగల;రాఘవ=రాముండా! పూర్వ కాలే=మునుపటికాలమునందు; యే= ఎవ్వరు;ప్రజాపతయః= ప్రజాపతులు; అభవన్=అయిరో;ఆదితః = మొదట నుండి;తాన్=వారలను;సర్వాన్= అం దఱను;నిగదతః=చెప్పుచున్న;మే= (పంచమ్యర్థమందుషష్ఠి)నావలన ; శృణు= వినుము.

మహాబాహుండవగు రాముండా !

మున్నెవ్వరెవ్వరు ప్రజాపతులుగానుండిరో, వారలనందఱ మొదటనుండి చెప్పెదను, వినుము. అని, తాత్పర్యము.

కర్దమః ప్రథమ స్తేషాం విక్రీత స్తదనంతరః
శేషశ్చ సంశ్రయశ్చైవ బహుపుత్రశ్చ వీర్యవాన్. ౭
స్థాణుర్మరీచి రత్రిశ్చ క్రతుశ్చైవ మహాబలః
పులస్త్య శ్చాంగిరా శ్చైవ ప్రచేతాః పులహ స్తథా ౮
దక్షో వివస్వా నపరో రిష్టనేమిశ్చ రాఘవ
కాశ్యపస్య మహాతేజా స్తేషా మాసీచ్చ పశ్చిమః. ౯

టీక॥ రాఘవ= రాముఁడా! తేషాం=ఆప్రజాపతులలో; ప్రథమః= మొదటివాఁడు; కర్దమః= కర్దముఁడు. తదనంతరః= ఆకర్దమునికి వెనుకటివాఁడు; విక్రీతః= విక్రీతుఁడు. శేషశ్చ= శేషుఁడును. బహుపుత్రశ్చ = పెక్కుకొడుకులు గలవాఁడును; వీర్యవాన్=అధికమయిన పరాక్రమముగలవాఁడునగు; సంశ్రయశ్చ= సంశ్రయుఁడును; స్థాణుః=స్థాణువును. మరీచిః= మరీచియు. అత్రిశ్చ=అత్రియును. మహాబలః=అధికమయినబలముగల; క్రతుశ్చైవ=క్రతుండును. పులస్త్యశ్చ=పులస్త్యుఁడును. అంగిరాశ్చైవ= అంగిరసుండును; ప్రచేతాః= ప్రచేతసుండును, తథా=అట్లు; పులహః=పులహుఁడును. దక్షః=దక్షుఁడును. వివస్వాన్ = వివస్వంతుఁడును. అపరః=మఱియొకఁడు; అరిష్టనేమిశ్చ =అరిష్టనేమియనునామాంతరముగల; మహాతేజాః= అధికమయినప్రభావముగల; కాశ్యపశ్చ= కాశ్యపుఁడును. తేషాం=ఆప్రజా పతులలో; పశ్చిమః=కడపటివాఁడును; ఆసీచ్చ=ఆయెను.

రాముఁడా! ఆప్రజాపతులలో మొదటివాఁడు, కర్దముఁడు; అంత, విక్రీతుండును, శేషుండును, పెక్కుకొడుకులుగలవాఁడును మహావీర్యశాలియు నగు సంశ్రయుండును; స్థాణుండును మారీచియునత్రియు మహాబలుండగు క్రతువును బులస్త్యుండు నంగిరసుండును బ్రచేతసుండును బులహుండును దక్షుండును వివస్వంతుండును, క్రమంబునఁ బ్రజాపతులైరి; అంతనరిష్ట నేమి

యను నామాంతరముగల మహాతేజుండగు కాశ్యపుఁడు ప్రజాపతియయ్యె అని, తాత్పర్యము.

ప్రజాపతేస్తు దక్షస్య బభూవు రితి విశ్రుతమ్
షష్టి ర్దుహితరో రామ యశస్విన్యో మహాయశః. ౧౦

టీక॥ మహాయశః= అధికమయిన కీర్తిగల; రామ=రాముఁడా! దక్షస్య= దక్షుఁడను ; ప్రజాపతేస్తు=ప్రజాపతికిమాత్రము; యశస్విన్యః= అధికమయినకీర్తిగల; దుహితరః= కూఁతురులు; షష్టిః= అఱువదిమంది; బభూవుః=కలిగిరి. ఇతి=అని; విశ్రుతం= ప్రసిద్ధము.

మహాయశుండవగు రాముఁడా! దక్షప్రజాపతికిఁ గీర్తిమంతులగు నఱువదిమందికూఁతులుగల్గిరని యుండుటకును దెలిసినదేకదా! అని, తాత్పర్యము.

కాశ్యపః ప్రతిజగ్రాహ తాసా మష్టౌ సుమధ్యమాః
అదితించ దితించైవ దనుమ ప్యథ కాళికామ్.౧౧
తామ్రాం క్రోధవశాంచైవ మనుంచాప్య నలామపి

టీక॥ కాశ్యపః= కాశ్యపుఁడు; తాసాం=వారలలో; సుమధ్యమాః= మంచినడుములుగల; అదితించ= అదితిని; దితించైవ=దితిని; దనుమపి = దనువును. అథ=ఇంక; కాళికాం=కాళికను; తామ్రాం=తామ్రను; క్రోధవశాంచైవ= క్రోధవశను; మనుంచాపి=మనువును ; అనలామపి=అనలను ; అష్టౌ= ఈయెనిమిదిమందిని; ప్రతిజగ్రాహ= స్వీకరించెను.

కాశ్యపుఁడు, వారలలో , సుందరాంగులగు నదితిని దితిని దనువును గాళికను, తామ్రను క్రోధవశను మనువును అనలను , ఈయెనిమిదిమందిని, వివాహంబయ్యెను.

అని, తాత్పర్యము.

తాస్తు కన్యా స్తతః ప్రీతః కాశ్యపః పున రబ్రవీత్. ౧౨

టీక॥ తతః=అంత; కాశ్యపః = కాశ్యపుఁడు; ప్రీతః = సంతోషించినవాఁ




ద్రైః తాః=ఆః కన్యాస్తు = కన్యకలను గూర్చి; పునః=మఱల; అబ్రవీత్= చెప్పెను.

అంతఁ, గాశ్యపుఁడు, సంతోషంబున, నాకన్యకలంజూచి, యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము!

పుత్రాం స్త్రైలోక్య భర్తౄన్వై జనయిష్యథ మత్సమాన్

టీక ॥ త్రైలోక్యభర్తౄన్ = ముల్లోకములను బాలించువారలును ; ("వై" అనునది పాదపూరణార్థము); మత్సమాన్= నాతోసమానులునగు; పుత్రాన్ = కొడుకులను; జనయిష్యథ=పుట్టింపఁగలరు.

ముల్లోకంబులం బాలింపం గలిగిన వారలును నాకుసమానులునగు, కొడుకులంగనుండు. అని, కశ్యపుఁడు ఆకన్యలకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

అదితి స్తన్మనా రామ దితిశ్చ మనుజర్షభ. ౧౩
కాళికాచ మహాబాహో శేషా స్త్వమనసోభవన్

టీక॥మనుజర్షభ= పురుషశ్రేష్ఠుఁడవును; మహాబాహో= పెద్దచేతులుగలవాఁడవునగు; రామ = రాముఁడా! అదితిః=అదితి; తన్మనాః= అదిమనస్సునందుఁగలది. దితిశ్చ= దితియు; కాళికాచ= కాళికయు ; తన్మనసౌ (అధ్యాహృతము) = అదేమనస్సునందుఁగలవారలు. శేషాస్తు= మిగిలినవారలుమాత్రము; అమనసః=మనస్సులేనివారలు; అభవన్=అయిరి.

పురుషశ్రేష్ఠుఁడవు మహాబాహుండవునగు రాముఁడా! అందుకు, నదితియు దితియుఁ గాళికయుసమ్మతించిరి; మిగిలినవారలుమాత్రము, సమ్మతింపరైరి.

అని, తాత్పర్యము.

అదిత్యాం జజ్ఞిరే దేవా స్త్రయ స్త్రింశ దరిందమ. ౧౪
ఆదిత్యా వసవో రుద్రా హ్యశ్వినౌచ పరంతప

టీక॥ అరిందమ = శత్రువులనడఁగఁద్రొక్కునట్టి; పరంతప = శత్రువు




లందపింపఁజేయునట్టి రాముఁడా! అదిత్యాం=అదితియందు;ఆదిత్యాః = ఆదిత్యులును;వసవః = వసువులును;రుద్రాః=రుద్రులును;అశ్వినౌచ = అశ్వినీదేవతలును;దేవాః= దేవతలు;త్రయస్త్రింశత్=ముప్పదిమువ్వురు;జజ్ఞిరే=పుట్టిరి.

శత్రుసంహారకారకుండవగు రాముఁడా! అదితియందుఁ, బన్నిద్దఱాదిత్యులును,ఎనమండ్రువసువులును, బదునొకరు రుద్రులును, ఇద్దఱశ్వినీదేవతలును, ఇట్లుముప్పదిముగ్గురు దేవతలు జన్మించిరి. అని, తాత్పర్యము.

దితి స్త్వజనయ త్పుత్రా న్దైత్యాం స్తాత యశస్వినః. ౧౫
తేషా మియం వసుమతీ పురాసీ త్సవనార్ణవా

టీక॥ తాత=నాయనా! దితిస్తు=దితియు; యశస్వినః=అధికమయినకీర్తిగలవారలగు; దైత్యాన్=దైత్యులను; పుత్రాన్= కొడుకులను ; అజనయత్=పుట్టించెను.పురా=మును;సవనార్ణవా= వనములతోను సముద్రములతోనుంగూడినదగు;ఇయం= ఈ;వసుమతీ=భూమి, తేషాం= ఆదైత్యులది; ఆసీత్=అయినది.

నాయనా! దితి,కీర్తిమంతులగు దైత్యులంగనెను; మును సమస్తారణ్యంబులతోను సముద్రంబులతోనుంగూడినయీ భూమియంతయు, నాదైత్యులదిగా నుండెను. అని, తాత్పర్యము.

దనుస్త్వజనయ త్పుత్ర మశ్వగ్రీవ మరిందమ. ౧౬

టీక॥అరిందమ=శత్రువుల వడంగఁదొక్కునట్టి రాముఁడా!దనుస్తు= దనువును;అశ్వగ్రీవం = హయగ్రీవుండను; పుత్రం=కొడుకును;అజనయత్ = పుట్టించెను.

శత్రువులనడంగఁద్రొక్కంజాలిన రాముఁడా! దనువు, హయగ్రీవుండను కొడుకుంగనెను. అని, తాత్పర్యము.

నరకాం కాలకంచైవ కాళికాపి వ్యజాయత

టీక॥కాళికాపి=కాళికయును, నరకం=నరకుని,కాలకంచైవ = కాలకునిని;

వ్యజాయత=కనెను.

కాళికను,నరకుండును గాలకుండనుబుట్టిరి. అని, తాత్పర్యము.

క్రౌంచీం భాసీం తథా శ్యేనీం ధృతరాష్ట్రీం తథా శుకీమ్. ౧౭
తామ్రాపి సుషువే కన్యాః పంచైతా లోకవిశ్రుతాః

టీక॥ తామ్రాపి=తామ్రియును ; క్రౌంచీం=క్రౌంచిని; భాసీం= భాసిని; తథా=అట్లు; శ్యేనీం=శ్యేనిని; ధృతరాష్ట్రీం=ధృతరాష్ట్రిని; తథా= అట్లు;శుకీం=శుకిని;ఏతాః= ఈ;లోకవిశ్రుతాః=లోకప్రసిద్ధలగు ; కన్యాః=కూఁతులను;పంచ=ఐదుగురను; సుషువే=కనెను.

తామ్రయుఁ, గ్రౌంచిని , భాసిని, శ్యేనిని, ధృతరాష్ట్రిని, శుకిని, లోకప్రసిద్ధలగునీయైదుగురఁగన్యలంగనెను.

అని, తాత్పర్యము.

ఉలూకాన్ జనయత్క్రౌంచీ భాసీ భాసాన్ వ్యజాయత. ౧౮

టీక॥ క్రౌంచీ = క్రౌంచి; ఉలూకాన్=గుడ్లగూబలను;జనయత్(అజనయత్)=పుట్టించెను. భాసీ=భాసి;భాసాన్=భాసపక్షులను; వ్యజాయత=కనెను.

క్రౌంచి, యులూకంబులంగనెను; భాసిభాసపక్షులంబుట్టించెను.

అని, తాత్పర్యము.

శ్యేనీ శ్యేనాంశ్చ గృధ్రాంశ్చ వ్యజాయత సుతేజసః
ధృతరాష్ట్రీ తు హంసాంశ్చ కలహంసాంశ్చ సర్వశః. ౧౯

టీక॥ శ్యేనీ=శ్యేని, సుతేజసః=అధికమయినవీర్యముగల; శ్యేనాంశ్చ= డేగలను; గృధ్రాంశ్చ=గద్దలను; వ్యజాయత=కనెను. ధృతరాష్ట్రీ తు= ధృతరాష్ట్రియు; హంసాంశ్చ= హంసపక్షులను; కలహంసాంశ్చ = కలహంసపక్షులను; సర్వశః=అంతయు; వ్యజాయత(అధ్యాహృతము)= కనెను.

శ్యేనికి,మహావీర్యంబులగు డేగలును గృధ్రంబులునుబుట్టినవి; ధృతరాష్ట్రికి, హంసలునుగల హంసములును బుట్టినవి. అని, తాత్పర్యము.

చక్రవాకాంశ్చ భద్రం తే విజజ్ఞే సాపి భామినీ

టీక॥ సా=ఆ; భామిన్యపి = ధృతరాష్ట్రియె; చక్రవాకాంశ్చ= చక్రవాకపక్షులను; జజ్ఞే=కనెను. తే= నీకొఱకు; భద్రం=మంగళము; అస్తు (అధ్యాహృతము)=కలుగుఁగాక.

ఆధృతరాష్ట్రికె, చక్రవాకపక్షులు గూడజన్మించినవి. అని, తాత్పర్యము.

శుకీ నతాం విజజ్ఞేతు నతాయా వినతా సుతా. ౨౦

టీక॥ శుకీతు=శుకియు; నతాం= నతను; విజజ్ఞే=కనెను. నతాయాః= నతయొక్క; సుతా= కూఁతురు; వినతా- వినత.

శుకికి, నతజన్మించెను; నతకువినత పుట్టెను అని, తాత్పర్యము.

దశ క్రోధవశా రామ విజజ్ఞే హ్యాత్మసంభవాః
మృగీంచ మృగమందాంచ హరిం భద్రమదామపి. ౨౧
మాతంగీ మపి శార్దూలీం శ్వేతాంచ సురభిం తథా
సర్వలక్షణసంపన్నాం సురసాం కద్రుకామపి. ౨౨

టీక॥ రామ=రాముఁడా! క్రోధవశా=క్రోధవశ; మృగీంచ=మృగిని; మృగమందాంచ= మృగమఁదను; హరిం=హరిని; భద్రమదామపి = భద్రమదను, మాతంగీమపి=మాతంగిని ; శార్దూలీం=శార్దూలిని; శ్వేతాంచ = శ్వేతను, తథా=అట్లు; సురభిం = సురభిని; సర్వలక్షణసంపన్నాం= సమస్తలక్షణములతోఁగూడిన; సురసాం= సురసను; కద్రుకామపి=కద్రువును; దశ= పదుగురను; ఆత్మసంభవాః = కొమార్తెలను; విజజ్ఞేహి=కనెనుగదా!

రాముఁడా! క్రోధవశ, మృగినిమృగమందను హరినిభద్రమదను మాతంగిని శార్దూలిని శ్వేతనుసురభిని, సమస్తలక్షణసంపన్నయగు సురసను గద్రువును, ఇట్లుపదుగురఁగొమార్తెలంగనెను. అని, తాత్పర్యము.

అపత్యంతు మృగా స్సర్వే మృగ్యా నరవరోత్తమ

టీక॥ నరవరోత్తమ = పురుషశ్రేష్ఠులలోనుత్తముఁడవగు రామునఁడా! మృగ్యాః = మృగియొక్క, అపత్యంతు= సంతానముమాత్రము ; సర్వే= సమస్తములయిన ; మృగాః=జింకలు.

పురుషశ్రేష్ఠుండవగు రామునఁడా! మృగికి, సమస్తములయినజింకలుజన్మించినవి. అని, తాత్పర్యము.

ఋక్షాశ్చ మృగమందాయా స్సృమరా శ్చమరా స్తథా. ౨౩

టీక॥ మృగమందాయాః = మృగమందయొక్క ; అపత్యం (అధ్యాహృతము) = సంతానము ; ఋక్షాశ్చ = ఎలుఁగుగొడ్డులును ; స్పృమరాశ్చ = ఆఁడువాండ్రుకొప్పులంబెట్టుకొను సవరంబులఁగలిగించుమృగంబులును ; తథా= అట్లు ; చమరాః = చమరమృగములును.

మృగమందకు, నెలుగుఁబంటులును, సృమరమృగములునుజమరమృగంబులునుజన్మించినవి. అని, తాత్పర్యము.

హర్యాశ్చ హరయో పత్యం వానరాశ్చ తరస్వినః

టీక॥ హర్యాః = హరియొక్క ; అపత్యం=సంతానము ; హరయశ్చ= సింహములును ; తరస్వినః= అధికమయినవేగముగల ; వానరాశ్చ=వానరులును.

హరికి, సింహంబులును వేగవంతులగువానరులును గలిగిరి.

అని, తాత్పర్యము.

తత స్త్విరావతీంనామ జజ్ఞే భద్రమదా సుతామ్. ౨౪

టీక॥ తతస్తు = అంతను ; భద్రమదా=భద్రమద ; ఇరావతీంనామ= ఇరావతియనుపేరుగల ; సుతాం = కొమార్తెను ; జజ్ఞే=కనెను.

అంతను, భద్రమదకు, ఇరావతియనుకూఁతురుపుట్టెను. అని, తాత్పర్యము.

తస్యా స్త్వైరావతః పుత్రో లోకనాథో మహాగజః

టీక॥ తస్యాస్తు = ఆయిరావతికిని; లోకనాథః = లోకంబులకుఁ బ్రభువును; మహాగజః = పెద్దయేనుంగునగు; ఐరావతః = ఐరావతుండను; పుత్రః = కొడుకు; జజ్ఞే (అధ్యాహృతము) = పుట్టెను.

ఆయిరావతికి, దేవేంద్రునివాహనంబగుటచేలోకనాథంబగునైరావతంబను మహాగజంబుగలిగెను.

అని, తాత్పర్యము.

మాతంగా స్త్వథ మాతంగ్యా అపత్యం మనుజర్షభ. ౨౫

టీక॥ మనుజర్షభ = పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! అథ = అంత; మాతంగ్యాః = మాతంగియొక్క; అపత్యం తు = సంతానమును; మాతంగాః = ఏనుగులు.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! మాతంగికి, ఏనుంగులు, గలిగినవి.

అని, తాత్పర్యము.

గోలాంగూలాశ్చ శార్దూలీ వ్యాఘ్రాంశ్చా జనయ త్సుతాన్

టీక॥ శార్దూలీ = శార్దూలి; గోలాంగూలాంశ్చ = కొండముచ్చులను; వ్యాఘ్రాంశ్చ = పెద్దపులులను; సుతాన్ = కొడుకులనుగా; అజనయత్ = పుట్టించెను.

శార్దూలికి, గోలాంగూలంబులును వ్యాఘ్రంబులునుం గలిగినవి.

అని, తాత్పర్యము.

దిశాగజాంశ్చ కాకుత్స్థ శ్వేతా ప్య జనయ త్సుతాన్. ౨౬

టీక॥ కాకుత్స్థ = రాముఁడా! శ్వేతాపి = శ్వేతయును; దిశాగజాంశ్చ = దిగ్గజములను; సుతాన్ = కొడుకులనుగా; అజనయత్ = పుట్టించెను.

రాముఁడా! శ్వేతకు, దిగ్గజంబులు జన్మించినవి.

అని, తాత్పర్యము.

తతో దుహితరౌ రామ సురభి ర్దేవ్యజాయత
రోహిణీంనామ భద్రం తే గంధర్వీంచ యశస్వినీమ్. ౨౭

టీక॥ రామ=రాముఁడా ! తతః= అంత; సురభిః=సురభి ; రోహిణీంనామ=రోహిణియనుపేరుగలదానిని; యశస్వినీం=అధికమయినకీర్తిగల; గంధర్వీంచ=గంధర్విని; దుహితరౌ=కూఁతురులను; ద్వే=ఇద్దఱను; వ్యజాయత=కనెను. తే=నీకు; భద్రం = మంగళము; అస్తు(అధ్యాహృతము)= అగుఁగాక.

రాముఁడా! అంత, సురభి, రోహిణియు, గంధర్వియుననుపేళ్లుగల యిద్దఱుకూఁతులంగనెను; నీకుమంగళమగుఁగాక. అని, తాత్పర్యము.

రోహిణ్యజనయ ద్గావై గంధర్వీ వాజిన స్సుతాన్

టీక॥ రోహిణీ=రోహిణి ; గాః= గోవులను("వై" అనునది పాదపూరణార్థము); అజనయత్ = పుట్టించెను. గంధర్వీ=గంధర్వి; వాజినః= గుఱ్ఱములను; సుతాన్=కొడుకులనుగా; అజనయత్=పుట్టించెను.

రోహిణికిగోవులుపుట్టినవి; గంధర్వికి, గుఱ్ఱములుజన్మించినవి.

అని, తాత్పర్యము.

సురసా జనయ న్నాగాన్ రామ కద్రూస్తు పన్నగాన్. ౨౮

టీక॥ రామ=రాముఁడా! సురసా= సురస; నాగాన్= పెక్కుతలలుగలదివ్యసర్పములను; అజనయత్=పుట్టించెను. కద్రూస్తు = కద్రువును ; పన్నగాన్= సాధారణములగుపాములను; అజనయత్(అధ్యాహృతము)= పుట్టించెను.

రాముఁడా! సురసకుఁ, బెక్కుతలలుగలదివ్యసర్పంబులుజన్మించినవి; కద్రువునకు, సాధారణసర్పంబులు గలిగినవి. అని, తాత్పర్యము.

మను ర్మనుష్యాన్ జనయ ద్రామ పుత్రాన్ యశస్వినః

బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాన్ శూద్రాంశ్చమనుజర్షభ. ౨౯

టీక॥ మనుజర్షభ=పురుషశ్రేష్ఠుండవగు; రామ=రాముఁడా! మనుః= మనువు; బ్రాహ్మణాన్= బ్రాహ్మణులను ; క్షత్రియాన్ = క్షత్రియులను;

స ౧౪

వైశ్యాన్=వైశ్యులన; శూద్రాంశ్చ=శూద్రులను;మనుష్యాన్ = మనుష్యులను; జనయత్ (అజనయత్)= పుట్టించెను.

పురుషశ్రేష్ఠుండవగు [illegible] బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రాదులను నాలుగువర్ణములు గల మనుష్యులంగనెను. అని, తాత్పర్యము.

సర్వాన్ పిండఫలాన్ వృక్షా ననలాపి వ్యజాయత
( "పుణ్యఫలాన్ వృక్షాన్" ఇతిపాఠాంతరం )

టీక॥ అనలాపి=అనలయును; పిండఫలాన్ = పిండాకారఫలములుగల; ( పాఠాంతరపక్షమునందు ) పుణ్యఫలాన్ = పవిత్రములయినఫలములుగల;వృక్షాన్=వృక్షములను; సర్వాన్=అన్నిటిని:వ్యజాయత=కనెను.

అనలయును [illegible] (పవిత్రములగు) [illegible] గనెను. అని, తాత్పర్యము.

వినతా చ శుకీపౌత్రీ కద్రూశ్చ సురసాస్వసా. ౩౦

టీక॥ వినతా చ=వినతయును ; శుకీపౌత్రీ = శుకియొక్క మనుమరాలు; కద్రూశ్చ= కద్రువును;సురసాస్వసా= సురసచెల్లెలు.

[illegible] కద్రువ , వీరలవంశమును [illegible]. అని.తాత్పర్యము.

కద్రూ నాగం సహస్రాస్యం విజజ్ఞే [illegible]

టీక॥ కద్రూః=కద్రువు; సహస్రాస్యం= వేయిముఖములుగలవాడును; ధరణీధరం = భూమినిధరించువాడునగు;నాగం=ఆదిశేషుని;విజజ్ఞే = కనెను.

[illegible]

అని, తాత్పర్యము.

ద్వౌ పుత్రౌ వినతాయాస్తు గరుడోఽరుణఏవ చ. ౩౧

టీక॥ వినతాయాస్తు=వినతకును ; గరుడః=గరుడుండనియు ; అరుణఏవ చ=అరుణుండనియు ; ద్వౌ=ఇద్దఱు ; పుత్రౌ=కొడుకులు.

వినతకు, గరుడుండనియు నరుణుం డనియు నిద్దఱు కొడుకులు గలిగిరి.

అని, తాత్పర్యము.

అస్మా జ్జాతోఽహ మరుణా త్సంపాతిస్తు మమాగ్రజః
జటాయురితి మాం విద్ధి శ్యేనీపుత్ర మరిందమ ౩౨

టీక॥ అరిందమ=శత్రువులనడఁగఁ ద్రొక్కుజాలినట్టి రాముఁడా! అహం=నేను ; తస్మాత్=ఆ ; అరుణాత్=అరుణునివలన ; జాతః=పుట్టినవాఁడను. సంపాతిస్తు=సంపాతిమాత్రము ; మమ=నాయొక్క, అగ్రజః=అన్న ; మాం=నన్ను ; శ్యేనీపుత్రం=శ్యేనియొక్క కొడుకును గాను ; జటాయురితి=జటాయు వనియు ; విద్ధి=ఎఱుంగుము.

శత్రువులను డంగఁ ద్రొక్కుజాలినట్టి రాముఁడా! నేనా యరుణునకు శ్యేనియందుఁ బుట్టినవాఁడను ; సంపాతియాను వాఁడు నా యగ్రజుఁడు ; నా పేరు జటాయువని యెఱుంగుము.

అని, తాత్పర్యము.

సోఽహం వాససహాయస్తే భవిష్యామి యదీచ్ఛసి

టీక॥ సోఽహం=అట్టి, అహం=నేను, ఇచ్ఛసి యది=కోరుదువేని ; తే=నీకు, వాససహాయః=నివసింపుటయందు సహాయుఁడుగ ; భవిష్యామి=కాఁగలను.

నీవు కోరుదువేని, నేను, నీవు వనవాసంబున సహాయుఁడనై యుండెదను.

అని, తాత్పర్యము.

ఇదం దుర్గం హి కాంతారం మృగరాక్షససేవితమ్, ౩౩

టీక॥ ఇదం=ఈ ; కాంతారం=అడవి ; దుర్గం=పొందనలవిగానిదియు ;

మృగరాక్షససేవితంహి=మృగములచేతను రాక్షసులచేతను సేవింపఁబడినది గదా.

ఈయడవి మిక్కిలియు భయంకరమునుక్రూరమృగంబులుగలదియు రాక్షససేవితంబునుగావున, నా సాహాయ్యంబు నీకు బ్రయోజనముగలదు.

అని, తాత్పర్యము.

సీతాంచ తాత రక్షిష్యే త్వయి యాతే సలక్ష్మణే

టీ॥ తాత = నాయనా! సలక్ష్మణే=లక్ష్మణునితోఁగూడిన; త్వయి=నీవు; యాతే=పోఁగా; సీతాంచ= సీతాదేవిని; రక్షిష్యే=కాపాడెదను.

నాయనా! నీవునులక్ష్మణుఁడును, వెళ్ళునప్పుడు, నేనుసీతాదేవిని రక్షించుచుండెదను. అని, జటాయువు రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

జటాయుషం తం ప్రతిపూజ్య రాఘవో
ముదా పరిష్వజ్య చ సన్నతోఽభవత్. ౩౪
పితుర్హి శుశ్రావ సఖిత్వ మాత్మవాన్
జటాయుషా సంకథితం పునఃపునః

టీక॥ఆత్మవాన్=ప్రశస్తమయినస్వభావముగలు; రాఘవః = రాముఁడు; తం= ఆ; జటాయుషం= జటాయువును; సంప్రతిపూజ్యచ= పూజించియు; ముదా= సంతోషముచేత; పరిష్వజ్య చ=కవుఁగిలించియు; సన్నతః= నమస్కరించినవాఁడు; అభవత్= ఆయెను. జటాయుషా= జటాయువుచేత; పునఃపునః = మాటిమాటికి, సంకథితం=చెప్పఁబడిన; పితుః= తండ్రియొక్క; సఖిత్వం=స్నేహమును; శుశ్రావహి=వినెనుగదా!

మహాత్ముండగు రాముండు, జటాయువుఁ బూజించి, సంతోషంబునం గవుఁగిలించికొని, మ్రొక్కెను, పలుమాఱు తనకునుదశరథునకునుంగల్గినసఖ్యంబుఁజెప్పినప్పుడెల్ల నత్యాదరంబున వినుచు నమస్కరింపుచుండెను.

అని, తాత్పర్యము.

స తత్ర సీతాం పరిగృహ్య మైథిలీం
సహైవ తేనాతిబలేన పక్షిణా. ౩౫
జగామ తాం పంచవటీం సలక్ష్మణో
రిపూన్ దిధక్షన్ శలభానివానలః

టీక॥ సః = ఆ రాముఁడు; తత్ర = అచ్చట; మైథిలీం = మిథిలయందుఁ బుట్టిన, సీతాం = సీతను; పరిగృహ్య = తీసికొని; అతిబలేన = అధికమైనబలముగల; తేన = ఆ; పక్షిణా, సహైవ = జటాయువుతోఁగూడనే; సలక్ష్మణః = లక్ష్మణునితోఁగూడినవాఁడై; శలభాన్ = మిడుతలను; అనల ఇవ = అగ్నిహోత్రుఁడువలె; రిపూన్ = శత్రువులను; దిధక్షన్ = దహింపఁగోరువాఁడై; తాం = ఆ; పంచవటీం = పంచవటిని; జగామ = పోయెను.

అంత, రాముండు, మహాబలుండగు జటాయువుతోఁగూడ, సీతాలక్ష్మణసమేతుండై, శలభంబుల నగ్నిహోత్రుండువలె శత్రువులదహింపఁగోరుచుఁ, బంచవటింబోయెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, చతుర్దశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండచతుర్దశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

పంచదశస్సర్గ ప్రారంభః.

తతః పంచవటీం గత్వా నానావ్యాళమృగాయుతామ్
ఉవాచ భ్రాతరం రామ స్సౌమిత్రిం దీప్తతేజసమ్. ౧

టీక॥ తతః--అంత; రామః = రాముఁడు; నానావ్యాళమృగాయుతాం= నానావిధము లయిన దుష్టసర్పములతోను మృగములతోనుం గూడిన ; పంచవటీం=పంచవటినిగూర్చి; గత్వా = పొంది; దీప్తతేజసం= మండుచున్న తేజస్సుగలవాఁడును; భ్రాతరం= తమ్ముఁడునగు; సౌమిత్రిం=లక్ష్మణునిగూర్చి ; ఉవాచ=చెప్పెను.

అంత, రాముఁడు , నానావిధములయిన దుష్టసర్పములతోను మృగములతోనుంగూడినపంచవటింజేరి, మహాతేజుండగుతమ్ముని లక్ష్మణుంజూచి, యిట్లని , చెప్పెను.

అని, తాత్పర్యము.

ఆగతా స్స్మ యథోద్దిష్ట మముం దేశం మహర్షిణా
అయం పంచవటీ దేశ స్సౌమ్య పుష్పితకాననః. ౨

టీక॥సౌమ్య=శాంతుండవగు లక్ష్మణుఁడా!మహర్షిణా= అగస్త్యమహాముని చేత; యథోద్దిష్టం = చెప్పఁబడినట్లున్న; అముం=ఈ, దేశం= ప్రదేశమును; ఆగతాః=పొందినవారలము ; స్మ (స్మః)=అగుచున్నాము. పుష్పితకాననః=పూచినయడవులుగల ; అయం= ఈ; దేశః=ప్రదేశము; పంచవటీ=పంచవటి.

శాంతుండవగులక్ష్మణుఁడా ! అగస్త్యమహాముని చెప్పినపద్ధతిని,మనమీప్రదేశముం జేరినాము,ఇదిగో చక్కఁగాఁబూచిన యడవులుగల యీప్రదేశమె పంచవటి. అని, తాత్పర్యము.

సర్వత శ్చార్యతాం దృష్టిః కాననే నిపుణోహ్యసి
ఆశ్రమః కతరస్మి న్నో దేశే భవతి సమ్మతః. ౩

టీక॥ సర్వతః = అంతటను; దృష్టిః=చూపు; చార్యతాం= నడపఁబడుఁగాక. కాననే= అడవియందు; నిపుణః=సమర్థుఁడవు; అసిహి=అగుచున్నావుగదా! కతరస్మిన్=ఏ; దేశే= ప్రదేశమునందు; నః=మనకు; సమ్మతః=ఇష్టమయిన; ఆశ్రమః = ఆశ్రమము; భవతి=అగును?

ఈయడవినంతంజూడుము; అడవియందాశ్రమయోగ్యస్థలంబు గనుంగొనుటయందు నీవుమిక్కిలియుసమర్థుండవుగదా! ఏప్రదేశంబున, మనకందఱకును సమ్మతంబగునట్లు, ఆశ్రమంబుగుదురును? అని, తాత్పర్యము.

రమతే యత్ర వైదేహీ త్వమహంచైవ లక్ష్మణ
తాదృశో దృశ్యతాం దేశ స్సన్నికృష్టజలాశయః. ౪
వనరామణ్యకం యత్ర స్థలరామణ్యకం తథా
సన్నికృష్టంచ యత్ర స్యాత్సమిత్పుష్పకుశోదకమ్. ౫

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! యత్ర=ఎచ్చట; వైదేహీ=సీతాదేవి; రమతే=క్రీడించునో, త్వం=నీవు; రమసే (అధ్యాహృతము)=క్రీడింతువో; అహంచైవ = నేనును, రమే (అధ్యాహృతము)= క్రీడింతునో; యత్ర= ఎచ్చట; వనరామణ్యకం= వనసౌందర్యమును, తథా=అట్లు, స్థలరామణ్యకం = స్థలసౌందర్యమునో, యత్ర=ఎచ్చట; సమిత్పుష్పకుశోదకం = సమిత్తులును బూలునుదర్భలును జలములును; సన్నికృష్టం=సమీపముననుండునదిగా; స్యాత్ =ఉండునదో; తాదృశః = అట్టి, సన్నికృష్టజలాశయః = సమీపించినకొలనుగల; దేశః = ప్రదేశము; దృశ్యతాం=చూడఁబడుఁగాక.

లక్ష్మణుఁడా! ఎచ్చటసీతకును, నీకును నాకును, సంతోషంబుగనుండునో, ఎచ్చట సుందరవనంబులును మంచియిసుకతోఁగూడినస్థలంబునుండునో, ఎచ్చట, సమిధలును బూలునుదర్భలునుసమీపంబునసమృద్ధంబుగానుండునో, అట్టి, సమీపంబునం గొలనుగలప్రదేశముంజూడుము. అని, రాముండు, లక్ష్మణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు రామేణ లక్ష్మణ స్సంయతాంజలిః
సీతాసమక్షం కాకుత్స్థ మిదం వచన మబ్రవీత్. ౬

టీక॥లక్ష్మణః=లక్ష్మణుఁడు; రామేణ=రామునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడైనంతనే; సంయతాంజలిః=కట్టఁబడిన చేమోడ్పు గలవాఁడై; సీతాసమక్షం= సీతాదేవియెదుట; కాకుత్స్థం=రామునిగూర్చి; ఇదం=ఈ; వచనం= మాటను ; అబ్రవీత్ =చెప్పెను.

లక్ష్మణుఁడు, రామునిమాటనువిని, చేతులు మొగుడ్చుకొని, సీతాదేవి సమక్షంబున రామునిఁజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

పరవా నస్మి కాకుత్స్థ త్వయి వర్ష శతం స్థితే
స్వయంతు రుచిరే దేశే క్రియతా మితి మాం వద. ౭

టీక॥ కాకుత్స్థ= రాముఁడా! త్వయి=నీవు; వర్షశతం= సంవత్సరములనూఱు; స్థితే = ఉండఁగా ; అహం (అధ్యాహృతము)=నేను;పరవాన్ = పరతంత్రుండను ; అస్మి = అయితిని. స్వయంతు=నీవే; రుచిరే= మనోహరమగు; దేశే=ప్రదేశమునందు ; క్రియతాం=చేయబడుఁగాక. ఇతి= అని ; మాం=నన్నుగూర్చి; వద= చెప్పుము.

రాముఁడా! నీవివ్వనంబున నూఱు సంవత్సరంబులున్నను, నేనునీవు చెప్పినపనిఁ జేయుచుండువాఁడనేగాని స్వతంత్రుండఁగాను;కావున,నీవెచూచి , మనోహరంబగుప్రదేశంబున , నాశ్రమంబు రచియింపుమని యానతిమ్ము. అని,లక్ష్మణుఁడు, రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

సుప్రీత స్తేన వాక్యేన లక్ష్మణస్య మహాత్మనః
విమృశ న్రోచయామాస దేశం సర్వగుణాన్వితమ్. ౮

టీక॥రామః ( అధ్యాహృతము )= రాముఁడు;మహాత్మనః=పూజ్యమయిన మనస్సుగల; లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క; తేన=ఆ;వాక్యేన=మాటచేత;సు

ప్రీతః=మిక్కిలియు సంతోషించినవాఁడై; విమృశన్=ఆలోచించుచు; సర్వగుణాన్వితం = సమస్తగుణములతోఁగూడినదగు; దేశం=ప్రదేశమును ; రోచయామాస=ఇచ్ఛించెను.

రాముండు, మహాత్ముండగు లక్ష్మణుని మాటకు సంతసించి , చక్కఁగా విమర్శించి, సమస్తగుణసమన్వితంబగు ప్రదేశంబునొకటిఁ జూపెను.

అని, తాత్పర్యము.

స తం రుచిర మాక్రమ్య దేశ మాశ్రమకర్మణి
హస్తౌ గృహీత్వా హస్తేన రామ స్సౌమిత్రి మబ్రవీత్. ౯

టీక॥ సః=ఆ; రామః = రాముఁడు; ఆశ్రమకర్మణి = ఆశ్రమకార్యనిమిత్తమయి; తం=ఆ; రుచిరం = మనోహరమగు; దేశం = ప్రదేశమును; ఆక్రమ్య=ఆక్రమించి, హస్తేన= చేతిచేత, హస్తౌ=చేతులను; గృహీత్వా = పట్టుకొని; సౌమిత్రిం= లక్ష్మణునిగూర్చి; అబ్రవీత్ =చెప్పెను.

ఆ రాముండు , ఆశ్రమంబునిమిత్తమయి , యమ్మనోహర ప్రదేశమునాక్రమింపఁదలఁచి , తనహస్తంబున లక్ష్మణునిహస్తంబులు పట్టుకొని, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అయం దేశ స్సమ శ్శ్రీమాన్ పుష్పితై స్తరుభి ర్వృతః
ఇహాశ్రమపదం సౌమ్య యథావ త్కర్తు మర్హసి. ౧౦

టీక॥ సౌమ్య=శాంతుఁడవగులక్ష్మణుఁడా! అయం=ఈ; దేశః=దేశము. సమః = మిట్టపల్లములు లేనిది ; శ్రీమాన్=అధికమయిన కాంతిగలది. పుష్పితైః=పూచిన; తరుభిః - వృక్షములచేత; వృతః=చుట్టబడినది. ఇహ= ఇచ్చట; ఆశ్రమపదం=ఆశ్రమస్థానమును ; యథావత్= యథాశాస్త్రముగా ; కర్తుం=చేయుటకు; అర్హసి= తగుదువు.

శాంతుండవగులక్ష్మణుఁడా! ఈ ప్రదేశముమిట్టపల్లములులేనిదిగాను శ్రీమంతంబుగాను బుష్పితంబులగు వృక్షములుగలదిగానునున్నది; ఇచ్చట , యథాశాస్త్రముగా నాశ్రమంబునిర్మింపుము. అని, తాత్పర్యము.

ఇయ మాదిత్యసంకాశైః పద్మైః సురభిగంధిభిః
అదూరే దృశ్యతే రమ్యా పద్మినీ పద్మసేవితా. ౧౧

టీక॥ఆదిత్యసంకాశైః = సూర్యునితో సమానములగు; సురభిగంధిభిః= మంచివాసనగల; పద్మైః=కమలములతో; సహితా=కూడినదియు; పద్మసేవితా=కమలములచే సేవింపఁబడినదియు; రమ్యా=రమణీయమునగు; ఇయం=ఈ; పద్మినీ=తామరకొలను; అదూరే= సమీపమునందు; దృశ్యతే = చూడఁబడుచున్నది.

సూర్యసమానంబులును పరిమళంబుగలవియునగు కమలంబులతో నొప్పుచున్నదియు రమణీయంబగు తామరకొలను, ఇదిగో సమీపంబుననున్నది. అని, తాత్పర్యము.

యథాఖ్యాత మగస్త్యేన మునినా భావితాత్మనా
ఇయం గోదావరీ రమ్యా పుష్పితై స్తరుభి ర్వృతా. ౧౨
హంసకారండవాకీర్ణా చక్రవాకోపశోభితా

టీక॥ భావితాత్మనా= ధ్యానింపఁబడినయాత్మగల ; మునినా= మునియగు; అగస్త్యేన= అగస్త్యునిచేత; యథాఖ్యాతం=చెప్పఁబడినట్లు; రమ్యా= రమణీయంబును; పుష్పితైః= పూచిన; తరుభిః=వృక్షములచేత; వృతా = చుట్టఁబడినదియు ; హంసకారండవాకీర్ణా= హంసలచేతను గన్నెలేళ్లచేత నువ్యాపింపఁబడినదియు; చక్రవాకోపశోభితా = చక్రవాకములచేతఁబ్రకాశించుచున్నదియునగు; ఇయం = ఈ; గోదావరీ= గోదావరి; అస్తి (అధ్యాహృతము)=ఉన్నది.

భావితాత్ముండగు నగస్త్యమునిచెప్పినట్లు, రమణీయమునగు పూచిన వృక్షములతోఁగూడినదియు, హంసకారండవచక్రవాకంబులతోఁ బ్రకాశించుచున్నదియునగు నీగోదావరి యెంతయు సమీపంబుననున్నది. అని, తాత్పర్యము.

నాతిదూరే న చాసన్నే మృగయూథ నిపీడితా. ౧౩

స ౧౫

మయూరనాదితా రమ్యాః ప్రాంశవో బహుకందరాః
దృశ్యంతే గిరయః సౌమ్య ఫుల్లై స్తరుభి రావృతాః. ౧౪

టీక॥ సౌమ్య = శాంతుండవగులక్ష్మణా; అతిదూరే = మిక్కిలియుదూరమునందునున్నవి కాదు. ఆసన్నేచ = సమీపంబునందున్నవ = కాదు. మృగయూథ పీడితాః = మృగసమూహములచే నిండింపఁబడినవియు; మయూరనాదితాః = నెమిళ్లచేధ్వనింపఁజేయఁబడినవియు; రమ్యాః = రమణీయములును; ప్రాంశవః = ఉన్నతములును; బహుకందరాః = పెక్కుగుహలుగలవియు; ఫుల్లైః = వికసించిన; తరుభిః = వృక్షములచేత; ఆవృతాః = చుట్టఁబడినవియునగు; గిరయః = పర్వతములు; దృశ్యంతే = చూడఁబడుచున్నవి.

శాంతుండవగు లక్ష్మణుఁడా! మృగసమూహంబుల నిండినవియు మధురంబుగాఁ గూయుచుండు నెమిళ్లతోఁ గూడినవియు రమణీయంబులును నత్యున్నతంబులును పెక్కుగుహలు గలదియఁజక్కఁగా వికసించినపుష్పములుగలవృక్షములతోఁ గూడినవియునగు పర్వతంబులు, ఈపంచవటికి సమీపంబునను దూరంబుననుంగాక చెలంగుచున్నవి; చూడుము. అని, తాత్పర్యము.

సౌవర్ణై రాజతై స్తామ్రై ర్దేశే దేశేచ ధాతుభిః
గవాక్షితా ఇవాభాంతి గజాః పరమభి క్తిభిః. ౧౫

టీక॥ గజాః = ఏనుంగులు; సౌవర్ణైః = బంగారురంగుగలవియు; రాజతైః = వెండిరంగుగలవియు; తామ్రైః = ఎఱ్ఱనివియునగు; ధాతుభిః = గైరికధాతువులచేత; పరమభిక్తిభిః = ఉత్కృష్టములగు రేఖలచేత; గవాక్షితాఇవ = కిటికీలవంటిచిత్తరువులుగలవివలెఁ; ఆభాంతి = ప్రకాశించుచున్నవి.

ఇచ్చట, నన్యోన్యప్రదేశంబులనుండు, సువర్ణవర్ణంబులును రజతవర్ణంబులును తామ్రవర్ణంబులునగు గైరికధాతువుల కాంతులు మేనంబ్రసరించుటంజేసి, యేనుంగులు, గవాక్షాకారములగు చిత్తరువులు వ్రాయఁబడినవివలెఁబ్రకాశించుచున్నవి.

అని, తాత్పర్యము.

సాలై స్తాలై స్తమాలైశ్చ ఖర్జూరపనసామ్రకైః
నివారై స్తిమిశైశ్చైవ పున్నాగై శ్చోపశోభితాః. ౧౬
చూతై రశోకై స్తిలకై శ్చంపకైః కేతకైరపి
పుష్పగుల్మలతోపేతై స్తైస్తై స్తరుభి రావృతాః. ౧౭
చందనై స్స్యందనైర్నీపైః పార్ణాసై ర్లికుచైరపి
ధవాశ్వకర్ణఖదిరై శ్శమీకింశుకపాటలైః. ౧౮

టీక॥గిరయః(అధ్యాహృతము)=పర్వతములు;సాలైః= మద్దిచెట్లచేతను; తాలైః=తాటిచెట్లచేతను; తమాలైశ్చ=చీఁకటిచెట్లచేతను; ఖర్జూరపనసామ్రకైః=ఖర్జూరవృక్షములచేతను బనసచెట్లచేతనుబుల్ల మామిడిచెట్లచేతను;నివారైః= జలకంబవృక్షములచేతను;తిమిశైశ్చైవ= నేమివృక్షములచేతను;పున్నాగైః=పున్నాగవృక్షములచేతను;ఉపశోభితాః= ప్రకాశించినవై; చూతైః=తియ్యానిమామిడి చెట్లచేతను; అశోకైః=అశోకవృక్షములచేతను;తిలకైః=బొట్టుగుచెట్లచేతను;చంపకైః= సంపెఁగచెట్లచేతను; కేతకైరపి= మొగిలిపొదలచేతను ; పుష్పగుల్మలతోపేతైః=పూలపొదలతోను దీఁగెలతోనుం గూడిన;తైస్తైః=ఆయా;తరుభిః=వృక్షములచేతను,ఆవృతాః=చుట్టఁబడినవై; చందనైః = చందనవృక్షములచేతను; స్యందనైః=ఒకవిధమైన నేమి వృక్షములచేతను.నీపైః=కదంబవృక్షములచేతను; పార్ణాసైః=పార్ణాసవృక్షములచేతను;లికుచైరపి=నిమ్మచెట్లచేతను; ధవాశ్వకర్ణఖదిరైః=ఉమ్మెత్తచెట్లచేతనుఇనుమద్దిచెట్లచేతను చండ్రచెట్లచేతను;శమీకింశుకపాటలైః=జమ్మిచెట్లచేతను మోదుగుచెట్లచేతను గలిగొట్టుచెట్లచేతను;ఆవృతాః (అధ్యాహృతము)=చుట్టఁబడినవి.

మద్దిచెట్లును తాటిచెట్లును దమాలవృక్షంబులును ఖర్జూరవృక్షములును బనసచెట్లును నానావిధములగుమామిడిచెట్లునుజలకదంబవృక్షములును నేమివృక్షములునుబున్నాగవృక్షములును అశోకవృక్షములునుబొట్టుగుచెట్లును సంపెఁగచెట్లును మొగిలిపొదలును , మల్లెజాజి మున్నగు పుష్పలతలతోఁగూడిన నానావిధవృక్షంబులును , చందనవృక్షంబులునుస్యందనవృక్షంబులును కదంబ వృక్షంబులును పార్ణాస వృక్షం

స ౧౫

... మ్మ ... , ఉమ్మెత్తచెట్లును ... మద్దిచెట్లు ... చెట్లును ... ట్లును మేలుగు చెట్లు గలిగొట్టు చెట్లు సుంగలిగి, యీపర్వతంబులెంతయునొప్పుచున్నవి. అని, తాత్పర్యము.

ఇదం పుణ్య మిదం మేధ్య మిదం బహుమృగద్విజమ్
ఇహ వత్స్యామి సౌమిత్రే సార్ధ మేతేన పక్షిణా. ౧౯

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! ఇదం=ఈస్థలము; పుణ్యం= పుణ్యముగలిగినది; ఇదం=ఇది; మేధ్యం = పావనమైనది. ఇదం =ఇది; బహుమృగద్విజం= పెక్కుమృగములును బక్షులును గలది. ఇహ=ఇచ్చట, ఏతేన = ఈ, పక్షిణా సార్ధం=జటాయువుతోఁగూడ; వత్స్యామి=వాసముచేసెదను.

లక్ష్మణుఁడా! ఈప్రదేశముపుణ్యమును బావనమును గానున్నది; ఇచ్చట, నానా విధములగు మనోహరములయి నమృగంబులును బక్షులు నుంగలవు ; ఇచ్చట, ఈజటాయువుతోఁగూడనివసించియుందము. అని రాముండు లక్ష్మణుని తోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు రామేణ లక్ష్మణః పరవీరహా
అచిరే ణాశ్రమం భ్రాతు శ్చకార సుమహాబలః. ౨౦

టీక॥ పరవీరహా=శత్రువీరులఁజంపునట్టి; సుమహాబలః=మిక్కిలి యునధికమయినబలముగల; లక్ష్మణః = లక్ష్మణుఁడు; రామేణ=రామునిచేత; ఏవం = ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడై నంతనే; అచిరేణ=శీఘ్రముగా; భ్రాతుః=అన్నకు; ఆశ్రమం=ఆశ్రమమును; చకార= చేసెను.

శత్రువీరులవధించువాఁడును మహాబలుండు నగు లక్ష్మణుండు, రాముని మాటనువిని, శీఘ్రమున, రామునకు, ఆశ్రమంబు నిర్మించెను. అని, తాత్పర్యము.

పర్ణశాలాం సువిపులాం తత్ర సంఘాతమృత్తికామ్
సుస్తంభాం మస్కరై ర్దీర్ఘైః కృతవంశాం సుశోభనామ్. ౨౧

స ౧౫

శమీశాఖాభిరాస్తీర్య దృఢపాశావపాశితామ్
కుశకాశశరైః పర్ణైః సుపరిచ్ఛాదితాం తథా. ౨౨
సమీకృతతలాం రమ్యాం చకార లఘువిక్రమః
నివాసం రాఘవస్యార్థే ప్రేక్షణీయమనుత్తమమ్. ౨౩

టీ॥ లఘువిక్రమః=చురుకనయినగమనముగల లక్ష్మణుఁడు; తత్ర=ఆయాశ్రమమున, పృథులాం=మిక్కిలియువిశాలమును; సంఖ్యాతమృత్తికాం=త్రవ్వఁబడినమట్టిగలదియు; సుస్తంభాం=మంచిస్తంభములుగలదియు, దీర్ఘైః=నిడుపులయిన; మస్కరైః=వెదుళ్లచేత; కృతవంశాం=చేయఁబడిన స్తంభములుగలదియు; సుశోభనాం=మిక్కిలియుమంగళతరమును; శమీశాఖాభిః=జమ్మికొమ్మలచేత; ఆస్తీర్య=పఱచి; దృఢపాశావపాశితాం=దృఢములయినత్రాళ్లచేఁ గట్టఁబడినదియు; తథా=అట్లు; కుశకాశశరైః=దర్భలును రెల్లును; పర్ణైః=ఆకులచేత; సుపరిచ్ఛాదితాం=చక్కఁగాఁగప్పఁబడినదియు; సమీకృతతలాం=చదరముగాఁజేయఁబడినదియు; రమ్యాం=రమణీయమునగు; పర్ణశాలాం=పర్ణశాలారూపమయిన; ప్రేక్షణీయం=సుందరమును; అనుత్తమం=తనకన్న నుత్తమము లేనిదియునగు; నివాసం=వాసస్థానమును; రాఘవస్యార్థే=రాముని కార్యమునిమిత్తమై; చకార=చేసెను.

శీఘ్రముగాఁ గార్యముఁజేయుస్వభావముగలలక్ష్మణుఁడు, ఆయాశ్రమంబున, మట్టిత్రవ్వి గోడలుపెట్టి, దీర్ఘంబులును దృఢములునగు వెదుళ్లను స్తంభంబులుగాఁ బూన్చి వానిపైజమ్మికొమ్మలనడ్డముగా నుంచి, దృఢములగు త్రాళ్లఁ బంధించి, పైని, దర్భరెల్లుమొదలగు పత్రములచే చక్కఁగాఁ గప్పవేసి, నేలను సదరముగాఁజేసి, సకలలక్షణయుక్తంబుగా, రామునకు, సుందరంబును రమణీయంబునగు పర్ణశాలను నిర్మించెను. అని, తాత్పర్యము.

సహసా లక్ష్మణశ్శ్రీమాన్నదీం గోదావరీం తదా
స్నాత్వా పద్మాని చాదాయ సఫలః పునరాగతః. ౨౪

టీక॥ తదా=అప్పుడు; శ్రీమాన్=అధికమయినకాంతిగల, లక్ష్మణః = లక్ష్మణుఁడు; సహసా = శీఘ్రంబున. గోదావరీం=గోదావరయను; నదీం=ఏటిని ; గత్వా (అధ్యాహృతము)=పొంది; స్నాత్వా = స్నానముచేసి; పద్మాని చ= కమలంబులను; ఆదాయ=తీసికొని; సఫలః = పండ్లతోఁగూడినవాఁడై; పునః=మఱల; ఆగతః = వచ్చినాఁడు.

అప్పుడు, శ్రీమంతుండగులక్ష్మణుండు , శీఘ్రంబునగోదావరీనదికింబోయి, స్నానంబు గావించి , కమలంబులనుఫలంబులనుందీసికొని, మఱలవచ్చెను. అని, తాత్పర్యము.

తతః పుష్పబలిం కృత్వా శాంతిం చ స యథావిధి
దర్శయామాస రామాయ తదాశ్రమపదం కృతమ్. ౨౫

టీక॥ తతః=అంత; సః=ఆలక్ష్మణుండు; యథావిధి= యథాశాస్త్రముగా, పుష్పబలిం=వాస్తుపూజను; శాంతించ=అభ్యుదయకర్మమును; కృత్వా= చేసి; కృతం=చేయఁబడిన; తత్ =ఆ; ఆశ్రమపదం=ఆశ్రమస్థానమును ; రామాయ=రామునికొఱకు ; దర్శయామాస=చూపెను.

అంత, నాలక్ష్మణుండు, వాస్తుపూజను శాంతినిం గావించి, తానునిర్మించినయాశ్రమంబును, శ్రీరామునకుఁజూపెను. అని, తాత్పర్యము.

స తం దృష్ట్వా కృతం సౌమ్య మాశ్రమం సీతయా సహ
రాఘవః పర్ణశాలాయాం హర్ష మాహారయ ద్భృశమ్. ౨౬

టీక॥ సః=ఆ; రాఘవః=రాముఁడు; సీతయాసహ=సీతతోఁగూడ; కృతం=చేయఁబడిన; సౌమ్యం = సుందరమగు, తం=ఆ; ఆశ్రమం=ఆశ్రమమును ; దృష్ట్వా=చూచి; పర్ణశాలాయాం= పర్ణశాలయందు; భృశం=మిక్కిలియు, హర్షం=సంతోషమును ; ఆహారయత్ =పొందెను.

అంత, రాముండు, సీతతోఁగూడ, నయ్యాశ్రమంబుఁజూచి, పర్ణశాలం బ్రవేశించి, పరమసంతోషంబునొందెను. అని, తాత్పర్యము,

స ౧౫

సుసంహృష్టః పరిష్వజ్య బాహుభ్యాం లక్ష్మణం తదా
అతిస్నిగ్ధంచ గాఢంచ వచనం చేద మబ్రవీత్. ౨౭

టీక॥ సః (అధ్యాహృతము)= ఆ రాముఁడు;తదా= అప్పుడు;సుసంహృష్టః = మిక్కిలియుసంతోషించినవాఁడై;అతిస్నిగ్ధంచ= మిక్కిలియుస్నేహముగలుగునట్లుగాను;గాఢంచ = గట్టిగాను;బాహుభ్యాం = చేతులచేత;లక్ష్మణం=లక్ష్మణుని;పరిష్వజ్య= కవుఁగిలించుకొని;ఇదం=ఈ;వచనంచ= మాటను;అబ్రవీత్ =చెప్పెను.

రాముండట్లు పరమసంతుష్టుండై, యతిస్నేహంబున , బాహువులనాలక్ష్మణుని గాఢంబుగాఁగవుఁగిలించుకొని,యీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

ప్రీతోస్మి తే మహత్కర్మ త్వయాకృత మిదం ప్రభో
ప్రదేయో యన్నిమిత్తస్తే పరిష్వంగో మయాకృతః. ౨౮

టీక॥ప్రభో = సమర్థుఁడవగులక్ష్మణుఁడా!త్వయా=నీచేత ; ఇదం= ఈ;మహత్ =గొప్పదగు;కర్మ= కార్యము;కృతం=చేయఁబడినది. తే=నీకొఱకు;ప్రీతః=సంతసించినవాఁడను; అస్మి=అగుచున్నాను.యన్నిమిత్తం= దేనినిమిత్తము;ప్రదేయః=ఇవ్వఁదగినపారితోషికరూపమయిన;పరిష్వంగః= కవుఁగిలి;తే=నీకొఱకు;మయా = నాచేత;కృతః=చేయఁబడినదో.

సమర్థుఁడవగురాముఁడా! నీవు మిక్కిలియు గొప్పకార్యము గావించినావు;కావుననీపైనాకుఁజాల సంతోషముగలిగినది ; అందుకు నీకివ్వవలసిన పారితోషికమునకుఁగా,నిన్నుఁ గవుఁగిలించుకొంటిని. అని, తాత్పర్యము.

భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేనచ లక్ష్మణ
త్వయానాథేన ధర్మాత్మా నసంవృత్తః పితా మమ. ౨౯

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా!భావజ్ఞేన = హృదయముఁదెలిసినవాఁడవును;కృతజ్ఞేన= కార్యములఁదెలిసినవాఁడవును;ధర్మజ్ఞేనచ= ధర్మములఁదె

స ౧౫




లిసినవాఁడవునగు; నాథేన = పాలకుఁడవయిన; త్వయా = నీచేత; ధర్మాత్మా = ధర్మస్వభావుఁడగు, మమ = నా యొక్క; పితా = తండ్రి, నసంవృత్తః = మృతుండు కాఁడయ్యె.

లక్ష్మణుఁడా! నీవిట్లు నాహృదయంబుఁ దెలిసి, నాకుఁబ్రియంబులగువానినెల్ల నేను జెప్పకుండినను నేర్పుతోఁ జేయుచు, ధర్మముఁ దప్పక నాకు శుశ్రూష సేయుచుఁ, దండ్రికిమాఱుగా నన్నానావిధంబులం బాలింపుచు నుండుటచేత, ధర్మాత్ముండగు నాతండ్రి నాకు జీవించియున్నట్లేయున్నది. అని రాముండు లక్ష్మణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవం లక్ష్మణ ముక్త్వాతు రాఘవో లక్ష్మివర్ధనః
తస్మిన్ దేశే బహుఫలే న్యవస త్సుసుఖం వశీ. ౩౦

టీక॥ వశీ = ఇంద్రియనిగ్రహముగల; లక్ష్మివర్ధనః = సంపదనువృద్ధిఁబొందించునట్టి; రాఘవః = రాముఁడు; ఏవం = ఇట్లు; లక్ష్మణం = లక్ష్మణునిగూర్చి; ఉక్త్వాతు = చెప్పియు; బహుఫలే = పెక్కుపండ్లుగల; తస్మిన్ = ఆ; దేశే = ప్రదేశమునందు; సుసుఖం = మిక్కిలియు సుఖముగా; న్యవసత్ = ఉండెను.

జితేంద్రియుండును సంపద్వర్ధనుండునగు రాముండు, అట్లు లక్ష్మణునకుఁ జెప్పి నానావిధ బహుఫలసమన్వితంబగు నప్పంచవటియందు, సుఖంబుగా నివసించెను.

అని, తాత్పర్యము.

కంచిత్కాలం స ధర్మాత్మా సీతయా లక్ష్మణేనచ
అన్వాస్యమానో న్యవస త్స్వర్గలోకే యథామరః. ౩౧

టీక॥ ధర్మాత్మా = ధర్మస్వభావుఁడగు; సః = ఆ రాముఁడు; సీతయా = సీతచేతను; లక్ష్మణేనచ = లక్ష్మణునిచేతను; అన్వాస్యమానః = సేవింపఁబడుచున్నవాఁడై; స్వర్గలోకే = స్వర్గలోకమునందు, అమరః యథా = దేవేంద్రుఁడువలె; కంచిత్కాలం = కొంతకాలము; న్యవసత్ = ఉండెను.




ధర్మాత్ముండగునా రాముండు, సీతాలక్ష్మణులు సేవింప, నయ్యాశ్రమంబున, దేవలోకంబున దేవేంద్రుండుం బోలె, సుఖంబుననుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, అరణ్యకాండే, పంచదశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండ పంచదశసర్గటీక, ముగిసినది.

శ్రీ

షోడశసర్గప్రారంభః.

వసత స్తస్యతు సుఖం రాఘవస్య మహాత్మనః
శరద్వ్యపాయే హేమంత ఋతు రిష్టః ప్రవర్తతే. ౧

టీక॥ మహాత్మనః= పూజ్యమయిన స్వభావముగల; తస్య = ఆ; రాఘవస్య= రాముండు; సుఖం= సుఖముగా; వసతస్తు ; వాసము సేయుచుండఁగానే; శరద్వ్యపాయే = శరదృతువు యొక్క గడచుటకాఁగా; ఇష్టః= ప్రియంబగు; హేమంతఋతుః = హేమంతఋతువు; ప్రవర్తతే = ప్రవర్తించినది.

మహాత్ముండగునా రాముండట్లు లయ్యాశ్రమంబున, సుఖంబుగా వాసముచేయుచుండఁగానే, శరదృతువు గడచి, కామినీకాముకులకుఁ బ్రియంబగు హేమంతర్తువు వచ్చినది.

అని, తాత్పర్యము.

స కదాచి త్ప్రభాతాయాం శర్వర్యాం రఘునందనః
ప్రయయా వభిషేకార్థం రమ్యాం గోదావరీం నదీమ్. ౨

టీక॥ సః=ఆ; రఘునందనః = రాముఁడు; కదాచిత్=ఒకానొకప్పుడు; శర్వర్యాం=రాత్రి; ప్రభాతాయాం=తెల్లవాఱఁగా; అభిషేకార్థం= స్నానముకొఱకు; రమ్యాం= రమణీయమయిన, గోదావరీం=గోదావరియను; నదీం=నదినిగూర్చి; ప్రయయౌ = పోయెను.

ఒకనాఁడు తూర్పు తెల్లవాఱునప్పుడు, రాముండు స్నానార్థమయి, రమణీయంబగు, గోదావరీనదికిం బోయెను. అని, తాత్పర్యము.

ప్రహ్వః కలశహస్తస్తం సీతయాసహ వీర్యవాన్
పృష్ఠతో ఽనువ్రజన్ భ్రాతా సౌమిత్రి రిద మబ్రవీత్. ౩

టీక॥ వీర్యవాన్= అధికమయిన పరాక్రమము గలవాఁడును; భ్రాతా=తమ్ముఁడునగు; సౌమిత్రిః = లక్ష్మణుఁడు; ప్రహ్వః=నమ్రుఁడై; కలశహస్తః= కలశము చేతఁగలవాఁడై; సీతయా సహ=సీతతోఁగూడ; తం = ఆ రాముని, పృష్ఠతః=వెనుకనుండి; అనువ్రజన్= వెంబడించుచు; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

మహాపరాక్రమశాలియగు తమ్ముండు లక్ష్మణుండు, నమ్రుండై, కలశంబు దీసికొని, సీతతోఁగూడ రాముని వెంబడింబోవుచు, నాయనతో నిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

అయం స కాల స్సంప్రాప్తః ప్రియో యస్తే ప్రియంవద
అలంకృత ఇవా భాతి యేన సంవత్సర శ్శుభః. ౪

టీక॥ ప్రియంవద=ప్రియవాక్యములు చెప్పునట్టి రాముఁడా! యః=ఏది; తే=నీకు; ప్రియః = సంతోషము గల్గించునదో; యేన=దేని చేత; సంవత్సరః = సంవత్సరము; శుభః = మంగళకరమయి; అలంకృత ఇవ=అలంకరింపఁబడినదివలె; ఆభాతి=ప్రకాశించుచున్నదో; సః=అట్టి; అయం=ఈ; కాలః= హేమంతఋతువు; సంప్రాప్తః=వచ్చినది.

ప్రియంవదుండవగు రాముఁడా! ఏదినీకు మిక్కిలియుఁ బ్రియమో, దేనిచే సంవత్సరమునకంతయు నలంకారము గలుగునో, అట్టి హేమంతఋతువు వచ్చినది. అని, తాత్పర్యము.

నీహార పరుషో లోకః పృథివీ సస్యశాలినీ
జలా న్యనుపభోగ్యాని సుభగో హవ్యవాహనః. ౫

టీక॥ లోకః= జనము; నీహారపరుషః= మంచుచేతఁ బరుసుఁబారిన దేహము గలది. పృథివీ= భూమి; సస్యశాలినీ= పైరులచేఁ బ్రకాశించునది. జలాని= జలములు; అనుపభోగ్యాని= అనుభవింపఁదగనివి. హవ్యవాహనః= అగ్నిహోత్రము; సుభగః= మనోహరము.

ఇప్పుడు జనుల దేహము మంచుచేఁ బరుసుఁ గానున్నది, భూమి యంతయు సస్యములతో నొప్పుచున్నది; జలంబులు ద్రాఁక నలవిగాకున్నవి; నిప్పు మిక్కిలియు మనోహరమగుచున్నది.

అని, తాత్పర్యము.

నవాగ్రయణ పూజాభి రభ్యర్చ్య పితృదేవతాః
కృతాగ్రయణకాః కాలే సంతో విగత కల్మషాః. ౬

టీక॥ సంతః= సత్పురుషులు; నవాగ్రయణపూజాభిః= నూతనములయిన, నూతన ధాన్యము భుజించుటకు మును పు చేయవలసిన యాగ్రయణపూజల చేత; పితృదేవతాః= పితృదేవతలను; అభ్యర్చ్య= పూజించి; కాలే= యుక్తకాలమునందు; కృతాగ్రయణకాః= చేయఁబడిన యాగ్రయణము గలవారలయి; విగతకల్మషాః= పోయిన పాపము గలవారలు.

సత్పురుషులు, నవధాన్యములు భుజించుటకు మున్ను చేయవలసిన యాగ్రయణ యజ్ఞములచేఁ బితృదేవతలం బూజించి, యట్లు యుక్తకాలంబున నాగ్రయణయజ్ఞంబు నివర్తించి, విగతకల్మషులై యొప్పెదరు.

అని, తాత్పర్యము.

ప్రాజ్య కామా జన పదా స్సంపన్న తరగోరసాః
విచరంతి మహీపాలా యాత్రా స్థా విజిగీషవః. ౭

టీక॥ జనపదాః= గ్రామములు ; సంపన్నతరగోరసాః = సమృద్ధమయిన

యావుపాలుగలవై, ప్రాజ్యకామాః= అధికములయిన కోరఁదగిన పదార్థములుగలవై; వర్తంతే (అధ్యాహృతము)=ఉన్నవి; విజిగీషవః = జయింపఁగోరువట్టి; మహీపాలాః= రాజులు; యాత్రాస్థాః=యుద్ధయాత్రయందుశ్రద్ధగలవారలై; విచరంతి= సంచరించెదరు.

ఇప్పుడుగ్రామములందు సమస్తపదార్థంబులును సమృద్ధంబులై యావు పాలెచ్చుగానుండును; శత్రువుల జయింపఁగోరు రాజులు, యుద్ధములందిరుగుదురు. అని, తాత్పర్యము.

సేవమానే దృఢం సూర్యే దిశ మంతకసేవితామ్
విహీనతిలకేవ స్త్రీ నోత్తరా దిక్ప్రకాశతే. ౮

టీక॥సూర్యే=సూర్యుఁడు,దృఢం= దృఢముగా,అంతకసేవితాం=యమునిచే సేవింపఁబడిన ; దిశం = దిక్కును; సేవమానే= సేవించుచుండఁగా; ఉత్తరా=ఉత్తరపు; దిక్=దిక్కు; విహీనతిలకా=విడువఁబడినబొట్టుగల; స్త్రీవ=స్త్రీవలె; నప్రకాశతే= ప్రకాశింపకున్నది.

సూర్యుండు,దక్షిణపు దిక్కుననుండుటవలన, ఉత్తరపుదిక్కు, ముఖంబునఁ దిలకంబులేని స్త్రీవలె, నెంతమాత్రము ప్రకాశింపకున్నది.

అని; తాత్పర్యము.

ప్రకృత్యా హిమకోశాఢ్యో దూరసూర్యశ్చ సాంప్రతమ్
యథార్థనామా సువ్యక్తం హిమవాన్ హిమవాన్ గిరిః. ౯

టీక॥ప్రకృత్యా=స్వభావముచేత; హిమకోశాఢ్యః=మంచుసమూహముచే సమృద్ధంబును; సాంప్రతం=ఇప్పుడు; దూరసూర్యః= దూరంబునఁ దున్నసూర్యుండు గలదియు,కావుననే; హిమవాన్=అధికమయినమంచుగలదియునగు ; హిమవాన్=హిమవంతమను,గిరిః= పర్వతము; యథార్థనామా=అర్థము నతిక్రమింపని పేరుగలది; సువ్యక్తం = స్పష్టము.

స్వభావంబుననె,ఘనీభూతమగు మంచుచే నిండియుండునదియగు, హిమవ

త్సర్వతము, ఇప్పుడు దక్షిణాయనమునం దు, సూర్యుండు దూరగతుండగుటచే, మఱియు మంచు హెచ్చగుటం జేసి, "హ మవంతెము" (అధికముగా మంచుగలది) అనుయథార్థంబగు పేరుతోc గూడిన దయ్యె. అని, తాత్పర్యము.

అత్యంతసుఖసంచారా మధ్యాహ్నే స్పర్శతస్సుఖాః
దివసా స్సుభగాదిత్యా శ్ఛాయాసలిలదుర్భగాః. ౧౦

టీక॥ దివసాః= దినములు; మధ్యాహ్నే=మధ్యాహ్నమునందు; స్పర్శతః=ఉష్ణస్పర్శము చేతసుఖాః= సుఖకరములును; అత్యంతసుఖసంచారాః= మిక్కిలియు సుఖకరములయిన సంచారము గలవియు; సుభగాదిత్యాః = మనోహరుండైనసూర్యుండుగలవియు; ఛాయాసలిలదుర్భగాః=అనిష్టములయిన నీడయును జలమును గలవియును; భవంతి (అధ్యాహృతము)= అగుచున్నవి.

ఇప్పుడు, మధ్యాహ్నమునందు, ఎండలోc దిరుగుట మిక్కిలియు సుఖకరము గానున్నది; సూర్యుండు, వేడిమి గలిగించుటం జేసి, మనోహరుండై యున్నాండు; నీడయు జలమును, ఎంతమాత్రము క్కి అకురాకున్నవి. అని, తాత్పర్యము

మృదుసూర్యా స్సనీహారాః పటుశీతా స్సమారుతాః
శూన్యారణ్యా హిమధ్వస్తా దివసా భాంతి సాంప్రతమ్. ౧౧

టీక॥ సాంప్రతం= ఇప్పుడు; దివసాః=దినములు; మృదుసూర్యాః=మెత్తనిసూర్యుండుగలవియు; సనీహారాః= మంచుతోcగూడినవియు; పటుశీతాః= అధికమయినచలిగలవియు; సమారుతాః=గాలితోcగూడినవియు; శూన్యారణ్యాః = శూన్యములయినయడవులు గలవియు; హిమధ్వస్తాః = మంచుచేc జెడినవియుcగా; భాంతి= ప్రకాశించుచున్నవి,

ఇప్పుడు, సూర్యుండు, ఎచ్చవేడి లేక, మెత్తcగానున్నాండు; మంచధికముగాcగురియుచున్నది; చలిప్రబలముగానున్నది; గాలిమెచ్చుగానున్నది. అడవులయందుండువారలడవుల విడిచియున్నారు; మంచుచేనేదియుc జూడనలవిగాకున్నది. అని, తాత్పర్యము.

నివృత్తాకాశశయనాః పుష్యనీతా హిమారుణాః
శీతా వృద్ధతరాయామా స్త్రియామా యాంతి సాంప్రతమ్. ౧౨

టీక॥ సాంప్రతం = ఇప్పుడు; త్రియామాః = రాత్రులు; నివృత్తాకాశశయనాః = వదలినబయలునందుఁబరుండుటగలవియు, పుష్యనీతాః = పుష్యమాసముఁబొందినవియు; హిమారుణాః = మంచుచే ధూసరవర్ణముగలవియు, శీతాః = చలిగలవియు; వృద్ధతరాయామాః = మిక్కిలియువృద్ధిఁబొందినవిస్తారముగలవియునై; యాంతి = కడచుచున్నవి.

ఇప్పుడు, రాత్రులందు, బయలఁ బరుండరు; పుష్యమాసమువచ్చినది; మంచుచే రాత్రికాలమున, ధూసరవర్ణముగానున్నది; చలి యగుచున్నది; రాత్రులు, అతిదీర్ఘంబులుగానున్నవి. అని, తాత్పర్యము.

రవిసంక్రాంతసౌభాగ్య స్తుషారారుణమండలః
నిశ్శ్వాసాంధఇవా దర్శ శ్చంద్రమా నప్రకాశతే. ౧౩

టీక॥ రవిసంక్రాంతసౌభాగ్యః = సూర్యునియందుసంక్రమించిన మనోహరత్వముగలవాఁడును; తుషారారుణమండలః = మంచుచేనెఱ్ఱనైనమండలముగలవాఁడునగు; చంద్రమాః = చంద్రుఁడు; నిశ్శ్వాసాంధః = నిట్టూర్పులచేఁబ్రకాశములేనిదైన; ఆదర్శఇవ = అద్దమువలె; నప్రకాశతే = ప్రకాశింపకున్నాఁడు.

చంద్రునియందలి మనోహరతయు దర్శనీయతయు నిప్పుడు సూర్యునిఁ గలిగియున్నది, మఱియు, చంద్రుండు మంచుచే నెఱ్ఱనిమండలము గలవాఁడగుటచే, నిట్టూర్పులవలనఁ బ్రకాశముచెడినయద్దమువలె, ప్రకాశింపకున్నాఁడు అని, తాత్పర్యము.

జ్యోత్స్నా తుషారమలినా పౌర్ణమాస్యాం న రాజతే
సీతేవ చాతప శ్యామా లక్ష్యతే నతు శోభతే. ౧౪

టీక॥ పౌర్ణమాస్యాం = పున్నమయందు; జ్యోత్స్నా = వెన్నెల; తుషా

రమలినా=మంచుచేమలినమయినదై; నరజతే= ప్రకాశింపదు అతపక్ష్యా మాలిదచేనల్లనైదై ; సీతేవ=సీతవలెను; లక్ష్యతే= చూడఁబడుచున్నది. నతుశోభతే = ప్రకాశించుటమాత్రములేదు.

పున్నమనాఁడుగూడ, వెన్నెలతుషారమలినముగుటంజేసి, కాంతిదగ్గి, యెండదాఁకుడునల్లనయిన దేహముగల సీతాదేవియుంబోలెనున్నది ; ఎంతమాత్రముప్రకాశింపదు.

అని, తాత్పర్యము.

ప్రకృత్యా శీతళస్పర్శో హిమవిద్ధశ్చ సాంప్రతమ్
ప్రవాతి పశ్చిమో వాయుః కాలే ద్విగుణ శీతలః. ౧౫

టీక॥ ప్రకృత్యా=స్వభావము చేత; శీతలస్పర్శః = చల్లనైనస్పర్శముగలదియు, సాంప్రతం=ఇప్పుడు ; హిమవిద్ధశ్చ= మంచుచేఁగొట్టఁబడినదియునగాపునే; కాలే=ప్రాతఃకాలమునందు; ద్విగుణశీతలః=రెండింతలచల్లఁదనముగలదియునగు ; పశ్చిమః=పడమటి; వాయుః=గాలి; ప్రవాతి= వీచుచున్నది,

స్వభావంబుననె, చల్లనిదియునిప్పుడు హేమంతఋతువునందుమంచుదగులుటచేతఁ బ్రాతఃకాలంబునద్విగుణశీతలంబు నగుపడమటివాయువు వీచుచున్నది. అని, తాత్పర్యము,

బాష్పచ్ఛన్నా న్యరణ్యాని యవగోధూమ వంతిచ
శోభంతే భ్యుదితే సూర్యే నదద్భిః క్రౌంచసారసైః. ౧౬

టీక॥ సూర్యే=సూర్యుఁడు ;అభ్యుదితే=ఉదయించినవాఁడుకాఁగా; అరణ్యాని=అడవులు; బాష్పచ్ఛన్నాని= ఆవిరిచేఁగప్పఁబడినవియు ; యవగోధూమవంతిచ= యవలునుగోధుమలునుగలవియునైః నదద్భిః = ధ్వనించుచున్న; క్రౌంచసారసైః= క్రౌంచపక్షులతోను సారసపక్షులతోను; సహితాని (అధ్యాహృతము)=కూడినవై; శోభంతే=ప్రకాశించుచున్నవి.

సూర్యుండుదయించునప్పుడు, అడవులు,ఆవిరితోఁగూడినవై, యవగోధుమసంయుతంబులయి, మధురంబుగాఁగూయు క్రౌంచసారసపక్షులతో

నెంతయునొప్పుచున్నవి. అని, తాత్పర్యము.

ఖర్జూరపుష్పాకృతిభి శ్శిరోభిః పూర్ణతండులైః
శోభంతే కించి దానమ్రా శ్శాలయః కనకప్రభాః. ౧౭

టీక॥ కనకప్రభాః= బంగారుకాంతివంటికాంతిగల; శాలయః = వరిపైరులు; ఖర్జూరపుష్పాకృతిభిః=ఖర్జూరపుష్పములయొక్క యాకారమువంటి యాకారముగలవియు; పూర్ణతండులైః= నిండినగింజలుగలవియునగు ; శిరోభిః=ఎన్నులతో; కించిత్ = కొంచెము; ఆనమ్రాః = వంగినవై ; శోభంతే=ప్రకాశించుచున్నవి.

చక్కఁగాఁ బండియుండుటచేబంగారువన్నెగలవరిపైరులు, ఖర్జూరపుష్పములువలెనుండుతండులపూర్ణంబులగు వెన్నుల భారంబునకుఁ గొంచెమువంగినవై యెంతయు నొప్పుచున్నవి. అని, తాత్పర్యము.

మయూఖై రుపసర్పద్భి ర్హిమనీహారసంవృతైః
దూర మభ్యుదిత స్సూర్య శ్శశాంక ఇవలక్ష్యతే. ౧౮

టీక॥ హిమనీహారైః = చల్లనిమంచులచేతఁగప్పఁబడిన; ఉపసర్పద్భిః= వ్యాపించుచున్న; మయూఖైః = కిరణములచేత; దూరం=దూరముగా ; అభ్యుదితః= ఉదయించుచున్న ; సూర్యః=సూర్యుఁడు; శశాంకఇవ = చంద్రుఁడువలె; లక్ష్యతే= చూడఁబడుచున్నాడు.

కిరణంబులు, మంచుతోఁగూడియుండుటవలనను,దూరంబున నుదయించుటవలననుసూర్యుండు,చంద్రుండువలెఁజల్లగానున్నాఁడు. అని, తాత్పర్యము.

అగ్రాహ్యవీర్యః పూర్వాహ్ణే మధ్యాహ్నే స్పర్శత స్సుఖః
సంరక్తః కించి దాపాండురా తప శ్శోభతే క్షితౌ. ౧౯

టీక॥ఆతపః=ఎండ; పూర్వాహ్ణే= ప్రాతఃకాలము నందు ; అగ్రాహ్యవీర్యః= తెలియనలవిగాని వీర్యము గలదియు; మధ్యాహ్నే= మధ్యాహ్నము

స ౧౬

నందు; స్పర్శతః=స్పర్శమునందు; సుఖః=సుఖముగలిగించునదియు; కించిత్=కొంచెము; రక్తః= ఎఱ్ఱనిదియు; ఆపాండుః=తెల్లనిదియునై; క్షితౌ = భూమియందు; శోభతే=ప్రకాశించుచున్నది.

ఎండ,పూర్వాహ్ణంబున వెన్నెలవలె వీర్యములేనిదిగాను మధ్యాహ్నంబున సుఖస్పర్శణంబుగాను, గొంచెము రక్తవర్ణముగాను గొంచెము తెల్లఁగాను, ప్రకాశించుచున్నది.

అని, తాత్పర్యము.

అవశ్యాయనిపాతేన కించిత్ప్రక్లిన్నశాద్వలా
వనానాం శోభతే భూమి ర్నివిష్టతరుణాతపా. ౨౦

టీక॥ అవశ్యాయనిపాతేన= మంచుపడుటచేత ; కించిత్ప్రక్లిన్నశాద్వలా = కొంచెముదడిసిన పచ్చికగలదియు;నివిష్టతరుణాతపా= విడిసినలేఁతయెండగలదియునగు; వనానాం=అడవులయొక్క;భూమిః = నేల;ప్రకాశతే=ప్రకాశించుచున్నది.

అడవినేల , మంచుగురియుటచేఁదడిసినపచ్చికగలిగి , లేఁతయెండతోనెంతయుఁబ్రకాశించుచున్నది.

అని, తాత్పర్యము.

స్పృశంస్తు విమలం శీత ముదకం ద్విరద స్సుఖమ్
అత్యంతతృషితో వన్యః ప్రతిసంహరతే కరమ్. ౨౧

టీక॥ అత్యంతతృషితః = మిక్కిలియుదప్పిగొన్న; వన్యః=అడివియందుఁబుట్టిన; ద్విరదః=ఏనుంగు; సుఖం=సుఖముగా;విమలం=స్వచ్ఛమును;శీతం=చల్లనిదియునగు; ఉదకం=జలమును ; స్పృశంస్తు=తాఁకుచునే;కరం= తొండమును;ప్రతిసంహరతే= వెనుకకుఁదీసికొనుచున్నది.

అడవియేనుంగు,మిక్కిలియు దప్పిగొన్నదై,స్వచ్ఛమును అతిశీతంబునగు జలమును దాఁకి,తాఁకినంతనె,చల్లఁదనముతాళఁజాలక,తొండము నీడ్చుకొనుచున్నది.

అని,తాత్పర్యము.

ఏతేహి సముపాసీనా విహగా జలచారిణః
నావగాహంతి సలిల మప్రగల్భా ఇవాహవమ్. ౨౨

టీక॥ సముపాసీనాః = సమీపించి కూర్చుండియున్న; ఏతే = ఈ; జలచారిణః = జలములందిరుగునట్టి; విహగాః = పక్షులు; సలిలం = జలమును; అప్రగల్భాః = శూరులు గానివారలు; ఆహవమివ = యుద్ధమునువలె; నావగాహంతిహి = ప్రవేశింప కున్నవిగదా!

శూరులుగాని వారలు యుద్ధము సమీపంబునకుఁ బోయియు భయపడి యూరకుండునట్లు, ఈజలచరపక్షులు, జలసమీపంబుననుండియుఁ, జలిభయంబున,నీటంబ్రవేశింపకున్నవి.

అని, తాత్పర్యము.

అవశ్యాయతమోనద్ధా నీహారతమసా వృతాః
ప్రసుప్తాఇవ లక్ష్యంతే విపుష్పా వనరాజయః. ౨౩

టీక ॥ అవశ్యాయతమోనద్ధాః = మంచునీళ్లను చీఁకటిచేఁ గట్టఁబడినవియు; నీహారతమసా = మంచనుచీఁకటిచే; ఆవృతాః = కప్పఁబడినవియు; విపుష్పాః = పూలులేనివియునగు; వనరాజయః = వనపఙ్క్తులు; ప్రసుప్తాఇవ = మిక్కిలియునిద్రించినవివలె; లక్ష్యంతే = చూడఁబడుచున్నవి.

వనవృక్షములు, చీఁకటివలెదట్టముగానుండుమంచినీళ్ల తోఁగూడియుండుటచేనిశ్చలములయి, పైఁగురియుచుండు హిమంబగునంధకారముతోఁ గూడినవై, పుష్పరహితంబులయియుండుటచేఁ, గండ్లుమూసికొని నిద్రించుచున్నట్లుచూపట్టుచున్నవి.

అని, తాత్పర్యము.

బాష్పసంఛన్నసలిలా రుతవిజ్ఞేయసారసాః
హిమార్ద్రవాలుకై స్తీరై స్సరితో భాంతి సాంప్రతమ్. ౨౪

టీక॥ సాంప్రతం = ఇప్పుడు; సరితః = నదులు; బాష్పసంఛన్నసలిలాః = ఆవిరిచేఁగప్పఁబడిననీళ్లుగలవియు; రుతవిజ్ఞేయసారసాః = కూఁతలచేనెఱుంగఁ

స ౧౬

దగినసారసపక్షులుగలవియునై ; హిమార్ద్రైవాలుకైః= మంచుచేఁదడిసిన యిసుకగల; తీరైః=గట్టులతో; సహితాః(అధ్యాహృతము) = కూడినవై ; భాంతి=ప్రకాశించుచున్నవి.

ఇప్పుడు,నదులలో, నీళ్లు,ఆవిరి చేఁ గప్పఁబడియున్నవి; మంచుచేఁగప్పఁబడియుండుటచేఁ,గూఁతనుబట్టి సారసపక్షులు, దెలియఁదగియున్నవి; తీరంబులందలి యిసుకమంచుచేఁ దడిసియున్నది. అని,తాత్పర్యము.

తుషారపతనాచ్చైవ మృదుత్వాద్భాస్కరస్యచ
శైత్యాదగాధస్థమపి ప్రాయేణ రసవజ్జలమ్. ౨౫

టీక॥ తుషారపతనాచ్చైవ= మంచుపడుటవలనను;భాస్కరస్య= సూర్యునియొక్క;మృదుత్వాచ్చ = మెత్తగానుండుటవలనను;శైత్యాత్= చలివలనను;అగాధస్థమపి= లోఁతుగలప్రదేశములోనున్నదైనను; రసవత్=రుచికరమయిన;జలం = జలము;ప్రాయేణ=తఱచుగా;అపేయం (అధ్యాహృతము)=త్రాగఁగూడనిది.

మంచుపడుటవలనను సూర్యుండు చక్కఁగా నెండగాయకుండుటవలనను,అతిశీతముగానుండుటవలనను, మంచి లోఁతుగానుండు సరస్సులయందలి రుచ్యమయిన జలముగూడఁ , దఱచుగాఁ,ద్రాఁగనలవిగాకున్నది.

అని,తాత్పర్యము.

జరాజర్ఝరితైః పద్మైశ్శీర్ణకేసరకర్ణికైః
నాళశేషైర్హిమధ్వస్తైర్నభాంతి కమలాకరాః. ౨౬

టీక॥కమలాకరాః= తామరకొలంకులు; జరాజర్ఝరితైః = ముసలితనముచేజీర్ణములయినవియు ; శీర్ణకేసరకర్ణికైః= రాలినకేసరములుగల మిద్దెలుగలవియు ; నాళశేషైః=కాఁడమెమిగిలినదిగాఁగలవియు; హిమధ్వస్తైః= మంచుచేఁజెడినవియునగు ; పద్మైః=కమలములచేత; నభాంతి = ప్రకాశింపకున్నవి.

కమలంబులన్నియు , పూఁచిబహు

కాలమగుటచే , వివర్ణములయి రాలినకేసరములుగలకర్ణికలతో, నాళమాత్రము శేషంబులయి మంచుచేఁజెడియుండుటంజేసి , తామరకొలంకులు ప్రకాశింపకున్నవి.

అని, తాత్పర్యము.

అస్మింస్తు పురుషవ్యాఘ్రః కాలే దుఃఖసమన్వితః
తప శ్చరతి ధర్మాత్మా త్వద్భక్త్యా భరతః పురే. ౨౭

టీక॥ అస్మిన్=ఈ; కాలేతు=కాలమునందును; పురుషవ్యాఘ్రః= పురుషశ్రేష్ఠుండును;ధర్మాత్మా = ధర్మస్వభావుండునగు;భరతః = భరతుఁడు;పురే=పట్టణమునందు ; దుఃఖసమన్వితః = దుఃఖముతోఁగూడినవాఁడై; త్వద్భక్త్యా = నీయందలిభక్తిచేత;తపః= తపస్సును;చరతి = చేయుచున్నాఁడు.

ఈకాలమునందును, ధర్మాత్ముండును బురుషశ్రేష్ఠుండునగుభరతుండు, దుఃఖితుండై,నీయందలిభక్తిచేత , నయోధ్యాపురంబునఁదపస్సుగావించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

త్యక్త్వా రాజ్యంచ మానంచ భోగాంశ్చ వివిధాన్ బహూన్
తపస్వీ నియతాహార శ్శేతే శీతే మహీతలే. ౨౮

టీక॥సః(అధ్యాహృతము)= ఆభరతుఁడు;రాజ్యంచ=రాజ్యమును; మానంచ=మానమును;వివిధాన్= నానావిధములయిన;బహూన్ = పెక్కులయిన;భోగాంశ్చ=భోగములను ; త్యక్త్వా=విడిచి;తపస్వీ= మునియయి ; నియతాహారః= నియమింపఁబడినయాహారముగలవాఁడై,శీతే=చల్లని; మహీతలే=నేలయందు;శేతే= పరుండుచున్నాఁడు.

ఆభరతుఁడు, రాజ్యంబును మానంబును నానావిధానేకభోగంబులను విడిచి , మునివేషంబు ధరియించి , ఫలమూలంబులనాహారంబుగాఁగొనుచుఁ, జల్లనినేలపైఁబరుండుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

సోపి వేళా మిమాం నూన మభిషేకార్థ ముద్యతః

వృతః ప్రకృతిభి ర్నిత్యం ప్రయాతి సరయూ నదీమ్. ౨౯

టీక॥ సోపి = ఆభరతుండును;నిత్యం= ఎల్లప్పుడును;ఇమాం = ఈ;వేళాం=సమయమును, సమయమునందనుట;అభిషేకార్థం = స్నానముకొఱకు;ఉద్యతః = ఉద్యుక్తుఁడై; ప్రకృతిభిః=ప్రజలచేత;వృతః = చుట్టఁబడినవాఁడై;సరయూం = సరయువను;నదీం=నదినిగూర్చి;ప్రయాతి = పోవును.;నూనం=నిశ్చయము.

ఆభరతుండును, ఈసమయంబున, స్నానముసేయుటకొఱకు, లేచి, ప్రకృతులచే సేవింపఁబడుచు, సరయూనదికిం బోవును.

అని, తాత్పర్యము.

అత్యంత సుఖసంవృద్ధ స్సుకుమార స్సుఖోచితః
కథ న్న్వ పరరాత్రేషు సరయూ మవగాహతే. ౩౦

టీక॥ అత్యంతసుఖసంవృద్ధః = మిక్కిలియు సుఖముచేఁ బెరిఁగినవాఁడును;సుకుమారః = మృదులమయినదేహముగలవాఁడును;సుఖోచితః = సుఖంబునకుఁదగినవాఁడునగు ; సః (అధ్యాహృతము)=ఆభరతుండు ; కథన్ను=ఎట్లు;అపరరాత్రేషు= అపరరాత్రులయందు;సరయూం = సరయూనదిని;అవగాహతే=పొందును?

మిక్కిలియు సుఖముగాఁ బెరిఁగినవాఁడును సుకుమారశరీరుండును సుఖోచితుండునగుభరతుండు, ఎట్లు, అపరరాత్రులలేచి, సరయూనదియందుమునుంగును. అని, తాత్పర్యము.

పద్మపత్రేక్షణో వీర శ్శ్యామో నిరుదరో మహాన్
ధర్మజ్ఞ స్సత్యవాదీచ హ్రీనిషేధో జితేంద్రియః. ౩౧
ప్రియాభిభాషీ మధురో దీర్ఘబాహు రరిందమః
సంత్యజ్య వివిధాన్ భోగా నార్యం సర్వాత్మనా శ్రితః. ౩౨

టీక॥ పద్మపత్రేక్షణః = తామరపూఱేకులవంటికన్నులుగలవాఁడును; వీరః=పరాక్రమశాలియు; శ్యామః=శ్యామలవర్ణుండును;నిరుదరః= కడు

పులేనివాఁడును; మహాన్ = పూజ్యుండును; ధర్మజ్ఞః = ధర్మము నెఱింగినవాఁడును; సత్యవాదీచ = సత్యముఁ బలుకువాఁడును; హ్రీనిషేధః = సిగ్గుచేతన కృత్యంబులనుండి మఱలుట గలవాఁడును; జితేంద్రియః = జయింపఁబడిన యింద్రియములుగలవాఁడును; ప్రియాభిభాషీ = ప్రియవాక్యంబుఁ జెప్పువాఁడును; మధురః = మనోహరుండును; దీర్ఘబాహుః = నిడుపులయిన చేతులు గలవాఁడును, అరిందమః = శత్రువులనణఁగఁద్రొక్కువాఁడునగు; సః (అధ్యాహృతము) = ఆభరతుఁడు; వివిధాన్ = నానావిధములయిన; భోగాన్ = భోగములను; సంత్యజ్య = విడిచి; సర్వాత్మనా = సమస్తమయినమనస్సుచేతను; శ్రితః = పొందినాఁడు.

తామరపూరేకులంబోలె విశాలసుందరంబులగు కన్నులుగలవాఁడును వీరుండును శ్యామలవర్ణుండును సన్ననినడుముగలవాఁడును బూజ్యుండును ధర్మవేత్తయు సత్యవాదియు లజ్జచేతనె యకృత్యంబుఁ జేయకుండువాఁడును జితేంద్రియుండును బ్రియంవదుండును మనోహరవిగ్రహుండును ఆజానుబాహుండును శత్రువులనణఁగఁ ద్రొక్కఁజాలినవాఁడును, ఇట్లు సమస్తసుఖభోగార్హుండగు భరతుండు, సమస్తభోగంబులను విడిచి, యన్నివిధంబుల నిన్నే పొందియున్నాఁడు. అ౨, తాత్పర్యము.

జిత స్స్వర్గ స్తవ భ్రాత్రా భరతేన మహాత్మనా
వనస్థమపి తాపస్యే యస్త్వా మనువిధీయతే. ౩౩

టీక॥ యః = ఎవ్వఁడు; వనస్థమపి = అడవినున్నవాఁడవైనను; త్వాం = నిన్ను; తాపస్యే = తాపసత్వము విషయమయి; అనువిధీయతే = అనుసరించుచున్నాఁడో; తేన (అధ్యాహృతము) = అట్టి; మహాత్మనా = పూజ్యమయిన స్వభావముగల; తవ = నీయొక్క; భ్రాత్రా = తమ్ముఁడయిన; భరతేన = భరతునిచేత; స్వర్గః = స్వర్గము; జితః = జయింపఁబడినది.

మహాత్ముండగు నీతమ్ముండు భరతుండు, నీవడవిలో మునివేషంబు ధరించియున్నను, దానును నీయట్లు మునివేషము ధరించి నిన్ననుసరించుచుండుటం జేసి, స్వర్గమును జయించిన వాఁడయ్యె.

అ౨, తాత్పర్యము.

నపిత్ర్య మనువర్తంతే మాతృకం ద్విపదా ఇతి
ఖ్యాతో లోకప్రవాదో యం భరతే నాన్యథా కృతః. ౩౪

టీక॥ద్విపదాః= రెండుకాళ్లుగల జంతువులు, మనుష్యులనుట; పిత్ర్యం= తండ్రిస్వభావమును;నానువర్తంతే=అనుసరింపరు. మాతృకం=తల్లిస్వభావమును ; అనువర్తంతే (అధ్యాహృతము)=అనుసరింతురు. ఇతి=అనెడు ; ఖ్యాతః=ప్రసిద్ధమయిన; అయం=ఈ; లోకప్రవాదః=లోకవాదము ; భరతేన=భరతునిచేత;అన్యధా = వేఱువిధముగా; కృతః=చేయఁబడినది.

భరతుండు, తల్లిస్వభావమననుసరింపక తండ్రిస్వభావంబునే యనుసరించుటంజేసి, "మనుష్యులుతల్లిస్వభావమననుసరింతురుగాని తండ్రిస్వభావము ననుసరింపరు" అనునీలోకోక్తి భరతునివిషయమైయబద్ధమయ్యె. అని,తాత్పర్యము.

భర్తా దశరథో యస్యాః సాధుశ్చ భరత స్సుతః
కథన్ను సాంబా కైకేయీ తాదృశీ క్రూరశీలినీ. ౩౫

టీక॥యస్యాః=ఎవ్వతెకు;సాధుః=సత్పురుషుఁడయిన;దశరధః=దశరధమహారాజు;భర్తా = పెనిమిటియో;సాధుః(అధ్యాహృతము)=సత్పురుషుఁడైన;భరతః=భరతుఁడు; సుతశ్చ= కొడుకునో ; సా=అట్టి;అంబా=తల్లియయిన; కైకేయీ=కైకేయి;కథన్ను= ఎట్లు; తాదృశీ=అట్టి , క్రూరశీలినీ = క్రూరస్వభావముగలది?

ఎవ్వతెభర్త,సత్పురుషాగ్రగణ్యుండగుదశరథుఁడో, ఎవ్వతెకొడుకు, సత్పురుషవీర్యుండగు భరతుఁడో; అట్టికైకేయికి,ఇట్టిక్రూరస్వభావంబెట్లుగలిగెను?అని,లక్ష్మణుండు, రామునితోఁజెప్పెను అని,తాత్పర్యము.

ఇత్యేవం లక్ష్మణే వాక్యం స్నేహా ద్బ్రువతి ధార్మికే
పరివాదం జనన్యాస్త మసహ న్రాఘవో బ్రవీత్. ౩౬

స ౧౬

టీక॥ ఇత్యేవం = అనియిట్లు; ధార్మికే = ధర్మమునాచరించునట్టి; లక్ష్మణే = లక్ష్మణుఁడు; స్నేహాత్ = స్నేహమువలన; వాక్యం = మాటను; బ్రువతి = చెప్పుచుండఁగా; రాఘవః = రాముఁడు; తం = ఆ; జనన్యాః = తల్లియొక్క; పరివాదం = నిందను; అసహన్ = ఓర్వనివాఁడై; అబ్రవీత్ = పలికెను.

అనియిట్లు, ధార్మికుండగు లక్ష్మణుం స్నేహంబునం జెప్పుచుండఁగా, రాముండు, అట్లు తల్లియగు కైకేయిని నిందించుటను సహింపంజాలక, యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

న తేంబా మధ్యమా తాత గర్హితవ్యా కథంచన
తామే వేక్ష్వాకు నాథస్య భరతస్య కథాం కురు. ౩౭

టీక॥ తాత = నాయనా! కథంచన = ఎట్లయినను; తే = నీకు; మధ్యమా = నడిమిదియగు; అంబా = తల్లి యయిన కైకేయి; గర్హితవ్యా = నిందింపఁబడఁదగినది; న = కాదు. ఇక్ష్వాకునాథస్య = ఇక్ష్వాకువంశమునం దుఁబుట్టినవారలకునాథుండగు; భరతస్య = భరతునియొక్క; తాం = ఆ; కథామేవ = కథనే; కురు = చేయుము.

నాయనా! నీ వెంతమాత్రము, తల్లి యగు కైకేయిని నిందింపరాదు; ఇది వఱకు నీవు చెప్పుచుంటివే, ఆయిక్ష్వాకునాథుండగు భరతునిసమాచారమునే చెప్పుము. అని, తాత్పర్యము.

నిశ్చితాపి హి మే బుద్ధి ర్వనవాసే దృఢవ్రతా
భరతస్నేహసంతప్తా బాలిశీ క్రియతే పునః. ౩౮

టీక॥ దృఢవ్రతా = దృఢమయినవ్రతముగల; మే = నాయొక్క; బుద్ధిః = బుద్ధి; వనవాసే = వనవాసమునందు; నిశ్చితాపి = నిశ్చయమునొందినదయ్యును; భరతస్నేహసంతప్తా = భరతునియందలి స్నేహముచే మిక్కిలియుఁదపింపఁజేయఁబడినదై; పునః = మఱల; బాలిశీక్రియతే = మూఢముగాఁ జేయఁబడుచున్నది.

దృఢవ్రతుండనగు నేను, వనవాసంబు సేయవలెనని నిశ్చయించిన వాఁడనైనను, భరతునియందలి స్నేహంబున, నతనిం దలంచుకొనునప్పుడెల్ల, నాబుద్ధి మిక్కిలియుఁ జంచలమగుచున్నది.

అని, తాత్పర్యము.

సంస్మరామ్య స్య వాక్యాని ప్రియాణి మధురాణిచ
హృద్యా న్యమృతకల్పాని మనఃప్రహ్లాదనానిచ. ౩౯

టీక॥ ప్రియాణి=ఇష్టములును; మధురాణిచ=మనోహరములును; హృద్యాని=మనస్సునకింపయినవియు; అమృతకల్పాని = అమృతముతోసమానములును; మనఃప్రహ్లాదనానిచ = మనస్సును సంతోషపఱచునవియునగు; అస్య=ఈభరతునియొక్క; వాక్యాని=మాటలను; సంస్మరామి = తలంచెదను.

ప్రియంబులును మధురంబులునగు అమృతంబువంటివియునగు భరతుని మాటలను, ఇప్పుడునప్పుడప్పుడు, తలంచుకొనుచున్నాను; అవితలంచుకొన్నను, మనంబునకు సంతోషకరంబులుగానున్నది. అని, తాత్పర్యము.

కదా న్వహం సమేష్యామి భరతేన మహాత్మనా
శత్రుఘ్నేన చ వీరేణ త్వయాచ రఘునందన. ౪౦

టీక॥ రఘునందన= లక్ష్మణుఁడా! అహం=నేను; మహాత్మనా= పూజ్యమయినస్వభావముగల; భరతేన = భరతునితోను; వీరేణ= పరాక్రమశాలియగు; శత్రుఘ్నేనచ= శత్రుఘ్నునితోను; త్వయాచ=నీతోను; కదాను = ఎప్పుడు; సమేష్యామి=చేరఁగలను.

లక్ష్మణుఁడా! నేను, మహాత్ముండగు భరతునితోఁ బరాక్రమవంతుండగు శత్రుఘ్నునినిన్నునుమిమ్ముందఱనుం గూడి, యెప్పుడుసుఖంబుననుభవింపఁగలను? అని, రాముండులక్ష్మణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యేవం విలపం స్తత్ర ప్రాప్య గోదావరీం నదీమ్
చక్రేఽభిషేకం కాకుత్స్థ స్సానుజ స్సహసీతయా. ౪౧

టీక॥ కాకుత్స్థః = రాముఁడు; తత్ర=అచ్చట; ఇత్యేవం= అనియిట్లు; విలపన్=దుఃఖించుచు; గోదావరీం=గోదావరియను; నదీం = ఏటిని; ప్రా

ప్య=పొంది; సానుజః = తమ్మునితోఁ గూడినవాఁడై; సీతయా సహ = సీతతోఁ గూడ; అభిషేకం = స్నానమును; చ క్రే=చేసెను.

రాముండట్లువిలపించుచు, గోదావరీనదింజేరి, సీతాలక్ష్మణులతోఁగూడనచ్చటస్నానము గావించెను.

అని, తాత్పర్యము.

తర్పయిత్వాథ సలిలై స్తే పితౄన్ దైవతానిచ
స్తువంతిస్మో దితం సూర్యం దేవతాశ్చ సమాహితాః. ౪౨

టీక॥ అథ=అంత; తే= ఆ సీతారామలక్ష్మణులు; సలిలైః=జలములచేత; పితౄన్=పితృదేవతలను; దైవతానిచ= దేవతలను; తర్పయిత్వా= తృప్తిఁబొందించి; ఉదితం= ఉదయించిన; సూర్యం=సూర్యుని; దేవతాశ్చ = దేవతలను; సమాహితాః= చిత్తైకాగ్రతగలవారలయి; స్తువంతిస్మ = స్తుతించిరి.

అంత, నా సీతారామలక్ష్మణులు, పితృదేవతలకును దేవతలకును జలతర్పణంబు గావించి, యుదితుండగుసూర్యునిదేవతలనుం బ్రస్తుతించిరి.

అని, తాత్పర్యము.

కృతాభిషేక స్సరరాజ రామ
స్సీతాద్వితీయ స్సహ లక్ష్మణేన
కృతాభిషేకో గిరిరాజపుత్ర్యా
రుద్ర స్సనందీ భగవా నివేశః. ౪౩

టీక॥ కృతాభిషేకః= చేయఁబడిన స్నానము గలవాఁడును; సీతాద్వితీయః=సీత రెండవది గాఁగలవాఁడును; లక్ష్మణేనసహ(స్థితః)= లక్ష్మణునితోఁ గూడనున్నవాఁడునగు; సః=ఆ; రామః=రాముఁడు; కృతాభిషేకః = చేయఁబడినస్నానము గలవాఁడును; గిరిరాజపుత్ర్యా=పార్వతితో; సహితః (అధ్యాహృతము)= కూడినవాఁడును; సనందీ=నందితోఁగూడినవాఁడును; భగవాన్= అధికమయిన మాహాత్మ్యముగలవాఁడును; ఈశః= జగత్ప్రభుండునగు; రుద్రఇవ=శివుఁడువలె; రరాజ=ప్రకాశించెను.

రాముండుకృతస్నానుండై, సీతా లక్ష్మణసహితుండై, స్నానము చేసిన వాఁడును నందికేశసహితుండునుభగ వంతుండును జగన్నాథుండునగు శివుఁ డుంబోలెఁ బ్రకాశించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
అరణ్యకాండే , షోడశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు , అరణ్యకాండషోడశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

సప్తదశసర్గ ప్రారంభః.

కృతాభిషేకో రామస్తు సీతా సౌమిత్రిరేవచ
తస్మాద్గోదావరీతీరా త్తతో జగ్ముస్స్వమాశ్రమమ్. ౧

టీక॥తతః=అంత; కృతాభిషేకః= చేయఁబడినస్నానముగల; రామస్తు= రాముఁడును;సీతా=సీతయును; సౌమిత్రిరేవచ= లక్ష్మణుఁడును; తస్మాత్= ఆ; గోదావరీతీరాత్ = గోదావరి గట్టుననుండి;స్వం= తమదైన ; ఆశ్రమం=ఆశ్రమమును;జగ్ముః=పొందిరి.

అట్లుస్నానంబుగావించినపిమ్మట, రాముండునుసీతాలక్ష్మణులును , గోదావరీతీరంబుననుండి, తమయాశ్రమంబునకుఁబోయిరి. అని,తాత్పర్యము.

ఆశ్రమం త ముపాగమ్య రాఘవ స్సహలక్ష్మణః
కృత్వా పౌర్వాహ్ణికం కర్మ పర్ణశాలా ముపాగమత్. ౨

టీక॥సహలక్ష్మణః=లక్ష్మణునితోఁ గూడిన;రాఘవః=రాముఁడు;తం=ఆ; ఆశ్రమం= ఆశ్రమమును;ఉపాగమ్య= పొంది;పౌర్వాహ్ణికం=పూర్వాహ్ణము

నందుఁజేయవలసిన,కర్మ= కార్యము నుఃకృత్వా=చేసి,పర్ణశాలాం = పర్ణశాలను;ఉపాగమత్ =పొందెను.

రాముండు, లక్ష్మణునితోఁగూడ, బ్రహ్మయజ్ఞము మొదలగు పూర్వాహ్ణమునందుఁజేయవలసినకర్మముల నిర్వర్తించి,పర్ణశాలంబ్రవేశించెను.

అని, తాత్పర్యము.

ఉవాస సుఖిత స్తత్ర పూజ్యమానో మహర్షిభిః
లక్ష్మణేన సహభ్రాత్రా చకార వివిధాః కథాః. ౩

టీక॥ సః(అధ్యాహృతము)= ఆరాముఁడు;తత్ర = ఆపర్ణశాలయందు; మహర్షిభిః= పూజ్యులయినమునులచేత; పూజ్యమానః= పూజింపఁబడుచున్నవాఁడై; సుఖితః= సుఖముగలవాఁడై; ఉవాస=ఉండెను . భ్రాత్రా = తమ్ముఁడైన;లక్ష్మణేనసహ= లక్ష్మణునితోఁగూడ ; వివిధాః=నానావిధములయిన; కథాః=మాటలను; చకార= చేసెను.

అప్పుట, రాముండు , మహర్షులచేఁబూజింపఁబడుచు,లక్ష్మణునితో నానావిధంబులగు నాయామాటలంజెప్పుచు, సుఖంబుననుండెను.

అని, తాత్పర్యము.

స రామః పర్ణశాలాయా మాసీన స్సహ సీతయా
విరరాజ మహాబాహు శ్చిత్రయా చంద్రమాఇవ. ౪

టీక॥ మహాబాహుః= పెద్దచేతులుగల;సః=ఆ; రామః = రాముఁడు, పర్ణశాలాయాం = పర్ణశాలయందు;సీతయాసహ= సీతతోఁగూడ,ఆసీనః=కూర్చుండినవాఁడై; చిత్రయా= చిత్తానక్షత్రముతో;సహాసీనః(అధ్యాహృతము)= కూడఁగూర్చుండిన;చంద్రమాఇవ = చంద్రుఁడువలె;విరరాజ=ప్రకాశించెను.

సీతాసమేతుండై యిప్పర్ణశాలయందుఁ గూర్చుండియున్న మహాబాహుండగునా రాముండు , చిత్తానక్షత్రయుక్తుండగు చంద్రుండుంబోలెఁ , దేజరిల్లుచుండెను.

అని, తాత్పర్యము.

తథాసీనస్య రామస్య కథాసంసక్తచేతసః
తం దేశం రాక్షసీ కాచి దాజగామ యదృచ్ఛయా. ౫

టీక॥ తథా = అట్లు; రామస్య = రాముండును; కథాసంసక్తచేతసః = మాటలయందుఁదగిలినమనస్సుగలవాడై; ఆసీనస్య = కూర్చుండియుండఁగా; కాచిత్ = ఒకానొక; రాక్షసీ = రాక్షసస్త్రీ; యదృచ్ఛయా = డబ్బాటుచేత; తం = ఆ; దేశం = ప్రదేశము; ఆజగామ = పొందినది.

అట్లు రాముండు, మనస్సునకింపుగా మాటలుచెప్పుకొనుచుఁ బర్ణశాలయందుఁగూర్చుండియుండఁగా, నొకానొక రాక్షసస్త్రీ యాదృచ్ఛికముగా, నాప్రదేశంబునకువచ్చినది. అని, తాత్పర్యము.

సాతు శూర్పణఖానామ దశగ్రీవస్య రక్షసః
భగినీ రామ మాసాద్య దదర్శ త్రిదశోపమమ్. ౬

టీక॥ రక్షసః = రాక్షసుఁడయిన; దశగ్రీవస్య = రావణుని యొక్క ; భగినీ = తోఁబుట్టువు ; శూర్పణఖానామ = శూర్పణఖయనిప్రసిద్ధియయినదియునగు; సాతు = ఆరాక్షసియు; ఆసాద్య = సమీపించి; త్రిదశోపమం = దేవతతోఁబోలిక గల; రామం = రాముని; దదర్శ = చూచెను.

రావణుని చెల్లెలును శూర్పణఖయను పేరుగలదియునగునా రాక్షసి, యచ్చటికివచ్చి, దేవసమానుండగు రాముంజూచెను. అని, తాత్పర్యము.

సింహోరస్కం మహాబాహుం పద్మపత్రనిభేక్షణమ్
ఆజానుబాహుం దీప్తాస్య మతీవ ప్రియదర్శనమ్. ౭
గజవిక్రాంతగమనం జటామండలధారిణమ్
సుకుమారం మహాసత్త్వం పార్థివవ్యంజనాన్వితమ్. ౮
రామ మిందీవరశ్యామం కందర్పసదృశప్రభమ్
బభూ వేంద్రోపమం దృష్ట్వా రాక్షసీ కామమోహితా. ౯

టీక॥ రాక్షసీ = శూర్పణఖ; సింహోరస్కం = సింహముయొక్క ఱొమ్మువంటి ఱొమ్ము గలవాఁడును; మహాబాహుం = పెద్దచేతులుగలవాఁడును; పద్మపత్రనిభేక్షణం = తామరపూఱేకులతో సమానములయిన కన్నులు గలవాఁడును; ఆజానుబాహుం = మోకాలువఱకుఁ జేతులుగలవాఁడును ; దీప్తాస్యం = ప్రకాశించుచున్నముఖముగలవాఁడును; అతీవ = మిక్కిలియు; ప్రియదర్శనం = సంతోషకరమగుచూచుటగలవాఁడును; గజవిక్రాంతగమనం = ఏనుంగుయొక్క నడకవంటి నడకగలవాఁడును; జటామండలధారిణం = జటల సమూహమును దాల్చినవాఁడును; సుకుమారం = మృదువైనశరీరముగలవాఁడును; మహాసత్త్వం = అధికమయినబలముగలవాఁడును; పార్థివవ్యంజనాన్వితం = రాజచిహ్నములతోఁగూడినవాఁడును; ఇందీవరశ్యామం = నల్లకలువవలెనల్లనివాఁడును; కందర్పసదృశప్రభం = మన్మథునికాంతితోసమానమయినకాంతిగలవాఁడును ; ఇంద్రోపమం = దేవేంద్రునితోఁబోలిక గలవాఁడునగు; రామం = రాముని; దృష్ట్వా = చూచి, కామమోహితా = మన్మథునిచే మోహమునొందింపఁబడినది; బభూవ = అయినది.

సింహంబునకుంబోలె విశాలంబగు వక్షస్స్థలము గలవాఁడును మహాబాహుండును దామరసపత్రంబులుం బోలె విశాలసుందరంబులగు కన్నులుగలవాఁడును నాజానుబాహుండును దివ్యతేజంబున వెలుంగుచుండుముఖంబు గలవాఁడును జూపరులకు మిక్కిలియు సంతోషంబు గలిగించువాఁడును, మత్తగజంబునకుంబోలె గంభీరగమనంబుగలవాఁడును, జటామండలంబుతో నొప్పువాఁడును , సుకుమారశరీరుండును మహాబలుండును రాజచిహ్నయుక్తుండును నల్లకలువలుంబోలె శ్యామలవర్ణుండును, నూతనమన్మథునిమాడ్కి సుందరాకారుండై తేజరిల్లుచున్నవాఁడును దేవేంద్రసమానుండునగు రాముంజూచి, యాశూర్పణఖ మోహించినది.

అని, తాత్పర్యము.

సుముఖం దుర్ముఖీ రామం వృత్తమధ్యం మహోదరీ
విశాలాక్షం విరూపాక్షీ సుకేశం తామ్రమూర్ధజా. ౧౦
ప్రీతిరూపం విరూపా సా సుస్వరం భైరవస్వరా

స ౧౭

తరుణం దారుణా వృద్ధా దక్షిణం వామభాషిణీ. ౧౧
న్యాయవృత్తం సుదుర్వృత్తా ప్రియ మప్రియదర్శనా
శరీరజసమావిష్టా రాక్షసీ వాక్య మబ్రవీత్. ౧౨

టీక॥ దుర్ముఖీ=వికృతమయినముఖముగలదియు; మహోదరీ= పెద్దకడుపుగలదియు; విరూపాక్షీ= వికృతములయినకండ్లుగలదియు; తామ్రమూర్ధజా = ఎఱ్ఱనివెండ్రుకలుగలదియు; విరూపా= వికృతమయినయాకారముగలదియు; భైరవస్వరా= భయంకరమయినధ్వనిగలదియు; వామభాషిణీ= గ్రామ్యములయిన మాటలంజెప్పునదియు; సుదుర్వృత్తా= మిక్కిలియుదురాచారముగలదియు ; అప్రియదర్శనా = సంతోషకరములేనిచూచుటగలదియునగు; సా=ఆ; రాక్షసీ=శూర్పణఖ; సుముఖం= సుందరమయినముఖముగలవాఁడును; వృత్తమధ్యం=సన్ననడుముగలవాఁడును; విశాలాక్షం=వెడల్పులయినకన్నులుగలవాఁడును ; సుకేశం=సుందరములయినవెండ్రుకలుగలవాఁడును;ప్రీతిరూపం=సంతోషముగలిగించునాకారముగలవాఁడును; సుస్వరం=శ్రావ్యమగుకంఠధ్వని గలవాఁడును;తరుణం=యౌవనము గలవాఁడును; దక్షిణం=చమత్కారియు; న్యాయవృత్తం=శాస్త్రసమ్మతమగు నాచారముగలవాఁడును; ప్రియం= సంతోషకరుండునగు; రామం=రామునిగూర్చి ; శరీరజసమావిష్టా= మన్మథునిచేనావేశింపఁబడినదై; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

దుర్ముఖియుమహోదరియు వికటనేత్రయునెఱ్ఱనివెండ్రుకలు గలదియువిరూపయుభయంకరమయినకంఠధ్వనిగలదియుభయంకరాకారయువృద్ధయుగ్రామ్యోక్తులాడునదియునగు నాశూర్పణఖ,సుందరముఖుండును సన్ననడుముగలవాఁడునువెడల్పుకన్నులుగలవాఁడునునల్లనిసుందరములయిన వెండ్రుకలుగలవాఁడునుజూపరులకుఁ బ్రియంబగురూపముగలవాఁడును శ్రావ్యమయినకంఠధ్వనిగలవాఁడును యౌవనవంతుఁడును జతురంబుగా మాటలాడువాఁడును శాస్త్రసమ్మతముగా నాచరించువాఁడును జూపరులకుఁబ్రియుండునునగురామునింజూచి, మన్మథపరవశయయియిట్లని, చెప్పెను.

అని,తాత్పర్యము.

జటీ తాపసరూపేణ సభార్య శ్శరచాపధృత్
ఆగత స్త్వ మిమం దేశం కథం రాక్షససేవితమ్. ౧౩

టీక॥ త్వం=నీవు; తాపసరూపేణ=ఋషిరూపముచేత; జటీ = జటలుగలవాఁడవై; సభార్యః= భార్యతోఁగూడినవాఁడవై; శరచాపధృత్= బాణంబులనుధనుస్సును దాల్చినవాఁడవై; రాక్షససేవితం= రాక్షసులచే సేవింపఁబడినదగు; ఇమం=ఈ; దేశం=ప్రదేశమును; కథం=ఎట్లు; ఆగతః=పొందినావు?

నీవు, తాపసరూపంబు, జటలు ధరించి, ధనుర్బాణంబులు దాల్చి, భార్యతోఁగూడ, రాక్షససేవితంబగు నీప్రదేశంబునకెట్లువచ్చినావు? అని, తాత్పర్యము.

కి మాగమనకృత్యం తే తత్త్వ మాఖ్యాతు మర్హసి

టీక॥ తే=నీయొక్క ; ఆగమనకృత్యం=వచ్చుటయొక్కపని; కిం=ఏమి? తత్త్వం=యథార్థమును; ఆఖ్యాతుం=చెప్పుటకు; అర్హసి=తగుదువు.

నీవిచ్చటికేలవచ్చితివి? ఇదంతయు నాకుయథార్థముగాఁజెప్పవు. అని, శూర్పణఖ రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు రాక్షస్యా శూర్పణఖ్యా పరంతపః ౧౪
ఋజుబుద్ధితయా సర్వ మాఖ్యాతు ముపచక్రమే

టీక॥ పరంతపః=శత్రువులఁ దపింపజేయునట్టి రాముఁడు; శూర్పణఖ్యా =శూర్పణఖయను; రాక్షస్యా= రాక్షసిచేత; ఏవం=ఇట్లు; ఉక్తస్తు=చెప్పబడినవాఁడైనంతనే; ఋజుబుద్ధితయా=కుటిలముగానిబుద్ధిగలవాఁడగుటచేత ; సర్వం=సమస్తమును; ఆఖ్యాతుం=చెప్పుటకు; ఉపచక్రమే= ఆరంభించెను.

శత్రువులదపింపఁ జేయునట్టి రాముఁడు , శూర్పణఖచెప్పినమాటలన్నియువిని, కపటములేనివాఁడగుటచేఁ దనవృత్తాంతమునంతయు యథార్థముగాఁజెప్పనారంభించెను.

అని, తాత్పర్యము.

అనృత నృహి రామస్య కదాచి దపి సమ్మతమ్. ౧౫
విశేషేణాశ్రమస్థస్య సమీపే స్త్రీజనస్యచ

టీక॥ రామస్య=రామునకు; అనృతం=అసత్యము;కదాచిదపి = ఒకానొకప్పుడును; విశేషేణ = విశేషము చేత;ఆశ్రమస్థస్య= ఆశ్రమంబుననున్న వానికిని;స్త్రీజనస్య = స్త్రీజనము యొక్క;సమీపేచ = సమీపమునందును; నసమ్మతంహి=ఇష్టముగాదుగదా!

రామునకసత్యము , ఎప్పటికినిష్టముగాదు;అందువిశేషించి , తాపసధర్మంబవలంబించి యాశ్రమంబుననుండునప్పుడును స్త్రీలసమక్షమునందును, ఎంతమాత్రమసత్యమాడడు.

అని, తాత్పర్యము.

ఆసీ ద్దశరథో నామ రాజా త్రిదశవిక్రమః. ౧౬

టీక॥ త్రిదశవిక్రమః = దేవతయొక్క పరాక్రమమువంటి పరాక్రమము గల;దశరథోనామ = దశరథుండనిప్రసిద్ధుఁడైన;రాజా=రాజు;ఆసీత్=ఉండెను.

దేవతలకుంబోలె బరాక్రమంబుగలదశరథుండనునొకరాజుండెను.

అని, తాత్పర్యము.

తస్యాహ మగ్రజః పుత్రో రామోనామ జనై శ్శ్రుతః

టీక॥ అహం=నేను;తస్య= ఆదశరథమహారాజుయొక్క;అగ్రజః= ముందుపుట్టిన;పుత్రః=కుమారుండను . రామోనామ=రాముండని;జనైః= జనులచేత;శ్రుతః=వినఁబడినవాఁడను.

నేనా దశరథమహారాజు పెద్దకుమారుండను ; నన్నురాముండని జనులుపిలుతురు.అని, తాత్పర్యము.

భ్రాతాయం లక్ష్మణోనామ యవీయా న్మా మనువ్రతః. ౧౭

టీక॥ అయం = ఇతఁడు ; యవీయాన్=చిన్నవాఁడయిన; భ్రాతా=తోఁబుట్టువు.లక్ష్మణోనామ = లక్ష్మణుఁడనిప్రసిద్ధుఁడు.మాం = నన్ను;అ

నుఁవ్రతః=అనుసరించినవాఁడు.

ఇతండు, నాతమ్ముండు, ఇతనిపే రులక్ష్మణుండంఁడు; ఎప్పటికినన్నను సరించియుండును.

అని, తాత్పర్యము.

ఇయం భార్యాచ వైదేహీ మమ సీతేతి విశ్రుతా

టీక॥ వైదేహీ= విదేహరాజుకొమారెయగు; ఇయంచ = ఈబిడయు; మమ = నాయొక్క; భార్యా= పెండ్లాము. సీతేతి = సీతయని; విశ్రుతా=ప్రసిద్ధిఁబొందినది.

ఈబిడ, జనకమహారాజుకొమారెౕ, నాభార్య; సీతయనియీబిడపేరు. అని, తాత్పర్యము.

నియోగాత్తు నరేంద్రస్య పితుర్మాతుశ్చ యంత్రితః. ౧౮
ధర్మార్థం ధర్మకాంక్షీచ వనం వస్తు మిహాగతః

టీక॥ అహం=నేను; పితుః= తండ్రియైన; నరేంద్రస్య = దశరథమహారాజుయొక్కయు; మాతుశ్చ=తల్లియయినకైకేయియొక్కయు; నియోగాత్తు=ఆజ్ఞవలననె; యంత్రితః=బద్ధుండనై; ధర్మకాంక్షీచ= ధర్మముఁగోరువాఁడనునై; ధర్మార్థం=ధర్మముకొఱకు; వస్తుం=వాసముసేయుటకు; ఇహ=ఈ; వనం=అడవిని; ఆగతః=పొందినాను.

నేను, నాతండ్రిదశరథమహారాజును నాతల్లికైకేయియు నాజ్ఞాపించుటంజేసి, పిత్రాజ్ఞాపరిపాలనరూపధర్మంబునాచరించుటకై, యీవనంబునకువచ్చినాను. అని, తాత్పర్యము.

త్వాంతు వేదితు మిచ్ఛామి కథ్యతాం కాసి కస్య వా. ౧౯

టీక॥ త్వాంతు=నిన్నును; వేదితుం= తెలిసికొనుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను. త్వం(అధ్యాహృతము)=నీవు; కా=ఎవ్వతెవు; అసి = అగుచున్నావు? కస్యవా = ఎవ్వనిదానవు? కథ్యతాం=చెప్పఁబడుఁగాక.

నిన్నుఁదెలియఁగోరియున్నాను; నీవెవ్వతెవు? ఎవ్వరికొమారెౕవు? చెప్పుము. అని; తాత్పర్యము.

నహి తావన్మనోజ్ఞాంగీ రాక్షసీ ప్రతిభాసి మా

టీక॥ తావన్మనోజ్ఞాంగీ= అంతమనోహరమయినదేహముగలనీవు ; రాక్షసీ=రాక్షసస్త్రీవిగా; మాం=నన్నుఁగూర్చి; నప్రతిభాసిహి = తోఁచవుగదా!

ఇంతసుందరమయినరూపముగలనీవు, రాక్షసివనినాకుఁదోఁచలేదు. అని, తాత్పర్యము.

ఇహ వా కిన్నిమిత్తం త్వ మాగతా బ్రూహి తత్త్వతః. ౨౦

టీక॥ త్వం=నీవు; ఇహ=ఇచ్చటికి; కిన్నిమిత్తంవా = ఎందుకొఱకు; ఆగతా=వచ్చినావు? తత్త్వతః=యథార్థముగా; బ్రూహి=చెప్పుము.

నీవిచ్చటికేలవచ్చినావు? ఈసంగతియంతయునాకుయథార్థముగాఁజెప్పుము. అని, రాముఁడు, శూర్పణఖతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

సా బ్రవీ ద్వచనం శ్రుత్వా రాక్షసీ మదనార్దితా

టీక॥ సా=ఆ; రాక్షసీ= శూర్పణఖ; శ్రుత్వా=విని; మదనార్దితా=మన్మథునిచేఁ బీడింపఁబడినదై ; వచనం = మాటను ; అబ్రవీత్ = చెప్పెను.

ఆశూర్పణఖ రామునిమాటను విని,మన్మథపరవశయయి యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

శ్రూయతాం రామ వక్ష్యామి తత్త్వార్థం వచనం మమ. ౨౧

టీక॥ రామ=రాముఁడా! వక్ష్యామి=చెప్పెదను. మమ= నాయొక్క; తత్త్వార్థం = యథార్థమయినయర్థముగల; వచనం = మాట; శ్రూయతాం=వినఁబడుఁగాక.

రాముఁడా! యథార్థముగానాసంగతినంతయుఁజెప్పెదను ; నామాటనువినుము. అని, తాత్పర్యము.

అహం శూర్పణఖానామ రాక్షసీ కామరూపిణీ
అరణ్యం విచరామీద మేకా సర్వభయంకరా. ౨౨

టీక॥ అహం = నేను; శూర్పణఖానామ = శూర్పణఖయనిప్రసిద్ధనగు; రాక్షసీ = రాక్షసిని. కామరూపిణీ = ఇచ్ఛాధీనమగురూపముగలదానను. సర్వభయంకరా = అందఱకు నుభయము సేయుదానను. ఏకా = ఒకర్తెదాననై, ఇదం = ఈ, అరణ్యం = అడవిని, అడవియందనుట; విచరామి = తిరుగుచున్నాను.

నేను, శూర్పణఖయను రాక్షసిని; కామరూపిణిని; సమస్తప్రాణులును నాపేరన్న భయపడుదురు; ఒక్కతెనై యీయడవియందుఁ దిరుగుచుందును. అని, తాత్పర్యము.

రావణోనామ మే భ్రాతా బలీయాన్ రాక్షసేశ్వరః
వీరో విశ్రవసః పుత్రో యది తే శ్రోత్రమాగతః. ౨౩

టీక॥ బలీయాన్ = అధికమయినబలముగలవాఁడును; వీరః = పరాక్రమవంతుఁడును; విశ్రవసః = విశ్రవసుని యొక్క; పుత్రః = కొడుకునగు; రావణోనామ = రావణుఁడనుపేరుగల; రాక్షసేశ్వరః = రాక్షసరాజు; మే = నాయొక్క; భ్రాతా = తోఁబుట్టువు. తే = నీయొక్క; శ్రోత్రం = చెవిని; ఆగతోయది = పొందినాఁడా యేమి?

బలవంతుండును, పరాక్రమవంతుండును విశ్రవసునికుమారుండును రాక్షసేశ్వరుండునగు రావణుండు, నాకు సహోదరుఁడు; ఆతనినీవును వినియుందువు. అని, తాత్పర్యము.

ప్రవృద్ధనిద్రశ్చ సదా కుంభకర్ణో మహాబలః

టీక॥ మహాబలః = అధికమయినబలముగలవాఁడును; సదా = ఎల్లప్పుడును; ప్రవృద్ధనిద్రః = వృద్ధిఁబొందిననిదురగలవాఁడునగు; కుంభకర్ణశ్చ = కుంభకర్ణుఁడును; మేభ్రాతా (అధ్యాహృతము) = నాతోఁబుట్టువు.

మహాబలశాలియు నెల్లప్పుడునుమిక్కిలియు నిద్రపోవుచుండు వాఁడునగుకుంభకర్ణుండును నాసహోదరుఁడు. అని, తాత్పర్యము.

విభీషణస్తు ధర్మాత్మా నతురాక్షసచేష్టితః. ౨౪

టీక॥ ధర్మాత్మా = ధర్మస్వభావుఁడైన; నరాక్షసచేష్టితస్తు = రాక్షసవ్యాపారము లేనివాఁడును గు; విభీషణస్తు = విభీషణుఁడును; మే భ్రాతా (అధ్యాహృతము) = నాతోఁబుట్టువు.

ధర్మాత్ముండగు విభీషణుండును నా సహోదరుఁడు; అయితే, అతండు, రాక్షసచేష్టలుగలవాఁడు గాఁడు.

అని, తాత్పర్యము.

ప్రఖ్యాతవీర్యౌచ రణే భ్రాతరౌ ఖరదూషణౌ

టీక॥ రణే = యుద్ధమునందు; ప్రఖ్యాతవీర్యౌ = ప్రసిద్ధినొందిన పరాక్రమము గల; ఖరదూషణౌచ = ఖరదూషణులును; మే (అధ్యాహృతము) = నాయొక్క; భ్రాతరౌ = తోఁబుట్టువులు.

యుద్ధంబునవినుతికెక్కిన మహాపరాక్రమశాలులగు ఖరదూషణులును, నా సహోదరులు. అని, తాత్పర్యము.

తా నహం సమతిక్రాంతా రామ త్వా పూర్వదర్శనాత్. ౨౫
సముపేతాస్మి భావేన భర్తారం పురుషోత్తమమ్

టీక॥ రామ = రాముఁడా! పూర్వదర్శనాత్ = మొదటజూచుటనుండి; అహం = నేను; తాన్ = ఆతోఁబుట్టువులను, సమతిక్రాంతా = అతిక్రమించిన దాననై; పురుషోత్తమం = పురుషశ్రేష్ఠుండవగు; త్వా = నిన్ను; భర్తారం = పెనిమిటినిగా; భావేన = మనస్సుచేత; సముపేతా = పొందినదానను; అస్మి = అగుచున్నాను.

రాముఁడా! నేను, నిన్నుఁజూచినంతనె, వారలనందఱింబరిత్యజించి, పురుషోత్తముండవగు నిన్ను భర్తగాఁ బొందవలెననియున్నాను.

అని, తాత్పర్యము.

అహం ప్రభావసంపన్నా స్వచ్ఛందబలగామినీ. ౨౬
చిరాయ భవ మే భర్తా సీతయా కిం కరిష్యసి

టీక॥ అహం = నేను; ప్రభావసంపన్నా = ప్రభావముతోఁగూడినదానను. స్వచ్ఛందబలగామినీ — నాయిచ్ఛకొలఁదిబలమునుబొందుదానను; చిరాయ =

స ౧౭

బహుకాలము; మే=నాయొక్క; భర్తా=పెనిమిటివి; భవ=అగుము. సీతయా=సీతచేత, కిం=ఏమి; కరిష్యసి=చేయఁగలవు?

నేనుమహాప్రభావంబు గల దానను; నాయిచ్చకొలఁదిబలంబునొందఁ గలదానను; నాకు బహుకాలము భర్తవుగానుండుము; ఈసీతతోనీకేమి కార్యము. అని, తాత్పర్యము.

వికృతాచ విరూపాచ నచేయం సదృశీ తవ. ౨౭

టీక॥ ఇయం=ఈసీత; వికృతాచ=వికారముగలదియు; విరూపాచ=వికృతరూపముగలదియు; తవ=నీకు; నసదృశీ=తగినదియుకాదు.

ఈసీతవికృతగాను కురూపిగానున్నది; ఈబిడనీకుఁదగినదికాదు. అని, తాత్పర్యము.

అహమేవా నురూపా తే భార్యారూపేణ పశ్య మామ్

టీక॥ అహమేవ=నేనే; తే=నీకు; అనురూపా=తగినదానను. మాం=నన్ను; భార్యారూపేణ=భార్యయొక్క రూపముచేత; పశ్య=చూడుము.

నేనేనీకుఁ దగిన దానను; నన్నుభార్యగాఁజూడుము. అని, తాత్పర్యము.

ఇమాం విరూపా మసతీం కరాళాం నిర్ణతోదరీమ్. ౨౮
అనేన తే సహభ్రాత్రా భక్షయిష్యామి మానుషీమ్

టీక॥ విరూపాం = వికృతరూపముగలదియు; అసతీం= దుర్మార్గురాలును; కరాళాం = భయంకరురాలును; నిర్ణతోదరీం = వంగినకడుపుగలదియు; మానుషీం= మనుష్యస్త్రీయగు; ఇమాం=ఈసీతను; తే = నీయొక్క; అనేన=ఈ; భ్రాత్రాసహ = తమ్మునితోఁగూడ; భక్షయిష్యామి = భక్షించెదను.

వికృతరూపయును దుష్టాచారయును భయంకరాకారయును వ్రేలుకాదు కడుపుగలదియునగు నీమనుష్యస్త్రీని, నీతమ్మునితోఁగూడ భక్షించెదను. అని, తాత్పర్యము.

తతః పర్వతశృంగాణి వనాని వివిధానిచ. ౨౯
పశ్యన్ సహ మయా కాంత దండకా న్విచరిష్యసి

టీక॥కాంత=మనోహరుఁడా! తతః=అంత;పర్వతశృంగాణి= పర్వతశిఖరములను;వివిధాని= నానావిధములగు;వనానిచ=అడవులను; పశ్యన్= చూచుచు;మయాసహ=నాతోఁగూడ; దండకాన్=దండకారణ్యమును, దండకారణ్యమునందనుట;విచరిష్యసి= సంచరింపఁగలవు.

మనోహరుఁడా!అంత,నీవు, నన్నుఁగూడి, పర్వతశిఖరంబులను నానావిధములగువనంబులనుంజూచుచు,దండకారణ్యంబునవిహరింపఁగలవు-అని, శూర్పణఖరామునితోఁజెప్పెను.

అని,తాత్పర్యము.

ఇత్యేవ ముక్తః కాకుత్థ్సః ప్రహస్య మదిరేక్షణామ్. ౩౦
ఇదం వచన మారేభే వక్తుం వాక్యవిశారదః

టీక॥వాక్యవిశారదః=మాటలయందుఁబండితుండగు; కాకుత్థ్సః = రాముఁడు;ఇతి=అని;ఏవం=ఇట్లు;ఉక్తః=చెప్పఁబడినవాఁడై;ప్రహస్య=నవ్వి;మదిరేక్షణాం=మదముగప్పినకన్నులుగలశూర్పణఖనుగూర్చి;ఇదం=ఈ; వచనం=మాటను;వక్తుం=చెప్పుటకు;ఆరేభే=ఆరంభించెను.

మాటలుచెప్పుటయందు నేర్పరియగురాముండు,శూర్పణఖ చెప్పినమాటనువిని,యాబిడంజూచి, యిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
అరణ్యకాండే, సప్తదశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అరణ్యకాండసప్తదశసర్గటీక,
ముగిసినది.

శ్రీ

అష్టాదశసర్గప్రారంభః.

తత శ్శూర్పణఖాం రామః కామపాశావపాశితామ్
స్వచ్ఛయా శ్లక్ష్ణయా వాచా స్మితపూర్వ మథాబ్రవీత్. ౧

టీక॥ తతః=అంతకన్న; అథ=పిమ్మట, రామః=రాముఁడు; కామపాశావపాశితాం=మన్మథుఁడను పాశముచేఁగట్టఁబడిన; శూర్పణఖాం=శూర్పణఖనుగూర్చి; స్వచ్ఛయా=స్పష్టమును, శ్లక్ష్ణయా=మృదువునగు, వాచా=మాటచేత; స్మితపూర్వం=చిఱునగవుముందుగలుగునట్లుగా; అబ్రవీత్=పలికెను.

అంత, రాముఁడు, కామపాశవశంగతయగుశూర్పణఖంజూచి, స్పష్టార్థమును మధురమునగువాక్యంబునఁజిఱునగవుమొగంబునందోఁప, నిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

కృతదారో స్మి భవతి భార్యేయం దయితా మమ
త్వద్విధానాంతు నారీణాం సుదుఃఖా ససపత్నతా. ౨

టీక॥ భవతి=అమ్మా! అహం (అధ్యాహృతము)=నేను; కృతదారః=స్వీకరింపఁబడిన భార్యగలవాఁడను; అస్మి=అగుచున్నాను. ఇయం=ఈబిడ, మమ=నాయొక్క; భార్యా=పెండ్లాము. దయితా=ప్రియురాలు. త్వద్విధానాం=నీయట్టివారలగు; నారీణాం తు=స్త్రీలకుమాత్రము, ససపత్నతా=చవతితోఁగూడియుండుట; సుదుఃఖా=మిక్కిలియుదుఃఖముగలిగించునది.

అమ్మా! నేనువివాహము చేసికొనియున్నాను; ఈబిడనాభార్య; ఈబిడయందునాకుమిక్కిలిమక్కువయుఁగలిగియుండును; మఱియునీయట్టియుత్తమస్త్రీలకు, చవతితోనుండుటకష్టము. అని, తాత్పర్యము.

అనుజ స్త్వేష మే భ్రాతా శీలవాన్ ప్రియదర్శనః

శ్రీమా నకృతదారశ్చ లక్ష్మణో నామ వీర్యవాన్. ౩

టీక॥ ఏషతు=ఇతండును;మే=నాయొక్క;అనుజః=వెనుకఁబుట్టిన; భ్రాతా=తోఁబుట్టువు . లక్ష్మణోనామ=లక్ష్మణుండను పేరుగలవాఁడు . శీలవాన్= సదాచారముగలవాఁడు. ప్రియదర్శనః= సంతోషకరమయినచూచుటగలవాఁడు. శ్రీమాన్=కాంతిమంతుండు.అకృతదారశ్చ= స్వీకరింపఁబడనిభార్యగలవాఁడు.వీర్యవాన్= అధికమయినపరాక్రమముగలవాఁడు.

ఇతండునాతమ్ముండు; ఇతనిపేరు లక్ష్మణుండందురు; సదాచారవంతుండు; మంచిరూపరి;శ్రీమంతుండు ; ఇతండు భార్యనువెంటఁదీసికొని రాలేదు ; మఱియునితండు మిక్కిలియుఁబరాక్రమశాలి.

అని, తాత్పర్యము.

అపూర్వీ భార్యయాచార్థీ తరుణః ప్రియదర్శనః
అనురూపశ్చ తే భర్తా రూపస్యాస్య భవిష్యతి. ౪

టీక॥ అయం (అధ్యాహృతము)= ఈతండు; అపూర్వీ = మున్నుభార్యసౌఖ్యము నెఱుంగనివాఁడు . భార్యయా=భార్యచేత;అర్థీచ= ప్రయోజనముగలవాఁడును.తరుణః = యౌవనవంతుండు.ప్రియదర్శనః= సంతోషకరంబగుచూచుటగలవాఁడు. తే=నీయొక్క;రూపస్యాస్య = రూపమునకును;అనురూపశ్చ = తగినవాఁడునైన; భర్తా=పెనిమిటి;భవిష్యతి = కాఁగలఁడు.

ఇతండు , ఇదివఱకుభార్యసుఖంబెఱుంగనివాఁడు ; కాఁబట్టియితనికిభార్యకావలసియున్నది ; మఱియునితండు యౌవనవంతుండును సుందరాకారుండును గాన , నీరూపంబునకనురూపంబుగా,భర్తకాఁగలఁడు.

అని, తాత్పర్యము.

ఏనం భజ విశాలాక్షి భర్తారం భ్రాతరం మమ
అసపత్నా వరారోహే మేరు మర్క ప్రభా యథా. ౫

టీక॥వరారోహే= శ్రేష్ఠములయినపిఱుందులుగల;విశాలాక్షి=వెడల్పులయినకన్నులుగలశూర్పణఖా!మమ=నాయొక్క;భ్రాతరం=తమ్ముఁడయిన; ఏనం=ఈలక్ష్మణుని;భర్తారం=పెనిమిటిగా;అసపత్నా= చవతిలేనిదానవై; మేరుం=మేరుపర్వతమును ; అర్కప్రభాయథా=సూర్యకాంతివలె; భజ= పొందుము.

సుందరములయిన పిఱుందులు గల దానవు వెడల్పులయిన కన్నులుగలదానవునగుశూర్పణఖా! మేరుపర్వతమునుసూర్యకాంతిపొందునట్లు, నీవు నాతమ్మునిఁబెనిమిటిగాఁబొందుము; నీకుఁజవతులు లేకసుఖంబుగానుందువు. అని, రాముఁడు,శూర్పణఖతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి రామేణ సా ప్రోక్తా రాక్షసీ కామమోహితా
విసృజ్య రామం సహసా తతో లక్ష్మణ మబ్రవీత్. ౬

టీక॥కామమోహితా= మన్మథునిచే మోహమునొందింపఁబడిన;సా=ఆ; రాక్షసీ=శూర్పణఖ;ఇతి=ఇట్లు; రామేణ=రామునిచేత;ప్రోక్తా= చెప్పఁబడినదై;సహసా=శీఘ్రింబున;రామం= రాముని;విసృజ్య=విడిచి;తతః=అంత; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి ; అబ్రవీత్=పలికెను.

కామమోహితయగునాశూర్పణఖ, రాముఁడుచెప్పినదివిని,యంతశీఘ్రింబునరామునివిడిచి , లక్ష్మణునింజూచియిట్లని,పలికెను. అని, తాత్పర్యము.

అస్య రూపస్య తే యుక్తా భార్యాహం వరవర్ణినీ
మయాసహ సుఖం సర్వాన్ దండకాన్ విచరిష్యసి. ౭

టీక॥వరవర్ణినీ = ఉష్ణకాలమున సుఖశీతలమును శీతకాలమున సుఖోష్ణమునగునంగముగలిగి భర్తయందనురాగముగల యుత్తమస్త్రీ నగు ; అహం=నేను; తే=నీకు; అస్య=ఈ;రూపస్య=రూపమునకు; యుక్తా=తగిన; భార్యా=భార్యను. త్వం (అధ్యాహృతము)=నీవు; మయాసహ=నాతోఁగూడ; సుఖం=సుఖముగా; సర్వాన్= సమస్తమయిన; దండకాన్= దండకార

స ౧౮

ణ్యమును,దండకారణ్యమునందనుట; విచరిష్యసి=తిరుగఁగలవు.

ఉష్ణకాలమునసుఖ శీతలమును శీతకాలమునసుఖోష్ణమునగు సంగముగలిగి భర్తయందనురాగముగల యుత్తమవనితనగు నేను, నీసౌందర్యమునకుఁదగినభార్యను; నీవునన్నుంగూడి,సౌఖ్యంబున, నీదండకారణ్యముననంతటను విహరింపుచుండుము. అని,శూర్పణఖ లక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు సౌమిత్రీ రాక్షస్యా వాక్యకోవిదః
తత శ్శూర్పణఖీం స్మిత్వా లక్ష్మణో యుక్త మబ్రవీత్. ౮

టీక॥వాక్యకోవిదః= మాటలయందుఁబండితుండగు; సౌమిత్రిః= సుమిత్రకొడుకైన;లక్ష్మణః=లక్ష్మణుఁడు;రాక్షస్యా=శూర్పణఖచేత ; ఏవం= ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడైనంతనె; తతః=అంత; స్మిత్వా = కొంచెమునవ్వి; శూర్పణఖీం= చేటలవంటిగోళ్లుగలశూర్పణఖనుగూర్చి ; యుక్తం = తగునట్లుగా ; అబ్రవీత్=చెప్పెను.

మాటలుచెప్పుటయందుఁ బండితుండగులక్ష్మణుండు శూర్పణఖ చెప్పినమాటనువిని, చేటలవంటిగోళ్లతో నున్నయారాక్షసింజూచి , చిఱునగవుమొగంబునందోఁప, నిట్లని యుక్తంబుగాఁబలికెను. అని,తాత్పర్యము.

కథం దాసస్య మే దాసీ భార్యా భవితు మిచ్ఛసి
సోహ మార్యేణ పరవాన్ భ్రాత్రా కమలవర్ణిని. ౯

టీక॥ కమలవర్ణిని=తామరపువ్వుయొక్క-రంగువంటిరంగుగల శూర్పణఖా! త్వం(అధ్యాహృతము) = నీవు; దాసస్య=దాసుండనగు ; మే=నాకు; భార్యా=భార్యవయి;దాసీ=దాసివి ; భవితుం=అగుటకు; కథం=ఎట్లు ; ఇచ్ఛసి=కోరుచున్నావు? సః=అట్టి; అహం=నేను; ఆర్యేణ=పూజ్యుండగు ; భ్రాత్రా=అన్నచేత; పరవాన్ = పరాధీనుండను.

తామరపువ్వువంటిరంగుగల దానవగు శూర్పణఖా! నీవు దాసుండనగు నాకు భార్యవై దాసివగుట కేల గోరెదవు? నాకు జ్యేష్ఠభ్రాతయగు నీ రాముండు నాధుండు; నేనతనికి దాసుండను.

అని, తాత్పర్యము.

సమృద్ధార్థస్య సిద్ధార్థా ముదితా మలవర్ణినీ
ఆర్యస్య త్వం విశాలాక్షి భార్యా భవ యవీయసీ. ౧౦

టీక॥ విశాలాక్షి= వెడల్పులయిన కన్నులుగలశూర్పణఖా! సిద్ధార్థా= ఈడేఱినప్రయోజనముగలదానవును; అమలవర్ణినీ=నిర్మలమయినరంగుగల దానవునగు; త్వం=నీవు; ముదితా= సంతోషించినదానవై; సమృద్ధార్థస్య=సమృద్ధమయినప్రయోజనముగల; ఆర్యస్య= పూజనీయుండయిన రామునకు; యవీయసీ=చిన్నదానవగు; భార్యా=భార్యవు; భవ=అగుము.

వెడల్పులయినకన్నులుగలశూర్పణఖా! సిద్ధార్థురాలవును సుందరాంగివగు నీవు సంతోషంబున, సర్వార్థసిద్ధిగల రామునకు రెండవభార్యవగుము.

అని, తాత్పర్యము.

ఏనాం విరూపా మసతీం కరాళాం నిర్ణతోదరీమ్
భార్యాం వృద్ధాం పరిత్యజ్య త్వా మేవైష భజిష్యతి. ౧౧

టీక॥ ఏషః=ఈరాముండు; విరూపాం = వికృతమయినరూపముగలదియు, అసతీం= దుష్టురాలును; కరాళాం=భయంకరురాలును; నిర్ణతోదరీం=వంగినకడుపుగలదియు; వృద్ధాం= ముసలిదియునగు, ఏనాం= ఈ; భార్యాం=భార్యను; పరిత్యజ్య = విడిచి; త్వామేవ=నిన్నే; భజిష్యతి = పొందంగలండు,

ఈరాముండు, వికృతరూపముగలదియు దుర్మార్గురాలును భయంకరాకారయును వ్రేలుకాడుచుండు కడుపుగలదియు ముసలిదియునగు నీభార్యను విడిచి, నిన్నే భార్యగాంబొందును.

అని, తాత్పర్యము.

కోహి రూప మిదం శ్రేష్ఠం సంత్యజ్య వరవర్ణిని
మానుషీషు వరారోహే కుర్యా ద్భావం విచక్షణః. ౧౨

టీక॥వరవర్ణిని=ఉష్ణకాలమునను ఖశీతలమును శీతకాలమున సుఖోష్ణము నగునంగము గలిగిభర్తయందను రాగ ముగలయుత్తమస్త్రీ యవి;వరారోహే= శ్రేష్ఠములయినపిఱుదులుగలదానవగు శూర్పణఖా!విచక్షణః= పండితుండగువాఁడు;కోహి=ఎవ్వఁడు ; ఇదం= ఈ;శ్రేష్ఠం=ఉత్తమమయిన.రూపం= ఆకారమును;సంత్యజ్య=విడిచి; మానుషీషు=మనుష్యస్త్రీలయందు,భావం= మనస్సును;కుర్యాత్=చేయును?

ఉష్ణకాలమునసుఖ శీతలమును శీతకాలమునసుఖోష్ణమునగునంగము గలిగిభర్తయందును రాగముగల యుత్తమవనితవును దరములయిన పిఱుదులు గలదానవునగుశూర్పణఖా!పండితుండగువాఁడెవ్వఁడు,ఇట్టిసుందరాకారంబువిడిచి,మనుష్యస్త్రీలయందు మనసునుంచును?అని,లక్ష్మణుఁడు శూర్పణఖతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇతి సా లక్ష్మణే నోక్తా కరాళా నిర్ణతోదరీ
మన్యతే తద్వచ స్తథ్యం పరిహాసావిచక్షణా. ౧౩

టీక॥కరాళా = భయంకరురాలును;నిర్ణతోదరీ= వంగినకడుపుగలదియు;పరిహాసావిచక్షణా= పరిహాసము నెఱుంగనిదియునగు;సా = ఆశూర్పణఖ;ఇతి=ఇట్లు;లక్ష్మణేన= లక్ష్మణునిచేత;ఉక్తా = చెప్పఁబడినదై;తత్=ఆ;వచః=మాటను;తథ్యం = యథార్థముగా;మన్యతే = తలంచుచున్నది.

భయంకరాకారయు వ్రేలుకాడుచుండు కడుపుగలదియునగు నాశూర్పణఖ,లక్ష్మణునిమాటనువిని , పరిహాసంబెట్టిదో యెఱుంగనిది కావున, నామాటనంతయు యథార్థముగాఁ దలంచినది. అని, తాత్పర్యము.

సా రామం పర్ణశాలాయా ముపవిష్టం పరంతపమ్
సీతయా సహదుర్ధర్ష మబ్రవీ త్కామమోహితా. ౧౪

టీక॥ కామమోహితా= మన్మథునిచే మోహమునొందింపఁబడిన; సా= ఆశూర్పణఖ; సీతయాసహ = సీతతోఁగూడ; పర్ణశాలాయాం= పర్ణశాలయందు; ఉపవిష్టం= కూర్చుండినవాఁడును; పరంతపం= శత్రువులఁదపింపజేయువాఁడును; దుర్ధర్షం= ఎదిరింపనలవి గానివాఁడునగు, రామం= రామునిగూర్చి ; అబ్రవీత్ = చెప్పెను.

మన్మథపరవశయగునా శూర్పణఖ పర్ణశాలయందుసీతతోఁగూడ దుర్ధర్షుఁడై కూర్చుండియున్న శత్రుమర్దనుండగు రాముంజూచి, యిట్లని, పలికెను. అని, తాత్పర్యము.

ఏనాం విరూపా మసతీం కరాళాం నిర్ణతోదరీమ్
వృద్ధాం భార్యా మవష్టభ్య మాం నత్వం బహుమన్యసే. ౧౫

టీక॥త్వం=నీవు; విరూపాం=వికృతరూపముగలదియు; అసతీం= దుష్టురాలును; నిర్ణతోదరీం= వంగినకడుపుగలదియు; వృద్ధాం=ముసలిదియునగు; ఏనాం=ఈ; భార్యాం= భార్యను; అవష్టభ్య = అవలంబించి; మాం= నన్ను; నబహుమన్యసే = గౌరవింపకున్నావు.

నీవు, వికృతరూపముగలిగి భయంకరాకారయయి వ్రేలుకాఁడుకడుపుతోఁ గూడినయీముసలిభార్యనుదగ్గిఱఁ బెట్టుకొని, నన్నులక్ష్యముసేయకున్నావు. అని, తాత్పర్యము.

అద్యే మాం భక్షయిష్యామి పశ్యత స్తవ మానుషీమ్
త్వయాసహ చరిష్యామి నిస్సపత్నా యథా సుఖమ్. ౧౬

టీక॥అద్య=ఇప్పుడు; తవ=నీవు ; పశ్యతః= చూచుచుండగా; ఇమాం = ఈ; మానుషీం=మనుష్యస్త్రీని ; భక్షయిష్యామి = భక్షించెదను. నిస్సపత్నా=సవతిలేనిదాననై; యథా సుఖం=సుఖముగా; త్వయాసహ=నీతోఁ గూడ; చరిష్యామి=సంచరించెదను.

ఇప్పుడు, నీవుచూచుచుండఁ గానే

ఈమనుష్యస్త్రీని భక్షించెదను; అంతట జవతిబంపులేక సీతోఁగూడ సుఖంబుగ విహరించెదను. అని, శూర్పణఖ రాముని తోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా మృగశాబాక్షీ మలాతసదృశేక్షణా
అభ్యధావ త్సుసంక్రుద్ధా మహోల్కా రోహిణీమివ. ౧౭

టీక॥ అలాతసదృశేక్షణా= కొఱవులతోసమానములయిన కన్నులుగల శూర్పణఖ; ఇతి=అని; ఉక్త్వా=చెప్పి; సుసంక్రుద్ధా = మిక్కిలియుకోపము నొందుచు; మృగశాబాక్షీం=జింకపిల్ల కన్నులవంటికన్నులుగల సీతాదేవిని; మహోల్కాః = క్రూరగ్రహములు; రోహిణీమివ=రోహిణీదేవినివలె; అభ్యధావత్ =తఱిమెను.

ఆశూర్పణఖయిట్లుచెప్పి కన్నులు కొఱవులుంబోలె భయంకరంబులయి గ్రాలఁ, బరమకుపితయయి, క్రూరగ్రహములు రోహిణిందఱుమునట్లు, సీతాదేవిందఱిమెను.

అని, తాత్పర్యము.

తాం మృత్యుపాశప్రతిమా మాపతంతీం మహాబలః
నిగృహ్య రామః కుపిత స్తతో లక్ష్మణ మబ్రవీత్. ౧౮

టీక॥ మహాబలః= అధికమయినబలముగల; రామః = రాముఁడు; కుపితః=కోపమునొందినవాఁడై; ఆపతంతీం = వచ్చుచున్న; మృత్యుపాశప్రతిమాం= మృత్యుపాశముతోఁబోలికగల; తాం=ఆశూర్పణఖను; నిగృహ్య= నిగ్రహించి; తతః = అంత; లక్ష్మణం= లక్ష్మణునిగూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

మహాబలశాలియగు రాముండు, మృత్యుపాశంబువలె నతిభయంకరయయి వచ్చుచున్న యాశూర్పణఖంజూచి, కుపితుండై, యదల్చి, లక్ష్మణుం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

క్రూరై రనార్యై స్సౌమిత్రే పరిహాసః కథంచన

న కార్యః పశ్య వైదేహీం కథంచి త్సౌమ్య జీవతీమ్. ౧౯

టీక॥ సౌమ్య = తిన్ననివాఁడవగు; సౌమిత్రే = లక్ష్మణుఁడా! అనార్యైః = దుష్టులగు; క్రూరైః = క్రూరజనులతోఁ గూడ, పరిహాసః = ఎగతాళి, కథంచన = ఎట్లైనను, నకార్యః = చేయఁదగినది కాదు. కథంచిత్ = ఎట్లయినను; వైదేహీం = సీతాదేవిని, జీవతీం = బ్రతుకు దానిఁగా; పశ్య = చూడుము.

సౌమ్యుండవగు లక్ష్మణుఁడా! దుష్టులును క్రూరులు నగువారలతో నెంతమాత్రము పరిహాసమాడరాదు; ఇప్పుడు, సీత బ్రతికియుండునట్లు చూచుకొనుము. అని, తాత్పర్యము.

ఇమాం విరూపా మసతీ మతిమత్తాం మహోదరీమ్
రాక్షసీం పురుషవ్యాఘ్ర విరూపయితు మర్హసి. ౨౦

టీక॥ పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! విరూపాం = వికృతరూపముగలదియు; అసతీం = దుష్టురాలును; అతిమత్తాం = మిక్కిలియు మదించినదియు; మహోదరీం = పెద్దకడుపు గలదియునగు; ఇమాం = ఈ; రాక్షసీం = రాక్షసస్త్రీని; విరూపయితుం = విరూపగాఁ జేయుటకు; అర్హసి = తగుదువు.

పురుషశ్రేష్ఠుండవగు లక్ష్మణుఁడా! వికృతాకారయును దుష్టురాలును మిక్కిలియు మదించియున్నదియు మహోదరియునగు నీశూర్పణఖను అంగవిహీనఁగాఁ జేయుము. అని, రాముండు, లక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్తో లక్ష్మణ స్తస్యాః క్రుద్ధో రామస్య పార్శ్వతః
ఉద్ధృత్య ఖడ్గం చిచ్ఛేద కర్ణనాసం మహాబలః. ౨౧

టీక॥ మహాబలః = అధికమయినబలముగల; లక్ష్మణః = లక్ష్మణుఁడు; ఇతి = ఇట్లు; ఉక్తః = చెప్పఁబడినవాఁడై; క్రుద్ధః = కోపించినవాఁడై; రామస్య = రామునియొక్క; పార్శ్వతః = ప్రక్కనుండి; ఖడ్గం = కత్తిని; ఉద్ధృత్య = ఎత్తి;

తస్యాః=ఆశూర్పణఖయొక్క ;కర్ణ నాసం=చెవులనుముక్కును;చిచ్ఛేద= కోసెను.

మహాబలుండగులక్ష్మణుండు, రాముని మాటను విని, క్రుద్ధుండై రాముని పార్శ్వంబున నున్న ఖడ్గంబు దీసి, యా శూర్పణఖ ముక్కుం జెవులను ఛేదించెను. అని, తాత్పర్యము.

నికృత్త కర్ణనాసా తు విస్వరం సా వినద్య చ
యథాగతం ప్రదుద్రావ ఘోరా శూర్పణఖా వనమ్. ౨౨

టీక॥ఘోరా = భయంకరయగు; సా=ఆ;శూర్పణఖా= శూర్పణఖ; నికృత్తకర్ణనాసాతు = ఛేదింపఁబడిన చెవులును ముక్కును గలదైనంతనె;విస్వరం = వికృతస్వరము గలుగునట్లుగా;వినద్యచ = అఱచియు;యథాగతం=వచ్చినట్లుగా;వనం = అడవినిగూర్చి;ప్రదుద్రావ = పరుగెత్తెను.

భయంకరాకారయగు శూర్పణఖ, తన ముక్కుఁజెవులను ఛేదించినంతట, వికృతస్వరముగా నఱచి, వచ్చిన దారిఁబట్టి, యడవికిఁబరుగెత్తిపోయెను. అని, తాత్పర్యము.

సా విరూపా మహాఘోరా రాక్షసీ శోణితోక్షితా
ననాద వివిధా న్నాదాన్ యథా ప్రావృషి తోయదః. ౨౩

టీక॥మహాఘోరా=మిక్కిలియుభయంకరయయిన;సా=ఆ ; రాక్షసీ= శూర్పణఖ;విరూపా = వికృతరూపముగలదై; శోణితోక్షితా= నెత్తురుచేఁదడుపఁబడినదై;ప్రావృషి=వర్షాకాలమునందు;తోయదఇవ= మేఘము వలె;వివిధాన్= నానావిధములయిన; నాదాన్=ధ్వనులను;ననాద= అఱచెను.చేసెననుట.

అతిభయంకరాకారయగు నాశూర్పణఖ, అట్లు విరూపగాఁ జేయఁబడి, నెత్తురు వెల్లువలుగాఁ గాఱ, వర్షాకాలమున మేఘముంబోలె, నానావిధంబుగా, నఱచెను. అని, తాత్పర్యము.

సా విక్షరంతీ రుధిరం బహుధా ఘోరదర్శనా

స ౧౮

ప్రగృహ్య బాహూ గర్జంతీ ప్రవివేశ మహావనమ్. ౨౪

టీక॥ ఘోరదర్శనా = భయంకరమయినచూచుటగల; సా = ఆశూర్పణఖ; రుధిరం = నెత్తురును; విక్షరంతీ = కారుచు; బాహూ = చేతులను; ప్రగృహ్య = పట్టుకొని; గర్జంతీ = అఱచుచు; మహావనం = పెద్దయడవిని; ప్రవివేశ = ప్రవేశించెను.

చూపరులకు భయంబుగలిగించునట్టియాశూర్పణఖ, నెత్తురుగాఱ, జేతులంబట్టుకొని, నానావిధంబులరోదనంబు సేయుచు, మహారణ్యంబుఁజొచ్చెను. అని, తాత్పర్యము.

తతస్తు సా రాక్షససంఘసంవృతం
ఖరం జనస్థానగతం విరూపితా
ఉపేత్య తం భ్రాతర ముగ్రదర్శనం
పపాత భూమౌ గగనా ద్యథాఽశనిః. ౨౫

టీక॥ తతస్తు = అంతను; విరూపితా = విరూపగాఁజేయఁబడిన; సా = ఆశూర్పణఖ; జనస్థానగతం = జనస్థానమునుబొందినవాఁడును; ఉగ్రదర్శనం = భయంకరమయిన చూచుటగలవాఁడును; భ్రాతరం = తోఁబుట్టువునగు; తం = ఆ; ఖరం = ఖరుని; ఉపేత్య = పొంది; గగనాత్ = ఆకాశముననుండి, అశనిర్యథా = పిడుగువలె; భూమౌ = నేలయందు; పపాత = పడెను.

అంత, నట్లువిరూపితయయినశూర్పణఖ, జనస్థానంబునఁ బెక్కురాక్షసులంగూడియున్న భయంకరాకారుండగుతనసోదరుఖరుంజేరి, దుఃఖావేశంబున, నాకాశంబుననుండిపిడుగుపడునట్లు, నేలంబడెను.

అని, తాత్పర్యము.

తత స్సభార్యం భయమోహమూర్ఛితా
సలక్ష్మణం రాఘవ మాగతం వనమ్
విరూపిణం చాత్మని శోణితోక్షితా
శశంస సర్వం భగినీ ఖరస్యసా. ౨౬

స ౧౮

టీక॥తతః=అంత;ఖరస్య = ఖరుని యొక్క;భగినీ=తోఁబుట్టువగు;సా=ఆ శూర్పణఖ;భయమోహమూర్ఛితా= భయముచేతను మోహముచేతను వ్యాపింపఁబడినదై;శోణితోక్షితా=నెత్తురు చేఁదడుపఁబడినదై;సభార్యం= భార్యతోఁగూడినవాఁడును;సలక్ష్మణం = లక్ష్మణునితోఁగూడినవాఁడునగు; రాఘవం=రాముని;వనం=అడవిని;ఆగతం= పొందినవానిఁగాను;ఆత్మని= తనయందు;విరూపణంచ=విరూపగాఁ జేయుటను;సర్వం=సమస్తమును; శశంస= చెప్పెను.

అంత, నాశూర్పణఖ, భయమోహంబులు పెనంగొన, నెత్తురు వెల్లువలుగాఁగాఅ, రాముండు సీతాలక్ష్మణులతోఁగూడవనంబునకువచ్చుటయుఁదన్ను విరూపంజేయుటయు మొదలుగా సమాచారమంతయు, ఖరునకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే, అష్టాదశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండాష్టాదశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

# ఏకోనవింశసర్గప్రారంభః.

తాం తథా పతితాం దృష్ట్వా విరూపాం శోణితోక్షితామ్
భగినీం క్రోధసంతప్తః ఖరః పప్రచ్ఛ రాక్షసః. ౧

టీక॥ ఖరః=ఖరుఁడను; రాక్షసః=రాక్షసుఁడు;విరూపాం = వికృతరూపముగలదియు;శోణితోక్షితాం=నెత్తురుచేఁ దడుపఁబడినదియు ; తథా=అట్లు; పతితాం = పడినదియునగు; తాం=ఆ;భగినీం = తోఁబుట్టువును; దృష్ట్వా= చూచి ; క్రోధసంతప్తః=కోపముచే మిక్కిలియుఁ దపింపఁ జేయఁబడినవాఁడై;పప్రచ్ఛ=అడిగెను.

అంత, ఖరుండు, అట్లు విరూపితయు నెత్తురుచేఁదడుపఁబడినదై నేలం బడియున్న తనతోఁబుట్టు శూర్పణఖం జూచి, పరమకుపితుండై యిట్లనియడిగెను. అని, తాత్పర్యము.

ఉత్తిష్ఠ తావ దాఖ్యాహి ప్రమోహం జహి సంభ్రమమ్
వ్యక్త మాఖ్యాహి కేన త్వ మేవంరూపా విరూపితా. ౨

టీక॥ఉత్తిష్ఠ= లెమ్ము;తావత్ =అంతయు;ఆఖ్యాహి=చెప్పుము . ప్రమోహం=మోహమును;సంభ్రమం=తొట్రుపాటును; జహి=విడువుము . కేన=ఎవ్వనిచేత;త్వం=నీవు; ఏవంరూపా=ఇట్టిదానవుగా;విరూపితా = విరూపగాఁజేయఁబడినావు ? వ్యక్తం=స్పష్టముగా;ఆఖ్యాహి=చెప్పుము.

లెమ్ము; సంగతినంతయుఁ జెప్పుము; మోహసంభ్రమంబులవిడువుము ; ఎవ్వాఁడునిన్నిట్లు విరూపగాఁజేసెను? స్పష్టముగాఁ జెప్పుము. అని, తాత్పర్యము.

కః కృష్ణసర్ప మాసీన మాశీవిష మనాగసమ్
తుద త్యభిసమాపన్న మంగుళ్యగ్రేణ లీలయా. ౩

టీక॥కః =ఎవ్వఁడు; ఆసీనం= కూర్చుండియున్నదియు; ఆశీవిషం= కోఱలయందువిషముగలదియు; అభి సమాపన్నం=ఎదురుగావచ్చినదియు; అనా

గసం=అపరాధములేనిదియునగు; కృష్ణసర్పం=కృష్ణసర్పమును; లీలయా=విలాసము చేత; అంగుళ్యగ్రేణ=వ్రేలికొనచేత; తుదతి=హింసించుచున్నాఁడు? ఎవ్వఁడు, తనజోలికి రాకతనంతట నూరకకూర్చుండియున్న కృష్ణసర్పమును, విలాసార్థము వ్రేలిచేఁ గొట్టుచున్నాఁడు? అని, తాత్పర్యము.

కః కాలపాశ మాసజ్య కంఠే మోహా న్నజానతే
యస్త్వాం మద్య సమాసాద్య పీతవా న్విష ముత్తమమ్. ౪

టీక॥ కః=ఎవ్వఁడు; కంఠే=కంఠమునందు; మోహాత్ = అజ్ఞానమువలన; కాలపాశం=మృత్యుపాశమును; ఆసజ్య=బంధించుకొని; నజానతే (నజానీతే)=తెలిసికొనకున్నాఁడు? యః = ఎవ్వఁడు; అద్య=ఇప్పుడు; త్వాం= నిన్ను; సమాసాద్య=పొంది; ఉత్తమం= శ్రేష్ఠమయిన; విషం=విషమును ; పీతవాన్ =త్రాగినాఁడు?
ఎవ్వఁడు , మోహంబునఁగంఠమునందు మృత్యుపాశంబుఁదగిలించుకొని, తెలిసికొనకున్నాఁడు? ఎవ్వఁడు, నిన్నుఁ దాఁకి, మహావేగంబగువిషంబు ద్రావినాఁడు? అని, తాత్పర్యము.

బలవిక్రమసంపన్నా కామగా కామరూపిణీ
ఇమా మవస్థాం నీతా త్వం కేనాంతకసమా గతా. ౫

టీక॥ బలవిక్రమసంపన్నా = బలముతోను బరాక్రమముతోను గూడినదానవును; కామగా = ఇచ్చకువచ్చినట్లుపోవుదానవును ; కామరూపిణీ= ఇచ్ఛాధీనమగురూపము గలదానవును; అంతకసమా = మృత్యువుతో సరియైనదానవునగు; త్వం= నీవు; గతా= పోయినదానవై; కేన = ఎవ్వనిచేత, ఇమాం=ఈ; అవస్థాం = అవస్థను; నీతా=పొందింపఁబడినావు?
బలపరాక్రమంబులతోఁ గూడినదానవును గామగమనముగలదానవును గామరూపిణివి మృత్యుసమానవునగు నీవు ఎవ్వఁడిట్టిదురవస్థగావించినాఁడు.
అని, తాత్పర్యము.

దేవగంధర్వభూతానా మృషీణాంచ మహాత్మనామ్

కోయమేవం విరూపాం త్వాం మహావీర్య శ్చకార హ. ౬

టీక॥ దేవగంధర్వభూతానాం= దేవతలలోను గంధర్వులలోనుభూతములలోను;మహాత్మనాం= పూజ్యమయినస్వభావముగల; ఋషీణాంచ= ఋషులలోను;మహావీర్యః = అధికమయినపరాక్రమముగల;అయం = ఈ; కః = ఎవ్వఁడు;త్వాం = నిన్ను;ఏవం=ఇట్లు;విరూపాం = వికృతమయినరూపముగలదానిఁగా;చకార = చేసెను ? "హ" అనునదిపాదపూరణార్థము.

దేవతలలోఁగాని గంధర్వులలోఁగానిభూతంబులలోఁగాని మహాత్ములగుఋషులలోఁగాని యెవ్వఁడు మహాపరాక్రమశాలి, నిన్నిట్లువిరూపఁగావించెను? అని, తాత్పర్యము.

నహి పశ్యామ్యహం లోకే యః కుర్యా న్మమ విప్రియమ్
అమరేషు సహస్రాక్షం మహేంద్రం పాకశాసనమ్. ౭

టీక॥ యః=ఎవ్వఁడు; లోకే=లోకమునందు, మమ=నాకు; విప్రియం= అపకారమును; కుర్యాత్=చేయునో; అమరేషు=దేవతలయందు ; తం(అధ్యాహృతము)=అట్టి; సహస్రాక్షం= వేయికన్నులుగల; పాకశాసనం=పాకుఁడను రాక్షసునివధించినవాఁడునగు; మహేంద్రం=దేవేంద్రుని ; నపశ్యామిహి=చూడనుగదా!

లోకంబున,సహస్రాక్షుండునుబాకాసురుంజంపినవాఁడునగు దేవేంద్రుండునుఁగూడ , నాకపకారంబుసేయఁజాలఁడు. అని, తాత్పర్యము.

అద్యాహం మార్గణైః ప్రాణా నాదాస్యే జీవితాంతకైః
సలిలే క్షీర మాసక్తం నిష్పిబన్నివ సారసః. ౮

టీక॥ అద్య=ఇప్పుడు; అహం= నేను; జీవితాంతకైః=ప్రాణముల నశింపఁజేయునట్టి; మార్గణైః= బాణములచేత; కస్య (అధ్యాహృతము)= ఎవ్వనియొక్క; ప్రాణాన్= ప్రాణములను;సలిలే=నీటియందు; ఆసక్తం=క

లసిన; క్షీరం = పాలను; నిష్పిబన్= త్రాఁగునట్టి; సారసఇవ= హంసపక్షి వలె; ఆదాస్యే= గ్రహింతును?

హంసపక్షినీటంగలసినపాలనుద్రావునట్లు, నేనిప్పుడు, ప్రాణాంతకరంబులగుబాణంబుల, నెవ్వని ప్రాణంబులంగొనవలయు? అని, తాత్పర్యము,

నిహతస్య మయా సంఖ్యే శరసంకృత్తమర్మణః
సఫేనం రుధిరం రక్తం మేదినీ కస్య పాస్యతి. ౯

టీక॥ పత్రరథాః= పక్షులు ; సంగతాః= గుంపులుగూడినవై ; ప్రహృష్టాః= సంతసించినవై ; రణే= యుద్ధమునందు; మయా= నాచేత; నిహతస్య= వధింపఁబడిన; కస్య= ఎవ్వనియొక్క ; కాయాత్ = దేహమునుండి; మాంసం= మాంసమును; ఉత్కృత్య= పెఱికి; భక్షయిష్యంతి= తినఁగలవు?

ఎవ్వండుయుద్ధంబుననాచేత నిహతుండగుడు, పక్షులు , సంతోషంబునగుంపులుగూడియతనిదేహంబుననుండి మాంసమునుభక్షింపఁగలవు?

అని, తాత్పర్యము.

కస్య పత్రరథాః కాయా న్మాంస ముత్కృత్య సంగతాః
ప్రహృష్టా భక్షయిష్యంతి నిహతస్య మయా రణే. ౧౦

టీక॥ సంఖ్యే= యుద్ధమునందు; మయా= నాచేత; నిహతస్య= వధింపఁబడినవాఁడును; శరసంకృత్తమర్మణః= బాణములచేత ఛేదింపఁబడిన మర్మస్థానములుగలవాఁడునగు; కస్య = ఎవ్వనియొక్క ; సఫేనం = నురుఁగుతోఁ గూడిన; రక్తం= ఎఱ్ఱని; రుధిరం= నెత్తురును; మేదినీ= భూమి; పాస్యతి= త్రాఁగఁగలదు?

ఎవ్వండు , యుద్ధంబుననాబాణంబుల ఛిన్నమర్ముండై హతుండగుచు, నురుఁగుతోఁ గూడియెఱ్ఱనైయుండు నతనిరక్తంబునుభూమిద్రావఁగలదు?

అని, తాత్పర్యము.

తం న దేవా న గంధర్వా న పిశాచా న రాక్షసాః

మయాఽపకృష్టం కృపణం శక్తా స్త్రాతు మిహాహవే. ౧౧

టీక॥ ఇహ = ఇప్పుడు; మయా = నాచేత; ఆహవే = యుద్ధమునందు, అపకృష్టం = ఈడ్వఁబడినట్టి; కృపణం = శోచనీయుండగు; తం = అతని; త్రాతుం = రక్షించుటకు; దేవాః = దేవతలు; నశక్తాః = సమర్థులు కారు గంధర్వాః = గంధర్వులు; న (శక్తాః) = సమర్థులు కారు. పిశాచాః = పిశాచములు; న (శక్తాః) = సమర్థులు కారు. రాక్షసాః = రాక్షసులు; న (శక్తాః) = సమర్థులు కారు.

నేనిప్పుడతనియుద్ధంబున కీడ్వఁగా, దేవతలుగానిగంధర్వులుగాని పిశాచములుగాని రాక్షసులుగాని యతనిరక్షింపఁజాలరు. అని, తాత్పర్యము.

ఉపలభ్య శనై స్సంజ్ఞాం తం మే శంసితు మర్హసి
యేన త్వం దుర్వినీతేన వనే విక్రమ్య నిర్జితా. ౧౨

టీక॥ దుర్వినీతేన = దుష్టుండగు; యేన = ఎవ్వనిచేత, త్వం = నీవు; వనే = అడవియందు; విక్రమ్య = పరాక్రమించి; నిర్జితా = జయింపఁబడినావో, శనైః = మెల్లఁగా; సంజ్ఞాం = తెలివిని; ఉపలభ్య = పొంది; తం = అతని; మే = నాకొఱకు ; శంసితుం = చెప్పుటకు; అర్హసి = తగుదువు.

ఏదుష్టుండు, పరాక్రమ గర్వంబున, నిన్నిట్లుగావించిననాఁడో , నీవుతిన్నఁగాఁ, దెలివిఁదెచ్చుకొని, యతనినాకుం జెప్పుము. అని, ఖరుండు, శూర్పణఖతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇతి భ్రాతు ర్వచ శ్శ్రుత్వా క్రుద్ధస్యచ విశేషతః
తత శ్శూర్పణఖా వాక్యం సబాష్ప మిద మబ్రవీత్. ౧౩

టీక॥ శూర్పణఖా = శూర్పణఖ, ఇతి = ఇట్లు; విశేషతః = విశేషించి ; క్రుద్ధస్య = కోపమునొందిన, భ్రాతుః = తోఁబుట్టువుయొక్క ; వచః = మాటను; శ్రుత్వాచ = విని యు; తతః = అంత ; సబాష్పం = కన్నీళ్లతోఁగూడునట్లుగా ; ఇదం = ఈ; వాక్యం = మాటను ; అబ్రవీత్ = చెప్పెను.

శూర్పణఖ పరమకుపితుండగుఖరుఁడు చెప్పినమాటనువిని , యంతఁగన్నులంగన్నీళ్లుగాఱ,నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ
పుండరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ. ౧౪
ఫలమూలాశనౌ దాంతౌ తాపసౌ ధర్మచారిణౌ
పుత్రౌ దశరధస్యాస్తాం భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౧౫

టీక॥ తరుణౌ= యౌవనవంతులును; రూపసంపన్నౌ = సౌందర్యముతోఁగూడినవారలును ; సుకుమారౌ= మృదువయిన దేహము గలవారలును; మహాబలౌ = అధికమయినబలముగల వారలును;పుండరీకవిశాలాక్షౌ= తెల్లదామరపూలువలెవెడల్పులయిన కన్నులుగలవారలును ; చీరకృష్ణాజినాంబరౌ = నారచీరలునుజింకతోలునువస్త్రములుగాఁగలవారలును; ఫలమూలాశనౌ=పండ్లునుగడ్డలును ఆహారముగాఁగలవారలును;దాంతౌ = ఇంద్రియనిగ్రహముగలవారలును;తాపసౌ= తపస్వులును; ధర్మచారిణౌ = ధర్మమునాచరించువారలును ; దశరధస్య = దశరధునియొక్క; పుత్రౌ= కొడుకులును;భ్రాతరౌ= అన్నదమ్ములనగు;రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు;ఆస్తాం=ఉండిరి.

యౌవన సంపన్నులును సౌందర్యవంతులునుసుకుమారశరీరులును మహాబలశాలులును బుండరీకంబులవంటి వెడఁదకన్నులుగలవారలును నారచీరలునుగృష్ణాజినంబును గట్టుకొన్నవారలును ఫలమూలంబుల నాహారంబుగాఁగొనువారలును జితేంద్రియులును దాపసులును ధార్మికులునగు దశరథమహారాజ కుమారులు రామలక్ష్మణులనువారలన్నదమ్ములిద్దఱు వనంబుననుండిరి. అని, తాత్పర్యము.

గంధర్వరాజప్రతిమౌ పార్థివవ్యంజనాన్వితౌ
దేవౌవా మానుషౌవాతౌ నతర్కయితు ముత్సహే. ౧౬

టీక॥గంధర్వరాజప్రతిమౌ= గంధర్వరాజుతోఁబోలిక-గలవారలును; పార్థివవ్యంజనాన్వితౌ= రాజచిహ్నములతోఁగూడినవారలునగు; తౌ= ఆరామలక్ష్మణులను; దేవౌవా= దేవతలనుగాఁగాని;మానుషౌవా= మనుష్యులనుగాఁగాని; తర్కయితుం=నిశ్చయించుటకు; నోత్సహే=ఉత్సహింపను.

ఆరామలక్ష్మణులు, గంధర్వ రాజ సమానులు గాను రాజ చిహ్నంబులతోఁగూడినవారలుగానునున్నారు; వారలు దేవతలో మనుష్యులో నాకుఁ దెలియకున్నది. అని, తాత్పర్యము.

తరుణీ రూపసంపన్నా సర్వాభరణభూషితా
దృష్టా తత్ర మయా నారీ తయో ర్మధ్యే సుమధ్యమా. ౧౭

టీక॥తరుణీ = యౌవనము గలదియు;రూపసంపన్నా = సౌందర్యముతోఁగూడినదియు; సర్వాభరణభూషితా=సమస్తములయినసొమ్ములచే నలంకరింపఁబడినదియు;సుమధ్యమా = సుందరమయిన నడుముగలదియునగు; నారీ=స్త్రీ;తత్ర=అచ్చట;తయోః = ఆరామలక్ష్మణులయొక్క; మధ్యే= నడుమునందు; మయా=నాచేత ; దృష్టా=చూడఁబడినది.

యౌవనవంతురాలును సుందరాంగియు సమస్త భూషణంబులను దాల్చియున్నదియు సుందరమయిన నడుము గలదియునగు , నొకవనిత, వారియిద్దఱినడుమనుండఁగంటిని.

అని, తాత్పర్యము.

తాభ్యా ముభాభ్యాం సంభూయ ప్రమదా మధికృత్య తామ్
ఇమా మవస్థాం నీతాఽహం యథాఽ నాథా సతీ తథా. ౧౮

టీక॥ తాం=ఆ;ప్రమదాం= స్త్రీని;అధికృత్య=నిమిత్తముగాఁజేసి; తాభ్యాం=ఆ;ఉభాభ్యాం = ఇద్దఱిచేతను;సంభూయ=ఒకటియయి;అహం=నేను;అనాథాసతీ= నాథుఁడులేనిదాననగుచు;యథా=ఎట్లో;తథా = అట్లు;ఇమాం=ఈ;అవస్థాం= అవస్థను; నీతా=పొందింపఁబడినాను.

ఆస్త్రీనిమిత్తముగా వారలిద్దఱును జేరి,నన్ను , అనాథనుంబోలె నిట్టియ

వస్థనుబొందించినారు. అని, తాత్పర్యము.

తస్యాశ్చ నృతవృత్తాయా స్తయోశ్చ హతయో రహమ్
సఫేనం పాతు మిచ్ఛామి రుధిరం రణమూర్ధని. ౧౯

టీక॥ అహం=నేను; రణమూర్ధని = యుద్ధాగ్రమునందు ; అనృజువృత్తాయాః= కుటిలమయినయాచారము గల; తస్యాశ్చ = ఆస్త్రీయొక్కయు; హతయోః = వధింపఁబడిన; తయోశ్చ = ఆరామలక్ష్మణులయొక్కయు; సఫేనం = నురుఁగుతోఁగూడిన; రుధిరం=నెత్తురును; పాతుం = త్రాఁగుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను.

యుద్ధాగ్రంబున, హతులయిన యారామలక్ష్మణుల యొక్కయు నావనిత యొక్కయు, నెత్తురునునురుఁగుతోఁగూడఁద్రావంగోరెదను.

అని, తాత్పర్యము.

ఏష మే ప్రథమః కామః కృత స్తాత త్వయా భవేత్
తస్యా స్తయోశ్చ రుధిరం పిబేయ మహ మాహవే. ౨౦

టీక॥ తాత=నాయనా! అహం=నేను; ఆహవే = యుద్ధమునందు ; తస్యాః = అసీతయొక్కయు ; తయోశ్చ= ఆరామలక్ష్మణులయొక్కయు ; రుధిరం=నెత్తురును; పిబేయం= త్రాఁగవలయును. ప్రథమః=ముఖ్యమగు ; ఏషః=ఈ; మే=నాయొక్క;కామః = కోరిక; త్వయా=నీచేత; కృతః= చేయఁబడినది; భవేత్ = కావలయును.

నాయనా! నేనుయుద్ధంబుననామువ్వురినెత్తురుంద్రావవలయును ; ఇది నామొదటికోరిక; దీనినినీవు గావింపవలయును.' అని,శూర్పణఖఖరునితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

ఇతి తస్యాం బ్రువాణాయాం చతుర్దశ మహాబలాన్
వ్యాదిదేశ ఖరః క్రుద్ధో రాక్షసా నంతకోపమాన్. ౨౧

టీక॥ తస్యాం=ఆశూర్పణఖ ; ఇతి= ఇట్లు; బ్రువాణాయాం=చెప్పుచుండఁగా; ఖరః=ఖరుఁడు; క్రుద్ధః= కోపించినవాఁడై; అంతకోపమాన్=యము

నితోఁబోలినగల; మహాబలాన్ = అధికమయినబలముగల; రాక్షసాన్ = రాక్షసులను; చతుర్దశ = పదునల్వురను; వ్యాదిదేశ = ఆజ్ఞాపించెను.

ఇట్లాశూర్పణఖ చెప్పుచుండఁగా, ఖరుండుకోపించి, మహాబలశాలులనంతకతుల్యులఁ బదునల్వుర రాక్షసులం జూచి, యిట్లని, యాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

మానుషౌ శస్త్రసంపన్నౌ చీరకృష్ణాజినాంబరౌ
ప్రవిష్టౌ దండకారణ్యం ఘోరం ప్రమదయా సహ. ౨౨

టీక॥ శస్త్రసంపన్నౌ = ఆయుధముతోఁగూడినవారలును; చీరకృష్ణాజినాంబరౌ = నారచీరలును కృష్ణాజినంబునువస్త్రములుగాఁ గలవారలునగు, మానుషౌ = మనుష్యులు; ప్రమదయా సహ = స్త్రీతోఁగూడ; ఘోరం = భయంకరమయిన; దండకారణ్యం = దండకారణ్యమును; ప్రవిష్టౌ = ప్రవేశించిరి.

ఇద్దఱుమనుష్యులునారచీరలను కృష్ణాజినంబునుగట్టుకొని యాయుధధారులయి, ఒకస్త్రీని వెంటఁదీసికొని, భయంకరమగుదండకారణ్యంబునకు వచ్చిరి. అని, తాత్పర్యము.

తౌ హత్వా తాంచ దుర్వృత్తా మపావర్తితు మర్హథ
ఇయంచ రుధిరం తేషాం భగినీ మమ పాస్యతి. ౨౩

టీక॥ తౌ = ఆరామలక్ష్మణులను; దుర్వృత్తాం = దురాచారముగల; తాంచ = ఆస్త్రీని; హత్వా = వధించి; అపావర్తితుం = మరలుటకు; అర్హథ = తగుదురు. ఇయం = ఈ; మమ = నాయొక్క; భగినీచ = తోఁబుట్టువును; తేషాం = వారలయొక్క; రుధిరం = నెత్తురును; పాస్యతి = త్రాఁగఁగలదు.

వారలనిద్దఱును దురాచారయగు నావనితనువధించిరండు; నాభగినియగు నీశూర్పణఖవారలనెత్తురుం ద్రావును. అని, తాత్పర్యము.

మనోరథోఽయ మిష్టోఽస్యా భగిన్యా మమ రాక్షసాః

శీఘ్రం సంపాద్యతాం తౌచ ప్రమథ్య స్వేన తేజసా. ౨౫

టీక॥ రాక్షసాః= రాక్షసులారా! మమ=నాయొక్క; అస్యాః= ఈ; భగిన్యాః = తోడఁబుట్టినదానియొక్క, ఇష్టః=కోరఁబడిన; అయం = ఈ; మనోరథః=కోర్కె; స్వేన = మీదైన; తేజసా=పరాక్రమముచేత; తౌచ= ఆ రామలక్ష్మణులను (చకారముచేత) సీతను; ప్రమథ్య=వధించి, శీఘ్రం= శీఘ్రముగా; సంపాద్యతాం = సంపాదింపఁబడుఁగాక.

రాక్షసులారా! మీరలుమీపరాక్రమంబున, నాసీతారామలక్ష్మణులం జంపి, నాతోడఁబుట్టినదాని కోరికను, సిద్ధించునట్లుగావింపుఁడు. అని, ఖరుండాపదునలువురి రాక్షసుల కాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

ఇతి ప్రతి సమాదిష్టా రాక్షసా స్తే చతుర్దశ
తత్ర జగ్ము స్తయా సార్థం ఘనా వాతేరితా యథా. ౨౬

టీక॥ తే=ఆ; రాక్షసాః= రాక్షసులు; చతుర్దశ= పదునలువురు; ఇతి=ఇట్లు; ప్రతిసమాదిష్టాః=ఆజ్ఞాపింపఁబడినవారలయి; వాతేరితాః=వాయువుచేఁ బ్రేరింపఁబడిన; ఘనాః యథా=మేఘంబులుంబోలె; తయా సార్థం=ఆశూర్పణఖతోఁగూడ; తత్ర= ఆరామాశ్రమమునకు; జగ్ముః = పోయిరి.

అంతనాపదునలువురు రాక్షసులు, ఖరునియాజ్ఞనుశిరసావహించి, వాయువేగచోదితంబులగు మేఘంబులకైవడి, నతివేగంబున, నాశూర్పణఖతోఁగూడ, రామునియాశ్రమంబునకుఁ బోయిరి. అని, తాత్పర్యము.

తతస్తు తే తం సముదగ్ర తేజసం
తథాపి తీక్ష్ణప్రదరా నిశాచరాః
న శేకు రేనం సహసా ప్రమర్దితుం
వనద్విపా దీప్త మివాగ్ని ముత్థితమ్. ౨౭

టీక॥ తతస్తు=అంతను; తథా= అట్లు; తీక్ష్ణప్రదరాఅపి=కఱకుబాణములుగలవారలయ్యు; తే = ఆ; నిశాచరాః=రాక్షసులు; సముదగ్రతేజసం= మిక్కిలియియున్నతమయినకాంతిగల ; ఉత్థితం=లేచిన; తం=ఆ; ఏనం= ఈ రామునిః వనద్విపాః = అడవియేనుంగులు; దీప్తం=మండుచున్న ; అగ్నిమివ=నిప్పునువలె; సహసా=శీఘ్రమున; ప్రమర్దితుం=కొట్టుటకు; న శేకుః = చాలరైరి.

అంత, నారాక్షసులుకఱకుబాణంబులుచేతంగలవారలయ్యు, మహాతేజుండునుదమ్ముఁజూచి యెదురొత్తున్నవాఁడునగురామునింజూచి, నడవియేనుంగులుమండుచున్నకార్చిచ్చుంజూచిభయపడునట్లు, వెఱఁగంది , ప్రహరింపం జాలకయూరకుండిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
ఆరణ్యకాండే, ఏకోనవింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండైకోనవింశసర్గటీక,
ముగిసినది.



శ్రీ

వింశసర్గ ప్రారంభః.

తత శ్శూర్పణఖా ఘోరా రాఘవాశ్రమ మాగతా
రక్షసా మాచచక్షే తౌ భ్రాతరౌ సహ సీతయా. ౧

టీక॥ తతః = అంత; ఘోరా = భయంకరయగు; శూర్పణఖా = శూర్పణఖ; రాఘవాశ్రమం = రామునియాశ్రమమును; ఆగతా = పొందినదై; సీతయా సహ = సీతతోఁగూడ; తౌ = ఆ; భ్రాతరౌ = అన్నదమ్ములను; రక్షసాం = రాక్షసులకు; ఆచచక్షే = చెప్పెను.

అంత, భయంకరాకారయగు శూర్పణఖ, రాముని యాశ్రమంబునకు వచ్చి, సీతారామలక్ష్మణులను, ఆ రాక్షసులకుంజూపెను. అని, తాత్పర్యము.

తే రామం పర్ణశాలాయా ముపవిష్టం మహాబలమ్
దదృశు స్సీతయా సార్థం వైదేహ్యా లక్ష్మణేనచ. ౨

టీక॥ తే = ఆ రాక్షసులు; మహాబలం = అధికమయినబలముగలవాఁడును; వైదేహ్యా = విదేహరాజుపుత్రియగు; సీతయా = సీతతోను; లక్ష్మణేన చ సార్థం = లక్ష్మణునితోనుంగూడ; పర్ణశాలాయాం = పర్ణశాలయందు; ఉపవిష్టం = కూర్చుండియున్నవాఁడునగు; రామం = రాముని; దదృశుః = చూచిరి.

ఆ రాక్షసులు, పర్ణశాలయందు, జనకమహారాజపుత్రియగుసీతతోను లక్ష్మణునితోనుంగూడఁ గూర్చుండియున్నమహాబలుండగురాముంజూచిరి.

అని, తాత్పర్యము.

తాన్ దృష్ట్వా రాఘవ శ్శ్రీమా నాగతాన్ తాంచ రాక్షసీమ్
అబ్రవీ ద్భ్రాతరం రామో లక్ష్మణం దీప్తతేజసమ్. ౩

టీక॥శ్రీమాన్= కాంతిమంతుండును; రాఘవః= రఘువంశమునంబుట్టినవాఁడునగు; రామః=రాముఁడు ; ఆగతాన్=వచ్చిన;తాన్ = ఆరాక్షసులను; తాం=ఆ; రాక్షసీంచ = శూర్పణఖను;దృష్ట్వా=చూచి ; దీప్తతేజసం=జ్వలించుచున్నకాంతిగల ; భ్రాతరం=తమ్ముఁడైనలక్ష్మణునిగూర్చి ; అబ్రవీత్=చెప్పెను.

శ్రీమంతుండగు రాముండు,ఆపదునలువురు రాక్షసులును శూర్పణఖయు వచ్చుటంజూచి , మహాతేజుండగు తమ్ముండులక్ష్మణునితోనిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

ముహూర్తం భవ సౌమిత్రే సీతాయాః ప్రత్యనంతరః
ఇమా నస్యా వధిష్యామి పదవీ మాగతా నిహ. ౪

టీక॥సౌమిత్రే=లక్ష్మణుఁడా! ముహూర్తం = కొంచెముసేపు; సీతాయాః=సీతయొక్క; ప్రత్యనంతరః=దగ్గి ఱయుండువాఁడవు; భవ=అగుము.అస్యాః=ఈశూర్పణఖయొక్క;పదవీం=మార్గమును; ఆగతాన్= పొందిన, ఇమాన్=ఈ రాక్షసులను; ఇహ= ఇప్పుడు; వధిష్యామి=చంపెదను.

లక్ష్మణుఁడా! నీవుకొంచెముసేపు సీతయొద్దనుండుము; నేనిప్పుడు,ఈశూర్పణఖకుఁగావచ్చిన రాక్షసుల వధించివచ్చెదను- అని రాముండు, లక్ష్మణునితోఁజెప్పెను. అని,తాత్పర్యము.

వాక్య మేత త్తత శ్శ్రుత్వా రామస్య విదితాత్మనః
తథేతి లక్ష్మణో వాక్యం రామస్య ప్రత్యపూజయత్ ౫

టీక॥తతః=అంత; లక్ష్మణః=లక్ష్మణుఁడు; ఏతత్=ఈ, విదితాత్మనః=తెలియఁబడినపరమాత్మ గల ; రామస్య = రామునియొక్క ; వాక్యం = మాటను; శ్రుత్వా=విని; తథేతి= అట్లేయని; రామస్య=రామునియొక్క ; వాక్యం=మాటను;ప్రత్యపూజయత్=గౌరవించెను.

అంత, లక్ష్మణుండు,పరమాత్మ వేత్తయగు రామునిమాటనువిని , అట్లే

స ౨౦

యని, రామునియాజ్ఞ చొప్పునం, బ్రవర్తించెను. అని, తాత్పర్యము.

రాఘవోపి మహ చ్చాపం చామీకరవిభూషితమ్
చకార సజ్యం ధర్మాత్మా తాని రక్షాంసి చాబ్రవీత్. ౬

టీక॥ ధర్మాత్మా = ధర్మస్వభావుండగు; రాఘవోపి = రాముండును; చామీకరవిభూషితం = బంగారముచేస లంకరింపఁబడిన; మహత్ = గొప్పదగు; చాపం = ధనుస్సును; సజ్యం = అల్లెత్రాటితోఁగూడినదానిఁగా; చకార = చేసెను. తాని = ఆ; రక్షాంసిచ = రాక్షసులనుగూర్చియు; అబ్రవీత్ = చెప్పెను.

ధర్మాత్ముండగు రాముండును, గాంచనభూషితంబగు మహాధనువునెక్కుపెట్టి, యారాక్షసులఁజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

పుత్రౌ దశరథస్యావాం భ్రాతరౌ రామలక్ష్మణౌ
ప్రవిష్టౌ సీతయా సార్ధం దుశ్చరం దండకావనమ్. ౭

టీక॥ ఆవాం = మేము; దశరథస్య = దశరథునియొక్క; పుత్రౌ = కొడుకులము. భ్రాతరౌ = అన్నదమ్ములము. రామలక్ష్మణౌ = రామలక్ష్మణులనుపేరుగలవారలము. సీతయాసార్ధం = సీతతోఁగూడ; దుశ్చరం = పొందఁగూడని; దండకావనం = దండకారణ్యమును; ప్రవిష్టౌ = ప్రవేశించినాము.

మేముదశరథమహారాజు కొడుకులము; అన్నదమ్ములము; మాపేరురామలక్ష్మణులు; ఈబిడపేరుసీత; ఈబిడతోఁగూడదుర్గమంబగు నీదండకారణ్యంబునకువచ్చినాము.

అని, తాత్పర్యము.

ఫలమూలాశనౌ దాంతౌ తాపసౌ ధర్మచారిణౌ
వసంతౌ దండకారణ్యే కిమర్థ ముపహింసథ. ౮

టీక॥ ఫలమూలాశనౌ = పండ్లును గడ్డలునుఆహారముగాఁ గలవారలమును; దాంతౌ = ఇంద్రియనిగ్రహము గలవారలమును; తాపసౌ = ఋషులును; ధ

స ౨౦




మ౯చారిణౌ = ధర్మముననాచరించు వారలమును, దండకారణ్యే = దండకారణ్యమునందు; వసంతౌ = వాసముసేయుచున్నవారలమునగు; ఆవాం (అధ్యాహృతము) = మమ్ము; కిమర్థం = ఎందుకొఱకు, ఉపహింసథ = హింసించెదరు.

మేము ఫలమూలంబులందినుచు జితేంద్రియులమయి తపంబాచరించుచు ధర్మాచరణంబుగావించుచు, దండకారణ్యంబుననున్నాము; మమ్మేలహింసించెదరు? అని, తాత్పర్యము.

యుష్మాన్ పాపాత్మకాన్ హంతుం విప్రకారా న్మహాహవే
ఋషీణాంతు నియోగేన ప్రాప్తో౽హం సశరాయుధః. ౯

టీక॥ అహం = నేను; విప్రకారాన్ = హింసకులును; పాపాత్మకాన్ = పాపస్వభావులునగు; యుష్మాన్ = మిమ్ము; మహాహవే = గొప్పయుద్ధంబునందు; హంతుంతు = వధించుటకును, ఋషీణాం = ఋషులయొక్క; నియోగేన = ఆజ్ఞచేత; సశరాయుధః = బాణధనుస్సులతోఁగూడినవాఁడనై; ప్రాప్తః = వచ్చినాను.

నేను, ఋషినియోగంబున, సాధుహింసకులరును బాపాత్ములరునగుమిమ్ము యుద్ధంబునవధించుటకై యే, ధనుర్బాణంబులుధరించియిచ్చటికివచ్చినాను. అని, తాత్పర్యము.

తిష్ఠతై వాత్ర సందుష్టా నోపావర్తితు మర్హథ
యది ప్రాణై రిహార్థో వా నివర్తధ్వం నిశాచరాః. ౧౦

టీక॥ సందుష్టాః = మిక్కిలియు దుష్టులరయిన, నిశాచరాః = రాక్షసులారా! అత్రైవ = ఇచ్చటనె; తిష్ఠత = నిలువుఁడు. ఉపావర్తితుం = దగ్గఱకు వచ్చుటకు; నార్హథ = తగరు. ఇహ = ఈలోకమున; ప్రాణైః = ప్రాణములచేత; అర్థోయదివా = ప్రయోజనముకలదేని; నివర్తధ్వం = పొండు.

దుష్టాత్ములరగు రాక్షసులారా! ఇచ్చటనె నిలువుఁడు; మిమ్ము వధించెదను; పైకిరావలదు; మీకుఁ బ్రాణాపేక్షకలదేని పాఱిపొండు, అని రాముండారాక్షసులతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము,




తస్య తద్వచనం శ్రుత్వా రాక్షసా స్తే చతుర్దశ
ఊచు ర్వాచం సుసంక్రుద్ధా బ్రహ్మఘ్నా శ్శూలపాణయః. ౧౧

టీక॥ బ్రహ్మఘ్నాః=బ్రాహ్మణులఁజంపువారలును; శూలపాణయః=శూలములు చేతులంగలవారలునగు; తే=ఆ; రాక్షసాః=రాక్షసులు; చతుర్దశ= పదునలుగురు; తస్య = ఆ రామునియొక్క; తత్=ఆ; వచనం = మాటను ; శ్రుత్వా=విని; సుసంక్రుద్ధాః = మిక్కిలి యుఁగోపించినవారలయి ; వాచం= మాటను; ఊచుః= పలికిరి.

బ్రాహ్మణ ఘాతకులగు నాపదునలుఁవురు రాక్షసులు , రాముని మాటను విని , చేతుల శూలంబులు గ్రాలఁ, బరమకుపితులయి, యిట్లని, పలికిరి.

అని, తాత్పర్యము.

క్రోధ ముత్పాద్య నో భర్తుః ఖరస్య సుమహాత్మనః
త్వమేవ హాస్యసే ప్రాణా నద్యాస్మాభి ర్హతో యుధి. ౧౨

టీక ॥ సుమహాత్మనః = మిక్కిలి యు నధికమయిన పరాక్రమముగల; నః=మాయొక్క; భర్తుః = ప్రభువయిన; ఖరస్య=ఖరునకు; క్రోధం = కోపమును; ఉత్పాద్య=పుట్టించి; త్వమేవ= నీవే; అద్య=ఇప్పుడు; యుధి = యుద్ధమునందు; అస్మాభిః = మాచేత; హతః=వధింపఁబడినవాఁడై; ప్రాణాన్= ప్రాణములను; హాస్యసే = విడువఁగలవు.

మహా పరాక్రమశాలియగు మాదొరఖరునికిఁ గోపముగలుగునట్లు గావించినావు, కావున, నీవెయిప్పుడుయుద్ధంబున మాచేవధింపఁబడిన వాఁడవై ప్రాణంబులువిడువఁగలవు.

అని, తాత్పర్యము.

కాహి తే శక్తి రేకస్య బహూనాం రణమూర్ధని
అస్మాక మగ్రత స్స్థాతుం కిం పున ర్యోద్ధు మాహవే. ౧౩

టీక॥ ఏకస్య=ఒకరుఁడవయిన, తే= నీకు; రణమూర్ధని=యుద్ధాగ్రమునందు; బహూనాం=పెక్కండ్రమయిన; అస్మాకం=మాయొక్క ; అగ్రతః =

ముందట; స్థాతుం=నిలుచుటకు; శక్తిః= సామర్థ్యము; కాహి= ఏది? ఆహవే= యుద్ధమునందు; యోద్ధుం=పోరుటకు; కింవునః=చెప్ప నేల?

నీవొక్కరుండవు యుద్ధంబునఁ బెక్కండ్రమగుమా యెదుట నిలుచుటకేని సమర్థుండవు కావు; ఇంకఁ బోరంజాలవని చెప్ప నేల? అని, తాత్పర్యము.

ఏహి బాహుప్రయుక్తైర్నః పరిఘైః శూలపట్టిసైః
ప్రాణాం స్త్యక్ష్యసి వీర్యంచ ధనుశ్చ కరపీడితమ్. ౧౪

టీక॥ఏహి=రమ్ము.నః = మాయొక్క; బాహుప్రయుక్తైః= చేతులచేఁ బ్రయోగింపఁబడిన; పరిఘైః=ఇనుపగుదియల చేతను; శూలపట్టిసైః=శూలములచేతను అడ్డకత్తులచేతను; ప్రాణాన్= ప్రాణంబులను; వీర్యంచ= పరాక్రమమును; కరపీడితం=చేతంబట్టుకొనఁబడిన; ధనుశ్చ=వింటిని; త్యక్ష్యసి= విడువఁగలవు.

యుద్ధంబునకు రమ్ము; మేము ప్రయోగించు పరిఘశూలపట్టిసంబుల, హీనపరాక్రముండవై, ధనుస్సు జాఱవిడిచి, ప్రాణంబులు విడువంగలవు. అని యారాక్షసులు, రామునితోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

ఇత్యేవ ముక్త్వా సంక్రుద్ధా రాక్షసాస్తే చతుర్దశ
చిక్షిపు స్తాని శూలాని రాఘవం ప్రతి దుర్జయమ్. ౧౫

టీక॥ తే=ఆ; రాక్షసాః = రాక్షసులు; చతుర్దశ = పదునలువురు; ఇతి=అని; ఏవం=ఇట్లు; ఉక్త్వా = చెప్పి; సంక్రుద్ధాః = మిక్కిలియుఁగోపము నొందినవారలయి; దుర్జయం = జయింపనలవిగాని; రాఘవంప్రతి = రామునిగూర్చి; తాని = ఆ; శూలాని= శూలములను; చిక్షిపుః=వేసిరి.

ఆపదునలువురు రాక్షసులు, ఇట్లు చెప్పి, కోపంబినుమడింప, దుర్జయుండగు రామునిమీఁదికిఁ, దమచేతిశూలంబుల వేసిరి.

అని, తాత్పర్యము.

స ౨౦

తాని శూలాని కాకుత్స్థ స్సమస్తాని చతుర్దశ
తావద్భి రేవ చిచ్ఛేద శరైః కాంచన భూషణైః. ౧౬

టీక॥ కాకుత్స్థః=రాముఁడు; తాని=ఆ; శూలాని=శూలంబులను; చతుర్దశ=పదునాలుగింటిని; సమస్తాని = అన్నిఁటినీ; తావద్భిరేవ = అన్నియే యైన; కాంచనభూషణైః= బంగారము లెయలంకారముగాగల; శరైః=బాణంబులచేత; చిచ్ఛేద=నఱకెను.

రాముండు, ఆపదునాలుగుశూలంబులను, గాంచనాలంకృతంబులగుపదునాలుగుబాణంబులచేత, నడుమనె, ఖండించెను. అని, తాత్పర్యము.

తతః పశ్చా న్మహాతేజా నారాచాన్ సూర్యసన్నిభాన్
జగ్రాహ పరమక్రుద్ధ శ్చతుర్దశ శిలాశితాన్. ౧౭

టీక॥ తతః=అంత; మహాతేజాః=అధికమయినపరాక్రమముగల రాముండు; పరమక్రుద్ధః= మిక్కిలియుఁగోపించినవాఁడై; సూర్యసన్నిభాన్= సూర్యునితోసమానములును; శిలాశితాన్= సానఱాయియందు సానఁబెట్టఁబడి తీక్ష్ణములయినవియునగు; నారాచాన్= బాణములను; చతుర్దశ = పదునాలుగింటిని; జగ్రాహ=గ్రహించెను.

అంత, మహాతేజుండగురాముండు, పరమకుపితుండై, సూర్యసమానంబులునుజక్కఁగాసానఁబెట్టఁబడితీక్ష్ణములయి యున్నవియునగు పదునాలుగుబాణంబులనుగ్రహించెను. అని, తాత్పర్యము.

గృహీత్వా ధను రాయమ్య లక్ష్యా నుద్దిశ్య రాక్షసాన్
ముమోచ రాఘవో బాణాన్ వజ్రానివ శతక్రతుః. ౧౮

టీక॥ రాఘవః=రాముఁడు; గృహీత్వా=గ్రహించి; ధనుః=ధనుస్సును; ఆయమ్య=వంచి; రాక్షసాన్=రాక్షసులను; లక్ష్యాన్=గుఱిగా; ఉద్దిశ్య=ఉద్దేశించి; బాణాన్=బాణములను; శతక్రతుః=దేవేంద్రుఁడు; వజ్రానివ=వజ్రము




లనువలెఁ; ముమోచ=విడిచెను.

రాముండు, అట్లుబాణంబులు గ్రహించి, విల్లువంచి, రాక్షసుల నుద్దేశించి, దేవేంద్రుండువజ్రంబులంబ్రయోగించునట్లు, ఆబాణంబులనువారలపైఁ బ్రయోగించెను. అని, తాత్పర్యము.

రుక్మపుంఖాశ్చ విశిఖా దీప్తా హేమవిభూషితాః
తే భిత్త్వా రక్షసాం వేగా ద్వక్షాంసి రుధిరాప్లుతాః. ౧౯
వినిష్పేతు స్తదా భూమౌ న్యమజ్జంతా౽శనిస్వరాః

టీక॥ రుక్మపుంఖాశ్చ=బంగారుతోఁ బూయఁబడినక్రిందిచివరలు గలవియు; దీప్తాః=ప్రకాశించుచున్నవియు; హేమవిభూషితాః=బంగారముచే నలంకరింపఁబడినవియునగు; తే= ఆబాణములు; తదా=అప్పుడు; వేగాత్ = వేగమువలన; రక్షసాం = రాక్షసులయొక్క; వక్షాంసి=ఱొమ్ములను; భిత్త్వా = భేదించి; రుధిరాప్లుతాః=నెత్తురుచేఁదడిసినవై; వినిష్పేతుః=వెడలినవి. అశనిస్వనాః=పిడుగుయొక్క ధ్వనివంటిధ్వనిగలవై ; భూమౌ=నేలయందు; న్యమజ్జంత=మునిఁగినవి.

బంగారముతోఁబూయఁబడిన పింజలుగలవియుఁ, గాంతిమంతంబులును గాంచనాలంకృతంబులునగు నాబాణంబులు, వేగంబుననారాక్షసులవక్షఁబులభేదించి, నెత్తురుతోఁగూడ, నావలికివెడలి, పిడుగులుంబోలెభూమినిభేదించుకొనిపోయినవి. అని, తాత్పర్యము.

తే భిన్నహృదయా భూమౌ ఛిన్నమూలాఇవ ద్రుమాః. ౨౦
నిపేతు శ్శోణితాదార్ద్రాంగా వికృతా విగతాసవః

టీక॥ తే=ఆరాక్షసులు; భిన్నహృదయాః=భేదింపఁబడినఱొమ్ము గలవారలయి; శోణితాదార్ద్రాంగాః= నెత్తురుచేఁదడిసినదేహగలవారలయి; వికృతాః=వికారముగలవారలయి ; భూమౌ=నేలయందు; ఛిన్నమూలాః=నఱకఁబడినవేళ్లుగల; ద్రుమాఇవ= వృక్షములువలె; నిపేతుః=పడిరి.

ఆరాక్షసులు, బాణంబులచేఱొమ్ములుపగుల, నెత్తుటందోఁగుచు, వికృతాకారులయి, ప్రాణంబులువిడిచి, ఛిన్నమూలంబులగువృక్షంబులుంబోలె, నే




స ౨౦

లంబడిరి, అని, తాత్పర్యము.

తాన్ దృష్ట్వాపతితాన్ భూమౌ రాక్షసీ క్రోధమూర్ఛితా. ౨౧
పరిత్రస్తా పున స్తత్ర వ్యసృజద్భైరవస్వనాన్

టీక॥ క్రోధమూర్ఛితా= కోపముచేవ్యాపింపఁబడిన; రాక్షసీ= శూర్పణఖ; భూమౌ = నేలయందు; పతితాన్=పడిన; తాన్=ఆరాక్షసులను, దృష్ట్వా=చూచి; పరిత్రస్తా= భయపడినదై; పునః=మఱల; తత్ర=అచ్చట; భైరవస్వనాన్=భయంకరధ్వనులను; వ్యసృజత్ = విడిచెను.

పరమకుపితయగు నాశూర్పణఖ, యట్లుమృతులై నేలంబడిన రాక్షసులం జూచి, భయమునొంది,మఱలనచ్చట, భయంకరంబుగానఱచెను.

అని, తాత్పర్యము.

సా నదంతీ పున ర్నాదం జవా చ్ఛూర్పణఖా పునః. ౨౨
ఉపగమ్య ఖరం సాతు కించి త్సంశుష్క-శోణితా
పపాత పున రేవార్తా సనిర్యాసేవ సల్లకీ. ౨౩

టీక॥ సా = ఆ; శూర్పణఖా= శూర్పణఖ; పునఃపునః = మాటిమాటికి; నాదం=అఱపును; నదంతీ= చేయుచు; కించిత్సంశుష్క-శోణితా = కొంచెముఎండిననెత్తురుగల; సా = ఆశూర్పణఖ, జవాత్ = వేగమువలన; ఖరం= ఖరుని; ఉపగమ్యతు = పొందినంతనె, పునరేవ=మఱలనే, ఆర్తా= దుఃఖితయయి; సనిర్యాసా = బంకతోఁగూడిన; సల్లకీవ=అందుగుచెట్టువలె; పపాత=పడెను.

ఆశూర్పణఖ,అట్లు, మాటిమాటికిభయంకరంబుగానఱచుచు, వేగంబునఖరునియొద్దకుఁబోయి, మఱలఁబరమదుఃఖితయయి, నెత్తురుకొంచెమెండియుండుటంజేసి, నిర్యాససహితంబగు నందుగుచెట్టుకైవడి, నేలంబడెను.

అని, తాత్పర్యము.

భ్రాతుః స్సమీపే శోకార్తా ససర్జ నినదం ముహుః
సస్వరం ముముచే బాష్పం విషణ్ణవదనా తదా. ౨౪

టీక॥ సా(అధ్యాహృతము) = ఆ శూర్పణఖ; భ్రాతుః=ఖరునియొక్క; సమీపే = సమీపమునందు ; శోకార్తా=దుఃఖపీడితయయి; ముహుః= పలుమాఱు; నినదం=ధ్వనిని;ససర్జ= విడిచినది. తదా=అప్పుడు ; విషణ్ణవదనా=దుఃఖితమయినముఖముగలదై ; సస్వరం=ధ్వనితోఁగూడునట్లుగా; బాష్పం=కన్నీటిని; ముముచే= విడిచినది.

అట్లుశూర్పణఖ,ఖరునిసమీపంబుఁజేరి, పలుమాఱు నానావిధంబులనఱచి, దుఃఖితయయి,రోదనంబుసేయుచుఁ,గన్నీళ్లువిడిచెను.

అని, తాత్పర్యము.

నిపాతితాన్ దృశ్య రణేతు రాక్షసాన్
ప్రధావితా శూర్పణఖా పున స్తతః
వధంచ తేషాం నిఖిలేన రక్షసాం
శశంస సర్వం భగినీ ఖరస్య సా. ౨౫

టీక॥భగినీ=తోడఁబుట్టినదగు;సా=ఆ; శూర్పణఖా=శూర్పణఖ ; రణే= యుద్ధమునందు;నిపాతితాన్= చంపఁబడిన;రాక్షసాన్=రాక్షసులను; దృశ్యతు(దృష్ట్వాతు)=చూచినంతనే;తతః= అంత;పునః=మఱల;ప్రధావితా=పరుగెత్తినదై;ఖరస్య=ఖరునకు; నిఖిలేన= సాకల్యముచేత; తేషాం=ఆ;రక్షసాం= రాక్షసులయొక్క;వధంచ = చంపుటను;సర్వం=అంతను;శశంస=చెప్పెను.

ఖరునితోడఁ బుట్టినదగు శూర్పణఖ,యాపదునలుగురు రాక్షసులు యుద్ధంబునహతులగుటంజూచినంతనె,యచ్చోనిలువక పరుగెత్తిఖరుని యొద్దకుఁబోయి,యారాక్షసులందఱు హతులగుటమొదలుగా సమాచారమంతయు నతనితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
ఆరణ్యకాండే, వింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండ వింశసర్గటీక,
ముగిసినది.

శ్రీ

ఏకవింశసర్గ ప్రారంభః.

స పునః పతితాం దృష్ట్వా క్రోధాచ్ఛూర్పణఖాం ఖరః
ఉవాచ వ్యక్తయా వాచా తా మనర్థార్థ మాగతామ్. ౧

టీక॥ సః=ఆ;ఖరః = ఖరుఁడు;పునః=మఱల;పతితాం=పడిన; శూర్పణఖాం=శూర్పణఖను;దృష్ట్వా= చూచి,క్రోధాత్ =కోపమువలన ; వ్యక్తయా=స్పష్టమయిన;వాచా= మాటచేత;అనర్థార్థం = అనర్థముకొఱకు;ఆగతాం = వచ్చినట్టి;తాం= ఆశూర్పణఖనుగూర్చి;ఉవాచ = చెప్పెను.

ఆఖరుండు , అట్లు నేలంబడినశూర్పణఖంజూచి,కుపితుండై , రాక్షసవినాశార్థమువచ్చినయాశూర్పణఖతో,స్పష్టవాక్యంబున,నిట్లనిచెప్పెను. అని,తాత్పర్యము.

మయా త్విదానీం శూరా స్తే రాక్షసా రుధిరాశనాః
త్వత్ప్రియార్థం వినిర్దిష్టాః కిమర్థం రుద్యతే పునః. ౨

టీక॥మయా = నాచేత; ఇదానీంతు=ఇప్పుడే;త్వత్ప్రియార్థం=నీసంతోషముకొఱకు; రుధిరాశనాః=నెత్తురెయాహారముగాఁగలవారలును; శూరాః=యుద్ధములేనివారలునగు; తే = ఆరాక్షసులు;వినిర్దిష్టాః= పంపఁబడినారు. పునః=మఱల;కిమర్థం= ఎందుకొఱకు; రుద్యతే=ఏడ్పుటయగుచున్నది?

నేను,ఇప్పుడే,నీకొఱకు , శూరులునురుధిరాహారులునగు నారాక్షసులం బంపినానే;మఱలనేల రోదనము చేసెదవు?అని,తాత్పర్యము.

భక్తా శ్చైవా నురక్తాశ్చ హితాశ్చ మమ నిత్యశః
ఘ్నంతోపి న నిహంతవ్యా న నకుర్యు ర్వచో మమ. ౩

టీ॥ తే(అధ్యాహృతము)= ఆరాక్షసులు, నిత్యశః=ఎల్లప్పుడును; మే=నాకు, భక్తాశ్చైవ=భక్తులును. అనురక్తాశ్చ=స్నేహముగలవారును. హితాశ్చ=మేలుసేయువారలును, ఘ్నంతోపి= వధించువారలును. నచహంతవ్యాః= వధింపనలవిగానివారలు. మమ=నాయొక్క; వచః=మాటను,ననవర్త్యాః=చేయకుండరు.

ఆరాక్షసులు,ఎల్లప్పుడును, నాకు భక్తులయి,నాయందనురాగముగలిగి, నాకుమేలుసేయుచుండువారలు ; ఎట్టివారినైనశత్రువులవధింపంజాలినవారు; ఎవరికిజయింపనలవిగానివారలు; వారలునాయాజ్ఞ మీఱరు అని,తాత్పర్యము.

కిమేతచ్ఛ్రోతుమిచ్ఛామి కారణం యత్కృతే పునః
హానాథేతి వినదంతీ సర్పవల్లుఠసి క్షితౌ. ౪

టీక॥ యత్కృతే = దేనినిమిత్తము;పునః=మఱల,హానాథ= అయ్యో నాథుఁడా! ఇతి=అని;వినదంతీ = అఱచుచు,సర్పవత్=సర్పమువలె; క్షితౌ=భూమియందు;లుఠసి = పొరలుచున్నావో,ఏతత్=ఈ;కారణం= కారణము;కిం=ఏమి?శ్రోతుం= వినుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను.

అట్లుండఁగా, మఱలనిప్పుడువచ్చి, "అయ్యోనాథుఁడా!" యనిరోదనంబుసేయుచుసర్పముంబోలె నేలంబొరలుచున్నావే ; ఇందుకుఁగారణమేమి? చెప్పుము;వినఁగోరెదను.

అని,తాత్పర్యము.

అనాథవద్విలపసి నాథేతు మయి సంస్థితే
ఉత్తిష్ఠోత్తిష్ఠ మాభైషీ ర్వైక్లబ్యం త్యజ్యతామిహ. ౫

టీక॥నాథే= నాథుండనగు ; మయి=నేను;సంస్థితేతు=ఉండఁగానే;అనాథవత్= నాథుండులేనివాఁడువలె ; విలపసి=ఏడ్చుచున్నావు. ఉత్తిష్ఠోత్తిష్ఠ=లెమ్ములెమ్ము. మాభైషీః=భయపడకుము. ఇహ= ఇప్పుడు;వైక్లబ్యం= దుఃఖము;త్యజ్యతాం = విడువఁబడుఁగాక.

నేను నాథుండనుండగానే, నీవనాథవలెరోదనము సేయుచున్నావేల? లెమ్ము లెమ్ము; భయపడవలదు; దుఃఖము విడువుము; అని, ఖరుండు, శూర్పణఖతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యేవ ముక్తా దుర్ధర్షా ఖరేణ పరిసాంత్వితా
విమృజ్య నయనే సాస్రే ఖరం భ్రాతర మబ్రవీత్. ౬

టీక॥ దుర్ధర్షా = ఎదిరింపఁ నలవిగానిదగుశూర్పణఖ; ఇత్యేవం = అనియిట్లు; ఖరేణ = ఖరునిచేత; ఉక్తా = చెప్పఁబడినదై; పరిసాంత్వితా = ఊఱడింపఁబడినదై; సాస్రే = కన్నీళ్లతోఁగూడిన; నయనే = కన్నులను; విమృజ్య = తుడిచి; భ్రాతరం = అన్నయగు; ఖరం = ఖరునిగూర్చి, అబ్రవీత్ = చెప్పెను.

అట్లు ఖరుండు నానావిధవచనంబుల ననూనయింప, దుర్ధర్షయగు నా శూర్పణఖ, కన్నీళ్లుందుడుచుకొని, యన్నయగు ఖరుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అస్మీ దానీ మహం ప్రాప్తా హృతశ్రవణనాసికా
శోణితౌఘపరిక్లిన్నా త్వయా చ పరిసాంత్వితా. ౭

టీక॥ ఇదానీం = ఇప్పుడు; అహం = నేను; హృతశ్రవణనాసికా = అపహరింపఁబడిన చెవులును ముక్కునుగలదానవై; శోణితౌఘపరిక్లిన్నా = నెత్తురుసమూహముచేతఁ దడుపఁబడినదానవై; ప్రాప్తా = వచ్చినదానవై; త్వయా = నీచేత; పరిసాంత్వితా చ = ఊఱడింపఁబడినదానను; అస్మి = అగుచున్నాను.

ఇప్పుడు, నేను ముక్కు చెవులం బోఁగొట్టుకొని నెత్తుటఁదోఁగుచు, నిచ్చటికిరాఁగానే, నీవు నన్నూఱడించితివి. అని, తాత్పర్యము.

ప్రేషితాశ్చ త్వయా వీర రాక్షసా స్తే చతుర్దశ
నిహంతుం రాఘవం క్రోధా న్మత్ప్రియార్థం సలక్ష్మణమ్. ౮

 

టీక॥ వీర= పరాక్రమశాలివగుఖరుఁడా!మత్ప్రియార్థం= నాసంతోషముకొఱకు;క్రోధాత్=కోపమువలన; సలక్ష్మణం = లక్ష్మణునితోఁగూడిన; రాఘవం=రామునిని; నిహంతుం = వధించుటకు;త్వయా=నీచేత; తే = ఆ; రాక్షసాః= రాక్షసులు ; చతుర్దశ= పదునలుగురు;ప్రేషితాశ్చ= పంపఁబడినారును.

పరాక్రమవంతుండవగు ఖరుఁడా! నీవు, నాకొఱకుఁ, గోపించి , రామలక్ష్మణులవధించుటకు, నాపదునలుగురరాక్షసులనుబంపినావు.

అని, తాత్పర్యము.

తేతు రామేణ సామర్షాః శూలపట్టిసపాణయః
సమరే నిహతాస్సర్వే సాయకై ర్మర్మభేదిభిః. ౯

టీక॥ సామర్షాః= కోపముతోఁగూడినవారలును ; శూలపట్టిసపాణయః = శూలములును అడ్డకత్తులును జేతులంగలవారలునగు; తేతు= ఆ రాక్షసులును; సర్వే=అందఱును; సమరే= యుద్ధమునందు; రామేణ= రామునిచేత; మర్మభేదిభిః= జీవస్థానములను భేదించునట్టి; సాయకైః = బాణములచేత; నిహతాః=వధింపఁబడిరి.

ఆ రాక్షసులందఱు , శూలంబులఁబట్టిసంబులంగొని , కోపంబున రామునిపైకడర, యుద్ధంబున , నారాముండు , మర్మభేదకములగు బాణముల, వారలనందఱువధించెను.

అని, తాత్పర్యము.

తాన్ దృష్ట్వా పతితాన్ భూమౌ క్షణేనైవ మహాబలాన్
రామస్యచ మహత్కర్మ మహాం స్త్రాసో భవ న్మమ. ౧౦

టీక॥ క్షణేనైవ=స్వల్పకాలముననె; భూమౌ=నేలయందు; పతితాన్=పడిన; మహాబలాన్= అధికమయినబలముగల; తాన్= ఆరాక్షసులను; రామస్య=రామునియొక్క ; మహత్ = గొప్పదగు; కర్మ=కార్యమును ; దృష్ట్వా=చూచి; మమ=నాకు; మహాన్= గొప్పదగు; త్రాసః=భయము; అభవత్ =కలిగెను.

క్షణమాత్రముననెయట్టి మహాబల

 

శాలులగు రాక్షసులు నేలం గూలుటయు, రాముని యమేయ పరాక్రమంబునుం జూడ, నాకు మిక్కిలియుఁ భయంబు గలిగినది. అని, తాత్పర్యము.

అహ మస్మి సముద్విగ్నా విషణ్ణాచ నిశాచర
శరణం త్వాం పునః ప్రాప్తా సర్వతోభయదర్శినీ. ౧౧

టీక॥ నిశాచర=ఖరుఁడా! అహం=నేను; సముద్విగ్నా=భయమునొందినదానను; విషణ్ణాచ=దుఃఖితను; అస్మి=అగుచున్నాను. సర్వతోభయదర్శినీ=అంతటను భయమును జూచుదాననై; పునః=మరల; త్వాం=నిన్ను; శరణం=రక్షకునిఁగా; ప్రాప్తా=పొందినాను.

ఖరుఁడా! నేను, భయంబు నొంది, దుఃఖార్తనై యున్నాను, ఎందుఁజూచినను నాకు భయమగుచున్నది; కావున, మరలనిన్నే శరణముపొందినాను. అని, తాత్పర్యము.

విషాదనక్రాధ్యుషితే పరిత్రాసోర్మిమాలిని
కిం మాం న త్రాయసే మగ్నాం విపులే శోకసాగరే. ౧౨

టీక॥ విషాదనక్రాధ్యుషితే=దిగులను మొసలిచేనధిష్ఠింపఁబడినదియు; పరిత్రాసోర్మిమాలిని=భయమనన లల పఙ్క్తి గలదియు; విపులే=విశాలమునగు; శోకసాగరే=దుఃఖసముద్రమునందు; మగ్నాం=మునింగిన; మాం=నన్ను; న త్రాయసేకిం=రక్షింపవా యేమి?

దిగులను మొసలితోఁగూడినదియు భయమను తరంగసమూహముతోఁ గూడినదియు నగు విశాలంబగు దుఃఖసముద్రంబున మునింగి పరితపించుచున్న నన్ను రక్షింపవా యేమి? అని, తాత్పర్యము.

ఏతేచ నిహతా భూమౌ రామేణ నిశితైశ్శరైః
యేపి మే పదవీం ప్రాప్తా రాక్షసాః పిశితాశనాః. ౧౩

టీక॥ పిశితాశనాః=మాంసమె యాహారముగాఁగల; యే=ఏ; రాక్షసాః=రాక్షసులు; మే=నాయొక్క; పదవీం=మార్గమును; ప్రాప్తాః=పొం

దినారౌ; ఏతేచాపి = వీరలును; భూమౌ = నేలయందు; రామేణ = రామునిచేత; నిశితైః = తీక్ష్ణములగు; శరైః = బాణములచేత; నిహతాః = వధింపఁబడినారు.

నావెంబడివచ్చిన మాంసాహారులగునారాక్షసులనుంగూడ, రాముండు తీక్ష్ణబాణంబుల, వధించివుచ్చెను.

అని, తాత్పర్యము.

మయి తే యద్యనుక్రోశో యది రక్షస్సు తేషు చ
రామేణ యది తే శక్తిస్తేజో వాస్తి నిశాచర. ౧౪
దండకారణ్య నిలయం జహి రాక్షసకంటకమ్

టీక॥ నిశాచర = ఖరుఁడా! తే = నీకు; మయి = నాయందును; తేషు = ఆ; రక్షస్సు చ = రాక్షసులయందును; అనుక్రోశో యది = దయకలుగునేని; రామేణ = రామునితో; తుల్యా (అధ్యాహృతము) = సమానమయిన; శక్తిః = బలముగాని; తేజో వా = పరాక్రమముగాని; అస్తి యది = కలదేని; దండకారణ్యనిలయం = దండకారణ్యమెయునికిపట్టుఁగాఁగల; రాక్షసకంటకం = రాక్షసులకుశత్రువయినరాముని; జహి = వధింపుము.

ఖరుఁడా ! నీకునాయందును ఆ రాక్షసులయందును , ప్రీతిగలిగియుండునేని, నీవు రామునకుసమానముగా బలపరాక్రమంబులుగలవాఁడవేని , దండకారణ్యంబున రాక్షసకంటకుండగు నా రాముని వధింపుము.

అని, తాత్పర్యము.

యది రామం మమామిత్రం నత్వ మద్య వధిష్యసి. ౧౫
తవచైవాగ్రతః ప్రాణాం స్త్యక్ష్యామి నిరపత్రపా

టీక॥ త్వం = నీవు; అద్య = ఇప్పుడు; మమ = నాయొక్క; అమిత్రం = శత్రువైన; రామం = రాముని; నవధిష్యసి యది = వధింపవేని; అహం (అధ్యాహృతము) = నేను; నిరపత్రపా = సిగ్గులేనిదాననై; తవ = నీయొక్క; అగ్రతశ్చైవ = ముందటనే, ప్రాణాన్ = ప్రాణములను; త్యక్ష్యామి = విడిచెదను.

నీవిప్పుడు నాశత్రువును రాముని వధింపవేని, నేనిట్లుముక్కుం జెవులుఁబోగొట్టుకొని సిగ్గులేనిదాననై, నీయెదుటనే ప్రాణంబులు విడిచెదను.

అని, తాత్పర్యము.

బుద్ధ్యాహ మనుపశ్యామి న త్వం రామస్య సంయుగే. ౧౬
స్థాతుం ప్రతిముఖే శక్త స్సబలశ్చ మహాత్మనః

టీక॥త్వం=నీవు, సబలశ్చ = సైన్యముతోఁగూడినవాఁడవయ్యు ; సంయుగే=యుద్ధమునందు; మహాత్మనః=అధికమయినపరాక్రమముగల ; రామస్య=రామునియొక్క; ప్రతిముఖే= ఎదుటను;స్థాతుం= నిలుచుటకు ; నశక్తః=సమర్థుఁడవుకావు, ఇతి(అధ్యాహృతము)=అని;అహం=నేను ; బుద్ధ్యా=బుద్ధిచేత;అనుపశ్యామి=ఊహించుచున్నాను.

నీవు సైన్యంబుతోఁగూడిన వాఁడవయ్యు, యుద్ధంబునన పరిమేయపరాక్రమశాలియగు రామునియెదుటనిలువం జాలవని నాబుద్ధికిఁదోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

శూరమానీ న శూర స్త్వం మిథ్యారోపితవిక్రమః. ౧౭
మానుషౌ యౌ నశక్నోషి హంతుం తౌ రామలక్ష్మణౌ

టీక॥యః(త్వం)=ఏనీవు ; మానుషౌ=మనుష్యులయిన;తౌ=ఆ ; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను ; హంతుం=వధించుటకు; నశక్నోషి= చాలవో;సః(అధ్యాహృతము)=అట్టి;శూరమానీ=శూరుండవు గాకపోయినను శూరుండనని యహంకరించియున్న ; త్వం=నీవు;మిథ్యారోపితవిక్రమః=అసత్యవాక్యములచేనారోపించుకొనఁబడినపరాక్రమముగలవాఁడవై ; శూరఇవ=శూరుఁడువలె, భవసి (అధ్యాహృతము)=ఉన్నావు.

మనుష్యులగు నా రామలక్ష్మణుల వధింపఁజాలకున్నావుకావున , నీవెంతమాత్రముశూరుఁడవుకావు ; అయినను, బొంకులమాటలచే నేనుశూరుండనని చెప్పుకొని, మహాపరాక్రమశాలియగు శూరుండువలెనభినయించుచున్నావు.

అని, తాత్పర్యము.

స ౨౧

రామేణ యది తే శక్తి స్తేజో వా స్తి నిశాచర. ౧౮
దండకారణ్యనిలయం జహి తం కులపాంసన

టీక॥కులపాంసన= వంశమునుఁ జెఱుపనట్టి; నిశాచర=ఖరుఁడా! తే=నీకు; రామేణ=రామునితోఁ; తుల్యా (అధ్యాహృతము) = సమానమయిన; శక్తిః=బలముగాని; తేజోవా=పరాక్రమముగాని; అస్తియది= కలుగునేని; దండకారణ్యనిలయం= దండకారణ్యమెయునికిపట్టుగాఁగల; తం=ఆరాముని; జహి=వధింపుము.

వంశమును జెఱుపఁ బుట్టినట్టి ఖరుఁడా! నీవు రామునంతటి బల పరాక్రమంబులు గలవాఁడవేని,దండకారణ్యంబుననివసించుచున్న రాముని వధింపుము.

అని, తాత్పర్యము.

నిస్సత్వ స్యాల్ప వీర్యస్య వాస స్తే కీదృశ స్త్విహ. ౧౯
అపయాహి జనస్థానా త్త్వరిత స్సహబాంధవః

టీక॥నిస్సత్వస్య=బలములేనివాఁడవునుః అల్పవీర్యస్య=కొంచెమయినపరాక్రమముగలవాఁడవునగు; తే=నీకు; ఇహ=ఇచ్చట; వాసః=ఉనికి; కీదృశః=ఎట్టిది? త్వం(అధ్యాహృతము)=నీవు; త్వరితః = వేగిరపడినవాఁడవై; సహబాంధవః= బంధువులతోఁగూడినవాఁడవై ;జనస్థానాత్=జనస్థానంబుననుండి; అపయాహి=పొమ్ము.

దుర్బలుండవుస్వల్పపరాక్రముండవునగు నీవుభయంకరంబగునీజనస్థానంబుననుండఁదగవు; కాఁబట్టిబంధుసహితంబుగా వేగంబుననిచ్చటనుండిపొమ్ము.

అని, తాత్పర్యము.

రామ తేజోభిభూతోహి త్వం క్షిప్రం వినశిష్యసి. ౨౦

టీక॥త్వం=నీవు; రామతేజోభిభూతః= రామునిపరాక్రమముచేతజయింపఁబడినవాఁడవై;క్షిప్రం = శీఘ్రముగా ; వినశిష్యసిహి=నాశమునొందఁగలవుగదా!

లేనియెడ,నీవు , రాముని తేజంబునఁబరాజితుండవై నాశంబునొందుదువు. అని, తాత్పర్యము.

సహి తేజస్సమాయుక్తో రామో దశరథాత్మజః
భ్రాతా చాస్య మహావీర్యో యేన చాస్మి విరూపితా. ౨౧

టీక॥ దశరథాత్మజః = దశరథమహారాజుకొడుకైనట్టి; సః = ఆ; రామః = రాముఁడు; తేజస్సమాయుక్తోహి = పరాక్రమముతోఁ గూడినవాఁడుగదా! యేనచ = ఎవ్వనిచేతను; విరూపితా = విరూపగాఁజేయఁబడినదాననో; సః (అధ్యాహృతము) = అట్టి; అస్య = ఈరాముని యొక్క; భ్రాతాచ = తమ్ముఁడైనలక్ష్మణుఁడును; మహావీర్యః = అధికమయినపరాక్రమముగలవాఁడు.

దశరథ మహారాజ కుమారుండగు నారాముండు మహాతేజుండు; నన్ను విరూపగాఁ జేసినయతనితమ్ముండు లక్ష్మణుండునుమహాపరాక్రమశాలి. అని, శూర్పణఖ ఖరునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవం విలప్య బహుశో రాక్షసీ ప్రథితోదరీ
కరాభ్యా ముదరం హత్వా రురోద భృశదుఃఖితా. ౨౨

టీక॥ ప్రథితోదరీ = పెద్దకడుపుగలశూర్పణఖ; ఏవం = ఇట్లు; బహుశః = అధికముగా, విలప్య = విలపించి; భృశదుఃఖితా = మిక్కిలియుదుఃఖము నొందినదై; కరాభ్యాం = చేతులచేత; ఉదరం = కడుపును; హత్వా = కొట్టి; రురోద = ఏడ్చెను.

పెద్దకడుపుగల యాశూర్పణఖ, యిట్లునానావిధంబులవిలపించి, యంతదుఃఖంబుమఱియువృద్ధినొందఁ, జేతులతో నుదరంబు మోఁదికొనుచు రోదనంబు గావించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే, ఏకవింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండైకవింశసర్గటీక,
ముగిసినది.

శ్రీః

ద్వావింశసర్గప్రారంభః.

ఏవ మాధర్షిత శ్శూర శ్శూర్పణఖ్యా ఖర స్తథా
ఉవాచ రక్షసాం మధ్యే ఖరః ఖరతరం వచః. ౧

టీక॥ శూరః=యుద్ధమునందుభయము లేనివాఁడగు; ఖరః=ఖరుఁడు; తదా=అప్పుడు; రక్షసాం=రాక్షసులయొక్క; మధ్యే=నడుమునందు; ఏవం=ఇట్లు; ఆధర్షితః=అవమానింపఁబడినవాఁడై; ఖరః=ఉగ్రుఁడై; ఖరతరం= మిక్కిలి యుఁ బరుషమయిన; వచః= మాటను; ఉవాచ=పలికెను.

శూరుండగుఖరుండు, ఇట్లు శూర్పణఖ రాక్షసులనడుమందన్నవమానింప, దారుణాకారుండై, భయంకరం బగు వాక్యంబున, నిట్లని, పలికెను.

అని, తాత్పర్యము.

తవా ఽ వమానప్రభవః క్రోధో ఽ య మతులో మమ
నశక్యతే ధారయితుం లవణాంభ ఇవోత్థితమ్. ౨

టీక॥ తవ= నీయొక్క; అవమానప్రభవః=అవమానమె కారణముగాఁ గల; అతులః=సరిలేని; అయం= ఈ; మమ=నాయొక్క; క్రోధః=కోపము; ఉత్థితం=లేచిన; లవణాంభ ఇవ=సముద్రజలమువలె; ధారయితుం=నిలుపుటకు; నశక్యతే=అలవిగాకున్నది.

నీకుఁగలిగినయవమానముచే నాకిప్పుడు మితిలేనికోపము గలిగినది; ప్రళయకాలమునందుఁ బొంగినసముద్రజలమునువలెదాని నిప్పుడు నిలుప నలవిగాదు. అని, తాత్పర్యము.

న రామం గణయే వీర్యా న్మానుషం క్షీణజీవితమ్
ఆత్మదుశ్చరితైః ప్రాణా న్హతో యో ఽ ద్య విమోక్ష్యతి. ౩

టీక॥ యః=ఎవ్వఁడు ; ఆత్మదుశ్చరితైః = తనదుష్టకార్యములచేత; హ

తః=కొట్టఁబడినవాఁడై; అద్య= ఇప్పుడు; ప్రాణాన్=ప్రాణములను;విమోక్ష్యతి= విడువఁగలఁడో; తం (అధ్యాహృతము)=అట్టి; మానుషం = మనుష్యుండును;క్షీణజీవితం=నశించినయాయుస్సుగలవాఁడునగు ; రామం=రామునిఁ;వీర్యాత్=పరాక్రమమువలన;నగణయే=లెక్కపెట్టను.

మనుష్యుండునునష్టాయువునగు రామునిపరాక్రమంబునేనెంతమాత్రమునను సరకుసేయను ;అతండు తాను గావించిన దుష్టకార్యంబులకు ఫలముగా నిప్పుడు ప్రాణంబులువిడువఁబోవుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

బాష్పః సంహ్రియతామేష సంభ్రమశ్చ విముచ్యతామ్
అహం రామం సహభ్రాత్రా నయామి యమసాదనమ్. ౪

టీక॥ ఏషః=ఈ;బాష్పః= కన్నీరు; సంహ్రియతాం=నిలుపఁబడుగాక. సంభ్రమశ్చ=భయమును; విముచ్యతాం= విడువఁబడుఁగాక. అహం=నేను;రామం=రామునిఁ;భ్రాత్రాసహ=తమ్మునితోఁగూడ;యమసాదనం= యమునిగృహంబును;నయామి=పొందించెదను.

కన్నీరుతుడుచుకొనుము; భయంబు విడువుము; నేను,రామునినతని తమ్ముని లక్ష్మణుని,యమపురికింబంపెదను.

అని, తాత్పర్యము.

పరశ్వధహతస్యాద్య మందప్రాణస్య సంయుగే
రామస్య రుధిరం రక్తముష్ణం పాస్యసి రాక్షసి. ౫

టీక॥ రాక్షసి=శూర్పణఖా ! అద్య=ఇప్పుడు; మందప్రాణస్య = స్వల్పమయిన యాయుస్సు గలవాఁడును; సంయుగే=యుద్ధమునందు ; పరశ్వధహతస్య=గొడ్డలిచేఁ గొట్టఁబడినవాఁడునగు;రామస్య = రామునియొక్క; ఉష్ణం=వేఁడియు;రక్తం= ఎఱ్ఱనిదియునగు;రుధిరం=నెత్తురును ; పాస్యసి= త్రాఁగఁగలవు.

శూర్పణఖా! నేనుయుద్ధంబునన ల్పాయువగు రామునిఁ గుఠారంబునవధించెదను; అంతనీవు , రామునివేఁడి

నెత్తురుం ద్రావఁగలవు. అని, ఖరుఁడు, శూర్పణఖతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

సా ప్రహృష్టా వచ శ్శ్రుత్వా ఖరస్య వదనా చ్చ్యుతమ్
ప్రశశంస పున ర్మౌర్ఖ్యా ద్భ్రాతరం రక్షసాం వరమ్. ౬

టీక॥ సా = ఆశూర్పణఖ; ఖరస్య=ఖరునియొక్క; వదనాత్ = నోటనుండి; చ్యుతం = జాఱిన; వచః= మాటను; శ్రుత్వా=విని; ప్రహృష్టా= సంతోషించినదై; మౌర్ఖ్యాత్ = మూర్ఖురాలగుటవలన; పునః = మఱల; రక్షసాం=రాక్షసులలో; వరం = శ్రేష్ఠుఁడగు; భ్రాతరం = అన్నయయినఖరుని; ప్రశశంస=పొగడెను.

ఆశూర్పణఖ, ఖరుండు చెప్పినమాటనువిని, సంతోషించి, అవ్యవస్థితచిత్తయగుటవలన, రాక్షసశ్రేష్ఠుండగుఖరుని, మఱలఁ బ్రశంసించెను.

అని, తాత్పర్యము.

తయా పరుషితః పూర్వం పునరేవ ప్రశంసితః
అబ్రవీ ద్దూషణం నామ ఖర స్సేనా పతిం తదా. ౭

టీక॥ పూర్వం=ముందు ; తయా= ఆశూర్పణఖచేత; పరుషితః= దూషింపఁబడినవాఁడును; పునరేవ= మఱలనే; ప్రశంసితః= పొగడఁబడిన వాఁడునగు; ఖరః=ఖరుఁడు; తదా= అప్పుడు; దూషణంనామ=దూషణుఁడను పేరుగల, సేనాపతిం= సేనానాయకునిఁ గూర్చి; అబ్రవీత్ =చెప్పెను.

అట్లు శూర్పణఖ మొదట దూషించి వెనుక మఱలఁ బొగడినపిమ్మట, ఖరుండు, సేనానాయకుండగు దూషణుం జూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

చతుర్దశ సహస్రాణి మమ చిత్తానువర్తినామ్
రక్షసాం భీమవేగానాం సమరే ష్వనివర్తినామ్. ౮
నీలజీమూతవర్ణానాం ఘోరాణాం క్రూరకర్మణామ్
లోకహింసావిహారాణాం బలినా ముగ్రతేజసామ్. ౯

టీక॥ మమ=నాయొక్క; చిత్తానువర్తినాం= మనసుననుసరించువారలును; భీమవేగానాం= భయంకరమయిన వేగముగలవారలును; సమరేషు=యుద్ధములందు; అనివర్తినాం= మరలని వారలును; నీలజీమూతవర్ణానాం= నల్లని మేఘముయొక్క రంగువంటిరంగుగలవారలును; ఘోరాణాం=భయంకరులును; క్రూరకర్మణాం= క్రూరములయిన కార్యములుగలవారలును; లోకహింసావిహారాణాం=లోకముల హింసించుటయే విహారముగాఁగలవారలును; ఉగ్రతేజసాం=భయంకరమయిన కాంతిగలవారలునగు; రక్షసాం= రాక్షసులయొక్క; సహస్రాణి=వేలు, చతుర్దశ=పదునాలుగు; సంతి(అధ్యాహృతము)=కలవు.

నామనస్సుప్రకారము నడచువారలును భయంకరవేగులును యుద్ధంబుల వెనుదీయనివారలును మేఘవర్ణులును భయంకరాకారులును క్రూరకర్ములును లోకహింసకులును బలవంతులును మహాతేజులునగు రాక్షసులు, పదునాలుగు వేలమందియున్నారు.

అని, తాత్పర్యము.

తేషాం శార్దూలదర్పాణాం మహాస్యానాం మహౌజసామ్
సర్వోద్యోగ ముదీర్ణానాం రక్షసాం సౌమ్య కారయ. ౧౦

టీక॥సౌమ్య=తిన్ననివాఁడవగు దూషణుఁడా! శార్దూలదర్పాణాం= పెద్దపులియొక్కగర్వమువంటిగర్వముగలవారలును; మహాస్యానాం= పెద్దనోరుగలవారలును;మహౌజసాం= అధికమయినబలముగలవారలును; ఉదీర్ణానాం=గర్వితులునగు; తేషాం=ఆ; రక్షసాం=రాక్షసులకు;సర్వోద్యోగం=సమస్తప్రయత్నమును;కారయ=చేయింపుము.

సౌమ్యుండవగు దూషణుఁడా! పెద్ద పులులకుంబోలె దర్పముగలవారలునువికృతముఖులును మహాబలశాలులునుగర్వితులునగు నా రాక్షసులకు, యుద్ధమునకుఁగావలసినప్రయత్నములన్నియుఁగావింపుము.

అని, తాత్పర్యము.

ఉపస్థాపయ మే క్షిప్రం రథం సౌమ్య ధనూంషిచ

శరాం శ్చిత్రాంశ్చ ఖడ్గాంశ్చ శక్తీశ్చ వివిధా శ్శితాః. ౧౧

టీక ॥ సౌమ్య = శాంతుండవగు దూషణుఁడా! క్షిప్రం = శీఘ్రముగా; మే=నాయొక్క; రథం= రథమును; ధనూంషిచ=విండ్లను; చిత్రాన్ = నానావిధములయిన; శరాంశ్చ = బాణములను; ఖడ్గాంశ్చ = కత్తులను; వివిధాః = నానావిధములును; శితాః= తీక్ష్ణములునగు; శక్తీశ్చ = ఈటెలను; ఉపస్థాపయ= తెమ్ము.

సౌమ్యుండవగుదూషణుఁడా! మఱియు నారథంబును ధనుస్సులను నానావిధంబులగు బాణంబులను ఖడ్గంబులనుశక్తులనుశీఘ్రంబునందెమ్ము.

అని, తాత్పర్యము.

అగ్రే నిర్యాతు మిచ్ఛామి పౌలస్త్యానాం మహాత్మనామ్
వధార్థం దుర్వినీతస్య రామస్య రణకోవిదః. ౧౨

టీక॥రణకోవిదః=యుద్ధమునందుఁ బండితుండనగు; అహం(అధ్యాహృతము)=నేను; దుర్వినీతస్య= దుష్టుండనగు; రామస్య=రామునియొక్క; వధార్థం=చంపుటకొఱకు; మహాత్మనాం= అధికమయిన బలముగల ; పౌలస్త్యానాం=పులస్త్యవంశమునందుఁ బుట్టినవారలయొక్క; అగ్రే=ముందఱ; నిర్యాతుం=పోవుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను.

యుద్ధంబునంబండితుండనగు నేను, దుష్టుండగు రామునివధించుటకు, మహాత్ములగు పౌలస్త్యులలో నందఱికన్న ముందుపోవవలయునని యున్నాను. అని, ఖరుండు, దూషణునితోఁ జెప్పెను.

విశేషార్థము.— రణకోవిదః, అహం, మహాత్మనాం = అధికమయిన బలముగల; పౌలస్త్యానాం=పౌలస్త్యులయొక్క; వధార్థం=వధించుటకొఱకు; దుర్వినీతస్య, రామస్య, అగ్రే, నిర్యాతుం, ఇచ్ఛామి.

యుద్ధంబునఁబండితుండనగు నేను, మహాత్ములగుపౌలస్త్యులవధంబు కొఱకు, అందఱికన్న ముందు నేను రామువాద్దకుఁబోఁగోరెదను. అని, దైవయోగంబుననవశంబుగా భవిష్యదర్థమును ఖరుండు పలికెను. అని, తాత్పర్యము.

ఇతి తస్య బ్రువాణస్య సూర్యవర్ణం మహారథమ్
సదశ్వై శ్శబలై ర్యుక్త మాచచక్షేఽథ దూషణః. ౧౩

టీక॥ తస్య=ఆఖరుఁడు; ఇతి= ఇట్లు; బ్రువాణస్య=చెప్పుచుండఁగా:అథ=అంత; దూషణః= దూషణుఁడు. సూర్యవర్ణం= సూర్యునియొక్కరంగువంటిరంగుగలదియు; శబలైః=నానావర్ణములయిన; సదశ్వైః= శ్రేష్ఠములయినగుఱ్ఱములతో; యుక్తం= కూడినదియు నగు; మహారథం=గొప్పరథమును; ఉపస్థితం (అధ్యాహ్యము)=వచ్చినదానిఁగా; ఆచచక్షే = చెప్పెను.

అట్లుఖరుండుచెప్పుచుండఁగానే, దూషణుండు, సూర్యవర్ణంబునునానావర్ణంబులగు నుత్తమాశ్వంబులు గలదియునగు మహారథంబాయత్తంబయ్యెనని చెప్పెను.

అని, తాత్పర్యము.

తం మేరుశిఖరాకారం తప్తకాంచనభూషణమ్
హేమచక్ర మసంబాధం వైడూర్యమయకూబరమ్. ౧౪
మత్స్యైః పుష్పై ర్ద్రుమై శ్శైలై శ్చంద్రసూర్యైశ్చ కాంచనైః
మంగళైః పక్షిసంఘైశ్చ తారాభి రభిసంవృతమ్. ౧౫
ధ్వజనిస్త్రింశసంపన్నం కింకిణీకవిరాజితమ్
సదశ్వయుక్తం సోఽమర్షా దారురోహ ఖరో రథమ్. ౧౬

టీక॥సః=ఆ;ఖరః=ఖరుఁడు; మేరుశిఖరాకారం= మేరుశృంగముయొక్కయాకారమువంటి యాకారము గలదియు; తప్తకాంచనభూషణం= కాఁచఁబడిన బంగారువికారములయినయలంకారములుగలదియు;హేమచక్రం= బంగారు వికారము లయిన చక్రములు గలదియు;అసంబాధం=ఇఱుకులేనిదియు; వైడూర్యమయకూబరం= వైడూర్యమణివికారమయిన నొగ గలదియు;కాంచనైః = బంగారువికారములయిన;మంగళైః = మంగళముగలిగించునట్టి ; మత్స్యైః=మత్స్యములచేతను;పుష్పైః=పూలచేతను ; ద్రుమైః=

వృక్షములచేతను; శైలైః=పర్వతముల చేతను ; చంద్రసూర్యైశ్చ = చంద్రసూర్యులచేతను; పక్షిసంఘైశ్చ = పక్షి సమూహముల చేతను; తారాభిః = నక్షత్రముల చేతను; అభిసంవృతం=చుట్టఁబడినదియు; ధ్వజనిస్త్రింశ సంపన్నం=టెక్కెముతోను గత్తుల తోనుంగూడినదియు, కింకిణీకవిరాజితం= చిఱుగంటలచేతఁ బ్రకాశించుచున్నదియు; సదశ్వయుక్తం= ఉత్తమాశ్వములతోఁగూడినదియునగు: రథం = రథమును; అమర్షాత్ =కోపమువలన; ఆరురోహ=ఎక్కెను.

అంత, ఖరుండు, కోపంబున, మేరుశిఖరాకారంబును గాంచనాలంకృతంబును బంగారుచక్రంబులు గలదియు విశాలంబును వైడూర్యమణితోఁ జేయఁబడిన నొగగలదియు బంగారముతోఁ జేయఁబడినవియు మంగళకరంబులునగు మత్స్యంబులతోను పుష్పంబులతోను వృక్షంబులతోను బర్వతంబులతోను జంద్రసూర్యబింబములతోను బక్షులతోను నక్షత్రంబులతోనుంగూడినదియు ధ్వజఖడ్గసంయుతంబును జిఱుగంటలతో నొప్పుచున్నదియు నుత్తమాశ్వసమేతంబునగు మహారథంబు నారోహించెను.

అని, తాత్పర్యము.

నిశామ్యతు రథస్థం తం రాక్షసా భీమవిక్రమాః
తస్థు స్సంపరివార్యైనం దూషణంచ మహాబలమ్. ౧౭

టీక॥ భీమవిక్రమాః = భయంకరమయినపరాక్రమముగలః; రాక్షసాః= రాక్షసులు; రథస్థం= రథమునందున్న; తం=ఆఖరుని, నిశామ్యతు= చూచినంతనె, ఏనం=ఈఖరుని; మహాబలం= అధికమయినబలముగల ; దూషణంచ= దూషణుని; సంపరివార్య = చుట్టుకొని; తస్థుః=నిలిచిరి.

భయంకరమగు పరాక్రమముగల రాక్షసులు , ఖరుండు రథంబునారోహించినంతనె, యాతనిని మహాబలుండగు దూషణునిఁ బరివేష్టించి నిలిచిరి.

అని, తాత్పర్యము.

ఖరస్తు తాన్ మహేష్వాసాన్ ఘోరవర్మాయుధధ్వజాన్
నిర్యాతేత్యబ్రవీ ద్దృష్ట్వా రథస్థ స్సర్వరాక్షసాన్. ౧౮

టీక॥ ఖరస్తు=ఖరుఁడును; రథస్థః=రథముననున్నవాఁడై; మహేష్వాసాన్=పెద్దవిండ్లుగలవారలును; ఘోరవర్మాయుధధ్వజాన్=భయంకరమయినకవచములును ఆయుధములును ధ్వజములునుగలవారలునగు; తాన్=ఆ, సర్వరాక్షసాన్=సమస్త రాక్షసులను; దృష్ట్వా=చూచి; నిర్యాతేతి=వెడలుఁడని; అబ్రవీత్=చెప్పెను.

ఖరుండునురథంబుననుండి, మహాధనుర్ధరులునుభయంకరకవచాయుధధారులును ధ్వజంబులు పట్టుకొనియున్నవారలునగు నారాక్షసుల నందఱంజూచి, బయలు దేఱుఁడనియాజ్ఞాపించెను అని, తాత్పర్యము.

తత స్తద్రాక్షసం సైన్యం ఘోరవర్మాయుధధ్వజమ్
నిర్జగామ జనస్థానా న్మహానాదం మహాజవమ్. ౧౯

టీక॥ తతః=అంత, ఘోరవర్మాయుధధ్వజం=భయంకరములయినకవచములును ఆయుధములును ధ్వజములునుగలదియు; మహాజవం = అధికమయిన వేగముగలదియునగు; తత్=ఆ; రాక్షసం=రాక్షససంబంధియగు; సైన్యం=సైన్యము; జనస్థానాత్= జనస్థానముననుండి; నిర్జగామ=బయలు వెడలెను.

అంత, గొప్పగొప్పకవచంబులను ఆయుధంబులనుధరించియున్నరాక్షసులతోఁగూడినదియుఁబతాకాసమన్వితంబునగు నారాక్షససైన్యము, మహాధ్వనిగదుర, మహావేగంబున, జనస్థానంబుననుండి వెడలినది. అని, తాత్పర్యము.

ముద్గరైః పట్టిసై శ్శూలై స్సుతీక్ష్ణై శ్చ పరశ్వధైః
ఖడ్గై శ్చక్రైశ్చ హస్తస్థై ర్భ్రాజమానైశ్చ తోమరైః. ౨౦
శక్తిభిః పరిఘై ర్ఘోరై రతిమాత్రైశ్చ కార్ముకైః
గదాసిముసలై ర్వజ్రై ర్గృహీతై ర్భీమదర్శనైః. ౨౧
రాక్షసానాం సుఘోరాణాం సహస్రాణి చతుర్దశ
నిర్యాతాని జనస్థానా త్ఖరచిత్తానువర్తినామ్. ౨౨

టీక॥ గృహీతైః= పట్టుకొనఁబడినవియు; హస్తస్థైః = చేతులనున్న

వియు,భీమదర్శనైః = భయంకరమయిన చూచుటగలవియునగు ; ముద్గరైః=ముద్గరములను నాయుధములచేతను;పట్టిసైః= అడ్డకత్తులచేతను;శూలైః=శూలములచేతను; సుతీక్ష్ణైః= మిక్కిలియుఁగఅకులయిన ; పరశ్వథైశ్చ=గొడ్డళ్లచేతను;ఖడ్గైః = కత్తులచేతను;చక్రైశ్చ= చక్రములచేతను, భ్రాజమానైః = ప్రకాశించుచున్న; తోమరైః = తోమరములను నాయుధములచేతను;శక్తిభిః = ఈఁటెలచేతను;ఘోరైః = భయంకరములగు;పరిఘైః =ఇనుపగుదియలచేతను;అతిమాత్రైః=మిక్కిలియుఁబెద్దవగు; కార్ముకైశ్చ=ధనుస్సులచేతను;గదాసీముసలైః= గదలచేతను కత్తులచేతను రోఁకళ్లచేతను;వజ్రైః = వజ్రములచేతను,ఉపలక్షితానాం (అధ్యాహృతము)=కూడినవారలును;సుఘోరాణాం= మిక్కిలియుభయంకరులును ; ఖరచిత్తానువర్తినాం = ఖరునిమనస్సుననుసరించువారలునగు; రాక్షసానాం = రాక్షసులయొక్క;సహస్రాణి=వేలు; చతుర్దశ=పదునాలుగు;జనస్థానాత్ = జనస్థానముననుండి;నిర్యాతాని = వెడలినవి.

భయంకరాకారంబులగు ముద్గరంబులు పట్టిసంబులు శూలంబులుగొడ్డళ్లుఖడ్గంబులు చక్రంబులు తోమరంబులుశక్తులు పరిఘంబులు ధనువులుగదలు ముసలంబులువజ్రంబులు మొదలగునాయుధంబుల ధరించినవారలును పరమభయంకరాకారులును ఖరునాజ్ఞ చొప్పున నడచువారలునగు రాక్షసులుపదునాలుగు వేలమంది జనస్థానంబుననుండి , రామునిపైకియుద్ధంబు సేయఁబోయిరి. అని,తాత్పర్యము.

తాం స్త్వభిద్రవతో దృష్ట్వా రాక్షసాన్ భీమవిక్రమాన్
ఖరస్యాపి రథః కించి జ్జగామ తదనంతరమ్. ౨౩

టీక॥అభిద్రవతః= పరుగెత్తుచున్న; భీమవిక్రమాన్= భయంకరమయినపరాక్రమముగల; తాన్=ఆ ; రాక్షసాన్=రాక్షసులను;దృష్ట్వాతు= చూచినంతనే;ఖరస్య=ఖరునియొక్క ; రథోపి=రథమును;కించిత్=కొంచెము; తదనంతరం=దానికివెనుక; జగామ= పోయెను.

భయంకరపరాక్రమములగునారాక్షసులుబయలుదేఱిపోవుటంజూచి, దానికిఁగొంచెము వెనుక, ఖరునిరథంబు వెడలినది. అని, తాత్పర్యము.

తత స్తాన్ శబళా నశ్వాం స్తప్తకాంచనభూషితాన్
ఖరస్య మతి మాజ్ఞాయ సారథి స్సమచోదయత్. ౨౪

టీక॥తతః= అంత; సారథిః= తేరునడపువాఁడు; ఖరస్య= ఖరుని యొక్క; మతిం= బుద్ధిని; ఆజ్ఞాయ= తెలిసి; తప్తకాంచనభూషితాన్= కాఁచఁబడినబంగారముచే నలంకరింపఁబడిన ; శబళాన్= నానావర్ణములుగల; తాన్= ఆ; అశ్వాన్= గుఱ్ఱములను; సమచోదయత్= తోలెను.

అంత, సారధి, ఖరునియభిప్రాయం బెఱింగి, కాంచనాలంకృతంబులును చిత్రవర్ణంబులునగునశ్వంబుల, శీఘ్రంబుగాఁదోలెను. అని, తాత్పర్యము.

స చోదితో రథ శ్శీఘ్రం ఖరస్య రిపుఘాతినః
శబ్దేనా పూరయామాస దిశశ్చ ప్రదిశ స్తదా. ౨౫

టీక॥తదా= అప్పుడు; రిపుఘాతినః= శత్రువులఁజంపునట్టి; ఖరస్య= ఖరుని యొక్క; సః= ఆ; రథః= రథము; శీఘ్రం= వేగముగా; చోదితః= తోలఁబడినదై; శబ్దేన= ధ్వనిచేత; దిశశ్చ= దిక్కులను; ప్రదిశశ్చ= విదిక్కులను ; ఆపూరయామాస= నించెను.

అప్పుడు, సారధి, శత్రువులవధించునట్టిఖరునిరథంబును వేగంబునందోలఁగానే, యారథధ్వనికి, దిక్కులును విదిక్కులును, నిండినవి. అని, తాత్పర్యము.

ప్రవృద్ధమన్యుస్తు ఖరః ఖరస్వనో
రిపో ర్వధార్థం త్వరితో యథాంతకః
అచూచుద త్సారధి మున్నదన్ ఘనం
మహాబలో మేఘ ఇవాశ్మవర్షవాన్. ౨౬

టీక॥ మహాబలః= అధికమయినబలముగలవాఁడును; ప్రవృద్ధమన్యుః = వృద్ధిఁబొందిన కోపము గలవాఁడును; ఖరస్వనః=పరుషమయిన ధ్వనిగలవాఁడునగు; ఖరస్తు=ఖరుఁడును; రిపోః=శత్రువుయొక్క; వధార్థం= చంపుటకొఱకు; త్వరితః = వేగిరపడినవాఁడై; అంతకోయథా = యముఁడువలె; అశ్మవర్షవాక్=ఱాళ్లవానగల ; మేఘఇవ=మేఘమువలె; ఘనం = పెద్దగాఁ; ఉన్నదక్=అఱచుచు; సారథిం= సారథిని; అచూచుదత్ =ప్రేరించెను.

మహాబలుండగు ఖరుండు , అంతకంతకుఁ గోపంబగ్గలంబుగా , శత్రువధార్థమయి , యముండుంబోలెఁ జూపట్టుచు, ఱాళ్లవానగురియు మహామేఘంబుకరణి, భయంకరనాదంబున గర్జించుచు, సారథిని రథంబును వేగము నందోలనాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

ఆరణ్యకాండే, ద్వావింశస్సర్గః,

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండద్వావింశసర్గటీక,

ముగిసినది.



౨౨

త్రయోవింశసర్గప్రారంభః.

తత్ప్రయాతం జనస్థానా దశివం శోణితోదకమ్
అభ్యవర్ష న్మహామేఘ స్తుములో గర్దభారుణః. ౧

టీక॥ జనస్థానాత్ = జనస్థానము నుండి; ప్రయాతం = పోయిన; తత్ = ఆ రాక్షససైన్యమును గూర్చి; తుములః = దట్టమయిన; గర్దభారుణః = గాడిదవలె ధూసరవర్ణమయిన; మహామేఘః = గొప్పమేఘము; అశివం = అమంగళకరమయిన; శోణితోదకం = రక్తవర్ణమయినజలమును; అభ్యవర్షత్ = వర్షించెను.

రాక్షససేన, జనస్థానంబుననుండి వెడలఁగానే, గర్దభంబువలె ధూసరవర్ణంబగు మహామేఘము, ఆసైన్యముపై నమంగళకరంబగు రక్తజలంబుఁ గురిసెను. అని, తాత్పర్యము.

నిపేతు స్తురగా స్తస్య రథయుక్తా మహాజవాః
సమే పుష్పచితే దేశే రాజమార్గే యదృచ్ఛయా. ౨

టీక॥ రథయుక్తాః = రథంబునందుఁ బూన్పఁబడిన; మహాజవాః = అధికమయినవేగము గల; తురగాః = గుఱ్ఱములు; యదృచ్ఛయా = దచ్చాటుచేత; సమే = మిట్టపల్లములు లేనిదియు; పుష్పచితే = పూలచే వ్యాపింపఁబడినదియునగు; దేశే = ప్రదేశమయిన; రాజమార్గే = రాజమార్గమునందు; నిపేతుః = పడినవి.

అతనిరథంబునకుఁ బూన్చియున్న మహావేగంబులగు గుఱ్ఱంబులు సమభూమియు బూలుజల్లియున్నదియునగు రాజమార్గంబున దైవగతిచేఁబడినవి.

అని, తాత్పర్యము.

శ్యామం రుధిరపర్యంతం బభూవ పరివేషణమ్

అలాతచక్రప్రతిమం పరిగృహ్య దివాకరమ్. ౩

టీక॥ దివాకరం = సూర్యుని; పరిగృహ్య=చుట్టి; శ్యామం= నల్లనిదియు; రుధిరపర్యంతం = నెత్తురు రంగుగల యంచు గలదియు ; అలాతచక్రప్రతిమం = కొఱవిచక్రముతోఁబోల్కిగల దియునగు; పరివేషణం = గాలిగుడి; బభూవ=కలిగినది.

సూర్యుని చుట్టును, నల్లనిదియునంచునందు మాత్రము రక్తవర్ణంబును చక్రాకారంబగు కొఱవివలెనున్నదియు నగు, పరివేషంబుకలిగినది.

అని, తాత్పర్యము.

తతో ధ్వజ ముపాగమ్య హేమదండం సముచ్ఛ్రితమ్
సమాక్రమ్య మహాకాయ స్తస్థౌ గృధ్రః సుదారుణః. ౪

టీక॥ తతః=అంత; మహాకాయః= పెద్దదేహముగలదియు; సుదారుణః= మిక్కిలియుభయంకరమునగు; గృధ్రః= గద్ద; హేమదండం=బంగారువికారమ యినదండముగలదియు; సముచ్ఛ్రితం= ఉన్నతంబునగు; ధ్వజం= టెక్కెమును; ఉపాగమ్య=పొంది; సమాక్రమ్య = ఆక్రమించి ; తస్థౌ=నిలిచెను.

అంత, మహాకాయంబునుభయంకరంబునగునొకగద్ద, బంగారుదండంబు గలదియు నత్యున్నతంబు నగు ధ్వజంబునాక్రమించినిలిచెను.

అని, తాత్పర్యము.

జనస్థానసమీపే తు సమాగమ్య ఖరస్వనాః
విస్వరా న్వివిధాం శ్చక్రు ర్మాంసాదా మృగపక్షిణః. ౫

టీక॥జనస్థానసమీపేతు= జనస్థానమునకుసమీపంబునందును ; మాంసాదాః=మాంసభక్షకములగు; మృగపక్షిణః=మృగములునుబక్షులును; సమాగమ్య=చేరి; ఖరస్వనాః= పరుషమయిన ధ్వనిగలవై; వివిధాన్=నానావిధములగు; విస్వరాన్=వికృతధ్వనులను ; చక్రుః=చేసినవి.

మాంస భక్షకంబులగు మృగపక్షులు, జనస్థానసమీపంబునం జేరి, నానావిధంబులుగ, వికృతంబుగా నఱచినవి.

అని, తాత్పర్యము.

వ్యాజహ్రుశ్చ ప్రదీప్తాయాం దిశి వై భైరవస్వనమ్
అశివం యాతుధానానాం శివా ఘోరా మహాస్వనాః. ౬

టీక॥ శివాః = నక్కలు; ఘోరాః = భయంకరంబులయి; మహాస్వనాః = పెద్దధ్వనిగలవై; ప్రదీప్తాయాం = ప్రకాశించుచున్న; దిశి = దిక్కునందు; యాతుధానానాం = రాక్షసులకు; అశివం = అమంగళకరమగు; భైరవస్వనం = భయంకరధ్వనిని; వ్యాజహ్రుశ్చ = అఱచినవియు, చేసినవనుట.

నక్కలు, సూర్యుండు వెలుంగుదిక్కునం జేరి, భయంకరంబులయి, పెరలుచున, రాక్షసులకమంగళసూచకంబగునట్లు, అఱచినవి.

అని, తాత్పర్యము.

ప్రభిన్నగిరిసంకాశా స్తోయశోణితధారిణః
అనాకాశం తదా కాశం చక్రుర్భీమా వలాహకాః. ౭

టీక॥ ప్రభిన్నగిరిసంకాశాః = పగిలినపర్వతములతో సమానముగలవియు; తోయశోణితధారిణః = నెత్తురువంటి నీళ్లయొక్క ధారలుగలవియు; భీమాః = భయంకరములునగు; వలాహకాః = మేఘములు; తత్ = ఆ; ఆకాశం = ఆకాశమును; అనాకాశం = అవకాశములేనిదానింగా; చక్రుః = చేసినవి.

పగిలినపర్వతంబులతో సమానములును భయంకరములునగు మేఘములు నెత్తురువంటిజలమును వర్షించుచు, నాకాశమంతయు నిరవకాశము గావించినవి. అని, తాత్పర్యము.

బభూవ తిమిరం ఘోర ముద్ధతం రోమహర్షణమ్
దిశో వా విదిశో వాపి నచ వ్యక్తం చకాశిరే. ౮

టీక॥ ఘోరం=భయంకరంబును; ఉద్ధతం=అధికమును; రోమహర్షణం=వెండ్రుకలగగుర్పాటు నొందించునది యునగు; తిమిరం=చీఁకటి, బభూవ=అయినది. దిశో వా=దిక్కులు గాని; విదిశో వాపి=విదిక్కులు గాని; వ్యక్తం=స్పష్టముగా; నచకాశిరేచ=ప్రకాశింపకుండినవియు.

భయంకరంబును అధికంబును రోమహర్షణంబునగు చీఁకటిక్రమ్మినది; దిక్కులు గాని విదిక్కులు గాని, యెంత మాత్రము ప్రకాశింపకుండినవి. అని, తాత్పర్యము.

క్షతజార్ద్రసవర్ణాభా సంధ్యాకాలం వినా బభౌ

టీక॥ క్షతజార్ద్రసవర్ణాభా=నెత్తురు చేఁదడిసిన వస్త్రముతో సమానమయిన రంగుగల కాంతిగల, సంధ్యా=సంధ్య; కాలం వినా=కాలమును విడిచి, బభౌ=ప్రకాశించినది.

సంధ్యాకాలము రాకమున్నె, నెత్తురువంటి వర్ణముగల సంధ్య యడరినది. అని, తాత్పర్యము.

ఖరస్యాభిముఖా నేదుస్తదా ఘోరమృగాః ఖగాః ।
కంకగోమాయుగృధ్రాశ్చ చుక్రుశుర్భయశంసినః

టీక॥ తదా=అప్పుడు; ఘోరమృగాః=భయంకరమృగంబులును; ఖగాః=పక్షులును; ఖరస్య=ఖరునికి; అభిముఖాః=ఎదురైనవై; నేదుః=అఱచినవి. కంకగోమాయుగృధ్రాశ్చ=రాపులుఁగులు నక్కలును గద్దలును; భయశంసినః=భయమును సూచించినవై; చుక్రుశుః=అఱచినవి.

అప్పుడు, భయంకరములగు క్రూరమృగంబులును బక్షులును రాపులుఁగులును నక్కలును గద్దలును, ఖరునికెదురు మొగమయి, భయంబుగలుగుట సూచింపుచు నఱచినవి. అని, తాత్పర్యము.

నిత్యాశుభకరా యుద్ధే శివా ఘోరనిదర్శనాః ౧౦
నేదుర్బలస్యాభిముఖం జ్వాలోద్గారిభిరాననైః

టీక॥ యుద్ధే=యుద్ధమునందు; నిత్యాశుభకరాః=ఎల్లప్పుడును అమంగళము చేయునవియు; ఘోరనిదర్శనాః=భయంకరమయిన దృష్టాంతము గలవియునగు,శివాః = నక్కలు;బలస్య=సైన్యమునకు; అభిముఖం = ఎదురుగా; జ్వాలోద్గారిభిః = మంటలనుగ్రక్కుచున్నట్టి,ఆననైః = నోళ్లతో; నేదుః=అఱచినవి.

యుద్ధంబునం, దప్పకయమంగళంబుగలిగించునట్టి సాన్నిధ్యంబుగలవియు భయంకరమయిన యాపదను గలిగించునవియునగు నక్కలు, సైన్యమునకభిముఖముగా, వక్త్రంబులనగ్నిజ్వాలలుగదుర,నఱచినవి.

అని, తాత్పర్యము.

కబంధః పరిఘాభాసో దృశ్యతే భాస్కరాంతికే. ౧౧

టీక॥ పరిఘాభాసః = ఇనుపగుదియవలెఁ బ్రకాశించుచున్న; కబంధః=మనిషిమొండెము; భాస్కరాంతికే=సూర్యునిసమీపమునందు; దృశ్యతే=చూడఁబడినది.

సూర్యునిసమీపంబున, నినుపగుదియవంటి నల్లని మనిషిమొండెము ఒకటి చూపట్టినది.

అని, తాత్పర్యము.

జగ్రాహ సూర్యం స్వర్భాను రపర్వణి మహాగ్రహః

టీక॥ మహాగ్రహః = గొప్పగ్రహమగు;స్వర్భానుః = రాహువు;అపర్వణి = పర్వముకానికాలమునందు;సూర్యం = సూర్యుని;జగ్రాహ= గ్రహించెను.

రాహువు, పూర్ణిమగాని యమావాస్యగాని కాని కాలమునందు సూర్యునిగ్రసించెను.

అని, తాత్పర్యము.

ప్రవాతి మారుత శ్శీఘ్రం నిష్ప్రభో భూ ద్దివాకరః. ౧౨

టీక॥ మారుతః = వాయువు; శీఘ్రం = వేగముగా;ప్రవాతి = ప్రతికూలముగావీచినది. దివాకరః=సూర్యుఁడు;నిష్ప్రభః= కాంతిలేనివాఁడు;

అభూత్ = అయ్యెను.

వాయువు, మహావేగంబునఁ బ్రతికూలంబుగా వీచెను; సూర్యుండు కాంతివిహీనుండయ్యెను.

అని, తాత్పర్యము.

ఉత్పేతుశ్చ వినా రాత్రిం తారాః ఖద్యోత సప్రభాః

టీక॥ రాత్రింవినా = రాత్రిలేకయె; తారాః = నక్షత్రములు; ఖద్యోతసప్రభాః = మిడుఁగుఱుఁబురువులతోసమానమయిన కాంతిగలవై, ఉత్పేతుశ్చ = లేచినవియు.

పట్టపగటనె, నక్షత్రంబులు మిడుఁగుఱుఁబురువులుఁబోలె, నుదయించినవి. అని, తాత్పర్యము.

సంలీన మీనవిహగా నళిన్య శ్శుష్క పంకజాః ౧౩
తస్మిన్ క్షణే బభూవుశ్చ వినాపుష్ప ఫలై ద్రుమాః

టీక॥ తస్మిన్ = ఆ; క్షణే = సమయమునందు; నళిన్యః = తామరకొలంకులు; సంలీనమీనవిహగాః = అణఁగిన మత్స్యములును బక్షులును గలవియు; శుష్కపంకజాః = ఎండినకమలములు గలవియు; బభూవుశ్చ = అనయివియు. ద్రుమాః = వృక్షములు; పుష్పఫలైర్వినా = పూలనుబండ్లనువిడిచి; బభూవుః (అధ్యాహృతము) = అయినవి.

ఆసమయమునందుఁ, దామరకొలంకులు, మత్స్యములునుజలపక్షులును జలంబులనడంగి, యెండినకమలంబులతోఁ గాంతిహీనంబులయియుండినవి; వృక్షంబులఁబుష్పఫలంబులు లేకుండినవి.

అని, తాత్పర్యము.

ఉద్ధూతశ్చ వినావాతం రేణు ర్జలధరారుణః. ౧౪
వీచీకూచీతి వాశ్యంత్యో బభూవు స్తత్ర శారికాః

టీక॥ తత్ర = ఆసేనయందు; వాతంవినా = గాలిలేకయె; జలధరారుణం = మేఘమువలెధూసరవర్ణమయిన; రేణుః = పరాగము; ఉద్ధూతశ్చ = రేఁగినదియు. శారికాః = గోరువంకపిట్టలు; వీచీకూచీతి = వీచీకూచియని; వాశ్యంత్యః = అఱ

చుచున్నవి;బభూవుః=అయినవి.

ఆరాక్షససేనయందు , గాలిలేక యె, మేఘంబువలెధూసరవర్ణమగుదుమ్ము రేఁగినది;గోరువంకలు, వీచికూచి యనిపరుషంబుగాఁ గూయుచుండినవి.

అని, తాత్పర్యము.

ఉల్కాశ్చాపి సనిర్ఘాతా నిపేతు ర్ఘోరదర్శనాః. ౧౫
ప్రచచాల మహీ సర్వా సశైలవనకాననా

టీక॥ఘోరదర్శనాః= భయంకరమయినచూచుటగల;సనిర్ఘాతాః= పిడుగులతోఁగూడిన; ఉల్కాశ్చాపి= ఒకవిధమయిన తేజస్సులును;నిపేతుః=పడినవి;సశైలవనకాననా= పర్వతంబులతోనువనంబులతోను అడవులతోనుంగూడిన;సర్వా=సమస్తమయిన ; మహీ=భూమి;ప్రచచాల=చలించినది.

చూపరులకుభయంకరంబుగా, మహాకాంతితోఁబిడుగులుపడినవి ; పర్వతంబులతోనువనంబులతోనుఁగూడభూమియంతయుఁజలనంబునొందినది.

అని, తాత్పర్యము.

ఖరస్యచ రథస్థస్య నర్దమానస్య ధీమతః. ౧౬
ప్రాకంపత భుజస్సవ్య స్స్వరశ్చాస్యా వసజ్జత

టీక॥రథస్థస్య = రథమునందున్నవాఁడును;ధీమతః= బుద్ధిమంతుండును; నర్దమానస్య=అఱచుచున్న వాఁడునగు;ఖరస్య=ఖరునియొక్క;సవ్యః= ఎడమదైన;భుజః=బాహువు; ప్రాకంపత చ=వడంకినదియు.అస్య = ఇతనియొక్క;స్వరశ్చ=కంఠధ్వనియు; అవసజ్జత(అవాసజ్జత)=తడఁబడెను.

రథంబుపైఁగూర్చుండి గర్జించుచున్నబుద్ధిమంతుండగుఖరునియెడమభుజంబదరినది; అతనికంఠధ్వనియు డగ్గుత్తికతోఁదడఁబడసాగినది.

అని, తాత్పర్యము.

సాస్రా సంపద్యతే దృష్టిః పశ్యమానస్య సర్వతః. ౧౭
లలాటే చ రుజా జాతా నచ మోహా న్న్యవర్తత




టీక॥ సర్వతః=అంతటను; పశ్యమానస్య=చూచుచుండఁగా; దృష్టిః=చూపు; సాస్రా=కన్నీళ్లతోఁగూడినది; సంపద్యతే=అయినది. లలాటే చ = నెత్తియందును, రుజా=రోగము; జాతా=కలిగినది. మోహాత్= అజ్ఞానమునను౦డి; నన్యవర్తత చ= వదలఁడయ్యెను.

ఖరుండును నాలుగుప్రక్కలఁజూచినప్పుడు, నిమిత్తముగా నతని కన్నులలో నీళ్లు గాఱినది; అతనికి నెత్తియందొక విధమయిన వికారముగలిగినది; అట్లయినను అతండు యుద్ధంబు సేయవలెనను తనయజ్ఞానమును వదలఁడయ్యె.

అని, తాత్పర్యము.

తాన్ సమీక్ష్య మహోత్పాతా నుత్థితాన్ రోమహర్షణాన్. ౧౮
అబ్రవీ ద్రాక్షసాన్ సర్వాన్ ప్రహసన్ స ఖర స్తదా

టీక॥ తదా=అప్పుడు; సః = ఆ; ఖరః=ఖరుఁడు; ఉత్థితాన్ = ఉదయించిన; రోమహర్షణాన్ = వెండ్రుకలగగుర్పాటునొందఁజేయునట్టి; తాన్= ఆ ; మహోత్పాతాన్ = మహోత్పాతంబులను; సమీక్ష్య = చూచి; ప్రహసన్=నవ్వుచు; రాక్షసాన్ = రాక్షసులను; సర్వాన్=అందఱను గూర్చి ; అబ్రవీత్=చెప్పెను.

అప్పుడు, ఖరుండు , భయంకరములగు నాయుత్పాతంబులుదయించుటంగని పకపకనవ్వుచు , రాక్షసులనందఱంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

మహోత్పాతా నిమాన్ సర్వా నుత్థితాన్ ఘోరదర్శనాన్. ౧౯
నచింతయా మ్యహం వీర్యా ద్బలవాన్ దుర్బలానివ

టీక॥ అహం=నేను ; ఉత్థితాన్=పుట్టిన; ఘోరదర్శనాన్ = భయంకరమగు చూచుటగల; ఇమాన్= ఈ; మహోత్పాతాన్ = గొప్పయుత్పాతంబులను; సర్వాన్ = అన్నింటిని; వీర్యాత్= పరాక్రమాతిశయమువలన, బలవాన్ = అధికమయినబుద్ధిగలవాఁడు; దుర్బలానివ= బలహీనులనువలె; నచింతయామి=ఆలోచింపను.

ఇప్పుడుదయించునట్టి భయంకరంబులగు నీమహోత్పాతంబులను , నేను, బరాక్రమబలంబున , బలవంతుండుబల




హీనులంబోలె నెంతమాత్రము సరకుసేయను. అని, తాత్పర్యము.

తారా అపి శరై స్తీక్ష్ణైః పాతయామి నభస్థ్సలాత్. ౨౦
మృత్యుం మరణధర్మేణ సంక్రుద్ధో యోజయామ్యహమ్

టీక॥ అహం=నేను; సంక్రుద్ధః = కోపించినవాఁడనై; తీక్ష్ణైః=కఱకులయిన; శరైః=బాణములచేత; తారా అపి=నక్షత్రములనైనను; నభస్థ్సలాత్=ఆకాశమువనుండి; పాతయామి = పడఁద్రోసెదను. మృత్యుం= మృత్యువును; మరణధర్మేణ = చావుఅనుధర్మముతో; యోజయామి = కూర్చెదను.

నేనుగోపించినయెడఁ దీక్ష్ణబాణంబులనక్షత్రంబులనుంగూడ నాకాశంబుననుండిపడఁద్రోయుదును ; మృత్యువునకుంగూడమరణంబుగలిగింతును.

అని, తాత్పర్యము.

రాఘవం తం బలోత్సిక్తం భ్రాతరం చాస్య లక్ష్మణమ్. ౨౧
అహత్వా సాయకై స్తీక్ష్ణై ర్నోపావర్తితు ముత్సహే

టీక॥అహం(అధ్యాహృతము)=నేను; బలోత్సిక్తం=బలముచే గర్వించిన; తం=ఆ; రాఘవం=రాముని ; అస్య=ఇతనియొక్క; భ్రాతరం=తమ్ముఁడగు;లక్ష్మణంచ=లక్ష్మణునిన్;తీక్ష్ణైః=కఱకులయిన; సాయకైః=బాణములచేత; అహత్వా=వధింపక ; ఉపావర్తితుం=మఱలుటకు; నోత్సహే=ఉత్సహింపను.

నేనుగఱకుబాణంబుల, బల గర్వితుండగురాముని, అతనితమ్ముని లక్ష్మణునివధింపక, మఱలివచ్చుటలేదు.

అని, తాత్పర్యము.

స కామా భగినీ మేస్తు పీత్వాతు రుధిరం తయోః. ౨౨
యన్నిమిత్తస్తు రామస్య లక్ష్మణస్య విపర్యయః

టీక॥మే=నాయొక్క; భగినీ= చెల్లెలు; తయోః = ఆరామలక్ష్మణులయొక్క; రుధిరం=నెత్తురును;పీత్వాతు = త్రాఁగియె; సకామా = కోరికతోఁ

గూడినది; అస్తు=అగుఁగాక. రామస్య= రామునికిని; లక్ష్మణస్య=లక్ష్మణునికిని; విపర్యయః=నాశము; యన్నిమిత్తస్తు= ఏబిడనిమిత్తముగాఁగలదేయో.

నాచెల్లెలుశూర్పణఖయు, నారామలక్ష్మణుల రుధిరంబుఁద్రావి, తనకోరికినీడేర్చుకొనుఁగాక; ఆబిడకొఱకే గదా యిప్పుడారామలక్ష్మణులకు నాశంబువాటిల్లునది.

అని, తాత్పర్యము.

న క్వచి త్ప్రాప్త పూర్వో మే సంయుగేషు పరాజయః. ౨౩
యుష్మా క మేత త్ప్రత్యక్షం నానృతం కథయామ్యహమ్

టీక॥ మే=నాకు; క్వచిత్= ఒకానొకచోటను; సంయుగేషు = యుద్ధములందు; పరాజయః=అపజయము; న ప్రాప్తపూర్వః= ముందుగలిగినది కాదు. ఏతత్=ఇది; యుష్మాకం= మీకు; ప్రత్యక్షం=ప్రత్యక్షము. అహం= నేను; అనృతం=అబద్ధమును; నకథయామి= చెప్పలేదు.

ఇదివఱకు నాకెప్పుడును ఎందును యుద్ధంబునఁ బరాజయంబు గలిగినది లేదు; ఇదిమీకును జక్కఁగాఁ దెలిసినదేగదా! నేనబద్ధముఁజెప్పలేదు.

అని, తాత్పర్యము.

దేవ రాజ మపి క్రుద్ధో మత్తై రావత యాయినమ్. ౨౪
వజ్రహ స్తం రణే హన్యాం కిం పునస్తౌ కుమానుషౌ

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; క్రుద్ధః=కోపించినవాఁడనై; మత్తైరావతయాయినం= మదించినయైరావతముచేఁబోవునట్టి; వజ్రహస్తం= వజ్రముచేతంగల; దేవరాజమపి = దేవేంద్రునైనను; రణే = యుద్ధమునందు; హన్యాం=వధింతును. తౌ=ఆ; కుమానుషౌ=కుత్సితమనుష్యులయిన రామలక్ష్మణులను; కింపునః=చెప్పనేల?

నేనుగోపింతునేని, యుద్ధంబునమదించినయైరావతముపైఁ గూర్చుండిన వజ్రహస్తుండగు దేవేంద్రునేనివధించివుత్తును; ఇంకనా కుత్సితంపుమనుష్యులగు రామలక్ష్మణుల విషయమయి చెప్పనేల? అని, ఖరుండు రాక్షసులతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

సా తస్య గర్జితం శ్రుత్వా రాక్షసస్య మహాచమూః. ౨౫
ప్రహర్ష మతులం లేభే మృత్యుపాశావపాశితా

టీక॥ మృత్యుపాశావపాశితా = మృత్యుపాశముచేఁగట్టఁబడిన ; సా= ఆ;మహాచమూః= మహాసేన;తస్య= ఆ; రాక్షసస్య=ఖరునియొక్క ; గర్జితం=గర్జించినమాటను; శ్రుత్వా= విని;అతులం = సరిలేని;ప్రహర్షః= సంతోషమును;లేభే=పొందెను.

ఆసేనలోని రాక్షసులందఱు , ఖరుని మాటనువిని , మృత్యుపాశ వశంగతులు కావునఁ, బరమసంతోషంబునొందిరి. అని, తాత్పర్యము.

సమీయుశ్చ మహాత్మానో యుద్ధదర్శన కాంక్షిణః. ౨౬
ఋషయో దేవగంధర్వా స్సిద్ధాశ్చ సహచారణైః

టీక॥ మహాత్మానః= అధికమయిన ప్రభావముగల; ఋషయః= ఋషులును; దేవగంధర్వాః=దేవతలునుగంధర్వులును ; సిద్ధాశ్చ=సిద్ధులును; చారణైస్సహ=చారణులతోఁగూడ; యుద్ధదర్శనకాంక్షిణః= యుద్ధమునుచూచుటకుఁగోరినవారలయి ; సమీయుశ్చ= వచ్చిరియు.

మహాత్ములగుఋషులును దేవతలునుగంధర్వులనుసిద్ధులును జారణులును యుద్ధంబుఁజూడఁగోరి , యచ్చటికివచ్చిరి. అని, తాత్పర్యము.

సమేత్యచోచు స్సహితాస్తే న్యోన్యం పుణ్యకర్మణః. ౨౭

టీక॥ పుణ్యకర్మణః(పుణ్యకర్మాణః)=పుణ్యములయినకార్యములుగల ; తే=ఆఋష్యాదులు; సమేత్యచ= వచ్చియు;సహితాః=కూడినవారలయి; అన్యోన్యం=పరస్పరమునుగూర్చి; ఊచుః=చెప్పుకొనిరి.

పుణ్యకర్ములగు నాదేవర్షిగంధర్వచారణులు, అచ్చటికివచ్చియొక్కటిగాఁజేరియుండొరులతోనిట్లనిచెప్పుకొనిరి. అని, తాత్పర్యము.

స్వస్తి గోబ్రాహ్మణేభ్యో స్తు లోకానాం యేభిసంగతాః

స ౨౩




టీక॥ గోబ్రాహ్మణేభ్యః= గోవులకొఱకును బ్రాహ్మణులకొఱకును, యే= ఎవ్వరు; లోకానాం=లోకములకు;అభిసంగతాః=అనుకూలురో ; తేభ్యోపి(అధ్యాహృతము)=వారలకును; స్వస్తి=మంగళము; అస్తి=కలుగుగాక.

గోబ్రాహ్మణులకును, ఎవ్వరులోకహితంబుఁగోరువారలో , అట్టిమహాత్ములకునుమంగళంబుగలుగుఁగాక. అని, తాత్పర్యము.

జయతాం రాఘవ స్సంఖ్యే పౌలస్త్యాన్ రజనీచరాన్. ౨౮
చక్రహస్తో యథా యుద్ధే సర్వాంశ్చ సురపుంగవాన్

టీక॥ రాఘవః=రాముఁడు ; సంఖ్యే=యుద్ధమునందు; పౌలస్త్యాన్=పులస్త్యవంశమునందుఁబుట్టిన; రజనీచరాన్=రాక్షసులను;చక్రహస్తః= విష్ణువు;యుద్ధే=యుద్ధమునందు; అసురపుంగవాన్=అసురశ్రేష్ఠులను, సర్వాన్యథా=అందఱినువలె,జయతాం (జయతు)=జయించుఁగాక.

చక్రపాణియగువిష్ణుండు, యుద్ధంబుననసురులనందఱును జయించినట్లు , రాముండు,యుద్ధంబునఁబులస్త్యవంశంబునంబుట్టినరాక్షసులనందఱను జయించుఁగాక,అని, దేవర్షిగంధర్వాదులు చెప్పుకొనిరి. అని, తాత్పర్యము.

ఏతచ్చాన్యచ్చ బహుశో బ్రువాణాః పరమర్షయః. ౨౯
జాతకౌతూహలా స్తత్ర విమానస్థాశ్చ దేవతాః
దదృశు ర్వాహినీం తేషాం రాక్షసానాం గతాయుషామ్. ౩౦

టీక॥తత్ర=అచ్చట ; జాతకౌతూహలాః=పుట్టినకౌతుకముగల ; పరమర్షయః=పరమర్షులును ; దేవతాశ్చ=దేవతలును;విమానస్థాః=విమానమునను న్నవారలై,ఏతచ్చ= ఈమాటను;అన్యచ్చ=ఇతరమును;బహుశః=అధికముగా;బ్రువాణాః=చెప్పుచు ; గతాయుషాం = పోయిన యాయుస్సుగల;తేషాం=ఆ ; రాక్షసానాం=రాక్షసులయొక్క;వాహినీం=సేనను; దదృశుః=చూచిరి.

యుద్ధంబుఁ జూచు వేడుకతోఁగూడినయమ్మహర్షులును దేవతలును , విమానారూఢులయి , గోబ్రాహ్మణులకు మంగళంబుగలుగుఁగాకయని మొదలగుమాటలంజెప్పుకొనుచు , గతాయుష్కులగునారాక్షసుల సేనంజూచిరి. అని, తాత్పర్యము.




రథేనతు ఖరో వేగా దుగ్రసైన్యో వినిస్సృతః
తం దృష్ట్వా రాక్షసం భూయో రాక్షసాశ్చ వినిస్సృతాః. ౩౧

టీక॥ఉగ్రసైన్యః=భయంకరమయి నసేనగల;ఖరస్తు=ఖరుండును; వేగాత్=వేగమువలన;రథేన=రథముచేత; వినిస్సృతః=వెడలినాఁడు.తం=ఆ;రాక్షసం=రాక్షసుని;దృష్ట్వా = చూచి; భూయః=మఱల;రాక్షసాశ్చ= రాక్షసులును;వినిస్సృతాః=వెడలిరి.

భయంకరంబగుసైన్యముగల ఖరుండు,రథమునెక్కి, వేగంబున వెడలెను;అతండు వెడలుటఁజూచి,రాక్షసులందఱు వెడలిరి. అని, తాత్పర్యము.

శ్యేనగామీ పృధుగ్రీవో యజ్ఞశత్రు ర్విహంగమః
దుర్జయః కరవీరాక్షః పరుషః కాలకార్ముకః. ౩౨
మేఘమాలీ మహామాలీ సర్పాస్యో రుధిరాశనః
ద్వాదశైతే మహావీర్యాః ప్రతస్థు రభితః ఖరమ్. ౩౩

టీక॥శ్యేనగామీ= శ్యేనగామియు; పృధుగ్రీవః=పృధుగ్రీవుఁడును ; యజ్ఞశత్రుః=యజ్ఞశత్రుండును ; విహంగమః=విహంగముఁడును; దుర్జయః= దుర్జయుఁడును;కరవీరాక్షః= కరవీరాక్షుఁడును;పరుషః= పరుషుండును; కాలకార్ముకః= కాలకార్ముకుండును; మేఘమాలీ=మేఘమాలియు; మహామాలీ=మహామాలియు; సర్పాస్యః= సర్పముఖుండును;రుధిరాశనః=రుధిరాశనుండును;మహావీర్యాః= అధికమయి నపరాక్రమముగల;ఏతే=ఈ ; ద్వాదశ=పండ్రెండుగురు రాక్షసులు; ఖరమభితః=ఖరునిఁబరివేష్టించి;ప్రతస్థుః= బయలుదేఱిరి.

శ్యేనగామియుఁ బృధుగ్రీవుండును యజ్ఞశత్రుండునువిహంగముఁడును దుర్జయుఁడును గరవీరాక్షుండును బరుషుఁడును గాలకార్ముకుఁడును మేఘమాలియుమహామాలియుసర్పముఖుండునురుధిరాశనుండునను మహాపరాక్రములగునీపండ్రెండుగురు రాక్షసులు, ఖరునింబరివేష్టించివెడలిరి.
అని, తాత్పర్యము.

మహాకపాలి స్థూలాక్షః ప్రమాథీ త్రిశిరా స్తథా
చత్వార ఏతే సేనాన్యో దూషణం పరితో యయుః. ౩౪

టీక॥ మహాకపాలిః= మహాకపాలియు; స్థూలాక్షః=స్థూలాక్షుఁడును; ప్రమాథీ=ప్రమాథియు; తథా=అట్లు; త్రిశిరాః=త్రిశిరుఁడును, ఏతే=ఈ; సేనాన్యః=సేనానాయకులు; చత్వారః= నలువురు; దూషణంపరితః= దూషణుని చుట్టును; యయుః=పోయిరి.

మహాకపాలియు స్థూలాక్షుండును ప్రమాథియుఁద్రిశిరుండుననునీనలువురు సేనానాయకులు, దూషణునింబరివేష్టించితరలిరి. అని, తాత్పర్యము.

సా భీమవేగా సమరాభికామా
మహాబలా రాక్షసవీరసేనా
తౌ రాజపుత్త్రౌ సహసా భ్యుపేతా
మాలా గ్రహాణా మివ చంద్రసూర్యౌ. ౩౫

టీక॥ భీమవేగా= భయంకరమయినవేగముగలదియు; సమరాభికామా= యుద్ధంబునందుఁగోరికగలదియు; మహాబలా = అధికమయినబలముగలదియునగు; సా=ఆ; రాక్షసవీరసేనా= రాక్షసవీరులసైన్యము; సహసా= వేగంబున; తౌ=ఆ; రాజపుత్త్రౌ=రాచకొమరులగురామలక్ష్మణులను; గ్రహాణాం= గ్రహములయొక్క; మాలా= పఙ్క్తి; చంద్రసూర్యావివ=చంద్రసూర్యులనువలె; అభ్యుపేతా=పొందినది.

భయంకరవేగులును మహాబలశాలులునగు నా రాక్షసవీరులందఱుయుద్ధోత్సాహంబొప్ప, నంగారకాదిగ్రహములు చంద్రసూర్యులంబొందునట్లు, ఆరామలక్ష్మణులయొద్దకుఁబోయిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే , త్రయోవింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండత్రయోవింశసర్గటీక,
ముగిసినది.



౨౪

చతుర్వింశసర్గప్రారంభః.

ఆశ్రమం ప్రతి యాతేతు ఖరే ఖరపరాక్రమే
తానేవౌత్పాతికాన్ రామ స్సహ భ్రాత్రా దదర్శ హ. ౧

టీక॥ ఖరపరాక్రమే= తీక్ష్ణమయిన పరాక్రమముగల; ఖరే=ఖరుఁడు; ఆశ్రమంప్రతి= రాముని యాశ్రమమునుగూర్చి; యాతేతు= వెడలఁగానే ; రామః= రాముఁడు; భ్రాత్రాసహ = తమ్మునితోఁగూడ; తాన్=ఆ; ఔత్పాతికానేవ=ఉత్పాతములనే ; దదర్శ= చూచెను "హ" అనునది పాదపూరణార్థము.

భయంకరంబగు పరాక్రమంబుగల ఖరుండు, రాముని యాశ్రమంబునకుఁ బయనంబగుచుండ, రాముండులక్ష్మణుని తోఁ గూడ, మున్నుదాహరింపఁబడిన యుత్పాతంబులనే గాంచెను.

అని, తాత్పర్యము.

తానుత్పాతాన్మహాఘోరా నుత్థితాన్ రోమహర్షణాన్
ప్రజానామహితాన్ దృష్ట్వా రామో లక్ష్మణ మబ్రవీత్. ౨

టీక॥ సః(అధ్యాహృతము)=ఆ; రామః= రాముఁడు; మహాఘోరాన్=మహాభయంకరములును; రోమహర్షణాన్= వెండ్రుకలగగుపాటు నొందించునవియును; ప్రజానాం=ప్రజలకు ; అహితాన్=కీడుకలిగించునవియునగు; ఉత్థితాన్=పొడసూపిన; తాన్=ఆ ; ఉత్పాతాన్= ఉత్పాతంబులను ; దృష్ట్వా=చూచి, లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

రాముండు, మహాభయంకరంబులు నురోమహర్షణంబులును జనులకుంగీడుగావించునవియునగు నట్టియుత్పాతంబులుపొడసూపుటంగని, లక్ష్మణుం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇమాన్ పశ్య మహాబాహో సర్వభూతాపహారిణః
సముత్థితాన్ మహాఘోరా న్నుత్పాతాన్ సంహర్తుం సర్వరాక్షసాన్. ౩

టీక॥ మహాబాహో = పెద్దచేతులుగలలక్ష్మణుఁడా! సర్వభూతాపహారిణః = సమస్తభూతంబుల సంహరించునవియు; మహాఘోరాన్ = మిక్కిలియు భయంకరంబులును; సర్వరాక్షసాన్ = సమస్తరాక్షసులను; సంహర్తుం = సంహరించుటకు; సముత్థితాన్ = లేచినవియునగు, ఇమాన్ = ఈ; మహోత్పాతాన్ = మహోత్పాతంబులను; పశ్య = చూడుము.

మహాబాహుండవగులక్ష్మణుఁడా! సమస్తరాక్షసులనుసంహరించుటకై సర్వభూతభయంకరంబులగునీమహోత్పాతంబులుపొడసూపినవి; చూడుము.

అని, తాత్పర్యము.

అమీ రుధిరధారాస్తు విసృజంతః ఖరస్వనాః
వ్యోమ్ని మేఘా వివర్తంతే పరుషా గర్దభారుణాః. ౪

టీక॥ పరుషాః = తీక్ష్ణములును; గర్దభారుణాః = గాడిదవలెనెఱ్ఱనైనవియునగు; అమీ = ఈ; మేఘాః = మేఘములు; రుధిరధారాః = నెత్తురుదారలను; విసృజంతస్తు = విడుచుచునే; ఖరస్వనాః = తీక్ష్ణమయినధ్వనిగలవై; వ్యోమ్ని = ఆకాశమునందు; వివర్తంతే = తిరుగుచున్నవి.

పరుషములుగార్దభవర్ణములునగు నీమేఘంబులు, రక్తధారలువర్షింపుచు, మహాధ్వనిగలుగునట్లుగర్జించుచు, నాకాశంబునఁదిరుగుచున్నవి.

అని, తాత్పర్యము.

సధూమాశ్చ శరా స్సర్వే మమ యుద్ధాభినందితాః

రుక్మపృష్ఠాని చాపాని వివేష్టంతేచ లక్ష్మణ. ౫

టీక॥ లక్ష్మణ= లక్ష్మణుఁడా! మమ=నాయొక్క; శరాః=బాణములు; సర్వే=అన్నియు; సధూమాశ్చ=పొగతోఁగూడినవియునై; యుద్ధాభినందితాః=యుద్ధమునందుసంతోషంబుగలవిగానున్నవి. రుక్మపృష్ఠాని= బంగారము వీపులందుఁగల; చాపానిచ = ధనస్సులును; వివేష్టంతే=పొరలుచున్నవి.

లక్ష్మణుఁడా! నాబాణములన్నియు పొగరాజుచుయుద్ధంబుఁగోరుచున్నవి; కాంచనాలంకృతంబులగునాధనుస్సులు, యుద్ధోత్సాహంబుననాతురంబులయి పొరలుచున్నవి.

అని, తాత్పర్యము.

యాదృశా ఇహ కూజంతి పక్షిణో వనచారిణః
అగ్రతో నో భయం ప్రాప్తం సంశయో జీవితస్యచ. ౬

టీక॥ ఇహ = ఇప్పుడు; యాదృశాః=ఎట్టి; వనచారిణః=అడవియందు సంచరించునట్టి; పక్షిణః=పక్షులు; కూజంతి= కూయుచున్నవో ; తస్మాత్ (అధ్యాహృతము) = అందువలన; అగ్రతః=ముందట; నః = మనకు; భయం=భయము; ప్రాప్తం=వచ్చినది. జీవితస్య= ప్రాణముయొక్క ; సంశయశ్చ=సందేహమును; ప్రాప్తః (అధ్యాహృతము)=వచ్చినది.

ఇప్పుడు, కూయుచుండునట్టివనచరపక్షులంజూడఁగా, ముందుమనకుభయంబును ప్రాణసంశయంబును గలుగుననితోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

సంప్రహారస్తు సుమహాన్ భవిష్యతి నసంశయః
అయమాఖ్యాతి మే బాహు స్స్ఫురమాణో ముహుర్ముహుః. ౭

టీక॥ సుమహాన్= మిక్కిలియుగొప్పదగు; సంప్రహారస్తు=యుద్ధముమాత్రము; భవిష్యతి=కలుగును. సంశయః= సందేహము; న= లేదు. ముహుర్ముహుః=మాటిమాటికి; స్ఫురమాణః = స్ఫురించుచున్న; అయం=ఈ; మే=నా

యొక్క; బాహుః=చేయి; ఆఖ్యాతి=చెప్పుచున్నది.

మహాయుద్ధంబు మాత్రముజరుగును; ఇందుకుసందేహములేదు; నాదక్షిణభుజముమాటిమాటికి స్ఫురించుచుండుటవలనఁదెలియవచ్చినది.

అని, తాత్పర్యము.

సన్నికర్షేతు న శ్శూర జయం శత్రోః పరాజయమ్

టీక॥ శూర=యుద్ధమునందుభయములేనిలక్ష్మణుఁడా! సన్నికర్షేతు=సమీపమునందే, నః=మనకు, జయం=జయమును; శత్రోః=శత్రువునకు; పరాజయం=అపజయమును; భవిష్యతి(అధ్యాహృతము)=కాఁగలదు.

శూరుండవగులక్ష్మణుఁడా! ఇంకశీఘ్రంబుననె, మనకుజయంబును శత్రువునకుఁబరాజయంబునుగలుగును.

అని, తాత్పర్యము.

స ప్రభంచ ప్రసన్నంచ తవ వక్త్రం హి లక్ష్యతే. ౮

టీక॥ తవ=నియొక్క; వక్త్రం=ముఖము; సప్రభంచ=కాంతితోఁగూడినదిగాను; ప్రసన్నంచ=నిర్మలముగాను; లక్ష్యతేహి=చూడఁబడుచున్నదిగదా.

నీముఖంబును, గాంతిమంతంబును బ్రసన్నంబును గాఁగాపట్టుచున్నది.

అని, తాత్పర్యము.

ఉద్యతానాంహి యుద్ధార్థం యేషాం భవతి లక్ష్మణ
నిష్ప్రభం వదనం తేషాం భవ త్యాయుఃపరిక్షయః. ౯

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! యుద్ధార్థం=యుద్ధముకొఱకు; ఉద్యతానాం=ఉద్యుక్తులయిన; యేషాం=ఎవ్వరియొక్క; వదనం=ముఖము; నిష్ప్రభం=కాంతిహీనమో; తేషాం=వారలకు; ఆయుఃపరిక్షయః=ఆయునాశము; భవతి=కలుగును.

లక్ష్మణుఁడా! యుద్ధమువచ్చినప్పుడు, ఎవ్వరిముఖముకాంతిహీనమగునో, వారలకుఁబ్రాణహానికలుగును.

అని, తాత్పర్యము.

రక్షసాం నర్దతాం ఘోర శ్శ్రూయతేచ మహాధ్వనిః
ఆహతానాంచ భేరీణాం రాక్షసైః క్రూరకర్మభిః. ౧౦

టీక॥ నర్దతాం = అఱచుచున్న; రక్షసాం = రాక్షసులయొక్కయు ; క్రూరకర్మభిః= క్రూరములయినకార్యములుగల; రాక్షసైః= రాక్షసులచేత; ఆహతానాం = కొట్టఁబడిన; భేరీణాంచ = భేరులయొక్కయు; ఘోరః= భయంకరమయిన ; మహాధ్వనిశ్చ=గొప్పధ్వనియు; శ్రూయతే = వినఁబడుచున్నది.

ఇదిగో , రాక్షసులసింహనాదంబులును భేరీధ్వనులును , మహాభయంకరముగా , మనవీనులకు వినవచ్చుచున్నవి. అని, తాత్పర్యము.

అనాగతవిధానంతు కర్తవ్యం శుభ మిచ్ఛతా
ఆపదం శంకమానేన పురుషేణ విపశ్చితా. ౧౧

టీక॥శుభం=మంగళమును ; ఇచ్ఛతా=కోరుచున్నవాఁడును ; ఆపదం=ఆపత్తును;శంకమానేన=సందేహించుచున్నవాఁడునగు;విపశ్చితా=పండితుండయిన;పురుషేణ=పురుషునిచేత ; అనాగతవిధానంతు=రానిదానికిఁ బ్రతీకారము;కర్తవ్యం= చేయఁబడవలసినది.

ఆపదవచ్చునేమోయని భయపడువాఁడునుమంగళంబుగోరువాఁడునుబండితుండునగుపురుషుండు, ఆపదవచ్చుటకుమున్నె దానికిఁబ్రతీకారంబు సేయవలసినది.అని, తాత్పర్యము.

తస్మాద్గృహీత్వా వైదేహీం శరపాణి ర్ధనుర్ధరః
గుహా మాశ్రయ శైలస్య దుర్గాం పాదపసంకులామ్. ౧౨

టీక॥తస్మాత్=అందువలన;త్వం(అధ్యాహృతము)=నీవు;శరపాణిః= బాణముచేతంగలవాఁడవై;ధనుర్ధరః=ధనుస్సునుదాల్చినవాఁడవై; వైదేహీం=సీతను;గృహీత్వా = తీసికొని ; దుర్గాం=ప్రవేశింపరానిదియు; పాదప

సంకులాం=వృక్షములచే నిండినదియు నగు, శైలస్య=పర్వతముయొక్క; గుహాం=గుహను; ఆశ్రయ = ఆశ్రయించుము.

అందువలన, నీవు ఘనచాపంబు లుధరించి, సీతం దీసికొని, దుర్గమంబును వృక్షములచే నాచ్ఛాదితంబును గు గుహం బ్రవేశించికాచియుండుము.

అని, తాత్పర్యము.

ప్రతికూలితు మిచ్ఛామి నహి వాక్య మిదం త్వయా
శాపితో మమ పాదాభ్యాం గమ్యతాం వత్స మాచిరమ్. ౧౩

టీక॥ వత్స=బిడ్డఁడవగు లక్ష్మణుఁడా! త్వయా=నీచేత, ఇదం = ఈ; వాక్యం=మాటను; ప్రతికూలితుం = ఎదిరించుటకు; నేచ్ఛామి=కోరను. మమ=నాయొక్క, పాదాభ్యాం= పాదముల చేత; శాపితః = ఒట్టుపెట్టఁబడినాఁడవు. మాచిరం = శీఘ్రముగా; గమ్యతాం=పొందఁబడుఁగాక.

లక్ష్మణుఁడా! నీవీమాటకడ్డము చెప్పవలదు; నాపాదంబులయాన; జాగు సేయవలదు; శీఘ్రముగాఁబొమ్ము.

అని, తాత్పర్యము.

త్వం హి శూరశ్చ బలవాన్ హన్యా హ్యేతా న్న సంశయః
స్వయంతు హంతు మిచ్ఛామి సర్వానేవ నిశాచరాన్. ౧౪

టీక॥ త్వం=నీవు; శూరశ్చ= యుద్ధమునందుభయములేనివాఁడవును; బలవాన్ హి=అధికమయినబలముగలవాఁడవునుగదా! ఏతాన్= ఈ రాక్షసులను; హన్యాహి=చంపుదువుగదా! సంశయః=సందేహము; న= లేదు. స్వయంతు=నేనే; నిశాచరాన్ = రాక్షసులను; సర్వానేవ=అందఱనే; హంతుం=వధించుటకు; ఇచ్ఛామి= కోరుచున్నాను.

నీవుశూరుండవుబలవంతుండవు; ఈరాక్షసులనందఱను వధింపఁ జాలుదువు; ఇందుకుసందియములేదు; అయితే, నేనేయీరాక్షసులనందఱు వధింపఁ దలఁచియున్నాను. అని, తాత్పర్యము.




ఏ వముక్తస్తు రామేణ లక్ష్మణ స్సహ సీతయా
శరా నాదాయ చాపంచ గుహాం దుర్గాం సమాశ్రయత్. ౧౫

టీక॥ లక్ష్మణః=లక్ష్మణుఁడు; రామేణ=రామునిచేత; ఏవం= ఇట్లు; ఉక్తస్తు = చెప్పఁబడినవాఁడైనంతనె; శరాన్=బాణములను; చాపంచ= ధనుస్సును; ఆదాయ=తీసికొని; సీతయాసహ=సీతతోఁగూడ; దుర్గాం= పోందఁగూడని; గుహాం=గుహను; సమాశ్రయత్=ఆశ్రయించెను.

లక్ష్మణుఁడు, రాముని మాటను విని, ధనుర్బాణంబులను దాల్చి, సీతదేవిఁదీసికొని, దుష్ప్రవేశంబగు గుహానాశ్రయించెను. అని, తాత్పర్యము.

తస్మిన్ ప్రవిష్టేతు గుహాం లక్ష్మణే సహ సీతయా
హంత నిర్యుక్త మిత్యుక్త్వా రామః కవచ మావిశత్. ౧౬

టీక॥ తస్మిన్=ఆ; లక్ష్మణే=లక్ష్మణుఁడు; సీతయాసహ=సీతాదేవితోఁగూడ; గుహాం=గుహను; ప్రవిష్టేతు= ప్రవేశించినంతనె; రామః=రాముఁడు, హంత; ఆ! నిర్యుక్తం = మంచియుపాయము! ఇతి=అని; ఉక్త్వా = చెప్పి; కవచం=కవచమును; ఆవిశత్= పొందెను.

లక్ష్మణుండు సీతాదేవిందీసికొనిగుహం బ్రవేశించినపిదప, రాముండు, "ఆ! మంచియుపాయంబుదోఁచినది." అని చెప్పి, మేనంగవచంబుధరించెను.

అని, తాత్పర్యము.

స తేనాగ్నినికాశేన కవచేన విభూషితః
బభూవ రామ స్తిమిరే విధూమో గ్నిరివోత్థితః. ౧౭

టీక॥ అగ్నినికాశేన= అగ్నిహోత్రముతోఁసమానమయిన; తేన = ఆ; కవచేన=కవచముచేత; విభూషితః= అలంకరింపఁబడిన; సః = ఆ; రామః= రాముఁడు; తిమిరే = చీఁకటియందు; ఉత్థితః=లేచిన; విధూమః = పొగలేని; అగ్నిరివ=అగ్నిహోత్రమువలె, బభూవ=ఉండెను.

అగ్నిహోత్రమువలె వెలుఁగు చున్నట్టి యావకచము దొడుగుకొన్నపి దప, రాముండు, చీఁకటియందుఁ బాఁగలేకమందుచున్నయగ్నిపగిది వెలుంగుచుండెను. అని, తాత్పర్యము.

స చాప ముద్యమ్య మహ చ్ఛరా నాదాయ వీర్యవాన్
బభూవా వస్థిత స్తత్ర జ్యాస్వనైః పూరయన్ దిశః. ౧౮

టీక॥ వీర్యవాన్ = అధికమయిన పరాక్రమముగల; సః = ఆరాముఁడు, మహత్ = గొప్పదగు; చాపం = ధనుస్సును; ఉద్యమ్య = పట్టుకొని; శరాన్ = బాణములను; ఆదాయ = తీసికొని; తత్ర = అచ్చట; జ్యాస్వనైః = అల్లెత్రాటిధ్వనులచేత; దిశః = దిక్కులను; పూరయన్ = నిండించుచు; బభూవ = ఉండెను.

మహాపరాక్రమశాలియగు నారాముండు, అట్లు మహాధనుస్సును బాణంబులనుదీసికొని, జ్యాఘోషంబులదిక్కులుపిక్కటిల్లఁజేయుచునుండెను.
అని, తాత్పర్యము.

తతో దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ సహచారణైః
సమేయుశ్చ మహాత్మానో యుద్ధదర్శనకాంక్షిణః. ౧౯

టీక॥ తతః = అంత; మహాత్మానః = అధికమయినప్రభావముగల; సగంధర్వాః = గంధర్వులతోఁగూడిన; దేవాః = దేవతలును; సిద్ధాశ్చ = సిద్ధులును; చారణైస్సహ = చారణులతోఁగూడ; యుద్ధదర్శనకాంక్షిణః = యుద్ధముచూచుటంగోరువారలయి; సమేయుశ్చ = వచ్చిరియు.

అంత, మహాత్ములగు దేవతలును గంధర్వులును సిద్ధులును జారణులును యుద్ధంబుఁజూచుటకైవచ్చిరి.
అని, తాత్పర్యము.

ఋషయశ్చ మహాత్మానో లోకే బ్రహ్మర్షిసత్తమాః
సమేత్య చోచు స్సహితా అన్యోన్యం పుణ్యకర్మణః. ౨౦




టీక॥ లోకే=లోకమునందు; బ్రహ్మర్షిసత్తమాః = బ్రహ్మర్షిశ్రేష్ఠులును; పుణ్యకర్మాణః (పుణ్యకర్మాణః)= పుణ్యములయిన కార్యములుగలవారలును; మహాత్మానః = అధికమయినప్రభావముగలవారలునగు ; ఋషయశ్చ=ఋషులును;సమేత్యచ = వచ్చియు; సహితాః = కూడినవారలయి; అన్యోన్యం = పరస్పరమునుగూడి; ఊచుః=చెప్పిరి.

పుణ్యకర్ములును మహాత్ములును బ్రహ్మర్షిప్రవరులునగుఋషులును, అచ్చోటికివిచ్చేసి,యందఱుంజేరి, యొండొరులతో,నిట్లని, చెప్పుకొనిరి.

అని, తాత్పర్యము.

స్వస్తి గోబ్రాహ్మణేభ్యోస్తు లోకానాం యే ఽభిసంగతాః

టీక॥ గోబ్రాహ్మణేభ్యః= గోవులకొఱకును బ్రాహ్మణులకొఱకును; యే= ఎవరు; లోకానాం=లోకములకు, అభిసంగతాః= మేలుగోరువారలో; తేభ్యశ్చ(అధ్యాహృతము)= వారలకొఱకును; స్వస్తి= మంగళము; అస్తు = అగుంగాక.

గోబ్రాహ్మణులకును లోకహితార్థులగు వారలకునుమంగళంబు గలుగుంగాక. అని, తాత్పర్యము.

జయతాం రాఘవో యుద్ధే పౌలస్త్యాన్ రజనీచరాన్. ౨౧
చక్రహస్తో యథా యుద్ధే సర్వానసురపుంగవాన్

టీక॥ యుద్ధే=యుద్ధమునందు; రాఘవః= రాముఁడు ; పౌలస్త్యాన్ = పులస్త్యునివంశమునందుఁబుట్టిన; రజనీచరాన్ = రాక్షసులను; యుద్ధే= యుద్ధమునందు; చక్రహస్తః=విష్ణువు; అసురపుంగవాన్ =అసురశ్రేష్ఠులను; సర్వాన్ యథా=అందఱనువలె; జయతాం = గెలుచుఁగాక.

చక్రపాణియగువిష్ణుదేవుండు, సమస్తాసురులనుజయించినట్లు, రాముండు, పౌలస్త్యులగు రాక్షసులనందఱను యుద్ధంబునజయించుఁగాక. అని,యాదేవాదులుపరస్పరము చెప్పుకొనిరి.

అని, తాత్పర్యము.




ఏవ ముక్త్వా పునః ప్రోచు రాలోక్యచ పరస్పరమ్. ౨౨

టీక॥ తే(అధ్యాహృతము)= ఆ దేవాదులు, ఏవం=ఇట్లు, ఉక్త్వా= చెప్పి, పునః=మఱల; పరస్పరం = ఒండొరులను; ఆలోక్యచ=చూచియు; ప్రోచుః= చెప్పిరి.

ఈప్రకారమునం జెప్పి, యా దేవతలు మున్నగువారలు మఱలనొండొరులంజూచి, యిట్లని చెప్పుకొనిరి.

అని, తాత్పర్యము.

చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్
ఏకశ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి. ౨౩

టీక॥ భీమకర్మణాం=భయంకరమయిన కార్యముగల; రక్షసాం = రాక్షసులయొక్క; చతుర్దశ = పదునాలుగు; సహస్రాణి= వేలు; సంతి (అధ్యాహృతము)=ఉన్నవి. ధర్మాత్మా = ధర్మస్వభావుండగు; రామః = రాముఁడు; ఏకశ్చ=ఒక్కఁడే. కథం = ఎట్లు; యుద్ధం=యుద్ధము; భవిష్యతి = కాఁగలదు?

భయంకర కర్ములగు రాక్షసులు పదునాలుగు వేవురున్నవారు; ధర్మాత్ముండగు రాముండొక్కఁడె ; యుద్ధం బెట్టుజరగును? అని, దేవతలు మున్నగువారలు చెప్పుకొనిరి.

అని, తాత్పర్యము.

ఇతి రాజర్షయ స్సిద్ధా స్సగణాశ్చ ద్విజర్షభాః
జాతకౌతూహలా స్తస్థు ర్విమానస్థాశ్చ దేవతాః. ౨౪

టీక॥ ఇతి=ఇట్లు; రాజర్షయః = రాజర్షులును; సగణాః= సమూహముతోఁగూడిన; సిద్ధాః=సిద్ధులును; ద్విజర్షభాః=బ్రాహ్మణశ్రేష్ఠులును; దేవతాశ్చ=దేవతలును; విమానస్థాః = విమానముననున్నవారలయి; జాతకౌతూహలాః= పుట్టినవేడుకగలవారలయి; తస్థుః=నిలిచిరి.

ఇట్లు, రాజర్షులును సిద్ధులును బ్రహ్మర్షులును దేవతలును, యుద్ధంబుఁ

జూచువేడుకతో, విమానారూఢులయి యాకాశంబుననుండిరి. అని, తాత్పర్యము.

ఆవిష్టం తేజసా రామం సంగ్రామశిరసి స్థితమ్
దృష్ట్వా సర్వాణి భూతాని భయాద్వ్యథిరే తదా. ౨౫

టీక॥ తదా=అప్పుడు; తేజసా=తేజస్సుచేత; ఆవిష్టం = ఆవేశింపఁబడినవాఁడును, సంగ్రామశిరసి= యుద్ధాగ్రమునందు. స్థితం=ఉన్నవాఁడునగు; రామం=రామునిఁ; దృష్ట్వా=చూచి, సర్వాణి=సమస్తములయిన, భూతాని=భూతంబులు, భయాత్=భయమువలన; వివ్యథిరే=దుఃఖించినవి.

అప్పుడు, అద్భుతంబగు తేజస్సుతోఁ గూడియుద్ధాగ్రంబుననున్న రాముంజూచి, సమస్తభూతంబులు భయమోహితంబులయినవి. అని, తాత్పర్యము.

రూపమప్రతిమం తస్య రామస్యాక్లిష్టకర్మణః
బభూవ రూపం క్రుద్ధస్య రుద్రస్యేవ మహాత్మనః. ౨౬

టీక॥ అక్లిష్టకర్మణః =దుఃఖకరము కానికార్యములుగల; తస్య=ఆ; రామస్య=రామునియొక్క; అప్రతిమం= పోల్కిలేని; రూపం=ఆకారము ; మహాత్మనః=అధికమయిన ప్రభావముగల, క్రుద్ధస్య=కోపమునొందిన; రుద్రస్య= రుద్రునియొక్క; రూపమివ = ఆకారమువలె, బభూవ=ఉండెను.

అప్పుడు క్రుద్ధుండయినయక్లిష్టకర్ముఁడగు నా రామునియాకారంబు, క్రుద్ధుండగు రుద్రుని యాకారంబుపగిది , నెంతయు భయంకరంబై యొప్పినది.

అని, తాత్పర్యము.

ఇతి సంభావ్యమానే తు దేవగంధర్వచారణైః
తతో గంభీరనిర్హ్రాదం ఘోరవర్మాయుధధ్వజమ్. ౨౭
అనీకం యాతుధానానాం సమంతాత్ప్రత్యదృశ్యత

టీక॥ ఇతి=ఇట్లు ; దేవగంధర్వచారణైః= దేవతలచేతను గంధర్వులచే

తనుజారణుల చేతను; సంభాష్యమాణే తు=చెప్పఁబడుచుండఁగానే ; తతః= అంత;గంభీరనిహ్రాదం=గంభీరమగు నధ్వనిగలదియు; ఘోరవర్మాయుధధ్వజం=భయంకరములయిన కవచములును ఆయుధములును ధ్వజములునుగలదియునగు;యాతుధానానాం = రాక్షసులయొక్క;అనీకం= సైన్యము;సమంతాత్=అంతటను; ప్రత్యదృశ్యత= చూడఁబడినది.

ఇట్లు , దేవగంధర్వచారణులు, చెప్పుకొనుచుండఁగానే , అంత, గంభీరధ్వనియు భయంకరంబులగు కవచంబులునాయుధంబులును ధ్వజంబులును గలదియునగు నారాక్షస సైన్యము , ఎల్లెడలం జూపట్టెనది.

అని, తాత్పర్యము.

సింహనాదం విసృజతా మన్యోన్య మభిగర్జతామ్. ౨౮
చాపాని విస్ఫారయతాం జృంభతా మప్యభీక్ష్ణశః
విప్రఘుష్టస్వనానాంచ దుందుభీశ్చాపి నిఘ్నతామ్. ౨౯
తేషాం సుతుముల శ్శబ్దః పూరయామాస త ద్వనమ్

టీక। సింహనాదం=సింహనాదమును; విసృజతాం= విడుచుచున్నవారలును; అన్యోన్యం=ఒండొరులనుగూర్చి ; అభిగర్జతాం=గర్జించుచున్నవారలును; చాపాని= ధనుస్సులను ; విస్ఫారయతాం = ధ్వనింపఁజేయుచున్నవారలును;అభీక్ష్ణశః=మిక్కిలియు; జృంభతామపి=ఆవలింతలువిడుచుచున్న వారలును;విప్రఘుష్టస్వనానాం= అఱచుచున్న ధ్వనులుగలవారలును; దుందుభీః=భేరులను; నిఘ్నతాంచాపి=కొట్టుచున్నవారలునగు; తేషాం = ఆరాక్షసులయొక్క;సుతుములః=మిక్కిలియు దొమ్మియయిన; శబ్దః=ధ్వని; తత్=ఆ ; వనం=అడవిని; పూరయామాస= నించెను.

సింహనాదంబులు సేయువారలును ఒండొరులంజూచి నేనుజయించెద నేను జయించెదనని యుచ్చైనాదంబున నుద్ఘోషించువారలును జ్యానాదంబులు గావించువారలును మదంబుననావలింతలువిడుచువారలును మహాధ్వనులు గలుగునట్లఱచు వారలును భేరులు వాయించువారలునగు నారాక్షసుల తు

ములధ్వని, యావనంబంతయు నిండిచెలంగినది. అని, తాత్పర్యము.

తేన శబ్దేన విత్రస్తా శ్శ్వాపదా వనచారిణః. ३०
దుద్రువు ర్యత్ర నిశ్శబ్దం పృష్ఠతో నావ్యలోకయన్

టీక॥ వనచారిణః= అడవియందుఁదిరుగునట్టి; శ్వాపదాః= క్రూరజంతువులు; తేన=ఆ; శబ్దేన=ధ్వనిచేత; విత్రస్తాః=భయపడినవై; యత్ర= ఎచ్చస; నిశ్శబ్దం= శబ్దములేమియు; తత్ర (అధ్యాహృతము)=అచ్చటికి; దుద్రువుః=పాఱినవి. పృష్ఠతః=వెనుకను; నవ్యలోకయన్=చూడలేదు.

అడవియందుండునట్టి క్రూరజంతువులు, ఆధ్వనికిభయమునొంది, తిరిగి చూడక, నిశ్శబ్దముగానున్నస్థలమునకుఁబాఱిపోయినవి. అని, తాత్పర్యము.

తత్త్వనీకం మహాఘోరం రామం సముపసర్పత. ३१
ధృతనానాప్రహరణం గంభీరం సాగరోపమమ్

టీక॥ ధృతనానాప్రహరణం = ధరింపఁబడిన నానావిధములయిన యాయుధములుగలదియు; గంభీరం= లోఁతైనదియు; సాగరోపమం = సముద్రముతోఁబోలికగలదియు ; మహాఘోరం=మిక్కిలియు భయంకరంబునగు; తత్=ఆ, అనీకంతు=సైన్యమును ; రామం=రాముని; సముపసర్పత (సముపాసర్పత్)=సమీపించెను.

నానావిధాయుధంబులతోఁ గూడినదియునితరులకుదప్రవేశంబును సముద్రతుల్యంబును మహా భయంకరంబునగునారాక్షససేన , రామునిచెంతకుఁబోయినది. అని, తాత్పర్యము.

రామోపి చారయన్ చక్షు స్సర్వతో రణపండితః. ३२
దదర్శ ఖరసైన్యం త ద్యుద్ధాభిముఖ ముత్థితమ్

టీక॥ రణపండితః = యుద్ధమునందుఁబండితుండగు; రామోపి= రాముండును; చక్షుః=కంటిని; సర్వతః=అంతటను; చారయన్=సంచరింపఁజేయుచు;

యుద్ధాభిముఖం = యుద్ధమునకెదురు మొగముగలదియు; ఉత్థితం = ఉద్యుక్తంబునగు, తత్ = ఆ; ఖరసైన్యం = ఖరుని సేనను; దదర్శ = చూచెను.

యుద్ధమునందుఁబండితుండగు రాముండును, నలుప్రక్కలంజూచి, యుద్ధంబునకు సన్నద్ధంబుగా వచ్చిన ఖరసైన్యముం గనెను. అని, తాత్పర్యము.

వితత్య చ ధను ర్భీమం తూణ్యాశ్చో ద్ధృత్య సాయకాన్. ౩౩
క్రోధ మాహారయ త్తీవ్రం వధార్థం సర్వరక్షసామ్

టీక॥ సః (అధ్యాహృతము) = ఆ రాముఁడు; భీమం = భయంకరమయిన; ధనుః = విల్లును; వితత్యచ = విస్తరిల్లఁజేసియు; తూణ్యాః = అమ్ములపొదినుండి; సాయకాన్ = బాణములను; ఉద్ధృత్యచ = ఎత్తియు; సర్వరక్షసాం = సమస్తరాక్షసులయొక్కయు; వధార్థం = చంపుటకొఱకు; తీవ్రం = తీక్ష్ణమయిన; క్రోధం = కోపమును; ఆహారయత్ = తెచ్చుకొనెను.

రాముండు, భయంకరాకారంబగు ధనుస్సును గొంచెము వంచి, యమ్ములపొదినుండి బాణంబులుదీసి, సమస్తరాక్షసులను వధించుటకై, తీవ్రంబగు కోపం బవలంబించెను. అని, తాత్పర్యము.

దుష్ప్రేక్షః సోఽభవ త్క్రుద్ధో యుగాంతాగ్ని రివ జ్వలన్. ౩౪
తం దృష్ట్వా తేజసా విష్టం ప్రాద్రవన్ వనదేవతాః

టీక॥ క్రుద్ధః = కోపమునొందిన; సః = ఆ రాముఁడు, యుగాంతాగ్నిరివ = ప్రళయకాలాగ్నివలె; జ్వలన్ = మండుచు; దుష్ప్రేక్షః = చూడఁగూడనివాఁడు; అభవత్ = అయ్యెను. తేజసా = తేజంబుచే; ఆవిష్టం = ఆవేశింపఁబడిన; తం = ఆ రాముని; దృష్ట్వా = చూచి; వనదేవతాః = వనదేవతలు; ప్రాద్రవన్ = పరుగెత్తిరి.

అట్లు రాముండు క్రుద్ధుండై, ప్రళయకాలానలంబుపగిదిఁ దేఱిచూడ నలవిగాక తేజరిల్లుచుండెను; అట్లు తేజంబున దుర్నిరీక్షుండై, వెలుంగుచున్న రాముంజూచి, వనదేవతలు భయంబునం బాఱిపోయిరి.

అని, తాత్పర్యము.

తస్య క్రుద్ధస్య రూపంతు రామస్య దదృశే తదా. ౩౫
దక్షస్యేవ క్రతుం హంతు ముద్యతస్య పినాకినః

టీక॥ తదా=అప్పుడు; క్రుద్ధస్య = కోపమునొందిన; తస్య= ఆ; రామస్య= రామునియొక్క; రూపంతు=ఆకారముమాత్రము; దక్షస్య= దక్షప్రజాపతియొక్క; క్రతుం=యాగమును; హంతుం=చెఱుపుటకు; ఉద్యతస్య=ఉద్యుక్తుండైన; పినాకినఇవ=రుద్రునియొక్కవలె; దదృశే= చూడఁబడినది.

అప్పుడు రాక్షసవధార్థమయి క్రుద్ధుండగు రామునియాకారంబు, దక్షప్రజాపతియజ్ఞంబుహరింప నుద్యుక్తుండైయతిక్రుద్ధుండైన రుద్రునియాకారంబుకైవడి, యతిభయంకరంబయి, చూపట్టినది.అని, తాత్పర్యము.

ఆవిష్టం తేజసా రామం సంగ్రామశిరసి స్థితమ్. ౩౬
దృష్ట్వా సర్వాణి భూతాని భయార్తాని ప్రదుద్రువుః

టీక॥సంగ్రామశిరసి=యుద్ధాగ్రమునందు; స్థితం = ఉన్నవాఁడును; తేజసా=తేజస్సుచేత; ఆవిష్టం= ఆవేశింపఁబడినవాఁడునగు; రామం=రాముని, దృష్ట్వా=చూచి; సర్వాణి= సమస్తములయిన; భూతాని=భూతములు ; భయార్తాని = భయపీడితంబులయి; ప్రదుద్రువుః = పాఱినవి.

అట్లుయుద్ధాగ్రంబుననిలుచుండిదుర్నిరీక్ష తేజుండైయున్న రాముంజూచి, సమస్త భూతంబులును భయపీడితంబులయిపరుగెత్తినవి.అని, తాత్పర్యము.

తత్కార్ముకైరాభరణైర్ధ్వజైశ్చ
తైర్వర్మభిశ్చాగ్నిసమానవర్ణైః. ౩౭
బభూవ సైన్యం పిశితాశనానాం
సూర్యోదయే నీల మివాభ్రబృందమ్

టీక॥ కార్ముకైః = ధనుస్సులచేతను;ఆభరణైః = సొమ్ములచేతను;ధ్వ

జైశ్చ=టెక్కెములచేతను ; అగ్నిసమానవర్ణైః = నిప్పుతోసమానమయినరంగుగల; తైః=ఆ; వర్మభిః = కవచములచేతను; తత్ = ఆ ; పిశితాశనానాం=రాక్షసులయొక్క; సైన్యం = సైన్యము; సూర్యోదయే = సూర్యోదయకాలమునందు, నీలం=నల్లని ; అభ్రబృందమివ=మేఘసమూహమువలె; బభూవ=ఉండినది.

అస్లుకాంచనాలంకృతంబులగు ధనుస్సులను భూషణంబులను ధ్వజంబులను అగ్నిసమానవర్ణంబులగు కవచంబులను ధరించియుండుటంజేసి, నీలవర్ణులగు నా రాక్షసుల సైన్యము, సూర్యోదయంబున , సూర్యకిరణంబులతోఁగలసిననీలమేఘసమూహంబుకరణిఁ బ్రకాశించినది. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే ,
అరణ్యకాండే , చతుర్వింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండచతుర్వింశసర్గటీక,
ముగిసినది.



స ౨౫

౨౫

పంచవింశసర్గప్రారంభః.

అవష్టబ్ధధనుం రామం క్రుద్ధంచ రిపుఘాతినమ్
దదర్శాऽऽశ్రమ మాగమ్య ఖర స్సహ పురస్సరైః. ౧

టీక॥ ఖరః=ఖరుఁడు ; పురస్సరైస్సహ=ముందునడచువారలతోఁగూడ; ఆశ్రమం=ఆశ్రమమును; ఆగమ్య=పొంది;అవష్టబ్ధధనుం=అవలంబింపఁబడినధనుస్సుగలవాఁడును; క్రుద్ధంచ= కోపించినవాఁడును; రిపుఘాతినం=శత్రువులవధించువాఁడునగు; రామం= రామును; దదర్శ=చూచెను.

ఖరుండు,సైనికులతోఁగూడరామాశ్రమంబుఁకవచ్చి, ధనుర్ధరుండై క్రుద్ధుండైయున్నశత్రుఘాతకుండగు రాముంజూచెను. అని, తాత్పర్యము.

తం దృష్ట్వా సశరం చాప ముద్యమ్య ఖరనిస్స్వనమ్
రామస్యాభిముఖం సూతం చోద్యతా మిత్యచోదయత్. ౨

టీక॥సః(అధ్యాహృతము)= ఆఖరుఁడు;తం=ఆరాముని ; దృష్ట్వా=చూచి; సశరం= బాణముతోఁగూడిన ; ఖరనిస్స్వనం=తీక్ష్ణమయినధ్వనిగల;చాపం=ధనుస్సును ; ఉద్యమ్య=పట్టుకొని; సూతం=సారథినిగూర్చి ; "రామస్య = రామునకు;అభిముఖం=ఎదురుగా; చోద్యతాం=తోలఁబడుఁగాక."ఇతి= అని; అచోదయత్=ప్రేరించెను.

ఆఖరుండు, రాముంజూచి, మహాధ్వనియగుధనుస్సునుబాణంబును బట్టుకొని , రామునికభిముఖంబుగాఁదోలుము; అనిసారథినాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

స ఖరస్యాజ్ఞయా సూత స్తురగాన్ సమచోదయత్
యత్ర రామో మహాబాహు రేకో ధూన్వన్ స్థితో ధనుః. ౩




టీక॥ సః=ఆ; సూతః=సారధి; ఖరస్య=ఖరునియొక్క; ఆజ్ఞయా=ఆజ్ఞచేత; యత్ర=ఎచ్చట; మహాబాహుః=పెద్దచేతులుగల; రామః=రాముఁడు, ఏకః=ఒక్కఁడే; ధనుః = ధనుస్సును; ధూన్వన్=విసరుచు; స్థితః= ఉన్నాఁడో; తత్ర(అధ్యాహృతము)=అచ్చటికి; తురగాన్=గుఱ్ఱములను ; సమచోదయత్=తోలెను.

ఆసారధి, ఖరునానతిచొప్పున, మహాబాహుండగురాముండొక్కఁడె,ధనుర్ధరుండైయుండు స్థలంబునకు, గుఱ్ఱంబులందోలెను. అని, తాత్పర్యము.

తంతు నిష్పతితం దృష్ట్వా సర్వే తే రజనీచరాః
నర్దమానా మహానాదం సచివాః పర్యవారయన్. ౪

టీక॥నిష్పతితం=పోయిన;తం=ఆఖరుని;దృష్ట్వాతు= చూచినంతనే; సచివాః = మంత్రులగు; తే=ఆ; రజనీచరాః=రాక్షసులు; సర్వే=అందఱును, మహానాదం = మహాధ్వనిగలుగునట్లుగా;నర్దమానాః=అఱచుచు;పర్యవారయన్=చుట్టుకొనిరి.

అట్లుఖరుండు రామునిపైకిఁ బోవుటఁజూచినంతనె, శ్యేనగామిమున్నగునతనిమంత్రులందఱు, మహాధ్వనిగదురసింహనాదంబులు సేయుచు, నతనింబరివేష్టించిపోయిరి.అని, తాత్పర్యము.

స తేషాం యాతుధానానాం మధ్యే రథగతః ఖరః
బభూవ మధ్యే తారాణాం లోహితాంగ ఇవోదితః. ౫

టీక॥రథగతః = రథమునుబొందినట్టి; సః=ఆ;ఖరః=ఖరుఁడు; తేషాం=ఆ; యాతుధానానాం = రాక్షసులయొక్క; మధ్యే=నడుమునందు; తారాణాం=నక్షత్రములయొక్క;మధ్యే=నడుమునందు; ఉదితః = ఉదయించినట్టి; లోహితాంగఇవ=అంగారకుఁడువలె; బభూవ=ఉండెను.

నక్షత్రంబులనడుమ నుదితుం డగునంగారకుండు ప్రకాశించునట్లు,ఆరాక్షసుల నడుమ రథగతుండగు ఖరుండు తేజరిల్లెను. అని,తాత్పర్యము.




స ౨౫

తత శ్శరసహస్రేణ రామ మప్రతిమౌజసమ్
అర్దయిత్వా మహానాదం ననాద సమరే ఖరః. ౬

టీక॥ తతః=అంత; ఖరః= ఖరుఁడు, సమరే=యుద్ధమునందు; అప్రతిమౌజసం= సరిలేనిపరాక్రమముగల ; రామం= రాముని; శరసహస్రేణ=బాణంబులవేయింటిచేత; అర్దయిత్వా=నొప్పించి; మహానాదం=అధికమయినధ్వని గలుగునట్లుగా; ననాద=అఱచెను.

అంత, యుద్ధంబున, ఖరుండు, అసమానపరాక్రమశాలియగు రామునివేయిబాణంబులనొప్పించి, మహాధ్వనిగదుర, సింహనాదంబుగావించెను.

అని, తాత్పర్యము.

తత స్తం భీమధన్వానం క్రుద్ధా స్సర్వే నిశాచరాః
రామం నానావిధై శ్శస్త్రై రభ్యవర్షంత దుర్జయమ్. ౭

టీక॥ తతః=అంత; నిశాచరాః=రాక్షసులు; సర్వే=అందఱు; క్రుద్ధాః= కోపించినవారలయి; భీమధన్వానం = భయంకరమయిన ధనుస్సుగలవాఁడును; దుర్జయం=జయింపనలవిగానివాఁడునగు; తం=ఆ; రామం= రామునిగూర్చి; నానావిధైః= నానావిధములగు ; శస్త్రైః= ఆయుధములచేత ; అభ్యవర్షంత=కురిపించిరి.

అంత, నారాక్షసులందఱుఁ గుపితులయి, భయంకర ధనుర్ధరుండును జయింప నలవిగానివాఁడునగు రామునిపై, నానావిధాయుధంబులం గురిపించిరి. అని, తాత్పర్యము.

ముద్గరైః పట్టిసై శ్శూలైః ప్రాసైః ఖడ్గైః పరశ్వధైః
రాక్షసా స్సమరే రామం నిజఘ్ను రోషతత్పరాః. ౮

టీక॥ రాక్షసాః=రాక్షసులు; రోషతత్పరాః=కోపాధీనులయి; సమరే=యుద్ధమునందు; రామం = రాముని; ముద్గరైః= గుదియలచేతను; పట్టిసైః= అడ్డకత్తులచేతను; శూలైః = శూలములచేతను; ప్రాసైః= ఈఁటెలచేతను; ఖడ్గైః=కత్తులచేతను ; పరశ్వధైః=గొడ్డళ్లచేతను; నిజఘ్నుః= కొ

ట్టిరి.

రాక్షసులు, కుపితులయి, యుద్ధంబున, ముద్గరంబులుఁబట్టిసంబులుశూలంబులుఁబ్రాసంబులు ఖడ్గంబులుగొడ్డళ్లుమున్నగునాయుధంబులచేత, రాముంబ్రహరించిరి. అని, తాత్పర్యము.

తే వలాహకసంకాశా మహానాదా మహౌజసః
అభ్యధావంత కాకుత్థ్సం రథై ర్వాజిభి రేవచ. ౯
గజైః పర్వతకూటాభై రామం యుద్ధే జిఘాంసవః

టీక॥ వలాహకసంకాశాః = మేఘములతో సమానులును; మహానాదాః = అధికమయిన ధ్వనిగలవారలును; మహౌజసః = అధికమయినపరాక్రమము గలవారలునగు; తే = ఆ రాక్షసులు; యుద్ధే = యుద్ధమునందు; కాకుత్థ్సం = కకుత్థ్సవంశమునందుఁ బుట్టిన; రామం = రాముని; జిఘాంసవః = వధింపఁ గోరువారలయి; రథైః = రథములచేతను; వాజిభి రేవచ = గుఱ్ఱములచేతను; పర్వతకూటాభైః = పర్వతశిఖరములకాంతివంటికాంతిగల; గజైః = ఏనుంగులచేతను; అభ్యధావంత = తఱిమిరి.

మేఘాకారులును మహానాదులును మహాపరాక్రమశాలులునగు నా రాక్షసులు, యుద్ధంబున రామునివధింపంగోరి, కొందఱురథంబులచేతనుగొందఱు గుఱ్ఱంబులచేతను గొందఱు పర్వతశిఖరాకారంబులగు నేనుంగులచేతను, రామునిం దఱిమిరి. అని, తాత్పర్యము.

తే రామే దశ వర్షాణి వ్యసృజన్ రక్షసాం గణాః. ౧౦
శైలేంద్ర మివ ధారాభి ర్వర్షమాణా వలాహకాః

టీక॥ తే = ఆ; రక్షసాం = రాక్షసులయొక్క; గణాః = సమూహములు; రామే = రామునందు; దశవర్షాణి = పదివానలను; వర్షమాణాః = కురియుచున్న; వలాహకాః = మేఘములు; ధారాభిః = ధారలచేత; శైలేంద్రమివ = పర్వతరాజుంబలె; వ్యసృజన్ = విడిచినవి.

ఆ రాక్షసులు, మేఘంబులుపర్వతంబుపైవర్షించునట్లు, రామునిపైఁ బదివాలుఁ, బాణవర్షంబులుగురిపించిరి. అని, తాత్పర్యము.

స తైః పరివృతో ఘోరై ర్రాఘవో రక్షసాం గణైః. ౧౧

టీక॥ సః=ఆ; రాఘవః = రాముఁడు; ఘోరైః = భయంకరములగు; రక్షసాం=రాక్షసులయొక్క; తైః= ఆ, గణైః= సమూహముల చేత ; పరివృతః=చుట్టఁబడినాఁడు.

రాముండు , అప్పుడు యుద్ధంబున, నా రాక్షస గణంబులచేఁ బరివేష్టితుఁడయియుండెను. అని, తాత్పర్యము.

తాని ముక్తాని శస్త్రాణి యాతుధానై స్స రాఘవః
ప్రతిజగ్రాహ విశిఖై ర్నద్యోఘానివ సాగరః. ౧౨

టీక॥ సః=ఆ; రాఘవః = రాముఁడు; యాతుధానైః = రాక్షసుల చేత; ముక్తాని=విడువఁబడిన; తాని = ఆ; శస్త్రాణిచ=ఆయుధములను ; విశిఖైః= బాణముల చేత; సాగరః = సముద్రుఁడు; నద్యోఘానివ = నదీప్రవాహములనువలె ; ప్రతిజగ్రాహ = స్వీకరించెను.

సముద్రంబునందు , నదీప్రవాహములులయమునొందునట్లు, ఆ రాక్షసులచేఁ బ్రయోగింపఁ బడినయాయుధంబులన్నియు , రామబాణ ప్రహతంబులయి,లయమునొందినవి.

అని, తాత్పర్యము.

స తైః ప్రహరణై ర్ఘోరై ర్భిన్నగాత్రో న వివ్యథే
రామః ప్రదీప్తై ర్బహుభి ర్వజ్రై రివ మహాచలః. ౧౩

టీక॥సః=ఆ; రామః=రాముఁడు; తైః=ఆ, ఘోరైః=భయంకరములయిన; ప్రహరణైః=ఆయుధముల చేత; భిన్నగాత్రః=భేదింపఁబడిన దేహముగలవాఁడై; ప్రదీప్తైః= ప్రకాశించుచున్నవగు; బహుభిః=పెక్కులయిన; వజ్రైః = పిడుగుల చేత; భిన్నగాత్రః (అధ్యాహృతము) = భేదింపఁబడిన దేహముగల; మహాచలఇవ= మహాపర్వతమువలె;నవివ్యథే=దుఃఖితుఁడు కాఁడయ్యె.

ఆరాముండు , భయంకరంబులగు నా రాక్షసులయాయుధంబులచే భిన్నగాత్రుండయ్యు, నెన్ని పిడుగులు పడినను

మహాపర్వతంబుచలనంబునొందనట్లు, ఎంతమాత్రముజలనంబునొందఁడయ్యె. అని, తాత్పర్యము.

స విద్ధః క్షతజాదిగ్ధ స్సర్వగాత్రేషు రాఘవః
బభూవ రామ స్సంధ్యాభ్రై ర్దివాకర ఇవావృతః. ౧౪

టీక॥సః=ఆ; రాఘవః= రఘువంశమునందుఁబుట్టిన; రామః=రాముఁడు, సర్వగాత్రేషు= సమస్తావయవములందును; విద్ధః=కొట్టఁబడినవాఁడై; క్షతజాదిగ్ధః = నెత్తురుచేఁబూయఁబడినవాఁడై; సంధ్యాభ్రైః=సంధ్యాకాలమునందలి మేఘంబులచేత; ఆవృతః= కప్పఁబడిన; దివాకరఇవ=సూర్యుండువలె; బభూవ=ఉండెను.

ఆ రాముండు, అట్లుసమస్తావయవములందునుబాధింపఁబడినెత్తుటం దడుపఁబడినవాఁడై, సాయంకాలమునందలి మేఘంబులచేనావృతుండగు సూర్యుని పగిదింబ్రకాశించుచుండెను.

అని, తాత్పర్యము.

విషేదు ర్దేవగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః
ఏకం సహస్రై ర్బహుభి స్తదా దృష్ట్వా సమావృతమ్. ౧౫

టీక॥తదా=అప్పుడు ; దేవగంధర్వాః=దేవతలునుగంధర్వులును; సిద్ధాశ్చ=సిద్ధులును; పరమర్షయః=ఉత్తములయినబుషులును; బహుభిః=పెక్కులయిన; సహస్రైః=వేలచేత; సమావృతం=చుట్టఁబడిన; ఏకం=ఒక్కఁడైన రాముని; దృష్ట్వా=చూచి; విషేదుః= దుఃఖించిరి.

అప్పుడు దేవతలునుగంధర్వులును సిద్ధులునుబరమర్షులును , రాముండొక్కఁడు పెక్కువేలరాక్షసులచేఁజిక్కియుండుటనుజూచి, మిక్కిలియుదుఃఖంబునొందిరి. అని, తాత్పర్యము.

తతో రామ స్సుసంక్రుద్ధో మండలీకృతకార్ముకః
ససర్జ విశిఖాన్ బాణాన్ శతశోథ సహస్రశః. ౧౬

టీక॥ తతః=అంత; రామః= రాముఁడు; సుసంక్రుద్ధః = మిక్కిలియుఁ గోపించినవాఁడై; మండలీకృతకార్ముకః=గుండ్రముగాఁ జేయఁబడినధనుస్సు గలవాఁడై, విశిఖాన్=విశిఖములను ; బాణాన్=బాణములను,అర్ధచంద్రాకారబాణములననుట ; శతశః= నూఱునూఱుగాను; అథ=ఇంక; సహస్రశః=వేనవేలుగాను ; ససర్జ = విడిచెను.

అంత , రాముఁడుపరమకుపితుండై, మండలీకృతకోదండుండై, నూఱులునూఱులుగాను వేనవేలుగాను , అర్ధచంద్రాకార బాణంబులంబ్రయోగించెను. అని, తాత్పర్యము.

దురావారాన్ దుర్విషహాన్ కాలదండోపమాన్ రణే
ముమోచ లీలయా రామః కంకపత్రా నజిహ్మగాన్. ౧౭

టీక॥ రామః=రాముఁడు; రణే = యుద్ధమునందు; లీలయా= విలాసము చేత; దురావారాన్=నివారింపనలవిగానివియు; దుర్విషహాన్=సహింపనలవిగానివియు; కాలదండోపమాన్= యమదండములతోఁబోలిక గలవియు; అజిహ్మగాన్= వక్రముగాఁబోనివియునగు;కంకపత్రాన్=బాణములను; ముమోచ=విడిచెను.

అప్పుడు, యుద్ధంబున, రాముండు నివారింపఁగూడనివియుదుస్సహంబులును యమదండములవంటివియులక్ష్యంబుదప్పనివియునగు పెక్కుబాణంబులను , అనాయాసంబుగాఁ బ్రయోగించెను.అని, తాత్పర్యము.

తే శరా శ్శత్రుసైన్యేషు ముక్తా రామేణ లీలయా
ఆదదూ రక్షసాం ప్రాణాన్ పాశాః కాలకృతాఇవ. ౧౮

టీక॥ రామేణ=రామునిచేత; లీలయా=విలాసముచేత; శత్రుసైన్యేషు= శత్రుసైన్యములయందు; ముక్తాః= విడువఁబడిన; తే=ఆ;శరాః= బాణములు; కాలకృతాః=యమునిచేతఁజేయఁబడిన;పాశా ఇవ=పాశములువలె;రక్షసాం=రాక్షసులయొక్క;ప్రాణాన్= ప్రాణములను;ఆదదుః= గ్రహించినవి.

రాముండు రాక్షససైన్యంబులపై, విలాసంబునం బ్రయోగించినబాణంబులు, కాలపాశంబులుంబోలె, యుద్ధంబున, రాక్షసులప్రాణంబులను గ్రహించినవి. అని, తాత్పర్యము.

భిత్త్వా రాక్షసదేహాం స్తాం స్తే శరా రుధిరాప్లుతాః
అంతరిక్షగతా రేజు ర్దీప్తాగ్నిసమతేజసః. ౧౯

టీక॥ తే=ఆ, శరాః = బాణములు; తాన్=ఆ; రాక్షసదేహాన్= రాక్షసదేహములను; భిత్త్వా=భేదించి ; రుధిరాప్లుతాః= నెత్తురుచేఁ దడుపఁబడినవై; అంతరిక్షగతాః = ఆకాశమును బొందినవై; దీప్తాగ్నిసమతేజసః = మండుచున్నయగ్నితో సమానమయిన కాంతిగలవై; రేజుః=ప్రకాశించినవి.

ఆబాణంబులు రాక్షస దేహంబులను భేదించి, నెత్తురుతో నాకాశంబునొంది, మండుచున్నయగ్నులుకైవడిం బ్రకాశించినవి. అని, తాత్పర్యము.

అసంఖ్యేయాస్తు రామస్య సాయకా శ్చాపమండలాత్
వినిష్పేతు రతీవోగ్రా రక్షః ప్రాణాపహారిణః. ౨౦

టీక॥ రామస్య= రామునియొక్క; చాపమండలాత్ = మండలాకారమగుధనుస్సుననుండి, అసంఖ్యేయాః= లెక్కపెట్టరానివియు; అతీవ = మిక్కియు; ఉగ్రాః=భయంకరములును ; రక్షఃప్రాణాపహారిణః= రాక్షసులప్రాణంబులవపహరించునవియునగు ; సాయకాస్తు=బాణంబులుమాత్రము; వినిష్పేతుః=వెడలినవి.

అప్పుడు, మండలాకారమునొందిన రామునిధనుస్సుననుండి, మహాభయంకరంబులగు లెక్కలేని బాణంబులు వెడలి, రాక్షసులప్రాణంబులనపహరించినవి. అని, తాత్పర్యము.

తై ర్ధనూంషి ధ్వజాగ్రాణి వర్మాణిచ శిరాంసిచ
బాహూన్ సహస్తాభరణా నూరూన్ కరికరోపమాన్. ౨౧

స ౨౫

చిచ్ఛేద రామ స్సమరే శతశో థ సహస్రశః

టీక॥ రామః = రాముఁడు; సమరే=యుద్ధమునందు, శైః=ఆబాణములచేత; శతశః= నూఱులునూఱులుగాను; అధ= మఱియు; సహస్రశః=వేనవేలుగాను; ధనూంషి=విండ్లను; ధ్వజాగ్రాణి=టెక్కెములకొనలను ; వర్మాణిచ=కవచములను, శిరాంసిచ = తలలను; సహస్తాభరణాన్=కడియములతోఁగూడిన; బాహూన్=చేతులను; కరికరోపమాన్=ఏనుంగులతొండములతోఁబోలఁగలవగు; ఊరూన్=తొడలను; చిచ్ఛేద=నఱకెను.

రాముఁడు, యుద్ధంబున, రాక్షసులధనుస్సులనుధ్వజంబులనుగవచంబులనుశిరస్సులనుగడియంబులతోఁగూడిన బాహువులనుఏనుంగతొండంబుల వంటితొడలను, వేనవేలుగాఁ దీక్ష్ణబాణంబుల, ఛేదించెను.

అని, తాత్పర్యము.

హయాన్ కాంచనసన్నాహాన్ రధయుక్తాన్ ససారధీన్. ౨౨
గజాంశ్చ సగజారోహాన్ సహయాన్ సాదిన స్తథా
పదాతీన్ సమరే హత్వా హ్యనయ ద్యమసాదనమ్. ౨౩

టీక॥ సః(అధ్యాహృతము)= ఆరాముఁడు, సమరే=యుద్ధమునందు; కాంచనసన్నాహాన్= బంగారలంకారముగాఁగలవియు;రధయుక్తాన్= రధమునందుఁగూర్పఁబడినవియు ; ససారధీన్=సారధులతోఁ గూడినవియునగు; హయాన్=గుఱ్ఱములను ; సగజారోహాన్=మావటీలతోఁగూడిన ; గజాంశ్చ=ఏనుంగులను;తధా=అట్లు; సహయాన్=గుఱ్ఱములతోఁగూడిన ; సాదినః=గుఱ్ఱపువాండ్రను;పదాతీన్=కాల్బురను;హత్వా=వధించి;యమసాదనం=యమునియింటికి;అనయద్ధి=పొందించెనుగదా!

అప్పుడు, యుద్ధంబున, రాముఁడు, కాంచనాలంకృతంబులును సారధీసహితంబులునగు రథంబులకుఁగట్టినగుఱ్ఱంబులను,మావటీలతోఁగూడ నేనుంగులను సాదులతోఁగూడగుఱ్ఱంబులను, గాలిబంటులను,వధించి,యమపురికిం బంపెను.

అని, తాత్పర్యము.

తతో నాళీకనారాచై స్తీక్ష్ణాగ్రైశ్చ వికర్ణిభిః
భీమ మార్తస్వరం చక్రు ర్భిద్యమానా నిశాచరాః. ౨౪

టీక॥ తతః=అంత; నిశాచరాః= రాక్షసులు;నాళీకనారాచైః= నాళాకారములగుబాణములచేతను ఆయస బాణములచేతను;తీక్ష్ణాగ్రైః = కఱకులయినకొనలుగల; వికర్ణిభిశ్చ = కర్ణాకారబాణములచేతను; భిద్యమానాః = భేదింపఁబడుచున్నవారలయి; భీమం= భయంకరముగా ; ఆర్తస్వరం = దుఃఖితధ్వనిని;చక్రుః = చేసిరి.

అంత , రాక్షసులట్లు , తీక్ష్ణములగు నానావిధబాణములచే భేదింపఁబడుచు,నోర్వఁజాలక,దుఃఖంబున , భయంకరంబుగానఱచిరి.

అని, తాత్పర్యము.

త త్సైన్యం నిశితై ర్బాణై రర్దితం మర్మభేదిభిః
రామేణ న సుఖం లేభే శుష్కం వన మివాగ్నినా. ౨౫

టీక॥ రామేణ = రామునిచేత;మర్మభేదిభిః = జీవస్థానములనుభేదించునట్టి;నిశితైః = తీక్ష్ణములయిన; బాణైః=బాణములచేత; అర్దితం = పీడింపఁబడిన;తత్= ఆ;సైన్యం = సైన్యము;అగ్నినా = అగ్నిహోత్రముచేత;అర్దితం (అధ్యాహృతము) = పీడింపఁబడిన,వనమివ = అడవివలె; సుఖం = సుఖమును;న లేభే= పొందదయ్యె.

అట్లు రామునిచే మర్మభేదకంబులగుబాణంబులనొప్పింపఁబడినయారాక్షససేన , కార్చిచ్చుచేదహింపఁబడునరణ్యముంబోలె , మిక్కిలియువ్యథనొందినది. అని,తాత్పర్యము.

కేచి ద్భీమబలా శ్శూరా శ్శూలా న్ఖడ్గా న్పరశ్వధాన్
రామస్యా భిముఖం గత్వా చిక్షిపుః పరమాయుధాన్. ౨౬

టీక ॥ భీమబలాః = భయంకరమయినబలముగలవారలును; శూరాః =

యుద్ధమునందు భయములేనివారలున గు; కేచిత్ = కొందఱు రాక్షసులు ; రామస్య = రామునికి, అభిముఖం = ఎదురుగా; గత్వా = పోయి ; పరమాయుధాన్ = ఉత్తమాయుధంబు లగు, శూలాన్ = శూలములను; ఖడ్గాన్ = కత్తులను; పరశ్వధాన్ = గొడ్డళ్లను; చిక్షిపుః = వేసిరి.

భయంకరబలశాలులును శూరులు నగుకొందఱు రాక్షసులు, రామునకభిముఖంబుగాఁబోయి, యుత్తమంబుల గు శూలంబులు ఖడ్గ బులుఁబరశ్వధంబులు మన్నగునాయుధంబులను, రామునిపై వేసిరి. అని, తాత్పర్యము.

తేషాం బాణై ర్మహాబాహు శ్శస్త్రాణ్యావార్య రాఘవః
జహార సమరే ప్రాణాన్ చిచ్ఛేదచ శిరోధరాన్. ౨౭

టీక॥ మహాబాహుః = పెద్దచేతులు గల; రాఘవః = రాముఁడు; బాణైః = బాణములచేత, తేషాం = ఆరాక్షసులయొక్క; శస్త్రాణి = ఆయుధములను; ఆవార్య = అడ్డగించి; సమరే = యుద్ధమునందు; ప్రాణాన్ = ప్రాణములను ; జహార = గ్రహించెను. శిరోధరాన్ = కంఠములను; చిచ్ఛేద = నఱికెను.

మహాబాహుండగు రాముండు, బాణంబులచే, నా రాక్షసులు ప్రయోగించిన యాయుధంబులనివారించి, వారలకంఠములను ఛేదించెను. అని , తాత్పర్యము.

తే భిన్నశిరసః పేతు శ్ఛిన్నవర్మశరాసనాః
సుపర్ణవాతవిక్షిప్తా జగత్యాం పాదపా యథా. ౨౮

టీక॥ తే = ఆరాక్షసులు; ఛిన్నశిరసః = నఱుకఁబడినతలలుగలవారలయి; ఛిన్నవర్మశరాసనాః = నఱుకఁబడినకవచములును ధనుస్సులునుగల వారలయి; సుపర్ణవాతవిక్షిప్తాః = గరుత్మంతునివాయువుచే నెగురఁ గొట్టఁబడిన; పాదపాయథా = వృక్షములవలె; జగత్యాం = భూమియందు; పేతుః = పడిరి.

ఆరాక్షసులు, తలలుఛేదింపఁ బడి కవచంబులును ధనుస్సులును ఖండితంబులు గాఁగా , గరుత్మంతునిపక్ష వాయువుచేవృక్షంబులుభూమింబడునట్లు, నేలంగూలిరి. అని, తాత్పర్యము.

అవశిష్టాశ్చ యే తత్ర విషణ్ణాశ్చ నిశాచరాః
ఖర మేవాభ్యధావంత శరణార్థం శరార్దితాః. ౨౯

టీక॥తత్ర=ఆసేనయందు; యే=ఎవ్వరు;అవశిష్టాశ్చ=మిగిలినవారలునో, తే(అధ్యాహృతము)=ఆ , నిశాచరాశ్చ=రాక్షసులును;శరార్దితాః= బాణములచే:బీడింపఁబడినవారలయి;విషణ్ణాః=దుఃఖితులయి;శరణార్థం= రక్షణముకొఱకు;ఖరమేవ = ఖరునిగూర్చియే;అభ్యధావంత= పరుగెత్తిరి.

ఆరాక్షసులలోఁజంపఁబడఁగా మిగిలినరాక్షసులును, రామబాణవిద్ధులయిభయింపడి,కావుకావుమని, ఖరునిశరణుచొచ్చిరి. అని, తాత్పర్యము.

తాన్ సర్వాన్ పున రాదాయ సమాశ్వాస్యచ దూషణః
అభ్యధావత కాకుత్థ్సం క్రుద్ధో రుద్ర మివాంతకః. ౩౦

టీక॥ దూషణః = దూషణుఁడు; తాన్=ఆరాక్షసులను;సర్వాన్= అందఱను,పునః=మఱల;ఆదాయ = గ్రహించి;సమాశ్వాస్యచ = ఊఱడించియు;క్రుద్ధః=కోపించినవాఁడై ; కాకుత్థ్సం=రామునిగూర్చి;రుద్రం=రుద్రునిగూర్చి; అంతకఇవ=యముఁడువలె ; అభ్యధావత=పరుగెత్తెను.

దూషణుఁడు,ఆరాక్షసులనందఱుం బిలిచి,యాశ్వాసించి,క్రుద్ధుఁడై,రుద్రునిపైకిమృత్యువుపోవునట్లు, రామునిపైకడరెను. అని, తాత్పర్యము.

నివృత్తాస్తు పున స్సర్వే దూషణాశ్రయసంశ్రితాః
రామ మేవాభ్యధావంత సాలతాలశిలాయుధాః. ౩౧

టీక॥ తే(అధ్యాహృతము)= ఆరాక్షసులు; సర్వే=అందఱును; పునః= మఱల; నివృత్తాస్తు=మఱలినవారలయినంతనే; దూషణాశ్రయసంశ్రితాః = దూషణునియాశ్రయమును బొందినవారలయి; సాలతాలశిలాయుధాః= మద్దిచెట్లును తాటిచెట్లును ఱాళ్లును ఆయుధములుగాఁగలవారలయి ; రామ

మేవ=రామునిగూర్చియే; అభ్యధావంత=పరుగెత్తిరి.

ఆరాక్షసులందఱును మఱలి వచ్చి దూషణునిమున్నిడుకొని, సాలవృక్షంబులను తాలవృక్షంబులను శిలలను నాయుధంబులుగాఁగొని, రామునిపైకడరిరి.

ఆ, తాత్పర్యము.

శూలముద్గరహస్తాశ్చ చాపహస్తా మహాబలాః
సృజంత శ్శరవర్షాణి శస్త్రవర్షాణి సంయుగే. ౩౨
ద్రుమవర్షాణి ముంచంత శ్శిలావర్షాణి రాక్షసాః

టీక॥ శూలముద్గరహస్తాశ్చ=శూలములును గుదియలును జేతులం గలవారలును; చాపహస్తాః = విల్లుచేతులంగలవారలును; మహాబలాః = అధికమయినబలముగలవారలునగు; రాక్షసాః=రాక్షసులు; సంయుగే= యుద్ధమునందు; శరవర్షాణి= బాణములవానలను; శస్త్రవర్షాణి= ఆయుధవర్షములను; సృజంతః= పుట్టించుచు; ద్రుమవర్షాణి= వృక్షవర్షములను. శిలావర్షాణి = ఱాళ్లవానలను; ముంచంతః = విడుచుచు; ఆసన్ (అధ్యాహృతము)=ఉండిరి.

శూలముద్గరంబులును ధనుస్సులును దాల్చియున్నవారలును మహాబలశాలులునగు నారాక్షసులు, యుద్ధంబున, రామునిపై, బాణంబులను నానావిధాయుధంబులను వృక్షంబులను ఱాళ్లను గురిపించుచుఁబోరుచుండిరి.

అని, తాత్పర్యము.

తద్బభూవా ద్భుతం యుద్ధం తుములం రోమహర్షణమ్ ౩౩
రామస్యచ మహాఘోరం పున స్తేషాంచ రక్షసామ్

టీక॥ పునః=మఱల; రామస్యచ=రామునకును; తేషాం=ఆ; రక్షసాం=రాక్షసులకును; అద్భుతం = ఆశ్చర్యకరంబును; రోమహర్షణం= వెంట్రుకలగగుపాటునొందించునదియు; తుములం=దొమ్మియును; మహాఘోరం =మహాభయంకరమునగు, తత్ =అట్టి; యుద్ధం=యుద్ధము; బభూవ = అయినది.

అప్పుడు, మఱల, రామునకును ఆరాక్షసులకును రోమహర్షణంబును ఆశ్చర్య

కరంబును మహాభయంకరంబునగు తుములయుద్ధము, జరిగినది.

అని, తాత్పర్యము.

తే సమంతా దభిక్రుద్ధా రాఘవం పున రభ్యయుః. ౩౪

టీక॥ తే=ఆరాక్షసులు; సమంతాత్=అంతటను; అభిక్రుద్ధాః= కోపము నొందినవారలయి; పునః=మఱల; రాఘవం=రామునిగూర్చి, అభ్యయుః= పోయిరి.

ఆరాక్షసులు, మఱలఁ, బరమకుపితులయి, రామునిపైకడరిరి.

అని, తాత్పర్యము.

తైశ్చ సర్వా దిశో దృష్ట్వా ప్రదిశశ్చ సమావృతాః
రాక్షసై రుద్యతప్రాసై శ్శరవర్షాభివర్షిభిః. ౩౫
స కృత్వా భైరవం నాద మస్త్రం పరమభాస్వరమ్
సంయోజయత గాంధర్వం రాక్షసేషు మహాబలః. ౩౬

టీక॥ మహాబలః=అధికమయినబలముగల, సః=ఆరాముఁడు; ఉద్యతప్రాసైః=ఎత్తంబడినయీఁటెలు గలవారలును; శరవర్షాభివర్షిభిః= బాణవర్షంబులు గురియుచున్నవారలునగు, తైః=ఆ, రాక్షసైః=రాక్షసులచేత; సమావృతాః= కప్పఁబడిన; సర్వాః= సమస్తములయిన, దిశశ్చ=దిక్కులను, ప్రదిశశ్చ=విదిక్కులను; దృష్ట్వా= చూచి; భైరవం=భయంకరమయిన; నాదం=ధ్వనిని; కృత్వా=చేసి; పరమభాస్వరం= మిక్కిలియుఁబ్రకాశించునట్టి; గాంధర్వం= గంధర్వదేవతాకమయిన; అస్త్రం=అస్త్రమును; రాక్షసేషు= రాక్షసులయందు; సంయోజయత(సమయోజయత్)=కూర్చెను.

మహాబలుండగు రాముండు, రాక్షసులు ప్రాసంబులుధరించి, బాణవర్షంబులుగురియుచు సమస్తదిక్కుల నాక్రమించియుండుటంజూచి, భయంకరంబుగా సింహనాదంబుసేయుచుఁ, బరమభాస్వరంబగు గాంధర్వాస్త్రంబును, రాక్షసులపైఁబ్రయోగించెను.

అని, తాత్పర్యము.

తత శ్శరసహస్రాణి నిర్యయు శ్చాపమండలాత్
సర్వా దశ దిశో బాణై రవార్యంత సమాగతైః. ౩౭

టీక॥ తతః=అంత; చాపమండలాత్ = మండలాకారమగుధనుస్సుననుండి; శరసహస్రాణి = బాణంబులవేలు; నిర్యయుః=వెడలినవి. సమాగతైః= వచ్చిన; బాణైః=బాణములచేత; దశ= పదియయిన; దిశః = దిక్కులు; సర్వాః=అన్నియును; అవార్యంత=అడ్డగింపఁబడినవి.

అంత రాముని ధనుస్సుననుండి, వేనవేలుగ బాణంబులు వెడలినవి; రామప్రయుక్తంబులగు బాణంబులు దశదిశలనునిండి చెలంగినవి. అని, తాత్పర్యము.

నాదదానం శరాన్ ఘోరా న్నముంచంతం శిలీముఖాన్
వికర్షమాణం పశ్యంతి రాక్షసా స్తే శరార్దితాః. ౩౮

టీక॥ శరార్దితాః = బాణములచేఁబీడింపఁబడిన; తే=ఆ; రాక్షసాః= రాక్షసులు; ఘోరాన్ = భయంకరములయిన; శరాన్=బాణములను; ఆదదానం = గ్రహించుచున్నరామునిన(పశ్యంతి)=చూడరు. శిలీముఖాన్= బాణములను; ముంచంతం= విడుచుచున్న రామునిన (పశ్యంతి)= చూడరు. వికర్షమాణం = ఈడ్చుచున్న రామునిః(న)పశ్యంతి=చూడరు.

బాణపీడితులగు నా రాక్షసులు, రాముండు బాణంబులు దీయుటనుగాని బాణంబులు విడుచుటనుగాని ధనుస్సు నాకర్షించుటను గాని గానంజాలరైరి; బాణంబులచేఁబీడితులుమాత్రమగుచుండిరి. అని, తాత్పర్యము.

శరాంధకార మాకాశ మావృణో త్సదివాకరమ్
బభూవా వస్థితో రామః ప్రవమ న్నివ తాన్ శరాన్. ౩౯

టీక॥ శరాంధకారం= బాణములనునంధకారము; సదివాకరం= సూర్యునితోఁగూడిన; ఆకాశం = ఆకాశమును; ఆవృణోత్=కప్పినది. రామః=రాముండు; తాన్=ఆ; శరాన్= బాణములన; ప్రవమన్నివ=గ్రక్కుచున్నవాఁడువలె;

అవస్థితః=ఉన్నవాఁడు;బభూవ = ఆయెను.

ఆకాశంబంతయు సూర్యునితోఁగూడ,బాణమయంబగు నంధకారంబుచేనావృతంబయినది;రాముండు,ఆబాణంబులనునోఁటివెంబడిఁ గ్రక్కినట్లు చూపట్టుచుండెను. అని,తాత్పర్యము.

యుగప త్పతమానైశ్చ యుగపచ్చ హతైర్భృశమ్
యుగప త్పతితైశ్చైవ వికీర్ణా వసుధా ౽ భవత్.౪౦

టీక॥ యుగపత్ =ఏకకాలమునందు; పతమానైశ్చ = పడుచున్నవారలును,యుగపత్ = ఏకకాలమునందు, హతైశ్చ = వధింపఁబడిన వారలును; యుగపత్=ఏకకాలమునందు; పతితైశ్చైవ = పడినవారలునగు రాక్షసులచేత;వసుధా=భూమి;భృశం = మిక్కిలియు;వికీర్ణా= వ్యాపింపఁబడినది;అభవత్=అయినది.

గుంపులుగుంపులుగాఁబడుచున్నవారలునుగుంపులుగుంపులుగా వధింపఁబడి నేలంగూలువారలునుగుంపుగుంపుగావివశులయి నేలంబడియున్న వారలునగు నారాక్షసులచే,నయ్యుద్ధభూమి యంతయువ్యాపింపఁబడియుండినది.

అని, తాత్పర్యము.

నిహతాః పతితాః క్షీణా శ్ఛిన్నా భిన్నా విదారితాః
తత్ర తత్ర స్మ దృశ్యంతే రాక్షసా స్తే సహస్రశః. ౪౧

టీక॥ తే=ఆ;రాక్షసాః = రాక్షసులు;నిహతాః=చంపఁబడినవారలును;పతితాః=పడినవారలును,క్షీణాః=నశించినవారలును; ఛిన్నాః= నఱుకఁబడినవారలును;భిన్నాః=భేదింపఁబడిన వారలును; విదారితాః=చీల్పఁబడినవారలునై; సహస్రశః=వేనవేలుగా; తత్రతత్ర= అచ్చటచ్చట ; దృశ్యంతేస్మ=చూడఁబడిరి.

ఆయుద్ధభూమియందు , రాక్షసులు, కొందఱు నిహతులును గొందఱు పతితులును గొందఱు రూపనాశంబు నొందినవారలును గొందఱునఱుకఁబడినవారలును గొందఱుభిన్నులునుగొందఱువిదారితులునునై, వేనవేలుగాఁ బడియుండిరి. అని,తాత్పర్యము.

సోష్ణీషై రుత్తమాంగైశ్చ సాంగదై ర్బాహుభి స్తథా
ఊరుభి ర్జానుభి శ్ఛిన్నై ర్నానారూపవిభూషణైః. ౪౨
హయైశ్చ ద్విపముఖ్యైశ్చ రథై ర్భిన్నై రనేకశః
చామరై ర్వ్యజనై శ్ఛత్త్రై ర్ధ్వజై ర్నానావిధై రపి. ౪౩
రామస్య బాణాభిహతై ర్విచిత్రై శ్శూలపట్టిసైః
ఖడ్గైః ఖండీకృతైః ప్రాసై ర్వికీర్ణైశ్చ పరశ్వథైః. ౪౪
చూర్ణితాభి శ్శిలాభిశ్చ శరై శ్చిత్రై రనేకశః
విచ్ఛిన్నై స్సమరే భూమి ర్వికీర్ణా ఽభూ ద్భయంకరా. ౪౫

టీక॥సమరే= యుద్ధమునందు; భిన్నైః=నఱుకఁబడిన,సోష్ణీషైః= తలగుడ్డలతోఁగూడిన; ఉత్తమాంగైశ్చ= తలలచేతను; తథా=అట్లు ; సాంగదైః = బాహుపురులతోఁగూడిన; బాహుభిః=చేతులచేతను; నానారూపవిభూషణైః=నానావిధములయినయలంకారములుగల; ఊరుభిః= తొడలచేతను; జానుభిః=మోఁకాళ్లచేతను ; అనేకశః=అనేకములుగా; భిన్నైః=భేదింపఁబడిన; హయైశ్చ=గుఱ్ఱములచేతను;ద్విపముఖ్యైశ్చ= గజశ్రేష్ఠములచేతను;రథైః=రథములచేతను; నానావిధైః=నానావిధములగు;చామరైః=వింజామరలచేతను;వ్యజనైః= విసనకఱ్ఱలచేతను;ఛత్త్రైః=గొడుగులచేతను;ధ్వజైరపి= టెక్కెములచేతను ; రామస్య= రామునియొక్క ; బాణాభిహతైః=బాణములచేతఁగొట్టఁబడిన; విచిత్రైః=నానావిధములగు ; శూలపట్టిసైః=శూలములచేతను;అడ్డకత్తులచేతను;ఖండీకృతైః=తునకలుగాఁ జేయఁబడిన;ప్రాసైః= ఈఁటెలచేతను ; వికీర్ణైః=వెదచల్లఁబడిన;పరశ్వథైః=గొడ్డళ్లచేతను;చూర్ణితాభిః= చూర్ణముగాఁజేయఁబడిన;శిలాభిశ్చ=ఱాళ్లచేతను;అనేకశః=అనేకముగా;విచ్ఛిన్నైః=నఱుకఁబడిన;చిత్రైః= నానావిధములగు;శరైః=బాణములచేతను;భూమిః=భూమి;వికీర్ణా= వ్యాపింపఁబడినదై; భయంకరా=భయముగలిగించునది;అభూత్=అయినది.

రామబాణంబులచే నఱుకఁబడినతలగుడ్డలతోఁగూడినశిరస్సులచేతను బా

హువురులచేనలంకృతంబులగు బాహువులచేతను నానావిధాలంకార సహితములగు తొడలచేతను మ్రోఁకాళ్లచేతను గుఱ్ఱములచేతను ఏనుంగుల చేతను రథములచేతను నానావిధము లగు చామరముల చేతను విసనకఱ్ఱలచేతను ఛత్రంబులచేతను ధ్వజంబుల చేతను నానావిధంబులగు శూలంబులచేతను అడ్డకత్తులచేతను దునకలుగా జేయఁబడిన ఖడ్గంబులచేతను ప్రాసంబులచేతను గొడ్డళ్ల చేతను చూర్ణితంబులగు శిలలచేతను ఛిన్నంబులగు బాణంబులచేతను, ఆయుద్ధభూమియంతయు వ్యాపింపఁబడి భయంకరంబయియుండినది. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

ఆరణ్యకాండే, పంచవింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండపంచవింశసర్గటీక, ముగిసినది.



శ్రీ

## షడ్వింశస్సర్గప్రారంభః.

దూషణస్తు స్వకం సైన్యం హన్యమానం నిరీక్ష్య సః
సందిదేశ మహాబాహు ర్భీమవేగా న్నిశాచరాన్. ౧
రాక్షసాన్ పంచసాహస్రాన్ సమరే ష్వనివర్తినః

టీక॥ మహాబాహుః= పెద్దచేతులు గల; సః= ఆ; దూషణస్తు= దూషణుఁడును; హన్యమానం= చంపఁబడుచున్న; స్వకం= తనదైన; సైన్యం= సైన్యమును; నిరీక్ష్యతు= చూచినంతనె; భీమవేగాన్= భయంకరమయిన వేగము గలవారలును; సమరేషు= యుద్ధములందు; అనివర్తినః= మఱలనివారలును; నిశాచరాన్= రాత్రిఁదిరుగువారలునగు; రాక్షసాన్= రాక్షసులను; పంచసహస్రాన్= అయిదువేలమందిని; సందిదేశ= ఆజ్ఞాపించెను.

మహాబాహుండగు దూషణుండును, తన సైన్యమంతయు నిట్లు రామునిచే హతంబగుటం జూచి, భయంకరవేగులును ఎట్టి యుద్ధంబున నేనియు వెనుదీయనివారలు నగు నైదువేల రాక్షసుల, రామునిపైకిఁ బోవ, నాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

తే శూలైః పట్టసైః ఖడ్గైః శ్శిలావర్షై ర్ద్రుమై రపి. ౨
శరవర్షై రవిచ్ఛిన్నం వవర్షు స్తం సమంతతః

టీక॥ తే= ఆ రాక్షసులు; శూలైః= శూలముల చేతను; పట్టసైః= అడ్డకత్తుల చేతను; ఖడ్గైః= కత్తుల చేతను; శిలావర్షైః= ఱాళ్లవానల చేతను; ద్రుమైరపి= వృక్షముల చేతను; శరవర్షైః= బాణములవానల చేతను; తం= ఆ రాముని గూర్చి; సమంతతః= అంతటను; అవిచ్ఛిన్నం= ఎడతెగక; వవర్షుః= కురిపించిరి

ఆ రాక్షసులు, నలుప్రక్కలనుండి, శూలంబులును పట్టిసంబులును ఖడ్గంబులును ఱాళ్లును వృక్షంబులును బాణంబు

లును, రాముఁపై, నవిచ్ఛిన్నంబుగాఁగురిపించిరి. అని, తాత్పర్యము.

స ద్రుమాణాం శిలానాంచ వర్షం ప్రాణహరం మహత్. ౩
ప్రతిజగ్రాహ ధర్మాత్మా రాఘవ స్తీక్ష్ణసాయకైః

టీక॥ ధర్మాత్మా = ధర్మస్వభావుఁడగు; సః=ఆ; రాఘవః= రాముండు; ద్రుమాణాం= వృక్షములయొక్కయు; శిలానాంచ = ఱాళ్ల యొక్కయు; ప్రాణహరం=ప్రాణములనుహరించునట్టి; మహత్ = గొప్పదగు; వర్షం=వానను; తీక్ష్ణసాయకైః= కఱకులయినబాణములచేత ; ప్రతిజగ్రాహ=స్వీకరించెను.

ధర్మాత్ముండగు రాముండు, ప్రాణహరంబునుభయంకరంబునునగు, నాశిలావృక్షములవర్షమును, గఱకుబాణంబుల, నివారించెను.

అని, తాత్పర్యము.

ప్రతిగృహ్యాచ తద్వర్షం నిమీలితఇవర్షభః. ౪
రామః క్రోధం పరం లేభే వధార్థం సర్వరక్షసామ్

టీక॥ రామః=రాముఁడు ; ఋషభఇవ=వృషభమువలె; నిమీలితః= కండ్లుమూసికొన్నవాఁడై; తత్=ఆ ; వర్షం=వానను;ప్రతిగృహ్యాచ=స్వీకరించియు; సర్వరక్షసాం= సమస్తరాక్షసులయొక్కయు; వధార్థం=చంపుటకొఱకు; పరం=అధికమయిన; క్రోధం=కోపమును; లేభే=పొందెను.

రాముండు, ఆఁబోతుకన్నుమూసికొనియెంతవానవైనను సరకుసేయకుండునట్లు, నానావిధాయుధవర్షమునుసరకుసేయకతీసికొని , ఆరాక్షసులనందఱను వధించుటకై , మహాకోపంబునవలంబించెను.

అని, తాత్పర్యము.

తతః క్రోధసమావిష్టః ప్రదీప్త ఇవ తేజసా. ౫
శరైరవాకిర త్సైన్యం సర్వత స్సహదూషణమ్

టీక॥ తతః = అంత; సః (అధ్యాహృతము)= ఆరాముఁడు ; క్రోధసమావిష్టః = కోపముచే నావేశింపఁబడినవాఁడై; తేజసా = కాంతిచేత, ప్రదీప్తఇవ (స్థితః)= మండుచున్నవాఁడై; సహదూషణం = దూషణునితోఁగూడిన; సైన్యం = సైన్యమును; సర్వతః= అంతటను; శరైః= బాణములచేత; అవాకిరత్ =చల్లెను.

అంత, రాముండు పరమక్రుద్ధుండై, తేజంబున వెలుంగుచు, దూషణసహితంబుగా నారాక్షస సేననంతయు, బాణంబులచేఁ గప్పఁబడునట్లు గావించెను. అని, తాత్పర్యము.

తత స్సేనాపతిః క్రుద్ధో దూషణ శ్శత్రుదూషణః। ౬
శరై రశనికల్పై స్తం రాఘవం సమవాకిరత్

టీక॥ తతః = అంత; శత్రుదూషణః= శత్రువులదూషించునట్టి; సేనాపతిః= సేనానాయకుఁడగు; దూషణః= దూషణుఁడు; క్రుద్ధః = కోపించినవాఁడై; అశనికల్పైః = వజ్రములతో సమానములగు; శరైః= బాణములచేత; తం= ఆ; రాఘవం= రాముని; సమవాకిరత్ =చల్లెను.

అంత, శత్రుదూషణుండును సేనానాయకుండునగు నాదూషణుండు కోపించి వజ్రంబులంబోని కఱకు బాణంబుల రామునిఁ నొప్పించెను. అని, తాత్పర్యము

తతో రామ స్సుసంక్రుద్ధః క్షురేణా స్య మహ ద్ధనుః। ౭
చిచ్ఛేద సమరే వీర శ్చతుర్భి శ్చతురో హయాన్

టీక॥ తతః= అంత; సమరే = యుద్ధంబునందు; వీరః= పరాక్రమశాలియగు; రామః= రాముఁడు; సుసంక్రుద్ధః= మిక్కిలియుఁ గోపించినవాఁడై; క్షురేణ= అర్ధచంద్రబాణముచేత; అస్య = ఈదూషణుని యొక్క; మహత్= గొప్పదగు; ధనుః= వింటిని ; చతుర్భిః = నాలుగింటిచేత; చతురః = నాలుగైన; హయాన్ = గుఱ్ఱంబులను; చిచ్ఛేద= నఱకెను.

అంత, వీరుండగు రాముండును యుద్ధంబున, నొక్క యర్ధచంద్రాకారబాణంబున నాదూషణుని ధనుస్సును ఖండించి, నాలుగు బాణంబులచే నతని గుఱ్ఱం

బులంగూలనేసెను. అని, తాత్పర్యము.

హత్వా చాశ్వాన్ శరై స్తీక్ష్ణై రర్ధచంద్రేణ సారథేః ౹
శిరో జహార తద్రక్షః త్రిభి ర్వివ్యాధ వక్షసి

టీక॥ సః(అధ్యాహృతము)=ఆరాముండు; తీక్ష్ణైః = కఱకులయిన; శరైః=బాణములచేత; అశ్వాన్=గుఱ్ఱములను; హత్వాచ=వధించియు ; అర్ధచంద్రేణ= అర్ధచంద్రబాణముచేత;సారథేః=తేరునడపువానియొక్క ; శిరః=తలను; జహార = హరించెను. తత్=ఆ; రక్షః=దూషణుఁ; వక్షసి=ఱొమ్మునందు; త్రిభిః= మూడింటిచేత; వివ్యాధ=నొప్పించెను.

ఆరాముండు, అట్లుకఱకుబాణంబులచేగుఱ్ఱంబులవధించి, యొకయర్ధ చంద్రాకారబాణంబున సారథి శిరంబు ద్రుంచి,యంతంబోక, యాదూషణుని ఱొమ్మునమూఁడమ్ములనొప్పించెను. అని, తాత్పర్యము.

సచ్ఛిన్నధన్వా విరథో హతాశ్వో హతసారథిః ౹
జగ్రాహ గిరిశృంగాభం పరిఘం రోమహర్షణమ్
వేష్టితం కాంచనైః పట్టై ర్దేవసైన్యప్రమర్దనమ్. ౧౦
ఆయసై శ్శంకుభి స్తీక్ష్ణైః కీర్ణం పరవసోక్షితమ్
వజ్రాశనిసమస్పర్శం పరగోపురదారణమ్. ౧౧

టీక॥ సః=ఆదూషణుఁడు ; ఛిన్నధన్వా=నఱుకఁబడిన విల్లుగలవాఁడై; విరథః = రథములేనివాఁడై; హతాశ్వః =చంపఁబడిన గుఱ్ఱములుగలవాఁడై;హతసారథీః= చంపఁబడినసారథిగలవాఁడై;గిరిశృంగాభం= పర్వతశిఖరముయొక్క-కాంతివంటి కాంతిగలదియు;రోమహర్షణం= వెంట్రుకలగగుర్పాటునొందించునదియు; కాంచనైః=బంగారువికారములయిన ; పట్టైః=కట్టులచేత;వేష్టితం = చుట్టఁబడినదియు ; దేవసైన్యప్రమర్దనం= దేవసైన్యములమర్దించునదియు ; ఆయసైః=ఇనుమువికారములయిన ; తీక్ష్ణైః=కఱకులయిన;శంకుభిః= మేకులచేత;కీర్ణం= వ్యాపింపఁబడినదియు;

పరవసోక్షితం = శత్రువుల మేదస్సు చేఁదడుపఁబడినదియు ; వజ్రాశనిసమస్పర్శం=వజ్రములతోను వజ్రాయుధముతోనుసమానమయిన తాఁకుడుగలదియు; పరగోపురదారణం = శత్రువుల పట్టణద్వారంబులను భేదించునదియునగు;పరిఘం=ఇనుపగుదియను; జగ్రాహ=తీసికొనెను.

దూషణుండు, అట్లు తనధనుస్సు ఖండింపఁబడుటయుగుఱ్ఱంబులును సారథియునువధింపఁబడుటయుంజూచి,పర్వత శిఖరసమానంబును జూపరులకుభయంబుగలిగించునదియు బంగారుకట్టులతోఁ గూడినదియుఁ బలుమాఱు దేవసైన్యంబుల మర్దించినదియుఁ దీక్ష్ణంబులగు నినుపమేకులతోఁ గూడినదియుశత్రువులమేదస్సుచేఁ దడుపఁబడినదియు వజ్రములను రత్నంబులు వలె నతికఠినంబును వజ్రాయుధంబుకైవడిఁ బ్రాణహరంబును శత్రువుల పురద్వారంబుల భేదించునదియు నగు మహాపరిఘంబు, గ్రహించెను.

అని, తాత్పర్యము.

తం మహోరగసంకాశం ప్రగృహ్య పరిఘం రణే
దూషణో భ్యద్రవ ద్రామం క్రూరకర్మా నిశాచరః. ౧౨

టీక॥ క్రూరకర్మా= క్రూరములయినకార్యములుగల;దూషణః= దూషణుఁడను;నిశాచరః = రాక్షసుఁడు; రణే= యుద్ధమునందు ; మహోరగసంకాశం=మహాసర్పముతో సమానమయిన;తం=ఆ;పరిఘం = ఇనుపగుదియను;ప్రగృహ్య = పట్టుకొని;రామం=రామునిగూర్చి; అభ్యద్రవత్ = పరుగెత్తెను.

క్రూరకర్ముఁడగు దూషణుండు, మహోరగముంబోని యాపరిఘంబు చేకొని,యుద్ధంబునరామునిపైకిఁ బోయెను. అని, తాత్పర్యము.

తస్యాభిపతమానస్య దూషణస్య స రాఘవః
ద్వాభ్యాం శరాభ్యాం చిచ్ఛేద సహస్తాభరణౌ భుజౌ. ౧౩

టీక॥ సః=ఆ; రాఘవః = రాముఁడు; అభిపతమానస్య = ఎదురొకని

వచ్చుచున్న; తస్య = ఆ; దూషణస్య = దూషణునియొక్క; సహస్తాభరణౌ = కడియములతోఁగూడిన; భుజౌ = బాహువులను; ద్వాభ్యాం = రెండైన; శరాభ్యాం = బాణములచేత; చిచ్ఛేద = నఱికెను.

ఆ రాముండు, అట్లు దూషణుండు పరిఘంబు చేనిడికొని తనపైకివచ్చుటం జూచి, రెండుబాణంబులచేఁ, గంకణాలంకృతంబులగు నతని బాహువులంద్రుంచెను. అని, తాత్పర్యము.

భ్రష్ట స్తస్య మహాకాయః పపాత రణమూర్ధని
పరిఘ శ్ఛిన్నహ స్తస్య శక్రధ్వజ ఇవాగ్రతః. ౧౪

టీక॥ రణమూర్ధని = యుద్ధాగ్రమునందు; ఛిన్నహస్తస్య = నఱుకఁబడినచేతులుగల; తస్య = ఆదూషణునియొక్క; మహాకాయః = పెద్దయాకారము గల; పరిఘః = ఇనుపగుదియ; భ్రష్టః = జాఱినదై; అగ్రతః = ముందట; శక్రధ్వజఇవ = ఇంద్రధ్వజమువలె; పపాత = పడెను.

అట్లు దూషణుని బాహువులు రెండును ఖండింపఁబడుటయు, భయంకరాకారంబగు నతని పరిఘంబు చేతనుండిజాఱి, యుత్సవాంతంబున నింద్రధ్వజంబు పడునట్లు, నేలంబడెను.
అని, తాత్పర్యము.

స కరాభ్యాం వికీర్ణాభ్యాం పపాత భువి దూషణః
విషాణాభ్యాం విశీర్ణాభ్యాం మనస్వీవ మహాగజః. ౧౫

టీక॥ సః = ఆ; గూషణః = దూషణుఁడు; వికీర్ణాభ్యాం = పడిన, కరాభ్యాం = చేతులతో; సహితః (అధ్యాహృతము) = కూడినవాఁడై; విశీర్ణాభ్యాం = రాలిన; విషాణాభ్యాం = కొమ్ములతో; సహితః (అధ్యాహృతము) = కూడిన; మనస్వీ = ధైర్యముగల; మహాగజఇవ = పెద్దయేనుంగువలె; భువి = నేలయందు; పపాత = పడెను.

ఆదూషణుండట్లు చేతులు తెగి, దంతంబులు తెగిన మహాగజంబు పగిది, నేలంగూలెను. అని, తాత్పర్యము.

తం దృష్ట్వా పతితం భూమౌ దూషణం నిహతం రణే
సాధు సాధ్వితి కాకుత్థ్సం సర్వభూతా న్యపూజయన్. ౧౬

టీక॥ సర్వభూతాని= సమస్తభూతంబులు; రణే=యుద్ధమునందు; నిహతం=చంపఁబడినవాఁడును; భూమౌ=నేలయందు; పతితం= పడినవాఁడును గు; తం=ఆ; దూషణం = దూషణుని దృష్ట్వా=చూచి; సాధుసాధ్వితి=ఒకో బలేయని; కాకుత్థ్సం=రాముని ; అపూజయన్=పూజించిరి.

అట్లుదూషణుండు యుద్ధంబున నిహతుండై నేలంబడుటనుజూచి, సమస్తభూతంబులును, రాముఁ సాధు వాక్యంబులం బ్రశంసించినవి.

అని, తాత్పర్యము.

ఏతస్మి న్నంతరే క్రుద్ధా స్త్రయ స్సేనాగ్రయాయినః
సంహృత్యా భ్యద్రవన్ రామం మృత్యుపాశావపాశితాః. ౧౭
మహాకపాల స్థ్సూలాక్షః ప్రమాథీచ మహాబలః

టీక॥ ఏతస్మిన్నంతరే= ఈమధ్యమునందు; మహాకపాలః=మహాకపాలుండును; స్థూలాక్షః=స్థూలాక్షుండును ; మహాబలః = అధికమయినబలముగల; ప్రమాథీచ=ప్రమాథియు ; సేనాగ్రయాయినః = సేనముందునడచువారలు; త్రయః=ముగ్వురు; క్రుద్ధాః=కోపించినవారలయి; మృత్యుపాశావపాశితాః= మృత్యుపాశముచేబద్ధులయి; సంహృత్య=చేరి; రామం= రాముని కూర్చి; అభ్యద్రవన్=పరుగెత్తిరి.

ఇంతలో, మహాకపాలుండును స్థూలాక్షుండును మహాబలుండగు ప్రమాథియుననునీముగ్వురు రాక్షసులు, మృత్యుపాశబద్ధులగుటంజేసి, పరమ కుపితులయి, రామునిపై కడచిరి.

అని, తాత్పర్యము.

మహాకపాలో విపులం శూల ముద్యమ్య రాక్షసః. ౧౮
స్థూలాక్షః పట్టిసం గృహ్య ప్రమాథీచ పరశ్వధమ్

స ౨౬

టీక॥ విపులం=విశాలమగు ; శూలం=శూలమును; ఉద్యమ్య = పట్టుకొని;మహాకపాలః = మహాకపాలుఁడను; రాక్షసః=రాక్షసుఁడును ; పట్టిసం=అడ్డకత్తిని;గృహ్య(గృహీత్వా)=పట్టుకొని;స్థూలాక్షః = స్థూలాక్షుండును;పరశ్వధం = గొడ్డలిని; గృహీత్వా (అధ్యాహృతము)= గ్రహించి; ప్రమాధీచ = ప్రమాధియు;అభ్యద్రవన్(అధ్యాహృతము)=పరుగెత్తిరి.

విశాలంబగుశూలంబుధరియించిమహాకపాలుండును బట్టిసంబుదాల్చిస్థూలాక్షుండును బరశ్వధంబుఁ జేకొనిప్రమాధియు, రామునిపైకడరిరి.

అని, తాత్పర్యము.

దృష్ట్వైవాపతత స్తూర్ణం రాఘవ స్సాయకై శ్శితైః. ౧౯
తీక్ష్ణాగ్రైః ప్రతిజగ్రాహ సంప్రాప్తా నతిథీ నివ

టీక॥ రాఘవః=రాముఁడు; ఆపతతః = వచ్చుచున్నయారాక్షసులను; దృష్ట్వైవ=చూచినంతనె; తాన్ (అధ్యాహృతము)=ఆరాక్షసులను; తూర్ణం=శీఘ్రముగా;శితైః = సానఁబెట్టఁబడిన; తీక్ష్ణాగ్రైః = కఱకులయినకొనలుగల; సాయకైః = బాణములచేత;సంప్రాప్తాన్ = వచ్చిన;అతిథీనివ=అతిథులనువలె ; ప్రతిజగ్రాహ=స్వీకరించెను.

రాముండు , ఆరాక్షసులుమువ్వురునువచ్చుటంజూచి , యతిథులువచ్చినచోవారలకర్ఘ్యాదులొసంగునట్లు, శీఘ్రంబుననారాక్షసులకుఁ , దీక్ష్ణంబులగుబాణంబులంబ్రయోగించెను.

అని, తాత్పర్యము.

మహాకపాలస్య శిర శ్చిచ్ఛేద పరమేషుభిః. ౨౦

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాముఁడు;పరమేషుభిః= ఉత్కృష్టములగుబాణములచేత;మహాకపాలస్య= మహాకపాలునియొక్క;శిరః=తలను; చిచ్ఛేద=నఱకెను.

ఆరాముండు, కఱకుబాణంబులచే మహాకపాలునిశిరంబుఖండించెను.

అని, తాత్పర్యము.

అసంఖ్యేయై స్తు బాణౌఘైః ప్రమమాథ ప్రమాథినమ్
స పపాత హతో భూమౌ విటపీవ మహాద్రుమః. ౨౧

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాముఁడు; అసంఖ్యేయైః= లెక్కపెట్టరాని; బాణౌఘైః=బాణసమూహములచేత ; ప్రమాథినంతు= ప్రమాథినిగూడ; ప్రమమాథ=వధించెను. సః= ఆప్రమాథి; హతః=వధింపఁబడినవాఁడై; విటపీవ=కొమ్మలుగల ; మహాద్రుమఇవ=మహావృక్షమువలె, భూమౌ= నేలయందు; పపాత=పడెను.

ఆరాముండు, లెక్కలేని బాణంబులచేఁబ్రమాథిని వధించె,నంతనతండు, పెక్కుకొమ్మలతోఁగూడిన మహావృక్షంబుపగిది, నేలంగూలెను.

అని, తాత్పర్యము.

స్థూలాక్షస్యాక్షిణీ తీక్ష్ణైః పూరయామాస సాయకైః

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాముఁడు; తీక్ష్ణైః=కఱకులయిన; సాయకైః=బాణములచేత; స్థూలాక్షస్య= స్థూలాక్షునియొక్క; అక్షిణీ= కన్నులను; పూరయామాస=నిండించెను.

ఆరాముండు, స్థూలాక్షుని కన్నులు నిండఁ, గఱకుబాణంబుల నేసెను.

అని, తాత్పర్యము.

దూషణస్యానుగాన్ పంచ సాహస్రాన్ కుపితః క్షణాత్. ౨౨
బాణౌఘైః పంచసాహస్రై రనయ ద్యమసాదనమ్

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాముఁడు; కుపితః=కోపించినవాఁడై ; క్షణాత్=క్షణమువలన; దూషణస్య= దూషణునియొక్క; అనుగాన్=వెంబడించువారలగు; పంచసాహస్రాన్ = అయిదువేల మందిని ; పంచసాహస్రైః = అయిదువేలయిన; బాణౌఘైః=బాణసమూహములచేత; యమసాదనం=యముని యింటికిని; అనయత్=పొందించెను.

ఆరాముండు, కుపితుండై,దూషణునివెంబడించి వచ్చిన యయిదువేల




మంది రాక్షసులను, అయిదు వేల బాణములచే, క్షణంబున, యమపురికిం బంపెను. అని, తాత్పర్యము.

దూషణం నిహతం దృష్ట్వా తస్యచైవ పదానుగాన్. ౨౩
వ్యాదిదేశ ఖరః క్రుద్ధ స్సేనాధ్యక్షాన్ మహాబలాన్

టీక॥ ఖరః=ఖరుఁడు ; నిహతం=చంపఁబడిన; దూషణం=దూషణుని; నిహతాన్ (అధ్యాహృతము)=చంపఁబడిన; తస్య= ఆదూషణునియొక్క ; పదానుగాన్ చైవ= అడుగును వెంబడించినవారలను; దృష్ట్వా = చూచి; క్రుద్ధః=కోపించినవాఁడై; మహాబలాన్= అధికమయిన బలముగల ; సేనాధ్యక్షాన్=సేనాధ్యక్షులను; వ్యాదిదేశ= ఆజ్ఞాపించెను.

ఖరుండు, దూషణుండును అతనివెంబడిఁబోయిన నయిదు వేలమంది రాక్షసులును నిహతులగుటంజూచి, కుపితుండై, మహాబలశాలులగు సేనాధ్యక్షులకాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

అయం వినిహత స్సంఖ్యే దూషణ స్సపదానుగః. ౨౪

టీక॥ సపదానుగః= అడుగును వెంబడించువారలతోఁగూడిన ; అయం= ఈ; దూషణః=దూషణుఁడు; సంఖ్యే= యుద్ధమునందు; వినిహతః= చంపఁబడినాఁడు.

ఈదూషణుండును, అతని వెంబడిఁబోయిన యయిదు వేల రాక్షసులును రాముని చేహతులయిరి.

అని, తాత్పర్యము.

మహత్యా సేనయా సార్ధం యుద్ధ్వా రామం కుమానుషమ్
శస్త్రై ర్నానావిధాకారై ర్హనధ్వం సర్వరాక్షసాః. ౨౫

టీక॥ సర్వరాక్షసాః = సమస్తరాక్షసులారా ! యూయం (అధ్యాహృతము)= మీరలు ; మహత్యా= గొప్పదగు; సేనయాసార్ధం = సేనతోఁగూడ; నానావిధాకారైః = నానావిధములయిన యాకారములుగల ;




శస్త్రైః = ఆయుధములచేత ; కుమానుషం = కుత్సితమనుష్యుఁడగు ; రామం = రామునిని ; హన్తవ్యం = వధింపుఁడు.

సమస్తరాక్షసులారా ! మీరలు, ఇమ్మహాసేనంగూడి, నానావిధాయుధంబులయుద్ధముగావించి, కుత్సితమనుష్యుండగు రామునివధింపుఁడు. అని, ఖరుఁడు సేనాధ్యక్షులకాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా ఖరః క్రుద్ధో రామ మేవాభిదుద్రువే

టీక॥ ఖరః = ఖరుఁడు ; ఏవం = ఇట్లు ; ఉక్త్వా = చెప్పి ; క్రుద్ధః = కోపించినవాఁడై ; రామమేవ = రామునిగూర్చియె ; అభిదుద్రువే = పరుగెత్తెను.

ఖరుండీప్రకారమునంజెప్పి, కుపితుండై, రామునిమీఁదికిఁబోయెను.

అని, తాత్పర్యము.

శ్యేనగామీ పృథుగ్రీవో యజ్ఞశత్రు ర్విహంగమః. ౨౬
దుర్జయః కరవీరాక్షః పరుషః కాలకార్ముకః
మేఘమాలీ మహామాలీ సర్పాస్యో రుధిరాశనః. ౨౭
ద్వాదశైతే మహావీర్యా బలాధ్యక్షా స్ససైనికాః
రామ మేవా భ్యవర్తన్త విసృజన్త శ్శరోత్తమాన్. ౨౮

టీక॥ శ్యేనగామీ = శ్యేనగామియు ; పృథుగ్రీవః = పృథుగ్రీవుఁడును ; యజ్ఞశత్రుః = యజ్ఞశత్రుఁడును ; విహంగమః = విహంగముఁడును ; దుర్జయః = దుర్జయుఁడును ; కరవీరాక్షః = కరవీరాక్షుఁడును ; పరుషః = పరుషుఁడును ; కాలకార్ముకః = కాలకార్ముకుండును ; మేఘమాలీ = మేఘమాలియు ; మహామాలీ = మహామాలియు ; సర్పాస్యః = సర్పాస్యుఁడును ; రుధిరాశనః = రుధిరాశనుఁడును ; మహావీర్యాః = అధికమయినపరాక్రమముగల ; ఏతే = ఈ ; ద్వాదశ = పండ్రెండుగురైన ; బలాధ్యక్షాః = సేనాధ్యక్షులు ; ససైనికాః = సైనికులతోఁగూడినవారలయి ; శరోత్తమాన్ = బాణశ్రేష్ఠములను ; విసృజన్తః = విడుచుచు ; రామమేవ = రామునిగూర్చియె ; అభ్యవర్తన్త = పోయిరి.

స ౫౭

శ్యేనగామియుఁ బృథుగ్రీవుండును యజ్ఞశత్రుండును విహంగముఁడును దుర్జయుఁడును గరవీరాక్షుఁడును బరుషుఁడును గాలకార్ముకుండును మేఘమాలియును మహామాలియు సర్పాస్యుఁడును రుధిరాశనుఁడును మహావీర్యులగు నీ సేనాధ్యక్షులు పండ్రెండుగురును సేనాసహితులయి, నానావిధోత్తమ బాణంబులం బ్రయోగించుచు, రాముని మీఁదికి డరిరి. అని, తాత్పర్యము.

తతః పావకసంకాశై ర్హేమవజ్రవిభూషితైః
జఘాన శేషం తేజస్వీ తస్య సైన్యస్య సాయకైః. ౨౯

టీక॥ తతః= అంత; తేజస్వీ = అధికమయిన పరాక్రమము గల రాముండు; పావకసంకాశైః= నిప్పుతోసమానములును; హేమవజ్రవిభూషితైః= బంగారముల చేతను వజ్రముల చేతను అలంకరింపఁబడినవియును అగు; సాయకైః= బాణముల చేత; తస్య= ఆ; సైన్యస్యం= సైన్యము యొక్క, శేషం= మిగతను; జఘాన= వధించెను.

అంత, మహాపరాక్రమశాలియగు రాముండు, బంగారము చేతను వజ్రములచేతను అలంకృతంబులయి యగ్నిహోత్రములువలెఁ దేజరిల్లుచున్న బాణంబులచే, నామిగిలిన సైన్యమును గూడ, వధించెను. అని, తాత్పర్యము.

తే రుక్మపుంఖా విశిఖా స్సధూమా ఇవ పావకాః
నిజఘ్ను స్తాని రక్షాంసి వజ్రా ఇవ మహాద్రుమాన్. ౩౦

టీక॥ సధూమాః= పొగతోఁగూడిన; పావకాః ఇవ (స్థితాః)= నిప్పులువలె నున్న; రుక్మపుంఖాః= బంగారు పింజలు గల; తే= ఆ; విశిఖాః= బాణములు; తాని; ఆ; రక్షాంసి= రాక్షసులను; వజ్రాః= వజ్రాయుధములు; మహాద్రుమానివ= మహావృక్షములనువలె; నిజఘ్నుః= వధించినవి.

పొగరాజుచున్న యగ్నిహోత్రములువలెనున్న కాంచనపుంఖములగు నా బాణంబులు, వజ్రాయుధంబులు, మహావృక్షంబులన డఁకునట్లు, ఆ రాక్షసులనందఱ, ఖండించినవి. అని, తాత్పర్యము.

రక్షసాంతు శతం రామ శ్శతే నై కేన కర్ణినా
సహస్రంచ సహస్రేణ జఘాన రణమూర్ధని. ౩౧

టీక॥ రామః = రాముఁడు; రణమూర్ధని = యుద్ధాగ్రమమునందు; ఏకేన=ఒక్కటయిన;కర్ణినా = కర్ణాకారములగు ;శతేన = నూఱు బాణములచేత;రక్షసాం = రాక్షసులయొక్క; శతంతు = నూటిని;సహస్రేణ= వేయిబాణములచేత ; సహస్రంచ=వేయిఁటెని; జఘాన = వధించెను.

రాముండు,యుద్ధాగ్రంబున , నూఱు రాక్షసుల నూఱుబాణంబులచేతను,వేయిమంది రాక్షసులవేయిబాణంబులనువధించెను. అని,తాత్పర్యము.

తై ర్భిన్నవర్మాభరణా శ్ఛిన్నభిన్నశరాసనాః
నిపేతు శ్శోణితాదిగ్ధా ధరణ్యాం రజనీచరాః. ౩౨

టీక॥ రజనీచరాః = రాక్షసులు; తైః=ఆబాణములచేత; భిన్నవర్మాభరణాః = భేదింపఁబడినకవచములనుఆభరణములునుగలవారలయి ; ఛిన్నభిన్న శరాసనాః = నఱుకఁబడినవియు భేదింపఁబడినవియునగు విండ్లు గలవారలయి; శోణితాదిగ్ధాః = నెత్తురుచేఁ దడుపఁబడినవారలయి ; ధరణ్యాం=భూమియందు;నిపేతుః= పడిరి.

రాక్షసులు , ఆబాణంబులచేభిన్నకవచులయి , నఱుకఁబడినధనుస్సులుగలవారలయి , నెత్తుటం దోఁగుచు, భూమింబడిరి. అని,తాత్పర్యము.

తై ర్ముక్తకేశై స్సమరే పతితై శ్శోణితోక్షితైః
ఆస్తీర్ణా వసుధా కృత్స్నా మహావేదిః కుశైరివ. ౩౩

టీక॥ సమరే= యుద్ధమునందు;ముక్తకేశైః= విడువఁబడినవెండ్రుకలుగలవారలును; పతితైః= పడినవారలును; శోణితోక్షితైః= నెత్తురుచేఁదడు

పంబడినవారలునగు; తైః=ఆరాక్షసులచేత; ఆస్తీర్ణాం=కప్పంబడిన; వసుధా=భూమి; కృత్స్నా=అంతయు; కుశైః=దర్భలచేత; ఆస్తీర్ణా=కప్పంబడిన; మహావేదిరివ=యాగవేదికవలె; బభౌ(అధ్యాహృతము)=ప్రకాశించినది.

అట్లు, విరిసినతలవెండ్రుకలతోను త్తుటందోఁగుదుఁబడియున్న రాక్షసులచేఁగప్పంబడినయాయుద్ధభూమి, దర్భలచేఁగప్పంబడినయాగవేదికవలెనొప్పుచుండినది. అని, తాత్పర్యము.

క్షణేనతు మహాఘోరం వనం నిహతరాక్షసమ్
బభూవ నిరయప్రఖ్యం మాంసశోణితకర్దమమ్. ౩౪

టీక॥ క్షణేనతు=క్షణముచేతనే; మహాఘోరం=మహాభయంకరమగు; వనం=అడవి; నిహతరాక్షసం=చంపంబడినరాక్షసులుగలదిగాను; మాంసశోణితకర్దమం=మాంసముచేతను నెత్తురుచేతను నడుసుగలదిగాను; నిరయప్రఖ్యం=నరకముతోఁబోలికగలదిగాను; బభూవ=ఆయెను.

క్షణమాత్రంబున, మహాభయంకరబగునవ్వనంబు, రాక్షసులందఱునిహతులగుటచే, మాంసరక్తంబులయడుసుతోఁగూడి, నరకంబువలెనుండినది.
అని, తాత్పర్యము.

చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్
హతా న్యేకేన రామేణ మానుషేణ పదాతినా. ౩౫

టీక॥ ఏకేన=ఒక్కఁడును; మానుషేణ=మనుష్యుండును; పదాతినా=కాలిబంటువునగు; రామేణ=రామునిచేత; భీమకర్మణాం=భయంకరమయినకార్యములుగల; రక్షసాం=రాక్షసులయొక్క; సహస్రాణి=వేలు; చతుర్దశ=పదునాలుగు, హతాని=చంపఁబడినవి.

మనుష్యుండును బదాతియునగురాముండొక్కరుండు, భయంకరపరాక్రములగు పదునాలుగువేల రాక్షసులను వధించెను. అని, తాత్పర్యము.

తస్య సైన్యస్య సర్వస్య ఖరశ్శేషో మహారథః

రాక్షస స్త్రిశిరాశ్చైవ రామశ్చ రిపుసూదనః. ౩౬

టీక॥ తస్య=ఆ; సైన్యస్య = సైన్యమునకు; సర్వస్య=అంతకును; మహారథః= తన్ను నుసారథిని గుఱ్ఱంబులం గాపాడుకొనుచుఁ బదునొకండు వేలమందివిలుకాండ్రతోఁ బోరువాఁడగు; ఖరః=ఖరుండును; త్రిశిరాః= త్రిశిరుఁడను; రాక్షసశ్చైవ= రాక్షసుఁడును; రిపుసూదనః = శత్రువులంజంపునట్టి; రామశ్చ= రాముఁడును ; శేషః = మిగత.

ఆసైన్యమునకంతయుఁ దన్నునుసారథినిగుఱ్ఱంబులను గాపాడు కొనుచుఁ బదునొకండు వేలమందివిలుకాండ్రతోఁ బోరఁజాలినఖరుండును త్రిశిరుండును శత్రువధంబు సేయునట్టి రాముఁడును, వీరుముగ్గురుమిగిలిరి. అని, తాత్పర్యము.

శేషా హతా మహాసత్త్వా రాక్షసా రణమూర్ధని
ఘోరా దుర్విషహా స్సర్వే లక్ష్మణ స్యాగ్రజేన తే. ౩౭

టీక॥ శేషాః= మిగిలిన ; మహాసత్త్వాః= అధికమయినబలముగలవారలును; ఘోరాః=భయంకరులును; దుర్విషహాః = సహింపఁగూడనివారలునగు; తే=ఆ; రాక్షసాః = రాక్షసులు; సర్వే=అందఱును; రణమూర్ధని=యుద్ధాగ్రమునందు;లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క; అగ్రజేన= అన్నయగు రామునిచేత; హతాః = చంపఁబడినారు.

మహా బలశాలులును భయంకరాకారులునుదుర్జయులునగు తక్కినరాక్షసులనందఱును , లక్ష్మణాగ్రజుఁడగు రాముండు, యుద్ధంబున,వధించివుచ్చెను. అని, తాత్పర్యము.

తత స్తు త ద్భీమబలం మహాహవే
సమీక్ష్య రామేణ హతం బలీయసా
రథేన రామం మహతా ఖర స్తదా
సమాససా దేంద్ర ఇవోద్యతాశనిః. ౩౮




టీక॥తతస్తు=అంతను; తదా= అప్పుడు; ఖరః=ఖరుఁడు; మహాహవే=మహాయుద్ధమునందు; బలీయసా=బలిష్ఠుండగు; రామేణ=రామునిచేత; హతం=వధింపఁబడిన; భీమబలం=భయంకరమయినబలముగల; తత్= ఆసైన్యమును; సమీక్ష్య= చూచి;మహతా=గొప్పదగు; రథేన=రథముచేత ; రామం=రామునిః ఉద్యతాశనిః=పట్టఁబడినవజ్రాయుధముగల; ఇంద్రఇవ=ఇంద్రుఁడువలె; సమాససాద = సమీపించెను.

అంతనప్పుడు, బలవంతుండగు రాముండు యుద్ధంబున భయంకరంబగు నాసైన్యమునంతయు వధించుటం జూచి, ఖరుండు, కోపంబున,మహారథారూఢుండై, వజ్రాయుధంబు ధరించిన యింద్రునిపగిది,భయంకరాకారుండై, రామునిపైకిఁ గవిసెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే ,
ఆరణ్యకాండే , షడ్వింశస్సర్గః.
ఇది,స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,ఆరణ్యకాండషడ్వింశసర్గటీక,
ముగిసినది.








౨౭

సప్తవింశసర్గప్రారంభః.

ఖరంతు రామాభిముఖం ప్రయాంతం వాహినీపతిః
రాక్షస స్త్రిశిరా నామ సన్నిపత్యేద మబ్రవీత్. ౧

టీక॥ వాహినీపతిః= సేనానాయకుండగు; త్రిశిరానామ=త్రిశిరుండనిప్రసిద్ధుండైన; రాక్షసః = రాక్షసుండు; రామాభిముఖం= రామునకభిముఖముగా; ప్రయాంతం=పోయిన; ఖరంతు= ఖరునిగూర్చి; సన్నిపత్య=పోయి; ఇదం = ఈమాటను ; అబ్రవీత్ = చెప్పెను.

సేనానాయకుండగుత్రిశిరుండు, రామునకభిముఖంబుగానడచిన ఖరుంజూచి, యతనికడ్డముగాఁబోయి,యీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

మాం నియోజయ విక్రాంత సన్నివర్తస్వ సాహసాత్
పశ్య రామం మహాబాహుం సంయుగే వినిపాతితమ్. ౨

టీక ॥ విక్రాంత = పరాక్రమశాలివగుఖరుండా! మాం = నన్ను ; నియోజయ= నియోగింపుము . సాహసాత్= సాహసముననుండి ; సన్నివర్తస్వ=మరలుము. మహాబాహుం= పెద్దచేతులుగల; రామం = రాముని; సంయుగే=యుద్ధమునందు ; వినిపాతితం=వధింపఁబడినవానిఁగా; పశ్య= చూడుము.

పరాక్రమశాలివగుఖరుండా ! నన్నాజ్ఞాపింపుము ; ఈసాహసంబువదలుము ; ఇదిగో , మహాబాహుండగు రాముని యుద్ధంబున వధింతునను,జూడుము. అని, తాత్పర్యము.

ప్రతిజానామి తే సత్య మాయుధం చాహ మాలభే
యథా రామం వధిష్యామి వధార్హం సర్వరక్షసామ్. ౩

టీక॥ యథా = ఎట్లు; సర్వరక్షసాం=సమస్తరాక్షసులకును ; వధార్హం= వధింపనర్హుఁడగు ; రామం=రాముని;వధిష్యామి = వధించెదనో; తథా (అధ్యాహృతము)= అట్లు; తే=నీకొఱకు;సత్యం = సత్యముగా;ప్రతిజానామి= ప్రతిజ్ఞచేసెదను. అహం=నేను;ఆయుధం చ = ఆయుధమును;ఆలభే=తాఁకెదను.

నేనుసమస్తరాక్షసులకును వధ్యుండగు రామునివధించెదను ; అట్లు, ఆయుధంబు దాఁకి, సత్యము గాఁ బ్రతిన గావించెదను. అని, తాత్పర్యము.

అహం వాస్య రణే మృత్యు రేషవా సమరే మమ
వినివృత్య రణోత్సాహా న్ముహూర్తం ప్రాశ్నికో భవ. ౪

టీక॥అహంవా= నేనేని; అస్య = ఈరామునకు; రణే= యుద్ధమునందు; మృత్యుః=మృత్యువును. ఏషవా=ఇతఁడేని; సమరే=యుద్ధమునందు;మమ = నాకు; మృత్యుః(అధ్యాహృతము) = మృత్యువు.త్వం (అధ్యాహృతము) = నీవు; రణోత్సాహాత్ = యుద్ధోత్సాహమునసుండి; వినివృత్య=మఱలి; ముహూర్తం=కొంచెముసేపు; ప్రాశ్నికః=సాక్షివి; భవ=అగుము.

నేనైనను, ఈరామునియుద్ధంబున వధించెదను; లేక,రాముఁడేని నన్ను యుద్ధంబున వధించుఁ గాక;నీవిప్పుడు యుద్ధోత్సాహంబువదలి కొంచెముసేపుసాక్షివిగానుండుము.

అని, తాత్పర్యము.

ప్రహృష్టోవా హతే రామే జనస్థానం ప్రయాస్యసి
మయివా నిహతే రామం సంయుగాయో పయాస్యసి. ౫

టీక॥రామే=రాముఁడు ; హతే= చంపఁబడఁగా;త్వం=నీవు;ప్రహృష్టః= సంతసించినవాఁడవై;జనస్థానం= జనస్థానమును;యాస్యసివా = పొందనైనను బొందుదువు. మయి=నేను ; నిహతే=చంపఁబడఁగా; సంయుగాయ= యుద్ధముకొఱకు;రామం=రాముని; ఉపయాస్యసివా= పొందనైననుబొందుదువు.

రాముఁడుహతుండగు నేని, నీవుసం

తుష్టుండవై జనస్థానంబునకైనను బోఁ గలవు; లేక, నేనుహతుండనగుదునేని, రామునితోనేని యుద్ధంబుగావింపుము. అని, త్రిశిరుఁడు, ఖరునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఖర స్త్రిశిరసా తేన మృత్యులోభా త్ప్రసాదితః

టీక॥ ఖరః=ఖరుఁడు; తేన=ఆ; త్రిశిరసా=త్రిశిరునిచేత ; మృత్యులోభాత్=మరణమునందలియాసవలన , ప్రసాదితః=వేఁడుకొనఁబడినవాఁడు.

ఆత్రిశిరుండీప్రకారంబున , ఖరుని వేఁడుకొనియెను. అని, తాత్పర్యము.

గచ్ఛ యుధ్యే త్యనుజ్ఞాతో రాఘవాభి ముఖో యయౌ. ౬

టీక॥ సః (అధ్యాహృతము)= ఆ త్రిశిరుఁడు; "గచ్ఛ= పొమ్ము. యుధ్య=పోరుము" ఇతి=అని ; అనుజ్ఞాతః=అనుమతింపఁబడినవాఁడై; రాఘవాభిముఖః= రామునికెదురుమొగమయినవాఁడై; యయౌ=పోయెను.

అంతఖరుండు , "పోయియుద్ధంబుగావింపుము" అనియనుమతింప , నాత్రిశిరుఁడు రామున కభిముఖంబుగాఁబోయెను. అని, తాత్పర్యము.

త్రిశిరాపి రథేనైవ వాజియుక్తేన భాస్వతా
అభ్యద్రవ ద్రణే రామం త్రిశృంగఇవ పర్వతః. ౭

టీక॥ త్రిశిరాపి (త్రిశిరాఅపి) = త్రిశిరుఁడును;వాజియుక్తేన= గుఱ్ఱములతోఁగూడిన;భాస్వతా = ప్రకాశించుచున్న;రథేనైవ = రథముచేతనే; త్రిశృంగః = మూఁడుశిఖరములుగల, పర్వతఇవ=కొండవలె;రణే = యుద్ధమునందు; రామం= రామునిగూర్చి; అభ్యద్రవత్=పరుగెత్తెను.

త్రిశిరుండు , మంచిగుఱ్ఱంబులుగట్టినదియు దేదీప్యమానంబునగు , రథంబునారోహించి,మూఁడుతలలుగలవాఁడుకావున మూఁడుశిఖరములతోఁగూడినపర్వతంబుకరణి, యుద్ధంబున రామునిపైకడరెను. అని, తాత్పర్యము.

శరధారాసమూహాన్ స మహామేఘ ఇవోత్సృజన్
వ్యసృజత్సదృశం నాదం జలార్ద్రస్యతు దుందుభేః. ౮

టీక॥సః=ఆ త్రిశిరుఁడు; మహామేఘః=మేఘము. ఇవ=గొప్పమేఘమువలెః శరధారాసమూహాన్ = బాణములనెడు ధారలసమూహములను; ఉత్సృజన్=విడుచుచు, జలార్ద్రస్య=జలముచేఁదడిసిన, దుందుభేః=భేరికి; సదృశం=సమానమయిన; నాదం=ధ్వనిని; వ్యసృజత్ = విడిచెను.

ఆత్రిశిరుఁడు, మహామేఘము జలధారలు విడుచునట్లు, బాణంబులు గురిపించుచు, నీటందడిసిన భేరినాదంబునకుఁ దుల్యంబుగా, సింహనాదంబు గావించెను. అని, తాత్పర్యము.

ఆగచ్ఛంతం త్రిశిరసం రాక్షసం ప్రేక్ష్య రాఘవః
ధనుషా ప్రతిజగ్రాహ విధూన్వన్ సాయకాన్ శితాన్. ౯

టీక॥ రాఘవః=రాముఁడు ; ఆగచ్ఛంతం=వచ్చుచున్న, త్రిశిరసం= త్రిశిరుఁడను; రాక్షసం=రాక్షసుని ; ప్రేక్ష్య=చూచి; ధనుషా=ధనుస్సుచేత; శితాన్=తీక్ష్ణములగు; సాయకాన్=బాణములను; విధూన్వన్=కదలించుచు; ప్రతిజగ్రాహ=ప్రతిగ్రహించెను.

రాముఁడు, త్రిశిరుండు వచ్చుటం జూచి, తీక్ష్ణంబులగు బాణంబులను వింటం గూర్చి, ప్రయోగించుచు, నాతనిం బ్రతిగ్రహించెను. అని, తాత్పర్యము.

స సంప్రహారస్తుములో రామత్రిశిరసో మహాన్
బభూవా తీవ బలినో స్సింహకుంజరయో రివ. ౧౦

టీక॥అతీవ= మిక్కిలియు ; బలినోః=బలవంతులగు; రామత్రిశిరసోః= రామునకును త్రిశిరునకును; సింహకుంజరయోరివ=సింహమునకును ఏనుంగునకునువలె; మహాన్=గొప్పదియు; తుములః=దొమ్మియునగు; సః=ఆ ; సంప్రహారః=యుద్ధము; బభూవ = ఆయెను.

అంత, మహాబలశాలులగునారామ త్రిశిరులకు సింహంబునకునుమదపుటే నుంగునకుంబోలె, గొప్పయుద్ధంబుగలిగెను.అని, తాత్పర్యము.

తత స్త్రిశిరసా బాణై ర్లలాటే తాడిత స్త్రిభిః
అమర్షీ కుపితో రామ స్సంరబ్ధ మిద మబ్రవీత్. ౧౧

టీక॥ తతః=అంత;అమర్షీ= అధికమయినకోపముగల;రామః = రాముఁడు;త్రిశిరసా = త్రిశిరునిచేత; లలాటే=నొసటను; త్రిభిః = మూఁడైన;బాణైః = బాణములచేత; తాడితః=కొట్టఁబడినవాఁడై,కుపితః= కోపించినవాఁడై;సంరబ్ధం = వేగిరపాటుతోఁగూడునట్లుగా;ఇదం= ఈమాటను;అబ్రవీత్=చెప్పెను.

అంతఁ, గ్రుద్ధుండైనరాముండు, త్రిశిరునిచే నొసట మూఁడుబాణంబులందాడితుండై, మఱియుఁగోపమునొంది,యిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

అహో విక్రమశూరస్య రాక్షసస్యే దృశం బలమ్
పుష్పైరివ శరై ర్యస్య లలాటే స్మి పరిక్షతః. ౧౨

టీక॥అహో=ఆశ్చర్యము! విక్రమశూరస్య=పరాక్రమశూరుండగు; రాక్షసస్య=రాక్షసునియొక్క;బలం=బలిమి;ఈదృశం=ఇట్టిది!యస్య= ఎవ్వనియొక్క;శరైః=బాణములచేత ; పుష్పైరివ=పూలచేతవలె;లలాటే=నొసటను;పరిక్షతః= కొట్టఁబడినానో.

ఆశ్చర్యము! మహాపరాక్రమశాలియుశూరుండునగురాక్షసునిబలముచాలగొప్పదిగానున్నది ! ఈబాణంబులునానొసటందగిలిపుష్పంబులువలె నున్నవి! అని,తాత్పర్యము.

మమాపి ప్రతిగృహ్ణీష్వ శరాం శ్చాపగుణచ్యుతాన్

టీక॥మమ=నాయొక్క; చాపగుణచ్యుతాన్=ధనుస్సుయొక్క యల్లెత్రాటనుండివెడలిన;శరానపి= బాణములనుగూడ,ప్రతిగృహ్ణీష్వ= ప్రతిగ్రహిం

పుము.

ఇంక, నాధనుస్సునుండి వెడలెడు బాణంబులనుం బ్రతిగ్రహించి చూడు ము. అని, రాముండు, త్రిశిరునితోఁ జెప్పె ను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వాతు సంరబ్ధ శ్శరా నాశీవిషోపమాన్. ౧౩
త్రిశిరోవక్షసి క్రుద్ధో నిజఘాన చతుర్దశ

టీక॥ సః(అధ్యాహృతము)=ఆ రాముఁడు; ఏవం=ఇట్లు; ఉక్త్వాతు = చెప్పినంతనె; క్రుద్ధః = కోపించినవాఁడై; సంరబ్ధః=వేగిరపడినవాఁడై, ఆశీవిషోపమాన్= సర్పములతోఁ బోల్కిగల, చతుర్దశ= పదునాలుగు ; శరాన్=బాణములను; త్రిశిరోవక్షసి= త్రిశిరుని ఱొమ్మునందు ; నిజఘాన= వేసెను.

ఆ రాముండు , ఈప్రకారంబునం జెప్పి, కుపితుండై, వేగంబునఁ గ్రూర సర్పసమానంబులగు పదునాలుగు బాణంబులఁ, త్రిశిరుని ఱొమ్మునైపె గాడ నేసెను. అని, తాత్పర్యము.

చతుర్భి స్తురగా నస్య శరై స్సన్నతపర్వభిః. ౧౪
న్యపాతయత తేజస్వీ చతుర స్తస్య వాజినః

టీక॥ తేజస్వీ = అధికమయిన పరాక్రమముగల రాముఁడు ; తస్య= అట్టి; అస్య= ఈత్రిశిరునియొక్క; వాజినః=వేగవంతములగు; తురగాన్= గుఱ్ఱములను; చతురః = నాలుగింటిని; సన్నతపర్వభిః = వంకరలేనిగణుపులుగల, శరైః = బాణములచేత; చతుర్భిః=నాలుగింటిచేత; న్యపాతయత=పడవేసెను.

అంత , మహాపరాక్రమశాలియగు రాముండు , నాలుగుబాణలబులచేత , నాత్రిశిరునిగుఱ్ఱంబుల నాలుగింటినిం గూలనేసెను.

అష్టభి స్సాయకై స్సూతం రథోపస్థా న్న్యపాతయత్. ౧౫
రామ శ్చిచ్ఛేద బాణేన ధ్వజంచాస్య సముచ్ఛ్రితమ్

టీక॥ రామః = రాముఁడు; అష్టభిః=ఎనిమిదియయిన ; సాయకైః = బాణములచేత;సూతం = సారథిని; రథోపస్థాత్ = రథముపైనుండి; న్యపాతయత్ = పడవేసెను. అస్య= ఈత్రిశిరుని యొక్క ; సముచ్ఛ్రితం= ఉన్నతమగు;ధ్వజంచ = టెక్కెము ను,బాణేన=బాణముచేత ; చిచ్ఛేద నఱకెను.

రాముం డెనిమిది బాణంబుల సారథిం గూలనేసెను ; ఒక్కబాణంబున,రథంబుపైనుండుధ్వజంబును దెగవ్రేసెను. అని, తాత్పర్యము.

తతో హతరథా త్తస్మా దుత్పతంతం నిశాచరమ్. ౧౮
బిభేద రామ స్తం బాణై ర్హృదయే సోభవ జ్జడః

టీక॥ తతః=అంత;రామః = రాముఁడు;తస్మాత్=ఆ ; హతరథాత్= కొట్టఁబడినరథమునసుండి ; ఉత్పతంతం = ఎగురుచున్న ; తం = ఆ; నిశాచరం = రాక్షసుని;హృదయే= ఱొమ్మునందు; బాణైః = బాణములచేత;బిభేద=భేదించెను . సః = ఆ త్రిశిరుఁడు;జడః = మూర్ఛితుఁడు; అభవత్ =అయ్యెను.

అంత , రాముండు , ఆత్రిశిరుఁడు హతాశ్వంబగు నారథంబుననుండియుద్గమించుటంజూచి , యాతనివక్షస్థ్సలంబునఁ బెక్కుబాణంబుల గాఢనేయ, నారాక్షసుండుమూర్ఛిల్లెను. అని, తాత్పర్యము.

సాయకై శ్చాప్రమేయాత్మా సామర్ష స్తస్య రక్షసః. ౧౯
శిరాం స్యపాతయ ద్రామో వేగవద్భి స్త్రిభి శ్శితైః

టీక॥అప్రమేయాత్మా=కొలఁతపెట్టరానిబలముగల; రామః= రాముఁడు; సామర్షః= కోపముతోఁ గూడినవాఁడై; వేగవద్భిః= అధికమయినవేగముగలవియు; శితైః=తీక్ష్ణములునగు; త్రిభిః=మూఁడైన; సాయకైశ్చ= బాణములచేతను;తస్య=ఆ;రక్షసః = త్రిశిరునియొక్క; శిరాంసి=తలలను;అపాతయత్ =పడవేసెను.

అప్రమేయబలుండగు రాముండు,

కోపమునొంది, వేగవంతంబులగు మూఁడుకలుకుబాణంబుల, నాత్రిశిరుని మూఁడుతలలను ఖండించెను. అని, తాత్పర్యము.

స భూమౌ రుధిరోద్గారీ రామబాణాభిపీడితః. ౧౮
న్యపత త్పతితైః పూర్వం స్వశిరోభి ర్నిశాచరః

టీక॥ సః=ఆ; నిశాచరః =రాక్షసుఁడగు త్రిశిరుఁడు; రామబాణాభిపీడితః=రామబాణములచేఁ బీడింపఁబడినవాఁడై; రుధిరోద్గారీ= నెత్తురుఁగ్రక్కుచున్నవాఁడై; పూర్వం = మున్ను; పతితైః=పడిన; స్వశిరోభిః = తనతలలతోఁగూడ, భూమౌ= నేలయందు; న్యపతత్=పడెను.

ఆత్రిశిరుండు, అట్లు రామబాణంబులచే ఖండితశిరస్కుండై, నెత్తురుఁగ్రక్కుచుఁ, దలలతోఁగూడ, నేలంగూలెను. అని, తాత్పర్యము.

హతశేషా స్తతో భగ్నా రాక్షసాః ఖరసంశ్రయాః. ౧౯
ద్రవంతిస్మ న తిష్ఠంతి వ్యాఘ్రత్రస్తా మృగా ఇవ

టీక॥ తతః=అంత; హతశేషాః=చంపఁబడఁగా మిగిలిన; ఖరసంశ్రయాః=ఖరుఁడే యాశ్రయముగాఁగల; రాక్షసాః=రాక్షసులు; భగ్నాః= భయంబు నొందినవారలయి; ద్రవంతిస్మ=పరుగెత్తిరి. వ్యాఘ్రత్రస్తాః=పులివలనభయపడిన; మృగాఇవ=జింకలువలె; నతిష్ఠంతి=నిలువరు.

అంత, ఖరసైనికులలో హతశేషులగు రాక్షసులు, భీతులయి పెద్దపులికిభయపడిన జింకలపగిది, నిలువక పరుగెత్తిరి. అని, తాత్పర్యము.

తాన్ ఖరో ద్రవతో దృష్ట్వా నివర్త్య రుషిత స్స్వయమ్. ౨౦
రామ మేవాభిదుద్రావ రాహు శ్చంద్రమసం యథా

టీక॥ ఖరః=ఖరుఁడు; ద్రవతః=పరుగెత్తుచున్న; తాన్ = ఆరాక్షసుల

ను; దృష్ట్వా=చూచి; రుషితః=కోపించినవారై; స్వయం = తానె; నివర్త్య=మరలించి; రామమేవ = రామునిగూర్చియె ; రాహుః = రాహువు ; చంద్రమసంయథా = చంద్రునివలె ; అభిదుద్రావ = పరుగెత్తెను.

ఖరుండు, అట్లుపరుగెత్తుచున్న రాక్షసులంజూచి, కుపితుండై, వారలమరలించి, రాహువు చంద్రునిపైకిం బోవునట్లు, రామునిపైకిం బోయెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే, సప్తవింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యావంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండసప్తవింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః.

అష్టావింశసర్గప్రారంభః.

నిహతం దూషణం దృష్ట్వా రణే త్రిశిరసా సహ
ఖరస్యాప్యభవ త్త్రాసో దృష్ట్వా రామస్య విక్రమమ్. ౧

టీక॥ రణే = యుద్ధమునందు; త్రిశిరసాసహ= త్రిశిరునితోఁగూడ ; నిహతం=వధింపఁబడిన ; దూషణం= దూషణునిని; దృష్ట్వా=చూచి; ఖరస్యాపి=ఖరునికిని; రామస్య = రామునియొక్క; విక్రమం = పరాక్రమమును; దృష్ట్వా=చూచి; త్రాసః = భయము; అభవత్=కలిగెను.

అట్లు రాముండు, యుద్ధంబున, దూషణునిఁ ద్రిశిరునింగూడ వధించినది చూచి, ఖరుండును, రాముని పరాక్రమంబునకుభయమునొందెను.

అని, తాత్పర్యము.

స ౨౮

స దృష్ట్వా రాక్షసం సైన్య మవిషహ్యం మహాబలః
హత మేకేన రామేణ త్రిశిరోదూషణావపి. ౨

తద్బలం హతభూయిష్ఠం విమనాః ప్రేక్ష్య రాక్షసః
ఆససాద ఖరో రామం నముచి ర్వాసవం యథా. ౩

టీక॥ మహాబలః= అధికమయినబలముగల; రాక్షసః=రాక్షసుఁడైన ; ఖరః=ఖరుఁడు, ఏకేన=ఒకరిఁడైన, రామేణ=రామునిచేత; హతం= చంపఁబడిన; అవిషహ్యం= సహింపనలవిగాని, రాక్షసం=రాక్షససంబంధియగు; సైన్యం=సైన్యమును; హతౌ (అధ్యాహృతము)=చంపఁబడిన; త్రిశిరోదూషణావపి=త్రిశిరునిదూషణునిని; దృష్ట్వా= చూచి; హతభూయిష్ఠం=చంపఁబడిన యుత్తమ రాక్షసులుగల; తత్ =ఆ; బలం= సైన్యమును; ప్రేక్ష్య=చూచి; విమనాః= దుఃఖమునొందిన మనస్సుగలవాఁడై ; రామం=రాముని; నముచిః = నముచియను రాక్షసుఁడు; వాసవంయథా= ఇంద్రునిఁబోలె; ఆససాద = సమీపించెను.

మహాబలశాలియగు ఖరుఁడు, ఒకరిరామునిచే, దుర్జయంబగు రాక్షససైన్యంబంతయుఁ ద్రిశిరుండును దూషణుఁడునువధింపఁబడుటనుజూచి, సైన్యమంతయునశించుటంగని, దుఃఖితుండై, నముచియింద్రునిపైకిఁబోయినట్లు, రామునిమీఁదికడరెను.

అని, తాత్పర్యము.

వికృష్య బలవ చ్చాపం నారాచాన్ రక్తభోజనాన్
ఖర శ్చిక్షేప రామాయ క్రుద్ధా నాశీవిషానివ. ౪

టీక॥ ఖరః=ఖరుఁడు ; బలవత్= బలముగలుగునట్లుగా; చాపం = ధనుస్సును; వికృష్య = ఆకర్షించి ; క్రుద్ధాన్= కోపమునొందిన ; ఆశీవిషానివ (స్థితాన్) = సర్పములువలెనున్న; రక్తభోజనాన్ = రక్తమునుదినునట్టి; నారాచాన్ = బాణములను; రామాయ=రామునికొఱకు; చిక్షేప= విడిచెను.

ఖరుండు , తనబలంబుకొలంది ధ

నుస్సునాకర్షించి, క్రుద్ధంబులగుక్షుణ్ణ సర్పంబులవంటి రక్తభోజనంబులగు బాణంబుల రామునిపై, బ్రయోగించెను. అని, తాత్పర్యము.

జ్యాం విధూన్వన్ సుబహుశ శ్శిక్షయాస్త్రాణి దర్శయన్

చకార సమరే మార్గాన్ శరై రథగతః ఖరః. ౫

టీక॥ రథగతః=రథమునుబొందిన, ఖరః=ఖరుఁడు; సమరే=యుద్ధమునందు; శిక్షయా=అభ్యాసముచేత; సుబహుశః = అనేక విధములుగా; జ్యాం=అల్లెత్రాటను; విధూన్వన్=చలింపఁజేయుచు; అస్త్రాణి= అస్త్రములను; దర్శయన్=చూపుచు; శరైః= బాణములచేత; మార్గాన్= నానావిధమార్గములను; చకార = చేసెను.

రథగతుండగుఖరుండు, యుద్ధంబున, ధనుర్విద్యాపాండిత్యంబేర్పడ, నానావిధంబులబాణంబులు నారింగూర్చుచు, నస్త్రప్రయోగసామర్థ్యంబు గోచరింపఁ, నానామార్గంబుల బాణంబులు ప్రయోగించెను. అని, తాత్పర్యము.

స సర్వాశ్చ దిశో బాణైః ప్రదిశశ్చ మహారథః

పూరయామాస తం దృష్ట్వా రామోపి సుమహ ద్ధనుః. ౬

టీక॥ మహారథః= తన్నునసారథినిగుఱ్ఱంబులనుగాపాడుకొనుచుఁ బదునొకండువేలు విలుకాండ్రతోఁ బోరునట్టి; సః=ఆ; రామోపి=రాముఁడును; తం=ఆఖరుని; దృష్ట్వా=చూచి; బాణైః=బాణములచేత;సుమహత్ = మిక్కిలియుగొప్పదగు; ధనుః = ధనుస్సును; సర్వాః=సమస్తములయిన; దిశః=దిక్కులను; ప్రదిశశ్చ=విదిక్కులను; పూరయామాస= నిండించెను.

మహారథుండగునారాముండును, ఖరుండుతనమీఁదికివచ్చుటంజూచి, మహాధన్వుసబాణంబులుగూర్చి, సమస్తములయినదిక్కులును విదిక్కులును నిండునట్లు, బాణంబులుప్రయోగించెను. అని, తాత్పర్యము.

ససాయకై ర్దుర్విషహై స్సస్ఫులింగై రివాగ్నిభిః

నభ శ్చకారావివరం పర్జన్య ఇవ వృష్టిభిః. ౭

టీక॥సః=ఆరాముఁడు; దుర్విషహైః=సహింపఁగూడనివియు; సస్ఫులింగైః=అగ్నికణములతోఁగూడిన; అగ్నిభిరివ(దీప్తైః)=నిప్పులువలెనున్నవియునగు; సాయకైః=బాణములచేత; పర్జన్యః=మేఘుఁడు; వృష్టిభిరివ=వర్షములచేతవలె; నభః=ఆకాశమును; అవివరం=సందులేనిదానిఁగా; చకార=చేసెను.

ఆరాముండు, దుస్సహంబులును స్ఫులింగ సహితంబులగు నగ్నులుంబోలెనున్నవియునగు బాణంబులను, మేఘుంబు వర్షంబుగురియునట్లు, గురిపించి, యాకాశంబునంతయు సందులేనట్లుగావించెను. అని, తాత్పర్యము.

తద్బభూవ శితైర్బాణైః ఖరరామవిసర్జితైః
పర్యాకాశ మనాకాశం సర్వత శ్శరసంకులమ్. ౮

టీక॥ఖరరామవిసర్జితైః=ఖరునిచేతను రాముని చేతను విడువఁబడిన; శితైః=తీక్ష్ణములగు; బాణైః=బాణములచేత; తత్=ఆ; పర్యాకాశం=చుట్టునున్న యాకాశము; సర్వతః=అంతట; శరసంకులం=బాణములచే నిండినదిగాను; అనాకాశం=అవకాశములేనిదిగాను; బభూవ=ఆయెను.

అట్లు, ఖరుండును రాముండును ఒండొరులపై బ్రయోగించుకొనినబాణంబులచే, నాచుట్టునున్న యాకాశంబంతయు, బాణమయంబై, నిరవకాశంబయినది. అని, తాత్పర్యము.

శరజాలావృత స్సూర్యో న తదా స్మ ప్రకాశతే
అన్యోన్యవధసంరంభా దుభయో స్సంప్రయుధ్యతోః. ౯

టీక॥తదా=అప్పుడు; అన్యోన్యవధసంరంభాత్=ఒండొరులవధించుటయందలి సంరంభంబు వలన; ఉభయోః=ఇద్దఱును; సంప్రయుధ్యతోః=పోరుచుండఁగా; సూర్యః=సూర్యుఁడు; శరజాలావృతః=బాణసమూహ

ముచేఁ గప్పఁబడినవాఁడై; నప్రకాశతేస్మ = ప్రకాశింపఁడయ్యె.

అప్పుడు, బండోరుల వధింపఁబడలఁపున, నారాముండును ఖరుండునయుద్ధంబుసేయుడు, సూర్యుండు, వాఁబాణంబులనావృతుండై, ప్రకాశింపకుండెను. అని, తాత్పర్యము.

తతో నాళీకనారాచై స్తీక్ష్ణాగ్రైశ్చ వికర్ణిభిః
ఆజఘాన ఖరో రామం తోత్త్రైరివ మహాద్విపమ్. ౧౦

టీక॥ తతః=అంత, ఖరః = ఖరుఁడు; నాళీకనారాచైః = నాళీకాఖ్యముల బాణములచేతను ఆయసబాణములచేతను; తీక్ష్ణాగ్రైః = కఱకులయినకొనలుగల; వికర్ణిభిశ్చ = కర్ణాకారబాణములచేతను; రామం = రాముని; తోత్త్రైః = బరిగోలలచేత; మహాద్విపమివ = మహాగజమునువలె; ఆజఘాన = కొట్టెను.

అంత, బరిగోలలచే మహాగజంబును బొడుచునట్లు, ఖరుండు, తీక్ష్ణంబులగు నానావిధబాణంబులచే రాముని ప్రహరించెను. అని, తాత్పర్యము.

తం రథస్థం ధనుష్పాణిం రాక్షసం పర్యవస్థితమ్
దదృశుః సర్వభూతాని పాశహస్త మివాంతకమ్. ౧౧

టీక॥ సర్వభూతాని = సమస్తభూతంబులును; రథస్థం = రథమున నున్నవాఁడును; ధనుష్పాణిం = ధనుస్సుచేతంగలవాఁడును; పర్యవస్థితం= యుద్ధసన్నద్ధుండును; పాశహస్తం= పాశముచేతంగల; అంతకమివ (స్థితం)= యమునివలె నున్నవాఁడునగు; తం=ఆ; రాక్షసం = రాక్షసుని; దదృశుః=చూచినవి.

అట్లు రథగతుండును ధనుర్ధరుండును యుద్ధసన్నద్ధుండునై పాశహస్తుండగు యమునికైవడి భయంకరాకారుండైయున్న ఖరుంజూచి, సమస్తభూతంబులును భయమునొందినవి.

అని, తాత్పర్యము.

హంతారం సర్వసైన్యస్య పౌరుషే పర్యవస్థితమ్
పరిశ్రాంతం మహాసత్త్వం మేనే రామం ఖర స్తదా. ౧౨

టీక॥ ఖరః=ఖరుఁడు; తదా = అప్పుడు; సర్వసైన్యస్య = సమస్తసైన్యముయొక్క యొక్క; హంతారం = వధించినవాఁడును; పౌరుషే = పౌరుషమునందు; పర్యవస్థితం = నిలిచియున్నవాఁడును; మహాసత్త్వం = అధికమయినబలముగలవాఁడునగు; రామం= రాముని; పరిశ్రాంతం = అలసటనొందినవానిఁగా; మేనే=తలంచెను.

ఖరుఁడు, రాముఁడు మహాబలుండును మహాపౌరుషుండునైనను అంతటి మహాసైన్యమును వధించి యున్నాఁడు కావున నలసటనొంది యుండునని, తలంచెను. అని, తాత్పర్యము.

తం సింహమివ విక్రాంతం సింహవిక్రాంతగామినమ్
దృష్ట్వా నోద్విజతే రామ స్సింహః క్షుద్రమృగం యథా. ౧౩

టీక॥ రామః = రాముండు; సింహమివ=సింహమునువలె; విక్రాంతం= పరాక్రమించిన వాఁడును; సింహవిక్రాంతగామినం = సింహముయొక్క గమనమువలెనడచువాఁడునగు; తం= ఆఖరుని; దృష్ట్వా = చూచి, సింహః= సింహము, క్షుద్రమృగం = స్వల్పమృగమును; దృష్ట్వా (అధ్యాహృతము) యథా=చూచినవలె; నోద్విజతే= చలింపఁడు.

రాముండు, అట్లు సింహమువలె నతి పరాక్రమశాలియయి యతివేగంబున వచ్చుచున్న యాఖరుంజూచి, సింహము క్షుద్రమృగంబులంజూచి భయపడనట్లు, ఎంతమాత్రము చలింపఁడయ్యె. అని, తాత్పర్యము.

తత స్సూర్యనికాశేన రథేన మహతా ఖరః
ఆససాద రణే రామం పతంగఇవ పావకమ్. ౧౪

టీక॥ తతః=అంత; ఖరః= ఖరుఁడు; రణే=యుద్ధమునందు; సూర్యనికాశే

న=సూర్యునితో సమానమయిన; మహతా=గొప్పదగు;రధేన= రధముచేత; రామం=రాముని;పతంగః= మిడుత; పావకమివ= అగ్నిజ్వాలాత్రమువలె; ఆససాద=సమీపించెను.

అంత , మిడుతయగ్నిజ్వాలాత్రము మీఁదికిఁబోవునట్లు,ఖరుండు, యుద్ధంబున,సూర్యప్రభంబగు మహారధంబుతో, రాముసమీఁదికడరెను.

అని, తాత్పర్యము.

తతోస్య సశరం చాపం ముష్టిదేశే మహాత్మనః
ఖర శ్చిచ్ఛేద రామస్య దర్శయన్ పాణిలాఘవమ్. ౧౫

టీక॥తతః=అంత;అస్య= ఈఖరునియొక్క; శరః=బాణము; పాణిలాఘవం = హస్తలాఘవమును ; దర్శయన్=చూపుచు; మహాత్మనః= అధికమయినపరాక్రమముగల ; రామస్య= రామునియొక్క; సశరం= బాణముతోఁగూడిన;చాపం=ధనుస్సును; ముష్టిదేశే=పడికిలిప్రదేశమునందు ; చిచ్ఛేద=ఖండించెను.

అంత, ఖరుండు,తనహస్తలాఘవంబేపడ,నొక్కబాణమ్మున , మహాత్ముండగు రామునిధనుస్సును, ముష్టిప్రదేశంబున,ఖండించెను.

అని, తాత్పర్యము.

స పున స్త్వపరాన్ స ప్త శరా నాదాయ వర్మణి
నిజఘాన ఖరః క్రుద్ధ శ్శక్రాశనిసమప్రభాన్. ౧౬

టీక॥సః=ఆ;ఖరః=ఖరుఁడు ; క్రుద్ధః=కోపించినవాఁడై;అపరాన్= ఇతరములయిన;శక్రాశనిసమప్రభాన్= ఇంద్రుని వజ్రముయొక్క కాంతివంటి కాంతిగల;శరాన్=బాణములను; ఆదాయ=తీసికొని;వర్మణి= కవచమునందు;నిజఘాన=కొట్టెను.

ఆఖరుండు,క్రుద్ధుండై,మఱల , దేవేంద్రుని వజ్రాయుధమునుంబోనిమేడు బాణంబులఁదీసి , రామునికవచంబుపయినేసెను. అని, తాత్పర్యము.

తత స్తత్ప్రహతం బాణైః ఖరముక్తై స్సుపర్వభిః

పపాత కవచం భూమౌ రామస్యాదిత్యవర్చసః. ౧౭

టీక॥ తతః=అంత; ఆదిత్యవర్చసః=సూర్యునియొక్క-కాంతివంటికాంతి గల; రామస్య = రామునియొక్క; తత్=ఆ; కవచం = కవచము; ఖరముక్తైః= ఖరునిచేవిడువఁబడిన; సుపర్వభిః = మంచిగణుపులుగల; బాణైః= బాణములచేత; ప్రహతం=కొట్టఁబడినదై; భూమౌ=నేలయందు; పపాత=పడెను.

అంత, ఖరుండువిడిచిన యా సప్త బాణంబులచేఁ, గొట్టఁబడి, రామునికవచంబు నేలంబడెను; అట్లుకప్పు విడుచుటచే, రాముండు సూర్యునికై వడిఁ దేజరిల్లెను. అని, తాత్పర్యము.

తత శ్శరసహస్రేణ రామ మప్రతిమౌజసమ్
అర్దయిత్వా మహానాదం ననాద సమరే ఖరః. ౧౮

టీక॥ తతః=అంత; ఖరః=ఖరుఁడు, సమరే=యుద్ధమునందు; శరసహస్రేణ=బాణములవేయింటిచేత; అప్రతిమౌజసం=సరిలేనిపరాక్రమముగల; రామం= రాముని; అర్దయిత్వా = నొప్పించి; మహానాదం= అధికమయిన ధ్వనిగలుగునట్లుగా; ననాద = అఱచెను.

అంత, ఖరుండు, యుద్ధంబున, మహాపరాక్రమశాలియగు రాముని వేయిబాణంబులం బ్రహరించి, మహాధ్వనిగలుగునట్లు, సింహనాదంబు గావించెను. అని, తాత్పర్యము.

స శరై రర్పితః క్రుద్ధ స్సర్వగాత్రేషు రాఘవః
రరాజ సమరే రామో విధూమోగ్ని రివ జ్వలన్. ౧౯

టీక॥ రాఘవః= రఘువంశమునం బుట్టినవాఁడగు; సః=ఆ; రామః = రాముఁడు; సమరే= యుద్ధమునందు; సర్వగాత్రేషు = సమస్తావయవములందును; బాణైః=బాణములచేత; అర్పితః= పొందింపఁబడినవాఁడై; క్రుద్ధః = కో

పించినవాఁడై,విధూమః = పొగలేని; అగ్నిరివ = అగ్నిహోత్రమువలె,జ్వలన్=వెలుంగుచు;రరాజ = ప్రకాశించెను.

ఆరాముండు,యుద్ధంబున , నట్లు దేహంబునందంతటను బాణములచే బాధితుండై , పరమకుపితుండై , పొగలేక మండుచుండు నగ్నిహోత్రముకై వడిఁ, బ్రకాశించెను.

అని, తాత్పర్యము.

తతో గంభీరనిర్హ్రాదం రామ శ్శత్రునిబర్హణః
చకారాంతాయ స రిపో స్సజ్య మన్య న్మహ ద్ధనుః. ౨౦

టీక॥ తతః=అంత; శత్రునిబర్హణః = శత్రువులఁజంపునట్టి,సః= ఆ; రామః=రాముఁడు; రిపోః = శత్రువుయొక్క;అంతాయ = నాశముకొఱకు;గంభీరనిర్హ్రాదం = గంభీరమయినధ్వనిగలదియు;మహత్= గొప్పదియునగు;అన్యత్ = ఇతరమయిన; ధనుః=ధనుస్సును;సజ్యం = అల్లెత్రాటితోఁగూడినదానిఁగా;చకార = చేసెను.

అంత , శత్రువులవధించునట్టి రాముండు, శత్రువధార్థమయి , గంభీరమయినధ్వనిగలదగు నొకటియొక మహాధనుస్సును, సజ్యంబుగావించెను.

అని, తాత్పర్యము.

సుమహ ద్వైష్ణవం య త్త దతిసృష్టం మహర్షిణా
వరం త ద్ధను రుద్యమ్య ఖరం సమభిధావత. ౨౧

టీక॥ రామః(అధ్యాహృతము) = రాముండు; యత్=ఏది ; మహర్షిణా=అగస్త్యమహర్షిచేత; అతిసృష్టం=ఇవ్వఁబడినదో; తత్=అట్టి; సుమహత్ = మిక్కిలియుగొప్పదియు; వైష్ణవం=విష్ణుసంబంధియు; వరం = శ్రేష్ఠమునగు; తత్=ఆ; ధనుః= విండ్లిసి; ఉద్యమ్య=ఎత్తుకొని; ఖరం= ఖరునిగూర్చి; సమభిధావత (సమభ్యధావత్)=పరుగెత్తెను.

అగస్త్యమహాముని చేనియ్యఁబడిన వైష్ణవంబగునమ్మహాధనువుదీసికొని , రాముండు,యుద్ధంబున,ఖరునిపైకడరెను. అని, తాత్పర్యము.

తతః కనకపుంఖైస్తు శరై స్సన్నతపర్వభిః
బిభేద రామ స్సంక్రుద్ధః ఖరస్య సమరే ధ్వజమ్. ౨౨

టీక॥తతః=అంత; రామః=రాముఁడు; సంక్రుద్ధః=మిక్కిలియుఁగోపించినవాఁడై; సమరే=యుద్ధమునందు; కనకపుంఖైః=బంగారుపింజలు గలవియు; సన్నతపర్వభిః= వంకరలేనిగణుపులుగలవియునగు; శరైః=బాణములచేత; ఖరస్య=ఖరునియొక్క, ధ్వజంతు = పెక్కెమును; బిభేద=భేదించెను.

అంత, రాముండు, కుపితుండై, బంగారుపింజలుగలవియు ఋజుపర్వంబులునగుబాణంబులచే, ఖరునిధ్వజంబును ఖండించెను. అని, తాత్పర్యము.

స దర్శనీయో బహుధా వికీర్ణః కాంచనధ్వజః
జగామ ధరణీం సూర్యో దేవతానా మివాజ్ఞయా. ౨౩

టీక॥దర్శనీయః=సుందరమయిన; సః=ఆ; కాంచనధ్వజః=బంగారువికారమయినపెక్కెము; బహుధా = పెక్కువిధములయి; వికీర్ణః= వెదచల్లఁబడినదై; దేవతానాం= దేవతలయొక్క; ఆజ్ఞయా=ఆజ్ఞచేత; సూర్యఇవ=సూర్యుఁడువలె, ధరణీం= భూమిని; జగామ=పొందెను.

దేవతలయాజ్ఞచేసూర్యుండు భూమికివచ్చెనోయన, సుందరంబగు నా కాంచనధ్వజంబు పెక్కువ్రయ్యలయి నేలంబడినది. అని, తాత్పర్యము.

తం చతుర్భిః ఖరః క్రుద్ధో రామం గాత్రేషు మార్గణైః
వివ్యాధ యుధి మర్మజ్ఞో మాతంగ మివ తోమరైః. ౨౪

టీక॥మర్మజ్ఞః=జీవస్థానంబుల నెఱింగినట్టి; ఖరః=ఖరుఁడు; యుధి= యుద్ధమునందు; క్రుద్ధః= కోపించినవాఁడై; రామం=రాముని; గాత్రేషు= అవయవములందు; చతుర్భిః=నాలుగైన; మార్గణైః=బాణములచేత; తోమరైః=చిల్లకోలలచేత; మాతంగమివ=ఏనుఁగునువలె; వివ్యాధ=కొట్టెను.

జీవస్థానంబులుచక్కఁగాఁ దెలిసినట్టిఖరుండు, యుద్ధంబునఁగుపితుండై, చి

ల్లకోలలనేనుంగునబాడుచునట్లు, రా మునిజీవస్థానంబుల నాలుగుబాణంబుల చేనొప్పించెను. అని, తాత్పర్యము.

స రామో బహుభి ర్బాణైః ఖరకార్ముకనిస్సృతైః
విద్ధో రుధిరసిక్తాంగో బభూవ రుషితో భృశమ్. ౨౫

టీక॥ సః=ఆ; రామః = రాముఁడు; ఖరకార్ముకనిస్సృతైః = ఖరుని వింటనుండి వెడలిన; బహుభిః= పెక్కులయిన; బాణైః = బాణములచేత; విద్ధః=కొట్టఁబడినవాఁడై; రుధిరసిక్తాంగః = నెత్తురుచేఁదడుపఁబడిన దేహముగలవాఁడై; భృశం= మిక్కిలియు; రుషితః= కోపముతోఁగూడినవాఁడు; బభూవ=అయ్యెను.

ఆరాముండు, అట్లు ఖరుఁడుప్రయోగించిన పెక్కుబాణంబులచే విద్ధుండై నెత్తుటందోఁగుచు, మిక్కిలియు రోషంబునొందెను. అని, తాత్పర్యము.

స ధను ర్ధన్వినాం శ్రేష్ఠః ప్రగృహ్య పర మాహవే
ముమోచ పరమేష్వాస ష్షట్చరా నభిలక్షితాన్. ౨౬

టీక॥ ధన్వినాం= విలుకాండ్రలో; శ్రేష్ఠః=ఉత్తముఁడును; పరమేష్వాసః = ఉత్తమమయినధనుస్సుగలవాఁడునగు; సః=ఆరాముఁడు; ఆహవే= యుద్ధమునందు; పరం= ఇతరమయిన; ధనుః=వింటిని; ప్రగృహ్య = తీసికొని; అభిలక్షితాన్ = ఉత్తమములయిన; శరాన్=బాణములను; షట్ = ఆఱింటిని; ముమోచ=విడిచెను.

ధనుర్ధరులలోనుత్తముఁడును మహాధనుర్ధరుండునగు నారాముఁడు, అట్లు యుద్ధంబున మఱియొకవిల్లుఁజేకొని, యుత్తమబాణంబులనాఱింటినివిడిచెను. అని, తాత్పర్యము.

శిరస్యేకేన బాణేన ద్వాభ్యాం బాహ్వో రథార్దయత్
త్రిభి శ్చంద్రార్ధ వక్త్రైశ్చ వక్ష స్యభిజఘాన హ. ౨౭

టీక। అథ=అంతః; సః (అధ్యాహృతము)=ఆ రాముఁడు; శిరసి=తలయందు, ఏకేవ=ఒకటైనయిన; బాణేన=బాణముచేతను; బాహ్వోః= భుజములయందు; ద్వాభ్యాం= రెండుబాణములచేతను; అర్దయత్=నొప్పించెను. త్రిభిః= మూఁడయిన; చంద్రార్ధవక్త్రైశ్చ= అర్ధచంద్రబాణములచేతను, వక్షసి= ఱొమ్మునందు; అభిజఘాన = కొట్టెను ("హ" అనునది పాదపూరణార్థము.)

అంత, రాముఁడు, శిరంబున నొక బాణముచేతను బాహువులందు రెండమ్ములచేతను, వక్షస్థలంబున మూఁడర్ధచంద్రబాణంబులచేతను, ఖరుని నొప్పించెను అని, తాత్పర్యము.

తతః పశ్చా న్మహాతేజా నారాచాన్ భాస్కరోపమాన్
జిఘాంసూ రాక్షసం క్రుద్ధ స్త్రయోదశ సమాదదే ౨౮

టీక॥ తతః = అంతకన్న; పశ్చాత్=వెనుక; మహాతేజాః = అధికమయినపరాక్రమముగల రాముఁడు ; క్రుద్ధః=కోపించినవాఁడై; రాక్షసం = రాక్షసుఁడగు ఖరుని; జిఘాంసుః = వధింపఁగోరినవాఁడై; భాస్కరోపమాన్= సూర్యునితోఁ బోలికగల ; నారాచాన్=బాణములను; త్రయోదశ = పదుమూఁడింటిని; సమాదదే = గ్రహించెను.

అటుపిమ్మట, మహాతేజుండగు రాముండు, క్రుద్ధుండయి ఖరుని వధించుటకై, సూర్యసమానతేజంబులగు పదుమూఁడు బాణంబులఁదీసెను.

అని, తాత్పర్యము.

తతోఽస్య యుగ మేకేన చతుర్భి శ్చతురో హయాన్
షష్ఠేనతు శిర స్సంఖ్యే ఖరస్య రథసారథేః. ౨౯
త్రిభి స్త్రివేణుం బలవాన్ ద్వాభ్యా మక్షం మహాబలః
ద్వాదశేనతు బాణేన ఖరస్య సశరం ధనుః. ౩౦
ఛిత్వా వజ్రనికాశేన రాఘవః ప్రహసన్నివ
త్రయోదశే నేంద్రసమో బిభేద సమరే ఖరమ్. ౩౧

టీక॥తతః=అంత,ఇంద్రసమః=ఇంద్రునితోసమానుఁడును;బలవాన్= అధికమయినబలముగలవాఁడును; మహాబలః= అధికమయిన పరాక్రమముగలవాఁడునగు;రాఘవః=రాముఁడు; ప్రహసన్నివ(స్థితః)= నవ్వుచున్నట్లున్నవాఁడై;సంఖ్యే=యుద్ధమునందు; ఏకేన=ఒకబాణముచేత,అస్య= ఈఖరుని యొక్క;యుగం=కాఁడిని; చతుర్భిః= నాలుగింటిచేత;హయాన్= గుఱ్ఱములను;షష్ఠేనతు= ఆఱవబాణముచేతనే; ఖరస్య=ఖరునియొక్క; రథసారథేః= రథముయొక్క-సారథియొక్క;శిరః=తలను;త్రిభిః= మూఁడిటిచేత ; త్రివేణుం=నొగను;ద్వాభ్యాం=రెంటిచేత; అక్షం=బండికంటిని;వజ్రనికాశేన= వజ్రాయుధముతోసమానమయిన; ద్వాదశేన= పండ్రెండవదగు; బాణేనతు= బాణముచేతనే;ఖరస్య = ఖరునియొక్క;సశరం = బాణముతోఁగూడిన; ధనుః=ధనుస్సును,ఛిత్త్వా = నఱకి;సమరే= యుద్ధమునందు ; త్రయోదశేన= పదుమూఁడవబాణముచేత ; ఖరం=ఖరుని;బిభేద=భేదించెను.

అంత , దేవేంద్రసమానుఁడును మహాబల పరాక్రమశాలియునగు రాముఁడు, అనాయాసంబుగా , నాపదుమూఁడుబాణంబులలో , నొకబాణంబునరథముకాఁడిని ఖండించి , నాలుగింటచేగుఱ్ఱంబులంగూలనేసి, యాఱవబాణంబున నతనిసారథిశిరంబుఁదెగవ్రేసి , మూఁడింటయుగంధరముభేదించి , రెంటనక్షంబు దునియనేసి, యంత,వజ్రాయుధముంబోని పండ్రెండవబాణంబునఖరునిచేతనుండు బాణసహితంబగుధనుస్సునుఖండించి , పదుమూఁడవబాణంబున, ఖరునినొప్పించెను. అని, తాత్పర్యము.

ప్రభగ్నధన్వా విరథో హతాశ్వో హతసారథిః
గదాపాణి రవప్లుత్య తస్థౌ భూమౌ ఖర స్తదా. ౩౨

టీక॥ తదా = అప్పుడు;ఖరః=ఖరుఁడు;ప్రభగ్నధన్వా = విఱువఁబడినధనుస్సుగలవాఁడై;విరథః = రథములేనివాఁడై; హతాశ్వః = చంపఁబడిన గుఱ్ఱములుగలవాఁడై;హతసారథిః= చంపఁబడినసారథిగలవాఁడై ; గదాపాణిః= గదచేతంగలవాఁడై ; అవప్లుత్య=దిగి;భూమౌ = నేలయందు;

తస్థౌ=నిలిచెను.

అప్పుడుఖరుండు, అట్లు భగ్నశరాసనుండునువిరథుండునుహతాశ్వుండునుహతసారధియునై, గదచేతంగొని,రథంబుననుండిలంఘించి, నేలపైనిలిచెను. అని, తాత్పర్యము.

తత్కర్మ రామస్య మహారథస్య
సమేత్య దేవాశ్చ మహర్షయశ్చ
అపూజయన్ ప్రాంజలయః ప్రహృష్టా
స్తదా విమానాగ్రగతా స్సమేతాః. ౩౩

టీక॥ తదా=అప్పుడు; సమేతాః=వచ్చినవారలును; విమానాగ్రగతాః=విమానంబులయగ్రభాగమునుబొందినవారలునగు; దేవాశ్చ=దేవతలును; మహర్షయశ్చ=మహర్షులును; ప్రహృష్టాః = సంతసించినవారలయి, ప్రాంజలయః = మంచిచేమోడ్పుగలవారలయి; సమేత్య=చేరి; మహారథస్య= తన్నునుసారథిని గుఱ్ఱములనుగాపాడుకొనుచుఁబదునొకండువేల మంది విలుకాండ్రతోఁబోరునట్టి; రామస్య=రామునియొక్క; తత్=ఆ; కర్మ=కార్యమును; అపూజయన్ = పూజించిరి.

అప్పుడచ్చటికివచ్చి యాకాశంబున విమానగతులయి యుద్ధంబంతయుఁ జూచుచున్న దేవతలును మహర్షులును, మహారథుండగు రాముండు, ఖరుని విరథుంగావించుటనుజూచి, పరమసంతుష్టులయి, చేతులు మొగుడ్చుకొని, యందఱు నొకటిగాఁ జేరి, రామునిఁబూజించిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
అరణ్యకాండే,అష్టావింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండాష్టావింశసర్గటీక,
ముగిసినది.

౨౯

ఏకోనత్రింశసర్గప్రారంభః.

ఖరంతు విరథం రామో గదాపాణి మవస్థితమ్
మృదుపూర్వం మహాతేజాః పరుషం వాక్య మబ్రవీత్. ౧

టీక॥మహాతేజాః= అధికమయినపరాక్రమముగల; రామః=రాముఁడు; విరథం=రథములేనివాఁడును; గదాపాణిం=గదచేతంగలవాఁడును ; అవస్థితం=నిలిచినవాఁడునగు; ఖరంతు = ఖరునిగూర్చియె; మృదుపూర్వం=మెత్తనిమాటముందుగలుగునట్లుగా ; పరుషం=కఠినమయిన; వాక్యం= మాటను; అబ్రవీత్ =చెప్పెను.

మహాతేజుండగు రాముండు, అట్లువిరథుండై గదాపాణియయినిలిచియున్న ఖరుంజూచి, మెత్తనిమాటలచేఁ బరుషమయినయర్థముగల్గునట్లు , ఈప్రకారంబునంజెప్పెను. అని, తాత్పర్యము.

గజాశ్వరథసంబాధే బలే మహతి తిష్ఠతా
కృతం సుదారుణం కర్మ సర్వలోకజుగుప్సితమ్. ౨

టీక॥గజాశ్వరథసంబాధే= ఏనుంగులచేతనుగుఱ్ఱములచేతను రథములచేతనునిండిన; మహతి=గొప్పదియగు; బలే=సైన్యమునందు; తిష్ఠతా=ఉన్నట్టి; త్వయా(అధ్యాహృతము)=నీచేత; సుదారుణం=మిక్కిలియు భయంకరమనగు; సర్వలోకజుగుప్సితం= సమస్తజనములచేతనునిందింపఁబడినదియునగు; కర్మ=కార్యము; కృతం = చేయఁబడినది.

నీవు, ఏనుంగులచేతను గుఱ్ఱంబులచేతనురథములచేతను నిండిన మహాసైన్యముతోఁగూడి , సమస్తలోకంబులకును బాధకరంబునుమహాభయంకరంబునగు కార్యంబుఁగావించితివి.

అని, తాత్పర్యము.

ఉద్వేజనీయో భూతానాం నృశంసః పాపకర్మకృత్

త్రయాణామపి లోకానా మీశ్వరోపి నతిష్ఠతి. ౩

టీక॥ భూతానాం = ప్రాణుల కు; ఉద్వేజనీయః = దుఃఖకరుండును; నృశంసః= ఘాతకుండును; పాపకర్మకృత్ = పాపకార్యములు చేయువాఁడునైనయతఁడు; త్రయాణాం = మూఁడైన; లోకానామపి = లోకములకును; ఈశ్వరోపి = నాథుఁడైనను; న తిష్ఠతి = నిలువఁడు.

ప్రాణులకు దుఃఖంబు సేయుచు ఘాతుకుండై పాపంబులు సేయుచుండువాఁడని, యతండు ముల్లోకంబులకును నాథుండైనను, క్షేమంబునొందఁజాలఁడు. అని, తాత్పర్యము.

కర్మ లోకవిరుద్ధంతు కుర్వాణం క్షణదాచర
తీక్ష్ణం సర్వజనో హంతి సర్పం దుష్ట మివాగతమ్. ౪

టీక॥ క్షణదాచర = రాక్షసుఁడవగు ఖరుఁడా! లోకవిరుద్ధం = లోకంబులకు విరుద్ధమయిన; కర్మతు = కార్యమునే; కుర్వాణం = చేయువాఁడును; తీక్ష్ణం = ఉగ్రుండునగువాని; ఆగతం = వచ్చిన; దుష్టం = దుష్టమగు; సర్పమివ = పామునువలె; సర్వజనః = సమస్తజనమును; హంతి = వధించును.

ఖరుఁడా! దుష్టసర్పమువచ్చినయెడ, నందఱును దానివధించునట్లు, లోకవిరుద్ధంబగు కర్మము సేయువాఁడును భయంకరుండునగువాని, సమస్తజనులును, వధింపఁబూనుదురు. అని, తాత్పర్యము.

లోభా త్పాపాని కుర్వాణః కామాద్వా యో నబుధ్యతే
భ్రష్టః పశ్యతి తస్యాంతం బ్రాహ్మణీ కరకాదివ. ౫

టీక॥ యః = ఎవ్వఁడు; లోభాత్ = ఆసవలనఁగాని; కామాద్వా = కామమువలనఁగాని; పాపాని = పాపములను; కుర్వాణః = చేయుచు; నబుధ్యతే = తెలుసుకొనకుండునో; సః (అధ్యాహృతము) = అతఁడు; భ్రష్టః = పతితుఁడై; క

రకాత్ = వడగల్లుతాయినిదిన్న; బ్రాహ్మణీవ=నలికండ్లపామువలె; తస్య=దానియొక్క; అంతం=ఫలమును; పశ్యతి= చూచును.

లోభంబుననంగాని కామంబుననంగాని యొడలు దెలియక పాపంబులు గాంచునట్టివాండు, భ్రష్టుండై, వడగల్లుతాయినిన్న నలికండ్లపామువలె, దానిఫలమును, శీఘ్రంబునం బొందును (వడగల్లుతాయిన నలికండ్లపామునకు విషమనుట ప్రసిద్ధము.) అని, తాత్పర్యము.

వసతో దండకారణ్యే తాపసాన్ ధర్మచారిణః
కిం ను హత్వా మహాభాగాన్ ఫలం ప్రాప్స్యసి రాక్షస. ౬

టీక॥ రాక్షస = ఖరుండా! దండకారణ్యే=దండకారణ్యమునందు, వసతః=వాసముసేయువారలును, ధర్మచారిణః= ధర్మము నాచరించువారలును; మహాభాగాన్= పూజ్యమయినయదృష్టముగలవారలునగు; తాపసాన్= ఋషులను; హత్వా=వధించి, కిన్ను= ఏమి; ఫలం=ఫలమును; ప్రాప్స్యసి= పొందంగలవు?

ఖరుండా! ధర్మచారులును మహాభాగులునగు దండకారణ్యంబున వసించు ఋషులను వధించితివే; నీవు దానివలన నేమిఫలంబు గలిగినది? అని, తాత్పర్యము.

న చిరం పాపకర్మాణః క్రూరా లోకజుగుప్సితాః
ఐశ్వర్యం ప్రాప్య తిష్ఠంతి శీర్ణమూలా ఇవ ద్రుమాః. ౭

టీక॥ పాపకర్మాణః= పాపములైకార్యములు గలవారలును; క్రూరాః=క్రూరులును; లోకజుగుప్సితాః= లోకములచే నిందింపంబడినవారలును; శీర్ణమూలాః=నశించిన వేఱుగల; ద్రుమాః ఇవ=వృక్షములువలె; చిరం= బహుకాలము; ఐశ్వర్యం= ప్రభుత్వమును; ప్రాప్య=పొంది; న తిష్ఠంతి = నిలువరు.

పాపకర్ములును గ్రూరులును లోకనిందితులునగువారలు, బహుకాలమైశ్వర్యంబునొంది యుండంజాలరు; వే

ఱుదెగినవృక్షములువలె, శీఘ్రమున నాశంబునొందుదురు. అని, తాత్పర్యము.

అవశ్యం లభతే జంతుః ఫలం పాపస్య కర్మణః
ఘోరం పర్యాగతే కాలే ద్రుమాః పుష్ప మివార్తవమ్. ౮

టీక॥ కాలే = కాలము; పర్యాగతే = రాఁగానే = జంతుః = ప్రాణి; పాపస్య = పాపముగలిగించునట్టి; కర్మణః = కార్యముయొక్క; ఘోరం = భయంకరమయిన; ఫలం = ఫలమును; ద్రుమాః = వృక్షములు; ఆర్తవం = ఋతువునందుఁగలుగునట్టి; పుష్పమివ = పుష్పమునువలె; అవశ్యం = అవశ్యము; లభతే = పొందును.

ఋతుకాలమువచ్చినప్పుడు, వృక్షములు, ఆయాఋతువులననుసరించి పుష్పంబులంబొందునట్లు, పురుషుఁడు, అనుభవకాలమువచ్చినప్పుడు, తాను గావించిన పాపకర్మములఫలమునవశ్యముననుభవించును. అని, తాత్పర్యము.

నచిరాత్ప్రాప్యతే లోకే పాపానాం కర్మణాం ఫలమ్
సవిషాణా మివాన్నానాం భుక్తానాం క్షణదాచర. ౯

టీక॥ క్షణదాచర = రాక్షసుఁడవగు ఖరుఁడా! పాపానాం = పాపములుగలిగించునట్టి; కర్మణాం = కర్మములయొక్క; ఫలం = ఫలము; భుక్తానాం = భుజింపఁబడిన; సవిషాణాం = విషముతోఁగూడిన; అన్నానాం = అన్నములయొక్క; ఫలం (అధ్యాహృతము) ఇవ = ఫలమువలె; నచిరాత్ = శీఘ్రముగ; ప్రాప్యతే = పొందఁబడుచున్నది.

ఖరుఁడా! విషమిశ్రితమయిన యన్నముభుజించినచో, దానిఫలము శీఘ్రంబుననె యనుభవమునకు వచ్చునట్లు, అత్యుత్కటంబులగు పాపంబులు గావించినవారలకు, దానిఫలము అతిశీఘ్రంబుననె, యనుభవమునకు వచ్చును. అని, తాత్పర్యము.

పాప మాచరతాం ఘోరం లోకస్యాప్రియ మిచ్ఛతామ్
అహ మాసాదితో రాజ్ఞా ప్రాణాన్ హంతుం నిశాచర. ౧౦




టీక॥నిశాచర=రాక్షసుఁడా! ఘోరం=భయంకరమయిన;పాపం=పాపమును;ఆచరతాం= చేయుచున్నవారలయొక్క-యు;లోకస్య=లోకమునకు;అప్రియం=అనిష్టమును;ఇచ్ఛతాం=కోరుచున్న వారలయొక్క-యు ; ప్రాణాన్=ప్రాణములను; హంతుం= వధించుటకు;రాజ్ఞా=రాజుచేత;అహం=నేను;ఆపాదితః=వచ్చినాను.

రాక్షసుఁడా! భయంకరంబు లగు పాపములుగావించువారలును లోకము నకుఁగీడుగావించు వారలునగు దుష్టాత్ములనువధించుటకై,రాజయిన దశరథునియాజ్ఞచే,నేనువచ్చియున్నాను.

అని, తాత్పర్యము.

అద్యహి త్వా మయాముక్తా శ్శరాః కాంచన భూషణాః
విదార్యాతి పతిష్యంతి వల్మీకమివ పన్నగాః. ౧౧

టీక॥అద్య=ఇప్పుడు; మయా=నాచేత; ముక్తాః= విడువఁబడిన; కాంచ భూషణాః = బంగారమలంకారము గాఁగల;శరాః=బాణములు; త్వా = నిన్ను;పన్నగాః=సర్పములు; వల్మీకమివ = పొదనువలె; విదార్య=భేదించి;అతిపతిష్యంతి= వెడలఁగలవుగదా!

సర్పములు, వల్మీకమును జొచ్చియావలికివెడలునట్లు, ఇప్పుడు నేనుప్రయోగించు కాంచనభూషణంబు లగు బాణంబులు, నీశరీరమునుభేదించియావలికిఁబోఁగలవు. అని,తాత్పర్యము.

యే త్వయా దండకారణ్యే భక్షితా ధర్మచారిణః
తానద్య నిహత స్సంఖ్యే ససైన్యో నుగమిష్యసి. ౧౨

టీక॥ యే = ఏ;ధర్మచారిణః=ధర్మమునాచరించునట్టిమునులు; త్వయా=నీచేత;దండకారణ్యే = దండకారణ్యమునందు; భక్షితాః = తినఁబడినారో;తాన్=వారలను ; అద్య=ఇప్పుడు;త్వం (అధ్యాహృతము)= నీవు;సంఖ్యే=యుద్ధమునందు; నిహతః=వధింపఁబడినవాఁడవై;ససైన్యః= సైన్యముతోఁగూడినవాఁడవై ; అనుగమిష్యసి=పొందఁగలవు.




నీవివిపలుకు దండకారణ్యంబునధర్మచారులగు మునుల నెవ్వరెవ్వరిభక్షించియున్నావో, ఇప్పుడునీవుయుద్ధంబుననాచేనిహతుండవై, సైన్యసహితంబుగా వారలయొద్దకుఁబోఁగలవు. అని, తాత్పర్యము.

అద్య త్వాం పతితం బాణైః పశ్యంతు పరమర్షయః
నిరయస్థం విమానస్థా యే త్వయా హింసితాః పురా. ౧౩

టీక॥యే=ఎవ్వరు; పురా = మున్ను; త్వయా= నీచేత, హింసితాః = హింసింపఁబడినారో; తే=అట్టి; విమానస్థాః=విమానంబునందున్న; పరమర్షయః=మహాఋషులు; అద్య= ఇప్పుడు; బాణైః=బాణములచేత; పతితం=పడినవాఁడవును; నిరయస్థం=దురవస్థయందున్నవాఁడవునగు; త్వాం=నిన్ను; పశ్యంతు=చూతురుగాక.

మున్నునీచేహింసితులగు మహాఋషులిప్పుడువిమానగతులయి యాకాశంబుననుండి, నాబాణంబులనిహతుండవై నేలంగూలి దురవస్థనొందియున్న నిన్నుఁజూతురుగాక.

అని, తాత్పర్యము.

ప్రహర త్వం యథాకామం కురు యత్నం కులాధమ
అద్య తే పాతయిష్యామి శిర స్తాలఫలం యథా. ౧౪

టీక॥కులాధమ = కుల బుఁజెఱచువాఁడవగు ఖరుఁడా! యథాకామం= యథేచ్ఛముగా; ప్రహర= కొట్టుము. యత్నం=ప్రయత్నమును; కురు = చేయుము అద్య=ఇప్పుడు; తే = నీయొక్క; శిరః=తలను; తాలఫలంయథా= తాటిపండునుబోలె; పాతయిష్యామి=పడవేసెదను.

కులాధముఁడవగుఖరుఁడా! ఇప్పుడు నీవు యథేచ్ఛముగానన్నుఁ బ్రహరింపుము, నీచేనైనంతమట్టుకుఁజూడుము; ఇప్పుడె, తాటిపండునుబోలె నీశిరస్సును, నేలంబడవేసెదను. అని, రాముండు ఖరునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు రామేణ క్రుద్ధ స్సంరక్తలోచనః
ప్రత్యువాచ ఖరో రామం ప్రహసన్ క్రోధమూర్ఛితః. ౧౫

టీక॥ ఖరః=ఖరుఁడు; రామేణ = రామునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తస్తు= చెప్పఁబడినవాఁడైనంతనె ; క్రుద్ధః= కోపించినవాఁడై; సంరక్తలోచనః = ఎఱ్ఱనైనకన్నులు గలవాఁడై ; ప్రహసన్=నవ్వుచు; క్రోధమూర్ఛితః= కోపముచేనొడలుదెలియనివాఁడై ; రామం=రామునిగూర్చి; ప్రత్యువాచ = బదులుచెప్పెను.

ఖరుండు, రామునిమాటలనువిని , క్రుద్ధుండై,కన్నులనెఱ్ఱఁదనంబుగదురఁ, బకపకనవ్వుచుఁ , గోపావేశంబుననొడలు దెలియక, ఆ రామునిఁజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ప్రాకృతాన్ రాక్షసాన్ హత్వా యుద్ధే దశరథాత్మజ
ఆత్మనా కథ మాత్మాన మప్రశస్యం ప్రశంససి. ౧౬

టీక॥ దశరథాత్మజ = దశరథుని కొమరుఁడవైనరామఁడా! యుద్ధే= యుద్ధమునందు;ప్రాకృతాన్= స్వల్పులయిన;రాక్షసాన్=రాక్షసులను; హత్వా=చంపి;అప్రశస్యం= పొగడఁదగనట్టి;ఆత్మానం=నిన్ను; ఆత్మనా = నీచేతనె;కథం = ఎట్లు ; ప్రశంససి= పొగడుకొనుచున్నావు?

దశరథపుత్రుండవగు రామఁడా! నీవుయుద్ధంబున నల్పులగు రాక్షసులం గొందఱఁజంపి , యింతలోమహాశూరుండవైనట్లు నిన్నునీవే పొగడుకొనుచున్నావేమి? అని,తాత్పర్యము.

విక్రాంతా బలవంతోవా యేభవంతి నరర్షభాః
కథయంతి నతే కించి త్తేజసా స్వేన గర్వితాః. ౧౭

టీక॥యే=ఏ;నరర్షభాః= పురుషశ్రేష్ఠులు;విక్రాంతాః= పరాక్రమించినవారలును;బలవంతోవా = అధికమయినబలముగలవారలును;భవంతి= అ

గుచున్నారో; తే=వారలు; స్వేన= తమదైన; తేజసా=ప్రతాపముచేత, గర్వితాః=గర్వించినవారలయి; కించిత్=కొంచెమైనను; నకథయంతి=చెప్పరు.

ఎవ్వరుపరాక్రమశాలులును బలవంతులునైయుందురో, అట్టిపురుషశ్రేష్ఠులు, తమప్రతాపంబునకుగర్వించి, తమ్ముఁదామెయెంతమాత్రముఁబొగడుకొనరు. అని, తాత్పర్యము.

ప్రాకృతా స్త్వ కృతాత్మానో లోకే క్షత్రియపాంసనాః
నిరర్థకం వికత్థంతే యథా రామ వికత్థసే. ౧౮

టీక॥ రామ=రాముఁడా! యథా=ఎట్లు; త్వం(అధ్యాహృతము)=నీవు; వికత్థసే = పొగడుకొనుచున్నావో; తథా(అధ్యాహృతము)=అట్లు; లోకే=లోకమునందు; ప్రాకృతాత్మానః=అల్పులును; అకృతాత్మానః=ధైర్యములేనివారలునగు; క్షత్రియపాంసనాః=క్షత్రియాధములు; నిరర్థకం=నిష్ప్రయోజనముగా; వికత్థంతే=పొగడుకొందురు.

రాముఁడా! ఇప్పుడునీవుపొగడుకొనునట్లు, అల్పులును బిఱికివాండ్రునగు క్షత్రియాధములు, నిష్ప్రయోజనముగా, తమ్ముఁదామెపొగడుకొందురు. అని, తాత్పర్యము.

కులం వ్యపదిశన్ వీర స్సమరే కోఽభిధాస్యతి
మృత్యుకాలేహి సంప్రాప్తే స్వయ మప్రస్తవే స్తవమ్. ౧౯

టీక॥ వీరః= పరాక్రమశాలియగువాఁడు; కః=ఎవ్వఁడు; సమరే=యుద్ధమునందు; మృత్యుకాలే=మరణకాలము; సంప్రాప్తేహి= వచ్చియుండఁగానే; అప్రస్తవే= అసమయమునందు; స్వయం=తానె; కులం= తనవంశమును; వ్యపదిశన్=పొగడుచు; స్తవం=ఆత్మస్తుతిని; అభిధాస్యతి= చెప్పును?

యుద్ధంబున మరణకాలంబు వచ్చియుండు నప్పుడు, అసమయమునందు, వీరుండెవ్వఁడు, తనకులంబుఁ, బొగడుకొని, యాత్మస్తుతిఁజేసికొనును? అని, తాత్పర్యము.

సర్వథైవ లఘుత్వం తే కత్థనేన విదర్శితమ్
సువర్ణప్రతిరూపేణ తప్తేనేవ కుశాగ్నినా. ౨౦

టీక॥ సర్వథైవ = అన్నివిధంబులనే; కత్థనేన = పొగడుకొనుటచేత, తే=నీయొక్క; లఘుత్వం = చులుకఁదనము; సువర్ణప్రతిరూపేణ = బంగారముతో సమానమయిన; తప్తేన= తపింపఁజేయఁబడిన ; కుశాగ్నినేవ= దర్భలనిప్పుచేతవలె ; విదర్శితం= చూపఁబడినది.

నీవాత్మస్తుతిచేసికొనుటచేతనీయందలి యల్పత్వము స్పష్టముగాఁదెలియ వచ్చినది; మంచిబంగారు రంగుతోనుండుచుండు కుశాగ్ని ఇతరపదార్థములదహింపఁ జాలక యాఱిపోవునట్లు , ఆత్మస్తుతిచేసికొనవిఱ్ఱవీఁగువాఁడు , ఇతరులనెంతమాత్రమువధింపఁజాలక, తానెవధింపఁబడును.

అని, తాత్పర్యము.

నను మా మిహ తిష్ఠంతం పశ్యసి త్వం గదాధరమ్
ధరాధర మివాకంప్యం పర్వతం ధాతుభి శ్చితమ్. ౨౧

టీక॥అకంప్యం = కదిలింపరానిదియు; ధరాధరం=భూమిని ధరించునట్టిదియు; ధాతుభిః= గైరికధాతువులచేత; చితం=వ్యాపింపఁబడినదియునగు; పర్వతమివ(స్థితం)=కొండవలెనున్నవాఁడను; గదాధరం=గదదాల్చినవాఁడను; ఇహ=ఇచ్చట; తిష్ఠంతం= నిలుచుచున్నవాఁడనగు; మాం= నన్ను ; పశ్యసిను=చూచుచున్నావుగదా!

ధాతువులతోఁగూడినపర్వతంబు కరణి నిశ్చలుఁడనైగదాధరుండనై నీయెదుట నిలిచియున్ననన్నుం జూచుచున్నావుగదా! అని, తాత్పర్యము.

పర్యాప్తోహం గదాపాణి ర్హంతుం ప్రాణాన్ రణే తవ
త్రయాణా మపి లోకానాం పాశహస్త ఇవాంతకః. ౨౨

టీక॥త్రయాణాం=మూఁడైన; లోకానామపి=లోకములకును ; పాశహ

స్తః=పాశము చేతంగల; అంతక ఇవ=యముఁడువలె; గదాపాణిః=గద చేతం గల; అహం=నేను; రణే=యుద్ధంబునందు; తవ=నీయొక్క; ప్రాణాన్= ప్రాణములను; హంతుం=వధించుటకు ; పర్యాప్తః=చాలుదును.

ముల్లోకంబులకును బాశహస్తుండగు నంతకుండొక్కఁడు చాలినట్లు , నీ ప్రాణంబుల యుద్ధంబున హరింప, నేనొక్కఁడం జాలుదును.

అని, తాత్పర్యము.

కామం బహ్వపి వక్తవ్యం త్వయి వక్ష్యామి నత్వహమ్
అస్తం గచ్ఛేద్ధి సవితా యుద్ధవిఘ్నస్తతో భవేత్. ౨౩

టీక॥ త్వయి=నీయందు; బహ్వపి=అనేకమును; వక్తవ్యం కామం=చెప్పఁబడవలసినదే. అహం=నేను; నవక్ష్యామితు=చెప్పను. సవితా = సూర్యుఁడు; అస్తం=అస్తమయమును ; గచ్ఛేద్ధి=పొందునుగదా! తతః=అంత; యుద్ధవిఘ్నః=యుద్ధమునకడ్డి ; భవేత్ = అగును.

మఱియు నిట్లాత్మస్తుతి చేసికొనునట్టి నీవిషయమయి యింకను జాలఁ జెప్పవలసియున్నది ; అయినను , నిప్పుడు చెప్పను; అట్లు చెప్పినచో, నాలస్యమయి సూర్యుండస్తమించి, యుద్ధంబునకు విఘ్నంబు వచ్చును. అని, తాత్పర్యము.

చతుర్దశ సహస్రాణి రాక్షసానాం హతాని తే
త్వద్వినాశాత్కరోమ్యేష తేషా మశ్రుప్రమార్జనమ్. ౨౪

టీక॥ తే(త్వయా)= నీచేత; రాక్షసానాం = రాక్షసులయొక్క; సహస్రాణి=వేలు; చతుర్దశ = పదునాలుగు; హతాని=చంపఁబడినవి. ఏషః(అహం)= ఈనేను; త్వద్వినాశాత్ =నిన్నువధించుటవలన ; తేషాం= ఆరాక్షసులకు; అశ్రుప్రమార్జనం= కన్నీళ్లు తుడుచుటను; కరోమి= చేయుచున్నాను.

నీవు, పదునాలుగువేల రాక్షసుల వధించినావు, నేను, ఇప్పుడు , నిన్ను వధించి, వారలయందఱి కన్నీళ్లు తుడిచెదను. అని, ఖరుండు రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా పరమక్రుద్ధ స్తాం గదాం పరమాంగదః
ఖర శ్చిక్షేప రామాయ ప్రదీప్తా మశనిం యథా. ౨౫

టీక॥ పరమాంగదః = ఉత్కృష్ట ములయిన బాహుపురులు గల ; ఖరః = ఖరుఁడు; ఇతి=అని; ఉక్త్వా= చెప్పి; పరమక్రుద్ధః = మిక్కిలియుఁ గోపించినవాఁడై;ప్రదీప్తాం = ప్రకాశించుచున్న;అశనింయథా (స్థితాం)= వజ్రాయుధమువలెనున్న;తాం = ఆ; గదాం=గదను; రామాయ = రామునికొఱకు;చిక్షేప=విడిచెను.

మంచిబాహుపురులుగల ఖరుఁడీప్రకారమునం జెప్పి, పరమకుపితుండై, వజ్రాయుధముంబోలెఁ బ్రకాశించుచున్నయాగదను, రామునిపైవైచెను.

అని, తాత్పర్యము.

ఖరబాహుప్రముక్తా సా ప్రదీప్తా మహతీ గదా
భస్మవృక్షాంశ్చ గుల్మాంశ్చ కృత్వా గా త్తత్సమీపతః. ౨౬

టీక॥ ఖరబాహుప్రయుక్తా= ఖరునిచేతిచేఁబ్రయోగింపఁబడిన;ప్రదీప్తా= ప్రకాశించుచున్న; మహతీ=పెద్దదగు; సా=ఆ; గదా=గద; వృక్షాంశ్చ=వృక్షములను; గుల్మాంశ్చ=బోదెలేనివృక్షములను;భస్మ=బూడిదగా;కృత్వా= చేసి; తత్సమీపతః= ఆరామునిసమీపమునకు; అగాత్=పోయెను.

అట్లు, అమ్మహాగద , ఖరునిచేఁబ్రయోగింపఁబడినదై, మహాతేజంబునవెలుంగుచు, మార్గంబుననున్నవృక్షగుల్మంబులభస్మముగావింపుచు , నారామునిసమీపంబునకుంబోయెను.

అని, తాత్పర్యము.

తా మాపతంతీం జ్వలితాం మృత్యుపాశోపమాం గదామ్
అంతరిక్షగతాం రామ శ్చిచ్ఛేద బహుధా శరైః. ౨౭

టీక॥ రామః = రాముఁడు; ఆపతంతీం=వచ్చుచున్నదియు;జ్వలితాం= ప్రకాశించుచున్నదియు ; మృత్యుపాశోపమాం=మృత్యువుయొక్కపాశము

తోఁ బోల్కిగలదియు; అంతరిక్షగ తాం= ఆకాశము నొందినదియునగు; తాం=ఆ; గదాం = గదను; శరైః= బాణంబులచేత; బహుధా = పెక్కువిధములుగా; చిచ్ఛేద=నఱికెను.

రాముండు, అట్లు, మృత్యుపాశంబువలె నమ్మహాగద జ్వలించుచువచ్చుటంజూచి, దానినాకాశంబుననె, బాణంబులచేఁబెక్కువ్రయ్యలుగా ఖండించెను. అని, తాత్పర్యము.

సా విశీర్ణా శరైర్భగ్నా పపాత ధరణీతలే
గదా మంత్రౌషధబలైర్వ్యాళీవ వినిపాతితా. ౨౮

టీక॥ సా=ఆ; గదా = గద; శరైః=బాణములచేత; భగ్నా=ఖండింపఁబడినదై; విశీర్ణా=తునకలుతునకలయి; మంత్రౌషధబలైః=మంత్రములయొక్కయు నౌషధములయొక్కయు బలములచేత; వినిపాతితా=పడఁద్రోయఁబడిన; వ్యాళీవ=సర్పమువలె; ధరణీతలే = భూతలమునందు; పపాత=పడెను.

అట్లు, ఆగద, బాణములచేఖండింపఁబడి, తునకలుతునకలయి, మంత్రౌషధంబులచేనిర్జితమయిన సర్పమునకైవడి, నేలంబడెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే, ఏకోనత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండైకోనత్రింశసర్గటీక, ముగిసినది.



౩౦

త్రింశసర్గప్రారంభః.

భిత్త్వాతు తాంగదాం బాణై రాఘవో ధర్మవత్సలః
స్మయమానః ఖరం వాక్యం సంరబ్ధ మిద మబ్రవీత్. ౧

టీక॥ ధర్మవత్సలః = ధర్మము నందధికప్రీతిగల; రాఘవః = రాముఁడు; తాం=ఆ; గదాం = గదను; బాణైః=బాణములచే, భిత్త్వాతు = ఖండించినంతనె, స్మయమానః = పరిహసింపుచు; ఖరం = ఖరునిఁగూర్చి; సంరబ్ధం = సంభ్రమముతోఁగూడునట్లుగా; ఇదం= ఈ; వాక్యం = మాటను; అబ్రవీత్=చెప్పెను.

పరమధార్మికుండగు రాముఁడు, బాణంబులచే నాగదను ఖండించి, పరిహాసముగానవ్వుచు, ఖరుఁజూచి, సంరంభంబునని ట్లనె, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఏతత్తే బలసర్వస్వం దర్శితం రాక్షసాధమ
శక్తిహీనతరో మత్తో వృథా త్వ మవగర్జసి. ౨

టీక॥ రాక్షసాధమ=రాక్షసులలోఁ దక్కువవాఁడయిన ఖరుఁడా! ఏతత్ = ఈ; తే=నీయొక్క; బలసర్వస్వం = బలముయొక్కసర్వస్వమును; దర్శితం= చూపఁబడినది. త్వం=నీవు; మత్తః= నాకన్నను; శక్తిహీనతరః = మిక్కిలియు బలముచేవిడువఁబడినవాఁడవు; వృథా=వ్యర్థముగా; అవగర్జసి=అఱచుచున్నావు.

రాక్షసాధముఁడవగు ఖరుఁడా! నీ బలమంతయుఁజూపినావు; ఇంకనేమి సేయఁగలవు? నీవుబలంబున నాకన్నను హీనుండవయ్యు, వ్యర్థముగాఁ బ్రేలెదవు. అని, తాత్పర్యము.

ఏషా బాణవినిర్భిన్నా గదా భూమితలం గతా
అభిధానప్రగల్భస్య తవ ప్రత్యయఘాతినీ. ३

టీక॥ ఏషా=ఈ; గదా=గద, బాణవినిర్భిన్నా = బాణములభేదింపఁబడినదై, అభిధానప్రగల్భస్య = మాటలు చెప్పుటయందుసమర్థుఁడవగు; తవ=నీయొక్క ; ప్రత్యయఘాతినీ= నమ్మకమును బోఁగొట్టినదై ; భూమితలం=భూతలమును, గతా = పొందినది.

ఇంతదూరముప్రేలితివే ; నీవుమాటలు చెప్పుటయందుమాత్రమమహాసమర్థుఁడవు; ఇదిగో నీవంతదూరము జయముఁగల్గించునని నమ్మియుండిన, యీగద యిప్పుడు బాణంబులచేఖండింపఁబడి నేలంబడినది.

అని, తాత్పర్యము.

యత్త్వయోక్తం వినష్టానా మహ మశ్రుప్రమార్జనమ్
రాక్షసానాం కరోమీతి మిథ్యా తదపి తే వచః. ౪

టీక॥ త్వయా=నీచేత; "అహం= నేను; వినష్టానాం=నాశమునొందిన ; రాక్షసానాం=రాక్షసులకు ; అశ్రుప్రమార్జనం=కన్నీళ్లుతుడుచుటను; కరోమి=చేసెదను" ఇతి=అని; యత్= ఏమాట ; ఉక్తం= చెప్పఁబడినదో; తత్=ఆ, తే=నీయొక్క; వచోపి = మాటయును; మిథ్యా=అబద్ధము.

"నేను, నిన్నువధించి, యిప్పుడు యుద్ధంబుననీచేహతులయిన రాక్షసుల కన్నీళ్లుతుడిచెదను" అని, యిప్పుడుచెప్పితివే ; ఆమాటయబద్ధమయినది గదా! అని, తాత్పర్యము.

నీచస్య క్షుద్రశీలస్య మిథ్యావృత్తస్య రక్షసః
ప్రాణా నహం హరిష్యామి గరుత్మా నమృతంయథా. ౫

టీక॥ అహం = నేను; నీచస్య=నీచుండవు; క్షుద్రశీలస్య= దుష్టస్వభావముగలవాఁడవును; మిథ్యావృత్తస్య= అనాచారముగలవాఁడవును; రక్షసః= రాక్షసుుడవునగు నీయొక్క ; ప్రాణాన్=ప్రాణములను ; గరుత్మాన్= గరుత్మంతుఁడు ; అమృతం యథా= అమృతమునువలె; హరిష్యామి= హరిం

చెదను.

గరుత్మంతుండమృతమును హరించినట్లు, నేను నీచుండవును దుష్టస్వభావుండవు ననాచార సంపన్నుండవు రాక్షసుండవునగు నీప్రాణంబులను హరించెదను.

అని, తాత్పర్యము.

అద్య తే భిన్నకంఠస్య ఫేనబుద్బుదభూషితమ్
విదారితస్య మద్బాణైః మహీ పాస్యతి శోణితమ్. ౬

టీక॥ అద్య=ఇప్పుడు; మద్బాణైః= నాబాణములచేత; విదారితస్య=చీల్పఁబడినవాఁడవును; భిన్నకంఠస్య= నఱుకఁబడినకంఠముగలవాఁడవునగు; తే= నీయొక్క; ఫేనబుద్బుదభూషితం = నురుఁగుచేతను బుగ్గచేతను అలంకరింపఁబడిన; శోణితం = నెత్తురును; మహీ= భూమి; పాస్యతి = త్రాఁగఁగలదు.

ఇప్పుడు, నాబాణంబుల విదారితుండవై కంఠము తెగిపడిన నీనురుఁగు బుగ్గలతోఁగూడుకొన్ననెత్తురును, భూమి త్రాఁగఁగలదు.

అని, తాత్పర్యము.

పాంసురూషితసర్వాంగ స్స్రస్తన్యస్తభుజద్వయః
స్వప్స్యసే గాం సమాలింగ్య దుర్లభాం ప్రమదామివ. ౭

టీక॥ త్వం (అధ్యాహృతము) = నీవు; పాంసురూషితసర్వాంగః= దుమ్ముచేఁగప్పఁబడిన సమస్తావయవములునుగలవాఁడవై; స్రస్తన్యస్తభుజద్వయః = జాఱియుండునట్లుంచఁబడిన భుజములజంట గలవాఁడవై; గాం= భూమిని; దుర్లభాం = పొందఁగూడనిది; ప్రమదామివ=స్త్రీనివలె; ఆలింగ్య= కవుఁగిలించుకొని, స్వప్స్యసే= నిదురింపఁగలవు.

నీవు, దుమ్మునంబొరలుచుఁ, జేతులుసాఁచిపరుండినవాఁడవై, దుర్లభయగువనితంబోలెభూమిని గాఢంబుగాఁ గవుఁగిలించుకొని, దీర్ఘనిద్రం బొందఁగలవు. అని, తాత్పర్యము.

ప్రబద్ధనిద్రే శయితే త్వయి రాక్షస పాంసనే

భవిష్యంతి శరణ్యానాం శరణ్యా దండకా ఇమే. ౮

టీక॥ రాక్షసహంసనే = రాక్ష సాధముండవగు;త్వయి = నీవు;ప్రబద్ధనిద్రే = చక్కఁగాఁగట్టఁబడిననిదుర గలవాఁడవైశయితే = పరుండఁగా; ఇమే=ఈ,దండకాః = దండకారణ్యము;శరణ్యానాం = శరణుపొందఁదగినట్టిఋషులకు;శరణ్యాః= నివాసస్థానము;భవిష్యంతి=కాఁగలదు.

రాక్షసాధముండవగునీవట్లు దీర్ఘనిద్రఁబొందిశయనించినపిమ్మట, మహాతపశ్శాలులగుమునులు , ఈదండకారణ్యంబుననుఖము గానివసింతురు.

అని, తాత్పర్యము.

జనస్థానే హతస్థానే తవ రాక్షస మచ్ఛరైః
నిర్భయా విచరిష్యంతి సర్వతో మునయో వనే. ౯

టీక॥ రాక్షస = రాక్షసుఁడవగు ఖరుఁడా!మచ్ఛరైః= నాబాణములచేత;తవ=నీయొక్క; జనస్థానే = జనస్థానము;హతస్థానే= కొట్టఁబడిన రాక్షససన్నివేశముగలదగుచుండఁగా;మునయః=ఋషులు;వనే = అడవియందు;సర్వతః = అంతటను ; నిర్భయాః=భయము లేనివారలయి ; విచరిష్యంతి=తిరుగఁగలరు.

ఖరుఁడా! నాబాణములచేత , నీ జనస్థానంబునందలిరాక్షసులందఱు హతులయినపిదప, మునులీవనంబునందంతటనునిర్భయముగావిహరింపఁగలరు.

అని, తాత్పర్యము.

అద్య విప్ర సరిష్యంతి రాక్షస్యో హతబాంధవాః
బాష్పార్ద్ర వదనా దీనా భయా దన్య భయావహాః. ౧౦

టీక॥అన్యభయావహాః= ఇతరులకు భయముగలిగించునట్టి; రాక్షస్యః=రాక్షసస్త్రీలు; అద్య= ఇప్పుడు;హతబాంధవాః=చంపఁబడినబంధువులు గలవారలయి; బాష్పార్ద్రవదనాః = కన్నీటందడిసిన ముఖములు గలవారలయి;

దీనాః=దుఃఖితులయి ; భయాత్=భయమువలన; విప్రసరిష్యంతి= పరుగెత్తఁగలరు-

ఇదివఱకుఋషులకు భయంబు గలిగించుచుండిన రాక్షసస్త్రీలు, ఇప్పుడు, తమబంధువులందఱుహతులగుటం జేసి, కన్నీళ్లు గాఱఁ బరమదుఃఖితులయి, భయంబునంబరుగెత్తఁగలరు.

అని, తాత్పర్యము.

అద్య శోక రసజ్ఞాస్తా భవిష్యంతి నిరర్థకాః
అనురూపకులాః పత్న్యో యాసాం త్వం పతి రీదృశః. ౧౧

టీక॥ యాసాం = ఎవ్వరికి; ఈదృశః=ఇట్టి; త్వం=నీవు; పతిః=పెనిమిటివో; తాః=అట్టి; అనురూపకులాః=నీకుఁదగినకులముగల; పత్న్యః= భార్యలు; అద్య=ఇప్పుడు; నిరర్థకాః=కామరూపమయిన పురుషార్థములేనివారలయి; శోకరసజ్ఞాః=దుఃఖరసమును దెలిసినవారలు;భవిష్యంతి= కాఁగలరు.

నీకుసరియయిన కులంబునంబుట్టియిట్టి దుర్మార్గుఁడవగు నిన్నుఁబెండ్లాడిన రాక్షసవనితలు,ఇప్పుడుదుఃఖరసంబెట్టిదో యెఱుంగంగలరు.

అని, తాత్పర్యము.

నృశంస నీచ క్షుద్రాత్మ న్నిత్యం బ్రాహ్మణ కంటక
యత్కృతే శంకితై రగ్నౌ మునిభిః పాత్యతే హవిః. ౧౨

టీక॥నృశంస= ఘాతుకుఁడవు ; నీచ=నీచుఁడవు;క్షుద్రాత్మన్= దుష్టస్వభావముగలవాఁడవు;నిత్యం = ఎల్లప్పుడు;బ్రాహ్మణకంటక= బ్రాహ్మణులకు శత్రుఁడవునగుఖరుఁడా! యత్కృతే= ఎవ్వనినిమిత్తమయి;శంకితైః=భయము నొందిన;మునిభిః= మునులచేత ; హవిః=హవిస్సు; అగ్నౌ= అగ్నిహోత్రమునందు;పాత్యతే = వేయఁబడుచున్నదో.

ఘాతుకుఁడవు నీచుండవు దురాత్ముండవు నెల్లప్పుడును బ్రాహ్మణులకుఁ గీడు గావించుచుండు వాఁడవు నగుఖరుఁడా! నీనిమిత్తమయి , మునులుహవిస్సునగ్నిహోత్రమును వ్రేల్చునపుడెల్ల భయంబునొందుదురు ; అట్టిపరమ

దుష్కార్యుండవగు నిన్నుఁ బెండ్లాడిన స్త్రీలు, ఇప్పుడు దుఃఖంబెట్టిదో తెలిసి కొనఁగలరు. అని, రాముండు ఖరుని తోఁజెప్పెను. అని, తాత్పర్యము.

త మేవ మభిసంరబ్ధం బ్రువాణం రాఘవం రణే
ఖరో నిర్భర్త్సయామాస రోషా త్ఖరతరస్వనః. ౧౩

టీక॥ ఖరః=ఖరుఁడు; రణే = యుద్ధమునందు; అభిసంరబ్ధం = కోపము నొందినవాఁడును, ఏవం = ఇట్లు; బ్రువాణం=చెప్పుచున్నవాఁడునగు; రాఘవం=రామునిని; రోషాత్ = కోపము వలన; ఖరతరస్వనః = మిక్కిలియుఁదీక్ష్ణమయినధ్వనిగలవాఁడై; నిర్భర్త్సయామాస=బెదరించెను.

అట్లు కుపితుండై చెప్పుచున్న రాముంజూచి, ఖరుండు, పరమక్రుద్ధుండై, మహాధ్వనిగదుర, నారాముని, నీ ప్రకారంబున బెదరించెను.

అని, తాత్పర్యము.

దృఢం ఖల్వవలిప్తోసి భయేష్వపిచ నిర్భయః
వాచ్యావాచ్యం తతోహి త్వం మృత్యువశ్యో నబుధ్యసే. ౧౪

టీక॥ త్వం=నీవు; దృఢం = మిక్కిలియు; అవలిప్తః=గర్వితుండవు; అసి=అగుచున్నావు. తతోహి= అందువలననె; భయేష్వపిచ=భయములందును; నిర్భయః=భయములేనివాఁడవు; అసి (అధ్యాహృతము) = అగుచున్నావు. మృత్యువశ్యః=మృత్యువునకధీనుండవై; వాచ్యావాచ్యం = చెప్పఁదగినదానిని, నబుధ్యసే=ఎఱుంగవు.

నీవుమిక్కిలిగర్వితుండవు, అందువలననె, భయపడవలసిన కాలంబులందునుంగూడనిర్భయుండవై, మృత్యువశ్యుండవగుటంజేసి "ఇదిచెప్పవచ్చు. ఇదిచెప్పరాదు" అనిగూడఁదెలియకనోటికివచ్చినట్లు ప్రేలుచున్నావు.

అని, తాత్పర్యము.

కాలపాశ పరిక్షిప్తా భవంతి పురుషాహి యే
కార్యా కార్యం నజానంతి తే నిరస్తషడింద్రియాః. ౧౫




టీక॥ యే=ఏ; పురుషాః = పురుషులు; కాలపాశపరిక్షిప్తాః= మృత్యుపాశముచేఁగట్టఁబడినవారలు; భవంతి=అగుచున్నారో; తే=వారలు; నిరస్తషడింద్రియాః=విడువఁబడిన యాఱింద్రియములుగలవారలయి; కార్యాకార్యం=యుక్తాయుక్తమును; నజానంతి=ఎఱుంగరు.

ఎవ్వరు మృత్యుపాశబద్ధు లగుదురో, అట్టిపురుషులు, ఇంద్రియాధీనతం దప్పి, యుక్తాయుక్తంబు నెఱుంగఁజాలరు. అని, ఖరుండు, రామునితోఁ జెప్పెను. అని; తాత్పర్యము.

ఏవ ముక్త్వా తతో రామం సంరుధ్య భ్రుకుటీం తతః
స దదర్శ మహాసాల మవిదూరే నిశాచరః ౧౮
రణే ప్రహరణ స్యార్థే సర్వతో హ్యవలోకయన్

టీక॥ సః=ఆ; నిశాచరః= రాక్షసుఁడైనఖరుఁడు; ఏవం=ఇట్లు; రామం=రామునిగూర్చి; ఉక్త్వా=చెప్పి; తతః=అంత; భ్రుకుటీం=బొమముడిని; సంరుధ్య=కట్టి; తతః=అంత; రణే= యుద్ధమునందు; ప్రహరణస్య = ఆయుధముయొక్క; అర్థే=కార్యమునిమిత్తము; సర్వతోహి=అంతటను; అవలోకయన్=చూచుచు; అవిదూరే=సమీపమునందు; మహాసాలం=పెద్దవృక్షమును, దదర్శ=చూచెను.

ఆఖరుండు, రామునితో నీప్రకారంబునం జెప్పె, నంత బొమముడిపాటుగదుర, యుద్ధంబున నాయుధంబునిమిత్తమయి, నాలుగుప్రక్కలం జూచుచు, సమీపంబుననొక్క మహావృక్షముంగనెను. అని, తాత్పర్యము.

స త ముత్పాటయామాస సందశ్య దశనచ్ఛదమ్. ౧౯

టీక॥ సః=ఆఖరుఁడు; దశనచ్ఛదం=పెదవిని; సందశ్య=కొఱికి; తం=ఆమహావృక్షమును; ఉత్పాటయామాస = పెఱికెను.

ఆఖరుండు, రోషంబునఁ బెదవిం గొఱుకుచు, నామహావృక్షముం బెఱికెను. అని, తాత్పర్యము.




తం సముత్థిప్య బాహుభ్యాం వినద్యచ మహాబలః
రామ ముద్దిశ్య చిక్షేప హత స్త్వమతిచా బ్రవీత్. ౧౭

టీక॥ మహాబలః=అధికమయినబలముగలఖరుఁడు , బాహుభ్యాం=చేతులచేత; తం = ఆవృక్షమును; సముత్థిప్య=ఎత్తి; వినద్యచ=అఱచియు; రామం=రాముని ; ఉద్దిశ్య=ఉద్దేశించి;చిక్షేప=వేసెను. త్వం=నీవు ; హతః=చంపఁబడినావు;ఇతిచ=అనియు; అబ్రవీత్=చెప్పెను.

మహాబలశాలియగుఖరుండు, చేతులతోనావృక్షంబునెత్తి సింహనాదంబుగావించి, రామునిపైనేసి ,"దీనితో నీవు హతుండవైతివి"అని, చెప్పెను.

అని, తాత్పర్యము.

త మా పతంతం బాణౌఘై శ్ఛిత్వా రామః ప్రతాపవాన్
రోషమాహారయత్తీవ్రం నిహంతుం సమరే ఖరమ్. ౧౮

టీక॥ ప్రతాపవాన్= అధికమయినపరాక్రమముగల;రామః = రాముఁడు;ఆపతంతం= వచ్చుచున్న; తం=ఆవృక్షమును;బాణౌఘైః= బాణసమూహములచేత,ఛిత్వా=నఱికి; సమరే= యుద్ధమునందు;ఖరం = ఖరుని;నిహంతుం=వధించుటకై;తీవ్రం= తీక్ష్ణమగు; రోషం=కోపమును; ఆహారయత్=తెచ్చుకొనెను.

మహాపరాక్రమశాలియగురాముండు, అట్లుతనపైకివచ్చుచున్న యమ్మహా వృక్షమును బాణములం దునియలుగావించి, యుద్ధంబున ఖరునివధించుటకై ,తీవ్రంబగుకోపంబువహించెను.

అని, తాత్పర్యము.

జాతస్వేద స్తతో రామో రోషా ద్రక్తాంత లోచనః
నిర్బిభేద సహస్రేణ బాణానాం సమరే ఖరమ్. ౧౯

టీక॥ తతః=అంత;రామః = రాముఁడు;సమరే=యుద్ధమునందు ; రోషాత్=కోపమువలన; జాతస్వేదః=కలిగినచెమటగలవాఁడై; రక్తాంతలో

చనః= ఎట్టిదైనకొనలుగల కన్నులుగ లః ఖరం=ఖరుని; బాణానాం = బాణములయొక్క; సహస్రేణ = వేయింటి చేత; బిభేద=భేదించెను.

అంత, రాముండు, కోపంబునం జేసి దేహమంతయుం జెమటగాఁ, గనుంగొనలనెఱ్ఱఁదనంబుగదుర, ఖరుని, వేయిబాణంబులనొప్పించెను.

అని, తాత్పర్యము.

తస్య బాణాంతరా ద్రక్తం బహు సుస్రావ ఫేనిలమ్
గిరేః ప్రస్రవణస్యేవ తోయధారా పరిస్రవః. ౨౧

టీక॥ తస్య=ఆఖరునియొక్క; బాణాంతరాత్ = బాణములచేఁ జేయఁబడినరంధ్రమువలన; ఫేనిలం=నురుఁగుగల, బహు=అధికమయిన; రక్తం=నెత్తురు; ప్రస్రవణస్య= ప్రస్రవణమను; గిరేః=పర్వతముయొక్క ; తోయధారాపరిస్రవఇవ= జలధారలప్రవాహము వలె; సుస్రావ=కాఱెను.

ఆఖరుని దేహంబున రామునిబాణంబులం జేయఁబడిన గాయములనుండి, ప్రస్రవణపర్వతమునుండి జలధారాప్రవాహములు స్రవించునట్లు, నురుఁగుతోఁగూడిన నెత్తురెచ్చుగా స్రవించినది.

అని, తాత్పర్యము.

విహ్వల స్సకృతో బాణైః ఖరో రామేణ సంయుగే
మత్తో రుధిర గంధేన తమేవాభ్య ద్రవ ద్ద్రుతమ్. ౨౨

టీక॥ మత్తః=మదించిన; సః=ఆఖరః=ఖరుఁడు; సంయుగే= యుద్ధమునందు; రామేణ=రామునిచేత; విహ్వలః= అవయవములస్వాధీనత దప్పిన వాఁడుగా; కృతః=చేయఁబడినవాఁడై; రుధిరగంధేన=నెత్తురువాసనతో; ద్రుతం= శీఘ్రముగా; తమేవ= ఆరామునిగూర్చియే; అభ్యద్రవత్=పరుగెత్తెను.

మత్తుండగునాఖరుండు, యుద్ధంబున, రామునిబాణంబులచే నవయవంబులస్వాధీనతదప్పునట్లుగావింపఁబడి, నెత్తురువాసనతో, నారామునిపైకడరెను. అని, తాత్పర్యము.

తమాపతంతం సంరబ్ధం కృతాస్త్రో రుధిరాప్లుతమ్
అపాసర్పత్ప్రతిపదం కించిత్త్వరితవిక్రమః ౨౩

టీక॥ కృతాస్త్రః=నేర్వఁబడినయస్త్రములు గలవాఁడును ; త్వరితవిక్రమః=శీఘ్రము గా నపరాక్రమము గలవాఁడునగు రాముఁడు, ఆపతంతం= వచ్చుచున్నవాఁడును; సంరబ్ధం= వేగము గలవాఁడును, రుధిరాప్లుతం= నెత్తురు చేఁదడుపఁబడినవాఁడునగు; తం=ఆఖరునిగూర్చి; ప్రతిపదం= ఎదురుమార్గముగా; కించిత్=కొంచెము ; అపాసర్పత్ = వెనుకకుఁబోయెను.

సమస్తాస్త్రవేత్తయు శీఘ్రవిక్రముఁడునగు రాముండు, అట్లు, ఖరుండు మహావేగంబున నెత్తుటం దోఁగుచు వచ్చుటం జూచి, బాణంబు విడువనవకాశంబు గల్గుటకును ఖరుని మేనిరుధిరదుర్గంధంబు సహింపంజాలకపోవుటవలనను, గొంచెము వెనుకకుఁబోయెను.

అని, తాత్పర్యము.

తతః పావకసంకాశం వధాయ సమరే శరమ్
ఖరస్య రామో జగ్రాహ బ్రహ్మదండమివాపరమ్. ౨౪

టీక॥ తతః=అంత; రామః = రాముఁడు, సమరే=యుద్ధమునందు; ఖరస్య=ఖరునియొక్క; వధాయ= చంపుటకొఱకు; పావకసంకాశం=అగ్నిహోత్రముతో సమానమయి నదియు; అపరం=రెండవదైన; బ్రహ్మదండమివ(స్థితం) = బ్రహ్మదండమువలెనున్నదియునగు; శరం=బాణమును ; జగ్రాహ=గ్రహించెను.

అంత, రాముండు, ఖరవధార్థమయి, యగ్నిహోత్రంబుపగిది వెలుంగుచున్నదియు రెండవబ్రహ్మదండంబనందగియున్నదియు నగు బాణంబు గ్రహించెను. అని, తాత్పర్యము.

స తం దత్తం మఘవతా సురరాజేన ధీమతా
సందధేచాపి ధర్మాత్మా ముమోచచ ఖరంప్రతి. ౨౫

టీక॥ ధర్మాత్మా= ధర్మస్వభావుఁడగు; సః=ఆ రాముఁడు; ధీమతా= బుద్ధిమంతుండగు; మఘవతా = యాగములుగల; సురరాజేన = దేవేంద్రునిచేత; దత్తం = ఇయ్యఁబడిన; తం= ఆబాణమును; సందధేచాపి = సంధించెను. ఖరంప్రతి = ఖరునిగూర్చి; ముమోచచ=విడిచెను.

ధర్మాత్ముఁడగు రాముఁడు, మన్నుబుద్ధిమంతుఁడగు దేవేంద్రుండు, అగస్త్యమహర్షిద్వారంబున నొసంగినయమ్మహాశరంబును సంధించి ఖరునిపైవిడిచెను. అని, తాత్పర్యము.

స విముక్తో మహాబాణో నిర్ఘాత సమనిస్వనః
రామేణ ధను రాయమ్య ఖరస్యోర స్యపాతయత్. ౨౮

టీక॥ రామేణ=రామునిచేత ; ధనుః=వింటిని; ఆయమ్య = ఈడ్చి; విముక్తః=విడువఁబడిన; సః = ఆ; మహాబాణః= గొప్పబాణము ; నిర్ఘాతసమనిస్వనః= పిడుగుతో సమానమయిన ధ్వనిగలదై; ఖరస్య = ఖరునియొక్క ; ఉరసి=ఱొమ్మునందు; అపాతయత్= పడెను.

అట్లు, అమ్మహాబాణము , రామునిచే నాకర్ణాంతము ధనువునాకర్షించి విడువఁబడి , పిడుగుపడునట్లుమహాధ్వనిగదుర, ఖరునివక్షస్థలంబుఁజొచ్చెను. అని, తాత్పర్యము.

స పపాత ఖరో భూమౌ దహ్యమాన శ్శరాగ్నినా
రుద్రేణేవ వినిర్దగ్ధ శ్శ్వేతా రణ్యే యథాంధకః. ౨౯

టీక॥ సః=ఆ; ఖరః=ఖరుఁడు; శరాగ్నినా=బాణాగ్నిచేత; దహ్యమానః= దహింపఁబడుచున్నవాఁడై; శ్వేతారణ్యే= శ్వేతారణ్యక్షేత్రమునందు; రుద్రేణ=రుద్రునిచేత; ("ఇవ" అనునదివాక్యాలంకారార్థము ) వినిర్దగ్ధః= దహింపఁబడిన; అంధకో యథా=అంధకాసురుఁడువలె; భూమౌ = నేలయందు; పపాత=పడెను.

అంత, వాఖరుండు , రామబాణాగ్నిచేనిదగ్ధుఁడై, శ్వేతారణ్యక్షేత్రమునందు రుద్రనేత్రాగ్నిదగ్ధుడైన యంధ

కాసరునిపగిది, నేలంగూలెను. అని, తాత్పర్యము.

స వృత్రఇవ వజ్రేణ ఫేనేన నముచి ర్యథా
బలో వేంద్రా శనిహతో నిపపాత హతః ఖరః. ౨౮

టీక॥ సః = ఆ; హతః = చంపఁబడిన; ఖరః = ఖరుఁడు; వజ్రేణ = వజ్రాయుధముచేత; వృత్రఇవ = వృత్రాసురుఁడువలె; ఫేనేన = నురుఁగుచేత ; నముచిర్యథా = నముచివలె; ఇంద్రాశనిహతః = ఇంద్రునివజ్రాయుధముచే వధింపఁబడిన; బలోవా = బలాసురుఁడువలె ; నిపపాత = పడెను.

వజ్రాయుధంబుచేనిహతుండైనవృత్రాసురుకై వడి, నురుఁగుచే హతుండయిననముచిభంగి, వజ్రాయుధహతుండయినబలాసురునిచాడ్పున , నాఖరుండు, రామబాణహతుండై , నేలంగూలెను. అని, తాత్పర్యము.

తతో రాజర్షయ స్సర్వే సంగతాః పరమర్షయః
సభాజ్య ముదితా రామ మిదం వచన మబ్రువన్. ౨౯

టీక॥ తతః = అంత; రాజర్షయః = రాజర్షులును; పరమర్షయః = బ్రహ్మర్షులును; సర్వే = అందఱును; ముదితాః = సంతోషించినవారలయి; సంగతాః = చేరినవారలయి; రామం = రామునిని; సభాజ్య = పూజించి; ఇదం = ఈ; వచనం = మాటను; అబ్రువన్ = చెప్పిరి.

అంత, రాజర్షులును బ్రహ్మర్షులును , వచ్చి, పరమ సంతోషంబునొంది, రామునింబూజించి, యిట్లని , చెప్పిరి. అని, తాత్పర్యము.

ఏత దర్థం మహాతేజా మహేంద్రః పాకశాసనః
శరభంగాశ్రమం పుణ్య మాజగామ పురందరః. ౩౦

టీక॥ మహాతేజాః = అధికమయిన తేజస్సుగలవాఁడును; మహేంద్రః = వృత్రాసురునివధించినవాఁడును ; పాకశాసనః = పాకాసురుని వధించిన

వాఁడునగు; పురందరః = ఇంద్రుఁడు; ఏతదర్థం=ఇందుకొఱకె; పుణ్యం= పవిత్రమయిన; శరభంగాశ్రమం = శరభంగ మహాముని యాశ్రమమునుగూర్చి; ఆజగామ=వచ్చెను.

మహాతేజుండును వృత్రాసుర పాకాసురులవధించిన వాఁడు నగు దేవేంద్రుఁడు, ఈఖరాదివధముకొఱకె, పవిత్రంబగు శరభంగాశ్రమంబునకువచ్చెను. అని, తాత్పర్యము.

ఆనీత స్త్వ మిమం దేశ ముపాయేన మహర్షిభిః
ఏషాం వధార్థం క్రూరాణాం రక్షసాం పాపకర్మణామ్. ౩౧

టీక॥క్రూరాణాం=ఘాతుకులును; పాపకర్మణాం= పాపముగలిగించు కార్యములుగలవారలునగు; ఏషాం = ఈ; రక్షసాం= రాక్షసులయొక్క; వధార్థం=వధముకొఱకు; త్వం=నీవు; మహర్షిభిః=మహర్షులచేత; ఉపాయేన=ఉపాయముచేత; ఇమం=ఈ; దేశం=ప్రదేశమును; ఆనీతః=పొందింపఁబడినావు.

ఘాతుకులును పాపాత్ములు నగు నీ రాక్షసులవధార్థమై మహర్షులు పాయంబున, నిన్నీస్థలంబుఁ జేరునట్లు గావించిరి. అని, తాత్పర్యము.

తదిదం నః కృతం కార్యం త్వయా దశరథాత్మజ
సుఖం ధర్మం చరిష్యంతి దండకేషు మహర్షయః ౩౨

టీక॥దశరథాత్మజ = దశరథునికుమారుఁడవయినరాముఁడా! త్వయా= నీచేత; తత్=అట్టి, ఇదం=ఈ; నః= మాయొక్క; కార్యం=పని; కృతం= చేయఁబడినది. మహర్షయః= పూజ్యులయిన ఋషులు; దండకేషు= దండకారణ్యమునందు; సుఖం=సుఖముగా; ధర్మం=ధర్మమును; చరిష్యంతి = ఆచరింపఁగలరు.

దశరథమహారాజపుత్రుండవగు రాముఁడా! నీవుమాకుమిక్కిలియు సుఖకరమగునీకార్యంబుగావించినావు ; ఇంకమీఁద, మహర్షులు, దండకారణ్యంబున, సుఖంబుగాధర్మంబునాచరింతురు. అని, మహర్షులు, రామునితోఁ జెప్పిరి. అని, తాత్పర్యము.

ఏతస్మిన్నంతరే దేవాశ్చారణైస్సహసంగతాః
దుందుభీంశ్చాభినిఘ్నంతః పుష్పవర్షం సమంతతః. ౩౩
రామస్యోపరి సంహృష్టా వవృషు ర్విస్మితా స్తదా

టీక॥ఏతస్మిన్=ఈ;అంతరే = మధ్యమునందు;తదా=అప్పుడు; దేవాః=దేవతలు;చారణైస్సహ = చారణులతోఁగూడ;సంగతాః = చేరినవారలయి;సంహృష్టాః=మిక్కిలియు సంతోషించినవారలయి;విస్మితాః= ఆశ్చర్యమునొందినవారలయి; దుందుభీంశ్చ=భేరులనుగూడ; అభినిఘ్నంతః= కొట్టుచు;సమంతతః=అంతటను; రామస్యోపరి= రామునిమీఁదను;పుష్పవర్షం=పూలవానను;వవృషుః=కురిసిరి.

ఈమధ్యమున, దేవతలును జారణులును బరమసంతుష్టులయి, మిక్కిలియు నాశ్చర్యంబునొంది, భేరులు వాయించుచు, రామునిపైఁబూలవానగురిపించిరి.

అని, తాత్పర్యము,

అర్ధాధిక ముహూర్తేన రామేణ నిశితై శ్శరైః. ౩౪
చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్
ఖరదూషణ ముఖ్యానాం నిహతాని మహాహవే. ౩౫

టీక॥ రామేణ= రామునిచేత; మహాహవే = మహాయుద్ధమునందు; అర్ధాధికముహూర్తేన = సగముచేనధికమయినముహూర్తముచేత ; నిశితైః=తీక్ష్ణములయిన; శరైః = బాణములచేత,భీమకర్మణాం = భయంకరమయినకార్యముగల ; ఖరదూషణముఖ్యానాం=ఖరుండును దూషణుండును మొదలుగాఁగల;రక్షసాం= రాక్షసులయొక్క;సహస్రాణి = వేలు; చతుర్దశ=పదునాలుగు ; నిహతాని=వధింపఁబడినవి.

రాముండు , మహాయుద్ధంబునందు, ఒక్కటియునరముహూర్తంబులోఁగల , భయంకరపరాక్రములగు ఖరదూషణులు మొదలయిన పదునాలుగువేలరాక్షసులవధించెను.

అని, తాత్పర్యము.

అహో బత మహ త్కర్మ రామస్య విదితాత్మనః

అహో వీర్య మహో దాక్ష్యం విష్ణో రివహి దృశ్యతే. ౩౬

టీక॥విదితాత్మనః= తెలియఁబడిన యాత్మగల; రామస్య = రామునియొక్క; కర్మ=కార్యము;మహత్= గొప్పది. అహోబత = ఆశ్చర్యము! వీర్యం=పరాక్రమము! అహో= ఆశ్చర్యము! దాక్ష్యం=సామర్థ్యము ! అహో=ఆశ్చర్యము! విష్ణోరివ = విష్ణుదేవునకువలె;దృశ్యతేహి= చూడఁబడుచున్నదిగదా!

ఆత్మజ్ఞానముగలరాముండు , ఎంతటి గొప్పకార్యము గావించినాఁడు! ఆశ్చర్యము! ఈతనిపరాక్రమము , నీతని సామర్థ్యమును విష్ణుదేవుని పరాక్రమసామర్థ్యములుంబోలె నచింత్యంబులయియున్నవి ! ఆశ్చర్యము ! అని, దేవాదులుచెప్పిరి.

అని, తాత్పర్యము.

ఇత్యేవ ముక్త్వా తే సర్వే జగ్ము ర్దేవా యథా గతమ్

టీక॥ తే=ఆ;దేవాః = దేవతలు; సర్వే =అందఱును;ఇతి = అని;ఏవం= ఇట్లు;ఉక్త్వా=చెప్పి ; యథాగతం= వచ్చినట్లు;జగ్ముః=పోయిరి.

దేవతలు మున్నుగువారలందఱు,నీప్రకారమునంజెప్పితమతమనెలవులకుంబోయిరి. అని,తాత్పర్యము.

ఏతస్మి న్నంతరే వీరో లక్ష్మణ స్సహసీతయా. ౩౭
గిరి దుర్గా ద్వినిష్క్రమ్య స వివేశా శ్రమం సుఖీ

టీక॥ ఏతస్మిన్ అంతరే= ఈమధ్యమునందు; వీరః= పరాక్రమశాలియగు సః=ఆ; లక్ష్మణః=లక్ష్మణుఁడు ; సీతయాసహ = సీతతోఁగూడ ; గిరిదుర్గాత్ = పర్వతమునందలిదుర్గమప్రదేశముననుండి; వినిష్క్రమ్య= వెడలి ; సుఖీ=సంతోషముగలవాఁడై;ఆశ్రమం=ఆశ్రమమును; ప్రవివేశ=ప్రవేశించెను.

ఇంతలో, వీరుఁడగులక్ష్మణుండు, రాముండుజయించుటంజేసి, పరమసంతుష్టుండై, సీతతోఁగూడఁ , బర్వతగుహనుండివెడలి, యాశ్రమంబుఁబ్రవే

శించెను. అని, తాత్పర్యము.

తతో రామస్తు విజయీ పూజ్యమానో మహర్షిభిః. ౩౮
ప్రవివేశాశ్రమం వీరో లక్ష్మణేనాభిపూజితః

టీక॥ తతః=అంత; విజయీ=గెల్పు గలవాఁడును; వీరః= పరాక్రమశాలి యునగు, రామస్తు=రాముఁడును; మహర్షిభిః= పూజ్యులగుఋషులచేత, పూజ్యమానః = పూజింపఁబడుచున్న వాఁడై; లక్ష్మణేన=లక్ష్మణునిచేత; అభిపూజితః= పూజింపఁబడినవాఁడై ; ఆశ్రమం = ఆశ్రమమును; ప్రవివేశ= ప్రవేశించెను.

అంత, జయము నొందిన వాఁడును వీరుండునగు రాముండు, మహర్షులచేఁ బూజింపఁబడుచు , లక్ష్మణునిచే నెదుర్కొని పూజింపఁ బడినవాఁడై, తనయాశ్రమంబుఁ జొచ్చెను.

అని, తాత్పర్యము.

తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్. ౩౯
బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే

టీక॥ వైదేహీ=సీతాదేవి ; శత్రుహంతారం=శత్రువుల వధించువాఁడును; మహర్షీణాం=మహర్షులకు; సుఖావహం=సుఖముగలిగించు వాఁడునగు; తం=ఆ రాముని; దృష్ట్వా= చూచి; హృష్టా=సంతసించినది; బభూవ= ఆయెను. భర్తారం=పెనిమిటిని; పరిషస్వజే=కవుఁగిలించుకొనెను.

సీతాదేవి, యట్లుసమస్తశత్రువుల వధించినవాఁడును మహర్షులకు సుఖంబు గలిగించినవాఁడునగు నారాముంజూచి, సంతోషంబునొంది , పెనిమిటిని గాఢంబుగాఁ గవుగిలించుకొనెను.

అని, తాత్పర్యము.

విశేషార్థము.—పదునాలుగు వేలరాక్షసులతో రాముండొక్కఁడేమి చేయుననియది వరకుదిగులుపడుచున్న సీతాదేవి, యిప్పుడు, రాముండు పదునాలుగు వేలరాక్షసులనందఱవధించివచ్చుటంజూచి, సంతుష్టయయి, వీరతారత

మ్యంబు దెలిసినకులంబునం బుట్టినదికా వున,సబహుమానంబుగా రామునిం గ వుఁగిలించుకొనెనని చెప్పుచున్నారు.

తంద్ర్పష్ట్వా=ఆరామునిఁజూచి,అంత కుమున్నుమహాయుద్ధంబుననదృశ్యుండై యుండియిప్పుడుసమీపంబునకు వచ్చిన రాముంబూచియనుట;తంద్ర్పష్ట్వా= ఆ రామునింబూచి, నెత్తురుగాఁ వీరవ్ర ణంబులతోరోమకూపంబులవెడలు చె మటబిందువులతోనుంగూడికోదండ దం డమునవలంబించికొంచెముశ్రమముతో నొప్పుచున్న రాముంజూచియనుట; తం ద్ర్పష్ట్వా=మున్నువీరుండనిమాత్రము తెలి యఁబడినవానిని,నిప్పుడువీరుండుగావింప వలసినకృత్యంబునెఱవేర్చిన మహావీరుని రామునింజూచియనుట;తంద్ర్పష్ట్వా=ఇం ద్రాదిదేవతలందఱు నొక్కఁపెట్టవచ్చి నను సాధింపనలవిగాని మహాపరాక్ర ముశాలులఁ బదునాలుగువేలరాక్షసుల నొక్కఁడె యొకటియు నఱముహూ ర్తంబున ననాయాసంబుగా వధించిన ట్టి రామునింజూచి యనుట ; తంద్ర ష్ట్వా = "రామజామాతరం ప్రాప్య స్త్రీయంపురుషవిగ్రహం" (రాముఁ డా! నీవుపురుషవేషంబు ధరించినవాఁ డవు అంతస్స్త్రీస్వరూపుఁడవు) అని, ము న్నుతనచే, నరణ్యమునకువచ్చుటకుము నుపు,అజ్ఞానంబున,నవమానంబు గాఁబ లుకఁబడినవానిని,నిప్పుడు , ఒకటియున అముహూర్తంబులోపల మహాపరా క్రమశాలులఁబదునాలుగువేల రాక్షసు లననాయాసంబుగావధించిన మహావీర పురుషశిఖామణిని రాముంజూచి యను ట,శత్రుహంతారం=శత్రువులవధించి నవానిని,శత్రువులెదుటఁబడి తప్పించుకొ నిపోయినదేలేదనుట,ఇందువలనదుష్టని గ్రహము దెలుపఁ బడినది. మహర్షీణాంసుఖావహం = మహర్షులకుసు ఖంబుగలిగించువానిని, తపోమహిమచేని మేషమాత్రంబున సమస్తరాక్షసులను సంహరింప శక్తులయ్యు రామునందలి రక్షకత్వరూపధర్మముసకునుదమకుం గల రక్ష్యత్వరూపధర్మమునకును హా నిగలుగరాదను నభిప్రాయంబుచే,రా ముఁడెప్పుడువచ్చిరాక్షసులవధించునో యని నిరీక్షించుచుండిన లోకమర్యాదా పాలకులకుమహర్షులకు,వారలుగోరిన ట్లుసమస్తరాక్షసులనుసంహరించి,రా క్షసబాధయేలేకసుఖంబుగాఁ దపస్సు గావించుకొనునట్లు మహాసంతోషంబు గలిగించినవానిననుట ; ఇందువలన , శిష్ట పరిపాలనమును ధర్మసంస్థాపన

మును దెలుపఁబడినవి. ఈరెంటివలన, "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" (సత్పురుషులను రక్షించుటకును దుష్టుల శిక్షించుటకును ధర్మంబు నిలుపుటకును ప్రతియుగంబునందును అవతరించెదను) అను శ్లోకమునందలి యర్థము చెప్పఁబడినది. దృష్ట్వా, బభూవ = సంతోషించినదయ్యెను, రాముం డొకరుఁడె పెక్కురాక్షసుల నవమఁజికిఱియుండుటవలన, నంతవఱకు నానందరూపంబగు సత్త్వలేకుండిన సీతాదేవి, యిప్పుడు రామసత్త్వంబూచి, తాను నుసత్త్వంబొందినదనుట. వైదేహీ = "మిథిలాధిపతిర్వీరః" అని వీరుఁడని ప్రసిద్ధినొందిన జనకుని కొమార్తె కావున, వీరతారతమ్యంబు దెలిసినదనుట. భర్తారం పరిషస్వజే = పెనిమిటిని కవుఁగిలించుకొనెను; సర్వలోకభర్తను కవుగిలించుకొనెను; సుఖోష్ణంబులగు తన స్తనంబులచే నాయుధంబులం గలిగిన గాయములకితవుకాఁ గవుఁగిలించుకొనెను. తాను సర్వలోకమాతయగుటచేత, సర్వలోకభర్తయగు రాముండు, తన ప్రజలరక్షించుటం జేసి, సంతోషించి, యతనిం గవుఁగిలించుకొనెను.

ముదా పరమయా యుక్తా దృష్ట్వా రక్షోగణాన్ హతాన్. ౪౦
రామం చైవావ్యథం దృష్ట్వా తుతోష జనకాత్మజా

టీక॥ జనకాత్మజా = జనకమహారాజుకూఁతురయిన సీతాదేవి; పరమయా = మిక్కిలియు నధికమయిన; ముదా = సంతోషముతో; యుక్తా = కూడినదై; హతాన్ = చంపఁబడిన; రక్షోగణాన్ = రాక్షససమూహములను; దృష్ట్వా = చూచి; అవ్యథం = బాధలేనట్టి; రామం చైవ = రామునింగూడ; దృష్ట్వా = చూచి; తుతోష = సంతోషించెను.

జనకమహారాజుకూఁతురైన సీతాదేవి, రాక్షసులు హతులగుటకుఁ బరమసంతోషంబునొంది రాముండును యుద్ధంబున నేమియు బాధనొందకుండుటం జూచి, మఱియు నానందించెను.

అని, తాత్పర్యము.

తతస్తు తం రాక్షససంఘమర్దనం

సభాజ్యమానం ముదితైః మహర్షిభిః ४०
పునః పరిష్వజ్య శశిప్రభాననా
బభూవ హృష్టా జనకాత్మజా తదా

టీక॥ తతస్తు=అంతను; శశిప్రభాననా=చంద్రునికాంతివంటికాంతిగల; జనకాత్మజా=సీతాదేవి; తదా=అప్పుడు; రాక్షససంఘమర్దనం= రాక్షసులసమూహమును మర్దించినవాఁడును; ముదితైః = సంతసించిన; మహర్షిభిః = మహర్షులచేత; సభాజ్యమానం=పూజింపఁబడినవాఁడునగు; తం= ఆరామునిని; పునః=మఱల; పరిష్వజ్య= కవుఁగిలించుకొని; హృష్టా = సంతసించినది, బభూవ=అయ్యెను.

అంత, నప్పుడు, చంద్రబింబముంబోలుముఖంబుగలయాసీతాదేవి, యట్లుసమస్తరాక్షసులసంహరించినవాని సంతుష్టులగుమహర్షులచేఁ బూజింపఁబడుచున్నవాని శ్రీరామునిమఱిమఱి గాఢంబుగాఁగవుఁగిలించుకొని, పరమసంతోషంబునొందెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే, త్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండత్రింశసర్గటీక,
ముగిసినది.



శ్రీ

# ఏకత్రింశసర్గప్రారంభః.

త్వరమాణ స్తతో గత్వా జనస్థానా దకంపనః
ప్రవిశ్య లంకాం వేగేన రావణం వాక్య మబ్రవీత్. ౧

టీక॥ తతః= అంత; అకంపనః= అకంపనుఁడు; త్వరమాణః = వేగిరపడుచున్నవాఁడై; జనస్థానాత్ = జనస్థానముననుండి; గత్వా = పోయి; వేగేన= వేగముచేత; లంకాం = లంకను; ప్రవిశ్య= ప్రవేశించి; రావణం = రావణునిగూర్చి; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత, రావణునిచారుఁడగు నకంపనుండు, జనస్థానంబుననుండి యతివేగంబున లంకకుంబోయి, రావణుంబూచియిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

జనస్థానస్థితా రాజన్ రాక్షసా బహవో హతాః
ఖరశ్చ నిహత స్సంఖ్యే కథంచి దహ మాగతః. ౨

టీక॥ రాజన్= రాక్షసరాజుండవగు రావణుఁడా! జనస్థానస్థితాః= జనస్థానముననున్న; బహవః= పెక్కుండ్రయిన; రాక్షసాః = రాక్షసులు; హతాః= వధింపఁబడినారు. ఖరశ్చ= ఖరుండును; సంఖ్యే=యుద్ధమునందు; నిహతః=వధింపఁబడినాఁడు. అహం= నేను; కథంచిత్ =అతిప్రయాసమున; ఆగతః=వచ్చినాను.

రాక్షసరాజుండవగు రావణుఁడా! జనస్థానంబుననున్న రాక్షసు లందఱు యుద్ధంబునహతులయిరి; ఖరుండును వధింపఁబడియె; నేనుమాత్రముప్రయాసంబునఁదప్పించుకొనివచ్చినాను. అని, యకంపనుఁడు రావణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తో దశగ్రీవః క్రుద్ధ స్సంర క్తలోచనః

అకంపన మువాచేదం నిర్దహ న్నివ చక్షుసా. ౩

టీక॥ దశగ్రీవః= రావణుఁడు ; ఏవం=ఇట్లు;ఉక్తః=చెప్పఁబడినవాఁడై; క్రుద్ధః=కోపించినవాఁడై, సంరక్తలోచనః=మిక్కిలియు నెఱ్ఱనైనకన్నులుగలవాఁడై; చక్షుసా=కంటిచేత;నిర్దహన్నివ=దహించువాఁడువలె ; అకంపనం=అకంపనునిగూర్చి;ఇదం = ఈ మాటను;ఉవాచ=చెప్పెను.

రావణుఁడు, అకంపనుని మాటను విని,కుపితుండై,కన్నుల నెఱ్ఱఁదనం బొప్ప,దహించువాఁడువోలెఁ జూచుచుం జూచుచు,నకంపనునితోనిట్లని , చెప్పెను.అని,తాత్పర్యము.

కేన రమ్యం జనస్థానం హతం మమ పరాసునా
కోహి సర్వేషు లోకేషు గతిం చాధిగమిష్యతి. ४

టీక॥ పరాసునా = పోయినప్రాణంబులుగల; కేన=ఎవ్వనిచేత; మమ=నాయొక్క; రమ్యం = సుందరమయినః;జనస్థానం=జనస్థానము ; హతం=వధింపఁబడినది?కోహి = ఎవ్వఁడు ; సర్వేషు=సమస్తములయిన ; లోకేషు=లోకములయందును;గతిం = స్థానమును ; అధిగమిష్యతి = పొందఁగలఁడు?

మృత్యువశ్యుండెవ్వండు , జనస్థానంబునందలి రాక్షసుల వధించెను ?ఇంకనతనికి సమస్తలోకంబులయందును , గతియెక్కడిది? అని,తాత్పర్యము.

నహి మే విప్రియం కృత్వా శక్యం మఘవతా సుఖం
ప్రాప్తుం వైశ్రవణేనాపి నయమేన నవిష్ణునా. ౫

టీక॥ మే=నాకు; విప్రియం = అప్రియమును;కృత్వా=చేసి;సుఖం=సుఖమును; ప్రాప్తుం= పొందుటకు;మఘవతా=ఇంద్రునిచేతఁగాని; వైశ్రవణేనాపి=కుబేరునిచేతఁగాని;నశక్యంహి=అలవిగాదుగదా! యమేన = యమునిచేత;న (శక్యం)= అలవిగాదు. విష్ణునా=విష్ణుదేవునిచేత;న (శక్యం)= అ

లని గాదు.

దేవేంద్రుండుగాని కుబేరుండుగాని యముండుగాని విష్ణుండుగాని, నాకప్రియంబుగావించిరేని, యెంతమాత్రముసుఖంబునొందఁజాలరు.

అని, తాత్పర్యము.

కాలస్య చాప్యహం కాలో దహేయ మపి పావకమ్
మృత్యుం మరణధర్మేణ సంయోజయితు ముత్సహే. ౬

టీక॥ అహం=నేను; కాలస్యచాపి=యమునకును; కాలః= యముఁడను. పావకమపి=అగ్నినైనను; దహేయం=దహింతును. మృత్యుం=మృత్యువును; మరణధర్మేణ= మరణమనుధర్మముతోఁ; సంయోజయితుం= కూర్చుటకు; ఉత్సహే=ఉత్సహింతును.

నేనుయమునకునుయముండను; అగ్నినింగూడదహింతును; మృత్యువునకునుగూడమరణంబుగలిగింతును,

అని, తాత్పర్యము.

దహేయ మపి సంక్రుద్ధ స్తేజసాదిత్య పావకౌ
వాతస్య తరసా వేగం నిహంతు మహ ముత్సహే. ౭

టీక॥అహం=నేను;సంక్రుద్ధః= కోపించినవాఁడనై; తేజసా=తేజస్సుచేత; ఆదిత్యపావకావపి = సూర్యునిఅగ్నిహోత్రునింగూడ;దహేయం=దహింతును.తరసా=వేగముచేత; వాతస్య=వాయువుయొక్క; వేగం=వేగమును;నిహంతుం=కొట్టుటకు;ఉత్సహే=ఉత్సహింతును.

నేనుగ్రుద్ధుండనగుదునేని, సూర్యపావకులనిద్దఱనుంగూడదహింతును;వేగంబున వాయువేగంబును హరింతును. అని,రావణుఁడు,అకంపనునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తథా క్రుద్ధం దశగ్రీవం కృతాంజలి రకంపనః
భయా త్సందిగ్ధయా వాచా రావణం యాచ తేఽ భయమ్. ౮



టీక॥ అకంపనః=అకంపనుఁడు; కృతాంజలిః=చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై; తథా=అట్లు; క్రుద్ధం=కోపము నొందిన; దశగ్రీవం=పదికంఠములుగల; రావణం=రావణునికి; భయాత్=భయమువలన; సందిగ్ధయా=తొట్రుపడిన; వాచా=మాటచేత, అభయం=అభయము, ఇ; యాచతే=అడిగెను.

అంత, నకంపనుండు, రావణుండట్లు కుపితుండగుటనుజూచి, చేతులు మొగిడ్చి, భయంబున, మాటలు తొట్రుపడ, నభయంబొసంగుమని రావణుని యాచించెను. అని, తాత్పర్యము.

దశగ్రీవోఽభయం తస్మై ప్రదదౌ రక్షసాం వరః

టీక॥ రక్షసాం=రాక్షసులలో; వరః=శ్రేష్ఠుండగు; దశగ్రీవః=రావణుఁడు; తస్మై=ఆయకంపనునికొఱకు; అభయం=అభయమును; ప్రదదౌ=ఇచ్చెను.

రాక్షస శ్రేష్ఠుండగు రావణుండా యకంపనునకభయంబొసంగెను. అని, తాత్పర్యము.

స విస్రబ్ధోఽబ్రవీ ద్వాక్య మసందిగ్ధ మకంపనః. ౯

టీక॥ సః=ఆ; అకంపనః=అకంపనుఁడు; విస్రబ్ధః=నమ్మకముగలవాఁడై; అసందిగ్ధం=తొట్రుపాటు లేనట్లుగా; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

ఆయకంపనుండు, అంతభయంబు విడిచి, ధైర్యంబున, నిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

పుత్రో దశరథస్యాస్తి సింహసంహననో యువా
రామో నామ వృషస్కంధో వృత్తాయతమహాభుజః. ౧౦

టీక॥ సింహసంహననః=శ్రేష్ఠమయినరూపముగలవాఁడును; యువా=యౌవనముగలవాఁడును; వృషస్కంధః=ఆఁబోతుయొక్కమూఁపువంటి మూఁపుగలవాఁడును; వృత్తాయతమహాభుజః=గుండ్రములునునిడుపులునయినగొ



పృథుజములుగలవాఁడును; వీరః = పరాక్రమశాలియు; పృథుయశాః = గొప్పకీర్తిగలవాఁడును; శ్రీమాన్ = అధికమయినకాంతిగలవాఁడును; అతుల్యబలవిక్రమః = సరిలేనిబలపరాక్రమములు గలవాఁడును; దశరథస్య = దశరథునియొక్క; పుత్రః = కొడుకునగు; రామోనామ = రాముఁడనువాఁడు; అస్తి = కలఁడు.

లోకోత్తరమగు రూపముగలవాఁడును యౌవనవంతుండును ఆఁబోతుమూఁపువంటిమూఁపులు గలవాఁడును గుండ్రములయి నిడువులయిబలవంతంబులయినభుజంబులుగలవాఁడునువీరుండునుమహాయశుండును శ్రీమంతుండును సరిలేనిబలపరాక్రమంబులు గలవాఁడును, దశరథమహారాజపుత్రుండునగు రాముండనునొక్కమహాపురుషుండున్నాఁడు. అని, తాత్పర్యము.

వీరః పృథుయశా శ్శ్రీమా నతుల్యబలవిక్రమః
హంత తేన జనస్థానం ఖరశ్చ సహదూషణః. ౧౧

టీక॥ హంత = అయ్యో! తేన = ఆరామునిచేత; జనస్థానం = జనస్థానము; హతం (అధ్యాహృతము) = వధింపఁబడినది. సహదూషణః = దూషణునితోఁగూడిన; ఖరశ్చ = ఖరుండును; హతః (అధ్యాహృతము) = వధింపఁబడినాఁడు.

అయ్యో! ఆరాముఁడె, ఖరుండుదూషణుండు మొదలుగాఁగల, జనస్థానంబునందలి రాక్షసులనందఱను, వధించెను. అని, యకంపనుండు, రావణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

అకంపనవచ శ్శ్రుత్వా రావణో రాక్షసాధిపః
నాగేంద్రఇవ నిశ్శ్వస్య వచ నం చేద మబ్రవీత్. ౧౨

టీక॥ రాక్షసాధిపః = రాక్షసులకుఁ బ్రభుఁడగు; రావణః = రావణుఁడు; అకంపనవచః = అకంపనునిమాటను; శ్రుత్వా = విని; నాగేంద్రఇవ = సర్పరాజువలె; నిశ్శ్వస్య = నిట్టూర్పులువిడిచి; ఇదం = ఈ; వచనంచ = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

రాక్షసేశ్వరుఁడగు రావణుండు, అకంపనుండుచెప్పినమాటనువిని, సర్పరాజువలె వేఁడి నిట్టూర్పులువుచ్చుచు,

నిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

స సురేంద్రేణ సంయుక్తో రామ స్సర్వా మరై స్సహ
ఉపయాతో జనస్థానం బ్రూహి కచ్చి దకంపన.౧३

టీక॥ అకంపన = అకంపనుఁడా! సః=ఆ; రామః=రాముఁడు; సురేంద్రేణ=దేవేంద్రునితోను; సర్వామరైస్సహ=సమస్తదేవతలతోనుంగూడ; సంయుక్తః=కూడినవాఁడై; జనస్థానం = జనస్థానమును; ఉపయాతఃకచ్చిత్ = పొందినాఁడాయేమి? బ్రూహి= చెప్పుము.

అకంపనుఁడా! ఆరాముఁడు, దేవేంద్రునితోను దేవతల యందఱితో నుంగూడి జనస్థానంబునకువచ్చినాఁడా యేమి? నాకావివరంబుఁజెప్పుము. అని, అకంపనునితో రావణుఁడుచెప్పెను. అని, తాత్పర్యము.

రావణస్య పున ర్వాక్యం నిశమ్య త దకంపనః
ఆచచక్షే బలం తస్య విక్రమంచ మహాత్మనః. ౧४

టీక॥ అకంపనః=అకంపనుఁడు; పునః=మఱల; తత్=ఆ; రావణస్య=రావణునియొక్క; వాక్యం=మాటను; నిశమ్య=విని; మహాత్మనః= అధికమయిన పరాక్రమముగల; తస్య = ఆరామునియొక్క; బలం=బలమును; విక్రమంచ=పరాక్రమమును; ఆచచక్షే= చెప్పెను.

అకంపనుండు, మఱల రావణుండు చెప్పినమాటనువిని, మహాత్ముండగునా రామునిబలపరాక్రమంబులం జెప్పనారంభించెను. అని, తాత్పర్యము.

రామోనామ మహాతేజా శ్శ్రేష్ఠ స్సర్వధనుష్మతామ్
దివ్యాస్త్రగుణసంపన్నః పురందరసమో యుధి. ౧౫

టీక॥ రామోనామ = రాముఁడనఁగా; మహాతేజాః = అధికమయిన తేజస్సుగలవాఁడు. సర్వధనుష్మతాం= ఎల్లవిలుకాండ్రలోపలను; శ్రేష్ఠః = ఉ

త్తముఁడు. దివ్యాస్త్రగుణసంపన్నః= శ్రేష్ఠములైనయస్త్రములనుగుణముతోఁ గూడినవాఁడు. యుధి= యుద్ధమునందు;పురందరసమః= ఇంద్రునితోఁసమానుఁడు.

రాముండు,మహాతేజుండు , సమస్తధనుర్ధరులలోను శ్రేష్ఠుండు , దివ్యాస్త్రంబులు దెలిసినవాఁడు ; యుద్ధంబున దేవేంద్రునకు సాటివచ్చును.

అని, తాత్పర్యము.

తస్యా నురూపో బలవాన్ రక్తాక్షో దుందుభిస్వనః
కనీయాన్ లక్ష్మణో నామ భ్రాతా శశినిభాననః. ౧౬

టీక॥ తస్య = ఆరామునకు; బలవాన్= అధికమయినబలముగలవాఁడును; రక్తాక్షః=ఎఱ్ఱనికన్నులుగలవాఁడును; దుందుభిస్వనః= భేరియొక్కధ్వనివంటిధ్వనిగలవాఁడును; శశినిభాననః= చంద్రునితోఁసమానమయిన ముఖముగలవాఁడునగు; లక్ష్మణో నామ= లక్ష్మణుండనిప్రసిద్ధుఁడైన;కనీయాన్ = చిన్న;భ్రాతా=తోఁబుట్టువు, తమ్ముఁడనుట;అస్తి(అధ్యాహృతము)=కలఁడు.

ఆరామునకు, బలవంతుండునుఎఱ్ఱని రేఖలతోనొప్పుచున్నకన్నులు గలవాఁడును, భేరీధ్వనివలెగంభీరంబగుకంఠధ్వనిగలవాఁడును జంద్రబింబమువంటిముఖముగలవాఁడునగు లక్ష్మణుండను తమ్ముఁడొక్కఁడుగలఁడు.

అని,తాత్పర్యము.

స తేన సహ సంయుక్తః పావకే నానిలో యథా
శ్రీమాన్ రాజవర స్తేన జనస్థానం నిపాతితమ్. ౧౭

టీక॥శ్రీమాన్= అధికమయినకాంతిగలవాఁడును;రాజవరః = రాజశ్రేష్ఠుఁడునగు;సః= ఆరాముఁడు; తేనసహ= ఆలక్ష్మణునితోఁగూడ; పావకేన = అగ్నిహోత్రునితోఁ; అనిలోయథా= వాయువువలె; సంయుక్తః= కూడియున్నాఁడు. తేన= ఆరాముని చేత;జనస్థానం=జనస్థానము ; నిపాతితం=వధింపఁబడినది.

శ్రీమంతుండును రాజశ్రేష్ఠుండునగునారాముండు, వాయువగ్నిహోత్రునితోఁగూడునట్లు ఆలక్ష్మణునితోఁ

గూడియున్నాఁడు ; ఆరాముఁడెజన స్థానంబునందలి రాక్షసులనందఱవధిం చెను. అని, తాత్పర్యము.

నైవ దేవా మహాత్మానో నాత్ర కార్యా విచారణా

టీక॥ మహాత్మానః= పూజ్యమయి నస్వభావముగల; దేవాః = దేవతలు; నైవ=లేనేలేరు. అత్ర = ఈవిషయము నందు; విచారణా = ఆలోచన; నకార్యా=చేయఁదగినదికాదు.

మహాత్ములగు దేవతలెవ్వరును అచ్చటికివచ్చి, రామునకు సాహాయ్యము సేయనేలేరు; ఈవిషయంబునందు సంశయింపవలసినదిలేదు.

అని, తాత్పర్యము.

శరా రామేణ తూత్సృష్టా రుక్మపుంఖాః పతత్రిణః. ౧౪
సర్పాః పంచాననా భూత్వా భక్షయంతిస్మ రాక్షసాన్

టీక॥ రామేణ=రామునిచేత ; ఉత్సృష్టాః= విడువఁబడిన ; రుక్మపుంఖాః=బంగారుపింజలుగలవియు; పతత్రిణః=ఱెక్కలుగలవియునగు; శరాస్తు=బాణములుమాత్రము ; పంచాననాః=అయిదుతలలుగల; సర్పాః=సర్పములు; భూత్వా = అయి; రాక్షసాన్=రాక్షసులను; భక్షయంతిస్మ= భక్షించినవి.

రామునిచేఁబ్రయోగింపఁబడినకాంచనపుంఖములగు బాణములు , అయిదుతలలపాములయి , రాక్షసులనుభక్షించినవి. అని, తాత్పర్యము.

యేన యేనచ గచ్ఛంతి రాక్షసా భయకర్శితాః. ౧౫
తేన తేన స్మ పశ్యంతి రామ మేవాగ్రత స్థితమ్

టీక॥ రాక్షసాః=రాక్షసులు; భయకర్శితాః=భయముచేఁ గృశింపఁజేయఁబడినవారలయి; యేనయేనచ= ఏయే యాయుధముతోడను; గచ్ఛంతి= పోవు

చున్నారో ; తేనతేన = ఆయాయా యుద్ధముతోడను; అగ్రతః = ముందట; స్థితం = ఉన్న; రామమేవ = రామునే ; పశ్యంతి = చూచిరి.

రాక్షసులు, భయపీడితులయి, యాత్మ సంరక్షణార్థమయియే యాయాధముంగొని యుద్ధంబుగావింపఁబూనుదురో, రాముండునుఆయాయుద్ధంబునే పట్టుకొని వారికెదుటఁగాన్పించుచుండెను. అని, తాత్పర్యము.

ఇత్థం వినాశితం తేన జనస్థానం తవానఘ. ౨౦

టీక॥ అనఘ = పాపరహితుఁడవగు రావణుఁడా! తేన = ఆరామునిచేత; ఇత్థం = ఈప్రకారము; తవ = నీయొక్క ; జనస్థానం = జనస్థానము; వినాశితం = నశింపఁజేయఁబడినది.

పాపరహితుండవగురావణుఁడా! రాముండీప్రకారంబున, నీజనస్థానంబునంతయునాశంబు నొందించెను. అని, యకంపనుఁడు, రావణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

అకంపనవచశ్శ్రుత్వా రావణో వాక్యమబ్రవీత్

టీక॥ రావణః = రావణుఁడు; అకంపనవచః = అకంపనునియొక్క మాటను; శ్రుత్వా = విని; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

రావణుండు, అకంపనుఁడుచెప్పిన మాటనువిని, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

జనస్థానం గమిష్యామి హంతుం రామం సలక్ష్మణమ్. ౨౧

టీక॥ సలక్ష్మణం = లక్ష్మణునితోఁగూడిన; రామం = రాముని; హంతుం = వధించుటకు; జనస్థానం = జనస్థానమునుగూర్చి; గమిష్యామి = పోయెదను.

నేనుజనస్థానంబునకుఁబోయి, రాముని లక్ష్మణునివధించివచ్చెదను. అని, రావణుండకంపనునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

అథైవముక్తే వచనే ప్రోవాచేద మకంపనః

టీక॥ అథ=అంత; ఏవం = ఇట్లు; వచనే=మాట; ఉక్తే = చెప్పఁబడఁగా; అకంపనః = అకంపనుఁడు ; ఇదం=ఈమాటను ; ప్రోవాచ = చెప్పెను.

అట్లు రావణుండు చెప్పినది చూచి, యకంపనుం, డిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

శృణు రాజన్ యథావృత్తం రామస్య బలపౌరుషమ్, ౨౨

టీక॥ రాజన్ = రాక్షసరాజుఁడవగు రావణుఁడా! యథావృత్తం= యథార్థమయిన; రామస్య = రాముని యొక్క; బలపౌరుషం = బలమును బరాక్రమమును; శృణు=వినుము.

రాక్షసరాజుండవగు రావణుఁడా! రాముని బలపరాక్రమంబుల యథార్థముగాఁ, జెప్పెదను, వినుము.

అని, తాత్పర్యము.

అసాధ్యః కుపితో రామో విక్రమేణ మహాయశాః
ఆపగాయాః సుపూర్ణాయా వేగం పరిహరేచ్ఛరైః. ౨౩

టీక॥ మహాయశాః=అధికమయిన కీర్తిగల; రామః=రాముఁడు; అసాధ్యః= సాధింపనలవిగానివాఁడు. కుపితః=కోపించినవాఁడై; విక్రమేణ= పరాక్రమంబుచేత; శరైః=బాణంబులచేత; సుపూర్ణాయాః=చక్కఁగా నిండిన; ఆపగాయాః = నదియొక్క; వేగం=వేగమును; పరిహరేత్ = హరించును.

మహాయశుండగు రాముని సాధింప నేరికినలవిగాదు; అతండు, కోపించునేని , నిండినయేటి ప్రవాహవేగమునుగూడ, బాణంబులచే నిలుపును.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— వాల్మీకిమహాముని , యకంపనవచనవ్యాజంబున శ్రీరాముని యచింత్య శక్తి నభివర్ణించుచున్నారు.—“నదీప్రవాహము నిలుపు” ననుటచే, భవిష్యత్కృష్ణావతారకథ సూచింపఁబడినది.

సతారగ్రహనక్షత్రం నభశ్చాప్యవసాదయేత్

స ३०




టీక॥ సః(అధ్యాహృతము) = ఆ రాముఁడు; స తారగ్రహనక్షత్రం=సాధారణములయినచుక్కలతోను నవగ్రహములతోను నక్షత్రములతోను గూడిన; నభశ్చాపి=ఆకాశమునుగూడ; అవసాదయేత్=నశింపఁజేయును.

ఆ రాముఁడు, నక్షత్రగ్రహంబులతోఁగూడనాకాశంబు నంతయునశింపఁజేయంజాలును. అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఈయర్థశ్లోకార్థమువలనఁ, త్రివిక్రమావతారంబుసూచింపఁబడినది.

అసౌ రామస్తు సీదంతీం శ్రీమా నభ్యుద్ధరే న్మహీమ్. ౨४

టీక॥ శ్రీమాన్=సర్వాధికుఁడగు; అసౌ=ఈ; రామస్తు= రాముఁడే; సీదంతీం=నశించుచున్న; మహీం=భూమిని; అభ్యుద్ధరేత్=లేవనెత్తును.

శ్రీమంతుండగునీ రాముండు, మునిఁగిపోవుచున్న భూమినింగూడ లేవనెత్తును. అని, తాత్పర్యము.

విశేషార్థము.— "భూమినిలేవనెత్తును" అనుటచే, వరాహావతారముసూచింపఁబడినది. లేక; "భూమిని" అనగా భూమియందలిజనులుసంసారసముద్రమునమునింగినజనులనుద్ధరించువాఁడనుట.

భిత్త్వా వేలాం సముద్రస్య లోకానా ప్లావయే ద్విభుః
వేగం వాపి సముద్రస్య వాయుంవా విధమే చ్ఛరైః. ౨५

టీక॥విభుః = స్వతంత్రుండగు రాముండు;సముద్రస్య = సముద్రముయొక్క;వేలాం=చెలియలికట్టను;భిత్త్వా=భేదించి;లోకాన్=లోకములను;ఆప్లావయేత్=ముంచును.శరైః=బాణముల చేత;సముద్రస్య= సముద్రముయొక్క; వేగంవాపి=వేగమునుగాని; వాయుంవా=వాయువునుగాని;విధమేత్=నశింపఁజేయును.

స్వతంత్రుండగు రాముండు, సముద్రముచెలియలికట్టను భేదించి, లోకములనన్నింటిసముద్రజలంబుల ముంచును; బాణంబుల,సముద్రవేగంబుఁగాని, వాయువేగంబుఁగాని,నిలుపును.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— సముద్రజలము




లచేలోకములముంచును" అనుటచే, రాముండె జగత్సంహారంబు గావించువాఁడని చెప్పఁబడినది. "సముద్రంబు నిలుపు"ననుటచే, భవిష్యత్సేతుబంధంబు సూచింపఁబడినది.

సంహృత్యవా పున ర్లోకాన్ విక్రమేణ మహాయశాః
శక్త స్స పురుషవ్యాఘ్రః స్రష్టుం పునరపి ప్రజాః. ౨౬

టీక॥ మహాయశాః= అధికమయిన కీర్తిగలవాఁడునగు; సః=ఆ రాముఁడు; విక్రమేణ=పరాక్రమముచేత; పునః=మఱల; లోకాన్=లోకములను; సంహృత్య=సంహరించి; పునరపి= మఱలను; ప్రజాః=జనులను; స్రష్టుంవా = సృజించుటకుఁగాని; శక్తః= సమర్థుఁడు.

మహాయశుండగు రాముఁడు, పరాక్రమంబున లోకంబులనన్నింటిని సంహరించి, మఱల మొదటనుండి ప్రజల సృజించుటకునుంగూడ సమర్థుఁడు.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన, "సంహారంబు గావించి, యథాపూర్వంబుగా, మఱలలోకంబుల సృజించువాఁడును రాముండెయని" సూచింపఁబడినది.

నహి రామో దశగ్రీవ శక్యో జేతుం త్వయా యుధి
రక్షసాం వాపి లోకేన స్వర్గః పాప జనైరివ. ౨౭

టీక॥ దశగ్రీవ=రావణుఁడా! రామః=రాముఁడు; యుధి = యుద్ధమునందు; త్వయా = నీచేతఁగాని; రక్షసాం= రాక్షసులయొక్క ; లోకేన వాపి= సమూహముచేతఁగాని; స్వర్గః= స్వర్గము ; పాపజనైరివ= పాపజనులచేతవలె ; జేతుం= జయించుటకు; నశక్యోహి = అలవికాఁడుగదా!

రావణుఁడా ! స్వర్గముపాపజనులకుసాధ్యముకానట్లు, నీకుఁగానిమనరాక్షసులయందఱకుఁగాని , యుద్ధంబునరామునిజయింపనలవిగాదు.

అని, తాత్పర్యము.

న తం వధ్య మహం మన్యే సర్వైర్దేవాసురై రపి

టీక॥ అహం=నేను; తం = ఆరామని; దేవాసురైః = దేవతలచేతను అసురులచేతను; సర్వైరపి = అందఱిచేతను; వధ్యం = వధింపఁదగినవానిఁగా; నమన్యే=తలంపను.

దేవాసురులందఱునొక్కటియయినను రాముని వధింపఁజాలరని నేను దలంచెదను. అని, తాత్పర్యము.

అయ మస్య వధోపాయ స్తన్మమైకమనా శ్శృణు. ౨౮

టీ॥ అయం=ఇది, అస్య=ఈరామునియొక్క; వధోపాయః=వధించునుపాయము. తత్ =దానిని; మమ(మత్తః)=నావలన; ఏకమనాః= ఒక్కటైమనస్సుగలవాఁడవై; శృణు=వినుము.

రాముని వధించునుపాయం బొకటియున్నది; దానిం జెప్పెదను వినుము. అని, తాత్పర్యము.

భార్యా తస్యోత్తమా లోకే సీతానామ సుమధ్యమా
శ్యామా సమవిభక్తాంగీ స్త్రీరత్నం రత్నభూషితా. ౨౯

టీక॥ తస్య=ఆరామునకు; లోకే= లోకమునందు; ఉత్తమా= శ్రేష్ఠురాలును; సుమధ్యమా=సుందరమయిన నడుముగలదియు; శ్యామా = యౌవనమధ్యంబుననున్నదియు ;సమ విభక్తాంగీ=ఎచ్చుతక్కువలు లేకవిభజింపఁ బడినయవయవములు గలదియు ; స్త్రీరత్నం=స్త్రీశ్రేష్ఠురాలును; రత్నభూషితా=మణులచేనలంకరింపఁబడినదియునగు; సీతానామ=సీతయనెడు; భార్యా=పెండ్లాము; అస్తి (అధ్యాహృతము)=కలదు.

ఆరామునకు, లోకంబున సమస్త స్త్రీలలో నుత్తమురాలును సుందరమయిన నడుముగలదియు యౌవనమధ్యస్థయును సమముగాఁగుదిరియుండు నవయవములు గలదియు రత్నాలంకారంబులతో నొప్పుచున్నదియునగు సీతయనెడుభార్యగలదు. అని, తాత్పర్యము.

నైవ దేవీ నగంధర్వీ నాప్సరా నాపిదానవీ
తుల్యా సీమంతినీ తస్యా మానుషీషు కుతో భవేత్. ३०

టీక॥ తస్యాః=ఆసీతకు; తుల్యా=సమానయయినః సీమంతినీ = స్త్రీ; దేవీ=దేవభార్య; నైవ= లేనేలేదు. గంధర్వీ=గంధర్వపత్ని; న= లేదు. అప్సరాః=అప్సరస్సు; న=లేదు. దానవ్యపి=దానవపత్నియు; న = లేదు. మానుషీషు = మనుష్యస్త్రీలయందు; కుతః=ఎక్కడ; భవేత్=కలుగును.

ఆసీతకు సరియయినవనిత, దేవతలలోఁగాని గంధర్వులలోఁగాని యప్సరసలలోఁగాని దానవులలోఁగాని లేదు; ఇంకమనుష్యులలో లేదని చెప్పనేల? అని, తాత్పర్యము.

తస్యా పహర భార్యాం త్వం ప్రమథ్యతు మహావనే

టీక॥ త్వం=నీవు; మహావనే=మహారణ్యమునందు; ప్రమథ్యతు= బలాత్కరించియె; తస్య=ఆరామునియొక్క; భార్యాం=పెండ్లామును; అపహర= అపహరింపుము.

నీవామహారణ్యంబునకుఁబోయి, బలాత్కారంబుననారామునిభార్యను దీసికొనిరమ్ము. అని, తాత్పర్యము.

సీతయా రహితః కామీ రామో హాస్యతి జీవితమ్. ३१

టీక॥ కామీ=కాముకుఁడగు; రామః=రాముఁడు; సీతయా= సీతచేత; రహితః= విడువఁబడినవాఁడై; జీవితం=ప్రాణమును; హాస్యతి=విడువఁగలఁడు.

రాముఁడు, కాముకుండుగావునసీతనువిడిచియుండంజాలక, ప్రాణంబులువిడుచును. అని, అకంపనుండు, రావణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఆలోచయత తద్వాక్యం రావణో రాక్షసాధిపః
చింతయిత్వా మహాబాహు రకంపన మువాచ హ. ३२




టీక॥ రాక్షసాధిపః = రాక్షసుల కుఁబ్రభుఁడగు; రావణః = రావణుఁడు; తత్ = ఆ, వాక్యం = మాటను; ఆరోచయత = సరియనితలంచెను. మహాబాహుః = పెద్దచేతులుగలరావణుఁడు; చింతయిత్వా = ఆలోచించి; అకంపనం = అకంపనునిగూర్చి, ఉవాచ = చెప్పెను ("హ" అనునదిపాదపూరణార్థము).

రాక్షసరాజుఁడగురావణుండు, అకంపనుఁడు జెప్పినమాట, చక్కఁగానేయున్నదనితలంచి, యోచించి, యకంపనునింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

బాఢం కాల్యం గమిష్యామి హ్యేక స్సారథినా సహ
ఆనయిష్యామి వైదేహీ మిమాం హృష్టో మహాపురీమ్. ౩౩

టీక॥ బాఢం = మంచిది. అహం (అధ్యాహృతము) = నేను; ఏకః = ఒక్కఁడనై; సారథినాసహ = సారథితోఁగూడ; కాల్యం = (సప్తమ్యర్థమందుద్వితీయ) ప్రాతఃకాలమునందు; గమిష్యామి = పోయెదను. హృష్టః = సంతోషించినవాఁడనై; వైదేహీం = సీతాదేవిని; ఇమాం = ఈ; మహాపురీం = మహాపట్టణమును; ఆనయిష్యామి = పొందించెదను.

మంచిది, నేనొక్కండనె సారథితోఁగూడఁబ్రొద్దున లేచిపోయి, సంతోషంబున, సీతనిచ్చటికిఁదీసికొనివచ్చెదను. అని, తాత్పర్యము.

అథైవ ముక్త్వా ప్రయయౌ ఖరయుక్తేన రావణః
రథేనాదిత్యవర్ణేన దిశ స్సర్వాః ప్రకాశయన్. ౩౪

టీక॥ రావణః = రావణుఁడు; ఏవం = ఇట్లు; ఉక్త్వా = చెప్పి; అథ = అంత; ఖరయుక్తేన = గాడిదలతోఁగూడిన; ఆదిత్యవర్ణేన = సూర్యునియొక్క కాంతివంటికాంతిగల; రథేన = రథముచేత; దిశః = దిక్కులను; సర్వాః = అన్నిటిని; ప్రకాశయన్ = ప్రకాశింపఁజేయుచు; ప్రయయౌ = పోయెను.

రావణుం డీప్రకారంబునం జెప్పి, యాంతఁబ్రాతఃకాలంబున, గాడిదలు




పూన్చినసూర్యప్రభంబగు రథంబు నారోహించి, దిక్కులువెలుంగం జేయుచు, వెడలెను. అని, తాత్పర్యము.

స రథో రాక్షసేంద్రస్య నక్షత్ర పథగో మహాన్
సంచార్యమాణ శ్శుశుభే జలదే చంద్రమాఇవ. ౩౫

టీక॥ నక్షత్రపథగః = నక్షత్రమార్గమున బొందియున్న; మహాన్=గొప్పదగు; సః=ఆ; రాక్షసేంద్రస్య=రాక్షసేశ్వరుఁడగు రావణునియొక్క ; రథః=రథము; సంచార్యమాణః=తోలఁబడుచు; జలదే = మేఘమునందు; చంద్రమాఇవ = చంద్రుఁడువలె ; శుశుభే=ప్రకాశించెను.

ఆకాశంబునందుఁబోవుచున్న యా రాక్షసరాజుండగు రావణుని మహారథము , మేఘమండలంబునందిరుగుచంద్రునిభంగిఁబ్రకాశింపుచుండెను. అని, తాత్పర్యము.

స మారీచా శ్రమం ప్రాప్య తాటకేయ ముపాగమత్

టీక॥ సః=ఆరావణుఁడు ; మారీచాశ్రమం=మారీచునియొక్కయాశ్రమమును; ప్రాప్య=పొంది; తాటకేయం=తాటకకొడుకైనమారీచుని ; ఉపాగమత్=పొందెను.

ఆరావణుఁడుమారీచాశ్రమంబుఁజేరి, యచ్చటఁదేరుడిగ్గి , తాటకాపుత్రుండగుమారీచునొద్దకుఁబోయెను. అని, తాత్పర్యము.

మారీచే నార్చితో రాజా భక్ష్యభోజ్యై రమానుషైః ౩౬

టీక॥ రాజా = రాక్షసరాజుఁడగురావణుఁడు;మారీచేన = మారీచునిచేత;అమానుషైః = మనుష్యసంబంధములుకాని;భక్ష్యభోజ్యైః = పిండివంటలచేతను అన్నాదులచేతను ; అర్చితః=పూజింపఁబడినాఁడు.

మారీచుండు , మనుష్యదుర్లభంబులగుభక్ష్యభోజ్యంబులచే రాక్షసరాజుఁడగురావణునిఁబూజించెను. అని, తాత్పర్యము.

తం స్వయం పూజయిత్వాతు ఆసనే నోదకేనచ
అర్థోపహితయా వాచా మారీచో వాక్య మబ్రవీత్. ౩౭

టీక ॥ మారీచః = మారీచుఁడు; తం=ఆరావణుని; ఆసనేన = ఆసనముచేతను; ఉదకేన = జలముచేతను;స్వయం = తానె; పూజయిత్వాతు=పూజించినంతనె ; అర్థోపహితయా=అర్థముతోఁగూడిన;వాచా=మాటచేత;వాక్యం= మాటను; అబ్రవీత్ =చెప్పెను.

మారీచుండు, ఆసనోదకంబులనా రావణునిఁబూజించి , మహార్థంబగువచనంబున,రావణుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

కచ్చి త్సుకుశలం రాజన్ లోకానాం రాక్షసేశ్వర
ఆశంకే నాథ జానే త్వం యత స్తూర్ణ మిహాగతః. ౩౮

టీక॥ రాక్షసేశ్వర = రాక్షసులకుఁబ్రభుఁడవగు; రాజన్=రావణుఁడా! లోకానాం= రాక్షసజనములకు, సుకుశలంకచ్చిత్ =క్షేమమాయేమిః నాథ= నాథుఁడా! త్వం=నీవు; యతః= ఎందువలన; తూర్ణం= శీఘ్రముగా; ఆగతః = వచ్చినావో; తతః(అధ్యాహృతము)=అందువలన; ఆశంకే=సంశయించెదను. జానే= ఎఱుంగుదును.

రాక్షసరాజుండవగు రావణుఁడా! రాక్షసులందఱు క్షేమమాయేమిః నీవింతశీఘ్రముగా వచ్చుటవలన , నాకు సంశయమగుచున్నది. అని, మారీచుండు,రావణునితోఁజెప్పెను.

అని,తాత్పర్యము.

ఏవ ముక్తో మహాతేజా మారీచేన స రావణః
తతః పశ్చా దిదం వాక్య మబ్రవీ ద్వాక్యకోవిదః. ౩౯

టీక॥మహాతేజాః=అధికమయిన తేజస్సుగలవాఁడును;వాక్యకోవిదః= మాటలయందుఁబండితుండునగు;సః= ఆ; రావణః=రావణుఁడు;మారీచేన; మారీచునిచేత;ఏవం=ఇట్లు;ఉక్తః= చెప్పఁబడినవాఁడై;తతః పశ్చాత్ =అటుపిమ్మ

టః; ఇదం = ఈ, వాక్యం = మాటను, అబ్రవీత్ = చెప్పెను.

మహాతేజుండును మాటలు చెప్పుట యందుఁబండితుండునగు రావణుండు, మారీచుండు చెప్పినమాటను విని, యంతఁ దానిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఆరక్షో మే హతస్తాత రామేణా క్లిష్టకర్మణా
జనస్థాన మవధ్యం త త్సర్వం యుధి నిపాతితమ్. ౪౦

టీక॥ తాత = నాయనా! మే = నా యొక్క; ఆరక్షః = తలారివాఁడు; అక్లిష్టకర్మణా = దుఃఖకరములుకాని కార్యములుగల; రామేణ = రామునిచేత; హతః = చంపఁబడినాఁడు. అవధ్యం = వధింపరాని; తత్ = ఆ; జనస్థానం = జనస్థానము, జనస్థానమందలి రాక్షససమూహమనుట; సర్వం = అంతయు; యుధి = యుద్ధమునందు; నిపాతితం = వధింపఁబడినది.

మారీచుఁడా! నాతలారివాఁడైనఖరుని, రాముండు వధించినాఁడు; మఱియు, ఎట్టివారికివధింప నలవిగానివారలగుజనస్థానమునందలి రాక్షసులందఱు, యుద్ధంబున, రామునిచేహతులయిరి. అని, తాత్పర్యము.

తస్య మే కురు సాచివ్యం తస్య భార్యాపహారణే

టీక॥ తస్య = ఆరామునియొక్క; భార్యాపహారణే = భార్యయొక్కయపహరించుటయందు; తస్య = అట్టి; మే = నాకు; సాచివ్యం = సాహాయ్యము; కురు = చేయుము.

ఆరామునిభార్యనపహరించు విషయమునందు, బంధువులంబోఁగొట్టుకొనియున్ననాకు, నీవుసాహాయ్యంబుగావింపుము. అని, రావణుండు, మారీచునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

రాక్షసేంద్ర వచ శ్శ్రుత్వా మారీచో వాక్య మబ్రవీత్. ౪౧

టీక॥ మారీచః = మారీచుఁడు; రాక్షసేంద్రవచః = రాక్షసరాజుఁడగు రావణునియొక్కమాటను; శ్రుత్వా = విని; వాక్యం = మాటను; అబ్రవీత్ = చె

ప్పెను.

మారీచుండు, రాక్షస రాజుడగు రావణుఁడు చెప్పినమాటనువిని, యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

ఆఖ్యాతా కేన సీతా సా మిత్రరూపేణ శత్రుణా
త్వయా రాక్షస శార్దూల కో న నందతి నిందితః. ౮౨

టీ॥ రాక్షసశార్దూల=రాక్షసశ్రేష్ఠుఁడవగు రావణుఁడా! మిత్ర రూపేణ=స్నేహితరూపంబుగల;శత్రుణా=శత్రువైన; కేన=ఎవ్వనిచేత;సా=ఆ; సీతా=సీత;ఆఖ్యాతా=చెప్పఁబడినది? కః=ఎవ్వఁడు; త్వయా=నీచేత; నిందితః=నిందింపఁబడినవాఁడై; ననందతి=సంతోషింపకున్నాఁడు?

రాక్షస శ్రేష్ఠుండవగు రావణుఁడా! స్నేహితుఁడువలెనటించుచు నీపై విరోధంబుగాని నిన్ను నాశంబు నొందింపఁ దలఁచినవాఁడెవ్వఁడు నీకు సీతపేరుచెప్పెను? ఎవ్వఁడు, నీచే నైశ్వర్యమదంబునఁ దిరస్కృతుండై, నీపైన సూయగానియున్నాఁడు?

అని, తాత్పర్యము.

సీతా మిహానయస్వేతి కో బ్రవీతి బ్రవీహి మే

టీక॥ కః=ఎవ్వఁడు; సీతాం = సీతను;ఇహ=ఇచ్చటికి;ఆనయస్వ = తెమ్ము.ఇతి=అని;బ్రవీతి= చెప్పుచున్నాఁడు? మే=నాకొఱకు ; బ్రవీహి(బ్రూహి)=చెప్పుము.

సీతనిచ్చటికిఁ దెమ్మని యెవ్వఁడునీకుఁజెప్పెను?నాకతనిం జెప్పుము.

అని, తాత్పర్యము.

రక్షో లోకస్య సర్వస్య కశ్శృంగం ఛేత్తు మిచ్ఛతి. ౮౩
ప్రోత్సాహయతి కశ్చి త్త్వాం సచశత్రు రసంశయః

టీక॥ కః=ఎవ్వఁడు; సర్వస్య=సమస్తమయిన;రక్షోలోకస్య = రాక్షసలోకముయొక్క;శృంగం = ప్రధానమును;ఛేత్తుం = ఛేదించుటకు;ఇచ్ఛతి=కోరుచున్నాఁడు?యః (అధ్యాహృతము)=ఎవ్వఁడు;కశ్చిత్ = ఒకానొ

కఁడు; త్వాం=నిన్ను; ప్రోత్సాహయతి=ప్రోత్సాహపఱచుచున్నాఁడో; సచ=అతఁడును; శత్రుః=శత్రువు అసంశయః=సందేహము లేదు.

ఎవ్వఁడు, రాక్షసలోకమునకంతయుఁ బ్రధానభూతుఁడవైననిన్ను నాశంబునొందింపఁగోరినాఁడు? ఎవ్వఁడు నిన్నీవిషయంబునఁ బ్రోత్సాహపఱచుచున్నాఁడో, అతండునీకుశత్రువు; సందేహము లేదు.

అని, తాత్పర్యము.

ఆశీవిష ముఖా ద్దంష్ట్రా ముద్ధర్తుం చేచ్ఛతి త్వయా. ४४

టీక॥ కః (అధ్యాహృతము) = ఎవ్వఁడు; త్వయా = నీచేత; ఆశీవిషముఖాత్ = దుష్టసర్పము నోటనుండి; దంష్ట్రాం = కోఱను; ఉద్ధర్తుంచ = పెఱికించుటకును; ఇచ్ఛతి = కోరుచున్నాఁడు?

ఎవ్వఁడు, నిన్నుఁ గ్రూరసర్పము నోటనుండి కోఱం బెఱుకుమనుచున్నాఁడు?

అని, తాత్పర్యము.

కర్మణా కేన కేనాసి కాపథం ప్రతిపాదితః

టీక॥ కేన = ఎవ్వనిచేత; కేన = ఏ; కర్మణా = కార్యముచేత; కాపథం = దుష్టమార్గమును; ప్రతిపాదితః = పొందింపఁబడినవాఁడవు. అసి = అయితివి.

ఎవ్వండే యుపాయంబున నీకిట్టి దుర్బుద్ధి గలుగునట్లు గావించినాఁడు?

అని, తాత్పర్యము.

సుఖసుప్తస్య తే రాజన్ ప్రహృతం కేన మూర్ధని. ४५

టీక॥ రాజన్ = రాక్షసులకుఁ బ్రభుండవైన రావణుఁడా! సుఖసుప్తస్య = సుఖముగా నిద్రించియున్న; తే = నీయొక్క; మూర్ధని = తలయందు; కేన = ఎవ్వనిచేత; ప్రహృతం = కొట్టఁబడినది?

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! నిష్కారణముగా నెవ్వఁడు నీకు మహానర్థము గలిగింపఁదలంచినాఁడు?

అని, తాత్పర్యము.

విశుద్ధవంశాభిజనాగ్రహ స్త
స్తేజోమద స్సంస్థిత దోర్విషాణః
ఉదీక్షితుం రావణ నేహ యుక్త
స్స సంయుగే రాఘవ గంధహస్తీ. ౪౬

టీక॥ రావణ=రావణుఁడా! విశుద్ధవంశాభిజనాగ్రహస్తః = పరిశుద్ధమయిన వంశమునందుఁ బుట్టుటయనెడునున్నతమయిన తొండముగలదియు; తేజోమదః = ప్రతాపమనుమదముగలదియు, సంస్థితదోర్విషాణః= చక్కనియునికిగలబాహువులను కొమ్ములుగలదియునగు; రాఘవగంధహస్తీ = రాముఁడనుమదపుటేనుఁగు; ఇహ= ఇప్పుడు; సంయుగే = యుద్ధమునందు; ఉదీక్షితుం = తేఱిచూచుటకు; న యుక్తః= అలవికాదు.

రావణుఁడా! పరిశుద్ధమయినవంశమునందుఁబుట్టుటయె తొండముగాఁగలదియుఁ, బ్రతాపమె మదముగాఁగలదియు బాహువులె కొమ్ములుగాఁగలదియునగు, దేనిగంధముమూర్కొనియితరగజంబులుపరుగెత్తునో, అట్టి రాముఁడను మదపుటేనుఁగును, యుద్ధంబునఁదేఱిచూడనైన నలవిగాదు.

అని, తాత్పర్యము.

అసౌ రణాంతస్థితిసంధివాలో
విదగ్ధరక్షో మృగహా నృసింహః
సుప్త స్త్వయా బోధయితుం న యుక్త
శ్శరాంగపూర్ణో నిశితాసిదంష్ట్రః. ౪౭

టీక ॥ రణాంతస్థితిసంధివాలః = యుద్ధాగ్రమునందుండుటయనెడునడుముబొందినతోఁకగలదియు; విదగ్ధరక్షోమృగహా=సమర్థులగు రాక్షసులనుమృగముల వధించునదియు; శరాంగపూర్ణః = బాణములను నఖాద్యవయవములచేనిండినదియు; నిశితాసిదంష్ట్రః= కఱకులయిన కత్తులనుకోఱలుగలదియునగు; సుప్తః = నిదురించిన; నృసింహః= పురుషశ్రేష్ఠుఁడయిన రా

ముఁడను సింహము; త్వయా = నీచేత; బోధయితుం = మేలుకొలుపుటకు; న యుక్తః = తగినదికాదు.

యుద్ధాగ్రంబుననుండుట యెకోపంబున నడుము దాఁకి యుండు వాలంబు గాఁగలదియు శూరులగు రాక్షసులను మృగంబులం జంపునదియు బాణంబులె నఖాద్యవయవములు గాఁ గలదియుఁగ అకుఁ ఖడ్గంబులె కోఱలు గాఁగలదియున గు, నిదురించియున్న రాముండను సింహమును, నీవు మేలుకొలుపఁదగదు.

అని, తాత్పర్యము.

చాపావహారే భుజవేగపంకే
శరోర్మిమాలే సుమహాహవౌఘే
న రామపాతాళ ముఖే తిఘోరే
ప్రస్కందితుం రాక్షసరాజ యుక్తమ్. ४८

టీక॥ రాక్షసరాజ = రాక్షసులకుఁ బ్రభుఁడవైన రావణుఁడా! చాపావహారే = ధనుస్సను మొసలిగలదియు; భుజవేగపంకే = బాహువేగమను నడుసుగలదియు; శరోర్మిమాలే = బాణములనునలలపఙ్క్తి గలదియు; సుమహాహవౌఘే = మిక్కిలియు గొప్పయుద్ధమను ప్రవాహముగలదియు; అతిఘోరే = మిక్కిలియు భయంకరమునగు; రామపాతాళముఖే = రాముఁడను మహాబిలము యొక్క నోట; ప్రస్కందితుం = పడుటకు; న యుక్తం = తగినదికాదు.

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! ధనుస్సను మొసలి గలదియు బాహువేగంబను నడుసుగలదియు బాణంబులను తరంగసమూహముగలదియు యుద్ధంబనుమహాజలప్రవాహముగలదియు మహాభయంకరంబునగు రాముండనుమహాబిలంబు నోటం బడుట, యెంతమాత్రము యుక్తము గాదు. అని, తాత్పర్యము.

ప్రసీద లంకేశ్వర రాక్షసేంద్ర
లంకాం ప్రసన్నో భవ సాధు గచ్ఛ
త్వం స్వేషు దారేషు రమస్వ నిత్యం
రామస్సభార్యో రమతాం వనేషు. ४९

టీక॥లంకేశ్వర = లంకానాధుండవు; రాక్షసేంద్ర = రాక్షసరాజుండవు నగురావణుఁడా! ప్రసీద=ప్రసన్నుఁడవగుము. ప్రసన్నః = కోపమువిడిచినవాఁడవు; భవ=అగుము. సాధు = లెస్సఁగా; లంకాం= లంకనుగూర్చి; గచ్ఛ=పొమ్ము. త్వం=నీవు; నిత్యం= ఎల్లప్పుడును; స్వేషు=నీవారలయిన; దారేషు=భార్యలయందు; రమస్వ= క్రీడింపుము. సభార్యః=భార్యతోఁగూడిన; రామః=రాముఁడు; వనేషు=అడవులయందు; రమతాం=క్రీడించుఁగాక.

లంకానాధుండవు రాక్షస రాజుండవునగు రావణుఁడా! అట్లు కావున నీవుకోపంబువిడువుము; ప్రసన్నుండవయిలంకకుఁబొమ్ము; అచ్చట నీభార్యలంగూడి నానావిధభోగంబుల ననుభవింపుము; రాముండుతనభార్యం గూడియడవులం గ్రీడింపుచుండుఁగాక అని, మారీచుండు, రావణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తో దశగ్రీవో మారీచేన స రావణః
న్యవర్తత పురీం లంకాం వివేశచ గృహోత్తమమ్. ५०

టీక॥సః=ఆ; దశగ్రీవః=పదికంఠములుగల; రావణః=రావణుఁడు; మారీచేన=మారీచునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; లంకాం = లంకయను; పురీం=పట్టణమునుగూర్చి ; న్యవర్తత=మఱలెను. గృహోత్తమం=గృహశ్రేష్ఠమును; వివేశచ = ప్రకాశించెను.

ఆరావణుండు.మారీచుండుచెప్పిన మాటనువిని,మఱలిలంకకుఁ బోయి ,సర్వోత్తమంబగుతనగృహముం బ్రవేశించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే ,
అరణ్యకాండే, ఏకత్రింశస్సర్గః.
ఇది,స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండైకత్రింశసర్గటీక,
ముగిసినది.

౩౨

## ద్వాత్రింశసర్గప్రారంభః.

తత శ్శూర్పణఖీ దృష్ట్వా సహస్రాణి చతుర్దశ
హతా న్యేకేన రామేణ రక్షసాం భీమకర్మణామ్. ౧
దూషణంచ ఖరంచైవ హతం త్రిశిరసా సహ
దృష్ట్వా పున ర్మహానాదం ననాద జలదో యథా. ౨

టీక॥ తతః=అంత; శూర్పణఖీ=శూర్పణఖ; ఏకేన= ఒక్కఁడైన; రామేణ=రామునిచేత; హతాని=వధింపఁబడిన; భీమకర్మణాం= భయంకరములయినకార్యములుగల ; రక్షసాం=రాక్షసులయొక్క; సహస్రాణి = వేలను; చతుర్దశ=పదునాలుగింటిని ; దృష్ట్వా=చూచి; త్రిశిరసాసహ = త్రిశిరునితోఁగూడ; హతం = వధింపఁబడిన; దూషణంచ= దూషణుని; ఖరంచైవ=ఖరుని, దృష్ట్వా= చూచి; పునః=మఱల; జలదోయథా = మేఘమువలె; మహానాదం = అధికమయినధ్వనితోఁగూడునట్లుగా; ననాద=అఱచెను.

అంత, శూర్పణఖ , రాముఁడొక్కఁడె భయంకరపరాక్రములగు పదునాలుగువేలరాక్షసులను దూషణుని ఖరుని త్రిశిరుని వధించుటంజూచి , మఱల , మహాధ్వనిగలుగునట్లు, మేఘంబువలె, గర్జించెను.

అని, తాత్పర్యము.

సా దృష్ట్వా కర్మ రామస్య కృత మన్యై స్సుదుష్కరమ్
జగామ పరమోద్విగ్నా లంకాం రావణపాలితామ్. ౩

టీక॥ సా = ఆశూర్పణఖ ; అన్యైః=ఇతరులచేత; సుదుష్కరం=చేయనలవిగాని; కృతం=చేయఁబడిన; రామస్య=రామునియొక్క ; కర్మ=కార్యమును; దృష్ట్వా=చూచి; పరమోద్విగ్నా= మిక్కిలియుభయమునొంది నదై; రావణపాలితాం = రావణుని చేఁబాలింపఁబడిన; లంకాం=లంకాపు

రిని; జగామ=పొందెను.

ఆశూర్పణఖ, మతియెవ్వరికిని జేయ నలవిగానట్టి రామునికార్యమునుజూచి, మిక్కిలియుభయంబునొంది, రావణ పాలితంబగులంకకుఁబోయెను.

అని, తాత్పర్యము.

సా దదర్శ విమానాగ్రే రావణం దీప్తతేజసమ్
ఉపోపవిష్టం సచివై ర్మరుద్భిరివ వాసవమ్. ౪

టీక॥ సా=ఆశూర్పణఖ ; విమానాగ్రే=పుష్పకవిమానాగ్రమునందు ; సచివైః=మంత్రిచేత; ఉపోపవిష్టం=సమీపమునఁగూర్చుండఁ బడినవాఁడును; మరుద్భిః=దేవతలచేత ; ఉపోపవిష్టం(అధ్యాహృతము)=సమీపమునఁగూర్చుండఁబడిన;వాసవమివ(స్థితం)=ఇంద్రునివలెనున్నవాఁడును; దీప్తతేజసం=ప్రకాశించుచున్న తేజస్సుగలవాఁడునగు; రావణం = రావణుని ; దదర్శ=చూచెను.

ఆశూర్పణఖ, దేవతలతోఁగూడఁ గూర్చుండిన దేవేంద్రుండుంబోలెఁ, బుష్పకవిమానాగ్రంబునమంత్రులతోఁగూడఁగూర్చుండియున్న వాఁడును మహాతేజుండునగు రావణునింజూచెను.

అని, తాత్పర్యము.

ఆసీనం సూర్య సంకాశం కాంచనే పరమాసనే
రుక్మవేదిగతం ప్రాజ్యం జ్వలంతమివ పావకమ్. ౫

టీక॥ సూర్యసంకాశం= సూర్యునితోసమానుఁడును;కాంచనే = బంగారువికారమయిన;ఆసనే = ఆసనమునందు;ఆసీనం= కూర్చుండినవాఁడును;రుక్మవేదిగతం = బంగారువేదినిబొందినదియు;ప్రాజ్యం = అధికమయిన నేయి గలదియు ; జ్వలంతం=మండుచున్నదియునగు;పావకమివ (స్థితం)= అగ్నివలెనున్నవాఁడునగు; రావణందదర్శ (అధ్యాహృతము. ఇట్లుముందును)=రావణునింజూచెను,

సూర్యసమాన తేజుండును గాంచనాసనంబునంగూర్చుండి , బంగారు వేదికయందు హెచ్చుగా నేయిఁవ్రేల్చుటచేజ్వలించుచున్న యగ్నిహోత్రుందుంబోలెఁ దేజరిల్లుచున్న వాఁడునగు

రావణుని, శూర్పణఖ చూచెను. అని, తాత్పర్యము.

దేవగంధర్వభూతానా మృషీణాంచ మహాత్మనామ్
అజేయం సమరే శూరం వ్యాత్తానన మివాంతకమ్. ౬

టీక॥ దేవగంధర్వభూతానాం= దేవతలకును గంధర్వులకును భూతములకును; మహాత్మనాం = అధికమయినప్రభావముగల ; ఋషీణాంచ= ఋషులకును;సమరే = యుద్ధమునందు;అజేయం = జయింపరానివాఁడును;శూరం=యుద్ధమునందు భయములేనివాఁడును;వ్యాత్తాననం = తెఱవఁబడిననోరుగల; అంతకమివ (స్థితం)= యముఁడువలెనున్నవాఁడునగు ; రావణం,దదర్శ=రావణునిఁజూచెను.

దేవతలకుఁగాని గంధర్వులకుఁగాని భూతంబులకుఁగాని మహాత్ములగు ఋషులకుఁగాని, యుద్ధంబున జయింపఁలవిగానివాఁడును శూరుండును నోఱు దెఱచుకొని యుండు యముఁడువలె భయంకరాకారుండునగు రావణుని,శూర్పణఖచూచెను.

అని, తాత్పర్యము.

దేవాసురవిమర్దేషు వజ్రాశనికృతవ్రణమ్
ఐరావతవిషాణాగ్రై రుత్కృష్టకిణవక్షసమ్. ౭

టీక॥ దేవాసురవిమర్దేషు= దేవాసురయుద్ధములందు ; వజ్రాశనికృతవ్రణం= వజ్రాయుధముచేఁ జేయఁబడిన వ్రణములుగలవాఁడును; ఐరావతవిషాణాగ్రైః= ఐరావతముయొక్క కొమ్ముకొనలచేత;ఉత్కృష్టకిణవక్షసం= గీఱుటలచేఁగలిగిన కాయలుగల ఱొమ్ముగలవాఁడునగు; రావణందదర్శ= రావణునిఁజూచెను.

దేవాసుర యుద్ధంబులందు వజ్రాయుధప్రహారంబులచేఁగలిగినగాయములతోఁగూడినవాఁడును, ఐరావతముకొమ్ములతోఁగీఱుటచేఁగలిగిన కాయలతోనొప్పువక్షస్థలంబుగలవాఁడునగు రావణుని,శూర్పణఖ,చూచెను.

అని, తాత్పర్యము.

వింశద్భుజం దశగ్రీవం దర్శనీయపరిచ్ఛదమ్
విశాలవక్షసం వీరం రాజలక్షణశోభితమ్. ౮

టీక॥వింశద్భుజం=ఇరువదిచేతులు గలవాఁడును; దశగ్రీవం=పదికంఠములు గలవాఁడును ; దర్శనీయపరిచ్ఛదం=సుందరములయినఛత్రచామరములు మొదలగునవిగలవాఁడును; విశాలవక్షసం=వెడఁదఱొమ్ముగలవాఁడును; వీరం=పరాక్రమశాలియు ; రాజలక్షణ శోభితం=రాజచిహ్నములచేఁ బ్రకాశించుచున్నవాఁడునగు; రావణం, దదర్శ=రావణునిఁజూచెను.

ఇరువదిచేతులునుబదితలలును గలవాఁడునుసుందరములయిన ఛత్రచామరాదులతోనొప్పుచున్నవాఁడును విశాలంబగుఱొమ్ముగలవాఁడునువీరుఁడును రాజచిహ్నశోభితుండునగు రావణుని, శూర్పణఖ, చూచెను.

అని, తాత్పర్యము.

స్నిగ్ధవైడూర్య సంకాశం తప్తకాంచనకుండలమ్
సుభుజం శుక్లదశనం మహాస్యం పర్వతోపమమ్. ౯

టీక॥స్నిగ్ధవైడూర్యసంకాశం=సుందరములయినవైడూర్యమణులచేఁ బ్రకాశించుచున్నవాఁడును ; తప్తకాంచనకుండలం=కాఁచఁబడినబంగారుపోఁగులుగలవాఁడును; సుభుజం= మంచిబాహువులుగలవాఁడును ; శుక్లదశనం=తెల్లనిదంతములుగలవాఁడును; మహాస్యం=పెద్దనోరుగలవాఁడును; పర్వతోపమం=కొండతోఁబోలిక-గలవాఁడునగు; రావణందదర్శ = రావణునిచూచెను.

ఆభరణస్థగితంబులగుసుందరంబులయినవైడూర్యమణులచేఁ బ్రకాశించుచున్నవాఁడునుద ప్తకాంచనమయంబులగుకుండలంబులుదాల్చినవాఁడును దీర్ఘములుగాగుండ్రములుగానుండుభుజములుకలవాఁడును తెల్లనిదంతములు గలవాఁడును బెద్దనోరువాఁడునుబర్వతాకారుండునగు, రావణుని, శూర్పణఖచూచెను. అని, తాత్పర్యము.

విష్ణుచక్రనిపాతైశ్చ శతశో దేవసంయుగే

అన్యైశ్శస్త్రప్రహారైశ్చ మహాయుద్ధేషు తాడితమ్. ౧౦

టీక॥ దేవసంయుగే=దేవతలయుద్ధమునందు; శతశః=నూఱుమాఱులు; విష్ణుచక్రనిపాతైశ్చ= విష్ణుదేవుని చక్రము యొక్క వ్రేటుల చేతను, మహాయుద్ధేషు=మహాయుద్ధములందు; అన్యైః= ఇతరములయిన; శస్త్రప్రహారైః=ఆయుధముల దెబ్బల చేతను; తాడితం = కొట్టఁబడినవాఁడగు ; రావణం దదర్శ=రావణునిం జూచెను.

దేవతలతో యుద్ధంబు సేయు నప్పుడు, పెక్కు మాఱులు విష్ణుదేవుని చక్రము చేతను, ఇతరములయిన మహాయుద్ధములందు నానావిధములయిన దివ్యాయుధముల చేతను గొట్టబడియు వానిన న్నింటిని సరకు సేయని మహాబలుండగు రావణుని, శూర్పణఖ, చూచెను.

అని, తాత్పర్యము.

ఆహతాంగం సమస్తైశ్చ దేవప్రహరణైస్తథా

అక్షోభ్యాణాం సముద్రాణాం క్షోభణం క్షిప్రకారిణమ్. ౧౧

టీక॥ తథా=అట్లు; సమస్తైః= సమస్తములయిన; దేవప్రహరణైశ్చ= దేవతలయాయుధముల చేతను, ఆహతాంగం=కొట్టఁబడినయవయవములు గలవాఁడును; అక్షోభ్యాణాం= కలఁతపెట్టరాని; సముద్రాణాం= సముద్రముల యొక్క; క్షోభణం= కలఁతపెట్టువాఁడును; క్షిప్రకారిణం= శీఘ్రముగాఁ జేయువాఁడునగు; రావణం, దదర్శ=రావణునిం జూచెను.

అట్లు, దేవతల సమస్తాయుధంబుల చేతను బెక్కుమాఱులు ప్రహరింపఁబడిన దేహముగలవాఁడును అక్షోభ్యములగు సముద్రములకును క్షోభంబు గలిగించువాఁడును, ఏ కార్యము నేని యతివేగంబునం జేయువాఁడునగు, రావణుని, శూర్పణఖ, చూచెను. అని, తాత్పర్యము.

క్షేప్తారం పర్వతేంద్రాణాం సురాణాంచ ప్రమర్దనమ్

ఉచ్ఛేత్తారంచ ధర్మాణాం పరదారాభిమర్శనమ్. ౧౨

టీక॥ పర్వతేంద్రాణాం= పర్వతశ్రేష్ఠముల యొక్క; క్షేప్తారం = ఎగురవే




యువాఁడును; సురాణాం = దేవలయొక్క; ప్రమర్దనంచ = మర్దించువాఁడును; ధర్మాణాం = ధర్మముల యొక్క; ఉచ్ఛేత్తారంచ = ఛేదించువాఁడును; పరదారాభిమర్శనం = పరస్త్రీలఁజెఱుపువాఁడునగు; రావణం, దదర్శ = రావణునింజూచెను.

మహాపర్వతంబుల నెగురవేయువాఁడును దేవతలమర్దించువాఁడును ధర్మములనశింపఁజేయువాఁడును బరస్త్రీగామియునగు రావణుని, శూర్పణఖ చూచెను. అని, తాత్పర్యము.

సర్వదివ్యాస్త్రయోక్తారం యజ్ఞవిఘ్నకరం సదా

టీక॥ సర్వదివ్యాస్త్రయోక్తారం = సమస్తములయినదివ్యాస్త్రములను ప్రయోగించువాఁడును; సదా = ఎల్లప్పుడును; యజ్ఞవిఘ్నకరం = యాగములకువిఘ్నముసేయువాఁడునగు; రావణం, దదర్శ = రావణునింజూచెను.

సమస్తదివ్యాస్త్రంబులనుం బ్రయోగింపఁదెలిసినవాఁడును ఎల్లప్పుడును యాగంబులకు విఘ్నంబు సేయువాఁడునగు రావణుని, శూర్పణఖచూచెను.

అని, తాత్పర్యము.

పురీం భోగవతీం ప్రాప్య పరాజిత్యచ వాసుకిమ్. ౧౩

తక్షకస్య ప్రియాం భార్యాం పరాజిత్య జహార యః

టీక॥ యః = ఎవ్వఁడు; భోగవతీం = భోగవతియను, పురీం = పట్టణమును; ప్రాప్య = పొంది; వాసుకిం = వాసుకిని; పరాజిత్యచ = జయించియు; పరాజిత్య = బలాత్కరించి; తక్షకస్య = తక్షకుని యొక్క; ప్రియాం = ప్రియయగు; భార్యాం = భార్యను; జహార = అపహరించెనో. తం (అధ్యాహృతము) = ఆ; రావణం = రావణుని; దదర్శ = చూచెను.

ఎవ్వఁడు, భోగవతియను సర్పరాజనగరమునకుఁబోయి వాసుకిని జయించి, బలాత్కారంబునఁ దక్షకుని ప్రియభార్యనపహరించెనో, అట్టి రావణుని, శూర్పణఖ, చూచెను.

అని, తాత్పర్యము.




కైలాసపర్వతం గత్వా విజిత్య నరవాహనమ్ ౧౪
విమానం పుష్పకం తస్య కామగం వై జహార యః

టీక॥ యః = ఎవ్వఁడు; కైలాసపర్వతం=కైలాసపర్వతమునుగూర్చి; గత్వా=పోయి; నరవాహనం= కుబేరుని; విజిత్య=జయించి; తస్య= ఆకుబేరునియొక్క; కామగం= ఇచ్ఛచొప్పునఁబోవునట్టి; ("వై" అనునది పాదపూరణార్థము.) పుష్పకం= పుష్పకమను; విమానం=విమానమును; జహార=హరించెనో; తం రావణం దదర్శ = ఆరావణునిఁజూచెను.

ఎవ్వఁడు కైలాస పర్వతంబునకుఁబోయి కుబేరునిజయించి, కామగమనంబగు నతనిపుష్పకవిమానంబునపహరించెనో, అట్టిమహాబలురావణుని, శూర్పణఖ, చూచెను. అని, తాత్పర్యము.

వనం చైత్రరథం దివ్యం నళినీం నందనం వనమ్. ౧౫
వినాశయతి యః క్రోధా ద్దేవోద్యానాని వీర్యవాన్

టీక॥ వీర్యవాన్= అధికమయినపరాక్రమముగల; యః=ఎవ్వఁడు; క్రోధాత్=కోపమువలన; దివ్యం=శ్రేష్ఠమయిన; చైత్రరథం= చైత్రరథమను; వనం=కుబేరునివనమును; నళినీం= కుబేరునిపుష్కరిణిని; నందనం=నందనమను; వనం=ఇంద్రునివనమును; దేవోద్యానాని= దేవతలయుద్యానవనంబులను; వినాశయతి=నశింపఁజేయుచుండెనో; తం, రావణం, దదర్శ= అట్టిరావణునిఁజూచెను.

ఎవ్వఁడు, కుబేరునిచైత్రరథవనంబునుఅతనిపుష్కరిణిని, ఇంద్రునినందనవనంబును, మఱియునితరదేవతలయుద్యానవనంబులను, కోపంబున, నాశంబునొందించెనో, అట్టిమహాపరాక్రమశాలినిరావణుని, శూర్పణఖచూచెను. అని, తాత్పర్యము.

చంద్రసూర్యౌ మహాభాగౌ వుత్తిష్ఠంతౌ పరంతపౌ. ౧౬
నివారయతి బాహుభ్యాం య శ్శైలశిఖరోపమః

టీక॥ శైలశిఖరోపమః= పర్వతశిఖరముతోఁబోలికగల, యః= ఎవ్వఁడు, మహాభాగౌ=పూజ్యమయిన యదృష్టముగలవారలును; పరంతపౌ= శత్రువులనుదపింపఁజేయువారలునగు, ఉత్తిష్ఠంతౌ=ఉదయించుచున్న; చంద్రసూర్యౌ= చంద్ర సూర్యులను ; బాహుభ్యాం=చేతుల చేత; వారయతి= అడ్డగించునో; తం, రావణం, దదర్శ = ఆ రావణునిఁజూచెను,

పర్వతశిఖరాకారుండగు నెవ్వఁడు, మహాభాగులును శత్రువులఁ దపింపఁజేయువారలునగు చంద్రసూర్యులుదయించునప్పుడు, వారలఁ జేతులచే నడ్డగించునో, అట్టి రావణుని, శూర్పణఖ చూచెను. అని, తాత్పర్యము,

దశవర్షసహస్రాణి తపస్తప్త్వా మహావనే ౧౭
పురా స్వయంభువే ధీర శ్శిరాం స్యుపజహార యః

టీక॥ధీరః=ధైర్యశాలియగు; యః= ఎవ్వఁడు, పురా=మున్ను; మహావనే= మహారణ్యమునందు ; వర్షసహస్రాణి=సంవత్సరముల యొక్క వేలు; దశ= పది; తపః=తపస్సును; తప్త్వా=చేసి, స్వయంభువే=బ్రహ్మదేవునికొఱకు; శిరాంసి=తలలను; ఉపజహార= పూజాసాధనములుగాఁ జేసెనో; తం, రావణం, దదర్శ=ఆ రావణునిఁజూచెను.

ఏ ధైర్యశాలి, మున్ను మహావనంబునఁ, బదివేలయేండ్లత్యుగ్రంబుగాఁదపంబుగావించి, తనదలలనుఖండించి, వానిచేఁబ్రహ్మదేవునిఁబూజించెనో, అట్టి రావణుని, శూర్పణఖ, చూచెను. అని, తాత్పర్యము.

దేవదానవ గంధర్వపిశాచపతగోరగైః ౧౮
అభయం యస్య సంగ్రామే మృత్యుతో మానుషాదృతే

టీక॥ యస్య=ఎవ్వనికి; మానుషాదృతే=మనుష్యునివిడిచి ; దేవదానవగంధర్వపిశాచపతగోరగైః = దేవతలచేతను దానవులచేతను పిశాచములచేతను బత్తులచేతను సర్పములచేతను; సంగ్రామే= యుద్ధమునందు; మృత్యుతః=మృత్యువువలన ; అభయం= భయములేదో; తం, రావణం, దదర్శ=

ఆ రావణునిం జూచెను.

ఎవ్వనికి, మనుష్యుండొకఁడుదక్కఁ, దక్కిన దేవదానవ గంధర్వ పిశాచ పతగోరగాదులవలనయుద్ధంబున మరణభయములేదో, ఆ రావణుని, శూర్పణఖ చూచెను.

అని, తాత్పర్యము.

మంత్రై రభిష్టుతం పుణ్య మధ్వరేషు ద్విజాతిభిః. ౧౯
హవిర్ధానేషు యః స్సోమ ముపహంతి మహాబలః

టీక॥ మహాబలః = అధికమయిన బలముగల; యః = ఎవ్వఁడు; అధ్వరేషు = యాగములయందు; ద్విజాతిభిః = బ్రాహ్మణులచేత; మంత్రైః = మంత్రములచేత; అభిష్టుతం = స్తుతింపఁబడినదియు; పుణ్యం = పవిత్రమునగు; హవిర్ధానేషు = యాగశాలలయందలి; సోమం = సోమమును; ఉపహంతి = నశింపఁజేయుచున్నాఁడో, తం, రావణం, దదర్శ = ఆ రావణునిం జూచెను.

ఏమహాబలశాలి, యాగములందు బ్రాహ్మణులచే మంత్రంబుల నభిష్టుతంబును బవిత్రంబునగు యాగశాలలయందలిసోమమునునశింపఁజేయునో, ఆ రావణుని, శూర్పణఖ, చూచెను.

అని, తాత్పర్యము.

ప్రాప్తయజ్ఞహరం క్రూరం బ్రహ్మఘ్నం దుష్టచారిణమ్. ౨౦
కర్కశం నిరనుక్రోశం ప్రజానా మహితే రతమ్

టీక॥ ప్రాప్తయజ్ఞహరం = దక్షిణాకాలమును బొందిన యాగములను హరించువాఁడును; క్రూరం = కఠినుండును; బ్రహ్మఘ్నం = బ్రాహ్మణులవధించువాఁడును; దుష్టచారిణం = దుష్టకార్యములఁజేయువాఁడును; కర్కశం = దాక్షిణ్యములేనివాఁడును; నిరనుక్రోశం = దయలేనివాఁడును; ప్రజానాం = ప్రజలయొక్క; అహితే = కీడునందు; రతం = ఆసక్తుండునగు; రావణం, దదర్శ = రావణునిం జూచెను.

యాగము లంతయుముగిసి దక్షిణనిచ్చుకాలంబునవానిం జెఱచువాఁడును, క్రూరుండును బ్రహ్మహత్యలు గావిం

చినవాఁడును దుర్మార్గుఁడును నిర్దాక్షిణ్యుండును దయలేనివాఁడును బ్రజలకుఁ గీడుసేయువాఁడునగు రావణుని, శూర్పణఖచూచెను.

అని, తాత్పర్యము.

రావణం సర్వభూతానాం సర్వలోకభయావహమ్. ౨౧
రాక్షసీ భ్రాతరం శూరం సా దదర్శ మహాబలమ్

టీక॥ సర్వభూతానాం = సమస్తభూతములయొక్క; రావణం = ఏడ్పించువాఁడును ; సర్వలోకభయావహం= సమస్తలోకంబులకును భయముగలిగించువాఁడును;శూరం = యుద్ధంబునందుభయములేనివాఁడును ; మహాబలం= అధికమయినబలముగలవాఁడునగు;భ్రాతరం = తోఁబుట్టువయిన రావణుని;సా=ఆ;రాక్షసీ= శూర్పణఖ;దదర్శ=చూచెను.

సమస్తభూతంబుల నేడ్పించువాఁడును సమస్తలోకంబులకును భయంబుగలిగించువాఁడును శూరుండును మహాబలశాలియునగు తనసోదరుఁడైన రావణుని, శూర్పణఖచూచెను.

అని, తాత్పర్యము.

తం దివ్యవస్త్రాభరణం దివ్యమాల్యోపశోభితమ్. ౨౨
ఆసనే సూపవిష్టంచ కాలకాల మివోద్యతమ్
రాక్షసేంద్రం మహాభాగం పౌలస్త్యకులనందనమ్. ౨౩
రావణం శత్రుహంతారం మంత్రిభిః పరివారితమ్
అభిగమ్యా బ్రవీ ద్వాక్యం రాక్షసీ భయవిహ్వలా. ౨౪

టీక॥ దివ్యవస్త్రాభరణం = శ్రేష్ఠములయినవస్త్రములును ఆభరణములునుగలవాఁడును ; దివ్యమాల్యోపశోభితం= శ్రేష్ఠములయిన పుష్పమాలికలచేఁబ్రకాశించువాఁడును;ఆసనే = సింహాసనమునందు; సూపవిష్టంచ = చక్కఁగాఁగూర్చుండియున్నవాఁడును; ఉద్యతం=ఉద్యుక్తుండయిన ; కాలకాలమివ (స్థితం)= మృత్యువునకునుమృత్యువువలెనున్నవాఁడును ; రాక్షసేంద్రం=రాక్షసులకుఁబ్రభువును ; మహాభాగం = పూజ్యమయిన యదృష్టము

స ౩౨




గలవాఁడును; పౌలస్త్యకులనందనం= పులస్త్యునకుఁబుట్టినవంశమును సంతోషింపఁజేయువాఁడును ; శత్రుహంతారం= శత్రువులవధించువాఁడును; మంత్రిభిః=మంత్రులచేత ; పరివారితం= పరివేష్టింపఁబడినవాఁడునగు ; తం= ఆ;రావణం= రావణుని; అభిగమ్య= పొంది;రాక్షసీ = శూర్పణఖ;భయవిహ్వాలా= భయముచే నవయవముల స్వాధీనతదప్పినదై;వాక్యం = మాటను;అబ్రవీత్=చెప్పెను.

దివ్య వస్త్రాభరణంబులు దాల్చినవాఁడునుదివ్యపుష్పమాలికలతో నొప్పుచున్నవాఁడునుసింహాసనంబునంజక్కఁగాఁగూర్చుండియున్నవాఁడును లోకసంహారోద్యుక్తుండగు మృత్యుమృత్యువుంబోలెభయంకరాకారుండైయున్నవాఁడును మహాభాగుండునుపౌలస్త్యవంశమునకు సంతోషముగలిగించువాఁడునుశత్రువులవధించువాఁడునుమంత్రులచేఁబరివేష్టింపఁ బడియున్నవాఁడునగు రాక్షసరాజుఁడయినరావణునియొద్దకుఁబోయి,శూర్పణఖ, భయవిహ్వలయయి,యిట్లని,చెప్పెను.

అని,తాత్పర్యము,

తమబ్రవీద్దీప్తవిశాలలోచనం
ప్రదర్శయిత్వా భయమోహమూర్ఛితా
సుదారుణం వాక్యమభీతచారిణీ
మహాత్మనా శూర్పణఖా విరూపితా. ౨౫

టీక॥మహాత్మనా=అధికమయినప్రభావముగలలక్ష్మణుని చేత ; విరూపితా=విరూపగాఁజేయఁబడిన ; అభీతచారిణీ=నిర్భయముగాఁ దిరుగునట్టి; శూర్పణఖా=శూర్పణఖ; ప్రదర్శయిత్వా(ప్రదర్శ్య)= చూపి; దీప్తవిశాలలోచనా=ప్రకాశించుచున్నవిశాలములయినకన్నులుగల;తం= ఆరావణునిగూర్చి;సుదారుణం = మిక్కిలియుభయంకరమయిన;వాక్యం=మాటను;అబ్రవీత్=చెప్పెను.

మహాత్ముండగులక్ష్మణునిచేవిరూపితయయిన నిర్భయముగా సర్వలోకములందిరుగుచుండునట్టిశూర్పణఖ విశాలంబులయివెలుంగుచుండునట్టి కన్నులుగలయారావణుం జూచి , మహాభ




యంకరంబుగానీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
ఆరణ్యకాండే, ద్వాత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండద్వాత్రింశసర్గటీక,
ముగిసినది.



శ్రీ

త్రయస్త్రింశసర్గప్రారంభః.

తత శ్శూర్పణఖా దీనా రావణం లోకరావణమ్
అమాత్యమధ్యే సంక్రుద్ధా పరుషం వాక్య మబ్రవీత్. ౧

టీక॥ తతః = అంత; దీనా = దుఃఖిత యగు; శూర్పణఖా = శూర్పణఖ; సంక్రుద్ధా = కోపించినదై; అమాత్యమధ్యే = మంత్రులనడుమ; లోకరావణం = లోకముల నేడ్పించునట్టి; రావణం = రావణునిగూర్చి; పరుషం = కఠినమయిన; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత, విరూపితయగుటం జేసిదుఃఖితయగుశూర్పణఖ, మంత్రిమధ్యంబున, లోకంబుల నేడ్పించునట్టి రావణుంజూచి, పరమకుపితయయి, పరుషవాక్యంబున, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ప్రమత్తః కామభోగేషు స్వైరవృత్తో నిరంకుశః
సముత్పన్నం భయం ఘోరం బోద్ధవ్యం నావబుధ్యసే. ౨

టీక॥ త్వం (అధ్యాహృతము) = నీవు; ప్రమత్తః = మిక్కిలియు మదించినవాఁడవై; కామభోగేషు = మన్మథ భోగములయందు; స్వైరవృత్తః = యథే

చ్ఛాచారముగలవాఁడవై; నిరంకుశః= ఎదురులేనివాఁడవై; సముత్పన్నం=పుట్టిన; బోద్ధవ్యం= ఎఱుంగఁబడవలసిన; ఘోరం=భయంకరమయిన, భయం = భయమును; నావబుధ్యసే= తెలియక న్నావు.

నీవుమదించి, యెదురులేక యథేచ్ఛంబుగామన్మథ భోగంబులంబడియున్నావు; ఇప్పుడుమహాభయంబు నీకువచ్చినది; ముఖ్యంబుగానీచేతనే చారులవలనఁ దెలిసికొనవలసినదయ్యు, మదోన్మత్తుఁడవగుటచేఁ దెలిసికొనకున్నావు. అని, తాత్పర్యము.

సక్తం గ్రామ్యేషు భోగేషు కామవృత్తం మహీపతిమ్
లుబ్ధం న బహుమన్యంతే శ్మశానాగ్నిమివ ప్రజాః. ౩

టీక॥ప్రజాః=జనులు; గ్రామ్యేషు= నీచములయిన; భోగేషు= భోగములయందు; సక్తం=తగిలినవాఁడును; కామవృత్తం=యథేచ్ఛముగాఁ నాచరించువాఁడును; లుబ్ధం=ఆసగొన్న వాఁడునగు; మహీపతిం=రాజును; శ్మశానాగ్నిమివ=శ్మశానమునందలి యగ్నినివలె; నబహుమన్యంతే= గౌరవింపరు.

ప్రజలు, ఎల్లప్పుడును గ్రామ్య భోగంబులందెతగిలియుండువాఁడును స్వేచ్ఛగానాచరించువాఁడును లుబ్ధుండునగురాజును, శ్మశానాగ్నినివలెఁ జూతురు; ఎంతమాత్రముగౌరవింపరు.

అని, తాత్పర్యము.

స్వయం కార్యాణి యః కాలే నానుతిష్ఠతి పార్థివః
సతు వై సహ రాజ్యేన తైశ్చ కార్యైర్వినశ్యతి. ४

టీక॥యః=ఏ; పార్థివః=రాజు; కాలే=కాలమునందు; కార్యాణి=కార్యములను; స్వయం=తానె; నానుతిష్ఠతి=చేయఁడో; సతు = ఆరాజుమాత్రము ("వై" అనునది పాదపూరణార్థము;) తైః=ఆ; కార్యైశ్చ= కార్యములతోను; రాజ్యేనసహ= రాజ్యముతోనుంగూడ; వినశ్యతి= నశించును.

ఏరాజు, యుక్తకాలంబునఁదనకార్యంబులఁదానేచేసికొనఁడో, అతనికార్యంబులు చెడుటయెగాక, అతండు, రాజ్యంబుఁ బోఁగొట్టుకొని తానును

నశించును. అని, తాత్పర్యము.

అయుక్తచారం దుర్దర్శ మస్వాధీనం నరాధిపమ్
వర్జయంతి నరా దూరా న్నదీపంక మివ ద్విపాః. ౫

టీక॥నరాః=మనుష్యులు; అయుక్తచారం=ఏర్పఱుపఁబడని చారులుగలవాఁడును;దుర్దర్శం= చూడఁగూడనివాఁడును;అస్వాధీనం=తనయధీనతలోలేనివాఁడును,(స్త్రీ)లోలుండుననుట,అగు;నరాధిపం=రాజును;ద్విపాః = ఏనుంగులు;నదీపంకమివ= ఏటియడుసునువలె;దూరాత్=దూరంబున; వర్జయంతి=విడుతురు.

ఏనుంగులు,ఏటియడుసులోనికిఁబోయిననందుఁదగులుకొందుమని దానిదూరంబువదలునట్లు,జనులు, చారులులేనివాఁడునుఅన్యోన్యకాలంబులదర్శనంబొసఁగనివాఁడునుస్త్రీపరతంత్రుండునగు రాజును,అతనితోఁజేరినఁదామునుజెడుదురని,దూరంబునఁబరిత్యజింతురు.

అని, తాత్పర్యము.

యే న రక్షంతి విషయ మస్వాధీనా నరాధిపాః
తే న వృద్ధ్యా ప్రకాశంతే గిరయ స్సాగరే యథా. ౬

టీక॥ యే=ఏ;అస్వాధీనాః= స్త్రీపరతంత్రులగు;నరాధిపాః= రాజులు;విషయం=దేశమును;నరక్షంతి=రక్షింపరో; తే=వారలు;సాగరే=సముద్రమునందు;గిరయోయథా = పర్వతములువలె;వృద్ధ్యా=వృద్ధిచేత ; నప్రకాశంతే=ప్రకాశింపరు.

సముద్రంబునందుమునింగిన పర్వతములుప్రకాశింపనట్లు,స్త్రీపరతంత్రులయిదేశమును జక్కఁగారక్షింపని రాజులు,వృద్ధినొందిప్రకాశింపరు.

అని, తాత్పర్యము.

ఆత్మవద్భి ర్విగృహ్య త్వం దేవగంధర్వదానవైః
అయుక్తచార శ్చపలః కథం రాజా భవిష్యసి. ౭

టీక॥ త్వం=నీవు; ఆత్మవద్భిః= బలవంతులగు; దేవగంధర్వదానవైః= దేవతలతోను గంధర్వులతోను దానవులతోను; విగృహ్య=విరోధము చేసి; అయుక్తచారః=ఏర్పఱుపఁబడని చారులుగలవాఁడవై; చపలః=చంచలుండవై ; కథం=ఎట్లు; రాజా=రాజుగా ; భవిష్యసి=ఉండఁగలవు?

నీవు, బలవంతులగు దేవగంధర్వదానవులతో విరోధము చేసికొని, యిట్లు, చారులనేర్పఱచుకొనక విషయలోలుండవై యున్నయెడ, నెట్లు దొరతనము దక్కించుకొనఁగలవు? అని, తాత్పర్యము.

త్వంతు బాలస్వభావశ్చ బుద్ధిహీనశ్చ రాక్షస
జ్ఞాతవ్యంతు నజానీషే కథం రాజా భవిష్యసి. ౮

టీక॥ రాక్షస = రావణుఁడా ! త్వంతు=నీవో; బాలస్వభావశ్చ = పిన్నవానిస్వభావమువంటి స్వభావముగలవాఁడవును; బుద్ధిహీనశ్చ = బుద్ధిచేఁ విడువఁబడినవాఁడవును. జ్ఞాతవ్యంతు= తెలియఁబడవలసినదానినే ; నజానీషే=ఎఱుంగవు. కథం = ఎట్లు; రాజా=రాజుగా; భవిష్యసి = ఉండఁగలవు?

రావణుఁడా ! నీవు, బాలునివంటివాఁడవు; బుద్ధిహీనుండవు ; దేనిముఖ్యముగాఁ దెలిసికొనవలెనో , దానింగూడఁ దెలిసికొనకున్నావు; నీవెట్లు దొరతనము సేయఁగలవు?

అని, తాత్పర్యము.

యేషాం చారశ్చ కోశశ్చ నయశ్చ జయతాం వర
అస్వాధీనా నరేంద్రాణాం ప్రాకృతాస్తే జనైస్సమాః. ౯

టీక॥ జయతాం = జయించువారలలోపల; వర = శ్రేష్ఠుఁడవగు రావణుఁడా! యేషాం=ఏ; నరేంద్రాణాం= రాజులకు; చారశ్చ= వేగులవాఁడును; కోశశ్చ=బొక్కసమును ; నయశ్చ= నీతియును; అస్వాధీనాః = స్వాధీనములుకావో; తే = ఆరాజులు; ప్రాకృతైః=మూఢులగు; జనైః = జనులతో;

సమాః=సమానులు.

జయించువారలలో శ్రేష్ఠుఁడవగు రావణుఁడా ! ఏ రాజులు చారులను బొక్కసమును నీతిని ఏర్పఱచుకొనకుందురో , వారలు , సాధారణ మూఢజనులవంటివార లే.

అని, తాత్పర్యము.

యస్మాత్పశ్యంతి దూరస్థాన్ సర్వా నర్థా న్నరాధిపాః
చారేణ తస్మా దుచ్యంతే రాజానో దీర్ఘచక్షుషః. ౧౦

టీక॥ యస్మాత్ = ఏకారణమువలన; నరాధిపాః= రాజులు; చారేణ= వేగులవానిచేత; దూరస్థాన్= దూరంబుననుండునట్టి; సర్వాన్= సమస్తములయిన; అర్థాన్ = సమాచారములను; పశ్యంతి = చూచుచున్నారో; తస్మాత్ =అందువలన, రాజానః = రాజులు; దీర్ఘచక్షుషః = దీర్ఘములయినకన్నులుగలవారలుగా ; ఉచ్యంతే=చెప్పఁబడుచున్నారు.

రాజులు, చారులవలన, బహుదూరంబున జరగినసమాచారంబుల నన్నింటినిం దెలిసికొందురు కావున , వారలకు దీర్ఘనేత్రులను పేరువచ్చినది.

అని, తాత్పర్యము.

అయుక్తచారం మన్యే త్వాం ప్రాకృతైః సచివైర్వృతమ్
స్వజనంతు జనస్థానం హతం యో నావబుధ్యసే. ౧౧

టీక॥ యః(త్వం)=ఏనీవు; హతం= వధింపఁబడిన; జనస్థానం = జనస్థానమునవున్న; స్వజనంతు=బంధుజనమునే; నావబుధ్యసే = ఎఱుంగకున్నావో ; తం(అధ్యాహృతము)=అట్టి; త్వాం= నిన్ను; అయుక్తచారం= ఏర్పఱుపఁబడనిచారులుగలవానిఁగాను; ప్రాకృతైః=మూఢులయిన; సచివైః = మంత్రులచే; వృతం=చుట్టఁబడినవానిఁగాను; మన్యే=తలంచెదను.

నీవు, జనస్థానంబునబంధుజనులందఱు హతులయిన సంగతినింగూడ దెలిసికొనకున్నావు, కావున, నీవు చారులనే యుంచుకొనలేదనియు నీమంత్రులందఱు మూఢులనియుం దలంచెదను.

అని, తాత్పర్యము.

చతుర్దశ సహస్రాణి రక్షసాం క్రూరకర్మణామ్
హతా న్యేకేన రామేణ ఖరశ్చ సహదూషణః. ౧౨

టీక॥ ఏకేన = ఒక్కఁడైన; రామేణ=రామునిచేత; క్రూరకర్మణాం= క్రూరములయినకార్యములుగల; రక్షసాం= రాక్షసులయొక్క; సహస్రాణి=వేలు; చతుర్దశ= పదునాలుగు; హతాని= చంపఁబడినవి. సహదూషణః=దూషణునితోఁగూడిన; ఖరశ్చ = ఖరుఁడును; హతః(అధ్యాహృతము)= చంపఁబడినాఁడు.

రాముండొక్కఁడు, భయంకరపరాక్రములగు పదునాలుగువేల రాక్షసులను ఖరునిదూషణునింగూడ, వధించెను. అని, తాత్పర్యము.

ఋషీణా మభయం దత్తం కృతక్షేమాశ్చ దండకాః
ధర్షితంచ జనస్థానం రామేణా క్లిష్టకర్మణా. ౧౩

టీక॥ అక్లిష్టకర్మణా = దుఃఖకరముకానికార్యముగల ; రామేణ= రామునిచేత ; ఋషీణాం = ఋషులకు; అభయం= భయములేమి; దత్తం=ఇయ్యఁబడినది. దండకాశ్చ=దండకలును; కృతక్షేమాః=చేయఁబడినక్షేమముగలవి. జనస్థానంచ=జనస్థానమును; ధర్షితం=ధర్షింపఁబడినది.

అక్లిష్టకర్ముఁడగు రాముండు, ఋషులకభయంబొసంగి, జనస్థానంబునందలిరాక్షసులనందఱ వధించి, దండకారణ్యంబుననేవిధమయిన బాధయు లేకుండునట్లుగావించెను.

అని, తాత్పర్యము.

త్వంతు లుబ్ధః ప్రమత్తశ్చ పరాధీనశ్చ రావణ
విషయే స్వే సముత్పన్నం భయం యో నావబుధ్యసే. ౧౪

టీక॥ రావణ=రావణుఁడా ! యః(త్వం)=ఏనీవు; స్వే= తనదైన; విషయే=దేశమునందు; సముత్పన్నం=పుట్టిన; భయం = భయమును; నావబుధ్యసే=ఎఱుంగకున్నావో; సః(అధ్యాహృతము)=అట్టి; త్వంతు=నీవుమాత్ర

ము; లుబ్ధః = కృపణుండవు; ప్రమత్తశ్చ=ఏమఱియుండువాఁడవును ; పరాధీనశ్చ= ఇతరులయినస్త్రీల యధీనుండవును.

రావణుఁడా! నీవు,నీదేశంబునందు మహాభయంబుగలిగియుండుటను దెలిసికొనఁజాలకున్నావే; కావున,నీవుకృపణుండవు; జాగ్రత్తలేనివాఁడవు ; స్త్రీలోలుండవు. అని, తాత్పర్యము.

తీక్ష్ణ మల్పప్రదాతారం ప్రమత్తం గర్వితం శఠమ్
వ్యసనే సర్వభూతాని నాభిధావంతి పార్థివమ్. ౧౫

టీక॥తీక్ష్ణం=క్రూరుండును; అల్పప్రదాతారం=కొంచెమిచ్చువాఁడును;ప్రమత్తం=ఏమఱియున్నవాఁడును; గర్వితం=గర్వించినవాఁడును,శఠం= రహస్యముగానప్రియముచేయువాఁడునగు, పార్థివం=రాజును;వ్యసనే=కష్టమునందు;సర్వభూతాని= సమస్తజనులును;నాభిధావంతి= ఎదురొంగని పరుగెత్తరు.

క్రూరుండును ఎంతకార్యముచేసిననుగొంచెముగానిచ్చు వాఁడును బ్రమత్తుండునుగర్వితుండును బైకి మంచివాఁడుగానుండి రహస్యముగా నప్రియము గావించువాఁడునగు రాజునకు , ఆపద వచ్చినప్పుడు, జనులెవ్వరును , అతనిరక్షింపరారు. అని, తాత్పర్యము.

అతిమానిన మగ్రాహ్య మాత్మసంభావితం నరమ్
క్రోధినం వ్యసనే హంతి స్వజనోపి మహీపతిమ్. ౧౬

టీక॥అతిమానినం= అధికమయిన యహంకారముగలవాఁడును ; అగ్రాహ్యం=గ్రహింపరానివాఁడును; ఆత్మసంభావితం=తనచేతనెగౌరవింపఁ బడువాఁడును;క్రోధినం= అధికమయిన కోపముగలవాఁడునగు;నరం = మనుష్యుఁడైన;మహీపతిం=రాజును; వ్యసనే=కష్టమునందు;స్వజనోపి= తనజనముగూడ;హంతి=వధించును.

మిక్కిలియైనహంకారముగలవాఁడును సత్పురుషులకగ్రాహ్యుండును దన్నుఁదానెపొగడుకొనువాఁడును అకా

లంబునందుమిక్కిలియుఁగోపపడువాఁడునగు రాజునకు, ఆపదవచ్చినప్పుడు, స్వజనులునుఅతనివధింతురు.
అని, తాత్పర్యము.

నానుతిష్ఠతి కార్యాణి భయేషు నబిభేతిచ
క్షిప్రం రాజ్యాచ్చ్యుతో దీన స్తృణై స్తుల్యో భవిష్యతి. ౧౭

టీక॥యః(అధ్యాహృతము) = ఏ రాజు;కార్యాణి=పనులను; నానుతిష్ఠతి=చేయఁడో;భయేషు= భయములందు;నబిభేతిచ=భయపడఁడో; సః (అధ్యాహృతము)=ఆ రాజు;రాజ్యాత్ = రాజ్యముననుండి; చ్యుతః=భ్రష్టుండై; దీనః=గర్వంబుడిగినవాఁడై;తృణైః= గడ్డిపోచలతో;తుల్యః = సమానుఁడు; భవిష్యతి=కాఁగలఁడు.
ఏరాజు,కార్యంబుల నవ్వ్యైకాలంబులందుసరిగాఁజేయక,భయములు వచ్చునప్పుడు , జాగ్రత్త నొందకుండునో;అతండు,శీఘ్రింబునరాజ్య భ్రష్టుండై,గర్వంబుడిగి,తృణంబువంటివాఁడగును.అని, తాత్పర్యము.

శుష్కైః కాష్ఠై ర్భవే త్కార్యం లోష్టైరపిచ పాంసుభిః
నతుస్థానా త్పరిభ్రష్టైః కార్యం స్యా ద్వసుధాధిపైః. ౧౮

టీక॥శుష్కైః=ఎండిన; కాష్ఠైః= కొయ్యలచేతను;లోష్టైరపిచ=మట్టిగడ్డలచేతను;పాంసుభిః=దుమ్ములచేతను; కార్యం=ప్రయోజనము ; భవేత్ = ఉండును.స్థానాత్ =స్థానముననుండి;పరిభ్రష్టైః= జాఱిన ; వసుధాధిపైః=రాజులచేతమాత్రము; కార్యం= ప్రయోజనము;నస్యాత్ =ఉండదు.
ఎండుకొయ్యలచేతనుమట్టిగడ్డలచేతనుదుమ్ముచేతనుగార్యముండును గాని, రాజ్యభ్రష్టులగురాజులచే నెంతమాత్రము ప్రయోజనములేదు.
అని, తాత్పర్యము.

ఉపభుక్తం యథా వాస స్స్రజో వా మృదితా యథా
ఏవం రాజ్యా త్పరిభ్రష్ట స్సమర్థోఽపి నిరర్థకః. ౧౯




టీక॥ఉపభుక్తం= అనుభవింపఁబడిన; వాసః=వస్త్రము; యథా=ఎట్లో; మృదితాః=నలపఁబడిన ; స్రజోవా= పుష్పమాలికలు గాని; యథా= ఎట్లో; ఏవం=ఇట్లు; రాజ్యాత్= రాజ్యంబుననుండి; పరిభ్రష్టః=జాఱినవాఁడు; సమర్థోఽపి=గట్టివాఁడైనను; నిరర్థకః= నిష్ప్రయోజనుఁడు.

కట్టుకొని విడువఁబడిన వస్త్రము, ఎట్లు, ఇతరులకుపయోగింపదో, ధరించి విడిచినపుష్పమాలికలు, ఎట్లు ఇతరులకు పయోగింపవో; అట్లు, రాజ్యభ్రష్టుండగు రాజు, ఎంతగట్టివాఁడైనను, ఎంతమాత్రముఁ బ్రయోజనకారి కాఁడు.

అని, తాత్పర్యము.

అప్రమత్తశ్చ యో రాజా సర్వజ్ఞో విజితేంద్రియః
కృతజ్ఞో ధర్మశీలశ్చ స రాజా తిష్ఠతే చిరమ్. ౨౦

టీక॥యః=ఏ; రాజా=రాజు; అప్రమత్తశ్చ= ఏమఱుపాటులేనివాఁడును; సర్వజ్ఞః=సమస్తము దెలిసినవాఁడును; విజితేంద్రియః= జయింపఁబడిన యింద్రియములుగలవాఁడును; కృతజ్ఞః= చేయఁబడినయుపకారమును దెలిసినవాఁడును; ధర్మశీలశ్చ= ధర్మస్వభావుండునో; సః=ఆ; రాజా= రాజు; చిరం=బహుకాలము; తిష్ఠతే=ఉండును.

ఏ రాజు, ఏమఱుపాటులేక, సర్వజ్ఞుండును జితేంద్రియుండును గృతజ్ఞుండును ధార్మికుండునై యుండునో, అతండు, బహుకాలము, సుఖముగా రాజ్యముఁ బాలించుచుండును.

అని, తాత్పర్యము.

నయనాభ్యాం ప్రసుప్తోఽపి జాగర్తి నయచక్షుషా
వ్యక్తక్రోధప్రసాదశ్చ స రాజా పూజ్యతే జనైః. ౨౧

టీక॥ యః(అధ్యాహృతము)= ఏ రాజు; నయనాభ్యాం = కన్నులచేత; ప్రసుప్తోఽపి = నిదురించినవాఁడైనను; నయచక్షుషా= నీతియనుకన్ను చేత; జాగర్తి= మేలుకొనియుండునో ; వ్యక్తక్రోధప్రసాదశ్చ = స్పష్టములయి




న కోపమునుఅనుగ్రహమును గలవాఁడునో;సః=ఆ;రాజా=రాజు; జనైః=జనులచేత;పూజ్యతే = పూజింపఁబడుచున్నాఁడు.

ఎవ్వఁడు,చర్మనేత్రములచే నిదురపోవు చుండినను, నీతివిషయమయియెంతమాత్రమునేమఱకుండునో, మఱియు నెవ్వని నిగ్రహానుగ్రహములు వ్యర్థములు గాకుండునో, ఆరాజును జనులుపూజింతురు.

అని, తాత్పర్యము.

త్వంతు రావణ దుర్బుద్ధి ర్గుణై రేతై ర్వివర్జితః
యస్య తేఽ విదిత శ్చారై రక్షసాం సుమహాన్ వధః. ౨౨

టీక॥ రావణ=రావణుఁడా! యస్య=ఏ; తే=నీకు; రక్షసాం = రాక్షసులయొక్క; సుమహాన్ = మిక్కిలి యుగొప్పదగు;వధః = చంపుట;చారైః=వేగులవారలచేత;అవిదితః= తెలియఁబడకున్నదో; సః (అధ్యాహృతము)= అట్టి;త్వంతు= నీవుమాత్రము; దుర్బుద్ధిః=దుష్టబుద్ధిఁగలవాఁడవు. ఏతైః=ఈ;గుణైః=గుణములచేత ; వివర్జితః=విడువఁబడినవాఁడవు.

రావణుఁడా! నీవుజనస్థానంబున, రాక్షసులందఱును వధింపఁబడినసంగతిని, జారులచేనిదివఱకుఁ దెలిసికొనకున్నావుకావున, దుర్బుద్ధివగు నీయందిప్పుడు చెప్పిన రాజాహగుణంబులెంతమాత్రములేవు.

అని, తాత్పర్యము.

పరావమంతా విషయేషు సంగతో
న దేశకాలప్రవిభాగతత్త్వవిత్
అయుక్తబుద్ధి గుణదోషనిశ్చయే
విపన్నరాజ్యో న చిరా ద్విపత్స్యసే. ౨౩

టీక॥త్వం(అధ్యాహృతము)=నీవు; పరావమంతా =ఇతరులనవమానించువాఁడవు.విషయేషు=విషయములందు; సంగతః=ఆసక్తుండవు. దేశకాల ప్ర

విభాగతత్త్వవిత్ = దేశకాలములవిభాగముయొక్కతత్త్వముఁదెలిసినవాఁడవు; న=కావు. గుణదోషనిశ్చయే=గుణదోషంబులనునిశ్చయించుటయందు; అయుక్తబుద్ధిః=ప్రవేశింపనిబుద్ధిగలవాఁడవు. నచిరాత్=శీఘ్రముగనే; విపన్నరాజ్యః=నశించినరాజ్యముగలవాఁడవై; విపత్స్యసే=నాశమునొందఁగలవు.

నీవు, పరులనవమానించువాఁడవు; విషయోపభోగంబులందగిలినవాఁడవు; ఏదేశంబుననేకాలంబుననేదిచేయవలసినదో దానిం దెలియనివాఁడవు; గుణదోషంబులనిశ్చయింపఁజాలనివాఁడవు; కావున, నీవు, శీఘ్రంబునభ్రష్టరాజ్యుండవై, నశియింపంగలవు. అని, శూర్పణఖ, రావణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి స్వదోషాః పరికీర్తితా స్తయా
సమీక్ష్య బుద్ధ్యా క్షణదాచరేశ్వరః
ధనేన దర్పేణ బలేన చాన్వితో
విచింతయామాస చిరం స రావణః. ౨౪

టీక॥ ధనేన=ధనముతోను; దర్పేణ=గర్వముతోను; బలేనచ= బలముతోను; అన్వితః=కూడిన; క్షణదాచరేశ్వరః=రాక్షసులకుఁబ్రభుండగు; సః=ఆ; రావణః=రావణుఁడు; ఇతి=ఇట్లు; తయా = ఆశూర్పణఖచేత; పరికీర్తితాః=చెప్పఁబడిన; స్వదోషాః = తనదోషములను; బుద్ధ్యా=బుద్ధిచేత; సమీక్ష్య=చూచి; చిరం= బహుకాలము; విచింతయామాస=ఆలోచించెను.

ధనంబునుగర్వంబును బలంబునుంగలరాక్షసేశ్వరుండగు రావణుండు, ఇట్లుశూర్పణఖ చెప్పిన తనదోషంబులన్నియు స్వబుద్ధిచేఁజూచుకొని, బహుకాలమాలోచించెను.

అని, తాత్పర్యము,

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, 
ఆరణ్యకాండే, త్రయస్త్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండత్రయస్త్రింశసర్గటీక,
ముగిసినది.



శ్రీ

## చతుస్త్రింశసర్గప్రారంభః.

తత శ్శూర్పణఖాం క్రుద్ధాం బ్రువంతీం పరుషం వచః
అమాత్యమధ్యే సంక్రుద్ధః పరిపప్రచ్ఛ రావణః. ౧

టీక॥ తతః=అంత; రావణః=రావణుఁడు; సంక్రుద్ధః=కోపించినవాఁడై; క్రుద్ధాం=కోపించినదియు; పరుషం=కఠినమయిన; వచః=మాటను; బ్రువంతీం=చెప్పుచున్నదియునగు; శూర్పణఖాం=శూర్పణఖను; అమాత్యమధ్యే=మంత్రులనడుమ; పరిపప్రచ్ఛ=అడిగెను.

అంత, రావణుండు, ఖరాదివధంబు వినుటచేఁగ్రుద్ధుండై, కుపితయయి పరుషంబుగామాటలాడుచున్న శూర్పణఖంబూచి, మంత్రిమధ్యంబున, నిట్లనియడిగెను. అని, తాత్పర్యము.

కశ్చ రామః కథం వీర్యః కింరూపః కింపరాక్రమః
కిమర్థం దండకారణ్యం ప్రవిష్ట స్సుదురాసదమ్. ౨

టీక॥ రామశ్చ=రాముండును; కః=ఎవ్వఁడు? కథంవీర్యః=ఎట్టివీర్యముగలవాఁడు? కింరూపః=ఎట్టిరూపముగలవాఁడు? కింపరాక్రమః=ఎట్టిపరాక్రమముగలవాఁడు? కిమర్థం=ఎందుకొఱకు; సుదురాసదం=పొందఁగూడని; దండకారణ్యం=దండకారణ్యమును; ప్రవిష్టః=ప్రవేశించినాఁడు?

రాముండెవ్వఁడు? అతనివీర్యమెట్టిది? అతనిపరాక్రమమెట్టిది? అతఁడే

రూపముగలవాఁడు? అతండు ఎట్టివారికినిజొరరాని దండకారణ్యంబున కేల వచ్చినాఁడు? అని, తాత్పర్యము.

ఆయుధం కించ రామస్య నిహతా యేన రాక్షసాః
ఖరశ్చ నిహత స్సంఖ్యే దూషణ స్త్రిశిరా స్తథా. ౩

టీక॥ యేన= దేనిచేత; సంఖ్యే= యుద్ధమునందు; రాక్షసాః = రాక్షసులు;నిహతాః= వధింపఁబడినారో; ఖరశ్చ=ఖరుండును;దూషణః = దూషణుఁడును;తథా=అట్లు; త్రిశిరాః= త్రిశిరుఁడును; నిహతః = వధింపఁబడినాఁడో, తత్ (అధ్యాహృతము)= అట్టి,రామస్య=రామునియొక్క ; ఆయుధంచ = ఆయుధమును ; కిం= ఏది?

దేనిచేత,రాముండు , యుద్ధంబున , ఖరుండు దూషణుండు త్రిశిరుండు మొదలుగాఁ బదునాలుగువేల రాక్షసులంజంపెనో , ఆయాయుధంబెద్ది ? అని, రావణుండు , శూర్పణఖనడిగెను. అని,తాత్పర్యము.

ఇత్యుక్తా రాక్షసేంద్రేణ రాక్షసీ క్రోధమూర్ఛితా
తతో రామం యథాతత్త్వ మాఖ్యాతు ముపచక్రమే. ౪

టీక॥ క్రోధమూర్ఛితా= కోపముచే వ్యాపింపఁబడిన;రాక్షసీ= శూర్పణఖ;రాక్షసేంద్రేణ = రాక్షసులకుఁ బ్రభువగు రావణునిచేత;ఇతి = ఇట్లు, ఉక్తా=చెప్పఁబడినదై;తతః = అంత; రామం=రాముని ; యథాతత్త్వం= యథార్థమనతిక్రమింపక ; ఆఖ్యాతుం=చెప్పుటకు;ఉపచక్రమే = ఆరంభించెను.

పరమకుపితయయిన శూర్పణఖ, రాక్షసేశ్వరుండగు రావణుండుచెప్పినమాటనువిని, యంత , రామునిస్వరూపంబును యథార్థంబుగాఁ జెప్పనారంభించెను.అని,తాత్పర్యము.

దీర్ఘబాహు ర్విశాలాక్ష శ్చీరకృష్ణాజినాంబరః

కందర్ప సమరూపశ్చ రామో దశరథాత్మజః. ౫

టీక॥దశరథాత్మజః= దశరథునికొడుకైన; రామః=రాముఁడు; దీర్ఘబాహుః = నిడుపులయినచేతులుగలవాఁడు. విశాలాక్షః=వెడల్పులయినకన్నులుగలవాఁడు. చీరకృష్ణాజినాంబరః= నారచీరలును కృష్ణాజినమును వస్త్రముగాఁగలవాఁడు. కందర్ప సమరూపశ్చ=మన్మథునితో సమాన మయిన రూపముగలవాఁడును.

దశరథపుత్రుఁడగురాముఁడు , ఆజానుబాహుఁడు; విశాలములయిన కన్నులుగలవాఁడు; నార చీరలును కృష్ణాజినంబును గట్టుకొని యున్నవాఁడు; మన్మథుంబోలురూపము గలవాఁడు. అని, తాత్పర్యము.

శక్రచాపనిభం చాపం వికృష్య కనకాంగదమ్
దీప్తాన్ క్షిపతి నారాచాన్ సర్పానివ మహావిషాన్. ౬

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాముఁడు; శక్రచాపనిభం = ఇంద్రధనుస్సుతోసమమైనదియు;కనకాంగదం = బంగారువికారిమయినపట్టబంధముగలదియునగు; చాపం= ధనుస్సును; వికృష్య=ఆకర్షించి; మహావిషాన్=అధికమయిన విషముగల; సర్పానివ (స్థితాన్) = సర్పములువలెనున్న ; దీప్తాన్ = ప్రకాశించుచున్న; నారాచాన్=బాణములను; క్షిపతి = విడుచును.

ఆరాముఁడు,బంగారుపట్టబంధముగల యింద్రధనుస్సువంటి ధనుస్సు నాకర్షించి, మహావిషంబులగు సర్పంబులవంటి తీక్ష్ణబాణంబుల విడుచును.
అని, తాత్పర్యము.

నాదదానం శరాన్ ఘోరా న్న ముంచంతం శిలీముఖాన్
న కార్ముకం వికర్షంతం రామం పశ్యామి సంయుగే. ౭

టీక॥అహం (అధ్యాహృతము) = నేను; సంయుగే=యుద్ధమునందు;రామం=రాముని, ఘోరాన్= భయంకరములయిన; శరాన్=బాణములను ;




ఆదదానం=గ్రహించువాని ; నపశ్యామి=చూడను. శిలీముఖాన్=బాణములను; ముంచంతం=విడుచుచున్నవాని ; న(పశ్యామి)=చూడను. కార్ముకం=ధనుస్సును; వికర్షంతం = ఈడ్చుచున్నవాని; న(పశ్యామి)=చూడను.

నేను,యుద్ధంబున, రాముండు,భయంకరంబులగుబాణంబుల గ్రహించుటనుగాని బాణంబుల విడుచుటనుగాని ధనుస్సు నాకర్షించుటను గాని చూచినదిలేదు. అని,తాత్పర్యము.

హన్యమానంతు మత్సైన్యం పశ్యామి శరవృష్టిభిః
ఇంద్రేణే వోత్తమం సస్య మాహతం త్వశ్మవృష్టిభిః. ౮

టీక॥ఇంద్రేణ=ఇంద్రునిచేత; అశ్మవృష్టిభిః=ఱాళ్లవానలచేత; ఆహతం=కొట్టంబడిన;ఉత్తమం=శ్రేష్ఠమయిన ; సస్యమివతు = పైరువలెనే; శరవృష్టిభిః=బాణవర్షములచేత ; హన్యమానం= వధింపఁబడుచున్న; మత్సైన్యంతు=నాసేననుమాత్రమె; పశ్యామి = చూచుచుంటిని.

ఇంద్రుండు గుఱిపించు ఱాళ్లవానలచేమంచిపయిరు చెడునట్లు , బాణవర్షంబులచే, నాసైన్యమంతయు , వధింపఁబడుచుండుటను మాత్రము , చూచుచుంటిని. అని, తాత్పర్యము.

రక్షసాం భీమరూపాణాం సహస్రాణి చతుర్దశ
నిహతాని శరైస్తీక్ష్ణై స్తేనైకేన పదాతినా. ౯
అర్ధాధిక ముహూర్తేన ఖరశ్చ సహదూషణః

టీక॥ పదాతినా = కాలిబంటగు; తేన=ఆరామునిచేత,ఏకేన= ఒకరిని చేత;తీక్ష్ణైః=కఱుకులైన;శరైః= బాణములచేత;అర్ధాధిక ముహూర్తేన=సగముచేనధికమయినముహూర్తము చేత; భీమరూపాణాం=భయంకరాకారులగు,రక్షసాం=రాక్షసులయొక్క;సహస్రాణి=వేలు; చతుర్దశ=పదునాలుగు;నిహతాని= చంపఁబడినవి. సహదూషణః = దూషణునితోఁగూడిన;ఖరశ్చ=ఖరుండును;నిహతః(అధ్యాహృతము)=వధింపఁబడినాఁడు.




పదాతియగునారాముండొకఁడే, ఒకటియు నలువుహూర్తకాలంబునఁ, దీక్ష్ణబాణంబులచే, భయంకరాకారులగుపదునాలుగువేలమంది రాక్షసులను దూషణునిఖరునింగూడ, వధించివుచ్చెను. అని, తాత్పర్యము.

ఋషీణామభయం దత్తం కృతక్షేమాశ్చ దండకాః. ౧౦

టీక॥ తేన(అధ్యాహృతము)=ఆరామునిచేత; ఋషీణాం=ఋషులకు; అభయం=భయములేమి; దత్తం= ఇయ్యఁబడినది. దండకాః=దండకారణ్యములు; కృతక్షేమాః = చేయఁబడినక్షేమము గలవి.

అట్లు రాముండు, ఋషులకభయం బొసంగి, దండకారణ్యంబున నేమియు బాధలేనట్లుగావించెను.

అని, తాత్పర్యము,

ఏకా కథం చి న్ముక్తాహం పరిధూయ మహాత్మనా
స్త్రీవధం శంకమానేన రామేణ విదితాత్మనా. ౧౧

టీక॥ మహాత్మనా= అధికమయిన పరాక్రమముగలవాఁడును; విదితాత్మనా= తెలియఁబడిన యాత్మ గలవాఁడును; స్త్రీవధం = స్త్రీనిచంపుటను గుఱించి; శంకమానేన = సందేహించుచున్నవాఁడునగు; రామేణ= రామునిచేత, అహం=నేను; ఏకా = ఒకర్తెను; పరిధూయ = తిరస్కరించి; కథంచిత్ = అతిప్రయాసముచేత; ముక్తా=విడువఁబడినాను.

మహాత్ముఁడును ఆత్మజ్ఞానము గలవాఁడునగు రాముండు, స్త్రీవధముకారాదని, యతిప్రయాసంబున, నన్నొకతెనుమాత్రము, నానావిధంబులనవమానించివిడిచెను.

అని, తాత్పర్యము.

భ్రాతా చాస్య మహాతేజా గుణత స్తుల్యవిక్రమః
అనురక్తశ్చ భక్తశ్చ లక్ష్మణోనామ వీర్యవాన్. ౧౨

టీక॥ అస్య=ఈ రామునకును ; మహాతేజాః= అధికమయిన కాంతిగలవాఁడును; గుణతః= గుణంబులతో; తుల్యవిక్రమః = సమానమయినపరాక్ర

మముగలవాఁడును; అనురక్తశ్చ = అనురాగముగలవాఁడును ; భక్తశ్చ= భక్తుండును; వీర్యవాన్ = అధికమయిన పరాక్రమముగలవాఁడునగు ; లక్ష్మణో నామ=లక్ష్మణుండనెడు; భ్రాతా చ=తమ్ముండును; అస్తి (అధ్యాహృతము)=కలఁడు.

ఈ రామునకు, మహాతేజుండునుగుణవంతుండును మహాపరాక్రమశాలియు , అన్నపైననురాగంబును భక్తియుఁ గలవాఁడునగు లక్ష్మణుండనుతమ్ముండొక్కఁడున్నాఁడు.

అని, తాత్పర్యము.

అమర్షీ దుర్జయో జేతా విక్రాంతో బుద్ధిమాన్ బలీ
రామస్య దక్షిణో బాహు ర్నిత్యం ప్రాణో బహిశ్చరః. ౧౩

టీక॥ సః (అధ్యాహృతము)= ఆ లక్ష్మణుఁడు;అమర్షీ = అధికమయిన కోపముగలవాఁడు. దుర్జయః = జయింప నలవిగానివాఁడు. జేతా= జయించువాఁడు.విక్రాంతః = పరాక్రమించువాఁడు. బుద్ధిమాన్ = అధికమయినబుద్ధిగలవాఁడు . బలీ= అధికమయినబలముగలవాఁడు. రామస్య= రామునియొక్క;దక్షిణః = కుడిదైన; బాహుః=భుజము. నిత్యం = ఎల్లప్పుడును;బహిశ్చరః = బయటఁదిరుగునట్టి;ప్రాణః=ప్రాణము.

ఆలక్ష్మణుఁడు , మిక్కిలియుఁగోపముగలవాఁడు ; శత్రువులకుదుర్జయుండు; ఎట్టిశత్రువునైననుజయించువాఁడు; మహాపరాక్రమశాలి;బుద్ధిమంతుండు; బలవంతుండు ; రామునకుఁ గుడిభుజమువంటివాఁడు ; బహిశ్చరంబగుప్రాణంబువంటివాఁడు.

అని, తాత్పర్యము.

రామస్యతు విశాలాక్షీ పూర్ణేందుసదృశాననా
ధర్మపత్నీ ప్రియా భర్తు ర్నిత్యం ప్రియహితే రతా. ౧౪

టీక॥ రామస్య=రామునియొక్క; ధర్మపత్నీతు= ధర్మపత్నియు;విశాలాక్షీ = వెడల్పులయిన కన్నులు గలది. పూర్ణేందుసదృశాననా=నిండుచంద్రునితో సమానమయినముఖముగలది. భర్తుః=పెనిమిటికి; ప్రియా=ఇ

ష్టురాలు.నిత్యం = ఎల్లప్పుడును; ప్రియహితే=ప్రియమునందును మేలునందును;రతా=ఆసక్తురాలు.

రామునిభార్యయు, విశాలములయినకన్నులుగలది; నిండుచందురునింబోలుముఖంబుగలది; పెనిమిటికిఁబ్రియురాలు; ఎల్లప్పుడును బెనిమిటికిఁ బ్రియంబునుహితంబునగుకార్యము జేయుచుండును. అని, తాత్పర్యము.

సా సుకేశీ సునాసోరు స్సురూపాచ యశస్వినీ
దేవతేవ వనస్యాస్య రాజతే శ్రీ రివా ఽ పరా. ౧౫

టీక॥సుకేశీ=సుందరములయినవెండ్రుకలుగలదియు;సునాసోరుః=సుందరములయిన ముక్కును దొడలునుగలదియు;సురూపాచ=సుందరమయినరూపముగలదియు; యశస్వినీ= అధికమయినకీర్తిఁగలదియునగు;సా= ఆరామునిభార్య;అస్య=ఈ;వనస్య= దండకారణ్యముయొక్క; దేవతేవ = దేవతవలె,అపరా=ఇతరయయిన ; శ్రీరివ=లక్ష్మివలె,రాజతే= ప్రకాశించుచున్నది.

ఆరామునిభార్య,సుందరములయినవెండ్రుకలతో సుందరములయిన ముక్కుం దొడలతో నొప్పుచు రమణీయాకారయయి, యాదండకారణ్యదేవతయో, రెండవలక్ష్మిదేవియో యనందగి ప్రకాశించుచున్నది.

అని, తాత్పర్యము.

తప్తకాంచనవర్ణాభా రక్తతుంగనఖీ శుభా
సీతానామ వరారోహా వైదేహీ తనుమధ్యమా. ౧౬

టీక॥ సా(అధ్యాహృతము)=ఆరామభార్య; తప్తకాంచనవర్ణాభా = కాచఁబడిన బంగారు రంగుయొక్క కాంతివంటికాంతిగలది. రక్తతుంగనఖీ=ఎఱ్ఱనివియు నున్నతములునగు నఖములుగలది.శుభా= మంగళకరియయినది.వరారోహా=సుందరములయిన పిఱుదులుగలది. తనుమధ్యమా=సన్ననడుముగలది.సీతానామ = సీతయను పేరుగలది. వైదేహీ = విదేహదేశమునందుఁబుట్టినది.

ఆబిడ, మంచిబంగారుచాయగల




మేనితోనొప్పుచుండునదియు; ఎత్తరియున్నతములును నఖములును సుందరములయిన పిఱుందులును సన్ననడుమును గలది; మంగళలక్షణంబులు గలది; ఆబిడ పేరు సీత; విదేహదేశపు రాజుకూఁతురు.

అని, తాత్పర్యము.

నైవ దేవీ న గంధర్వీ న యక్షీ నచ కిన్నరీ
నైవంరూపా మయా నారీ దృష్టపూర్వా మహీతలే. ౧౭

టీక॥ మయా=నాచేత; ఏవంరూపా=ఇట్టిరూపముగల; నారీ=స్త్రీ; దేవీ=దేవపత్ని; నైవదృష్టపూర్వా=మున్నుచూడఁబడినదే కాదు. యక్షీ=యక్షపత్ని; న(దృష్టపూర్వా)=మున్నుచూడఁబడినది గాదు. కిన్నరీచ=కిన్నరపత్నియు; న(దృష్టపూర్వా)=మున్నుచూడఁబడినది గాదు. మహీతలే=భూతలమునందు; న(దృష్టపూర్వా)=చూడఁబడినది కాదు.

నేను, దేవతలలోఁగాని యక్షులలో గాని కిన్నరులలో గాని, యీసీతవంటి రూపముగల యాఁడుదానిని దివఱకుఁ జూడలేదు; ఇంక భూలోకంబున లేదని చెప్పనేల? అని, తాత్పర్యము.

యస్య సీతా భవే ద్భార్యా యంచ హృష్టా పరిష్వజేత్
అతిజీవే త్స సర్వేషు లోకేష్వపి పురందరాత్. ౧౮

టీక॥ యస్య=ఎవ్వనికి; సీతా=సీత; భార్యా=భార్యగా; భవేత్=అగునో; యంచ=ఎవ్వనిని; హృష్టా=సంతోషించినదై; పరిష్వజేత్=కవుఁగిలించుకొనునో; సః=అతండు; సర్వేషు=సమస్తములయిన; లోకేషు=లోకములందు; పురందరాదపి=దేవేంద్రునికన్నను; అతిజీవేత్=అధికముగా బ్రతుకును.

సీతాదేవి, యెవ్వనికి భార్యయో, ఎవ్వని సంతోషంబునం గవుఁగిలించుకొనునో, ఆమ్మహాపురుషుండు, సమస్త లోకంబులందును, దేవేంద్రునికన్నను, అధికుండు.

అని, తాత్పర్యము.

సా సుశీలా వపుశ్శ్లాఘ్యా రూపేణా ప్రతిమా భువి




తవానురూపా భార్యాస్యా త్త్వంచ తస్యా స్తథాపతిః. ౧౯

టీక॥సుశీలా=మంచిస్వభావముగలదియు;వపుశ్లాఘ్యా=దేహముచేఁగొనియాడఁదగినదియు;రూపేణ=సౌందర్యముచేత;భువి=భూమియందు;అప్రతిమా=సరిలేనిదియునగు; సా=ఆసీత; తవ=నీకు;అనురూపా = తగిన;భార్యా = భార్య;స్యాత్=అగును.త్వంచ=నీవును;తథా=అట్లు;తస్యాః=ఆదిడకు;పతిః=పెనిమిటివి; స్యాః(అధ్యాహృతము)=అగుదువు.

సదాచారసంపన్నయు సుందరాంగియు సౌందర్యంబున భూలోకంబున నెచ్చటను సాటిలేనిదియునగు, నాసీత, నీకుఁదగినభార్య;అట్లు, నీవా బిడకుఁదగిన పెనిమిటివి, అని, తాత్పర్యము.

తాంతు వి స్తీర్ణజఘనాం పీనశ్రోణీపయోధరామ్
భార్యార్థేచ తవానేతు ముద్యతాహం వరాననామ్. ౨౦

టీక॥ అహం= నేను;వి స్తీర్ణజఘనాం=విశాలమయిన మొలగలదియు; పీనశ్రోణీపయోధరాం= బలిసినపిఱుఁదులును స్తనములునుగలదియు; వరాననాం = సుందరమయినముఖముగలదియునగు;తాంతు = ఆసీతనే;తవ=నీకు;భార్యార్థేచ = భార్యనిమిత్తమయియె;ఆనేతుం = తెచ్చుటకు;ఉద్యతా=యత్నించితిని.

విశాలమయినజఘనమును , బలిసిన పిఱుందులును స్తనములును సుందరమయినముఖమునుగలయాసీతను , నీకు భార్యగానుండునని , నేనిచ్చటికి దేఁబ్రయత్నించితిని.

అని, తాత్పర్యము.

విరూపితాస్మి క్రూరేణ లక్ష్మణేన మహాభుజ

టీక॥ మహాభుజ = పెద్దచేతులుగలరావణుఁడా! క్రూరేణ = కఠినుఁడగు;లక్ష్మణేన = లక్ష్మణునిచేత; విరూపితా= విరూపగాఁ జేయఁబడినదానను;అస్మి=అయితిని.

మహాబాహుండవగు రావణుఁడా!

నేనట్లుసీతనపహరింపఁబ్రయత్నించుట నుజూచి, క్రూరుండగులక్ష్మణుండు, నన్నిట్లువిరూపఁగావించెను.

అని, తాత్పర్యము.

తాంతు దృష్ట్వాద్య వైదేహీం పూర్ణచంద్రనిభాననామ్. ౨౧
మన్మథస్య శరాణాం వై త్వం విధేయో భవిష్యసి

టీక॥ త్వం=నీవు; అద్య = ఇప్పుడు; పూర్ణచంద్రనిభాననాం= నిండుచంద్రునితో సమానమయినముఖముగల ; తాం=ఆ; వైదేహీం=సీతను; దృష్ట్వాతు=చూచినంతనే; మన్మథస్య= మన్మథునియొక్క; శరాణాం= బాణములకు ("వై" అనునది పాదపూరణార్థము); విధేయః=లోఁబడినవాఁడవు; భవిష్యసి=కాఁగలవు.

నీవు, నిండుచందురుంబోలు మొగములయాసీతనుజూచితివేని, తత్క్షణంబున, మన్మథబాణబాధంబొందుదువు.

అని, తాత్పర్యము.

యది తస్యా మభిప్రాయో భార్యార్థే తవ జాయతే. ౨౨
శీఘ్ర ముద్ధ్రియతాం పాదో జయార్థ మిహ దక్షిణః

టీక॥ తవ=నీకు; భార్యార్థే = భార్యనిమిత్తమయి; తస్యాం= ఆసీతయందు ; అభిప్రాయః=కోరిక; జాయతే యది=కలుగునేని; ఇహ= ఇప్పుడు; శీఘ్రం= శీఘ్రముగా; జయార్థం= జయముకొఱకు; దక్షిణః= కుడిదైన; పాదః= పాదము; ఉద్ధ్రియతాం= ఎత్తఁబడుఁగాక.

నీకు, ఆసీతభార్యకావలెననుకోరికగలదేని, యిప్పుడెశీఘ్రముగా, రామలక్ష్మణులను జయింపఁ, గుడియడుగు ముందుపెట్టుము.

అని, తాత్పర్యము.

కురు ప్రియం తథా తేషాం రక్షసాం రాక్షసేశ్వర. ౨౩
వధా త్తస్య నృశంసస్య రామస్యాశ్రమవాసినః

టీక॥ రాక్షసేశ్వర = రాక్షసుల కుఁ బ్రభుండవగు రావణుఁడా! తథా= అట్లు; ఆశ్రమవాసినః = ఆశ్రమమునం దుండునట్టి, నృశంసస్య= క్రూరుండగు, రామస్య= రామునియొక్క; వధాత్ = చంపుటవలన, తేషాం = ఆ; రక్షసాం= రాక్షసులకు; ప్రియం = సంతోషమును; కురు= చేయుము.

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! నీవట్లు క్రూరుండును ఆశ్రమవాసియు నైనరాముని వధించి, యతనిచే వధింపఁబడిన రాక్షసులకందఱకును సంతోషముగావింపుము. అని, తాత్పర్యము.

తం శరై ర్నిశితైః హత్వా లక్ష్మణంచ మహారథమ్. ౨౪
హతనాథాం సుఖం సీతాం యథావ దుపభోక్ష్యసి

టీక॥ తం=ఆ రాముని; మహారథం=తన్నును సారథిని గుఱ్ఱంబులనుం గాపాడుకొనుచు, బదునాకండువేలమందివిలుకాండ్రతోఁబోరునట్టి; లక్ష్మణంచ= లక్ష్మణుని; నిశితైః = కఱకులయిన; శరైః=బాణములచేత; హత్వా= వధించి; హతనాథాం = చంపఁబడిననాథుండుగల; సీతాం= సీతను; సుఖం= సుఖముగా; యథావత్ =యథాక్రమముగా; ఉపభోక్ష్యసి=అనుభవింపఁగలవు.

ఆ రాముని మహారథుఁడగు లక్ష్మణుని గఱకుబాణంబులవధింతువేని, యట్లు నాథయయినసీతను, సుఖంబుగాభార్యగాఁగావించుకొని, నానావిధభోగలననుభవింపఁగలవు.

అని, తాత్పర్యము.

రోచతే యది తే వాక్యం మమైత ద్రాక్షసేశ్వర. ౨౫
క్రియతాం నిర్విశంకేన వచనం మమ రావణ

టీక॥ రాక్షసేశ్వర= రాక్షసులకుఁ బ్రభుఁడవగు; రావణ= రావణుఁడా! తే=నీకు; మమ=నాయొక్క; ఏతత్ = ఈ; వాక్యం=మాట; రోచతే యది= రుచించునేని; మమ=నాయొక్క; వచనం=మాట; నిర్విశంకేన= భయములేనట్టి; త్వయా(అధ్యాహృతము)=నీచేత; క్రియతాం= చేయఁబడుఁగాక.

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! నేనిప్పుడుచెప్పినమాట నీకుసమ్మతమగు

నేను, నేనుజెప్పినట్లు, నిర్భయముగాఁగావింపుము. అని, తాత్పర్యము.

విజ్ఞాయేహాత్మశక్తించ హ్రియతా మబలా బలాత్. ౨౮
సీతా సర్వానవద్యాంగీ భార్యార్థే రాక్షసేశ్వర

టీక॥ రాక్షసేశ్వర = రాక్షసరాజుఁడవగు రావణుఁడా! ఇహ=ఇప్పుడు; ఆత్మశక్తించ=నీబలమును; విజ్ఞాయ=తెలిసి; బలాత్=బలిమివలన ; సర్వానవద్యాంగీ= సమస్తములయిననిందితములుకాని యవయవములుగల ; సీతా=సీతయను ; అబలా=స్త్రీ ; భార్యార్థే=భార్యనిమిత్తమయి ; హ్రియతాం=అపహరింపఁబడుఁగాక.

రాక్షసనాథుఁడవగు రావణుఁడా! నీకుంగలబలాతిశయమును దెలిసికొని , సర్వాంగసుందరియగు సీతను బలాత్కారంబునంగొని తెచ్చిభార్య గావించుకొనుము. అని, తాత్పర్యము.

నిశమ్య రామేణ శరై రజిహ్మగై
హతాన్ జనస్థానగతాన్ నిశాచరాన్. ౨౯
ఖరంచ బుద్ధ్వా నిహతంచ దూషణం
త్వ మత్ర కృత్యం ప్రతిపత్తు మర్హసి

టీక॥ త్వం=నీవు; రామేణ= రాముని చేత ; అజిహ్మగైః = కుటిలముగాఁబోనట్టి; శరైః=బాణముల చేత ; హతాన్= చంపఁబడిన ; జనస్థానగతాన్=జనస్థానమునుబొందిన ; నిశాచరాన్=రాక్షసులను ; నిశమ్య=విని ; నిహతం=చంపఁబడిన; ఖరంచ= ఖరుని; దూషణం=దూషణుని; బుద్ధ్వా = ఎఱింగి; అత్ర=ఈవిషయమునందు;కృత్యం=కర్తవ్యమును; ప్రతిపత్తుం=తెలిసికొనుటకు; అర్హసి=తగుదువు.

రాముండు, జనస్థానంబునందలి రాక్షసులనందఱను, ఖరదూషణులను, దీక్ష్ణబాణంబులవధించినసంగతిని వినియున్నావుగదా? ఇంకఁగర్తవ్యమును గుఱించినీవె నిశ్చయింపుము. అని, శూర్పణఖ, రావణునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే ,

ఆరణ్యకాండే, చతుస్త్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండచతుస్త్రింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీః

పంచత్రింశసర్గప్రారంభః.

తత శ్శూర్పణఖావాక్యం త చ్ఛ్రుత్వా రోమహర్షణమ్
సచివా నభ్యనుజ్ఞాయ కార్యం బుద్ధ్వా జగామ సః. ౧

టీక॥ తతః=అంత; సః= ఆరావణుఁడు; రోమహర్షణం= వెండ్రుకలనుగగుర్పాటునొందించునట్టి; తత్= ఆ; శూర్పణఖావాక్యం=శూర్పణఖయొక్కమాటను; శ్రుత్వా=విని; కార్యం= పనిని; బుద్ధ్వా=తెలిసికొని; సచివాన్= మంత్రులను; అభ్యనుజ్ఞాయ= వీడుకొలిపి; జగామ=పోయెను.

అంతనారావణుండు, భయంకరంబగుశూర్పణఖచెప్పినమాటనువిని, మంత్రులవలనరాచకార్యంబులుతెలిసికొని, వారలకుసెలవొసంగి, యంతఃపురంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

త త్కార్య మనుగమ్యా థ యథావ దుపలభ్య చ
దోషాణాంచ గుణానాంచ సంప్రధార్య బలాబలమ్. ౨
ఇతి కర్తవ్య మిత్యేవ కృత్వా నిశ్చయ మాత్మనః
స్థిరబుద్ధి స్తతో రమ్యాం యానశాలాం జగామహ. ३

టీక॥ అథ=అంత; సః(అధ్యాహృతము)=ఆరావణుఁడు; తత్=ఆ; కార్యం=పనిని; అనుగమ్య=ఆలోచించి; యథావత్=యథాక్రమముగ; ఉపల

భ్యచ=చూచుకొనియు ; దోషాణాం చ=దోషములయొక్కయు;గుణానాం చ=గుణములయొక్కయు;బలాబలం= ఎచ్చుతక్కువలను ; సంప్రధార్య= నిశ్చయించి; ఇతి=ఇట్లు; కర్తవ్యం = చేయఁబడవలసినది. ఇత్యేవ=అనియె; ఆత్మనః=తనయొక్క; నిశ్చయం= ఏర్పాటును; కృత్వా=చేసి; స్థిరబుద్ధిః= చలనములేనిబుద్ధిగలవాఁడై: తతః=అంత; రమ్యాం=సుందరమయిన ; యానశాలాం=గుఱ్ఱములకొట్టమును ; జగామ=పొందెను. ("హ" అనునదిపాదపూరణార్థము.

అంత, నారావణుండు, ఏకాంతంబున,సీతనపహరించుటను గుఱించి చక్కఁగానాలోచించి , పరాక్రమంబువంగొనివచ్చుటయందును దొంగ తనముగా నపహరించుట యందును, గుణదోషంబుల బలాబలములు విమర్శించి జనస్థానమునయున్న ఖరదూషణులు మున్నగాఁ బదునాలుగువేల రాక్షసుల మూఁడుగడియలలో వధించివచ్చిన మహా పరాక్రమశాలియగు రాముని యెదుటఁబరాక్రమంబునసీత నపహరించుట యెంతమాత్రము సాధ్యముకాదని యెఱింగి,చౌర్యంబుననేయపహరింప వలయునని దృఢంబుగానిశ్చయించి, రమణీయంబగు గుఱ్ఱముల కొట్టమునకుఁ బోయెను. అని, తాత్పర్యము.

యానశాలాం తతో గత్వా ప్రచ్ఛన్నో రాక్షసాధిపః
సూతం సంచోదయామాస రథ స్సంయోజ్యతా మితి. ౪

టీక॥ రాక్షసాధిపః= రాక్షసులకుఁ బ్రభుఁడైన రావణుఁడు; ప్రచ్ఛన్నః= తెలియఁబడనివాఁడై;యానశాలాం = గుఱ్ఱములకొట్టమును; గత్వా=పొంది; తతః=అంత; సూతం=సారథిని ; "రథః=రథము; సంయోజ్యతాం= కూర్పఁబడుఁగాక." ఇతి=అని; సంచోదయామాస=ఆజ్ఞాపించెను.

రాక్షసేశ్వరుండగు రావణుండు, మందోదరి మంత్రులు మున్నగువారలెఱింగిననివారింతురని , యెవ్వరికిని దెలియనట్లు, యానశాలకుఁబోయి సారథింగని,రథంబాయత్తంబు గావింపుమనియాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తః క్షణేనైవ సారథి ర్లఘువిక్రమః
రథం సంయోజయామాస తస్యాభిమత ముత్తమమ్. ౫

టీక॥ లఘువిక్రమః = శీఘ్రముగ నడకగల; సారథిః = తేరుగడపువాఁడు; ఏవం = ఇట్లు, ఉక్తః = చెప్పఁబడినవాఁడై, క్షణేనైవ = క్షణమాత్రముచేతనే; తస్య = ఆ రావణునికి; అభిమతం = ఇష్టమును, ఉత్తమం = శ్రేష్ఠమునగు; రథం = రథంబును; సంయోజయామాస = కూర్చెను.

శీఘ్రమయిన నడకగలయా సారథి, రావణునియాజ్ఞను విని, క్షణమాత్రంబున, రావణునకభిమతంబగు రమణీయ రథంబు నాయత్తంబు గావించెను.

అని, తాత్పర్యము.

కాంచనం రథ మాస్థాయ కామగం రత్నభూషితమ్
పిశాచవదనై ర్యుక్తం ఖరైః కాంచనభూషణైః. ౬
మేఘప్రతిమనాదేన స తేన ధనదానుజః
రాక్షసాధిపతి శ్శ్రీమా న్యయౌ నదనదీపతిమ్. ౭

టీక॥ ధనదానుజః = కుబేరుని తమ్ముఁడును; శ్రీమాన్ = అధికమయిన కాంతిగలవాఁడును; రాక్షసాధిపతిః = రాక్షసులకుఁ బ్రభుండునగు; సః = ఆ రావణుఁడు; కాంచనం = బంగారువికారంబును; కామగం = ఇచ్ఛచొప్పునఁ బోవునదియు; రత్నభూషితం = మణులచేనలంకరింపఁబడినదియు; పిశాచవదనైః = పిశాచములముఖమువంటి ముఖముగలదియు; కాంచనభూషణైః = బంగారువికారములయిన సొమ్ములుగలదియునగు; ఖరైః = గాడిదలతోఁ, యుక్తం = కూడినదియునగు, రథం = రథమును; ఆస్థాయ = అధిష్ఠించి; మేఘప్రతిమనాదేన = మేఘముతోఁ బోలికగలధ్వనిగల; తేన = ఆరథముచేత; నదనదీపతిం = సముద్రమును; యయౌ = పొందెను.

కుబేరుని తమ్ముఁడగు రాక్షసాధీశ్వరుండు రావణుండు, కామగమనంబును రత్నభూషితంబును బిశాచముఖంబులును గాంచనాలంకృతంబులునగు ఖరంబులుపూన్చినదియునగు కాంచనరథంబు

నారోహించి, సముద్రంబు చేరఁబోయెను. అని, తాత్పర్యము.

స శ్వేతవాలవ్యజన శ్శ్వేతచ్ఛత్రో దశాననః
స్నిగ్ధ వైడూర్యసంకాశ స్తప్తకాంచనకుండలః. ౮
వింశద్భుజో దశగ్రీవో దర్శనీయపరిచ్ఛదః
త్రిదశారి ర్మునీంద్రఘ్నో దశశీర్ష ఇవాద్రిరాట్. ౯
కామగం రథ మాస్థాయ శుశుభే రాక్షసేశ్వరః
విద్యున్మండలవా న్మేఘ స్సబలాక ఇవాంబరే. ౧౦

టీక॥ శ్వేతవాలవ్యజనః=తెల్లని వింజామరలు గలవాఁడును; శ్వేతచ్ఛత్రః=తెల్లనిగొడుగుగలవాఁడును; స్నిగ్ధవైడూర్యసంకాశః=సుందరమయినవైడూర్యమణితో సమానుఁడైనవాఁడును, తప్తకాంచనకుండలః = కాఁచఁబడిన బంగారుపోఁగులుగలవాఁడును ; వింశద్భుజః=ఇరువదిచేతులుకలవాఁడును. దశగ్రీవః= పదికంఠములుకలవాఁడును; దర్శనీయపరిచ్ఛదః = సుందరములయినవస్త్రములుగలవాఁడును ; త్రిదశారిః = దేవతలకుశత్రువును; మునీంద్రఘ్నః= మునిశ్రేష్ఠులనువధించు వాఁడును; దశశీర్షః=పదిశిఖరములుగల; అద్రిరాడివ(స్థితః)= పర్వతశ్రేష్ఠమువలె నున్నవాఁడును; రాక్షసేశ్వరః= రాక్షసులకుఁబ్రభుఁడునగు; సః=ఆ ; దశాననః=రావణుఁడు; కామగం= ఇచ్ఛ చొప్పునఁబోవునట్టి; రథం = రథమును ; ఆస్థాయ=అధిష్ఠించి; అంబరే = ఆకసమునందు; విద్యున్మండలవాన్= మెఱపులసమూహముగలదియు ; సబలాకః= కొక్కెరలతోఁ గూడినదియు నగు; మేఘఇవ=మేఘమువలె; శుశుభే=ప్రకాశించెను.

ఇరువదిచేతులుగలవాఁడునుబదితలలుగలవాఁడునగు నారాక్షసరాజుఁడయినరావణుఁడు, పది శిఖరంబులఁతోఁగూడినపర్వతంబు కరణిఁజూపట్టుచువైడూర్యంబువంటిమేనిచాయగల్గి తెల్లనివింజామరలును శ్వేతచ్ఛత్రములును మంచిబంగారుపోఁగులునుధరించి కామగమనంబగుకాంచనరథంబునారోహించియుండుటచే, నాకాశంబున, మెఱపులతోను గొక్కెరులతోనుం గూడిన మేఘంబువలె, నెంతయుశోభిల్లెను.

అని, తాత్పర్యము.

సశైలం సాగరానూపం వీర్యవా నవలోకయన్
నానాపుష్పఫలై ర్వృక్షై రనుకీర్ణం సహస్రశః. ౧౧

టీక॥ వీర్యవాన్= అధికమయినపరాక్రమముగల రావణుఁడు ; సశైలం=పర్వతములతోఁగూడినదియు; సహస్రశః=వేనవేలుగా ; నానాపుష్పఫలైః=నానావిధములగుపూలును పండ్లునుగల; వృక్షైః= చెట్లచేత ; అనుకీర్ణం=వ్యాపింపఁబడినదియునగు; సాగరానూపం=సముద్రతీరమును; అవలోకయన్=చూచుచు;జగామ(అధ్యాహృతము)=పోయెను.

మహాపరాక్రమ శాలియగు రావణుండు, పర్వతంబులతోనునానావిధంబులగుపుష్పఫలంబులతోనొప్పుచున్నవృక్షములతోనుంగూడిన, సముద్రతీరంబునుజూచుచుఁ బోయెను.

అని, తాత్పర్యము.

శీతమంగళతోయాభిః పద్మినీభి స్సమంతతః
విశాలై రాశ్రమపదై ర్వేదిమద్భి స్సమావృతమ్. ౧౩

టీక॥సమంతతః=అంతటను ; శీతమంగళతోయాభిః= చల్లనిమంగళకరంబులగుజలముగల;పద్మినీభిః= తామరకొలనులచేతను;విశాలైః = విస్తీర్ణములును;వేదిమద్భిః=యాగవేదికలు గలవియునగు;ఆశ్రమపదైః= ఆశ్రమస్థానములచేతను;సమావృతం= కప్పఁబడినదియునగు ; సాగరానూపం, అవలోకయన్ ; జగామ (అధ్యాహృతము)= సముద్రముతీరమును జూచుచుఁబోయెను.

చల్లనిమంచినీళ్లుగల తామరకొలంకులతోనువిశాలంబులును యాగవేదికాలంకృతంబులునగు నాశ్రమంబులతోను ఒప్పుచున్నసముద్రతీరంబుఁ జూచుచు, రావణుండు,పోయెను.

అని, తాత్పర్యము.

కదళ్యాఢకిసంబాధం నారికేళోపశోభితమ్
సాలై స్తాలై స్తమాలైశ్చ పుష్పితై స్తరుభి ర్వృతమ్. ౧౪

టీక॥ కదళ్యాఢకిసంబాధం= అరఁటిచెట్లచేతను కందితీఁగెలచేతను నిండినదియు. నారికేళోపశోభితం= టెంకాయచెట్లచేఁ బ్రకాశించుచున్నదియు, సాలైః=మద్దిచెట్లచేతను; తాలైః=తాటిచెట్లచేతను; తమాలైశ్చ=చీఁకటిచెట్లచేతను; పుష్పితైః=పూచిన; తరుభిః= వృక్షములచేతను, వృతం= చుట్టఁబడినదియునగు; సాగరానూపం, అవలోకయన్, జగామ(అధ్యాహృతము) = సముద్రతీరమునుజూచుచుఁబోయెను.

అరఁటిచెట్లతోను కందితీఁగెలతోను టెంకాయచెట్లతోనుగూడినదియు, మద్దిచెట్లు తాటిచెట్లు తమాలవృక్షంబులు మున్నగుచక్కఁగాఁ బూచిన వృక్షములచేనిండియుండునదియునగు, సముద్రతీరమునుజూచుచు, రావణుండుపోయెను. అని, తాత్పర్యము.

నాగైః సుపర్ణైర్గంధర్వైః కిన్నరైశ్చ సహస్రశః
అజైర్వైఖానసైర్మాషైర్వాలఖిల్యైర్మరీచిపైః. ౧౫
అత్యంతనియతాహారైః శోభితం పరమర్షిభిః

టీక॥ సహస్రశః = వేనవేలుగా; నాగైః = సర్పములచేతను ; సుపర్ణైః=గరుడులచేతను ;గంధర్వైః = గంధర్వులచేతను; కిన్నరైశ్చ= కిన్నరులచేతను; అజైః= అయోనిజులగు; మరీచిపైః= కిరణములనుద్రావువారలును; అత్యంతనియతాహారైః=మిక్కిలి యునియతమ్మయినయాహారముగల వారలునగు; వైఖానసైః=బ్రహ్మనఖంబునఁబుట్టినవారలును; మాషైః=మాష గోత్రంబునఁబుట్టినవారలును ; వాలఖిల్యైః=బ్రహ్మవాలంబునంబుట్టినవారలునైన; పరమర్షిభిః= శ్రేష్ఠులయినఋషులచేత; శోభితం=ప్రకాశించుచున్న; సాగరానూపం, అవలోకయన్ , జగామ(అధ్యాహృతము)= సముద్రతీరమునుజూచుచుఁబోయెను.

నాగములును గరుడులును గంధర్వులును గిన్నరులును , అయోనిజులును జంద్రసూర్యకిరణంబులె యాహారంబుగాఁ గొనువారలును, నియతాహారులునగు వైఖానసులును వాలఖిల్యులునుమున్నగు వారలకు నివాసస్థానంబగుసముద్రతీరమును జూచుచు రావణుండుపోయెను.

అని, తాత్పర్యము.

స ౩౫

జితకామైశ్చ సిద్ధైశ్చ చారణై రుపశోభితమ్. ౧౬

టీక॥ జితకామైశ్చ= జయింపఁబడినకోర్కెలుగలవారలచేతను ; సిద్ధైశ్చ=సిద్ధులచేతను; చారణైః=చారణులచేతను; ఉపశోభితం=ప్రకాశించుచున్న; సాగరానూపం,అవలోకయన్ , జగామ(అధ్యాహృతము)= సముద్రతీరమునఁజూచుచుఁబోయెను.

అవాప్తసమస్తకాములగుసత్పురులచేతను సిద్ధులచేతనుజారణులచేతను, ఎంతయునొప్పుచుండునట్టి, సముద్రతీరముంజూచుచు రావణుండు,పోయెను. అని, తాత్పర్యము.

దివ్యాభరణమాల్యాభి ర్దివ్యరూపాభి రావృతమ్
క్రీడారతివిధిజ్ఞాభి రప్సరోభి స్సహస్రశః. ౧౭

టీక॥దివ్యాభరణమాల్యాభిః=శ్రేష్ఠములయినభూషణములును బుష్పమాలికలునుగలవారలును;దివ్యరూపాభిః = శ్రేష్ఠమయినసౌందర్యముగలవారలును; క్రీడారతివిధిజ్ఞాభిః=ఆటలయొక్కయు సురతములయొక్కయు విధులనుదెలిసినట్టివారలునగు; అప్సరోభిః=అప్సరసలచేత ; సహస్రశః= వేనవేలుగా;ఆవృతం=కప్పఁబడినట్టి;సాగరానూపం, అవలోకయన్, జగామ (అధ్యాహృతము)=సముద్రతీరమునఁజూచుచుఁబోయెను.

దివ్యంబులగు నాభరణములను బుష్పమాలికలను దాల్చియుండు వారలును దివ్యసౌందర్యంబుగల వారలును నానావిధక్రీడలయందుఁ బాండిత్యంబు గలవారలునగునప్సరస్త్రీలతో నొప్పుచున్నసముద్రతీరముం జూచుచు రావణుండుపోయెను. అని, తాత్పర్యము.

సేవితం దేవపత్నీభి శ్శ్రీమతీభి శ్శ్రియా వృతమ్
దేవదానవసంఘైశ్చ చరితం త్వమృతాశిభిః. ౧౮

టీక॥శ్రీమతీభిః= అధికమయినకాంతిగల;దేవపత్నీభిః= దేవభార్యలచేత; సేవితం= సేవింపఁబడినదియు ; శ్రియా=కాంతిచేత;వృతం= చుట్టఁబడిన

దియు; అమృతాశిభిః = అమృతమును భక్షించునట్టి; దేవదానవసంఘైశ్చ = దేవతలయొక్క దానవులయొక్క సమూహములచేతను; చరితం = సంచరింపఁబడినదియునగు; సాగరానూపం, అవలోకయన్, జగామ (అధ్యాహృతము) సముద్రతీరమునుజూచుచుఁ బోయెను.

కాంతిసంపన్నలగు దేవభార్యలచే సేవింపఁబడినదియుఁ గాంతిసంపన్నంబును, అమృతంబుభుజించునట్టి దేవదానవులకువిహారస్థానంబునగు, సముద్రతీరంబుఁజూచుచు, రావణుఁడుపోయెను. అని, తాత్పర్యము.

హంసక్రౌంచప్లవాకీర్ణాం సారసైః సంప్రణాదితమ్
వైడూర్యప్రస్తరం రమ్యం స్నిగ్ధం సాగరతేజసా. ౧౯

టీక॥ హంసక్రౌంచప్లవాకీర్ణం = హంసపక్షులచేతను క్రౌంచపక్షులచేతనుకప్పలచేతనువ్యాపింపఁ బడినదియు, సారసైః = బెగ్గురుపక్షులచేత; సంప్రణాదితం = ధ్వనింపఁజేయఁబడినదియు, వైడూర్యప్రస్తరం = వైడూర్యములె ఱాళ్లుగాఁగలదియు; రమ్యం = సుందరమును; సాగరతేజసా = సముద్రముయొక్క కాంతిచేత; స్నిగ్ధం = నునుపయినదియునగు; సాగరానూపం, అవలోకయన్, జగామ (అధ్యాహృతము) = సముద్రతీరమునజూచుచుఁబోయెను.

మధురముగాఁగూయునట్టి హంసపక్షులుఁ గ్రౌంచపక్షులు నీరుకోళ్లుసారసపక్షులు మొదలగుపక్షులతోనొప్పుచున్నదియుఁ రమణీయంబును సముద్రకాంతిచేమఱియుసుందరముగాఁ జూపట్టుచున్నదియునగుసముద్రతీరముఁ జూచుచు రావణుఁడుపోయెను.

అని, తాత్పర్యము.

పాండరాణి విశాలాని దివ్యమాల్యయుతానిచ
తూర్యగీతాభిజుష్టాని విమానాని సమంతతః. ౨౦
తపసా జితలోకానాం కామగా న్యభిసంపతన్
గంధర్వాప్సరసశ్చైవ దదర్శ ధనదానుజః. ౨౧

టీక॥ ధనదానుజః = కుబేరునితమ్ముఁడగురావణుఁడు; పాండరాణి = తెల్ల




నివియు; విశాలాని = విస్తీర్ణములును; దివ్యమాల్యయుతానిచ= శ్రేష్ఠములయిన పుష్పమాలికలతోఁ గూడినవియు; తూర్యగీతాభిజుష్టాని= వాద్యములతోను పాటలతోను గూడినవియు; కామగాని=ఇచ్చచొప్పునబోవునవియు నగు; తపసా=తపస్సుచేత; జితలోకానాం= జయింపఁబడినలోకములుగలవారలయొక్క; విమానాని= విమానములను; సమంతతః=అంతటను ; అభిసంపతన్=పొందుచు; గంధర్వాప్సరసశ్చైవ= గంధర్వులను అప్సరసలను; దదర్శ=చూచెను.

కుబేరునితమ్ముఁడగు రావణుండు, అప్పుడు మార్గంబునఁ, దెల్లనివియు విశాలంబులును దివ్యంబులగు పుష్పమాలికలతోఁ గూడినవియు నానావిధవాద్యధ్వనులతోను గీతధ్వనులతోను ఒప్పుచున్నవియుఁ గామగమనంబులునగు తపోబలంబున దివ్యలోకంబుల సాధించినట్టి సత్పురుషుల విమానంబులను , గంధర్వుల నప్సరస్త్రీలనుఁ జూచెను.

అని, తాత్పర్యము.

నిర్యాసరససమూలానాం చందనానాం సహస్రశః
వనాని పశ్యన్ సౌమ్యాని ఘ్రాణతృప్తికరాణిచ. ౨౧

టీక॥నిర్యాసరససమూలానాం=బంకయుడుగునందుఁగల; చందనానాం= చందనవృక్షములయొక్క; సౌమ్యాని = సుందరములయినవియు; ఘ్రాణతృప్తికరాణిచ=ఘ్రాణేంద్రియమునకుఁ దృప్తిని జేయునవియునగు; వనాని= వనములను; సహస్రశః=వేనవేలుగా; పశ్యన్=చూచుచు; జగామ(అధ్యాహృతము)=పోయెను.

సుగంధంబు గుబాళించుచుండు నిర్యాసంబులతోఁ గూడినవియు సుందరములును ఘ్రాణేంద్రియాహ్లాదకంబులునగు చందనవనంబులం జూచుచు, రావణుఁడు పోయెను. అని, తాత్పర్యము.

అగరూణాంచ ముఖ్యానాం వనాన్యుపవనానిచ
తక్కోలానాంచ జాత్యానాం ఫలానాంచ సుగంధినామ్. ౨౨

టీక॥ముఖ్యానాం= శ్రేష్ఠములయిన; అగరూణాంచ = అగరువృక్షముల







యొక్కయు; జాత్యానాం=శ్రేష్ఠములయిన; తక్కోలానాంచ= తక్కోలవృక్షములయొక్కయు; సుగంధినాం=మంచివాసనగల; ఫలానాంచ= జాతివృక్షములయొక్కయు; వనాని= వనములను; ఉపవనాని= ఉద్యానవనములను; పశ్యన్, జగామ (అధ్యాహృతము)=చూచుచుంబోయెను.

శ్రేష్ఠములయిన యగరువృక్షముల యొక్కయుఁ దక్కోలవృక్షముల యొక్కయు మంచివాసనగలజాతివృక్షములయొక్కయువనంబులను, ఉద్యాన వనంబులనుఁజూచుచు రావణుఁడు, పోయెను. అని, తాత్పర్యము.

పుష్పాణిచ తమాలస్య గుల్మాని మరిచస్యచ
ముక్తానాంచ సమూహాని శుష్యమాణాని తీరతః. ౨౩

టీక॥ తమాలస్య = చీఁకటిచెట్టుయొక్క; పుష్పాణి=పూలను; మరిచస్య=మిఱియముయొక్క; గుల్మానిచ=పొదలను; తీరతః=గట్టునందు; శుష్యమాణాని=ఎండుచున్న, ముక్తానాం=ముత్తెములయొక్క ; సమూహానిచ=సమూహములను; పశ్యన్, జగామ(అధ్యాహృతము)= చూచుచుఁబోయెను.

తమాలవృక్షముల పుష్పములను మిఱియపుఁదీఁగెలను సముద్రతీరంబునం బడియెండుచున్న ముత్తెముల సమూహములనుజూచుచు, రావణుండు, పోయెను. అని, తాత్పర్యము.

శంఖానాం ప్రస్తరంచైవ ప్రవాళనిచయం తథా
కాంచనానిచ శైలాని రాజతానిచ సర్వశః. ౨౪

టీక॥ శంఖానాం= శంఖములయొక్క; ప్రస్తరంచైవ=సమూహమును; తథా=అట్లు; ప్రవాళనిచయం= చిగుళ్ల సమూహమును; కాంచనానిచ=బంగారువికారంబులగు ; రాజతానిచ=వెండివికారంబులునగు; శైలాని=పర్వతములను; సర్వశః=అన్నిటిని; పశ్యన్, జగామ(అధ్యాహృతము)=చూచుచుఁబోయెను.

శంఖసమూహములనుజిగురుటాకులసమూహములనుబంగారు కొండలను వెండికొండలనువీనినన్నింటిని జూచు




చు, రావణుండు, పోయెను. అని, తాత్పర్యము.

ప్రస్రవాణి మనోజ్ఞాని ప్రసన్నాని హ్రదానిచ

టీక॥ మనోజ్ఞాని= మనోహరములగు; ప్రస్రవాణి=సెలయేళ్లను; ప్రసన్నాని=నిర్మలములయిన; హ్రదానిచ=మడుగులను; పశ్యన్, జగామ (అధ్యాహృతము)=చూచుచుఁబోయెను.

మనోహరములగు సెలయేళ్లను నిర్మలమయిన జలముగల మడుఁగులనుంజూచుచు రావణుండుపోయెను

అని. తాత్పర్యము.

ధనధాన్యోపపన్నాని స్త్రీరత్నైశ్శోభితానిచ. ౨౫
హస్త్యశ్వరథగాఢాని నగరాణ్యవలోకయన్

టీక॥ ధనధాన్యోపపన్నాని = ధనములతోను ధాన్యములతోనుం గూడినవియు; స్త్రీరత్నైః = స్త్రీలలోనుత్తమలగువారలచేత; శోభితానిచ=ప్రకాశించుచున్నవియు; హస్త్యశ్వరథగాఢాని=ఏనుంగులచేతను గుఱ్ఱములచేతనురథములచేతనునిండినవియునగు; నగరాణి=పట్టణములను; అవలోకయన్= చూచుచు; జగామ (అధ్యాహృతము)= పోయెను.

ధనధాన్యసంపన్నములును ఉత్తమస్త్రీలతోనొప్పుచున్నవియు నేనుంగులతోనుగుఱ్ఱములతోనురథంబులతోనునిండినవియునగు నగరంబులంజూచుచు, రావణుండుపోయెను.

అని, తాత్పర్యము.

తం సమం సర్వతస్స్నిగ్ధం మృదుసంస్పర్శమారుతమ్. ౨౬
అనూపం సింధురాజస్య దదర్శ త్రిదశోపమమ్

టీక॥ సమం = మిట్టపల్లములులేనిదియు; సర్వతః=అంతటను; స్నిగ్ధం=నునుపైనదియు; మృదుసంస్పర్శ మారుతం=మెత్తనితాఁకుటగల గాలి గలదియు; త్రిదశోపమం = స్వర్గముతోఁబోలిక్కగలదియునగు; తం=ఆ; సింధురాజస్య=సముద్రము యొక్క; అనూపం=తీరమును; దదర్శ=చూచెను.




మిట్టపల్లములులేనిదియు అంతటను రమణీయంబును జల్లగాలిగలదియు స్వర్గంబువలె నతి సుందరంబైయున్నదియునగు సముద్రతీరమును, రావణుండు, చూచెను. అని, తాత్పర్యము.

తత్రాపశ్య త్సమేఘాభం న్యగ్రోధ మృషిభి ర్వృతమ్. ౨౭
సమంతా ద్యస్య తా శ్శాఖా శ్శతయోజన మాయతాః

టీక॥సః=ఆరావణుఁడు;తత్ర=అచ్చట,యస్య=దేనియొక్క;తాః=ఆ;శాఖాః=కొమ్మలు;సమంతాత్=అంతటను;శతయోజనం=నూఱుయోజనములు;ఆయతాః=పొడవులయినవో;తం(అధ్యాహృతము)=అట్టి;మేఘాభం=మేఘముయొక్క కాంతివంటికాంతిగలదియు,ఋషిభిః=ఋషులచేత,వృతం=చుట్టఁబడినదియునగు;న్యగ్రోధం=మఱ్ఱిచెట్టును;అపశ్యత్=చూచెను.

అచ్చటనా రావణుండు, నాలుగు ప్రక్కలను నూఱుయోజనముల నిడుపుగలకొమ్మలుగలదియు మేఘసమానంబును ఋషులకు నివాస భూతంబునగు న్యగ్రోధవృక్షముం జూచెను.

అని, తాత్పర్యము.

యస్య హస్తిన మాదాయ మహాకాయంచ కచ్ఛపమ్. ౨౮
భక్షార్థం గరుడ శ్శాఖా మాజగామ మహాబలః

టీక॥మహాబలః=అధికమయినబలముగల;గరుడః=గరుత్మంతుఁడు;హస్తినం=ఏనుంగును;మహాకాయం=పెద్దదేహముగల;కచ్ఛపం=తాఁబేలును;ఆదాయ=తీసికొని;భక్షార్థం=తినుటకొఱకు;యస్య (తస్య)=ఆచెట్టుయొక్క;శాఖాం=కొమ్మను,ఆజగామ=పొందెను.

మున్ను మహాబలశాలియగు గరుత్మంతుండు ఏనుంగును మహాకాయంబగు కచ్ఛపంబును దీసికొని,వానిందినుటకై యాచెట్టుకొమ్మపైకివ్రాలెను.

అని, తాత్పర్యము.

తస్య తాం సహసా శాఖాం భారేణ పతగోత్తమః. ౨౯




సుపర్ణః పర్ణబహుళాం బభంజచ మహాబలః

టీక॥ మహాబలః=అధికమయినబలముగల; పతగోత్తమః= పక్షిశ్రేష్ఠుఁడగుగరుత్మంతుఁడు; సహసా=శీఘ్రముగ; భారేణ=బరువుచేత ; తస్య= ఆవృక్షముయొక్క; శాఖాం= కొమ్మను; బభంజచ=విఱిచెను.

మహాబలశాలియగు నాగరుత్మంతునిభారము తాళఁజాలక యాచెట్టుకొమ్మతటాలునవిఱిగినది.
అని, తాత్పర్యము.

తత్ర వైఖానసా మాషా వాలఖిల్యా మరీచిపాః. ౩౦
అజా బభూవు ర్ధూమ్రాశ్చ సంగతాః పరమర్షయః

టీక॥ తత్ర=అచ్చట;మరీచిపాః=కిరణములనుద్రావువారలును ; అజాః=అయోనిజులును; ధూమ్రాశ్చ = పొగనుత్రావువారలును;పరమర్షయః=ఉత్తములయినఋషులునగు ; వైఖానసాః=వైఖానసులును; మాషాః = మాషగోత్రజులగు ఋషులును, వాలఖిల్యాః=వాలఖిల్యులును;సంగతాః=చేరినవారలు;బభూవుః=అయిరి.

ఆకొమ్మక్రింద,చంద్రసూర్యకిరణంబులుద్రావువారలను ధూమపులను , అయోనిజులునగు వైఖానసులనువాలఖిల్యులనుమాషులననుమహర్షులు తపస్సుచేయుచుండిరి. అని, తాత్పర్యము.

తేషాం దయార్థం గరుడ స్తాం శాఖాం శతయోజనామ్. ౩౧
జగామాదాయ వేగేన తౌ చోభౌ గజకచ్ఛపౌ

టీక॥గరుడః=గరుత్మంతుండు; తేషాం= ఆఋషులయొక్క ; దయార్థం=దయకొఱకు; శతయోజనాం=నూఱుయోజనములనిడుపుగల; తాం= ఆ;శాఖాం=కొమ్మను;తౌ=ఆ; గజకచ్ఛపౌ=ఏనుంగునుతాఁబేలును, ఉభౌచ=రెంటిని; ఆదాయ=తీసికొని ; వేగేన=వేగముచేత;జగామ=పోయెను.

గరుత్మంతుండు,ఆఋషులపైదయచేత, నూఱుయోజనంబుల నిడుపుగల యాశాఖనుఆగజకచ్ఛపంబులరెంటిని దీసికొని, వేగంబునంబోయెను.
అని, తాత్పర్యము.

స 3౫

ఏకపాదేన ధర్మాత్మా భక్షయిత్వా తదామిషమ్. 3౨
నిషాదవిషయం హత్వా శాఖయా పతగోత్తమః
ప్రహర్ష మతులం లేభే మోక్షయిత్వా మహామునీన్. 33

టీ॥ ధర్మాత్మా= ధర్మబుద్ధిగల, పతగోత్తమః= పక్షిశ్రేష్ఠుఁడగుగరుత్మంతుఁడు, ఏకపాదేన= ఒక్క కాలిచేత; తదామిషం = ఆమాంసమును; భక్షయిత్వా= తిని; శాఖయా= కొమ్మచేత; నిషాదవిషయం= నిషాదగ్రామమును; హత్వా= చంపి; మహామునీన్= పూజ్యులయినమునులను; మోక్షయిత్వా = విడిపించి; అతులం= సరిలేని; ప్రహర్షం= సంతోషమును; లేభే= పొందెను.

ధర్మాత్ముండగు గరుత్మంతుండు ఒక్క కాలిచే నిలిచి యాగజకచ్ఛపంబులందిని, యంత, నాశాఖచే నిషాదుల నందఱంజంపి, వారలనుభక్షించి, యమ్మహామునులనువిడిపించి, పరమసంతోషమునొందెను. అని, తాత్పర్యము.

స తేనైవ ప్రహర్షేణ ద్విగుణీకృతవిక్రమః
అమృతానయనార్థం వై చకార మతిమాన్మతిమ్. 3౪

టీక॥ మతిమాన్= అధికమయినబుద్ధిగల, సః= ఆగరుత్మంతుండు; తేన= ఆ, ప్రహర్షేణైవ = సంతోషముచేతనె; ద్విగుణీకృతవిక్రమః= రెండింతలుగాఁ జేయఁబడిన పరాక్రమముగలవాఁడై, అమృతానయనార్థం = అమృతంబుదెచ్చుటకై ("వై" అనునది పాదపూరణార్థము; ) మతిం= బుద్ధిని; చకార= చేసెను.

బుద్ధిమంతుండగు నాగరుత్మంతుండు, ఆసంతోషంబున రెట్టించినపరాక్రమముగలవాఁడై, యమృతంబుదేరం దలంచెను. అని, తాత్పర్యము.

అయోజాలాని నిర్మథ్య భిత్త్వా రత్నమయం గృహమ్. 3౫
మహేంద్రభవనాద్గుప్త మాజహారామృతం తతః

టీక॥ తతః= అంత ; సః (అధ్యాహృతము)= ఆగరుత్మంతుఁడు; అయోజాలాని = ఇనుపకిటికీలను ; రత్నమయం= రత్నవికారమయిన; గృహం=

ఇంటిని; భిత్వా=భేదించి; మహేంద్ర భవనాత్=మహేంద్రునింటనుండి; గుప్తం=రక్షింపఁబడిన; అమృతం=అమృతమును; ఆజహార=తెచ్చెను.

అంత, నాగరుత్మంతుండు, ఇనుపకిటికీలనుబగులఁగొట్టి,రత్నమయంబగు గృహమునుభేదించి, మహేంద్రునింట రక్షితంబైనయమృతంబుఁదెచ్చెను.

అని, తాత్పర్యము.

తం మహర్షిగణై ర్జుష్టం సుపర్ణకృతలక్షణమ్
నామ్నా సుభద్రం న్యగ్రోధం దదర్శ ధనదానుజః. ౩౬

టీక॥ ధనదానుజః = కుబేరునితమ్ముండగు రావణుఁడు ; మహర్షిగణైః=పూజ్యులయినఋషుల సమూహములతో;జుష్టం=కూడినదియు ; సుపర్ణకృతలక్షణం=గరుత్మంతునిచేఁ జేయఁబడినగుఱుతుగలదియు;నామ్నా=పేరుచేత;సుభద్రం = సుభద్రమను; తం=ఆ;న్యగ్రోధం=మఱ్ఱిచెట్టును; దదర్శ=చూచెను.

కుబేరునితమ్ముండగు రావణుఁడు , మహర్షిసేవితంబునుగరుత్మంతునిచేఁ గొమ్మువిఱిగినగుఱుతుగలదియు సుభద్రమనుపేరుగలదియునగున్యగ్రోధవృక్షమునుజూచెను.అని, తాత్పర్యము.

తంతు గత్వా పరం పారం సముద్రస్య నదీపతేః
దదర్శాశ్రమ మేకాంతే రమ్యే పుణ్యే వనాంతరే. ౩౭

టీక॥సః(అధ్యాహృతము)= ఆరావణుండు;నదీపతేః=ఏఱులకుఁ బెనిమిటియయిన;సముద్రస్య = సముద్రముయొక్క;పరం=అవలిదైన;పారం= గట్టును;గత్వా=పొంది;ఏకాంతే= విజనమయినదియు;రమ్యే=సుందరమయినదియు;పుణ్యే=పవిత్రమునగు; వనాంతరే=అడవిమధ్యమునందు;ఆశ్రమం= ఆశ్రమమును;దదర్శ=చూచెను.

అంతనారావణుండట్లు , సముద్రముయొక్కయావలిగట్టుఁజేరి,యచ్చట నేకాంతంబునురమణీయంబును బుణ్యంబునగువనంబునడుమ, నొకయాశ్రమంబుఁగనెను. అని,తాత్పర్యము.

తత్ర కృష్ణాజినధరం జటావల్కలధారిణమ్

దదర్శ నియతాహారం మారీచంనామ రాక్షసమ్. ౩౭

టీక॥ తత్ర= అచ్చట; కృష్ణాజినధరం=కృష్ణాజినమును దాల్చినవాఁడును; జటావల్కలధారిణం= జటలను నారచీరలను ధరించినవాఁడును ; నియతాహారం=నిగ్రహింపఁబడిన యాహారంబుగలవాఁడునగు; మారీచంనామ = మారీచుఁడను; రాక్షసం= రాక్షసుని ; దదర్శ=చూచెను.

రావణుం డయ్యాశ్రమంబునఁ గృష్ణాజినంబును జటావల్కలంబులును ధరించినవాఁడును నియతాహారుఁడునగు మారీచుండను రాక్షసుంజూచెను.

అని, తాత్పర్యము.

స రావణ స్సమాగమ్య విధివ త్తేనరక్షసా
మారీచేనా ర్చితో రాజా సర్వకామై రమానుషైః. ౩౯

టీక॥ రాజా = రాక్షసరాజుండగు; సః=ఆ; రావణః=రావణుఁడు; సమాగమ్య=చేరి; తేన=ఆ ; మారీచేన=మారీచుండను ; రక్షసా=రాక్షసునిచేత; విధివత్ = యథాశాస్త్రముగా; అమానుషైః= మనుష్యసంబంధులుగాని; సర్వకామైః= సమస్తములయినకోరఁబడుపదార్థములచేతను ; అర్చితః=పూజింపఁబడినాఁడు.

అంత, మారీచుండు, రాక్షసరాజుండగు రావణుండువచ్చుటంజూచి, యథాశాస్త్రంబుగా, మనుష్య దుర్లభంబులగు నానావిధ మహార్హపదార్థములచేతనింబూజించెను.

అని, తాత్పర్యము.

తం స్వయం పూజయిత్వాతు భోజనే నోదకేనచ
అర్థోపహితయా వాచా మారీచో వాక్య మబ్రవీత్. ४౦

టీక॥ మారీచః=మారీచుఁడు; స్వయం=తానే; తం=ఆరావణుని; భోజనేన=భోజనముచేతను; ఉదకేన=జలముచేతను; పూజయిత్వాతు= పూజించినంతనె; అర్థోపహితయా=అధికమయినయర్థముతోఁగూడిన; వా

చా=మాటచేత; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

మారీచుండు, ఆ రావణునకు, అర్ఘ్యపాద్యంబులను ఆహారంబులను, ఒసంగిపూజించి, యతనిం జూచి, యథార్థసహితంబగు మాటచే నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

కచ్చిత్సుకుశలం రాజన్ లంకాయాం రాక్షసేశ్వర
కేనార్థేన పున స్త్వం వై తూర్ణ మేవ మిహాగతః. ౪౧

టీక॥ రాక్షసేశ్వర = రాక్షసుల కుం బ్రభుండవైన; రాజన్ = రావణుండా! లంకాయాం=లంకయందు; సుకుశలం కచ్చిత్ = మిక్కిలియు క్షేమమే కదా? త్వం వై =నీవే; కేన=ఏ; అర్థేన=కార్యముచేత; పునః=మఱల; తూర్ణం=శీఘ్రముగా; ఏవం=ఇట్లు; ఇహ=ఇచ్చటికి, ఆగతః=వచ్చినావు?

రాక్షసరాజుండవగు రావణుండా! లంకయందంతయు క్షేమమే కదా! నీవె యింతశీఘ్రముగా మఱల నిచ్చటి కేందుకు వచ్చినావు? అని, మారీచుండు రావణు నడిగెను, అని, తాత్పర్యము.

ఏవ ముక్తో మహాతేజా మారీచేన స రావణః
తతః పశ్చా దిదం వాక్య మబ్రవీ ద్వాక్యకోవిదః. ౪౨

టీక॥ మహాతేజాః= అధికమయిన పరాక్రమముగలవాఁడును; వాక్యకోవిదః = మాటలయందుఁ బండితుండునగు; సః=ఆ; రావణః= రావణుఁడు; మారీచేన=మారీచుని చేత; ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; తతః పశ్చాత్=అటుపిమ్మట; ఇదం=ఈ; వాక్యం=మాటను; అబ్రవీత్= చెప్పెను.

మహాతేజుండును మాటలు చెప్పుటయందుఁ బండితుండునగు రావణుండు, మారీచుండు చెప్పినమాటనువిని, యంత, నీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

ఆరణ్యకాండే, పంచత్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండపంచత్రింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీః

షట్త్రింశసర్గప్రారంభః.

మారీచ శ్రూయతాం తాత వచనం మమ భాషతః
ఆర్తో౽స్మి మమ చార్తస్య భవాన్హి పరమా గతిః. ౧

టీక॥ తాత=నాయనా! మారీచ=మారీచుఁడా! భాషతః (భాషమాణస్య)=చెప్పుచున్నట్టి; మమ=నాయొక్క; వచనం=మాట; శ్రూయతాం=వినఁబడుఁగాక. ఆర్తః=దుఃఖితుఁడను; అస్మి=అగుచున్నాను. ఆర్తస్య=దుఃఖితుఁడనగు; మమ=నాకు; భవాన్=నీవు; పరమా=శ్రేష్ఠమయిన; గతిహి=గతివిగదా.

నాయనా! నేను జెప్పుమాట లన్నియు వినుము; నేనుమిక్కిలియు దుఃఖితుండనై తిని; ఆర్తుండనగు నాకుఁ బరమగతివినీవెకదా! అని, తాత్పర్యము.

జానీషే త్వం జనస్థానే యథా భ్రాతా ఖరో మమ
దూషణశ్చ మహాబాహుః స్వసా శూర్పణఖా చ మే. ౨
త్రిశిరాశ్చ మహాతేజా రాక్షసః పిశితాశనః
అన్యేచ బహవ శ్శూరా లబ్ధలక్షా నిశాచరాః. ౩
వసంతి మన్నియోగేన రతివాసంచ రాక్షసాః
బాధమానా మహారణ్యే మునీన్ వై ధర్మచారిణః. ౪




టీక॥యథా=ఎట్లు;మమ= నాయొక్క;భ్రాతా=తమ్ముఁడైన;ఖరః= ఖరుఁడును;మహాబాహుః= పెద్దచేతులుగల;దూషణశ్చ=దూషణుండును;మే=నాయొక్క;స్వసా=చెల్లెలగు;శూర్పణఖాచ=శూర్పణఖయును;మహాతేజాః అధికమయిన పరాక్రమముగలవాఁడును,పిశితాశనః= మాంసమె యాహారముగాఁగలవాఁడునగు ; త్రిశిరాః = త్రిశిరుఁడును;రాక్షసశ్చ= రాక్షసుఁడును;అన్యే=ఇతరులయిన ; లబ్ధలక్షాః=పొందఁబడినయుత్సాహముగలవారలును;శూరాః=యుద్ధమునందుభయము లేనివారలున;నిశాచరాః=రాత్రులందిరుగువారలునగు;రాక్షసాః= రాక్షసులు;బహవశ్చ=పెక్కండ్రును;మహారణ్యే=దండకారణ్యమునందు;మన్నియోగేన=నాయాజ్ఞచేత; ధర్మచారిణః = ధర్మమునాచరించునట్టి; మునీన్=మునులను ("వై" అనునది పాదపూరణార్థము);బాధమానాః=బాధించుచు; రతివాసం= ప్రీతిచేనివసించుట గల్గునట్లుగా;జనస్థానే=జనస్థానమునందు;వసంతి=ఉన్నారో; తథా (అధ్యాహృతము)=అట్లు,త్వం=నీవు, జానీషే= ఎఱుంగుదువు.

నాతమ్ముండుఖరుండును మహాబాహుండగు దూషణుండును నాచెల్లెలు శూర్పణఖయు మహాతేజుండగు త్రిశిరుండునుమఱియు నితరులగు శూరులయిన రాక్షసులు పెక్కండ్రును , నాయాజ్ఞచేదండకారణ్యంబున ధర్మచారులగుమునులనుబాధించుచు,జనస్థానంబుననున్నారన సంగతి,నీకుం దెలిసియున్నది. అని, తాత్పర్యము.

చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్
శూరాణాం లబ్ధలక్షాణాం ఖరచిత్తానువర్తినామ్. ౫

టీక॥భీమకర్మణాం= భయంకరమయినకార్యముగలవారలును;శూరాణాం=యుద్ధమునందు భయములేనివారలును;లబ్ధలక్షాణాం = పొందఁబడినయుత్సాహముగలవారలును;ఖరచిత్తానువర్తినాం=ఖరునిమనస్సు ననుసరించువారలునగు;రక్షసాం = రాక్షసులయొక్క;చతుర్దశ=పదునాలుగు; సహస్రాణి=వేలు;సంతి (అధ్యాహృతము)=ఉన్నవి.




భయంకరకర్ములును శూరులును మహోత్సాహులునగు రాక్షసులు, పదునాలుగు వేలమంది, ఖరునిక్రిందనున్నారు. అని, తాత్పర్యము.

తే త్విదానీం జనస్థానే వసమానా మహాబలాః
సంగతాః పరమాయత్తా రామేణ సహ సంయుగే. ౬
నానాప్రహరణోపేతాః ఖరప్రముఖ రాక్షసాః

టీక॥ జనస్థానే = జనస్థానమునందు; వసమానాః=వాసము సేయుచుండునట్టి, మహాబలాః=అధికమయినబలముగల; తే=ఆ, ఖరప్రముఖరాక్షసాస్తు= ఖరుఁడుమొదలు గాఁగల రాక్షసులును; ఇదానీం=ఇప్పుడు ; నానాప్రహరణోపేతాః=నానావిధములయిన యాయుధములతోఁ గూడినవారలయి; పరమాయత్తాః=మిక్కిలియుసన్నద్ధులయి ; సంయుగే=యుద్ధమునందు; రామేణసహ=రామునితోఁగూడ ; సంగతాః=చేరినారు.

జనస్థానంబునందు నివసించుచున్న మహాబలశాలులగునాఖరుండు మొదలగురాక్షసులు , నానావిధాయుధంబులం జేకొని, సన్నద్ధులయి, రామునితో యుద్ధంబు గావించిరి.

అని, తాత్పర్యము.

తేన సంజాత రోషేణ రామేణ రణమూర్ధని. ౭
అనుక్త్వా పరుషం కించి చ్ఛరై ర్వ్యాపారితం ధనుః

టీక॥సంజాతరోషేణ= పుట్టినకోపముగల; తేన=ఆ; రామేణ= రామునిచేత; రణమూర్ధని=యుద్ధాగ్రమునందు; కించిత్=కొంచెమయినను ; పరుషం=కఠినవచనమును; అనుక్త్వా = చెప్పక; ధనుః=ధనుస్సు; శరైః= బాణములచేత; వ్యాపారితం= వ్యాపారముగలది గాఁజేయఁబడినది.

అంత, నారాముండు, పరమకుపితుండై, యుద్ధంబునఁ గొంచెమేని పరుషవార్తఁ నాడక, ధనుస్సున, బాణంబులుగూర్చి, ధనుర్విద్యాపాండిత్యంబుఁ జూపెను. అని, తాత్పర్యము.

చతుర్దశ సహస్రాణి రక్షసా ముగ్ర తేజసామ్. ౮

నిహతాని శరై స్తీక్ష్ణై ర్మానుషేణ పదాతినా

టీక॥ పదాతినా= కాలినడకనున్న వాఁడును; మానుషేణ=మనుష్యుఁడు నగు రామునిచేత; ఉగ్రతేజసాం= భయంకరమయినపరాక్రమముగల ; రక్షసాం=రాక్షసులయొక్క; సహస్రాణి=వేలు; చతుర్దశ=పదునాలుగు ; తీక్ష్ణైః=కఱకులయిన; శరైః=బాణములచేత; నిహతాని=వధింపఁబడినవి.

పదాతియు నుమనుష్యుండు నగు రాముఁడొక్కఁడు భయంకర పరాక్రములగు పదునాలుగు వేల రాక్షసుల వధించెను. అని, తాత్పర్యము.

ఖరశ్చ నిహత స్సంఖ్యే దూషణశ్చ నిపాతితః. ౯
హతశ్చ త్రిశిరాశ్చాపి నిర్భయా దండకాః కృతాః

టీక॥సంఖ్యే=యుద్ధమునందు; ఖరశ్చ=ఖరుఁడును,నిహతః= చంపఁబడెను.దూషణశ్చ=దూషణుఁడును; నిపాతితః=చంపఁబడినాఁడు . త్రిశిరాశ్చాపి=త్రిశిరుఁడును;హతశ్చ= చంపఁబడెను.దండకాః=దండకారణ్యము; నిర్భయాః=భయములేనిది;కృతాః=చేయఁబడినది.

ఖరుండు,దూషణుండు,త్రిశిరుండు, ఇమ్మహావీరులందఱు వధింపఁబడిరి; ఇప్పుడు, దండకారణ్యమున, ఋషులకు, ఎంతమాత్రము భయము లేనట్లు చేయఁబడినది. అని, తాత్పర్యము.

పిత్రా నిర స్తః క్రుద్ధేన సభార్యః క్షీణజీవితః. ౧౦
స హంతా తస్య సైన్యస్య రామః క్షత్రియపాంసనః

టీక॥ క్రుద్ధేన = కోపించినట్టి; పిత్రా=తండ్రిచేత; నిరస్తః= విడువఁబడినవాఁడును; సభార్యః= భార్యతోఁగూడినవాఁడును; క్షీణజీవితః=నశించినప్రాణముగలవాఁడును;క్షత్రియపాంసనః=క్షత్రియాధముండునగు;సః=ఆ; రామః=రాముఁడు ; తస్య= ఆ,సైన్యస్య= సైన్యముయొక్క ; హంతా= వధించువాఁడు.

కుపితుండగుతండ్రిచేఁదఱుమఁబడిన

వాఁడును భార్యాసహితుండును, ఆయుస్సుదీఱినవాఁడును క్షత్రియాధముండును గునా రాముండు అంతటి సైన్యమునంత యు వధించినవాఁడు అని, తాత్పర్యము-

దుశ్శీలః కర్కశ స్తీక్ష్ణో మూర్ఖో లుబ్ధో జితేంద్రియః. ౧౧
త్యక్తధర్మో హ్యధర్మాత్మా భూతానా మహితే రతః

టీక॥ సః(అధ్యాహృతము)=ఆరాముఁడు; దుశ్శీలః = దుష్టస్వభావుఁడు. కర్కశః=క్రూరుఁడు.తీక్ష్ణః = కఠినుఁడు. మూర్ఖః=మూర్ఖుఁడు. లుబ్ధః= ఆసపోతు.అజితేంద్రియః= జయింపఁబడని యింద్రియములుగలవాఁడు . త్యక్తధర్మః = విడువఁబడినధర్మముగలవాఁడు అధర్మాత్మా= అధర్మమునందుబుద్ధిగలవాఁడు . భూతానాం= ప్రాణులయొక్క ; అహితే = కీడునందు ; రతో హి = ఆసక్తుఁడును గదా!

ఆరాముడు, దుష్టుఁడు ; క్రూరుఁడు;కఠినహృదయుఁడు; మూర్ఖుఁడు; లుబ్ధుఁడు ; ఇంద్రియంబులకు లోఁబడియుండువాఁడు; ధర్మంబువిడిచియధర్మం బాచరించువాఁడు ; ప్రాణులకుఁగీడు గావించువాఁడు.

అని, తాత్పర్యము.

యేన వైరం వినారణ్యే సత్త్వ మాశ్రిత్య కేవలమ్- ౧౨
కర్ణనాసాపహరణా ద్భగినీ మే విరూపితా
తస్య భార్యాం జనస్థానా త్సీతాం సురసుతోపమామ్. ౧३
ఆనయిష్యామి విక్రమ్య సహాయ స్తత్ర మే భవ

టీక॥ యేన = ఏరామునిచేత, అరణ్యే=అడవియందు;వైరంవినా= విరోధములేక యె, సత్త్వం కేవలం=బలమును మాత్రమె;ఆశ్రిత్య=ఆశ్రయించి; కర్ణనాసాపహరణాత్= చెవులనుముక్కును అపహరించుటవలన; మే = నా యొక్క;భగినీ=చెల్లెలగు శూర్పణఖ; విరూపితా = విరూపగాఁజేయఁబడినదో;తస్య = అట్టి రామునియొక్క;భార్యాం = భార్యయయిన;సురసుతోపమాం = దేవకన్యతోఁబోల్కిగల;సీతాం=సీతను;జనస్థానాత్=జనస్థాన

బుననుండి; విక్రమ్య=పరాక్రమించి; ఆనయిష్యామి (అనేష్యామి)=తెచ్చెదను. తత్ర=ఆవిషయమునందు; మే=నాకు, సహాయః=తోడు, భవ=అగుము.

ఎవ్వఁడు, ఎంతమాత్రము వైరములేకున్నను, కేవలబలగర్వంబున, వనంబునందు, నాచెల్లెలి శూర్పణఖను, ముకుచెవులుగోసి, విరూపగావించెనో, ఆ రాముని భార్యను దేవకన్యాసమానురాలను సీతం దేవలయు; నీవా విషయమునందు సాహాయ్యంబు సేయుము.

అని, తాత్పర్యము.

త్వయా హ్యహం సహాయేన పార్శ్వస్థేన మహాబల. ౧౪
భ్రాతృభిశ్చ సురాన్ యుద్ధే సమగ్రా నృభిచింతయే

టీక॥ మహాబల= అధికమయినబలముగలమారీచుఁడా! సహాయేన= తోడైనవాఁడవును; పార్శ్వేస్థేన=ప్రకటనున్నవాఁడవునగు; త్వయా= నీచేత; భ్రాతృభిశ్చ=తమ్ములచేతను; యుద్ధే=యుద్ధమునందు; సమగ్రాన్= సంపూర్ణులగు; సురాన్=దేవతలను; నాభిచింతయే హి=తలంపనగదా!

మహాబలుండవగుమారీచుఁడా! నీవును నాతమ్ములును నాకు సహాయులుగా నాప్రకటనుండఁగా, నేను యుద్ధంబున, దేవతలందఱు నొకటిగావచ్చినను, సరకుసేయకుందునుగదా!

అని, తాత్పర్యము.

తత్సహాయో భవ త్వం మే సమర్థోహ్యసి రాక్షస. ౧౫

టీక॥ రాక్షస = మారీచుఁడా! తత్=అందువలన; త్వం=నీవు; మే = నాకు; సహాయః=సహాయుఁడవు; భవ=అగుము. సమర్థః= సమర్థుండవు; అసి హి=అగుచున్నావుగదా!

మారీచుఁడా! అందువలన, నీవు నాకుసహాయుఁడవగుము; నీవుమిక్కిలియుసమర్థుండవు. అని, తాత్పర్యము.

వీర్యే యుద్ధేచ దర్పేచ నహ్యస్తి సదృశస్తవ
ఉపాయజ్ఞో మహాన్ శూర స్సర్వమాయావిశారదః. ౧౬

టీక॥ వీర్యే= పరాక్రమమునందును; యుద్ధేచ= యుద్ధమునందును ; ద




ర్పేచ=గర్వమునందున; తవ=నీకు; సదృశః=సమానుఁడు; నాస్తిహి=లేఁడుగదా! త్వం (అధ్యాహృతము)=నీవు; ఉపాయజ్ఞః= ఉపాయముదెలిసినవాఁడవు; మహాన్=గొప్పవాఁడవు; శూరః = యుద్ధమునందుభయములేనివాఁడవు; సర్వమాయావిశారదః= సమస్తములయిన మాయలందును బండితుఁడవు.

పరాక్రమంబునను దర్పంబునను యుద్ధంబునను నీకుసరియయినవాఁ డెవ్వఁడనులేఁడు; నీవు, ఉపాయంబు దెలిసినవాఁడవు; మహాశూరుండవు; సమస్తమాయలును దెలిసినవాఁడవు-

అని, తాత్పర్యము.

ఏతదర్థ మిహ ప్రాప్త స్త్వత్సమీపం నిశాచర
శృణు తత్కర్మ సాహాయ్యే యత్కార్యం వచనా న్మమ.౧౭

టీక॥ నిశాచర=మారీచుఁడా! ఏతదర్థం=ఇందుకొఱకు; ఇహ= ఇచ్చటికి, త్వత్సమీపం=నీసమీపమును; ప్రాప్తః=పొందినాను. సాహాయ్యే = తోడుపాటునందు; మమ=నాయొక్క; వచనాత్=మాటవలన; యత్=ఏది; కార్యం=చేయఁదగినదో; తత్=ఆ; కర్మ=కార్యమును; శృణు=వినుము.

మారీచుఁడా! ఇందుకొఱకే నేను నీయొద్దకు వచ్చినాను; నాకు నీవు సాహాయ్యము సేయ నేమిచేయవలెనో చెప్పెదను వినుము. అని, తాత్పర్యము.

సౌవర్ణ స్త్వం మృగో భూత్వా చిత్రో రజతబిందుభిః
ఆశ్రమే తస్య రామస్య సీతాయాః ప్రముఖే చర.౧౮

టీక॥ త్వం=నీవు; రజతబిందుభిః= వెండిబిందువులచేత; చిత్రః= నానావర్ణమయిన; సౌవర్ణః = బంగారువికారమయిన; మృగః = జింక; భూత్వా=అయి; తస్య=; ఆ; రామస్య=రామునియొక్క; ఆశ్రమె= ఆశ్రమమునందు; సీతాయాః = సీతయొక్క; ప్రముఖే=ఎదుటను; చర=సంచరింపుము.

నీవు, వెండిబిందువులతో నొప్పుచున్న బంగారుజింకరూపము ధరించి, రాముని యాశ్రమంబున సీత యెదుట సంచరింపుము. అని, తాత్పర్యము.




త్వాంతు నిస్సంశయం సీతా దృష్ట్వాతు మృగరూపిణమ్
గృహ్యతామితి భర్తారం లక్ష్మణంచాభిధాస్యతి. ౧౯

టీక॥ సీతా=సీత; మృగరూపిణం=జింకరూపముగల; త్వాంతు=నిన్నుమాత్రము; దృష్ట్వాతు=చూచినంతనే; నిస్సంశయం=నిస్సందేహముగా; గృహ్యతాం=పట్టఁబడుఁగాక. ఇతి=అని; భర్తారం=పెనిమిటిని; లక్ష్మణం చ=లక్ష్మణునిఁగూర్చిన్ని, అభిధాస్యతి=చెప్పఁగలదు.

సీత, కాంచనమృగరూపంబుధరించిననిన్నుఁజూచినంతనె, దీనింబట్టియుండని, తనపెనిమిటితోను లక్ష్మణునితోను నిస్సంశయముగాఁజెప్పును.

అని, తాత్పర్యము.

తత స్తయో రపాయేతు శూన్యే సీతాం యథాసుఖమ్,
నిరాబాధో హరిష్యామి రాహు శ్చంద్రప్రభామివ. ౨౦

టీక॥ తతః=అంత; తయోః=ఆరామలక్ష్మణులయొక్క; అపాయేత=పోవుటకాఁగానే; శూన్యే=శూన్యప్రదేశమునందు; నిరాబాధః=ఆటంకములేనివాఁడనై; యథాసుఖం=సుఖముగా; రాహుః=రాహువు; చంద్రప్రభామివ=చంద్రునికాంతినివలె; హరిష్యామి=అపహరించెదను.

అంత, నారామలక్ష్మణులు పోయినవెనుక, శూన్యంబగువరణ్యంబున, నడ్డిలేనివాఁడనై, సుఖంబుగ రాహువుచంద్రప్రభనుగబళించునట్లు, సీతనపహరించెదను. అని, తాత్పర్యము.

తతఃపశ్చా త్సుఖం రామే భార్యాహరణకర్శితే
విస్రబ్ధం ప్రహరిష్యామి కృతార్థే నాంతరాత్మనా. ౨౧

టీక॥ తతఃపశ్చాత్=అటుపిమ్మట; భార్యాహరణకర్శితే=భార్యనపహరించుటచేఁగృశింపఁజేయఁబడిన; రామే=రామునియందు; సుఖం=సుఖముగా; విస్రబ్ధం=నిర్భయముగాఁ; కృతార్థేన=చేయఁబడినపనిగల; అంతరాత్మనా=మనస్సుతోఁ; ప్రహరిష్యామి=కొట్టెదను.

అంత, రాముండు, భార్యావిరహంబునం బరమదుఃఖితుండై కృశించును, గావున, నతండు యుద్ధంబునకు వచ్చినను, గృతార్థుండనై నిర్భయంబుగాc, బ్రహరించెదను. అని, తాత్పర్యము.

తస్య రామకథాం శ్రుత్వా మారీచస్య మహాత్మనః
శుష్కం సమభవ ద్వక్త్రం పరిత్రస్తో బభూవ హ. ౨౨

టీక॥ రామకథాం = రామునిమాటను; శ్రుత్వా = విని; మహాత్మనః = అధికమయినబలముగల; తస్య = ఆ; మారీచస్య = మారీచునియొక్క; వక్త్రం = నోరు; శుష్కం = ఎండినది; సమభవత్ = అయినది. పరిత్రస్తః = భయపడినవాcడు, బభూవ = ఆయెను "హ" అనునది పాదపూరణార్థము.

రాముని పేరు విన్నంతనె మహాబలుండగు నమ్మారీచునినోరెండి, యతండు పరమభీతుండయ్యె. అని, తాత్పర్యము.

ఓష్ఠౌ పరిలిహన్ శుష్కౌ నేత్రై రనిమిషై రివ
మృతభూత ఇవార్తస్తు రావణం సముదైక్షత. ౨౩

టీక॥ సః (అధ్యాహృతము) = ఆ మారీచుండు; శుష్కౌ = ఎండిన; ఓష్ఠౌ = పెదవులను; పరిలిహన్ = నాకుచు; అనిమిషైరివ (స్థితైః) = తెప్పపాటులేనట్లున్న; నేత్రైః = కన్నులతో; మృతభూతఇవ = చచ్చినవాcడువలె; ఆర్తస్తు = దుఃఖితుండైయె; రావణం = రావణుని; సముదైక్షత = చూచెను.

ఆమారీచుండు, ఎండిన పెదవులం దడువుకొనుచు, చచ్చినవాcడువలెcబరమార్తుండై, తెప్పపాటులేనికన్నులతో రావణుc జూచుచుండెను. అని, తాత్పర్యము.

స రావణం త్రస్తవిషణ్ణచేతా
మహావనే రామపరాక్రమజ్ఞః
కృతాంజలి స్తత్త్వ మువాచ వాక్యం
హితంచ తస్మై హిత మాత్మనశ్చ. ౨౪

టీక॥ మహావనే=దండకారణ్యమునందు; రామపరాక్రమజ్ఞః= రాముని పరాక్రమమును దెలిసినట్టి; సః=ఆమారీచుఁడు; త్రస్తవిషణ్ణచేతాః=భయపడినదియు దుఃఖితమునగు మనస్సుగలవాఁడై; రావణం= రావణునిగూర్చి; తస్మైచ=ఆరావణునికొఱకును; హితం=మేలుగలిగించునదియు ;ఆత్మనశ్చ= తనకును; హితం=మేలుగలిగించునదియు, తత్త్వం=యథార్థమునగు; వాక్యం=మాటను,ఉవాచ=చెప్పెను.

దండకారణ్యంబుననిదివఱకు రాముని పరాక్రంబు నెఱింగియుండునట్టి యమ్మారీచుండు, పరమభీతుండై పరమదుఃఖితుండై, చేతులు మొగిడ్చి, రావణుంజూచి, యతనికిం దనకును హితంబునుయథార్థంబునగు నీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, షట్త్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండషట్త్రింశసర్గటీక,
ముగిసినది.

---

ఓం.

స ప్త త్రిం శ స ర్గ ప్రా రం భః.

తచ్ఛ్రుత్వా రాక్షసేంద్రస్య వాక్యం వాక్యవిశారదః
ప్రత్యువాచ మహాప్రాజ్ఞో మారీచో రాక్షసేశ్వరమ్. ౧

టీక॥ వాక్యవిశారదః = మాటలయందుఁబండితుండును ; మహాప్రాజ్ఞః=మహాపండితుండునగు;మారీచః=మారీచుఁడు; రాక్షసేంద్రస్య= రాక్షసులకుఁబ్రభుఁడగు రావణునియొక్క ; తత్ =ఆ; వాక్యం=మాటను; శ్రుత్వా=విని; రాక్షసేశ్వరం= రాక్షసులకు రాజయిన రావణునిగూర్చి; ప్రత్యువాచ =

బదులుచెప్పెను.

మాటలయందుగట్టివాఁడును , మహాపండితుండునగుమారీచుండు , రాక్షసరాజుండగురావణునిమాటనువిని, రావణుఁజూచి,యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః
అప్రియస్యతు పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః. ౨

టీక॥ రాజన్ = రాక్షసరాజుఁడవగురావణుఁడా! సతతం = ఎల్లప్పుడును ; ప్రియవాదినః=ప్రియములగుమాటలఁజెప్పునట్టి; పురుషాః=పురుషులు; సతతం=ఎల్లప్పుడును; సులభాః= సుఖముగాఁబొందఁదగినవారలు. అప్రియస్య=ప్రియముకాని; పథ్యస్యతు = హితమునకుమాత్రము; వక్తా= చెప్పవాఁడును; శ్రోతాచ=వినువాఁడును ; దుర్లభః=పొందఁగూడనివాఁడు.

రాక్షసరాజుండవగురావణుఁడా! కీడుమేలెంచక ఇచ్చకములాడువారలు, ఎల్లప్పుడును గావలసినంతమందిదొరకుదురు; అప్రియమయినహితమునుజెప్పువాఁడునుజెప్పినచోవినువాడును, ఎవ్వఁడునులేఁడు.అని, తాత్పర్యము.

న నూనం బుధ్యసే రామం మహావీర్యం గుణోన్నతమ్
అయుక్తచార శ్చపలో మహేంద్రవరుణోపమమ్. ౩

టీక॥ అయుక్తచారః= నియోగింపఁబడనిచారులుగలవాఁడవును ; చపలః= చంచలుండవునగు ; త్వం (అధ్యాహృతము)=నీవు; రామం= రాముని; మహావీర్యం=అధికమయినపరాక్రమముగలవానిఁగాను;గుణోన్నతం= గుణములచేతనధికునిగాను ; మహేంద్రవరుణోపమం= దేవేంద్రునితోనువరుణునితోనుంబోలికగలవానిఁగాను ; నబుధ్యసే=ఎఱుంగవు. నూనం = నిశ్చయము.

నీవు,చారులచేశత్రువునిజాడదెలిసికొనలేదు, మఱియుఁజపలుండవుకావున,రాముండుమహా పరాక్రమశాలియనియుసమస్తసద్గుణసంపన్నుండనియు మహేంద్రవరుణులకు సాటివచ్చువాఁడనియు, నీకుఁదెలియలేదు , ఇదినిశ్చయము.అని, తాత్పర్యము.

అపిస్వస్తి భవే త్తాత సర్వేషాం భువి రక్షసామ్
అపిరామో నసంక్రుద్ధః కుర్యాల్లోక మరాక్షసమ్. ౪

టీక॥ తాత=నాయనా భువి=భూమియందు ; రక్షసాం=రాక్షసుల కు;సర్వేషాం = అందఱకును;స్వస్తి=మంగళము;భవేదపి=కలుగునా యేమి? రామః=రాముఁడు;సంక్రుద్ధః= కోపమునొందినవాఁడై;లోకం = లోకమును;అరాక్షసం= రాక్షసులె లేనిదానిఁగా; నకుర్యాదపి = చేయకుండునా యేమి?

నాయనా! భూమిలోనింక రాక్షసులకందఱకుమంగళముకలుగునా ? రాముండుకోపించి, లోకములో రాక్షసులె లేకుండునట్లుచేయఁడా యేమి?

అని, తాత్పర్యము.

అపి తే జీవితాంతాయ నోత్పన్నా జనకాత్మజా
అపి సీతానిమిత్తంచ నభవేద్వ్యసనం మమ. ౫

టీక॥ జనకాత్మజా=జనకమహారాజుకూఁతురయినసీతాదేవి; తే= నీయొక్క;జీవితాంతాయ= ప్రాణనాశముకొఱకు;అపినోత్పన్నా=పుట్టలేదా యేమి?మమ=నాకు;సీతానిమిత్తం = సీతయెకారణముగాఁగల ; వ్యసనంచ= దుఃఖమును ; నభవేదపి = కలుగదు కదా ?

సీతాదేవి నీమరణంబుకై పుట్టలేదా యేమి? సీతానిమిత్తముగా నాకుదుఃఖముకలుగదా యేమి?

అని, తాత్పర్యము,

అపి త్వా మీశ్వరం ప్రాప్య కామవృత్తం నిరంకుశమ్
నవినశ్యే త్పురీ లంకా త్వయా సహ సరాక్షసా. ౬

టీక॥ కామవృత్తం= ఇచ్ఛాధీనమగు నాచారముగలవాఁడవును ; నిరంకుశం=అడ్డిలేనివాఁడవునగు; త్వాం= నిన్ను ; ఈశ్వరం=ప్రభువునుగా; ప్రాప్య=పొంది;లంకా=లంకయను;పురీ=పట్టణము; త్వయాసహ=తోనీఁగూడ; సరాక్షసా=రాక్షసులతోఁగూడినదై ; నవినశ్యేదపి=నశింపదా యేమి?

నిరంకుశంబుగామనసునకు వచ్చినట్లాచరించునట్టినిన్నునాథునిఁగాఁ బొం

ది, లంకాపురి, సీతోనుసమస్తరాక్షసులతోనుఁగూడ నాశమునొందకుండునా యేమి? అని, తాత్పర్యము.

త్వద్విధః కామవృత్తోహి దుశ్శీలః పాపమంత్రితః
ఆత్మానం స్వజనం రాష్ట్రం స రాజా హంతి దుర్మతిః ౭

టీక॥ యః=ఎవ్వఁడు ; త్వద్విధః=నీయట్టి; కామవృత్తః= యథేచ్ఛాచారముగలవాఁడును; దుశ్శీలః = దుష్టస్వభావుఁడును, పాపమంత్రితః= పాపముఁగలిగించునట్టియాలోచనముగలవాఁడునో; సః=అట్టి; దుర్మతిః= దుష్టబుద్ధియగు; రాజా = రాజు; ఆత్మానం=తన్నును; స్వజనం=తనజనమును; రాష్ట్రం=రాజ్యమును; హంతిహి = నశింపఁజేసికొనుచున్నాఁడుగదా!

ఎవ్వఁడు,నీవలెమనస్సునకువచ్చినట్లాచరించుచుదుష్టస్వభావుండైపాపాలోచనముఁజేయుచుండునో, అట్టిదుర్మతియగురాజు , తన్నునుతనబంధువులను తనరాజ్యమును జెఱచుకొనును. అని, తాత్పర్యము.

నచ పిత్రా పరిత్యక్తో నామర్యాదః కథంచన
నలుబ్ధో నచదుశ్శీలో నచక్షత్రియపాంసనః. ౮
నచధర్మగుణైర్హీనః కౌసల్యానందవర్ధనః
నతీక్ష్ణో నచ భూతానాం సర్వేషా మహితే రతః. ౯

టీక॥ కౌసల్యానందవర్ధనః= కౌసల్యయొక్కసంతోషమును వృద్ధిఁబొందించునట్టిరాముండు; పిత్రా= తండ్రిచేత, పరిత్యక్తశ్చ= విడువఁబడినవాఁడును; న=కాడు. కథంచన= ఎట్లయినను; అమర్యాదః= మర్యాదలేనివాఁడును; న=కాఁడు. లుబ్ధః=ఆసగొన్నవాఁడు;న=కాఁడు.దుశ్శీలశ్చ=దుస్స్వభావుఁడును;న=కాఁడు; క్షత్రియపాంసనశ్చ=క్షత్రియాధముఁడును; న=కాఁడు. ధర్మగుణైః=ధర్మముచేతనుగుణములచేతను; హీనశ్చ=విడువఁబడినవాఁడును; న=కాఁడు;తీక్ష్ణః=క్రూరుఁడు; న=కాఁడు. సర్వేషాం=సమస్తములయిన; భూతానాం=ప్రాణులకు; అహితే=కీడునందు; రతశ్చ=ఆసక్తుఁడును; న=కాఁడు.

రాముఁడు తండ్రిచేవఁబుమఁగొట్టఁ

బడినవాఁడుకాఁడు; మర్యాదలేనివాఁడు కాఁడు; లుబ్ధుఁడు కాఁడు; దుష్టస్వభావుఁడు కాఁడు; క్షత్రియాధముఁడు కాఁడు; ధర్మగుణంబుగానిగుణంబులుగానిలేనివాఁడుకాఁడు; క్రూరుఁడు కాఁడు; సమస్తభూతంబులకును గీడుగావించువాఁడునుగాఁడు. అని, తాత్పర్యము.

వంచితం పితరం దృష్ట్వా కైకేయ్యా సత్యవాదినమ్
కరిష్యామీతి ధర్మాత్మా తాత ప్రవ్రజితో వనమ్. ౧౦

టీక॥ తాత= నాయనా. కైకేయ్యా=కైకేయిచేత; వంచితం= మోసపుచ్చఁబడినవాఁడును; సత్యవాదినం= సత్యములనెచెప్పువాఁడునగు; పితరం= తండ్రిని; దృష్ట్వా = చూచి; ధర్మాత్మా= ధర్మస్వభావుఁడగు రాముండు; కరిష్యామీతి=చేసెదనని; ఉక్త్వా (అధ్యాహృతము)= చెప్పి; వనం = అడవిని; ప్రవ్రజితః=పోందినాఁడు.

నాయనా! తనతండ్రికైకేయికిమోసపోయి సత్యపాశబద్ధుండై యుండుటంజూచి, ధర్మాత్ముండగు రాముండు కైకేయికోరికనిగావించి, తండ్రిని అసత్యదోషములేనివానిఁ గావించెదనని చెప్పి, యడవికివచ్చినాఁడు.

అని, తాత్పర్యము.

కైకేయ్యాః ప్రియకామార్థం పితు ర్దశరథస్యచ
హిత్వా రాజ్యంచ భోగాంశ్చ ప్రవిష్టో దండకావనమ్. ౧౧

టీక॥ సః(అధ్యాహృతము) = ఆ రాముఁడు; కైకేయ్యాః = కైకేయియొక్కయు; పితుః=తండ్రియయిన; దశరథస్యచ=దశరథునియొక్కయు; ప్రియకామార్థం = సంతోషమునెడు కోర్కెకొఱకు; రాజ్యంచ=దొరతనమును; భోగాంశ్చ=భోగములను; హిత్వా=విడిచి; దండకావనం=దండకారణ్యమును; ప్రవిష్టః = ప్రవేశించినాఁడు.

రాముండు, కైకేయికిని దశరథునకును సంతోషంబుగలుగుటకై, రాజ్యంబును భోగంబులను విడిచి, దండకారణ్యంబునకు వచ్చినాఁడుగాని వేఱుగాదు.

అని, తాత్పర్యము.

న రామః కర్కశ స్తాత నావిద్వా న్నాజితేంద్రియః
అనృతం దుశ్శ్రుతం చైవ నైవ త్వం వక్తు మర్హసి. ౧౨

టీక॥ తాత=నాయనా! రామః=రాముఁడు; కర్కశః=కఠినుఁడు; న=కాఁడు. అవిద్వాన్=పండితుఁడుకానివాఁడు;న=కాఁడు. అజితేంద్రియః=జయింపఁబడనియింద్రియములుగలవాఁడు; న=కాఁడు త్వం=నీవు;అనృతం=అబద్ధమును; దుశ్శ్రుతంచైవ=తప్పుగా విన్నమాటను; వక్తుం=చెప్పుటకు,నార్హసి=తగనేతగవు.

నాయనా! రాముండు, కఠినుం డుకాఁడు; మూఢుఁడుకాఁడు; ఇంద్రియవశ్యుండునుగాఁడు ; తప్పుడుమాటలనువినినీవిట్లబద్ధముఁజెప్పరాదు.

అని, తాత్పర్యము.

రామో విగ్రహవాన్ ధర్మ స్సాధు స్సత్యపరాక్రమః
రాజా సర్వస్య లోకస్య దేవానాం మఘవానివ. ౧౩

టీక॥రామః=రాముఁడు; విగ్రహవాన్=ఆకారముగల; ధర్మః = ధర్మము. సాధుః=సత్పురుషుఁడు.సత్యపరాక్రమః = సత్యమయినపరాక్రమముగలవాఁడు. దేవానాం= దేవతలకు,మఘవానివ=ఇంద్రుఁడువలె; సర్వస్య=సమస్తమయిన; లోకస్య = జనమునకును; రాజా=ప్రభువు.

రాముండు; ఆకారమునొందిన ధర్మంబవందగును; సత్పురుషుండు; సత్యపరాక్రముండు; దేవతల కందఱకును ఇంద్రుఁడుప్రభువగునట్లు,జనులకందఱకును అతండుప్రభుండు.

అని, తాత్పర్యము.

కథం త్వం తస్య వైదేహీం రక్షితాం స్వేన తేజసా
ఇచ్ఛసి ప్రసభం హర్తుం ప్రభామివ వివస్వతః. ౧౪

టీక॥త్వం=నీవు; తస్య= ఆరామునియొక్క, స్వేన=తనదైన; తేజసా=పరాక్రమముచేత; రక్షితాం= రక్షింపఁబడిన; వైదేహీం=సీతను; వివస్వతః=సూర్యునియొక్క; ప్రభామివ = కాంతినివలె;ప్రసభం=బలాత్కారముగా; హర్తుం=హరించుటకు; కథం=ఎట్లు; ఇచ్ఛసి= కోరుచున్నావు?

అట్టి రాముని తేజంబుచే సురక్షిత యయియున్న సీతాదేవిని బలాత్కారంబుననీవెట్లపహరింపఁ గోరెదవు? ఎవ్వరేని, సూర్యునికాంతినిహరింపఁగలరా? అని, తాత్పర్యము.

శరార్చిష మనాధృష్యం చాపఖడ్గేంధనం రణే
రామాగ్నిం సహసా దీప్తం న ప్రవేష్టుం త్వ మర్హసి. ౧౫

టీక॥ త్వం=నీవు; రణే= యుద్ధమునందు;శరార్చిషం=బాణములెజ్వాలలుగాగలదియు; చాపఖడ్గేంధనం= ధనుస్సును ఖడ్గమునే కట్టెలుగాఁ గలదియు; అనాధృష్యం=ఎదిరింపఁగూడనిదియు; దీప్తం=మండుచున్నదియునగు; రామాగ్నిం=రాముఁడనునగ్నిహోత్రమును; ప్రవేష్టుం=ప్రవేశించుటకు; నార్హసి=తగవు.

నీవు, యుద్ధమునందు , బాణంబులెజ్వాలలుగాఁగలదియుధనుస్సు ఖడ్గంబునెకట్టెలుగాఁగలదియు నెదిరింపనలవిగానిదియుఁబ్రజ్వలించుచున్నదియు నగురాముండను నగ్నిహోత్రములో , నెంతమాత్రముపడకుము.

అని, తాత్పర్యము.

ధనుర్వ్యాదితదీప్తాస్యం శరార్చిష మమర్షణమ్
చాపపాశధరం వీరం శత్రుసైన్యప్రహారిణమ్. ౧౬
రాజ్యం సుఖంచ సంత్యజ్య జీవితం చేష్ట మాత్మనః
నాత్యాసాదయితుం తాత రామాంతక మిహార్హసి. ౧౭

టీక॥ తాత=నాయనా!త్వం (అధ్యాహృతము)= నీవు;రాజ్యం=దొరతనమును;సుఖంచ=సుఖమును ; ఆత్మనః=ఆత్మకు;ఇష్టం = ప్రియమయిన; జీవితంచ=బ్రతికియుండుటను; సంత్యజ్య=విడిచి;ఇహ=ఇప్పుడు; ధనుర్వ్యాదితదీప్తాస్యం= ధనుస్సె తెఱవఁబడినదియుమండుచున్నదియునగు నోరుగాఁగలవాఁడును;శరార్చిషం= బాణములెమంటలుగాఁగలవాఁడును; అమర్షణం=కుపితుండును; చాపపాశధరం= ధనుస్సును బాశమును ధరించినవాఁడును;వీరం= పరాక్రమశాలియును ; శత్రుసైన్యప్రహారిణం = శత్రుసైన్యము

నుసంహరించువాఁడునగు; రామాంతకం=రాముఁడనుయముని; అత్యాసాదయితుం= మిక్కిలియుసమీపించుటకు; నార్హసి=తగవు.

నాయనా! నీవు రాజ్యంబును సుఖంబునుబ్రియమయినజీవితంబును విడిచియిప్పుడు, ధనుస్సేలోకసంహారార్థమయి తెఱవఁబడిన నోరుగాఁగలవాఁడును బాణంబులె జ్వాలలుగాఁగలవాఁడును గుపితుండును జాపపాశంబులుదాల్చినవాఁడును వీరుండు శత్రుసైన్యంబులసంహరిఁచువాఁడునగు, రాముండను యమునిచెంతకుంజనవలదు.

అని, తాత్పర్యము.

అప్రమేయం హి తత్తేజో యస్య సా జనకాత్మజా
న త్వం సమర్థ స్తాం హర్తుం రామచాపాశ్రయాం వనే. ౧౮

టీక॥ సా=ఆ; జనకాత్మజా=జనకమహారాజుకొమార్తెయయినసీతాదేవి; యస్య=ఎవ్వనిభార్యయో; తత్= ఆ; తేజః=తేజస్సు, అప్రమేయంహి= కొలఁదిలేనిదిగదా! త్వం=నీవు; వనే= అడవియందు; రామచాపాశ్రయాం= రామునిధనుస్సేయవలంబముగాఁగల; తాం=ఆసీతను; హర్తుం= హరించుటకు; సమర్థః=సమర్థుఁడవు; న= కావు.

ఆసీతకుఁబెనిమిటియయిన రాముని తేజస్సు, అప్రమేయమయినది; అట్టి రామధనుస్సు నాశ్రయించియున్న సీతాదేవినిహరింపనీవుసమర్థుండవుకావు. అని, తాత్పర్యము.

తస్య సా నరసింహస్య సింహోరస్కస్య భామినీ
ప్రాణేభ్యోపి ప్రియతరా భార్యా నిత్య మనువ్రతా. ౧౯

టీక॥ సా=ఆ; భామినీ = సీత, నరసింహస్య = పురుషశ్రేష్ఠుండును; సింహోరస్కస్య=సింహముయొక్కఱొమ్మువంటిఱొమ్ముగలవాఁడునగు ; తస్య=ఆరామునకు; ప్రాణేభ్యోపి=ప్రాణములకన్నను; ప్రియతరా = మిక్కిలియుఁబ్రియురాలైన; భార్యా = భార్య. నిత్యం=ఎల్లప్పుడును; అనువ్రతా= అనుసరించియుండునది.

ఆసీతను బురుషోత్తముండును సిం

హంబునకుంబోలె విశాలంబగు ఱొమ్ముగలవాఁడునగునారాముండు, తన ప్రాణంబులకన్న నెచ్చుగాఁ జూచుకొనుచుండును;ఆసీతయు , నెల్లప్పుడను బెనిమిటిననుసరించియేయుండును.

అని, తాత్పర్యము.

న సా ధర్షయితుం శక్యా మైథిల్యోజస్వినః ప్రియా
దీప్తస్యేవ హుతాశస్య శిఖా సీతా సుమధ్యమా. ౨౦

టీక॥ ఓజస్వినః = అధికమయినపరాక్రమముగల రామునియొక్క ; ప్రియా=ప్రియురాలును;మైథిలీ = మిథిలయందుఁబుట్టినదియు ; సుమధ్యమా= సుందరమయిన నడుముగలదియునగు; సా=ఆ,సీతా=సీతాదేవి ; దీప్తస్య= మండుచున్న;హుతాశనస్య = అగ్నిహోత్రముయొక్క;శిఖేవ = జ్వాలవలె;ధర్షయితుం = ఎదిరించుటకు; నశక్యా=అలవికాదు.

మండుచున్నయగ్నిజ్వాలనుదాఁకుటకలవిగానట్లు, మహాపరాక్రమశాలియగు రామునిప్రియభార్యయగు నాసీతాదేవిని, ధర్షింపనెంతమాత్రమునలవిగాదు. అని, తాత్పర్యము.

కిముద్యమ మిమం వ్యర్థం కృత్వా తే రాక్షసాధిప
దృష్టశ్చే త్త్వం రణే తేన తదంతం తవజీవితమ్. ౨౧

టీక॥ రాక్షసాధిప=రాక్షసులకుఁ బ్రభుండవగురావణుఁడా! తే = నీకు; ఇమం=ఈ;వ్యర్థం = నిష్ప్రయోజనమయిన;ఉద్యమం = ప్రయత్నమును; కృత్వా=చేసి;కిం = ఏమిప్రయోజనము?రణే=యుద్ధమునందు;తేన = ఆ రామునిచేత;త్వం=నీవు; దృష్టశ్చేత్= చూడఁబడుదువేని;తవ = నీయొక్క; జీవితం=ప్రాణము;తదంతం= అదియెయంతముగాఁగలది.

రాక్షసరాజుండవగురావణుఁడా!నిష్ప్రయోజనమగునీ ప్రయత్నమును గావించుటవలననీకేమి ప్రయోజనముగలుగును?యుద్ధంబుననిన్ను రాముండుఎప్పుడుచూచునో,ఆక్షణమెనీప్రాణమునశించును. అని, తాత్పర్యము.

జీవితంచ సుఖంచైవ రాజ్యంచైవ సుదుర్లభమ్
యదీచ్ఛసి చిరం భోక్తుం మాకృథా రామవిప్రియమ్. ౨౨

టీక॥ జీవితంచ=ప్రాణమును ; సుఖంచైవ=సుఖమును ; సుదుర్లభం = మిక్కిలియుదుర్లభమగు ; రాజ్యంచైవ = రాజ్యమును; చిరం = బహుకాలము ; భోక్తుం = అనుభవించుటకు ; ఇచ్ఛసియది = కోరుదువేని; రామవిప్రియం= రామునకపకారమును; మాకృథాః=చేయవలదు.

జీవితంబునుసుఖంబును దుర్లభంబగు రాజ్యంబును అనుభవింపఁ గోరుదువేని, రామునిజోలికిఁబోవలదు, అని, తాత్పర్యము.

స సర్వైస్సచివై స్సార్ధం విభీషణపురోగమైః
మంత్రయిత్వాతు ధర్మిష్ఠైః కృత్వా నిశ్చయ మాత్మనః. ౨౩
దోషాణాంచ గుణానాంచ సంప్రధార్య బలాబలమ్
ఆత్మనశ్చ బలం జ్ఞాత్వా రాఘవస్యచ తత్త్వతః. ౨౪
హితాహితం వినిశ్చిత్య క్షమం త్వం కర్తు మర్హసి

టీక॥సః=అట్టి;త్వం=నీవు; విభీషణపురోగమైః= విభీషణుండు ముందునడచువాఁడుగాఁగల,ధర్మిష్ఠైః= పరమధార్మికులగు; సచివైః = మంత్రులతోఁ; సర్వైస్సార్ధం= అందఱితోఁగూడ; మంత్రయిత్వాతు= ఆలోచించియు;ఆత్మనః=నీయొక్క;నిశ్చయం= నిశ్చయమును;కృత్వా=చేసి ; దోషాణాంచ=దోషములయొక్కయు;గుణానాంచ=గుణములయొక్కయు ; బలాబలం=బలమునుఅబలమును; సంప్రధార్య=నిశ్చయించి;ఆత్మనః = తనయొక్క;బలంచ=బలమును; రాఘవస్య= రామునియొక్క;బలం ( అధ్యాహృతము)చ=బలమును;తత్త్వతః= యథార్థముగా; జ్ఞాత్వా=ఎఱింగి;హితాహితం= మేలుకీడులను;వినిశ్చిత్య= నిశ్చయించి; క్షమం = యుక్తమును ; కర్తుం=చేయుటకు,అర్హసి = తగుదువు.

నీవు, పరమధార్మికులగువిభీషణుండుమున్నగుమంత్రులతోఁ నాలోచించి, గుణదోషంబులనుబలాబలంబులనువిచారించి,నీబలంబును రామునిబలంబును జక్కఁగాఁదెలిసికొని,కీడు మేలులనాలోచించి,యేదియుక్తమో దానింజేయుము. అని,తాత్పర్యము.

అహంతు మన్యే తవ నక్షమం రణె
సమాగమం కోసలరాజసూనునా. ౨౫
ఇదంహి భూయశ్శృణు వాక్య ముత్తమం
క్షమంచ యుక్తంచ నిశాచరేశ్వర

టీక॥ నిశాచరేశ్వర = రాక్షసనాధుండవగు రావణుఁడా! అహంతు= నేను మాత్రము; రణే = యుద్ధమువందు, కోసలరాజసూనునా= దశరధమహారాజుకొడుకైన రామునితోఁ; సమాగమం=కలియుటయును; క్షమం= యుక్తమునుగా; నమన్యే= తలంపను. క్షమంచ=తగినదియు; యుక్తంచ= యుక్తితోఁగూడినదియునగు ; ఉత్తమం= శ్రేష్ఠమయిన; ఇదం= ఈ; వాక్యం= మాటను, భూయః=పలుమాఱు ; శృణు=వినుము.

రాక్షసరాజుండవగు రావణుఁడా! నాకుమాత్రము, నీవు దశరధమహారాజపుత్రుండగు రామునితో యుద్ధంబుగావించుట మంచిదికాదని తోఁచుచున్నది; నేను మాటిమాటికిదీనినే చెప్పెదను ; యుక్తియుక్తంబును దేశకాలయోగ్యంబునగు నీమాటను వినుము.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, సప్తత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండసప్తత్రింశసర్గటీక,
ముగిసినది.



శ్రీః

అష్టత్రింశసర్గప్రారంభః.

కదాచిదప్యహం వీర్యాత్పర్యటన్ పృథివీ మిమామ్
బలం నాగసహస్రస్య ధారయన్ పర్వతోపమః. ౧
నీలజీమూతసంకాశ స్తప్తకాంచనకుండలః
భయం లోకస్య జనయన్ కిరీటీ పరిఘాయుధః. ౨
వ్యచరం దండకారణ్యే ఋషిమాంసాని భక్షయన్

టీక॥ కదాచిత్=ఒకానొకప్పుడు; అహమపి=నేనును; వీర్యాత్ = పరాక్రమమువలన; ఇమాం=ఈ; పృథివీం=భూమిని; పర్యటన్=సంచరించుచు; నాగ సహస్రస్య= ఏనుంగుల యొక్క వేయింటియొక్క; బలం = బలమును; ధారయన్ = ధరించుచు; పర్వతోపమః = పర్వతముతోఁ బోల్కి గలవాఁడనై; నీలజీమూతసంకాశః=నల్లని మేఘముతో సమానుఁడనై; తప్తకాంచనకుండలః = కాచఁబడినబంగారుపోఁగులుగలవాఁడనై; కిరీటీ=కిరీటముగలవాఁడనై; పరిఘాయుధః= ఇనుపగుదియ యాయుధముగాఁ గలవాఁడనై; లోకస్య=లోకమునకు; భయం=భయమును; జనయన్=కలిగించుచు; ఋషిమాంసాని=ఋషులమాంసములను; భక్షయన్=భక్షించుచు; దండకారణ్యే=దండకారణ్యమునందు; వ్యచరం=సంచరించితిని.

మున్నొకప్పుడు, నేను, వేయిగజంబులబలంబుగలిగి, పర్వతకారుండనై, నీలమేఘవర్ణుండనై మంచి బంగారు పోఁగులుధరించి, కిరీటధరుండనై పరిఘంబుచేతంగొని, లోకంబునకంతయు భయంబుగలిగించుచు, భూమింగ్రుమ్మరుచు, ఋషిమాంసంబుభక్షింపవలయునని, కొంతకాలముదండకారణ్యంబునసంచరించుచుంటిని.

అని, తాత్పర్యము.

విశ్వామిత్రోథ ధర్మాత్మా మద్విత్రస్తో మహామునిః. ౩
స్వయం గత్వా దశరథం నరేంద్ర మిద మబ్రవీత్

టీక॥ అథ=అంత; ధర్మాత్మా= ధర్మస్వభావుఁడగు; మహామునిః= పూజ్యుఁడైనమునియయిన; విశ్వామిత్రః= విశ్వామిత్రుఁడు; మత్=నావలన; త్రస్తః=భయపడినవాఁడై; స్వయం=తానె; గత్వా=పోయి; నరేంద్రం = మనుష్యులకుఁ బ్రభువైన; దశరథం= దశరథునిగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, ధర్మాత్ముఁడగు విశ్వామిత్రమహాముని, నాకుభయపడి, తానె, దశరథమహారాజునొద్దకుఁబోయి, యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

అద్య రక్షతు మాం రామః పర్వకాలె సమాహితః. ౪
మారీచా న్మే భయంఘోరం సముత్పన్నం నరేశ్వర

టీక॥ నరేశ్వర= మనుష్యులకుఁబ్రభుఁడవైనదశరథమహారాజా! అద్య= ఇప్పుడు; రామః=రాముఁడు; పర్వకాలే=పరువపుకాలమునందు; సమాహితః=ఎచ్చరికగలవాఁడై; మాం = నన్ను; రక్షతు=రక్షించుఁగాక. మే=నాకు; మారీచాత్=మారీచునివలన; ఘోరం=భయంకరమయిన; భయం = భయము, సముత్పన్నం=పుట్టినది.

దశరథమహారాజా! మారీచుండు, మమ్ము మిక్కిలియు బాధించుచున్నాఁడు; కావున, నిప్పుడు, రాముండు , వచ్చి , పర్వకాలంబున నన్నురక్షించువుచుండవలయును. అని , విశ్వామిత్రుండు దశరథునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యేవ ముక్తో ధర్మాత్మా రాజా దశరథ స్తదా. ౫
ప్రత్యువాచ మహాభాగం విశ్వామిత్రం మహామునిమ్

టీక॥ తదా = అప్పుడు; ధర్మాత్మా=ధర్మస్వభావుఁడును; రాజా= రాజునగు; దశరథః=దశరథుఁడు ; ఇత్యేవం=అనియిట్లు ; ఉక్తః=చెప్పఁబడినవాఁడై ; మహాభాగం=పూజ్యమైనయదృష్టము గలవాఁడును ; మహామునిం= పూజ్యుఁడయినమునియునగు; విశ్వామిత్రం=విశ్వామిత్రుని; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

అప్పుడు, ధర్మాత్ముండగుదశరథ




మహారాజు, విశ్వామిత్రుండు చెప్పిన మాటను విని, మహాభాగుండగు విశ్వామిత్రమహామునిం జూచి, యిట్లని, చెప్పెను. అని; తాత్పర్యము.

బాలో ద్వాదశవర్షోఽయ మకృతాస్త్రశ్చ రాఘవః. ౬

టీక॥ అయం=ఈ; రాఘవః= రాముండు; ద్వాదశవర్షః= పండ్రెండేళ్లుగల; బాలః= చిన్నవాఁడు. అకృతాస్త్రః= నేర్వఁబడని యస్త్రములుగల వాఁడును.

ఈ రాముండు, పండ్రెండేళ్ల చిన్నవాఁడు; అస్త్రంబలను అన్నియుఁ జక్కఁగాఁ దెలియని వాఁడు. అని, తాత్పర్యము.

కామంతు మమ యత్సైన్యం మయాసహ గమిష్యతి

టీక॥ మమ=నాయొక్క; సైన్యం తు=సైన్యమును; యత్ (అస్తి)= ఏది గలదో; తత్ (అధ్యాహృతము)= అది; మయాసహ= నాతోఁగూడ; కామం=యథేచ్ఛముగా; గమిష్యతి= పోఁగలదు.

నీవు కావలెనన్నచో, నా సైన్యంబంతయు వెంటఁదీసికొని నేను వచ్చెదను. అని, తాత్పర్యము.

బలేన చతురంగేణ స్వయమేత్య నిశాచరాన్. ౭
వధిష్యామి మునిశ్రేష్ఠ శత్రూంస్తే మనసేప్సితాన్

టీక॥ మునిశ్రేష్ఠ=మునివరుండవగు విశ్వామిత్రుఁడా! స్వయం=నేనే; చతురంగేణ=నాలుగంగములుగల; బలేన=సైన్యముతో; ఏత్య=వచ్చి; తే=నీయొక్క; మనసా=మనస్సుచేత; ఈప్సితాన్=కోరఁబడిన; శత్రూన్= శత్రువులయిన; నిశాచరాన్= రాక్షసులను; వధిష్యామి=చంపెదను.

మునివరుండవగు విశ్వామిత్రుఁడా! నేనే చతురంగసైన్యముతో వచ్చి, నీ శత్రువులగు రాక్షసుల వధించివచ్చెదను. అని, దశరథమహారాజు, విశ్వామిత్రునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.




ఇత్యేవ ముక్త స్సమునీ రాజాన మిద మబ్రవీత్. ౮

టీక॥సః=ఆ; మునిః=విశ్వామిత్రమహాముని; ఇత్యేవం=అనియిట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; రాజానం=దశరథమహారాజునుగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

ఆవిశ్వామిత్రమహాముని, దశరథమహారాజుమాటనువిని, యతనిఁజూచి యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

రామా న్నాన్య ద్బలంలోకే పర్యాప్తం తస్య రక్షసః

టీక॥ లోకే=లోకమునందు; రామాత్=రామునికన్న; అన్యత్=ఇతరమయిన; బలం=బలము; తస్య=ఆ; రక్షసః=మారీచునకు; నపర్యాప్తం=చాలినదికాదు.

లోకమున, రాముండుదక్క, మఱియెంతబలమయినను, ఆమారీచుసాధింపనలవిగాదు. అని, తాత్పర్యము.

దేవతానా మపి భవాన్ సమరే ష్వభిపాలకః. ౯

టీక॥ భవాన్=నీవు; సమరేషు=యుద్ధమునందు; దేవతానామపి = దేవతలయొక్కయు; అభిపాలకః = పాలించువాఁడవు.

నీవు, యుద్ధంబులను దేవతలనుంగూడరక్షించినవాఁడవు.

అని, తాత్పర్యము.

ఆసీ త్తవ కృతం కర్మ త్రిలోకే విదితం నృప

టీక॥నృప=దశరథమహారాజా! తవ=నీయొక్క; కృతః=చేయఁబడిన; కర్మ=కార్యము; త్రిలోకే=ముల్లోకంబులయందును; విదితం=ప్రసిద్ధము; ఆసీత్=అయినది.

దశరథమహారాజా! నీవుగావించిన గొప్పకార్యములు, ముల్లోకంబులందు నువినుతిఁజెందియున్నవి.

అని, తాత్పర్యము.

కామ మస్తు మహా త్సైన్యం తిష్ఠత్విహ పరంతప. ౧౦




టీక॥ పరంతప = శత్రువులఁదపింపఁ జేయునట్టిదశరథమహారాజా ! మహత్ = గొప్పదగు; సైన్యం = సేన; కామం = యథేచ్ఛముగా; అస్తు = ఉండుగాక. ఇహ = ఇచ్చట; తిష్ఠతు = ఉండుఁగాక.

శత్రువులఁ దపింపఁ జేయునట్టిదశరథమహారాజా! నీసైన్యముచాల గొప్పదె, అయినను దానితోఁబనిలేదు; అదంతయునిచ్చటనేయుండుఁగాక.

అని, తాత్పర్యము.

బాలోఽప్యేష మహాతేజా స్సమర్థ స్తస్య నిగ్రహే

టీక॥ బాలోఽపి = పిన్నవాఁడైనను; మహాతేజాః = అధికమయిన పరాక్రమముకల; ఏషః = ఈరాముండు; తస్య = ఆమారీచునియొక్క; నిగ్రహే = నిగ్రహించుటయందు; సమర్థః = సమర్థుఁడు.

ఈరాముండు బాలుండయినను, మహాతేజుండుగావున, నారాక్షసుని వధింపఁగలఁడు. అని, తాత్పర్యము.

గమిష్యే రామ మాదాయ స్వస్తి తేస్తు పరంతప. ౧౧

టీక॥ పరంతప = శత్రువులఁదపింపఁజేయునట్టిదశరథమహారాజా; రామం = రాముని; ఆదాయ = తీసికొని; గమిష్యే = పోయెదను; తే = నీకు; స్వస్తి = మంగళము; అస్తు = అగుఁగాక.

శత్రువులఁదపింపఁజేయునట్టి దశరథమహారాజా! అట్లుకావున నేను రాముని దీసికొనిపోయెదను; నీకుమంగళములగుఁగాక. అని, విశ్వామిత్రుఁడు, దశరథునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వాతు సముని స్త మాదాయ నృపాత్మజమ్
జగామ పరమప్రీతో విశ్వామిత్ర స్స్వ మాశ్రమమ్. ౧౨

టీక॥ సః = ఆ; విశ్వామిత్రః = విశ్వామిత్రుండను; మునిః = ఋషి; ఏవం = ఇట్లు; ఉక్త్వాతు = చెప్పినంతనె; తం = ఆ; నృపాత్మజం = రాచకొమరుండగు, తం = ఆరాముని; ఆదాయ = తీసికొని; పరమప్రీతః = మిక్కిలియు సంతోషించినవాఁడై; స్వం = తనదైన; ఆశ్రమం = ఆశ్రమమును; జగామ = పొందెను.




ఆవిశ్వామిత్రమహాముని, దుష్టు చెప్పి, రాచకొమరుండగు రాముంది సికొని, పరమసంతుష్టుండై, తనయాశ్రమంబునకుఁ బోయెను.

అని, తాత్పర్యము.

తం తదా దండకారణ్యే యజ్ఞముద్దిశ్య దీక్షితమ్
బభూవో పస్థితో రామ శ్చిత్రం విష్ఫారయన్ ధనుః ౧౩

టీక॥ తదా=అప్పుడు, రామః = రాముఁడు; దండకారణ్యే= దండకారణ్యమునందు; చిత్రం= చిత్రవర్ణకము యొక; ధనుః=విల్లును; విష్ఫారయన్= ధ్వనింపఁజేయుచు, యజ్ఞం= యాగమును; ఉద్దిశ్య=ఉద్దేశించి; దీక్షితం= దీక్షనుబొందిన; తం=ఆవిశ్వామిత్రునిని; ఉపస్థితః= సమీపించినవాఁడై; బభూవ=అయ్యెను.

అప్పుడు, రాముఁడు, దండకారణ్యంబున, నవ్విశ్వామిత్రునాశ్రమము నందు; గొప్ప చిత్రితంబగు ధనుస్సుచే నింగొని జ్యానాదంబు పరఁగించుచు, యాగదీక్షవహించిన విశ్వామిత్రునిచెంతను జేరెను. అని, తాత్పర్యము.



అజాతవ్యంజనశ్శ్రీమాన్ పద్మపత్రనిభేక్షణః
ఏకవస్త్రధరో ధన్వీ శిఖీ కనకమాలయా. ౧౪
శోభయన్ దండకారణ్యం దీప్తేన స్వేన తేజసా

అదృశ్యత తతో రామో బాలచంద్ర ఇవోదితః. ౧౫

టీక॥ తతః= అంత; అజాతవ్యంజనః= పుట్టనిపురుషచిహ్నములుగలవాఁడును; శ్రీమాన్= అధికమయినకాంతిగలవాఁడును; పద్మపత్రనిభేక్షణః = తామరపూరేకులతో సమానములయినకన్నులుగలవాఁడును; ఏకవస్త్రధరః= ఒక్కటెవస్త్రమునుదాల్చినవాఁడును; ధన్వీ=ధనుస్సుగలవాఁడును; కనకమాలయా=బంగారుపుష్పమాలికతో ; శిఖీ=జుట్టుగలవాఁడునగు, రామః=రాముఁడు; దీప్తేన= ప్రకాశించుచున్న ; స్వేన=తనదైన; తేజసా=కాంతిచేత; దండకారణ్యం=దండకారణ్యమును;శోభయన్=ప్రకాశింపఁజేయుచు ; ఉదితః=ఉదయించిన;బాలచంద్రఇవ=బాలచంద్రుఁడువలె; అదృశ్యత= చూడఁబడెను.

అంత, ఇంకను మీసములు మొదలగుపురుషచిహ్నములు గలుగకున్నవాఁడును శ్రీమంతుండును , దామరపూరె కులుంబోలె విశాలసుందరంబులగు కన్నులు గలవాఁడును ఒక్కటెవస్త్రంబుగట్టుకొనియున్నవాఁడును బంగారుమాలికతోఁ జుట్టఁబడిన జుట్టుగలవాఁడునుదనదివ్యతేజంబున దండకారణ్యంబునంతయు వెలిఁగింపుచున్న వాఁడును , నవోదితుండగు బాలచంద్రుని మాడ్కిఁ దేజరిల్లుచున్నవాఁడునగు రాముంజూచితిని. అని, తాత్పర్యము.

తతో హం మేఘసంకాశ స్తప్తకాంచనకుండలః
బలీ దత్త వరో దర్పా దాజగామ తదాశ్రమమ్. ౧౬

టీక॥ తతః=అంత;మేఘసంకాశః= మేఘముతో సమానుండను;తప్తకాంచనకుండలః=కాఁచఁబడిన బంగారుపోఁగులుగలవాఁడను;బలీ= అధికమయినబలముగలవాఁడను ; దత్తవరః = ఇయ్యఁబడినవరము గలవాఁడనగు ; అహం=నేను;దర్పాత్= గర్వమువలన; తదాశ్రమం=ఆవిశ్వామిత్రునియాశ్రమమునుగూర్చి; ఆజగామ= వచ్చినాను.

అంత, మేఘాకారుండను మంచిబంగారుపోఁగులుధరించి యున్నవాఁడను బలవంతుండనువరంబులుపొందియున్న

| | |
|---|---|
| వాఁడనగునేను, గర్వంబున,నావిశ్వామిత్రునాశ్రమంబునకుఁబోతిని. | అని, తాత్పర్యము, |

తేన దృష్టః ప్రహృష్టోఽహం సహసైవోద్యతాయుధః

| | |
|---|---|
| టీక॥ అహం=నేను; తేన = ఆరాముని చేత; దృష్టః = చూడఁబడినవాఁడనై;ఉద్యతాయుధః= పట్టఁబడినయాయుధముగలవాఁడనై;సహసైవ = శీఘ్రముననె ; ప్రవిష్టః = ప్రవేశించితిని. | నేను,ఆయుధధరుండనై, రాముఁడు చూచుచుండ , శీఘ్రంబుననాశ్రమంబుఁ బ్రవేశించితిని. అని, తాత్పర్యము. |

మాంతు దృష్ట్వా ధనుస్సజ్య మసంభ్రాంత శ్చకార సః. ౧౭

| | |
|---|---|
| టీక॥ సః=ఆరాముఁడు; మాం=నన్ను; దృష్ట్వాతు=చూచినంతనె;అసంభ్రాంతః=తొట్రుపడనివాఁడై;ధనుః=ధనుస్సును; సజ్యం=అల్లెత్రాటితోఁగూడినదానిఁగా; చకార=చేసెను. | ఆరాముండు, నన్నుఁజూచినంతనె యెంతమాత్రముసంభ్రమంబు నొందక, ధనుస్సునుసజ్యంబుగావించెను. అని, తాత్పర్యము. |

అవజానన్నహం మోహా ద్బాలోఽయమితి రాఘవమ్
విశ్వామిత్రస్య తాం వేది మభ్యధావం కృతత్వరః. ౧౮

| | |
|---|---|
| టీక॥ అహం=నేను; మోహాత్=అజ్ఞానమువలన;అయం=ఈతఁడు; బాలః=పిల్లవాఁడు;ఇతి=అని;రాఘవం = రాముని; అవజానన్= అవమానించుచు; కృతత్వరః= చేయఁబడినత్వరగలవాఁడై ; తాం=ఆ; విశ్వామిత్రస్య = విశ్వామిత్రునియొక్క; వేదిం= యాగవేదినిగూర్చి; అభ్యధావం = పరుగెత్తితిని. | నేను; అజ్ఞానంబున, "ఇతండుపిల్లవాఁ"డనిరామునిసరకుసేయక, వేగంబున ; విశ్వామిత్రునియాగవేదికమీఁదికిఁబోతిని. అని, తాత్పర్యము, |

తేన ముక్త స్తతో బాణ శ్శిత శ్శత్రునిబర్హణః

టీ॥ తతః=అంతట; తేన= ఆరా
నిచేత; శితః=కఱకైనదియు; శత్రుని
బర్హణః=శత్రువులవధించునదియు నగు; బాణః = బాణము ; ముక్తః=
విడువఁబడినది.

అంత, నారాముండు, శత్రుసంహారకంబగు నొక్క తీక్ష్ణబాణంబువిడిచెను.
అని, తాత్పర్యము.

తేనాహంత్వా హతఃక్షిప్త స్సముద్రే శతయోజనే. ౧౯

టీ॥అహంతు=నేనుమాత్రము; తే
న=ఆబాణముచేత ; ఆహతః=కొట్టఁ
బడినవాఁడనై; శతయోజనే =నూరు
యోజనంబులదూరము గల, సముద్రే=
సముద్రమునందు ; క్షిప్తః=వేయఁబడి
నాను.

ఆబాణంబు దెబ్బకు, నేను, నూఱుయోజనంబుల కావల సముద్రంబునం
బడితిని.
అని, తాత్పర్యము.

నేచ్ఛతా తాత మాం హంతుం తదా వీరేణ రక్షితః

టీక॥ తాత=నాయనా ! తదా=
అప్పుడు;మాం = నన్ను; హంతుం=
వధించుటకు; నేచ్ఛతా=కోరనట్టి ; వీ
రేణ= పరాక్రమశాలియగు రాముని
చేత;రక్షితః=రక్షింపఁబడినాను.

నాయనా!అప్పుడు; వీరుండగురాముండు , నన్నువధింపనొల్లనందున,
నాప్రాణంబులు గొనక,రక్షించెను.
అని, తాత్పర్యము.

రామస్య శరవేగేన నిరస్తో హ్యచేతనః. ౨౦

టీక॥ అహం=నేను ; రామస్య=
రామునియొక్క; శరవేగేన = బాణ
వేగముచేత;నిరస్తః = త్రోయఁబడిన
వాఁడనై;అచేతనః=తెలివిలేనివాఁడను;
అభూవం(అధ్యాహృతము)=అయితిని.

నేను , రాముని బాణవేగంబునకు
సముద్రంబునంబడిమూర్ఛనొందితిని.
అని, తాత్పర్యము.

పాతితోஉహం తదా తేన గంభీరే సాగరాంభసి
ప్రాప్యసంజ్ఞాం చిరాత్తాత లంకాం ప్రతిగతః పురీమ్. ౨౧

టీక॥ తాత=నాయనా! తదా= అప్పుడు; అహం=నేను, తేన= ఆబాణముచేత; గంభీరే=లోఁతయిన; సాగరాంభసి=సముద్రజలమునందు; పాతితః= పడఁద్రోయఁబడినవాఁడనై; చిరాత్= బహుకాలమునకు; సంజ్ఞాం = తెలివిని; ప్రాప్య=పొంది; లంకాం= లంకయను, పురీం=పట్టణమును; ప్రతిగతః= పొందినాను.

నాయనా! అప్పుడు, ఆబాణవేగంబున, నేను లోఁతయిన సముద్ర జలంబులంబడి, బహుకాలంబునకు సంజ్ఞనొంది, లంకానగరంబునకువచ్చినాను. అని, తాత్పర్యము.

ఏవ మస్మి తదా ముక్త స్సహాయాస్తు నిపాతితాః
అకృతాస్త్రేణ బాలేన రామేణా క్లిష్టకర్మణా. ౨౨

టీక॥ అకృతాస్త్రేణ= నేర్వఁబడిన యస్త్రములుగలవాఁడును; అక్లిష్టకర్మణా= దుఃఖకరముకానికార్యము గలవాఁడును; బాలేన = పిల్లవాఁడునగు; రామేణ=రామునిచేత; తదా=అప్పుడు; ఏవం=ఇట్లు; ముక్తః = విడువఁబడినవాఁడను; అస్మి = అయితిని. సహాయాస్తు=తోడైనవారలుమాత్రము; నిపాతితాః=చంపఁబడినారు.

అప్పటికి రాముండు బాలుండు, ఇంకను అస్త్రములు కూడ నేర్చియుండలేదు; అట్లుండఁగానే, నాసహాయుల నందఱువధించి, నన్నుయంతటితో విడిచెను. అని, తాత్పర్యము.

తన్మయా వార్యమాణ స్త్వం యది రామేణ విగ్రహమ్
కరిష్యస్యాపదం ఘోరాం క్షిప్రం ప్రాప్స్యసి రావణ. ౨౩

టీక॥ రావణ=రావణుఁడా! తత్=అందువలన; త్వం=నీవు; మయా=నాచేత; వార్యమాణః = అడ్డగింపఁబడుచున్నవాఁడవయ్యు; రామేణ= రామునితో; విగ్రహం=యుద్ధమును; కరిష్యసియది=చేయుదువేని; క్షిప్రం=

శీఘ్రముగా; ఘోరాం= భయంకరమయిన; ఆపదం=ఆపదను; ప్రాప్స్యసి= పొందఁగలవు.

రావణుఁడా! అట్లుకావున, నీవు, నేను జెప్పినమాటను వినక, రామునితో యుద్ధము గావింతువేని, శీఘ్రంబున, గొప్పయాపదంబొందఁగలవు.

అని, తాత్పర్యము.

క్రీడారతివిధిజ్ఞానాం సమాజోత్సవ శాలినామ్
రక్షసాం చైవ సంతాప మనర్థం చాహరిష్యసి. ౨౪

టీక॥ త్వం(అధ్యాహృతము) = నీవు; క్రీడారతివిధిజ్ఞానాం = ఆటలయొక్కయు సంభోగముయొక్కయుఁ గ్రమమును దెలిసినవారలను; సమాజోత్సవశాలినాం=సభల చేతను ఉత్సవముల చేతను ప్రకాశించుచున్న వారలునగు; రక్షసాంచైవ = రాక్షసులకును ; సంతాపం=దుఃఖమును; అనర్థంచ= అపాయమును; ఆహరిష్యసి=తెచ్చెదవు.

నీవు చెడుటయె గాక, నావిధంబుగాఁ గ్రీడలం దేలుచు, నానావిధసంభోగరసంబనుభవింపుచు సభలఁ జేరి బహువిధోత్సవసుఖంబులంబొందుచున్న రాక్షసులకనుగూడ, సంతాపంబును నాశంబును దెచ్చినవాఁడవగుచున్నావు.

అని, తాత్పర్యము.

హర్మ్య ప్రాసాద సంబాధాం నానారత్న విభూషితామ్
ద్రక్ష్యసి త్వం పురీం లంకాం వినష్టాం మైథిలీకృతే. ౨౫

టీక॥ త్వం=నీవు; హర్మ్యప్రాసాదసంబాధాం = మేడలచేతను రాజగృహములచేతనునిండినదియు ; నానారత్నవిభూషితాం = నానావిధమయిన మణులచేతనలంకరింపఁబడినదియు నగు; లంకాం=లంకయను; పురీం= పట్టణమును; మైథిలీకృతే= సీతానిమిత్తము; వినష్టాం=నశించినదానిఁగా ; ద్రక్ష్యసి=చూడఁగలవు.

మేడలచేతను రాజగృహముల చేతనునిండియుండునదియు నానావిధ మణులచేనలంకృతంబునగు లంకాపురి సీతానిమిత్తమయి నశించుటం, జూడగలవు.

అని, తాత్పర్యము.

అకుర్వంతోపి పాపాని శుచయః పాపసంశ్రయాత్

పరపాపైర్వినశ్యంతి మత్స్యా నాగహ్రదే యథా. ౨౭

టీక॥ పాపాని=పాపములను; అకుర్వంతః=చేయనట్టి; శుచయోపి=పరిశుద్ధులుగూడ; పాపసంశ్రయాత్=పాపులసహవాసమువలన; పరపాపైః=ఇతరులపాపములచేత; నాగహ్రదే=సర్పము నివసించునట్టి తటాకమునందు; మత్స్యాఇవ = మత్స్యములువలె; వినశ్యంతి=నశింతురు.

సర్పములు నివసించునట్టి తటాకమునందుండుటచేమత్స్యములుగూడ గరుత్మంతునిచేభక్షింపఁబడునట్లు, ఏపాపముచేయకనిపరిశుద్ధాత్ములుగూడఁ, బాపులసహవాసముచేత, వారల పాపదోషంబునఁ, దాముసునశింతురు.

అని, తాత్పర్యము.

దివ్యచందన దిగ్ధాంగాన్ దివ్యాభరణ భూషితాన్
ద్రక్ష్య స్యభిహతాన్ భూమౌ తవ దోషాత్తు రాక్షసాన్. ౨౮

టీక॥ తవ=నీయొక్క; దోషాత్తు=దోషమువలననే; భూమౌ= నేలయందు; అభిహతాన్=కొట్టఁబడిన; దివ్యచందనదిగ్ధాంగాన్ = దివ్యచందనముచేఁబూయఁబడిన దేహముగలవారలను; దివ్యాభరణభూషితాన్ = శ్రేష్ఠములయినసొమ్ములచే నలంకరింపఁబడినవారలునగు; రాక్షసాన్ = రాక్షసులను; ద్రక్ష్యసి=చూడఁగలవు.

దివ్యచందనంబుమేననలందికొని దివ్యభూషణధారులయియుండు, రాక్షసులు, నీదోషంబునంజేసి, రామ బాణాభిహతులయి, నేలంగూలియుండుటఁజూడఁగలవు.

అని, తాత్పర్యము.

హృతదారాన్ సదారాంశ్చ దశ విద్రవతో దిశః
హతశేషా నశరణాన్ ద్రక్ష్యసి త్వం నిశాచరాన్. ౨౯

టీక॥ త్వం=నీవు; హృతదారాన్=విడువఁబడినభార్యలుగలవారలును; సదారాంశ్చ= భార్యలతోఁగూడినవారలును; దశ= పదియయిన; దిశః=దిక్కు




లనుగూర్చి; విద్రవతః= పరుగెత్తుచున్నవారలునగు; హతశేషాన్= చంపఁబడఁగామిగిలిన; అశరణాన్=రక్షకుఁడులేని; నిశాచరాన్=రాక్షసులను;ద్రక్ష్యసి=చూడఁగలవు.

నీవు, హతశేషులగురాక్షసులు, రక్షకుంగానక , కొందఱుభార్యలంగూడవిడిచియుఁగొందఱుభార్యలతోను, దశదిశలకుంబరుగెత్తుటను జూడఁగలవు. అని, తాత్పర్యము.

శరజాల పరిక్షిప్తా మగ్నిజ్వాలా సమావృతామ్
ప్రదగ్ధ భవనాం లంకాం ద్రక్ష్యసి త్వం నసంశయః. ౨౯

టీక॥ త్వం=నీవు ; శరజాలపరిక్షిప్తాం=బాణసమూహములచేఁ జుట్టఁబడినదియు ; అగ్నిజ్వాలా సమావృతాం = నిప్పుమంటలచేఁజుట్టఁబడినదియు; ప్రదగ్ధభవనాం= దహింపఁబడినయిండ్లుగలదియునగు; లంకాం=లంకను;ద్రక్ష్యసి=చూడఁగలవు.సంశయః=సందేహము; న=లేదు.

నీవు, లంకాపురియంతయుబాణసమూహంబులంగప్పఁబడి, యగ్నిజ్వాలాసమావృతమయి , మండిపోయినవియుమండుచున్నవియునగుగృహంబులతోనుండుటంజూడఁగలవు;ఇందుకుసంశయములేదు.అని, తాత్పర్యము.

పరదారాభిమర్శాత్తు నాన్యత్పాపతరం మహత్
ప్రమదానాం సహస్రంచ తవ రాజన్ పరిగ్రహః. ౩౦

టీక॥ రాజన్=రాక్షసరాజుండవగురావణుఁడా! పరదారాభిమర్శాత్తు=పరస్త్రీసంగమముకన్నన; అన్యత్=ఇతరమయిన;మహత్ = గొప్పదగు;పాపతరం= మిక్కిలియుఁబాపముగలిగించుకార్యము;న=లేదు. తవ=నీకు;పరిగ్రహాశ్చ=భార్యలును ; ప్రమదానాం=స్త్రీలయొక్క; సహస్రం=వేయి.

రాక్షసరాజుండవగురావణుఁడా! పరస్త్రీసంగమముకన్నను వేఱెయధికపాపమేదియులేదు ; నీకు , భార్యలు వేయిమందియున్నారు ; పరస్త్రీలనపేక్షింపకుము. అని, తాత్పర్యము.

భవ స్వదారనిరత స్స్వకులం రక్ష రాక్షస




మాన మృద్ధించ రాజ్యంచ జీవితం చేష్ట మాత్మనః ౩౧

టీక॥ రాక్షస=రావణుఁడా! స్వదారనిరతః=స్వభార్యలయందాసక్తుండవు; భవ=అగుము. స్వకులం= నీకులమును; మానం=గౌరవమును; బుద్ధించ=సంపదను; రాజ్యంచ=రాజ్యమును; ఆత్మనః=ఆత్మకు; ఇష్టం = ప్రియమయిన; జీవితంచ=ప్రాణమును; రక్ష= కాపాడుకొనుము.

రావణుఁడా! పరస్త్రీలనువిడిచి, స్వభార్యలయందెయాసక్తుండవైయుండుము; నీవంశమును గౌరవంబునుసంపదను రాజ్యమును ప్రియంబగు జీవితంబునురక్షించుకొనుము.

అని, తాత్పర్యము.

కళత్రాణిచ సౌమ్యాని మిత్రవర్గం తథైవచ
యదీచ్ఛసి చిరం భోక్తుం మాకృథా రామ విప్రియమ్ ౩౨

టీక॥ సౌమ్యాని= సౌందర్యముగలు; కళత్రాణి=భార్యలను ; తథైవచ= అట్లె; మిత్రవర్గం = స్నేహితులసమూహమును; చిరం= బహుకాలము; భోక్తుం=అనుభవించుటకు; ఇచ్ఛసియది=కోరుదువేని; రామవిప్రియం = రామునకప్రియమయినకార్యమును; మాకృథాః=చేయకుము.

బహుకాలము సౌందర్య వతులగు భార్యల నుపభోగించుచు స్నేహితులతోఁగూడ సుఖంబు ననుభవించుటకుఁ గోరుదువేని, రామునకెంతమాత్రమపకారము చేయవలదు.

అని, తాత్పర్యము.

నివార్యమాణ స్సుహృదా మయా భృశం
ప్రసహ్య సీతాం యది ధర్షయిష్యసి
గమిష్యసి క్షీణబల స్సబాంధవో
యమక్షయం రామశరా త్తజీవితః. ౩౩

టీక॥ త్వం(అధ్యాహృతము)= నీవు; సుహృదా=స్నేహితుఁడనైన; మయా=నాచేత; భృశం=మిక్కిలియు; నివార్యమాణః = అడ్డగింపఁబడనివాఁడ

వయ్యా; సీతాం = సీతాదేవిని ; ప్రసహ్య=బలాత్కరించి ; ధర్షయిష్యసి యది= తిరస్కరింతువేని ; సబాంధవః=బంధువులతోఁగూడినవాఁడవై ;క్షీణబలః=నశించినబలముగలవాఁడవై ; రామశరాత్తజీవితః= రామబాణముల చేనాకర్షింపఁబడిన ప్రాణములుగల వాఁడవై ; యమక్షయం= యముని గృహమును; గమిష్యసి=పొందగలవు.

స్నేహితుండగు నేనుజెప్పినమాటనువినక, నీవు, బలాత్కారంబున, సీతనపహరింతువేని, నీవు, రామబాణాభిహతుండవై, బంధుసహితంబుగా నాశంబునొంది, యమపురంబు సేరంగలవు అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, ఆరణ్యకాండే, అష్టత్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండాష్టత్రింశసర్గటీక, ముగిసినది.

---

౩౯.

ఏకోనచత్వారింశసర్గప్రారంభః.

ఏవమస్మి తదా ముక్తః కథంచి త్తేన సంయుగే
ఇదానీమపి యద్వృత్తం తచ్ఛృణుష్వ నిరుత్తరమ్ ౧

టీక॥ తదా=అప్పుడు; తేన = ఆ రామునిచేత;సంయుగే = యుద్ధమునందు;కథంచిత్ = అతిప్రయాసముచేత;ఏవం=ఇట్లు;ముక్తః= విడువఁబడినవాఁడను;అస్మి =అయితిని; ఇదానీమపి= ఇప్పుడును;యత్ =ఏది;వృత్తం= జరగెనో,తత్ = దాని ; నిరుత్తరం = బదులుమాటలేకుండునట్లు; శృణుష్వ=

వినుము.

అప్పుడు, బాల్యంబున, రాముండు, యుద్ధంబున, నన్నెట్టకేలకును న్నించి విడిచెను; ఇప్పుడు, అతనియా వనంబువచ్చిన వెనుక జరిగిన సమాచారమును జెప్పెదను, మా తాడకీ యారక వినుము. అని, తాత్పర్యము.

రాక్షసాభ్యాం మహాం ద్వాభ్యా మనిర్విణ్ణ స్తథాకృతః
సహితో మృగరూపాభ్యాం ప్రవిష్టో దండకావనమ్. ౨

టీక॥ అహం=నేను; తథాకృతః=అట్లుచేయబడినవాఁడనయ్యు; అనిర్విణ్ణః=వైరాగ్యమునొందనివాఁడనై; మృగరూపాభ్యాం=జింకరూపముగలఁ; ద్వాభ్యాం=ఇద్దఱయిన; రాక్షసాభ్యాం=రాక్షసులతో; సహితః=కూడినవాఁడనై; దండకావనం=దండకారణ్యమును, ప్రవిష్టః=ప్రవేశించితిని.

అట్లు, రామునిచే, దెబ్బదినియు నంతనూరకుండక, నేను మఱల, జింకలరూపుదాల్చిన యిద్దఱు రాక్షసులతోఁ దండకారణ్యంబుఁజొచ్చితిని.

అని, తాత్పర్యము.

దీప్తజిహ్వో మహాకాయ స్తీక్ష్ణదంష్ట్రో మహాబలః
వ్యచరం దండకారణ్యం మాంసభక్షో మహామృగః. ౩

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; దీప్తజిహ్వః=మండుచున్న నాలుకగలదియు; మహాకాయః=పెద్దశరీరముగలదియు; తీక్ష్ణదంష్ట్రః=కఱకులైన కోఱలుగలదియు; మహాబలః=అధికమయిన బలముగలదియు; మాంసభక్షః=మాంసమును దినునదియునగు; మహామృగః=పెద్దజింకనై; దండకారణ్యం=దండకారణ్యమును; వ్యచరం=పొందితిని.

నేను, వెలుంగుచున్న నాలుకయుఁ గఱకుఁ గోఱలును బెద్దమేనును గలదియు మహాబలంబును మాంసభక్షంబునగు పెద్దజింకనై, దండకారణ్యంబున సంచరించితిని. అని, తాత్పర్యము.

అగ్నిహోత్రేషు తీర్థేషు చైత్యవృక్షేషు రావణ
అత్యంత ఘోరో వ్యచరం తాపసాన్ సంప్రధర్షయన్. ౪

టీక॥ రావణ = రావణుఁడా! అగ్నిహోత్రేషు = అగ్నిహోత్రముల యందును, తీర్థేషు = పుణ్యతీర్థముల యందును; అత్యంతఘోరః = మిక్కిలి యు భయంకరుఁడనై; తాపసాన్ = ఋషులను; సంప్రధర్షయన్ = మిక్కిలి యు బెదరించుచు; వ్యచరం = సంచరించితిని.

రావణుఁడా! నేను, భయంకరాకారుండనై, యగ్నిహోత్రంబులయొద్దను, బుణ్యతీర్థంబులయందును జైత్యవృక్షసమీపంబులందును, ఋషులను భయపఱచుచు, సంచరించుచుంటిని.

అని, తాత్పర్యము.

నిహత్య దండకారణ్యే తాపసాన్ ధర్మచారిణః
రుధిరాణి పిబం స్తేషాం తథా మాంసాని భక్షయన్. ౫

టీక॥ అహం (అధ్యాహృతము) = నేను; దండకారణ్యే = దండకారణ్యమునందు; ధర్మచారిణః = ధర్మము నాచరించునట్టి; తాపసాన్ = ఋషులను; నిహత్య = వధించి; తేషాం = వారలయొక్క; రుధిరాణి = నెత్తురులను; పిబన్ = త్రావుచు; తథా = అట్లు; మాంసాని = మాంసములను; భక్షయన్ = భక్షించుచు; వ్యచరం (అధ్యాహృతము) = సంచరించితిని.

దండకారణ్యంబున ధర్మంబు నాచరించుచుండు ఋషులను వధించి, వారల రక్తంబు గ్రోలుచు, మాంసంబు భక్షించుచుంటిని. అని, తాత్పర్యము.

ఋషిమాంసాశనః క్రూర స్త్రాసయన్ వనగోచరాన్
తథా రుధిరమత్తోహం విచరన్ ధర్మదూషకః. ౬

టీక॥ అహం = నేను; ఋషిమాంసాశనః = ఋషులమాంసమే యాహారము గాఁగలవాఁడనై; క్రూరః = దయలేనివాఁడనై; వనగోచరాన్ = వనంబున నగపడువారలను; త్రాసయన్ = భయపఱచుచు; రుధిరమత్తః = నెత్తురు

చేయుచుండినవాఁడనై ; ధర్మదూషకః = ధర్మమును దూషించినవాఁడనై ; తథా = అట్లు ; విచరన్ = సంచరించుచు ; ఆసం (అధ్యాహృతము) = ఉంటిని.

నేను, క్రూరుండనై ఋషులమాంసంబుఁదినుచు వనంబునందుండువారలవెఱపించుచు యథేచ్ఛముగా నెత్తురుద్రావియుదించి, ధర్మంబుఁజెఱచుచు, నీప్రకారంబున, విహరింపుచుంటిని.

అని, తాత్పర్యము.

ఆసాదయం తదా రామం తాపసం ధర్మచారిణం
వైదేహీంచ మహాభాగాం లక్ష్మణంచ మహారథమ్. ౭

టీక॥ అహం (అధ్యాహృతము) = నేను ; తదా = అప్పుడు ; తాపసం = ఋషియును ; ధర్మచారిణం = ధర్మము నాచరించువాఁడునగు ; రామం = రాముని ; మహాభాగాం = పూజ్యమయినభాగ్యముగల ; వైదేహీంచ = సీతాదేవిని ; మహారథం = తన్నును సారథిని గుఱ్ఱములను గాపాడుకొనుచుఁ బదునాకండువేలమందివిలుకాండ్రతోఁ బోరునట్టి ; లక్ష్మణంచ = లక్ష్మణుని ; ఆసాదయం = పొందినాను.

అప్పుడు, నేను, ఋషివేషధరుండును ధార్మికుండునగు రాముని, మహాభాగురాలగు సీతాదేవిని, మహారథుండగు లక్ష్మణునిం జూచితిని.

అని, తాత్పర్యము.

తాపసం నియతాహారం సర్వభూతహితే రతం
సోహం వనగతం రామం పరిభూయ మహాబలమ్. ౮
తాపసోయమితి జ్ఞాత్వా పూర్వవైర మనుస్మరన్
అభ్యధావంహి సంక్రుద్ధ స్తీక్ష్ణశృంగో మృగాకృతిః. ౯
జిఘాంసు రకృత ప్రజ్ఞ స్తం ప్రహార మనుస్మరన్

టీక॥ తీక్ష్ణశృంగః = కఱకులయినకొమ్ములుగల ; మృగాకృతిః = జింకయొక్కరూపమువంటిరూపముగల ; సః = అట్టి ; అహం = నేను ; పూర్వవైరం = మునుపటివిరోధమును ; అనుస్మరన్ = తలంచుచు ; సంక్రుద్ధః = కోపించినవాఁడనై ;

తం=ఆ; ప్రహారం=దెబ్బను ; అనుస్మరన్=తలంచుచున్నవాఁడన్నై, అకృతప్రజ్ఞః=చేయఁబడనిబుద్ధిగలవాఁడన్నై, "అయం=ఈతండు, తాపసః=ఋషి," ఇతి=అని; జ్ఞాత్వా=తలంచి; తాపసం=ఋషియును; నియతాహారం= నియమింపఁబడినయాహారముగలవాఁడును; సర్వభూతహితే=సమస్తప్రాణుల మేలునందు; రతం=ఆసక్తుండును; వనగతం= అడవినిబొందినవాఁడును; మహాబలః= అధికమయినబలముగలవాఁడునగు ; రామం=రాముని; పరిభూయ= తిరస్కరించి; జిఘాంసుః= వధింపఁగోరినవాఁడన్నై; అభ్యధావం=హి= ఎదిరించిపరుగెత్తితినిగదా!

కఠినకొమ్ములుగలజింకరూపంబు దాల్చియున్ననేను , రాముఁజూచినంతనె, మున్నతండు నన్నుఁగొట్టినదెబ్బను దలంచుకొని, మనుష్యటివైరంబుదలఁచి , యుక్తాయుక్తంబువిచారింపక , "ఈతండు తాపసుండుగా నున్నాఁడు; ఇప్పుడేమిసేయఁగలఁడు?" అని, యోంచి తాపసాకారుండును నియతాహారుండును సర్వభూతహితాసక్తుండును బలశాలియునగు రామునిఁదిరస్కరించి, వధింపవలయునని , యాతనిపైకిఁబరుగెత్తితిని. అని, తాత్పర్యము.

తేన ముక్తా స్త్రయో బాణా శ్శితా శ్శత్రునిబర్హణాః. ౧౦
వికృష్య బలవ చ్చాపం సుపర్ణానిల నిస్వనాః

టీక॥ తేన=ఆరామునిచేత ; బలవత్=బలముగల్గునట్లుగా ; చాపం=ధనుస్సును; వికృష్య=ఆకర్షించి ; సుపర్ణానిలనిస్వనాః = గరుత్మంతుని యొక్కయు వాయువుయొక్కయు ధ్వనివంటిధ్వనిగలవియు; శితాః = తీక్ష్ణములును; శత్రునిబర్హణాః = శత్రువులసుజంపునవియునగు; బాణాః = బాణములు; త్రయః=మూఁడు ; ముక్తాః= విడువఁబడినవి.

ఆరాముండు , గరుత్మంతునకును వాయువునకునుంబోలె మహావేగంబుగలవియుఁ దీక్ష్ణములును శత్రువధంబు సేయునవియునగు మూఁడుబాణంబులుప్రయోగించెను. అని, తాత్పర్యము.

తేబాణా వజ్రసంకాశా స్సుముక్తా రక్తభోజనాః. ౧౧

ఆజగ్ముస్సహితా స్సర్వే త్రయ స్సన్నత పర్వణః

టీక॥ వజ్రసంకాశాః= వజ్రములతో సమానము లయినవియు ; సుముక్తాః=చక్కఁగా విడువఁబడినవియు;రక్తభోజనాః=నెత్తురుఆహారముగాఁగలవియు; సన్నతపర్వాణః=వంగినగనుపులుగలవియునగు; తే=ఆ; త్రయః=మూఁడైన; బాణాః=బాణములు ; సర్వే=అన్నియు ; సహితాః = కూడినవై ; ఆజగ్ముః=వచ్చినవి.

వజ్రములవంటియుఁ, జెవివఱకుధనుస్సునాకర్షించివిడువఁబడినవియు రక్తంబుఁ ద్రావునవియు సన్నతపర్వంబులునగువా బాణంబులు మూఁడునొక్కపెట్టుమాపైకివచ్చినవి.

అని, తాత్పర్యము.

పరాక్రమజ్ఞో రామస్య శరో దృష్టభయః పురా. ౧౨
సముద్భ్రాంత స్తతో ముక్త స్తావుభౌ రాక్షసౌ హతౌ

టీక। రామస్య= రామునియొక్క ; శరః=బాణము ; మయా (అధ్యాహృతము)=నాచేత; పురా=మున్ను; దృష్టభయః= చూడఁబడినభయముగలది. తతః(అధ్యాహృతము)= అందువలన; రామస్య(అధ్యాహృతము)= రామునియొక్క; పరాక్రమజ్ఞః = పరాక్రమమునుదెలిసిన ; అహం (అధ్యాహృతము)=నేను; సముద్భ్రాంతః=పరుగెత్తినాను. తతః=అంత; ముక్తః=విడువఁబడినాను. తౌ=ఆ;రాక్షసౌ= రాక్షసులు; ఉభౌ= ఇద్దఱును; హతౌ = చంపఁబడినారు.

నేను రామబాణవేగంబునుమున్నొకమాఱనుభవించి రామునిపరాక్రమంబు దెలిసికొనియున్నాను, గావునఁ, బరుగెత్తితప్పించుకొంటిని ; ఆయిద్దఱు రాక్షసులు, వధింపఁబడిరి.

అని, తాత్పర్యము.

శరేణ ముక్తో రామస్య కథంచి త్ప్రాప్య జీవితమ్. ౧౩
ఇహ ప్రవ్రాజితో యుక్త స్తాపసో హం సమాహితః




టీక॥అహం(అధ్యాహృతము)=నేను;రామస్య=రామునియొక్క ; శరేణ=బాణముచేత;ముక్తః = విడువఁబడినవాఁడనై;కథంచిత్=ఎట్టకేలకు; జీవితం=ప్రాణమును;ప్రాప్య= పొంది; ప్రవ్రాజితః= సన్యసించిన వాఁడనై; యుక్తః= యోగమునొందినవాఁడనై; తాపసః=తపోనిష్ఠుఁడనై ; సమాహితః=సమాధినొందినవాఁడనై;ఇహ=ఇచ్చట;వర్తే=(అధ్యాహృతము) = ఉన్నాను.

నేను,రామునిబాణంబు వాతంబడక,ప్రాణంబుదక్కించుకొని , దుష్టకార్యంబులనన్నియువిడిచి , తపోనిష్ఠుండనై యోగాభ్యాసంబుసేయుచు నిచ్చటనున్నాను. అని, తాత్పర్యము.

వృక్షే వృక్షేచ పశ్యామి చీరకృష్ణాజినాంబరమ్. ౧౪
గృహీత ధనుషం రామం పాశహస్త మివాంతకమ్

టీక॥ వృక్షేవృక్షేచ=ప్రతివృక్షమునందును; చీరకృష్ణాజినాంబరం=నారచీరలనుకృష్ణాజినంబును వస్త్రములుగాఁగలవాఁడును; గృహీతధనుషం = పట్టుకొనఁబడినధనుస్సుగలవాఁడును ; పాశహస్తం=పాశముచేతంగల; అంతకమివ(స్థితం)=యమునివలెనున్నవాఁడునగు; రామం=రామునిఁ;పశ్యామి=చూచుచున్నాను.

రాముండు, నారచీరలనుకృష్ణాజినంబునుదాల్చి ధనుర్ధరుండై,పాశహస్తుండగుయమునికైవడినతిభయంకరాకారుండై,నాకుఁబ్రతివృక్షంబునందును జూపట్టుచున్నాఁడు. అని, తాత్పర్యము.

అపి రామ సహస్రాణి భీతః పశ్యామి రావణ. ౧౫
రామభూత మిదం సర్వ మరణ్యం ప్రతిభాతి మే

టీక॥రావణ = రావణుఁడా! అహం(అధ్యాహృతము)=నేను; భీతః=భయపడినవాఁడనై ; రామసహస్రాణ్యపి=రాములవేలనుగూడ;పశ్యామి=చూచుచున్నాను. మే=నాకు; ఇదం=ఈ; అరణ్యం=అడవి; సర్వం= అంతయు; రామభూతం= రామమయముగా; ప్రతిభాతి=తోఁచుచున్నది.

రావణుఁడా! పెక్కువేల రాములు, నాకంటికగపడినాకుభయంబు గ




లిగించుచున్నారు; ఈయడవియంతయు నాకు రామమయముగా నగపడుచున్నది. అని, తాత్పర్యము.

రామమేవహి పశ్యామి రహితే రాక్షసాధిప. ౧౬

టీక॥ రాక్షసాధిప= రాక్షసులకుఁ బ్రభుఁడవైన రావణుఁడా! రహితే= విజనప్రదేశమునందు ; రామమేవహి= రామునే, పశ్యామి= చూచుచున్నాను. రాక్షసరాజుఁడవగు రావణుఁడా! ఎవ్వరును లేని ప్రదేశమలందంతటను, నాకు రాముఁడేతప్పక పొడసూపుచున్నాఁడు. అని, తాత్పర్యము.

దృష్ట్వా స్వప్నగతం రామ ముద్భ్రమామి విచేతనః

టీక॥ స్వప్నగతం = కలయందుఁ బొందఁబడిన; రామం= రాముని ; దృష్ట్వా= చూచి; విచేతనః= తెలివిదప్పినవాఁడనై ; ఉద్భ్రమామి= భ్రమించుచున్నాను. కలలో రామునిం జూచి, మూర్ఛనొంది, పరమ భయంబునం గలవరించెదను. అని, తాత్పర్యము.

రకారాదీని నామాని రామత్రస్తస్య రావణ. ౧౭
రత్నానిచ రథాశ్చైవ త్రాసం సంజనయంతి మే

టీక॥ రావణ= రావణుఁడా! రామత్రస్తస్య= రామునివలనభయపడిన ; మే= నాకు; రకారాదీని = రకారము మొదటఁగల; నామాని= పేళ్లయిన ; రత్నానిచ= రత్నములును; రథాశ్చైవ= రథములును; త్రాసం = భయమును; సంజనయంతి= కలిగించుచున్నవి. రావణుఁడా! నాకు , రాముని వలనిభయంబునంజేసి, రకారము మొదటగల , రత్నములురథములు మొదలగు పేళ్లుగూడ , మహాభయంబుగలిగించుచున్నవి. అని, తాత్పర్యము.

అహం తస్య ప్రభావజ్ఞో నయుద్ధం తేన తే క్షమమ్. ౧౮
బలింవా నముచింవాపి హన్యాద్ధి రఘునందనః

స ౩౯

టీక॥ అహం=నేను; తస్య=ఆరాముని యొక్క; ప్రభావజ్ఞః=ప్రభావమును దెలిసినవాఁడను; తే=నీకు; తేన=ఆరామునితోఁ, యుద్ధం=పోరు; క్షమం=తగినది; న=కాదు, రఘునందనః=రాముండు, బలింవా=బలినిగాని; నముచింవాపి=నముచినిగాని; హన్యాత్=వధించునుగదా!

ఆరాముని ప్రభావంబు నాకుఁ జక్కఁగాఁ దెలియును; కావున, నతనితోఁ యుద్ధము సేయుట నీ కెంతమాత్రము తగదు, రాముండు, బలినిగాని నముచినిగాని, వధింపఁజాలినంతటి మహాపరాక్రమశాలి. అని, తాత్పర్యము.

రణే రామేణ యుద్ధస్వ క్షమాంవా కురు రాక్షస. ౧౯
న తే రామకథా కార్యా యది మాం ద్రష్టు మిచ్ఛసి

టీక॥ రాక్షస=రావణుఁడా! రణే=యుద్ధమునందు; రామేణ=రామునితోఁ, యుద్ధస్వ=పోరినను బోరుము. క్షమాంవా=ఓర్పునైనను గాని; కురు=చేయుము. మాం=నన్ను; ద్రష్టుం=చూచుటకు; ఇచ్ఛసియది=కోరుదువేని; తే=నీకు; రామకథా=రాముని మాట, నకార్యా=చేయఁదగినది కాదు.

రావణుఁడా! నీవు, రామునితో యుద్ధము చేసినను జేయుము; ఊరకున్నను ఊరకుండుము, నీయిష్టము; నీవు, నన్నుఁ జూడఁగోరుదువేని, రాముని ప్రస్తాపమును మాత్రము నాయొద్దఁ జేయకుము. అని, తాత్పర్యము.

బహవ స్సాధవో లోకే యుక్తా ధర్మ మనుష్ఠితాః ౨౦
పరేషా మపరాధేన వినష్టా స్సపరిచ్ఛదాః

టీక॥ లోకే=లోకమునందు; ధర్మం=ధర్మమును; అనుష్ఠితాః=అనుష్ఠించినవారలును; యుక్తాః=యోగ్యులనగు, సాధవః=సత్పురుషులు; బహవః=పెక్కండ్రు; పరేషాం=ఇతరుల యొక్క; అపరాధేన=దోషముచేత; సపరిచ్ఛదాః=పరివారముతోఁ గూడినవారలయి; వినష్టాః=నశించినారు.

లోకమునందు యోగ్యులును ధార్మికులునగు సత్పురుషులు పెక్కండ్రు, ఒరులయపరాధంబునఁ, బరివా

రజనంబులతోఁగూడ, నాశంబునొందియున్నారు. అని, తాత్పర్యము.

సోహం తవాపరాధేన వినశ్యేయం నిశాచర. ౨౧

టీక॥ నిశాచర=రావణుఁడా! సః=అట్టి; అహం=నేను; తవ=నీయొక్క; అపరాధేన=దోషముచేత, వినశ్యేయం=నాశమునొందుదును.

రావణుఁడా! అట్టిసాధువృత్తి నవలంబించియున్ననేను, నీయపరాధంబున, నాశంబునొందుదును.

అని, తాత్పర్యము.

కురు యత్తే క్షమం తత్త్వ మహం త్వా నానుయామిహ

టీక॥ యత్=ఏ; తే=నీకు; క్షమం=యుక్తమో; తత్=దాని; త్వం=నీవు; కురు=చేయుము. అహం=నేను; త్వా=నిన్ను; నానుయామి=వెంబడింపను ("హ"అనునది పాదపూరణార్థము.)

నీకేదియుక్తముగాఁదోఁచునో, ఆప్రకారము నీవుచేసికొనుము; నాకక్కఱలేదు; నీతోఁగూడనేఁ తమాత్రము రాను. అని, తాత్పర్యము.

రామశ్చహి మహాతేజా మహాసత్త్వో మహాబలః. ౨౨
అపి రాక్షసలోకస్య నభవే దంతకో హి సః

టీక॥ మహాతేజాః=అధికమయిన తేజస్సుగలవాఁడును; మహాసత్త్వః=అధికమయినధైర్యము గలవాఁడును, మహాబలః=అధికమయినబలముగలవాఁడునగు; సః=ఆ; రామశ్చహి=రాముఁడును; రాక్షసలోకస్య=రాక్షసజనమునకు; అంతకః=యముఁడు నభవేదపి=కాఁడాయేమి?

మహాతేజుండును మహాధైర్యుండును మహాబలుండునగు శ్రీరాముండు, రాక్షసులనందఱను, వధింపక, విడువఁడు.

అని, తాత్పర్యము.

యది శూర్పణఖాహేతో ర్జనస్థానగతః ఖరః. ౨౩
అతివృత్తో హతః పూర్వం రామేణాక్లిష్టకర్మణా
అత్ర బ్రూహి యథాతత్త్వం కో రామస్య వ్యతిక్రమః. ౨౪




టీక॥ పూర్వం = మొదట; శూర్పణఖాహేతోః = శూర్పణఖానిమిత్తమయి, జనస్థానగతః = జనస్థానమునొందినవాఁడును; అతివృత్తః = దుర్మార్గుఁడునగు, ఖరః = ఖరుఁడు; అక్లిష్టకర్మణా = దుఃఖకరముకాని కార్యముగల; రామేణ = రామునిచేత; హతోయది = చంపఁబడినవాఁడగునేని; అత్ర = ఈ విషయమునందు; రామస్య = రామునియొక్క; వ్యతిక్రమః = తప్పు, కః = ఏది? యథాతత్త్వం = యథార్థముగా; బ్రూహి = చెప్పుము.

రాముండొరులకు దుఃఖముగలిగించువాఁడు కాఁడు, "శూర్పణఖను విరూపఁగావించెను; ఆకోపంబున యుద్ధంబునకు వచ్చిన ఖరునివధించెను." అని రామునిపైదోషంబు చెప్పుదువు కాఁబోలు; శూర్పణఖ సీతను బాధింపఁబోవుటచే రాముండాబిడను విరూపఁగావించెను; ఖరుండు, పైఁబడికొట్టవచ్చినందు వలన, నాత్మసంరక్షణార్థమయి యతనివధించెను; ఇందు రామునితప్పేమి యున్నది? యథార్థముగాఁ జెప్పుము.

అని, తాత్పర్యము.

హితం వచో బంధు హితార్థినా మయా
యథోచ్యమానం యది నాభి పత్స్యసే
సబాంధవ స్త్యక్ష్యసి జీవితం రణే
హతోద్య రామేణ శరై రజిహ్మగైః. ౨౫

టీక॥ బంధుహితార్థినా = బంధువును మేలుగోరువాఁడననగు; మయా = నాచేత; యథోచ్యమానం = యథార్థముగాఁ జెప్పఁబడుచున్న; హితం = మేలుగలిగించునట్టి; వచః = మాటను, నాభిపత్స్యసే యది = అంగీకరింపవేని; అద్య = ఇప్పుడు; రణే = యుద్ధమునందు; సబాంధవః = బంధువులతోఁగూడినవాఁడవై; రామేణ = రామునిచేత; అజిహ్మగైః = కుటిలముగాఁబోనట్టి; శరైః = బాణములచేత; హతః = కొట్టఁబడినవాఁడవై; జీవితం = ప్రాణమును; త్యక్ష్యసి = విడువఁగలవు.

బంధుండనును నీ మేలుగోరువాఁడను నగు నేను యథార్థముగాఁ జెప్పునట్టి మాటనంగీకరింపవేని, యుద్ధంబున రాముని బాణంబులనభిహతుండవై బంధుసహితంబుగాఁ బ్రాణంబులు విడువం




గలవు. అని, మారీచుండు, రావణునకుం జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, ఏకోనచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండైకోనచత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ:

చత్వారింశసర్గప్రారంభః.

మారీచేన తు తద్వాక్యం క్షమం యుక్తం నిశాచరః
ఉక్తో నప్రతి జగ్రాహ మర్తుకామ ఇవౌషధమ్. ౧

టీక॥ నిశాచరః = రావణుఁడు; మారీచేన = మారీచునిచేత ; క్షమం = తగినదియు; యుక్తం = యుక్తితోఁ గూడినదియునగు; తత్ = ఆ ; వాక్యం = మాటను; ఉక్తస్తు = చెప్పఁబడినవాఁడయ్యు; మర్తుకామః = చావఁగోరినవాఁడు; ఔషధమివ = మందునువలె, నప్రతిజగ్రాహ = స్వీకరించలేదు.

రావణుండు, మారీచుండుయుక్తియుక్తంబుగానెంతచెప్పినను, చావఁగోరినవాఁడు మందును బుచ్చుకొననట్లు మారీచునిమాటనంగీకరింపఁడయ్యె.

అని, తాత్పర్యము.

తం పథ్యహితవక్తారం మారీచం రాక్షసాధిపః
అబ్రవీత్పరుషం వాక్య మయుక్తం కాలచోదితః. ౨

టీక॥ రాక్షసాధిపః = రాక్షసుల కుఁబ్రభుఁడయిన రావణుఁడు ; కాలచోదితః = మృత్యువుచేఁబ్రేరింపఁబడినవాఁడై; పథ్యహితవక్తారం = మేలు



గలిగించుమాటను జెప్పువట్టి; తం = ఆ; మారీచం = మారీచునిగూర్చి ; పరుషం = కఠినమును; అయుక్తం = సరిగానిదియునగు; వాక్యం = మాటను ; అబ్రవీత్ = చెప్పెను.

రాక్షసరాజుండగు రావణుండు, కాలచోదితుండై, మేలుగలిగించుమాటలం జెప్పినమారీచుం జూచి, పరుషంబును అయుక్తంబునగు నీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

య త్త్వయైత దయుక్తార్థం మారీచ మయి కథ్యతే
వాక్యం నిష్ఫల మత్యర్థ ముప్తం బీజ మివౌషరే. ౩

టీక॥ మారీచ = మారీచుఁడా! యత్ = ఏ; అయుక్తార్థం = అనుచితమయినయర్థముగల; ఏతత్ = ఈమాట; మయి = నాయందు; కథ్యతే కిల = చెప్పఁబడుచున్నదో; ఔషరే = చవుటి నేలయందు; ఉప్తం = ఉంచఁబడిన; బీజమివ = విత్తనమువలె ; తత్ (అధ్యాహృతము) = ఆ; వాక్యం = మాట; అత్యర్థం = మిక్కిలియు; నిష్ఫలం = ఫలములేనిది.

మారీచుఁడా! నావిషయమయి, ఇట్లు చెప్పరానిమాటలం జెప్పినావు; చవుటి నేలయందు వేయఁబడినవిత్తనమువలె, నీమాటలంతయు వ్యర్థము.

అని, తాత్పర్యము.

త్వద్వాక్యై ర్న తు మాం శక్యం భేత్తుం రామస్య సంయుగే
పాపశీలస్య మూర్ఖస్య మానుషస్య విశేషతః. ౪

టీక॥ పాపశీలస్య = పాపస్వభావుండును; మూర్ఖస్య = మూర్ఖుండును; విశేషతః = విశేషించి; మానుషస్య = మనుష్యుండునగు; రామస్య = రామునియొక్క; సంయుగే = యుద్ధమునందు; మాం = నన్ను; భేత్తుం = భేదించుటకు; త్వద్వాక్యైః = నీమాటలచేత; న శక్యం తు = ఎంతమాత్రము నలవిగాదు.

పాపిష్ఠుండును మూర్ఖుండును విశేషించి మనుష్యుండునగు రామునితో యుద్ధంబు సేయు విషయమునందు, నన్ను మఱలింప, నీమాటలచే నెంతమాత్రము శక్యముగాదు.

అని, తాత్పర్యము.



యస్త్యక్త్వా సుహృదో రాజ్యం మాతరం పితరం తథా
స్త్రీవాక్యం ప్రాకృతం శ్రుత్వా వన మేకపదే గతః. ౫

టీక॥ యః=ఎవ్వఁడు; ప్రాకృతం=ఉపయోగములేని; స్త్రీవాక్యం=కైకేయిమాటను; శ్రుత్వా=విని; ఏకపదే=ఒకక్షణముననె; సుహృదః=స్నేహితులును; రాజ్యం=దొరతనమును; మాతరం=తల్లిని; తథా=అట్లు; పితరం=తండ్రిని; త్యక్త్వా=విడిచి; వనం=అడవిని; గతః=పొందినాఁడో; సః(అధ్యాహృతము)=అట్టి రాముండు; మూర్ఖః=(అధ్యాహృతము)=మూర్ఖుఁడు.

ఆఁడుదియగు కైకేయి చెప్పిన యుపయోగములేని మాటనువిని, తత్క్షణమున, స్నేహితులను రాజ్యంబునుందలిదండ్రులను విడిచివనంబుఁజేరి నంతటి మూర్ఖుండు రాముండు.

అని, తాత్పర్యము.

అవశ్యంతు మయాతస్య సంయుగే ఖరఘాతినః
ప్రాణైః ప్రియతరా సీతా హర్తవ్యా తవ సన్నిధౌ. ౬

టీక॥ సంయుగే=యుద్ధమునందు; ఖరఘాతినః=ఖరునివధించినట్టి; తస్య=ఆరామునికి; ప్రాణైః(ప్రాణేభ్యః)=ప్రాణములకన్నను; ప్రియతరా=ప్రియురాలైన; సీతా=సీత; తవ=నీయొక్క; సన్నిధౌ=సమీపమునందు; మయా=నాచేత; అవశ్యంతు=అవశ్యముగానే, హర్తవ్యా=హరింపఁబడవలసినది.

యుద్ధంబునఖరునివధించినట్టిదుర్మార్గుఁడగు నా రామునకు, ప్రాణంబులకన్నఁబ్రియతరయగుభార్యనుసీతను, నీయెదుట, నేనవశ్యముహరింపవలయునని నిశ్చయించితిని. అని, తాత్పర్యము.

ఏవం మే నిశ్చితా బుద్ధి ర్హృది మారీచ వర్తతే
న వ్యావర్తయితుం శక్యా సేంద్రై రపి సురాసురైః. ౭

టీక॥ మారీచ=మారీచుఁడా! ఏవం=ఇట్లు; నిశ్చితా=నిశ్చయింపఁబడిన; బుద్ధిః=బుద్ధి; మే=నాయొక్క; హృది=మనస్సునందు; వర్తతే=ఉన్నది. సేంద్రైః=ఇంద్రునితోఁగూడిన; సురాసురైరపి=దేవతలచేతనుఆసురులచేతను; వ్యావర్తయితుం=మఱలించుటకు; న శక్యా=అలవిగాదు.

మారీచుఁడా! ఈప్రకారంబుననే సుమనంబున నిశ్చయించుకొనియున్నాను ; ఈనిశ్చయముచు దేవేంద్రుండు సురాసురులనందఱు నొకటియయిన నుమలుప్పఁజాలఁడు.

అని, తాత్పర్యము.

దోషం గుణంవా సంపృష్ట స్త్వ మేవం వక్తు మర్హసి
అపాయంవా వ్యుపాయంవా కార్యస్యాస్య వినిశ్చయే. ౮

టీక॥ త్వం=నీవు; అస్య= ఈ; కార్యస్య=పనియొక్క; వినిశ్చయే = నిశ్చయించుటవిషయమయి; దోషం= దోషమును గాని; గుణంవా = గుణమును గాని; అపాయంవాపి= అపాయమును గాని; ఉపాయంవా = ఉపాయమును గాని; సంపృష్టః= అడుగఁబడినవాఁడవై; ఏవం=ఇట్లు; వక్తుం=చెప్పుటకు; అర్హసి=తగుదువు.

ఈకార్యము నిశ్చయించు విషయమయి , ఉపాయాపాయంబులను గాని గుణదోషంబులను గాని చెప్పుమని నేనడిగినట్టయిన, నీవిట్లు చెప్పవచ్చును.

అని, తాత్పర్యము.

సంపృష్టేన తు వక్తవ్యం సచివేన విపశ్చితా
ఉద్యతాంజలినా రాజ్ఞే య ఇచ్ఛేద్భూతి మాత్మనః. ౯

టీక॥ యః=ఎవ్వఁడు; ఆత్మనః=తనయొక్క; భూతిం=సంపదను; ఇచ్ఛేత్=కోరునో; తేన (అధ్యాహృతము)= అట్టి; సంపృష్టేన=అడుగఁబడిన ; విపశ్చితా=పండితుఁడగు ; సచివేనతు= మంత్రిచేతనే; ఉద్యతాంజలినా= ఎత్తఁబడిన చేమోడ్పుగలవానిచేత ; రాజ్ఞే=రాజుకొఱకు; వక్తవ్యం=చెప్పఁబడవలయును.

సంపదంబొందఁగోరిన పండితుండగుమంత్రి, తన్నురాజడిగినపిమ్మటనే, చేతులుమోడ్చుకొని , తనకుఁదోఁచినదిరాజునకుఁజెప్పుకొనవలయును; అడుగనియెడఁజెప్పఁగూడదు.

అని, తాత్పర్యము.

వాక్య మప్రతి కూలంతు మృదుపూర్వం హితం శుభమ్
ఉపచారేణ యుక్తంచ వక్తవ్యో వసుధాధిపః. ౧౦

టీక॥ వసుధాధిపః=రాజు ; అప్రతికూలం=విరుద్ధము గానిదియు ; మృదుపూర్వం = మెత్తనిది ముందుగలదియు; హితం= మేలుగలిగి చునదియు, శుభం=మంగళకరంబును ; ఉపచారేణ=వినయంబుతో; యుక్తంచ= కూడినదియునగు, వాక్యంతు=మాటనే ; వక్తవ్యః=చెప్పఁబడవలయును.

అట్లుమంత్రి రాజునకు హితంబుఁ జెప్పటలోను, రాజునకు విరుద్ధము గాకుండను మృదువుగనుపినయసహితంబుగను మంచిమాటలుగనుం జెప్పవలయును.

అని, తాత్పర్యము.

సావమర్దంతు య ద్వాక్యం మారీచ హిత ముచ్యతే
నాభినందతి త ద్రాజా మానార్హో మానవర్జితమ్. ౧౧

టీక॥ మారీచ= మారీచుఁడ! సావమర్దం=తిరస్కారముతోఁగూడిన, యత్=ఏ, హితం=మేలుగలిగించునట్టి; వాక్యంతు=మాటమాత్రము; ఉచ్యతే= చెప్పఁబడుచున్నదో, మానవర్జితం= సమ్మానముచేయఁబడనిది; తత్=ఆ మాటను; మానార్హః=సమ్మానమునకుఁదగిన; రాజా=రాజు; నాభినందతి=అంగీకరింపఁడు.

మారీచుఁడా! తిరస్కారముతోఁ జెప్పఁబడునేనియది హితవాక్యమయినను సమ్మానరహితమగుటచే, రాజు సమ్మానయోగ్యుండుకావున దాని నంగీకరింపఁడు అని, తాత్పర్యము.

పంచరూపాణి రాజానో ధారయం త్యమితౌజసః
అగ్నే రింద్రస్య సోమస్య వరుణస్య యమస్యచ. ౧౨

టీక॥ అమితౌజసః=కొలఁదిలేని ప్రతాపముగల; రాజానః=రాజులు; అగ్నేః=అగ్నియొక్కయు; ఇంద్రస్య=ఇంద్రునియొక్కయు; సోమస్య= చంద్రుని యొక్కయు; వరుణస్య = వరుణుని యొక్కయు; యమస్యచ=యమునియొక్కయు; రూపాణి = ఆకారములను; పంచ=అయిదింటిని; ధారయంతి=ధరింతురు.

అమితప్రతాపులగు రాజులు, అగ్ని, ఇంద్రుఁడు, చంద్రుఁడు, వరుణుండు, యముండు, ఈయయిదుగురి రూపంబులను దాల్చియుందురు.

అని, తాత్పర్యము.

ఔష్ణ్యం తథా విక్రమంచ సౌమ్యం దండం ప్రసన్నతామ్
ధారయంతి మహాత్మానో రాజానః క్షణదాచర. ౧౩

టీక॥ క్షణదాచర = రాక్షసుండవగుమారీచుఁడా! మహాత్మానః = అధికమయినప్రభావముగల ; రాజానః= రాజులు;తథా=అట్లు;ఔష్ణ్యం = వేడిమిని,విక్రమంచ = పరాక్రమంబును; సౌమ్యం=చల్లఁదనంబును ; దండం= శిక్షను; ప్రసన్నతాం = నిర్మలత్వమును,ధారయంతి=ధరించుచున్నారు.

మారీచుఁడా ! మహాత్ములగు రాజులు, అట్లు , అగ్నిదేవుని వేఁడిమిని, ఇంద్రునిపరాక్రమంబునుజంద్రునిచల్లఁదనంబును,వరుణునిప్రసన్నతను , యమునిశిక్షాశక్తిని,దాల్చియుందురు.

అని, తాత్పర్యము.

తస్మాత్సర్వా స్వవస్థాసు మాన్యాః పూజ్యాశ్చ పార్థివాః

టీక॥తస్మాత్=అందువలన ; పార్థివాః=రాజులు;సర్వాసు= సమస్తములయిన; అవస్థాసు=అవస్థలయందును; మాన్యాః= గౌరవింపఁదగినవారలును; పూజ్యాశ్చ=పూజింపఁదగినవారలును.

అందువలన, రాజులను సర్వావస్థలయందును గౌరవింపుచుఁ బూజింపుచునుండవలయును.

అని, తాత్పర్యము.

త్వంతు ధర్మ మవిజ్ఞాయ కేవలం మోహ మాస్థితః. ౧౪
అభ్యాగతం మాం దౌరాత్మ్యా త్పరుషం వక్తు మిచ్ఛసి

టీక॥త్వంతు = నీవుమాత్రము; ధర్మం=ధర్మమును; అవిజ్ఞాయ= ఎఱుంగక; మోహం కేవలం=అజ్ఞానమునుమాత్రము; ఆస్థితః= అవలంబించినవాఁడవై ; దౌరాత్మ్యాత్= దుష్టబుద్ధిగలవాఁడవగుటవలన; అభ్యాగతం= నీయింటికివచ్చిన; మాం = నన్నుఁగూర్చి; పరుషం = కఠినమయినమాటను; వక్తుం=చెప్పుటకు; ఇచ్ఛసి= కోరుచున్నావు.

నీవు,రాజధర్మంబుఁదెలియనివాఁడవగుటచే, నజ్ఞానంబుననిట్లుదౌష్ట్యంబువహించి, నీయింటికివచ్చినసకలరాక్షసరాజును నన్నుఁ జూచి,పరుషంబు

లాడఁబూనితివి. అని, తాత్పర్యము.

గుణ దోషౌ నపృచ్ఛామి క్షమం చాత్మని రాక్షస. ౧౫

టీక॥ రాక్షస=మారీచుఁడా! ఆత్మని=నావిషయమయి, గుణదోషౌ=గుణదోషములను; క్షమంచ= యుక్తమును; నపృచ్ఛామి=అడుగను.

మారీచుఁడా! ఇప్పడీవిషయమునందు, గుణదోషంబులనుగానియు క్తాయుక్తంబులనుగాని నేనునిన్నడుగలేదు.
అని, తాత్పర్యము.

మయోక్తం తవ చైతావత్సంప్ర త్యమితవిక్రమ

టీక॥అమితవిక్రమ=కొలఁతలేని పరాక్రమముగలమారీచుఁడా!సంప్రతి=ఇప్పుడు;మయా=నాచేత;తవ= నీకు; ఉక్తంచ=చెప్పఁబడినదియు ; ఏతావత్=ఇంత.

కొలఁదిలేనిపరాక్రమంబుగల మారీచుఁడా! నీకు నేనుజెప్పిన కార్యమింతమాత్రము ; దానినీవుచేయవలసినదేకానిబదులుచెప్పఁగూడదు.
అని, తాత్పర్యము.

అస్మింస్తు త్వం మహాకృత్యే సాహాయ్యం కర్తుమర్హసి. ౧౬

టీక॥ త్వం=నీవు;అస్మిన్ = ఈ; మహాకృత్యే = గొప్పకార్యమునందు; సాహాయ్యంతు = తోడుపాటునుమాత్రము;కర్తుం=చేయుటకు ; అర్హసి=తగుదువు.

ఇమ్మహాకార్యంబునందు , నీవుసాహాయ్యంబు సేయవలయును.
అని, తాత్పర్యము.

శృణు తత్కర్మ సాహాయ్యే యత్కార్యం వచనాన్మమ

టీక॥ సాహాయ్యే = తోడుపాటునందు; మమ=నాయొక్క;వచనాత్=మాటవలన; యత్=ఏది; కార్యం=చేయఁదగినదో; తత్= ఆ; కర్మ=కార్యమును; శృణు=వినుము.

సాహాయ్యముసేయుటయందు, నీవు , నామాటప్రకారమునాకేమిచేయవలయునోదానింజెప్పెదనువినుము.
అని, తాత్పర్యము.




సౌవర్ణ స్త్వం మృగో భూత్వా చిత్రో రజతబిందుభిః. ౧౭
ఆశ్రమే తస్య రామస్య సీతాయాః ప్రముఖే చర

టీక॥ త్వం=నీవు, రజతబిందుభిః=వెండిచుక్కలచేత; చిత్రః= నానావర్ణమయునః; సౌవర్ణః=బంగారువికారము యునః; మృగః=జింక; భూత్వా=అయి; తస్య=ఆ-రామస్య= రామునియొక్క; ఆశ్రమే=ఆశ్రమమునందు; సీతాయాః= సీతయొక్క; ప్రముఖే=ఎదుటను; చర= తిరుగుము.

నీవు, వెండిచుక్కలచే జిత్రితమయినబంగారుజింకరూపు దాల్చి, యా రామునియాశ్రమంబునకుం బోయి, సీత యెదుటందిరుగుము.

అని, తాత్పర్యము.

ప్రలోభయిత్వా వైదేహీం యథేష్టం గంతుమిచ్ఛసి. ౧౮

టీక॥ త్వం (అధ్యాహృతము)= నీవు; వైదేహీం= సీతను ; ప్రలోభయిత్వా(ప్రలోభ్య)= ఆశింపఁజేసి; యథేష్టం=యథేచ్ఛగా, గంతుం=పోవుటకు; అర్హసి=తగుదువు.

అట్లుసీతకు, మృగరూపధారివగు నీపై, ఆశగల్గునట్లుచేసి, యథేచ్ఛంబొమ్ము. అని, తాత్పర్యము.

త్వాంతు మాయా మృగం దృష్ట్వా కాంచనం జాతవిస్మయా
ఆనయైనమితి క్షిప్రం రామం వక్ష్యతి మైథిలీ. ౧౯

టీక॥ మైథిలీ=సీత ; కాంచనం = బంగారువికారమగు; మాయామృగం= మాయజింకవైన; త్వాం=నిన్ను ; దృష్ట్వాతు = చూచినంతనె; జాతవిస్మయా=పుట్టినయాశ్చర్యముగలదై ; క్షిప్రం=శీఘ్రముగా; ఏనం= ఈజింకను; ఆనయ=తెమ్ము. ఇతి=అని; రామం= రామునిగూర్చి; వక్ష్యతి=చెప్పఁగలదు.

బంగారుమాయజింక రూపుదాల్చియున్ననిన్నుఁజూచినంతనే, సీత, యాశ్చర్యపడి, యాజింకనుదెచ్చియిమ్మని, రామునడుగంగలదు.

అని, తాత్పర్యము.

అపక్రాంతేతు కాకుత్స్థే దూరం యాత్వా వ్యుదాహర




హా సీతే లక్ష్మణేత్యేవం రామవాక్యాను రూపకమ్. ౨౦

టీక॥ కాకుత్థ్సే=రాముఁడు ; అపక్రాంతేతు=అవలికిఁబోఁగానే ; త్వం (అధ్యాహృతము)=నీవు; దూరం=దూరము; యాత్వాపి=పోయియు; "హా= అయ్యో! సీతే=సీతా! లక్ష్మణ= లక్ష్మణా! ఇత్యేవఁ=అనియిట్లు ; రామవాక్యానురూపకం = రామునిమాటకనురూపముగా; ఉదాహర= పలుకుము.

రాముండునిన్నుఁబట్టుటకు సీతాలక్ష్మణులనువదలివచ్చినపిమ్మట , నీవు, దూరముగాఁబోయి, రాముండుచెప్పినట్లుగా, "అయ్యో! సీతా! లక్ష్మణా!" అని, యఱవుము . అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా రామ పదవీం సీతయాచ ప్రచోదితః
అనుగచ్ఛతి సంభ్రాంత స్సౌమిత్రి రపి సౌహృదాత్. ౨౧

టీక॥ సౌమిత్రిరపి=లక్ష్మణుఁడును; తత్=ఆమాటను; శ్రుత్వా=విని ; సంభ్రాంతః=భ్రమించినవాఁడై; సౌహృదాత్=స్నేహమువలనను ; సీతయా చ=సీతచేతను; ప్రచోదితః= ప్రేరింపఁబడినవాఁడై; రామపదవీం = రామునిమార్గమును; అనుగచ్ఛతి= వెంబడించును.

లక్ష్మణుండును, ఆమాటను విన్నంతనెయేమియుందోఁచక, యన్నపైస్నేహమువలనను సీతప్రేరణవలనను, రాముండుపోయినమార్గంబుఁ బట్టిపోవును. అని, తాత్పర్యము.

అపక్రాంతేచ కాకుత్థ్సే లక్ష్మణేచ యథాసుఖం
ఆనయిష్యామి వైదేహీం సహస్రాక్ష శ్శచీమివ. ౨౨

టీక॥ కాకుత్థ్సే=రాముండును ; లక్ష్మణేచ=లక్ష్మణుండును; అపక్రాంతేచ=పోయినంతనె; యథాసుఖం = సుఖముగా; వైదేహీం=సీతను; సహస్రాక్షః=దేవేంద్రుండు; శచీమివ= శచీదేవినివలె; ఆనయిష్యామి(ఆనేష్యామి)= తెచ్చెదను.

అట్లు, రాముండునులక్ష్మణుండును,

స ౪౦

ఆవలికిఁబోయినపిమ్మట, నేను, ఇంద్రుం డుశచీదేవినింబోలె, సుఖంబున, సీతం దెచ్చెదను. అని, తాత్పర్యము.

ఏవం కృత్వా త్విదం కార్యం యథేష్టం గచ్ఛ రాక్షస
రాజ్యస్యార్ధం ప్రయచ్ఛామి మారీచ తవ సువ్రత. ౨౩

టీక॥ రాక్షస=మారీచుఁడా! ఏవం=ఇట్లు; ఇదం=ఈ; కార్యం=పనిని ; కృత్వాతు=చేసినంతనె; యథేష్టం= యథేచ్ఛగా; గచ్ఛ= పొమ్ము . సువ్రత= మంచివ్రతముగల; మారీచ = మారీచుఁడా! తవ=నీకు; రాజ్యస్య= రాజ్యముయొక్క; అర్ధం=సగమును; ప్రయచ్ఛామి=ఇచ్చెదను.

మంచివ్రతములుగల మారీచుఁడా! నీవింతమాత్రముచేసి, నీయిచ్ఛకువచ్చిన చోటికింబొమ్ము; నీకు, నారాజ్యంబులో సగమిచ్చెదను. అని, తాత్పర్యము.

గచ్ఛ సౌమ్య శివం మార్గం కార్యస్యాస్య వివృద్ధయే
అహం త్వాను గమిష్యామి సరథో దండకావనం. ౨౪

టీక॥ సౌమ్య=తిన్ననివాఁడవగుమారీచుఁడా! అస్య=ఈ; కార్యస్య= కార్యముయొక్క; వివృద్ధయే=అభివృద్ధికొఱకు; శివం=సుందరమయిన; మార్గం= మృగసంబంధిరూపమును; గచ్ఛ= పొందుము. అహం=నేను; సరథః= రథముతోఁగూడినవాఁడనై ; దండకావనఁ= దండకారణ్యమునుగూర్చి; త్వాం = నిన్ను; అనుగమిష్యామి=వెంబడించెదను.

సౌమ్యుండవగుమారీచుఁడా ! ఈ కార్యంబభివృద్ధినొందుటకొఱకు, సుందరంబగుమృగరూపంబునొంది , దండకారణ్యంబునకుఁబొమ్ము ; నేనురథారూఢుండనై, నీవెంటవచ్చెదను.

అని, తాత్పర్యము.

ప్రాప్య సీతామయుద్ధేన వంచయిత్వాతు రాఘవమ్
లంకాం ప్రతిగమిష్యామి కృతకార్య స్సహత్వయా. ౨౫

టీక॥ రాఘవం=రామునిఁ; వంచయిత్వాతు=మోసపుచ్చియు ; అయుద్ధే

న=యుద్ధములేమిచేత,సీతాం = సీతనుః ప్రాప్య=పొంది,కృతకార్యః = చేయఁబడినకార్యముగలవాఁడనై ; త్వయాసహ=నీతోఁగూడః లంకాంప్రతి=లంకనుగూర్చిః గమిష్యామి = పోయెదను.

ఈప్రకారమున రామునివంచించి,యుద్ధంబు సేయవలసినదిలేకయె,సీతనపహరించుకొని, కృతార్థుఁడనై , సీతోఁగూడ లంకకుఁబోయెదను.

అని, తాత్పర్యము.

నచే త్కరోషి మారీచ హన్మి త్వా మహ మద్య వై
ఏతత్కార్య మవశ్యం మే బలాదపి కరిష్యసి. ౫౬

టీక॥ మారీచ=మారీచుఁడా! నకరోషిచేత్=చేయవేని;అహం= నేనుః త్వాం=నిన్నుఃఅద్యవై= ఇప్పుడెః హన్మి=వధించెదను. మే = నాయొక్కః ఏతత్=ఈ,కార్యం=పనినిః అవశ్యం= అవశ్యముగాఃబలాదపి= బలాత్కారమువలననైనః కరిష్యసి= చేయఁగలవు.

మారీచుఁడా ! నీవీకార్యముసేయవేని, నేనిప్పుడేనిన్నువధింతును ; అవశ్యముగా , బలాత్కారంబుననైనను, నీచేతనీకార్యముఁ, జేయింతును.

అని, తాత్పర్యము.

రాజ్ఞో హి ప్రతికూలస్థో నజాతు సుఖమేధతే

టీక॥ రాజ్ఞః= రాజునకుః ప్రతికూలస్థః= ప్రతికూలముగానుండువాఁడుః జాతు=ఒకానొకప్పుడునుఃసుఖం= సుఖమునుఃనైధతే=పొందఁడు.

రాజునకుఁబ్రతికూలముగా నుండువానికెప్పటికిని సుఖముగలుగదు.

అని, తాత్పర్యము.

ఆసాద్య తం జీవిత సంశయ స్తే
మృత్యు ర్ధ్రువో హ్యద్య మయా విరుధ్య. ౫౭
ఏత ద్యథావ త్ప్రతిగృహ్య బుద్ధ్యా
యదత్ర పథ్యం కురు త త్తథా త్వమ్




టీక॥ త్వే=నీవు;తం=ఆరాముని; ఆసాద్య=సమీపించి ; జీవితసంశయః=ప్రాణసందేహము. అద్య=ఇప్పుడు; మయా=నాతో,విరుధ్య = విరోధించి; మృత్యుః=మరణము;ధ్రువోహి= నిశ్చితముగదా! ఏతత్=దీనిని ; యధావత్=సరిగా;బుద్ధ్యా=బుద్ధిచేత ; ప్రతిగృహ్య=తీసికొని;అత్ర=ఇందు ; యత్=ఏది;పథ్యం=మేలో;తత్= దాని, త్వం=నీవు;తధా=అట్లు;కురు = చేయుము.

నీవుఆరామునియొద్దకుఁ బోవుదువేనిమరణంబుగలుగుటసందేహము, ఒకవేళఁదప్పిననుదప్పవచ్చును ; నాతోవిరోధింతువేని యిప్పుడె మరణంబుగల్గును;ఇదినిశ్చితము; నీవీరెంటినిజక్కఁగాఁ బాలోచించి,నీకేదిహితమో దానిఁగావింపుము.అని,రావణుండు , మారీచునితోఁజెప్పెను. అని,తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే,చత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,అరణ్యకాండచత్వారింశసర్గటీక,
ముగిసినది.






శ్రీః

ఏకచత్వారింశసర్గప్రారంభః.

ఆజ్ఞప్తో రాజవద్వాక్యం ప్రతికూలం నిశాచరః
అబ్రవీత్పరుషం వాక్యం మారీచో రాక్షసాధిపమ్. ౧

టీక॥ నిశాచరః=రాక్షసుఁడగు; మారీచః=మారీచుఁడు; రాజవత్= రాజా హాఁ మగు; ప్రతికూలం=విరుద్ధమయిన, వాక్యం=మాటను; ఆజ్ఞప్తః= ఆజ్ఞాపింపఁబడినవాఁడై; రాక్షసాధిపం = రాక్షసులకుఁబ్రభువయిన రావణునిగూర్చి; పరుషం= కఠినమయిన ; వాక్యం= మాటను; అబ్రవీత్=చెప్పెను.

రావణుండు, తనయధికారి మే ప ఁ డ, "నీయిష్టమునకుఁ బ్రతికూలమయిన నునీవీకార్యముఁజేయవలయును" అని యాజ్ఞాపింప, మారీచుండు, రాక్షసరాజుండగు రావణుఁజూచి , యిట్లని పరుషవాక్యంబునుం బలికెను.

అని, తాత్పర్యము.

కేనాయముపదిష్టస్తే వినాశః పాపకర్మణా
సపుత్రస్య సరాష్ట్రస్య సామాత్యస్య నిశాచర. ౨

టీక॥ నిశాచర= రావణుఁడా! అయం=ఈ; సపుత్రస్య=కొడుకులతోఁగూడినవాఁడవును; సరాష్ట్రస్య=రాజ్యముతోఁగూడినవాఁడవును ; సామాత్యస్య=మంత్రులతోఁగూడినవాఁడవునగు; తే=నీయొక్క; వినాశః=నాశము; కేన=ఏ; పాపకర్మణా=పాపముగలిగించుకార్యములుగలవానిచేత, ఉపదిష్టః= ఉపదేశింపఁబడినది.

నీకును , నీకొడుకులకునునీరాజ్యంబునకునునీమంత్రులకును అందఱకునువినాశంబుగలిగించునట్టి యీయుపాయమును, నీ కేపాపాత్ముండుపదేశించెను.

అని, తాత్పర్యము.

కస్త్వయా సుఖినా రాజన్నాభినందతి పాపకృత్
కేనేద ముపదిష్టన్తే మృత్యుద్వార ముపాయతః. ౩



టీక॥ రాజన్ = రాక్షసరాజుండవగు రావణుండా! సుఖినా = సుఖముగల, త్వయా = నీచేత; పాపకృత్ = పాపము సేయునట్టి; కః = ఎవ్వండు; నాభినందతి = సంతోషింపకున్నాండు? మృత్యుద్వారం = మృత్యువాకిలియయినది; ఇదం = ఈ కార్యము. కేన = ఎవ్వనిచేత; ఉపాయతః = ఉపాయమువలన; తే = నీకొఱకు; ఉపదిష్టం = ఉపదేశింపఁబడినది?

రాక్షసరాజుండవగు రావణుండా! నీవు సుఖంబుననుండుట నే పాపాత్ముండు చూడఁజాలకున్నాండు? మృత్యుద్వారతుల్యంబగు నీకార్యమును నీకెవ్వఁడుపదేశించెను? అని, తాత్పర్యము.

శత్రవ స్తవ సువ్యక్తం హీనవీర్యా నిశాచరాః
ఇచ్ఛంతి త్వాం వినశ్యంత ముపరుద్ధం బలీయసా. ౪

టీక॥ హీనవీర్యాః = విడువఁబడిన పరాక్రమముగల; నిశాచరాః = రాక్షసులు; తవ = నీకు; శత్రవః = శత్రువులు. సువ్యక్తం = స్పష్టము. త్వాం = నిన్ను; బలీయసా = బలిష్ఠుండగువానిచేత; ఉపరుద్ధం = అడ్డగింపఁబడినవానింగాను; వినశ్యంతం = నశించుచున్న వానింగను; ఇచ్ఛంతి = కోరుచున్నారు.

పరాక్రమహీనులగు రాక్షసులు, నీశత్రువులు; సందేహములేదు; నీవు బలిష్ఠుండగు రామునిచేతంజిక్కి నాశంబు నొందవలెనని కోరెదరు.

అని, తాత్పర్యము.

కేనేద ముపదిష్టం తే క్షుద్రేణా హితవాదినా
యస్త్వా మిచ్ఛతి నశ్యంతం స్వకృతేన నిశాచర. ౫

టీక॥ నిశాచర = రావణుండా! క్షుద్రేణ = అల్పుండును; అహితవాదినా = కీడుగలిగించునట్టి మాటను జెప్పువాండునగు; కేన = ఎవ్వనిచేత; తే = నీకొఱకు; ఇదం = ఇది; ఉపదిష్టం = ఉపదేశింపఁబడినది? యః = ఎవ్వండు; త్వాం = నిన్ను; స్వకృతేన = తన కార్యముచేత; వినశ్యంతం = నశించువానింగా; ఇచ్ఛతి = కోరుచున్నాండో.

రావణుండా! క్షుద్రుండగు నెవ్వండు, నీనాశంబుఁగోరి, నీకీయహితంబుపదేశించెను? అని, తాత్పర్యము.



వధ్యాః ఖలు నహన్యంతే సచివా స్తవ రావణ
యే త్వా ముత్పథ మారూఢం ననిగృహ్ణంతి సర్వశః. ౬

టీక॥ రావణ=రావణుఁడా! యే=ఎవ్వరు; సర్వశః= అందఱును; ఉత్పథం=ఉన్మార్గమును; ఆరూఢం=పొందినవానిని; త్వాం=నిన్ను; ననిగృహ్ణంతి=నిగ్రహింపకున్నారో; తే(అధ్యాహృతము)=అట్టి; తవ=నీయొక్క; సచివాః=మంత్రులు; వధ్యాః ఖలు= వధింపఁదగినవారలుగదా! నహన్యంతే= వధింపఁబడకున్నారు.

రావణుఁడా! ఈమంత్రులెవ్వరును ఇట్లున్మార్గప్రవృత్తుఁడగు నిన్ను నిగ్రహింపకున్నారుకావున, వారలందఱు వధ్యులు, వారలనేల వధింపకున్నావు? అని, తాత్పర్యము.

అమాత్యైః కామవృత్తో హి రాజా కాపథ మాశ్రితః
నిగ్రాహ్య స్సర్వథా సద్భి ర్న నిగ్రాహ్యో నిగృహ్యసే. ౭

టీక॥కామవృత్తః= యథేచ్ఛమయి నయాచారము గలవాఁడును; కాపథం=దుర్మార్గమును; ఆశ్రితః=పొందినవాఁడునగు; రాజా=రాజు; సద్భిః=పెద్దలగు; అమాత్యైః=మంత్రులచేత, సర్వథా = అన్నివిధంబులను; నిగ్రాహ్యోహి= నిగ్రహింపఁదగినవాఁడుగదా! నిగ్రాహ్యః= నిగ్రహింపఁదగిన నీవు; ననిగృహ్యసే= నిగ్రహింపఁబడకున్నావు.

రాజు, ఇచ్ఛకువచ్చినట్లు దుర్మార్గంబునొందునేని, సత్పురుషులగు మంత్రులతని నన్నివిధంబుల నిగ్రహింపవలయును; నిన్నేల నిగ్రహింపకున్నారు. అని, తాత్పర్యము.

ధర్మ మర్థంచ కామంచ యశశ్చ జయతాం వర
స్వామిప్రసాదా త్సచివాః ప్రాప్నువంతి నిశాచర. ౮

టీక॥జయతాం= జయించువారలలోపల; వర=శ్రేష్ఠుండవగు; నిశాచర= రావణుఁడా! సచివాః = మంత్రులు; స్వామిప్రసాదాత్= రాజుయొక్కనై

సర్గ ౧

 

మర్థ్యాములవలన; ధర్మం = ధర్మమును; అర్థంచ=ధనమును; కామంచ= కామమును; యశశ్చ=కీర్తిని; ప్రాప్నువంతి=పొందుచున్నారు.

జయించు వారలలో నుత్తముండవగురావణుండా! రాజునిర్దోషుండై యుండునేని, మంత్రులకు, ధర్మ కామంబులును గీర్తియుంగల్గును.

అని, తాత్పర్యము.

విపర్యయే తు తత్సర్వం వ్యర్థం భవతి రావణ
వ్యసనం స్వామివైగుణ్యా త్ప్రాప్నువంతీ తరే జనాః. ౯

టీక॥ రావణ=రావణుండా! విపర్యయే తు=విపరీతముగానుండుట యందు మాత్రము; తత్=అది; సర్వం= అంతయు; వ్యర్థం=ప్రయోజనములేనిది; భవతి=అగును ఇతరే=ఇతరులయిన, జనాః=జనులును; స్వామివైగుణ్యాత్=రాజుయొక్క దుర్గుణతవలన, వ్యసనం=దుఃఖమును; ప్రాప్నువంతి=పొందుదురు.

రావణుండా! రాజు దుర్గుణుండగునేని, మంత్రులకేప్రయోజనమును లేదు; ఇతరజనులుగూడ నిక్కిలియుఁ గష్టంబునొందుదురు.

అని, తాత్పర్యము.

రాజమూలో హి ధర్మశ్చ జయశ్చ జయతాంవర
తస్మా త్సర్వా స్వవస్థాసు రక్షితవ్యా నరాధిపాః. ౧౦

టీక॥ జయతాం= జయించువారలలో; వర=శ్రేష్ఠుఁడవగు రావణుండా! ధర్మశ్చ= ధర్మంబును; జయశ్చ = జయంబును; రాజమూలో హి=రాజె మూలముగాఁ గలదిగదా! తస్మాత్= అందువలన; సర్వాసు = సమస్తములయిన; అవస్థాసు = అవస్థలయందును; నరాధిపాః = రాజులు; రక్షితవ్యాః=కాపాడఁబడవలసినవారలు.

జయించువారలలో నుత్తముఁడవగు రావణుండా! ధర్మమునకును జయమునకును రాజె కారణముకావున, సర్వావస్థలయందును, రాజులను రక్షింపవలయును. అని, తాత్పర్యము.

 

రాజ్యం పాలయితుం శక్యం నతీక్ష్ణేన నిశాచర
నచాపి ప్రతికూలేన నావినీతేన రాక్షస. ౧౧

టీక॥ రాక్షస=రాక్షసుఁడవగు; నిశాచర=రావణుఁడా! రాజ్యం= రాజ్యమును; పాలయితుం= పాలించుటకు; తీక్ష్ణేన=క్రూరుఁడైనవానిచేత; న శక్యం = అలవిగాదు. ప్రతికూలేనచాపి=ప్రతికూలుఁడైనవానిచేతఁగాని; న (శక్యం)=అలవిగాదు. అవినీతేన= వినయములేనివానిచేత ; న (శక్యం) = అలవిగాదు.

రావణుఁడా! క్రూరుండగువాఁడుగాని , ప్రజలకుఁబ్రతికూలుండగువాఁడుగాని, యింద్రియనిగ్రహంబులేనివాఁడుగాని, రాజ్యంబునెంతమాత్రముపాలింపఁజాలఁడు. అని, తాత్పర్యము.

యే తీక్ష్ణమంత్రా స్సచివా భజ్యంతే సహ తేన వై
విషమే తురగా శ్శీఘ్రా మందసారథయో యథా. ౧౨

టీక॥ యే=ఏ; సచివాః= మంత్రులు; తీక్ష్ణమంత్రాః=భయంకరములయినయాలోచనగలవారలలో; తే(అధ్యాహృతము)=వారలు; తేనసహవై=ఆ రాజుతోఁగూడనె; విషమే=మిట్టపల్లపుప్రదేశమునందు; మందసారథయః= చేతఁగానిసారథులుగల; శీఘ్రాః= వేగముగాఁబోవునట్టి; తురగాయథా=గుఱ్ఱములువలె ; భజ్యంతే= భగ్నులగుచున్నారు.

చేతఁగానిసారథిగలగుఱ్ఱములు,మిట్టపల్లముగానుండుప్రదేశమునందతివేగముగాఁబోయి సారథితోఁగూడఁగూలునట్లు , అపాయకరములగున్నాలోచనలుచెప్పునట్టిమంత్రులు , యసమర్థుఁడగుటచేఁ దమమాటలువినురాజుతోఁగూడ, నాశమునొందుదురు.

అని, తాత్పర్యము.

బహవ స్సాధవో లోకే యుక్తా ధర్మ మనుష్ఠితాః
పరేషా మపరాధేన వినష్టా స్సపరిచ్ఛదాః. ౧౩

టీక॥లోకే = లోకమునందు; యుక్తాః = నీతిమార్గముననుండువారలు




ను; ధర్మాం = ధర్మమును; అనుష్ఠితాః = ఆచరించినవారలునగు; సాధవః=సత్పురుషులు; బహవః=పెక్కండ్రు; పరేషాం=ఇతరులయొక్క; అపరాధేన=తప్పుచేత; సపరిచ్ఛదాః=పరివారముతోఁ గూడినవారలయి; వినష్టాః=నశించిరి.

లోకమునందు, నీతిమార్గవర్తులు సుధర్మానుష్ఠానంబు తప్పక గావించువారలునగు సత్పురుషులు పెక్కండ్రు, ఇతరులనమ్మి వారలు గావించిన యపరాధంబువలనఁ, బరివారసమేతంబుగా నాశంబునొందియున్నారు.

అని, తాత్పర్యము.

స్వామినా ప్రతికూలేన ప్రజా స్తీక్ష్ణేన రావణ
రక్ష్యమాణా నవర్ధంతే మేషా గోమాయునా యథా. ౧౪

టీక॥ రావణ = రావణుఁడా! ప్రతికూలేన=విరోధియును; తీక్ష్ణేన=క్రూరుండునగు; స్వామినా= ప్రభువుచేత; రక్ష్యమాణాః=రక్షింపఁబడుచున్న; ప్రజాః=జనులు; గోమాయునా=నక్కచేత ; రక్ష్యమాణాః (అధ్యాహృతము) = రక్షింపఁబడుచున్న; మేషాః యథా=మేకలువలె; నవర్ధంతే=వృద్ధిఁ బొందరు.

మేకలను బెఱికితినునట్టి నక్కచేరక్షింపఁబడు మేకలు క్షీణించునట్లు, క్రూరుండు జనవిరోధియునగు రాజుచే రక్షింపఁబడుజనులు నానాటికి క్షీణింతురు.

అని, తాత్పర్యము.

అవశ్యం వినశిష్యంతి సర్వే రావణ రాక్షసాః
యేషాం త్వం కర్కశో రాజా దుర్బుద్ధి రజితేంద్రియః. ౧౫

టీక॥ రావణ = రావణుఁడా! యేషాం=ఎవరికి; కర్కశః = కఠినుండవును; దుర్బుద్ధిః=దుష్టబుద్ధిగలవాఁడవును; అజితేంద్రియః = జయింపఁబడినయింద్రియములుగలవాఁడవు కానివాఁడవునగు; త్వం=నీవు; రాజా=ప్రభుఁడవో; తే (అధ్యాహృతము)=అట్టి; రాక్షసాః=రాక్షసులు; అవశ్యం=అవశ్యము; వినశిష్యంతి=నశింపఁగలరు.

రావణుఁడా! క్రూరుండవు దుర్బుద్ధివింద్రియసుఖలోలుండవునగు నీవు రాక్షసరాజుగానుండుటచే, రాక్షసులందఱు




తప్పక, నాశంబునొందఁగలరు. అని, తాత్పర్యము.

త దిదం కాకతాళీయం ఘోర మాసాదితం మయా
అత్ర కిం శోచనీయ స్త్వం ససైన్యో వినశిష్యసి. ౧౬

టీక॥మయా=నాచేత ; కాకతాళీయం=యాదృచ్ఛికముగా ; ఘోరం=భయంకరమయిన;తత్=అట్టి; ఇదం=ఇది;ఆసాదితం=పొందఁబడినది.అత్ర=ఈవిషయమునందు;కిం=ఏమి? త్వం=నీవు;శోచనీయః = శోకింపఁదగినవాఁడవు; ససైన్యః = సైన్యముతోఁగూడినవాఁడవై ;వినశిష్యసి=నశింపగలవు!

నేను, దైవికముగా భయంకరంబగు నీయాపదం బొందితిని ; నేనుగావలెనని దెచ్చుకొనలేదుగావునను , నాకొకఁనికె నాశముగలుగుటవలనను , నన్నుఁగుఱించి దుఃఖింపవలసినది లేదు; నీవుబుద్ధిపూర్వకముగాఁ దెచ్చుకొన్నవాఁడవు ; మఱియునీవొకఁడవె కాదు , పుత్రభ్రాతృబంధుసమేతంబుగా నాశంబునొందెదవుకావున , నిన్నుఁజూచియె దుఃఖింపవలసియున్నది.

అని, తాత్పర్యము.

మాం నిహత్యతు రామస్తు నచిరా త్త్వాం వధిష్యతి
అనేన కృతకృత్యో స్మి మ్రియేయ మరిణా హతః. ౧౭

టీక॥రామస్తు= రాముండుమాత్రము;మాం=నన్ను;నిహత్యతు= వధించినంతనె; నచిరాత్ = శీఘ్రింబున నె; త్వాం=నిన్ను;వధిష్యతి= వధింపఁగలఁడు. అరిణా= శత్రువైనరామునిచేత; హతః=చంపఁబడినవాఁడనై ; మ్రియేయం=చత్తును.అనేన=దీనిచేత ; కృతకృత్యః=కృతార్థుఁడను;అస్మి= అగుచున్నాను.

రాముండు,నన్నువధించినవిమ్మట, శీఘ్రింబుననెనిన్నునువధించును;నిన్నువధించునట్టిరామునిచేతఁ జావుఁబొందుటవలనఁగృతార్థుఁడనయ్యెదను. (లేక) నీచేనిప్పుడుచచ్చుటకన్న, రామునిచేఁ జచ్చుటవలనఁ గృతార్థుఁడనగుదును. అని, తాత్పర్యము.

దర్శనా దేవ రామస్య హతం మా మవధారయ
ఆత్మానంచ హతం విద్ధి హృత్వా సీతాం సబాంధవమ్. ౧౮

టీక॥ రామస్య= రామునియొక్క; దర్శనాదేవ=చూచుటవలననే; మాం= నన్ను; హతం= చంపఁబడినవానిఁగా, అవధారయ = నిశ్చయించుకొనుము; సీతాం=సీతను; హృత్వా= అపహరించి; సబాంధవం = బంధువులతోఁగూడిన; ఆత్మానంచ=నిన్నును; హతం = చంపఁబడినవానిఁగా; విద్ధి=ఎఱుంగుము.

రామునింజూచినంతనె నేనుహతుం డనయ్యెదనని నిశ్చయించుకొనుము; సీతాదేవినపహరించినంతనె, నీవుబంధుసమేతంబుగాహతుండవాదువని తలంపుము. అని, తాత్పర్యము.

ఆనయిష్యసి చే త్సీతా మాశ్రమా త్సహితో మయా
నైవ త్వ మసి నాహంచ నైవ లంకా నరాక్షసాః. ౧౯

టీక॥ మయా= నాతో; సహితః= కూడినవాఁడవై; ఆశ్రమాత్ =ఆశ్రమమునుండి; సీతాం=సీతను; ఆనయిష్యసిచేత్ = తెత్తువేని; త్వం=నీవు, నైవాసి= ఉండ నేయుండవు. అహంచ= నేనును; న= ఉండ నేయుండను. లంకా= లంక; నైవ= ఉండ నేయుండదు. రాక్షసాః= రాక్షసులు; న= ఉండ నేయుండరు.

నీవును నేనును, రామునియాశ్రమంబుననుండి, సీతాదేవిం దెత్తుమేని, యింక, నీవుజీవించియుండఁ బోవునది లేదు, నేనును లేదు; రాక్షసులును జీవించి యుండఁబోరు; లంకయునాశంబునొందకమానదు. అని, తాత్పర్యము.

నివార్యమాణస్తు మయా హితైషిణా
నమృష్యసే వాక్య మిదం నిశాచర
పరేతకల్పా హి గతాయుషో నరా
హితం నగృహ్ణంతి సుహృద్భి రీరితమ్. ౨౦

టీక॥ నిశాచర=రాక్షసుఁడవగు రావణుఁడా! హితైషిణా= మేలుగోరున

ట్టె, మయా=నాచేత ; నివార్యమాణ స్తు=ఆడ్డగింపఁబడుచున్నవాఁడవయ్యు; ఇదం=ఈ, వాక్యం= మాటను; న వ్యవ్యసే= సహింపకున్నావు గతాయుషః = కడచినజీవితకాలము గలవారలును; పరేతకల్పాః= మృతప్రాయులునగు; నరాః=మనుష్యులు; సుహృద్భిః= స్నేహితులచేత, ఈరితం= చెప్పఁబడిన; హితం=మేలును; నగృహ్ణంతిహి= గ్రహింపరుగదా!

రావణుఁడా ! నేనునీమేలుగోరివలదనియెంతదూరముచెప్పినను నామాటనువినకున్నావు ; ఆయుస్సంతయుఁగడచినపిమ్మట, మరణంబతిసమీపంబుననుండునప్పుడు,మనుష్యులు, స్నేహితులుచెప్పెడుహితోక్తుల నాలకింపరు.అని, మారీచుండురావణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే,శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

ఆరణ్యకాండే,ఏకచత్వారింశస్సర్గః.

ఇది,స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు,అరణ్యకాండైకచత్వారింశసర్గటీక,

ముగిసినది.



సర్గ౪౨

శ్రీ

## ద్విచత్వారింశసర్గప్రారంభః.

ఏవ ముక్త్వాతు వచనం మారీచో రావణం తతః
గచ్ఛావే త్యబ్రవీ ద్దీనో భయా ద్రాత్రించరప్రభోః. ౧

టీక॥ తతః=అంత; మారీచః=మారీచుఁడు; రావణం=రావణునిగూర్చి; ఏవం=ఇట్లు; వచనం = మాటను; ఉక్త్వాతు=చెప్పినంతనె; రాత్రించరప్రభోః= రాక్షసరాజుఁడగు రావణునిగూర్చి; భయాత్ =భయమువలన; దీనః=దుఃఖితుఁడై; "గచ్ఛావ=పోయెదము" ఇతి=అని; అబ్రవీత్ =చెప్పెను.

అంత, మారీచుండు, రావణునితో నీప్రకారంబునంజెప్పి, యంత, రాక్షసరాజుండగు రావణునకుభయపడి, దుఃఖితుండై, పోయెదమని చెప్పెను. అని, తాత్పర్యము.

దృష్ట శ్చాహం పున స్తేన శరచాపాసిధారిణా
మద్వధోద్యతశస్త్రేణ వినష్టం జీవితంచ మే. ౨

టీక॥ అహంచ=నేను; పునః=మఱల; శరచాపాసిధారిణా= బాణంబులనుధనుస్సునుదాల్చిన ; మద్వధోద్యతశస్త్రేణ=నావధముకొఱకుఁబట్టఁబడినయాయుధముగల; తేన=ఆ రామునిచేత; దృష్టః=చూడఁబడినాను. మే=నాయొక్క; జీవితంచ = ప్రాణమును ; వినష్టం=నశించినది.

నేను,ధనుర్బాణంబులుదాల్చినన్నువధింపంబూనియున్న రామునిమెదుటంబడవలసినదంతే; రాముండు , బాణము వేయవలసినదిగూడనక్కఱలేదు ; మృతుండనగుదును. అని,తాత్పర్యము.

నహి రామం పరాక్రమ్య జీవన్ ప్రతినివర్తతే
వర్తతే ప్రతిరూపోసౌ యమదండహతస్యతే. ౩

టీక॥ రామం=రామునిగూర్చి ; పరాక్రమ్య=పరాక్రమించి; జీవన్= జీ

సర్గ ౪౧

వించినవాఁడై; న ప్రవర్తతేహి = మరలఁడుగదా! యమదండహతస్య = యమదండముచేఁగొట్టఁబడిన; తే = నీకు; ప్రతిరూపః = సరియయినవాఁడను; అసౌ = ఈ; అహం (అధ్యాహృతము) = నేను; వర్తతే = ఉన్నాను.

రామునియెదుటఁ బరాక్రమంబుఁ జూపి, యెట్టివాఁడును మఱిబ్రతికి రాలేఁడు, నీవాకరీఁడవు యమదండహతుండవై చావనున్నవాఁడవు; నీవలె నేనా కఁడనున్నాను. అని, తాత్పర్యము.

కిన్ను శక్యం మయా కర్తు మేవం త్వయి దురాత్మని
ఏష గచ్ఛామ్యహం తాత స్వస్తి తేఽస్తు నిశాచర. ౪

టీక॥ త్వయి = నీవు; ఏవం = ఇట్లు; దురాత్మని = దుర్బుద్ధివై యుండఁగా; మయా = నాచేత; కర్తుం = చేయుటకు; కిన్ను = ఏమి; శక్యం = అలవియగును? తాత = నాయనా! నిశాచర = రాక్షసుఁడా! ఏషః = ఈ; అహం = నేను; గచ్ఛామి = పోయెదను. తే = నీకు; స్వస్తి = మంగళము; అస్తు = అగుఁగాక.

నీకిట్లు దుర్బుద్ధి కలిగియుండఁగా, నేనేమి చేయఁగలను? ఇదిగో నేనుబోవుచున్నాను; నీకుమంగళము గలుగుఁగాక. అని, మారీచుఁడు, రావణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ప్రహృష్ట స్త్వభవ త్తేన వచనేన స రావణః
పరిష్వజ్య సుసంశ్లిష్ట మిదం వచన మబ్రవీత్. ౫

టీక॥ సః = ఆ; రావణస్తు = రావణుఁడును; తేన = ఆ; వచనేన = మాటచేత; ప్రహృష్టః = సంతసించినవాఁడు; అభవత్ = ఆయెను. సుసంశ్లిష్టం = మిక్కిలియు గట్టిగా; పరిష్వజ్య = కవుఁగిలించుకొని; ఇదం = ఈ; వచనం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

ఆ రావణుండు, మారీచుఁడు చెప్పిన మాటకుఁ బరమసంతుష్టుండై, యతని గాఢంబుగాఁ గవుఁగిలించుకొని, యీ మాటం జెప్పెను. అని, తాత్పర్యము.

ఏత చ్ఛౌండీర్యయుక్తం తే మచ్ఛందాదివ భాషితమ్

ఇదానీ మసి మారీచః పూర్వ మన్యో నిశాచరః. ౬

టీక॥ శౌండీర్యయుక్తం=శౌర్యముతోఁగూడిన; మచ్ఛందాదవ=నాయిచ్ఛవలనవలె; భాషితం = చెప్పఁబడిన; ఏతత్=ఈమాట; తే=నీది. ఇదానీం=ఇప్పుడు; మారీచః = మారీచుఁడవు; అసి=అయితివి. పూర్వం = ముందు; అన్యః=ఇతరుఁడగు, నిశాచరః = రాక్షసుఁడవు.

నాయిచ్ఛననుసరించి చెప్పినట్లు చెప్పినావుగాని, యిది మెనీవుగాఁ జెప్పిన మాట, ఇప్పుడునీవు మారీచుఁడవు; ఇలుక నున్నవేళొక రాక్షసుఁడవుగానుంటివి. అని, తాత్పర్యము.

ఆరుహ్యతా మయం శీఘ్రం రథో రత్నవిభూషితః
మయాసహ తథా యుక్తః పిశాచవదనైః ఖరైః. ౭

టీక॥ తథా= అట్లు; రత్నవిభూషితః=మణులచేనలంకరింపఁబడినదియు; పిశాచవదనైః=పిశాచములయొక్క ముఖములవంటిముఖములుగల; ఖరైః=గాడిదలతో; యుక్తః=కూడిన; అయం=ఈ; రథః=రథము; శీఘ్రం = శీఘ్రముగా; మయాసహ = నాతోఁగూడ; ఆరుహ్యతాం=ఎక్కఁబడుఁగాక.

నానావిధరత్నాలంకృతంబను పిశాచముఖంబులగు ఖరంబులు పూన్చినదియునగు నీరథము ను, శీఘ్రంబున, నాతోఁగూడ నారోహింపుము.

అని, తాత్పర్యము.

ప్రలోభయిత్వా వైదేహీం యథేష్టం గంతు మర్హసి
తాం శూన్యే ప్రసభం సీతా మానయిష్యామి మైథిలీమ్. ౮

టీక॥ త్వం(అధ్యాహృతము)=నీవు; వైదేహీం=సీతను; ప్రలోభయిత్వా=(ప్రలోభ్య)మోసపుచ్చి; యథేష్టం=యథేచ్ఛగా; గంతుం = పోవుటకు; అర్హసి=తగుదువు. అహం(అధ్యాహృతము)=నేను; శూన్యే=ఎవ్వరులేనికాలమునందు; తాం=ఆ; మైథిలీం = మిథిలయందుఁబుట్టిన; సీతాం=సీతను; ఆనయి

ష్యామి (ఆనేష్యామి) = తోడ్కొని వచ్చెదను.

నీవు, సీతను మోసపుచ్చియంతయ థేచ్ఛంజనుము; నేను, రామలక్ష్మణు లిద్దఱు లేనప్పుడు సీతం దీసికొనివచ్చెదను. అని, రావణుండు, మారీచునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

తతో రావణమారీచౌ విమానమివ తం రధమ్
ఆరుహ్య యయతు శ్శీఘ్రం తస్మా దాశ్రమమండలాత్. ౯

టీక॥ తతః=అంత; రావణమారీచౌ=రావణుండుమారీచుండును; విమానమివ(స్థితం)=విమానమువలెను న్న; తం=ఆ; రధం=రధమును; ఆరుహ్య=ఎక్కి; తస్మాత్=ఆ; ఆశ్రమమండలాత్=ఆశ్రమప్రదేశమునమండి; శీఘ్రం=శీఘ్రముగా; యయతుః=పోయిరి.

అంత, రావణమారీచులు, విమానంబువంటి యారధమునారోహించి, యయ్యాశ్రమపదంబుననుండి, శీఘ్రంబునంబోయిరి. అని, తాత్పర్యము.

తథైవ తత్ర పశ్యంతౌ పత్తనాని వనానిచ
గిరీంశ్చ సరిత స్సర్వా రాష్ట్రాణి నగరాణిచ. ౧౦

టీక॥ తౌ(అధ్యాహృతము)=ఆరావణమారీచులు; తథైవ=అట్లే; తత్ర=అచ్చట; పత్తనాని=పట్టణములను; వనానిచ=అడవులను; గిరీంశ్చ=పర్వతములను; సర్వాః=సమస్తములయిన; సరితః=నదులను; రాష్ట్రాణి=రాజ్యములను; నగరాణిచ=చిన్నపట్టణములను; పశ్యంతౌ=చూచుచు; యయతుః(అధ్యాహృతము)=పోయిరి.

ఆరావణమారీచులు, అట్లురధగతులయి, పట్టణంబులను వనంబులనుబర్వతంబులనునదులను రాజ్యంబులనుజిన్నపత్తనంబులనుంజూచుచుంబోయిరి.

అని, తాత్పర్యము.

సమేత్య దండకారణ్యం రాఘవస్యాశ్రమం తతః
దదర్శ సహమారీచో రావణో రాక్షసాధిపః. ౧౧




టీక॥ సహమారీచః = మారీచునితోఁగూడిన; రాక్షసాధిపః = రాక్షసరాజయిన; రావణః = రావణుఁడు; తతః = అంత; దండకారణ్యం = దండకారణ్యమును; సమేత్య = పొంది; రాఘవస్య = రామునియొక్క; ఆశ్రమం = ఆశ్రమమును; దదర్శ = చూచెను.

అంత, రాక్షసరాజుండగు రావణుండును మారీచుండును, అట్లుదండకారణ్యంబునకువచ్చి, రామునియాశ్రమంబుఁజూచిరి. అని, తాత్పర్యము.

అవతీర్య రథాత్తస్మా త్తతః కాంచనభూషణాత్
హస్తే గృహీత్వా మారీచం రావణో వాక్య మబ్రవీత్. ౧౨

టీక॥ తతః = అంత; రావణః = రావణుఁడు; కాంచనభూషణాత్ = బంగారమలంకారముగాఁగల; తస్మాత్ = ఆ, రథాత్ = రథమునసుండి; అవతీర్య = డిగ్గి; మారీచం = మారీచుని; హస్తే = చేతియందు; గృహీత్వా = తీసికొని; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత, రావణుండు, కాంచనాలంకృతంబగునారథంబుననుండిడిగ్గి, మారీచునిచేయిఁబట్టుకొని, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఏతద్రామాశ్రమపదం దృశ్యతే కదళీవృతమ్
క్రియతాం తత్సఖే శీఘ్రం యదర్థం వయ మాగతాః. ౧౩

టీక॥ సఖే = చెలికాఁడా! కదళీవృతం = అరఁటిచెట్లచేఁగప్పఁబడిన; ఏతత్ = ఈ; రామాశ్రమపదం = రామాశ్రమస్థానము; దృశ్యతే = చూడఁబడుచున్నది యదర్థం = ఎందుకొఱకు; వయం = మనము; ఆగతాః = వచ్చినామో; తత్ = ఆకార్యము; శీఘ్రం = శీఘ్రముగా; క్రియతాం = చేయఁబడుగాక

చెలికాఁడా! అరఁటిచెట్లచేనావృతమయియదిగో రామాశ్రమమున్నది చూడుము; ఇంకమనమెందుకువచ్చినామో, ఆపనిని శీఘ్రముగానారంభింపుము. అని, రావణుండు, మారీచునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.




స రావణవచ శ్శ్రుత్వా మారీచో రాక్షసస్తదా
మృగో భూత్వా ఽ ఽశ్రమద్వారే రామస్య విచచార హ. ౧౪

టీక॥ తదా=అప్పుడు; రాక్షసః=రాక్షసుఁడైన; మారీచః=మారీచుఁడు; రావణవచః=రావణునిమాటను; శ్రుత్వా=విని; మృగః = జింక; భూత్వా=అయి; రామస్య=రామునియొక్క; ఆశ్రమద్వారే=ఆశ్రమమువాకిలియందు; విచచార=తిరిగెను. "హ" అనునది పాదపూరణార్థము.

అప్పుడు, అమ్మారీచుండు, రావణుండు చెప్పినమాటనువిని, జింకరూపుదాల్చి, రామాశ్రమద్వారంబున, సంచరించుచుండెను. అని, తాత్పర్యము.

సతు తద్రూప మాస్థాయ మహ దద్భుతదర్శనమ్
మణిప్రవరశృంగాగ్ర స్సితాసితముఖాకృతిః. ౧౫

టీక॥ సతు = ఆమారీచుఁడును; మహత్= గొప్పదియు; అద్భుతదర్శనం=ఆశ్చర్యకరమయిన చూచుటగలదియునగు; తత్=ఆ; రూపం=జింకరూపును; ఆస్థాయ=అవలంబించి; మణిప్రవరశృంగాగ్రః= రత్నశ్రేష్ఠములగు నింద్రనీలములవంటి కొమ్ముల కొనలుగలవాఁడును; సితాసితముఖాకృతిః= తెల్లనిదియు నల్లనిదియునగు ముఖముయొక్క యాకారముగలవాఁడును; అభవత్ (అధ్యాహృతము)=ఆయెను.

ఆమారీచుండు, చూపరులకుమిక్కిలియు నాశ్చర్యముగలిగించునట్టి మృగరూపంబుదాల్చి, ఇంద్రనీలంబులవంటి శృంగాగ్రంబులనుగొంతభాగము తెల్లనిదియుఁగొంతభాగమునల్లనిదియునగు ముఖంబునుధరించెను.

అని తాత్పర్యము.

రక్తపద్మోత్పలముఖ ఇంద్రనీలోత్పలశ్రవాః
కించి దభ్యున్నతగ్రీవ ఇంద్రనీలదళాధరః. ౧౬

టీక॥ సః(అధ్యాహృతము) = ఆ మారీచుండు ; రక్తపద్మోత్పలముఖః= ఎఱ్ఱనికమలములవంటిదియునల్లకలువలవంటిదియునగునోరుగలవాఁడును; ఇం




ద్రనీలోత్పలశ్రవాః = ఇంద్రనీలమణులవంటివియునల్లకలువలవంటివియునగు చెవులుగలవాఁడును ; ఇంద్రనీలదళాధరః=ఇంద్రనీలమణిపలుకువంటిపెదవిగలవాఁడును ; అభవత్ (అధ్యాహృతము)=ఆయెను.

మృగరూపధరుండగు నమ్మారీచుండు, పైభాగమున నెఱ్ఱఁదామరపూవువలెనుగ్రిందిభాగమున నల్లకలువలువలెనున్ననోరును,ఇంద్రనీలమణిప్రభంబులగునల్లకలువలవంటిచెవులును, గొంచెమున్నతమయినకంఠమును ఇంద్రనీలమణిపలుకువలెనుండు పెదవియుం గలిగియుండెను.అని, తాత్పర్యము.

కుందేందువజ్రసంకాశ ముదరంచాస్య భాస్వరమ్

టీక॥అస్య= ఈమారీచునియొక్క; ఉదరంచ=కడుపును;కుందేందువజ్రసంకాశం = మొల్లపూలతోను చందురునితోను వజ్రముతోను సమానముగాను; భాస్వరం= ప్రకాశించుచున్నదిగాను; ఆసీత్(అధ్యాహృతము)=ఉండెను.

ఈమారీచుని,కడుపుమొల్లలు చంద్రబింబము వజ్రమువీనివలెఁ దెల్లఁగానెంతయుఁబ్రకాశించుచుండినది.

అని, తాత్పర్యము.

మధూకనిభపార్శ్వశ్చ పద్మకింజల్కసన్నిభః ౧౭
వైడూర్యసంకాశఖుర స్తనుజంఘ స్సుసంహతః

టీక॥సః (అధ్యాహృతము) = ఆ మారీచుఁడు; మధూకనిభపార్శ్వశ్చ= ఇప్పపువ్వుతోసమానమయిన పార్శ్వముగలవాఁడును ; పద్మకింజల్కసన్నిభః = తామరపూవుకేసరములతో సమానుఁడును ; వైడూర్యసంకాశఖురః=వైడూర్యమణితో సమానములగు గిట్టలుగలవాఁడును;తనుజంఘః= సన్నవైనపిక్కలుగలవాఁడును ; సుసంహతః=మిక్కిలియునంటికొనియున్న సంధిబంధముగలవాఁడునై;ఆసీత్(అధ్యాహృతము)=ఉండెను.

అతనిపార్శ్వమొకటి యిప్పపువ్వువన్నెగలదిగాను ఇతరావయవములన్నియుఁగమలకేసరవర్ణములుగాను గిట్టలు వైడూర్యమణివర్ణంబులుగాను పిక్కలు సన్నవిగాను సంధిబంధంబులు సుదృఢంబులుగాను, నుండినవి.

అని, తాత్పర్యము.




ఇంద్రాయుధసవర్ణేన పుచ్ఛే నోర్ధ్వేన విరాజతా. ౧౮

టీక॥సః (అధ్యాహృతము) = ఆ మారీచుఁడు,ఇంద్రాయుధసవర్ణేన= ఇంద్రధనుస్సుతో సమానమయిన వన్నెగల;ఊర్ధ్వేన=పైకి;విరాజతా = ప్రకాశించుచున్న;పుచ్ఛేన = తోఁకచేత, రరాజ(అధ్యాహృతము) = ప్రకాశించెను.

ఆమ్మారీచునితోఁక, ఇంద్రధనుస్సు వన్నెగలిగి, యూర్ధ్వముఖంబయి, యెంతయుఁ బ్రకాశించుచుండినది. అని, తాత్పర్యము.

మనోహర స్స్నిగ్ధవర్ణో రత్నై నానావిధై ర్వృతః

టీక॥సః(అధ్యాహృతము)= ఆమారీచుఁడు;మనోహరః = సుందరుండై; స్నిగ్ధవర్ణః = సుందరమయినవన్నెగలవాఁడై;నానావిధైః = పెక్కువిధములయిన,రత్నైః=మణులచేత ; వృతః=చుట్టఁబడినవాఁడై;ఆసీత్ (అధ్యాహృతము)=ఉండెను.

అమ్మారీచుండు, మనోహరాకారుండై, నానావిధరత్నాలంకృతుండై యొప్పయుండెను. అని, తాత్పర్యము.

క్షణేన రాక్షసో జాతో మృగః పరమశోభనః. ౧౯
వనం ప్రజ్వలయన్ రమ్యం రామాశ్రమ పదంచ తత్

టీక॥రాక్షసః=మారీచుఁడు; క్షణేన=క్షణకాలముచేత; రమ్యం=సుందరమయిన;వనం=అడవిని;తత్ =ఆ; రామాశ్రమపదంచ = రామునియాశ్రమస్థానమును;ప్రజ్వలయన్=ప్రకాశింపఁజేయుచు; పరమశోభనః=మిక్కిలియు సుందరమయిన;మృగః=జింకగా; జాతః=అయ్యెను.

అట్లు, మారీచుఁడు, రమణీయంబగు నవ్వనంబును రామునియాశ్రమంబును బ్రకాశింపఁజేయుచు, క్షణమాత్రంబునఁ, బరమసుందరంబగుమృగరూపంబు ధరియించెను. అని, తాత్పర్యము.

మనోహరం దర్శనీయం రూపం కృత్వా స రాక్షసః. ౨౦

ప్రలోభనార్థం వై దేహ్యా నానాధాతువిచిత్రితమ్
విచరన్ గచ్ఛతే తస్మా చ్ఛాద్వలాని సమంతతః. ౨౧

టీక॥ సః=ఆ, రాక్షసః=మారీచుడు; మనోహరం=సుందరమును; దర్శనీయం=చూడఁదగినదియు; నానాధాతువిచిత్రితం = నానావిధములయినవర్ణములచేవిచిత్రముగాఁజేయఁబడినదియునగు; రూపం=ఆకారమును ; కృత్వా=ధరించి; వై దేహ్యాః=సీతాదేవియొక్క; ప్రలోభనార్థం= మోసపుచ్చుటకొఱకు; తస్మాత్=ఆప్రదేశమునుండి; శాద్వలాని=పచ్చికనేలలను;సమంతతః=అంతటను; విచరన్=భక్షించుచు ; గచ్ఛతే (గచ్ఛతి) = పోవుచుండెను.

ఆమారీచుండట్లు, రమణీయంబును నానావర్ణంబులచే విచిత్రింబునగు రూపంబుదాల్చి, సీతాదేవిని మోసపుచ్చుటకై , పచ్చికలు మేసవుచు , లీల మెయింబోయెను.

అని, తాత్పర్యము.

రూప్యై ర్బిందుశతై శ్చిత్రో భూత్వా స ప్రియదర్శనః
విటపీనాం కిసలయాన్ భఙ్త్వాదన్ విచచార హ. ౨౨

టీక॥సః = ఆమారీచుఁడు; రూప్యైః=వెండివన్నెగల; బిందుశతైః=చుక్కలనూఱులచే,చిత్రః = చిత్రవర్ణుఁడును;ప్రియదర్శనః= సంతోషకరంబగు చూచుటగలవాఁడును; భూత్వా=అయి; విటపీనాం(విటపినాం)= వృక్షములయొక్క;కిసలయాన్ (కిసలయాని)=చిగుళ్లను;భఙ్త్వా= విఱిచి; అదన్=భక్షించుచు;విచచార=సంచరించెను "హ" అనునది పాదపూరణార్థము.

అమ్మారీచుండు, వెండిచుక్కలుగలుగుటచేఁజిత్రవర్ణుండై, చూపరులకానందంబుగలిగించుచు, వృక్షంబులచిగుళ్లంగొఱికిదినుచుసంచరించెను.

అని, తాత్పర్యము.

కదలీగృహకం గత్వా కర్ణికారా నిత స్తతః
సమాశ్రయ న్మందగతి స్సీతా సందర్శనం తథా. ౨౩




టీక॥సః (అధ్యాహృతము) = ఆ మారీచుఁడు;కదళీగృహకం = కదళీమయమయినగృహమును ; కర్ణికారాన్=కొండగోఁగుచెట్లను; తథా= అట్లు;సీతాసందర్శనం=సీతాదేవిచూడఁబడునట్టిస్థానమును;గత్వా = పొంది;ఇత స్తతః=ఇచ్చటచ్చట ; సమాశ్రయత్=ఆశ్రయించియుండెను.

ఆమారీచుండు, గృహాకారంబుగానుండుకదళీవృక్షంబులనుగొండగోఁగుచెట్లనుదాఁటిపోయి , ఎచ్చటసీతఁజూడనవకాశముగలుగునోఆస్థలముంజేరి, యిచ్చటచ్చటసంచరించుచుండెను.

అని, తాత్పర్యము.

రాజీవచిత్రపృష్ఠ స్స విరరాజ మహామృగః
రామాశ్రమ పదాభ్యాశే విచచార యథాసుఖమ్. ౧౪

టీక॥రాజీవచిత్రపృష్ఠః=తామరకేసరములవంటియాశ్చర్యకరమయిన వీపుగల;సః=ఆ;మహామృగః= శ్రేష్ఠమయినజింక;విరరాజ= ప్రకాశించెను. రామాశ్రమపదాభ్యాశే = రాముని యాశ్రమస్థానముసమీపమునందు; యథాసుఖం=సుఖముగా;విచచార = విహరించెను.

అట్టిమృగరూపము దాల్చినయమ్మారీచుండు, కమలకేసరవర్ణమయినయాశ్చర్యకరమగుపృష్ఠభాగంబుతోఁ దేజరిల్లుచు,రామాశ్రమపదసమీపంబున, సుఖముగా,విహరించుచుండెను.

అని, తాత్పర్యము.

పునర్గత్వా నివృత్తశ్చ విచచార మృగోత్తమః
గత్వా ముహూర్తం త్వరయా పునః ప్రతినివర్తతే. ౧౫

టీక॥మృగోత్తమః= మృగశ్రేష్ఠంబగుమారీచుఁడు;పునః=మఱల;గత్వా= పోయి;నివృత్తశ్చ= మఱలినవాఁడునై విచచార = సంచరించెను. ముహూర్తం=కొంచెముసేపు;గత్వా = పోయి;పునః=మఱల; త్వరయా=త్వరచేత;ప్రతినివర్తతే=మఱలును.

అమ్మృగోత్తమ రూపధరుండగు మారీచుండు,మఱలనాప్రదేశముననుండి,యావలికిఁబోయి,మఱలవచ్చి, విహరించుచు, మఱలఁగొంతసేపు, ఆవలికిఁబోయిమఱలి వచ్చుచు , నిట్లునానావి







ధంబునసంచరించుచుండెను. అని, తాత్పర్యము.

విక్రీడంశ్చ క్వచి ద్భూమౌ పునరేవ నిషీదతి
ఆశ్రమద్వార మాగమ్య మృగయూథాని గచ్ఛతి. ౧౬

టీక॥సః(అధ్యాహృతము) = ఆ మారీచుడు,విక్రీడంశ్చ=క్రీడించుచును; క్వచిత్=ఒకానొకచోట; భూమౌ= నేలయందు;నిషీదతి=కూర్చుండును. ఆశ్రమద్వారం= ఆశ్రమముయొక్క-వాకిలిని;ఆగమ్య= పొంది; మృగయూథాని=జింకలసమూహములను; గచ్ఛతి= చేరును.

ఆమారీచుడు,అట్లుక్రీడించుచుండి, యొకచోటc గొంతసేపు నేలపైcగూర్చుండును;అంత, నాశ్రమద్వారంబున కుcబోయి, యచ్చటనుండుమృగయూథంబులంజేరcజూచును.

అని, తాత్పర్యము.

మృగయూథై రనుగతః పునరేవ నివర్తతే
సీతాదర్శన మాకాంక్ష న్రాక్షసో మృగతాం గతః. ౧౭

టీక॥మృగతాం= జింకయగుటను; గతః=పొందినవాడును ; సీతాదర్శనం= సీతాదేవియొక్క- చూచుటను; ఆకాంక్షన్= కోరుచున్నవాడునగు; రాక్షసః=రాక్షసుడు ; మృగయూథైః=మృగసమూహములచేత; అనుగతః=వెంబడింపcబడినవాడై ; పునరేవ=మఱలనే;నివర్తతే=మఱలును.

మృగరూపుcడై సీతాదర్శనంబుc గోరుచున్నయామారీచుండు , మృగసమూహంబులు తనయొద్దకుc జేరవచ్చుటంజూచి,మఱలిదూరంబునకుc బోవును అని, తాత్పర్యము.

పరిభ్రమతి చిత్రాణి మండలాని వినిష్పతన్

టీక॥సః(అధ్యాహృతము) = ఆ మారీచుడు;వినిష్పతన్ = సంచరించుచు;చిత్రాణి = నానావిధములయిన; మండలాని = మండలాకారగమనము




లను, పరిభ్రమతి=తిరుగుచుండును.

అట్లు, నానావిధంబులుగ, మండలాకార గమనంబులు సేయుచుండును. అని, తాత్పర్యము.

సముద్వీక్ష్య చ తం సర్వే మృగా హ్యన్యే వనేచరాః. ౨౮
ఉపాగమ్య సమాఘ్రాయ విద్రవంతి దిశో దశ

టీక॥ వనేచరాః=అడవియందుఁదిరుగునట్టి; అన్యే=ఇతరములయిన; మృగాః=మృగములు; సర్వే=అన్నియు; తం=ఆమారీచుని; సముద్వీక్ష్యచ=చూచియు; ఉపాగమ్య=సమీపించి; సమాఘ్రాయ=మూర్కొని; దశ= పదియయిన; దిశః=దిక్కులనుగూర్చి; విద్రవంతి=పరుగెత్తినవి.

అడవియందుండునట్టియితరమృగంబులన్నియు, విచిత్రమృగరూపధరుండగునమ్మారీచుంజూచి, సమీపమునకుంబోయియాఘ్రాణించి, దమ్ముం భక్షించురాక్షసుండని తెలిసికొని, భయంబున, దశదిశలకుం బాఱినవి.

అని, తాత్పర్యము.

రాక్షస స్సోపి తా న్వన్యా న్మృగాన్ మృగవధే రతః. ౨౯
ప్రచ్ఛాదనార్థం భావస్య న భక్షయతి సంస్పృశన్

టీక॥ మృగవధే=మృగములచంపుటయందు; రతః=ఆసక్తుఁడగు; సః = ఆ; రాక్షసోపి=రాక్షసుఁడును; భావస్య=స్వభావముయొక్క; ప్రచ్ఛాదనార్థం=కప్పుటకొఱకు; వన్యాన్ = అడవియందుఁబుట్టిన; తాన్=ఆ; మృగాన్=మృగములను; సంస్పృశన్=తాఁకుచు; నభక్షయతి=భక్షింపఁడయ్యె.

మృగంబులంజంపిభక్షించుటెస్వభావముగాఁగల యారాక్షసుండును తన యథార్థస్వభావము బయలుపడకుండుటకై, యావన్యమృగంబులనుస్పృశించియుభక్షింపఁడయ్యె.

అని, తాత్పర్యము.

తస్మిన్నేవ తతః కాలే వైదేహీ శుభలోచనా. ౩౦
కుసుమాపచయవ్యగ్రా పాదపా నభ్యవర్తత

టీక॥ తతః=అంత; శుభలోచనా= మంగళకరములగుకన్నులుగల ; వైదేహీ=సీతాదేవి; తస్మిన్=ఆ ; కాలఏవ=కాలమునందే ; కుసుమాపచయవ్యగ్రా=పూలుగోయుటయందాసక్తయయి; పాదపాన్ = వృక్షములను గూర్చి; అభ్యవర్తత=వచ్చెను.

అంత , నాకాలమునందెమంగళకరంబులగుకన్నులుగలసీతాదేవి , పూలుగోయఁగోరి, యావృక్షంబులయొద్దకువచ్చెను అని, తాత్పర్యము.

కర్ణికారా నశోకాంశ్చ చూతాంశ్చ మదిరేక్షణా. ౩౧
కుసుమా న్యపచిన్వంతీ చచార రుచిరాననా

టీక॥ మదిరేక్షణా= మదముగప్పినకన్నులుగలదియును; రుచిరాననా = సుందరమయినముఖముగలదియునగుసీతాదేవి; కుసుమాని=పూలను; అపచిన్వంతీ=కోయుచు; కర్ణికారాన్ = కొండగోఁగుచెట్లను;అశోకాంశ్చ=అశోకవృక్షములను; చూతాంశ్చ=మామిడిచెట్లను; చచార=సంచరించెను.

మదముగప్పినకన్నులుగలదియుసుందరంబగుమొగముగలదియునగు సీతాదేవి, పూలుగోయుచుఁ,గొండగోఁగుచెట్లు అశోక వృక్షంబులు మామిడిచెట్లు మొదలగు వృక్షంబులఁయొద్దకుఁబోయెను. అని, తాత్పర్యము.

అనర్హా ఽరణ్య వాసస్య సా తం రత్నమయం మృగమ్. ౩౨
ముక్తామణివిచిత్రాంగం దదర్శ పరమాంగనా

టీక॥వనవాసస్య= అడవిలోనుండుటకు;అనర్హా=తగనిదియు; పరమాంగనా=ఉత్తమస్త్రీయునగు; సా=ఆసీతాదేవి;రత్నమయం=శ్రేష్ఠమును; ముక్తామణివిచిత్రాంగం= ముత్తెములవంటిచుక్కలచేతను రత్నములవంటి చుక్కలచేతను విచిత్రమయినదేహముగలదియునగు;తం=ఆ; మృగం = జింకను;దదర్శ=చూచెను.

అడవిలోనివసించుటకుఁదగనిదియు నుత్తమస్త్రీయునగునాసీతాదేవి , ఉత్తమంబును,మంచిముత్తెములురత్నములునుంబోలెనుండుబిందువులచేనలంకృతమయినదేహముగలదియునగునామృగముం,జూచెను.అని, తాత్పర్యము.

సా తం రుచిరదంతోష్ఠీ రూప్యధాతుతనూరుహమ్. ౩౩
విస్మయోత్ఫుల్లనయనా సస్నేహం సముదైక్షత

టీక॥ రుచిరదంతోష్ఠీ= సుందరములయినదంతములును పెదవులును గల ; సా=ఆసీతాదేవి ; విస్మయోత్ఫుల్లనయనా=ఆశ్చర్యముచేవికసించిన కన్నులుగలదై, రూప్యధాతుతనూరుహం=వెండివంటివియు గైరికధాతువులవంటివియునగు వెంట్రుకలుగల;తం=ఆమృగమును;సస్నేహం = స్నేహముతోఁ గూడునట్లుగా;సముదైక్షత= చూచెను.

సుందరములగు దంతములును పెదవులునుగలయాసీతాదేవి, యాశ్చర్యంబునవికసించిననేత్రంబులతో , వెండివలెను గైరికధాతువులవలెనుండు వెంట్రుకలతోనొప్పుచున్నయాజింకను స్నేహంబునంజూచెను. అని, తాత్పర్యము.

సచ తాం రామదయితాం పశ్యన్ మాయామయో మృగః. ౩౪
విచచార పునశ్చిత్రం దీపయన్నివ తద్వనమ్

టీక॥ మాయామయః= మాయావికారమయిన; సః=ఆ;మృగశ్చ=జింకయు;రామదయితాం= రామునిభార్యను;పశ్యన్=చూచుచు;పునః= ఇంకను; చిత్రం=ఆశ్చర్యకరముగా;తత్=ఆ; వనం=వనమును; దీపయన్= ప్రకాశింపఁజేయుచు,("ఇవ" అనునదివాక్యాలంకారార్థము); విచచార= తిరిగెను.

అమ్మాయామృగంబు, రామభార్యయగుసీతాదేవివచ్చుటంజూచి , మఱియునాశ్చర్యకరంబుగా,నవ్వనంబుఁబ్రకాశింపంజేయుచువిహరించెను.

అని, తాత్పర్యము.

అదృష్టపూర్వం తం దృష్ట్వా నానారత్నమయం మృగమ్. ౩౫
విస్మయం పరమం సీతా జగామ జనకాత్మజా

టీక॥ జనకాత్మజా = జనకమహారాజుకూఁతురయిన; సీతా= సీతాదేవి; అదృష్టపూర్వం= మున్నెప్పుడును జూడఁబడనట్టి; నానారత్నమయం =

నానావిధమణివికారమయిన; తం=ఆ; మృగం=జింకను; దృష్ట్వా=చూచి; పరమం=అధికమయిన; విస్మయం=ఆశ్చర్యమును; జగామ=పొందెను.

జనకమహారాజపుత్రియగు సీతాదేవి, మున్నెప్పుడునుజూడనట్టిలోకోత్తరమయిననానారత్నములవంటి బిందువులుగలయామాయామృగముఁజూచి, పరమాశ్చర్యంబునొందెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

ఆరణ్యకాండే, ద్విచత్వారింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండద్విచత్వారింశసర్గటీక,

ముగిసినది.



శ్రీః

## త్రిచత్వారింశ సర్గ ప్రారంభః.

సా తం సంప్రేక్ష్య సుశ్రోణీ కుసుమా న్యపచిన్వతీ
హైమరాజతవర్ణాభ్యాం పార్శ్వాభ్యా ముపశోభితమ్. ౧
ప్రహృష్టా చానవద్యాంగీ మృష్టహాటకవర్ణినీ
భర్తార మభిచక్రంద లక్ష్మణంచాపి సాయుధమ్ ౨

టీక॥ సుశ్రోణీ= సుందరములయిన పిఱుందులు గలదియు; అనవద్యాంగి= నిందితములు కానియవయవములు గలదియు; మృష్టహాటకవర్ణినీ=కడుగఁబడిన బంగారముయొక్క-వన్నెవంటివన్నెగలదియునగు; సా=ఆసీతాదేవి ; హైమరాజతవర్ణాభ్యాం = బంగారువన్నెగలదియు వెండివన్నెగలదియునగు; పార్శ్వాభ్యాం=పార్శ్వములచేత, ఉపశోభితం=ప్రకాశించుచున్న;తం=అమృగమును; సంప్రేక్ష్య=చూచి; ప్రహృష్టా చ=మిక్కిలియు సంతసించినదియునై; భర్తారం=పెనిమిటిని;సాయుధం=ఆయుధముతోఁగూడిన; లక్ష్మణంచాపి= లక్ష్మణునిఁగూడ ; అభిచక్రంద = పిలిచెను.

సుందరములయినపిఱుందులుగలదియునసింద్యములగునవయవములుగలదియుఁబరిశుద్ధమయిన బంగారమువంటి మేనుగలదియునగుసీతాదేవి , ఒకపార్శ్వమునఁగాంచనవర్ణముగను,మఱియొకపార్శ్వమునరజతవర్ణముగనునుండునట్టియమ్మాయామృగముం జూచి , సంతుష్టయయి, పెనిమిటియగురాముని, ఆయుధధారియయియున్నలక్ష్మణునింబిలిచెను.అని, తాత్పర్యము.

తయా ఒహూతౌ నరవ్యాఘ్రౌ వైదేహ్యా రామలక్ష్మణౌ
వీక్షమాణౌతు తం దేశం తదా దదృశతు ర్మృగమ్. ౩

టీక॥తయా=ఆ; వైదేహ్యా= సీతాదేవిచేత;ఆహూతౌ=పిలువఁబడిన;నరవ్యాఘ్రౌ=పురుషశ్రేష్ఠులగు; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు;తదా= అ




ష్పిత,తం=ఆ,దేశం=ప్రదేశమును;ప్రేక్షమాణౌ తు=చూచుచునే; మృగం=జింకను;దదృశతుః=చూచిరి.

అట్లుఆసీతాదేవి పిలుచుటవలనఁ, బురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులు వచ్చి,యాప్రదేశమునలుప్రక్కలం జూచుచు,నామాయాజింకంగనిరి.

అని,తాత్పర్యము.

శంకమాన స్తు తం దృష్ట్వా లక్ష్మణో రామ మబ్రవీత్

టీక॥లక్ష్మణస్తు=లక్ష్మణుఁడుమాత్రము,తం=ఆమృగమును;దృష్ట్వా= చూచి;శంకమానః=సందేహించుచు; రామం=రామునిగూర్చి,అబ్రవీత్= చెప్పెను.

లక్ష్మణుఁడుమాత్రము,ఆమాయామృగముంజూచినంతనె, సందేహమునొంది,రాముఁజూచి,యిట్లని, చెప్పెను. అని,తాత్పర్యము.

త మే వైన మహం మన్యే మారీచం రాక్షసం మృగమ్.౪

టీక॥అహం=నేను,ఏనం=ఈ; మృగం=జింకను,తం=ఆ;మారీచం=మారీచుఁడను;రాక్షసమేవ=రాక్షసునిఁగానె;మన్యే=తలంచెదను.

ఈమృగమె,యామారీచుండను రాక్షసుండనినాకుఁదోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

చరంతో మృగయాం హృష్టాః పాపేనో పాధినా వనే
అనేన నిహతా రాజన్ రాజానః కామరూపిణా. ౫

టీక॥రాజన్=రాముఁడా ! కామరూపిణా=ఇచ్ఛాధీనమగు రూపముగల మారీచునిచేత,వనే = అడవియందు; హృష్టాః=సంతసించినవారలును; మృగయాం=వేఁటను;చరంతః=చేయుచున్నవారలునగు;రాజానః=రాజులు; అనేన=ఈ;పాపేన=పాపముగలిగించునట్టి;ఉపాధినా=వేషముచేత ; నిహతాః=చంపఁబడినారు.

రాముఁడా ! కామరూపియగు నీమారీచుండు,పాపిష్ఠంబగు నీమృగరూపము నేధరించి,వనంబునందు , సంతోషంబున వేఁటాడవచ్చినరాజులం, జంపినాఁడు. అని,తాత్పర్యము.




అస్య మాయావిదో మాయా మృగరూప మిదం కృతమ్
భానుమ త్పురుషవ్యాఘ్ర గంధర్వపురసన్నిభమ్. ౬

టీక॥ పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుఁడవగు రామా! మాయావిదః= మాయనెఱింగినట్టి; అస్య=ఈమారీచునియొక్క; మాయా= మాయ; భానుమత్=ప్రకాశముగలదియు; గంధర్వపురసన్నిభం=గంధర్వనగరముతో సమానమయినదియునగు; ఇదం=ఈ; మృగరూపం=మృగాకారముగా; కృతం= చేయఁబడినది.

పురుషశ్రేష్ఠుఁడవగు రామా! ఆ మ్మారీచుండు, బహుమాయల నెఱింగినవాఁడు; అతఁడే, మాయచేత నీప్రకారంబున గాంతిమంతంబును గంధర్వనగరాకారంబునగు నీమృగరూపంబుఁ దాల్చినాఁడు. అని, తాత్పర్యము.

మృగో హ్యేవం విధో రత్నవిచిత్రో నాస్తి రాఘవ
జగత్యాం జగతీనాథ మాయైషా హి నసంశయః. ౭

టీక॥ జగతీనాథ= భూమీశ్వరుండవగు; రాఘవ=రాముఁడా! ఏవంవిధః= ఇట్టి; రత్నవిచిత్రః=రత్నాకారబిందువులచే విచిత్రమయిన; మృగః=జింక; జగత్యాం=భూమియందు; నాస్తిహి = లేదుగదా! ఏషా=ఇది; మాయాహి= మాయయేకదా! సంశయః=సందేహము; న=లేదు.

సమస్తభూమండలాధీశ్వరుండవగు రాముఁడా! ఇట్టి, రత్నాకారబిందువులతో నలంకృతమయిన మృగము, ప్రపంచంబునం దెచ్చటను లేదు; కావున, నిది మాయయే; సందియము లేదు. అని, లక్ష్మణుఁడు, రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం బ్రువాణం కాకుత్స్థం ప్రతివార్య శుచిస్మితా
ఉవాచ సీతా సంహృష్టా చర్మణా హృతచేతనా. ౮

టీక॥ శుచిస్మితా= స్వచ్ఛమయిన చిఱునవ్వుగల; సీతా=సీత; ఏవం=ఇట్లు; బ్రువాణం=చెప్పుచున్న; కాకుత్స్థం=లక్ష్మణుని; ప్రతివార్య= నివారిం

చి, చర్మణా=తోలుచేత ; హృతచేతనా=అపహరింపఁబడిన బుద్ధిగలదై ; సంహృష్టా=సంతోషించినదై ; ఉవాచ=చెప్పెను.

స్వచ్ఛమయిన చిఱునగవుగలసీతాదేవి , యీప్రకారంబునం జెప్పుచున్న లక్ష్మణునివారించి, ఆమాయామృగచర్మసౌందర్యంబునకు మోహించి, సంతుష్టయయి, రామునింజూచి,యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఆర్యపుత్రాభి రామో సౌ మృగో హరతి మే మనః
ఆనయైనం మహాబాహో క్రీడార్థం నో భవిష్యతి. ౯

టీక॥ మహాబాహో=పెద్దచేతులుగల;ఆర్యపుత్ర=పూజ్యుండగుదశరథునిపుత్రుండవయినరాముఁడా ! (స్త్రీలు భర్తనుఆర్యపుత్రశబ్దముచేఁ బిలుచుట సంప్రదాయము). అభిరామః= సుందరమయిన,అసౌ=ఈ; మృగః=మృగము, మే=నాయొక్క;మనః = మనస్సును;హరతి=ఆకర్షించుచున్నది ఏనం=దీనిని,ఆనయ=తెమ్ము. నః= మనకు;క్రీడార్థం=ఆటలకొఱకు; భవిష్యతి=కాఁగలదు.

మహాబాహుండవగు రాముఁడా! ఈమృగంబుమిక్కిలియు సుందరంబుగనుండుటవలన,దీనియందు నామనస్సునకుమిక్కిలియుమక్కువగలిగియున్నది ; దీనింబట్టి తెమ్ము ; మనము క్రీడార్థముంచుకొనవచ్చును. అని, తాత్పర్యము.

ఇహ శ్రమపదే౽ స్మాకం బహవః పుణ్యదర్శనాః
మృగా శ్చరంతి సహితా స్సృమరా శ్చమరా స్తథా. ౧౦

టీక॥ ఇహ=ఇచ్చట, అస్మాకం=మనయొక్క; ఆశ్రమపదే= ఆశ్రమస్థానమునందు; పుణ్యదర్శనాః= పుణ్యముగలిగించునట్టి చూచుటగల; మృగాః= జింకలును; సృమరాః = సృమరమృగములును; చమరాః=చమరమృగములును;బహవః=అనేకములు; సహితాః= గుంపుగాఁగూడినవై ; చరంతి=తిరుగుచున్నవి.

ఇచ్చటమనయాశ్రమమునందు, అతిసుందరంబులగుమృగంబులును సృమరంబులును చమరమృగములును అనేకంబులు,గుంపుగుంపుగాఁదిరుగుచున్నవి. అని, తాత్పర్యము.

ఋక్షాః పృషతసంఘాశ్చ వానరాః కిన్నరా స్తథా
విచరంతి మహాబాహో రూపశ్రేష్ఠా మనోహరాః. ౧౧

టీక॥ మహాబాహో = పెద్దచేతులుగలరాముఁడా! రూపశ్రేష్ఠాః=రూపంబుననుత్తమంబులును ; మనోహరాః=సుందరంబులునగు; ఋక్షాః = ఎలుఁగుబంటులును; పృషతసంఘాశ్చ= బిందువులతోఁగూడినజింకల సమూహములును; వానరాః=కోఁతులును ; తథా=అట్లు; కిన్నరాః=కిన్నరమృగంబులును; విచరంతి= సంచరించుచున్నవి

మహాబాహుండవగురాముఁడా! అట్లుసుందరరూపంబులగు నెలుఁగుబంటులును బిందువులతోఁగూడిన జింకలును గోఁతులును గిన్నరమృగంబులును మన యాశ్రమంబునందిరుగుచున్నవి.

అని, తాత్పర్యము.

నచాస్య సదృశో రాజన్ దృష్టపూర్వో మృగః పురా
తేజసా క్షమయా దీప్త్యా యథాయం మృగసత్తమః. ౧౨

టీక॥రాజన్ = రాముఁడా ! యథా=ఎట్లు;అయం= ఈ ; మృగసత్తమః=మృగశ్రేష్ఠము; తేజసా = రంగుచేతను;క్షమయా= ఓర్పుచేతను ; దీప్త్యా=కాంతిచేతను;దృశ్యతే (అధ్యాహృతము)= చూడఁబడుచున్నదో; తథా(అధ్యాహృతము)=అట్లు; అస్య= దీనికి;సదృశః=సమానమయిన ; మృగః= మృగము;పురా=మున్ను ; నదృష్టపూర్వః = మున్ను చూడఁబడినది కాదు.

రాముఁడా!ఎట్లుఈమృగంబు, రంగును ఓర్పును దేహకాంతియుఁగలిగి యున్నదో, అట్లు, రంగుఓర్పు.దేహకాంతిగలిగి , దీనికిసరియయియుండు మృగమును , ఇదివఱకుమన మెప్పుడును జూచినదిలేదు. అని,తాత్పర్యము.

నానావర్ణవిచిత్రాంగో రత్నబిందు సమాచితః
ద్యోతయన్ వన మవ్యగ్రం శోభతే శశిసన్నిభః. ౧౩

టీక॥నానావర్ణవిచిత్రాంగః=నానావిధవర్ణములచేవిచిత్రమయిన దేహ




ముగలదియు; రత్నబిందుసమాచితః= రత్నాకారములగుబిందువులచేవ్యాపింపఁబడినదియునగునీమృగము; శశిసన్నిభః=చంద్రునితోసమానమయి;వనం= అడవిని;అవ్యగ్రం=సమగ్రముగా; ద్యోతయన్=ప్రకాశింపఁజేయుచు; శోభతే=ప్రకాశించుచున్నది.

విచిత్రములయిననానావిధంబులగు వర్ణంబులతోను రత్నాకారంబులయినబిందువులతోనుఒప్పుచున్న యీమృగము, చంద్రుఁడుంబోలెనీవనంబంతయుఁ బ్రకాశింపఁజేయుచుఁ, దేజరిల్లుచున్నది. అని, తాత్పర్యము.

అహో రూప మహో లక్ష్మీ స్స్వరం సంపచ్చ శోభనా
మృగోద్భుతో విచిత్రాంగో హృదయం హరతీవ మే. ౧౪

టీక॥రూపం= సౌందర్యము ; అహో=ఆశ్చర్యము!లక్ష్మీః=కాంతి; అహో=ఆశ్చర్యము!స్వరం= కంఠధ్వని; అహో(అధ్యాహృతము)= ఆశ్చర్యము!శోభనా= సుందరమగు ; సంపచ్చ=అవయవసంపత్తియు ; అహో (అధ్యాహృతము)=ఆశ్చర్యము.అద్భుతః=ఆశ్చర్యకరమును; విచిత్రాంగః= విచిత్రమయినదేహము గలదియునగు; మృగః=జింక; మే= నాయొక్క; హృదయం=మనస్సును;హరతి= ఆకర్షించుచున్నది "ఇవ" అనునది వాక్యాలంకారార్థము.

ఇదియేమిసౌందర్యము! ఇదియేమి కాంతి!దీనికంఠధ్వనియేమి ! అవయవసంపత్తియేమి!ఆశ్చర్యకరంబును విచిత్రరూపంబునగునీమృగంబు , నామనస్సునెంతయునాకర్షించుచున్నది.

అని, తాత్పర్యము.

యది గ్రహణ మభ్యేతి జీవ న్నేవ మృగ స్తవ
ఆశ్చర్యభూతం భవతి విస్మయం జనయిష్యతి. ౧౫

టీక॥మృగః=జింక; జీవన్నేవ=బ్రతికినదై యే;తవ=నీయొక్క ; గ్రహణం=గ్రహించుటను ; అభ్యేతియది= పొందునేని; ఆశ్చర్యభూతం=ఆశ్చర్యకరము;భవతి=అగును.విస్మయం= ఆశ్చర్యమును;జనయిష్యతి= కలిగించును.




ఈమృగంబు ప్రాణముతోనే నీకుఁబట్టుపడునేని, ఇతరులకును మనకును ఆశ్చర్యంబుగలిగించుచు, మనయొద్దనుండఁగలదు అని, తాత్పర్యము.

సమాప్తవనవాసానాం రాజ్యస్థానాం చ నః పునః
అంతఃపురవిభూషార్థో మృగ ఏష భవిష్యతి. ౧౬

టీక॥సమాప్తవనవాసానాం= ముగింపఁబడినవనవాసవ్రతముగల వారలమును;పునః=మరల; రాజ్యస్థానాం= రాజ్యంబుననున్న వారలమునగు;నశ్చ= మనకును;ఏషః=ఈ;మృగః = జింక; అంతఃపురవిభూషార్థః = అంతఃపురమునకుభూషణమెప్రయోజనముగాఁగలది;భవిష్యతి=కాఁగలదు.

మనమువనవాసవ్రతంబు ముగించుకొని , మరలరాజ్యంబున నుండునప్పుడు, ఈమృగంబు , మనయంతఃపురంబునకలంకారముగానుండఁగలదు.

అని, తాత్పర్యము.

భరత స్యార్యపుత్రస్య శ్వశ్రూణాం మమచ ప్రభో
మృగరూప మిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి ౧౭

టీక॥ప్రభో=నాయకుఁడవగు రాముఁడా!ఇదం=ఈ;మృగరూపం= మృగముయొక్క-రూపము;భరతస్య= భరతునకును;ఆర్యపుత్రస్య=నీకును; శ్వశ్రూణాం=అత్తలకును;మమచ = నాకును;విస్మయం=ఆశ్చర్యమును ; జనయిష్యతి=కలిగించుచుండఁగలదు . వ్యక్తం=స్పష్టము.

రాముఁడా ఈమృగంబు , అయోధ్యలో , భరతునకును నీకునునా యత్తలకును నాకునునెల్లప్పుడును ఆశ్చర్యంబుగలిగించుచుండఁగలదు.

అని, తాత్పర్యము.

జీవ న్న యది తేఽభ్యేతి గ్రహణం మృగసత్తమః
అజినం నరశార్దూల రుచిరం మే భవిష్యతి. ౧౮

టీక॥నరశార్దూల = పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా ! మృగసత్తమః=

ఈమృగశ్రేష్ఠము; జీవన్ = బ్రతికియున్నదై; తే=నీయొక్క; గ్రహణం = గ్రహించుటను; నాభ్యేతియది= పొందదేని; రుచిరం=సుందరమయిన; అచిరం=తోలు; మే=నాకు; భవిష్యతి = కాఁగలదు.

పురుషశ్రేష్ఠుఁడా! ఈమృగశ్రేష్ఠంబు, ప్రాణంబుతోనీచేతికిఁ జిక్కదేని, దీనింజంపి తెత్తువేని సుందరంబయిన దీనిచర్మమును నేనుంచుకొందును.

అని, తాత్పర్యము.

నిహతస్యాస్య సత్త్వస్య జాంబూనదమయత్వచి
శష్పబ్రస్యాం వినీతాయా మిచ్ఛా మ్యహ ముపాసితుమ్. ౧౯

టీక॥ అహం=నేను; శష్పబ్రస్యాం=లేఁతకసవుతోఁ జేయఁబడిన యాసనమునందు; వినీతాయాం= పఱపఁబడిన; నిహతస్య=చంపఁబడిన; అస్య = ఈమృగముయొక్క ; జాంబూనదమయత్వచి = బంగారువికారమయినచర్మమునందు; ఉపాసితుం= శయనించుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను.

ఈమృగమునుజంపి తెత్తువేని, నేను, కాంచనమయంబగుదీనిచర్మమునుదర్భాసనముపైఁబఱచుకొని, నీతోఁ గూడశయనింపఁగోరెదను.

అని, తాత్పర్యము.

కామవృత్త మిదం రౌద్రం స్త్రీణా మసదృశం మతమ్
వపుషా త్వస్య సత్త్వస్య విస్మయో జనితో మమ. ౨౦

టీక॥ ఇదం=ఈ; కామవృత్తం=స్వేచ్ఛావ్యాపారము; స్త్రీణాం=స్త్రీలకు ; అసదృశం=సరికానిదిగా ; మతం=తలంపఁబడినది. ఘోరం=భయంకరము. తు=అయితే; అస్య=ఈ; సత్త్వస్య=జంతువుయొక్క; వపుషా=రూపముచేత ; మమ = నాకు; విస్మయః=ఆశ్చర్యము; జనితః= కలిగింపఁబడినది

ఇట్లు, స్త్రీలు స్వేచ్ఛగాభర్తలం బ్రేరేపించుట, మిక్కిలియు భయంకరము; ఇదిస్త్రీలకెంతమాత్రముతగదు ; అయినను, ఈమృగమురూప సౌందర్యాదులచేఁ బరవశనై యడుగుచున్నాను.

అని, సీత రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తేన కాంచనరూపేణ మణిప్రవరశృంగిణా
తరుణాదిత్యవర్ణేన నక్షత్రపథవర్చసా. ౨౧
బభూవ రాఘవస్యాపి మనో విస్మయ మాగతమ్

టీక॥ కాంచనరూపేణ = బంగారు యొక్క రంగువంటిరంగుగలదియు, మణిప్రవరశృంగిణా = రత్నశ్రేష్ఠమగు ఇంద్రనీలమణివంటికొమ్ములుగలదియు; తరుణాదిత్యవర్ణేన = లేఁతసూర్యునిరంగువంటిరంగుగలదియు; నక్షత్రపథవర్చసా = నక్షత్రమార్గము యొక్క కాంతివంటికాంతిగలదియునగు; తేన = ఆమృగముచేత; రాఘవస్య = రామునియొక్క; మనోపి = మనస్సును; విస్మయం = ఆశ్చర్యమును; ఆగతం = పొందినది; బభూవ = అయినది.

కాంచనవర్ణంబును ఇంద్రనీలములవంటికొమ్ములుగలదియు బాలసూర్యునికాంతివంటి కాంతిగలదియును దెల్లని బిందువులు గలుగుటంజేసి నక్షత్రగణయుక్తంబగు నాకాశంబు పగిదిఁ దేజరిల్లుచున్నదియునగు నామృగంబుం జూచి, రాముండును, ఆశ్చర్యంబునొందెను.

అని, తాత్పర్యము.

ఏవంసీతా వచ శ్శ్రుత్వా తం దృష్ట్వా మృగ మద్భుతమ్. ౨౨
లోభిత స్తేన రూపేణ సీతయాచ ప్రచోదితః
ఉవాచ రాఘవో హృష్టో భ్రాతరం లక్ష్మణం వచః. ౨౩

టీక॥ రాఘవః = రాముఁడు; ఏవం = ఇట్లు; సీతావచః = సీతాదేవిమాటను; శ్రుత్వా = విని; అద్భుతం = ఆశ్చర్యకరమగు; తం = ఆ; మృగం = మృగమును; దృష్ట్వా = చూచి; తేన = ఆ; రూపేణ = మృగసౌందర్యముచేత; లోభితః = ఆశనొందినవాఁడై, సీతయాచ = సీతాదేవిచేతను; ప్రచోదితః = ప్రేరేపింపఁబడినవాఁడై; హృష్టః = సంతోషించినవాఁడై; భ్రాతరం = తమ్ముఁడైన; లక్ష్మణం = లక్ష్మణునిగూర్చి; వచః = మాటను; ఉవాచ = చెప్పెను.

రాముఁడు, ఇట్లు సీతాదేవిచెప్పిన మాటనువిని, యాశ్చర్యకరంబగు నామృ

గంబునుంజూచి, దాని సౌందర్యంబున కు, ఆశనొంది, సీతాదేవిచేతనుఅట్లడు గంబడినవాఁడై, సంతోషంబునఁ దమ్ముండగులక్ష్మణుఁజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

పశ్య లక్ష్మణ వైదేహ్యా స్స్పృహాం మృగగతా మిమామ్
రూపశ్రేష్ఠతయా హ్యేష మృగోద్య నభవిష్యతి. ౨౪

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! వైదేహ్యాః= సీతాదేవియొక్క ; మృగగతాం=మృగమునుబొందిన; ఇమాం= ఈ, స్పృహాం=ఆశను; పశ్య= చూడుము. రూపశ్రేష్ఠతయా = సౌందర్యముచేనుత్తమమగుటచేత; ఏషః= ఈ; మృగః=జింక; అద్య=ఇప్పుడు ; నభవిష్యతి=దొరకదు.

లక్ష్మణుఁడా! సీతాదేవికి , ఈ మృగంబుపై నెంత యాశగలిగియున్నదో చూడుము ; ఇంతసౌందర్యముగల మృగ మెందును లేదు కావున, నిట్టిమృగంబు, ఈవనములో దొరకదు.

అని, తాత్పర్యము.

న వనే నందనోద్దేశే న చైత్రరథసంశ్రయే
కుతః పృథివ్యాం సౌమిత్రే యోస్య కశ్చి త్సమో మృగః. ౨౫

టీక॥ సౌమిత్రే = లక్ష్మణుఁడా! యః=ఏ; కశ్చిత్=ఒకానొక; మృగః= మృగము; అస్య=దీనికి; సమః = సరియయినదో; సః(అధ్యాహృతము)= అది; నందనోద్దేశే=నందనమను పేరుగల; వనే=వనమునందు; న = లేదు. చైత్రరథసంశ్రయే= చైత్రరథమను పేరుగలవనమునందు; న=లేదు. పృథివ్యాం=భూమియందు; కుతః=ఎక్కడిది?

లక్ష్మణుఁడా! దీనికిసరియయినమృగము, నందనవనమునందును చైత్రరథవనమునందును దొరకదు; ఇంకభూమియందెట్లుదొరకును.

అని, తాత్పర్యము.

ప్రతిలోమా నులోమాశ్చ రుచిరా రోమరాజయః
శోభంతే మృగ మాశ్రిత్య చిత్రాః కనకబిందుభిః. ౨౬

స ౬౩




టీక॥ ప్రతిలోమానులోమాః= ఎదురుదిరిగియున్నవియును అనుకూలములునగు; రోమరాజయశ్చ= వెండ్రుకల పజ్క్తులును; కనకబిందుభిః=బంగారు చుక్కలచేత; చిత్రాః=చిత్రవర్ణములయి; మృగం=మృగమును; ఆశ్రిత్య= ఆశ్రయించి; శోభంతే = ప్రకాశించుచున్నవి.

ప్రతిలోమములుగాను అనులోమములుగానునుండు వెండ్రుకలు,బంగారు బిందువులచేఁజిత్రితంబులయి, మృగశరీరంబునకెంతయుఁబ్రకాశముగలిగించుచున్నవి.అని, తాత్పర్యము.

పశ్యాస్య జృంభమాణస్య దీప్తా మగ్నిశిఖోపమామ్
జిహ్వాం ముఖా న్నిస్సరంతీం మేఘాదివ శతహ్రదామ్. ౨౭

టీక॥ అస్య=ఈమృగము ; జృంభమాణస్య = ఆవలించుచుండఁగా ; దీప్తాం=ప్రకాశించుచున్నదియు; అగ్నిశిఖోపమాం= అగ్నిజ్వాలతోఁబోలికగలదియు; ముఖాత్=నోటనుండి;నిస్సరంతీం=వెడలుచున్నదియు;మేఘాత్= మేఘమునసుండి ; నిస్సరంతీం(అధ్యాహృతము)=వెడలుచున్న; శతహ్రదామివ(స్థితాం)= మెఱుపువలెనున్నదియునగు; జిహ్వాం = నాలుకను ; పశ్య= చూడుము.

ఈమృగము, ఆవలించునప్పుడు , దీనినాలుకను , నోటనుండివెడలియగ్నిజ్వాలవలెవెలుఁగుచు, మేఘంబుననుండివెడలునట్టిమెఱపుకైవడి , మెఱయుచున్నది , చూడుము.

అని, తాత్పర్యము.

మసారగల్లర్కముఖ శ్శంఖముక్తానిభోదరః
కస్య నామా నిరూప్యోసా న మనో లోభయే న్మృగః. ౨౮

టీక॥మసారగల్లర్కముఖః= ఇంద్రనీలమణిగిన్నెవంటినోరుగలదియు; శంఖముక్తానిభోదరః= శంఖముతోను ముత్తెముతోనుసమానమయినకడుపుగలదియు;అనిరూప్యః= ఇదియిట్టిదనినిరూపింపఁదగనిదియువగు ;అసౌ=ఈ;మృగః= మృగము;కస్యనామ=ఎవ్వనియొక్కమాత్రము; మనః = మనస్సును; నలోభ




వేత్ = అతిశయింపఁజేయుదు.

ఇంద్రనీలమణికిన్నెవంటినొప్పుగలదియు శంఖమువలె ముత్తెములవలె తెల్లనైన కడుపుగలదియు నిట్టిదని నిరూపించి చెప్పనలవిగానిదియునగు నీమృగంబుపై, నెవ్వనికాశ గలుగదు?

అని, తాత్పర్యము.

కస్య రూప మిదం దృష్ట్వా జాంబూనదమయం ప్రభో
నానారత్నమయం దివ్యం నమనో విస్మయం వ్రజేత్. ౨౯

టీక॥ ప్రభో = సమర్థుండవగు లక్ష్మణుఁడా! జాంబూనదమయం = బంగారు వికారంబును; నానారత్నమయం = నానావిధరత్న వికారమయినదియు; దివ్యం = శ్రేష్ఠమునగు; ఇదం = ఈ; రూపం = రూపమును; దృష్ట్వా = చూచి; కస్య = ఎవ్వనియొక్క; మనః = మనస్సు; విస్మయం = ఆశ్చర్యమును; నవ్రజేత్ = పొందదు?

సమర్థుండవగు లక్ష్మణుఁడా! కాంచనవర్ణంబును నానావిధ రత్నాకారబిందువులచేనలంకృతంబును దివ్యంబునగు నీరూపంబుఁజూచి, యెవ్వని మనస్సునకాశ్చర్యంబు గలుగదు?

అని, తాత్పర్యము.

మాంసహేతో రపి మృగాన్ విహారార్థం చ ధన్వనః
ఘ్నంతి లక్ష్మణ రాజానో మృగయాయాం మహావనే. ౩౦

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! రాజానః = రాజులు; మహావనే = పెద్దయడవియందు; మృగయాయాం = వేటయందు; మాంసహేతోరపి = మాంస నిమిత్తమును; ధన్వనః = ధనుస్సుయొక్క; విహారార్థం చ = వినోదముకొఱకును; మృగాన్ = మృగములను; ఘ్నంతి = చంపుదురు.

లక్ష్మణుఁడా! రాజులు, వనంబున, మాంసము సంపాదించుకొఱకును ధనుర్విహారముకొఱకును, వేటయందు, మృగంబులం జంపుదురు.

అని, తాత్పర్యము.

ధనాని వ్యవసాయేన విచీయంతే మహావనే

ధాతవో వివిధాశ్చాపి మణిరత్నసువర్ణినః. ౩౦

టీక॥ మహావనే = పెద్దయడవియందు; వ్యవసాయేన = ప్రయత్నముచేత; ధనాని = ధనములును; మణిరత్నసువర్ణినః = రత్నశ్రేష్ఠములునుబంగారును గల; వివిధాః = నానావిధములయిన; ధాతవశ్చాపి = ధాతువులును; విచీయంతే = పొందఁబడుచున్నవి.

వనంబున వేటాడుటచే, రాజులకు, అచ్చటచ్చట నిధులందుండుధనములును మంచిరత్నములను బంగారును గలిగియుండుధాతుప్రదేశంబులను దొరకును, అని, తాత్పర్యము.

తత్సార మఖిలం నృణాం ధనం నిచయవర్ధనమ్
మనసా చింతితం సర్వం యథా శుక్రస్య లక్ష్మణ. ౩౨

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! మనసా = మనస్సుచేత; చింతితం = తలంపఁబడినది; సర్వం = అంతయు; శుక్రస్యయథా = శుక్రునకుంబోలె; నృణాం = మనుష్యులకు; సారం = శ్రేష్ఠమయిన; తత్ = ఆ; ధనం = వనంబులందు దొరకునట్టిధనము; అఖిలం = అంతయు; నిచయవర్ధనం = కోశమునువృద్ధిఁబొందించునది.

లక్ష్మణుఁడా! శుక్రుండు, మనుష్యులమనస్సున గొంతెమకోర్కులం గోరుధనమునంతయు, అనాయాసముగాఁ గొని తనకోశంబు నిండించుకొనునట్లు, రాజులు, అడవులందు నానావిధంబులం బడియున్న యుత్తమమయిన ధనములనంతయు, కష్టములేక, గ్రహించి, తమ కోశంబులనిండించుకొందురు.
అని, తాత్పర్యము.

అర్థీ యే నార్థకృత్యేన సంవ్రజ త్యవిచారయన్.
త మర్థ మర్థశాస్త్రజ్ఞాః ప్రాహు రర్థ్యాశ్చ లక్ష్మణ. ౩౩

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! అర్థీ = అర్థముఁగోరువాఁడు; యేన = ఏ; అర్థకృత్యేన = అర్థముగుఱించినకార్యముచేత; అవిచారయన్ = ఆలోచింపనివాఁడై; సంవ్రజతి = చరించఁగాఁబోవునో; అర్థశాస్త్రజ్ఞాః = అర్థ




శాస్త్రముఁదెలిసినవారలును; అర్థ్యాశ్చ=అర్థమువదలనివారలును, అర్థముసంపాదించుటయందు సమర్థులనుట, అగువారలు; తం= దానిని; అర్థం= అర్థమునుగా; ప్రాహుః = చెప్పుదురు.

లక్ష్మణుఁడా! అపూర్వవస్తువుఁగోరునట్టిపురుషుఁడు, ఎంతమాత్రమాలోచింపకదేనిసంపాదించుటకై ప్రయత్నించునో, అర్థసంపాదనసమర్థులును అర్థశాస్త్రముఁదెలిసినవారలునగు వారలు, దానినేఅర్థము , అనఁగాసంపాదింపఁదగినవస్తువనిచెప్పుదురు; ఈమృగమట్టిది. అని, తాత్పర్యము.

ఏతస్య మృగరత్నస్య పరార్ధ్యే కాంచనత్వచి
ఉపవేక్ష్యతి వైదేహీ మయాసహ సుమధ్యమా. ౩౪

టీక॥ఏతస్య-ఈ; మృగరత్నస్య- మృగశ్రేష్ఠముయొక్క; పరార్థ్యే (అధ్యాహృతము)= శ్రేష్ఠమయిన; కాంచనత్వచి-బంగారుచర్మమునందు; సుమధ్యమా-సుందరమయిననడుముగల; వైదేహీ-సీత; మయాసహ=నాతోఁగూడ; ఉపవేక్ష్యతి=కూర్చుండును.

మృగశ్రేష్ఠంబగు దీనికాంచనవర్ణమయినయుత్తమచర్మమునందు, సుందరమయిననడుముగలసీతాదేవి , నాతోఁగూడఁగూర్చుండఁగలదు.

అని, తాత్పర్యము.

న కాదలీ నప్రియకీ న ప్రవేణీ నచావికీ
భవే దేతస్య సదృశీ స్పర్శనేనేతి మే మతిః. ౩౫

టీక॥స్పర్శనేన=తాఁకుటచేత; ఏతస్య=దీనికి; సదృశీ= సమానమయినది; కాదలీ=కదళీమృగము; నభవేత్=కాదు. ప్రియకీ=ప్రియకీమృగము; న = కాదు. ప్రవేణీ=ప్రవేణీమృగము; న = కాదు. ఆవికీ=ఆవిమృగము; న = కాదు. ఇతి=అని; మే=నాయొక్క; మతిః = తలంపు.

అధికరోమములుగల కదళిమృగముగానిప్రియకీమృగముగాని ప్రవేణీమృగముగానిఆవిమృగముగాని, మృదుత్వంబున, దీనిసరికాఁజాలదు.

అని, తాత్పర్యము.




ఏషచైవ మృగ శ్శ్రీమాన్ యశ్చ దివ్యో నభశ్చరః
ఉభా వే తౌ మృగౌ దివ్యౌ తారామృగమహీమృగౌ. ౩౬

టీక॥శ్రీమాన్= అధికమయినకాంతిగల; ఏషః=ఈ; మృగఏవచ=మృగమును; యః=ఏ; దివ్యః=శ్రేష్ఠమయిన; నభశ్చరః=ఆకాశమునందిరుగునట్టి; మృగః (అధ్యాహృతము)= మృగశీర్షనక్షత్రము; అస్తి(అధ్యాహృతము)= కలదో; సః(అధ్యాహృతము)చ= అదియు; ఏతౌ=ఈ; తారామృగమహీమృగౌ= నక్షత్రమృగము సుభూమిమృగమును; దివ్యౌ=శ్రేష్ఠములయిన; మృగౌ= మృగములు.

శ్రీమంతంబగు నీమృగంబును, ఆకాశంబుననుండునట్టిదివ్యంబగుమృగశీర్షనక్షత్రంబనుమృగంబును, ఈభూమిమృగమునునక్షత్రమృగమును రెండునుఉత్తమమృగములు. అని, తాత్పర్యము.

యదివా యం తథా యన్మాం భవే ద్వదసి లక్ష్మణ
మాయైషా రాక్షసస్యేతి కర్తవ్యో స్య వధో మయా. ౩౭

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! త్వం (అధ్యాహృతము)=నీవు; మాం = నన్నుఁగూర్చి; ఏషా=ఇది; రాక్షసస్య= మారీచునియొక్క; మాయేతి=మాయయని; యత్=ఏమాటను; వదసి=చెప్పుచున్నావో; తథా=అట్లు; అయం=ఈ మృగము; భవేద్యది=అగునేని; మయా= నాచేత; అస్య=దీనియొక్క; వధః=చంపుట; కర్తవ్యః = చేయఁబడవలసినది.

లక్ష్మణుఁడా! నీవు, నాతోఁజెప్పినట్లు, ఇది, మారీచునిమాయయెయగునేని, నేనుదీనినవశ్యము వధింపవలయును. అని, తాత్పర్యము.

ఏతేన హి నృశంసేన మారీచేనా కృతాత్మనా
వనే విచరతా పూర్వం హింసితా మునిపుంగవాః. ౩౮

టీక॥పూర్వం=మున్ను; వనే= అడవియందు; విచరతా= సంచరించుచున్న; నృశంసేన=క్రూరుఁడైన; అకృతాత్మనా=శిక్షింపఁబడనిబుద్ధిగల ; ఏతే

స ౪౩

న=ఈ; మారీచేన=మారీచుని చేత; మునిపుంగవాః= మునిశ్రేష్ఠులు ; హింసితాః=చంపఁబడినారుగదా!

మున్ను, బుద్ధిహీనుండును గ్రూరుండునగు నీమారీచుండు , ఈవనంబునం దిరుగుచు, బెక్కుమునివరులం జంపియున్నాఁడుగదా! అని, తాత్పర్యము.

ఉత్థాయ బహవో యేన మృగయాయాం జనాధిపాః
నిహతాః పరమేష్వాసా స్తస్మా ద్వధ్య స్త్వయం మృగః. ౩౯

టీక॥ యేన=దేని చేత ; ఉత్థాయ= ప్రాదుర్భవించి ; మృగయాయాం= వేటయందు; పరమేష్వాసాః= మహాధనుర్ధరులగు; జనాధిపాః = రాజులు; బహవః=పెక్కండ్రు; నిహతాః= చంపఁబడినారో; అయం = ఈ; మృగః=మృగము; తస్మాత్తు = అందువలననె; వధ్యః=చంపఁదగినది.

ఈమృగము , వేటకువచ్చిన మహా ధనుర్ధరులగు రాజులఁ బెక్కండ్ర వధించియున్నది కావున , దీనినవశ్యమువధింపవలయును!

అని, తాత్పర్యము.

పురస్తా దిహ వాతాపిః పరిభూయ తపస్వినః
ఉదరస్థో ద్విజాన్ హంతి స్వగర్భో౽శ్వతరీమివ. ౪౦

టీక॥ పురస్తాత్=మున్ను; ఇహ= ఇచ్చట; వాతాపిః= వాతాపియను రాక్షసుఁడు; తపస్వినః=ఋషులను ; పరిభూయ=తిరస్కరించి; ఉదరస్థః=కడుపుననున్నవాఁడై; ద్విజాన్= బ్రాహ్మణులను; స్వగర్భః = తనచూడి ; అశ్వతరీమివ = ఆఁడుగుఱ్ఱమునందు మగగాడిదకుఁబుట్టినమృగమునువలె; హంతి=చంపుచుండెను.

మున్నిదండకారణ్యంబున , వాతాపియను రాక్షసుఁడొకఁడు , ఋషులనువంచించి, తాను మేకరూపమెత్తి వారలకుభోజ్యమయి , వారల యుదరముఁబ్రవేశించి, యాశ్వతరియీనునప్పుడుదూడ గర్భంబుఁజీల్చుకొనివచ్చి తల్లిం జంపునట్లు, యాఋషులకడుపుచిం

చుకొనివచ్చి, వారలవధించుచుండెను. అని, తాత్పర్యము.

స కదా చ్చిరా ల్లోభా దాససాద మహామునిమ్
అగస్త్యం తేజసా యుక్తం భక్ష స్తస్య బభూవహ. ౪౧

టీక॥ సః=ఆవాతాపి; చిరాత్=బహుకాలమునకు, కదాచిత్= ఒకానొకప్పుడు; లోభాత్ = ఆశవలన; తేజసా=ప్రభావముతో, యుక్తం=కూడినవాఁడును; మహామునిం= పూజ్యుఁడైన మునియునగు; అగస్త్యం=అగస్త్యుని; ఆససాద=పొందెను. తస్య=ఆమహామునికి; భక్షః=ఆహారము; బభూవ=ఆయెను "హ" అనునది పాదపూరణార్థము.

ఆవాతాపి, యట్లు బహుకాలముండి. యంతనొకప్పుడు, మాంసాశచే, ప్రభావసంపన్నుఁడగు నగస్త్యమహామునియొద్దకుఁబోయి, యథాక్రమముగ, భోజ్యమయి, యాయన యుదరముఁ బ్రవేశించెను అని, తాత్పర్యము.

సముత్థానేచ తద్రూపం కర్తుకామం సమీక్ష్య తమ్
ఉత్స్మయిత్వాతు భగవాన్ వాతాపి మిద మబ్రవీత్. ౪౨

టీక॥ భగవాన్=మాహాత్మ్యముగలయగస్త్యుఁడు; సముత్థానేచ=భోజనాంతమునందును; తద్రూపం=ఆతనరూపమును; కర్తుకామం= చేయఁగోరిన; తం=ఆ; వాతాపిం=వాతాపిని; సమీక్ష్య=చూచి; ఉత్స్మయిత్వాతు= నవ్వియు; ఇదం=ఈమాటను; అబ్రవీత్ = చెప్పెను.

భగవంతుండగు నగస్త్యుండు, భోజనాంతంబునఁ దనయుదరంబు భేదించుటకై యావాతాపి నిజరూపంబు ధరింపఁగోరుటంజూచి, యతనిం బేర్కొని, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

త్వయాఽ విగణ్య వాతాపే పరిభూతా స్స్వతేజసా
జీవలోకే ద్విజశ్రేష్ఠా స్తస్మా దసి జరాం గతః. ౪౩

టీక॥ వాతాపే=వాతాపీ! త్వయా=నీచేత ; జీవలోకే = ప్రాణిలోకమునందు ; అవిగణ్య = విచారింపక ; స్వతేజసా=నీబలముచేత; ద్విజశ్రేష్ఠాః=బ్రాహ్మణశ్రేష్ఠులు; పరిభూతాః=తిరస్కరింపఁబడినారు. తస్మాత్= అందువలన; జరాం=జీర్ణత్వను; గతః=పొందినవాఁడవు; అసి=అగుచున్నావు.

వాతాపీ! నీవు, భూలోకంబునఁబాపమనిగూడవిచారింపక , పెక్కుబ్రాహ్మణోత్తములంజంపినావు; అందువలన, నీవు, నాయుదరంబునజీర్ణుఁడండవయితివి. అని, యగస్త్యుఁడు , వాతాపితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం తన్న భవే ద్రక్షో వాతాపిరివ లక్ష్మణ
మద్విధంనాతి మన్యేత ధర్మనిత్యం జితేంద్రియమ్. ౪౪

టీక ॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! యః=ఎవ్వఁడు; ధర్మనిత్యం=ధర్మంబునందుస్థిరుండును; జితేంద్రియం= జయింపఁబడిన యింద్రియములుగలవాఁడునగు; మద్విధం=నాయట్టివాని; అతిమన్యేత=అతిక్రమించునో; తత్=ఆ ; రక్షః=రాక్షసుఁడు, మారీచుఁడనుట; ఏవం=ఇట్లు; వాతాపిరివ= వాతాపివలె; నభవేత్ =జీవింపఁడు.

లక్ష్మణుఁడా! ధర్మంబునందుఁజలనములేకుండువాఁడును జితేంద్రియుండునగునాయట్టివానినతిక్రమించునేని, యామారీచుండు, వాతాపివలె, నిహతుండగును. అని, తాత్పర్యము.

భవే ద్ధతోఽ యం వాతాపి రగస్త్యేనేవ మాం గతః

టీక॥ అయం = ఈమారీచుఁడు ; మాం=నన్ను ; గతః=పొందినవాఁడై ; అగస్త్యేన=అగస్త్యునిచేత ; వాతాపిరివ=వాతాపివలె ; హతః=చంపఁబడినవాఁడు; భవేత్=అగును.

అగస్త్యునిచేత వాతాపిహతుండయినట్లు, ఈమారీచుండునాచేహతుండగును. అని, తాత్పర్యము.

ఇహ త్వం భవ సన్నద్ధో యంత్రితో రక్ష మైథిలీమ్. ౪౫
అస్యా మాయత్త మస్మాకం యత్కృత్యం రఘునందన




టీక॥రఘునందన = లక్ష్మణుఁడా! త్వం=నీవు;ఇహ=ఇచ్చట ; సన్నద్ధః= కవచము మొదలగు సన్నాహముతోఁ గూడినవాఁడవు;భవ= అగుము. యంత్రితః=జాగ్రత్తగలవాఁడవై ; మైథిలీం=సీతాదేవిని;రక్ష = రక్షింపుము. అస్మాకం=మనకు;కృత్యం= కార్యము; యత్ (అస్తి)= ఏదిగలదో;తత్ (అధ్యాహృతము)= అది;అస్యాం= ఈ సీతయందు;ఆయత్తం=అధీనము.

లక్ష్మణుఁడా! నీవిచ్చటసన్నద్ధుండవై, జాగ్రత్తతో సీతాదేవిని రక్షింపుచుండుము;మన కార్యములన్నియు, ఈ బిడయందేయున్నవి . (ఈబిడనురక్షించుటెమనకుముఖ్యకార్యము).

అని, తాత్పర్యము

విశేషార్థము.— "మన కార్యము అన్నియునీబిడయందేయున్నవి" అనుట చేమనము చేయవచ్చిన రావణవధాది కార్యములన్నియు , నీబిడమూలముగ నే చేయవలసినవి" అని, సూచింపఁబడినది.

అహ మేనం వధిష్యామి గ్రహీష్యామ్యపివా మృగమ్. ౪౬
యావద్గచ్ఛామి సౌమిత్రే మృగ మానయితుం ద్రుతమ్

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! అహం=నేను; ఏనం=ఈ; మృగం=మృగమును; వధిష్యామి=చంపెదను. అపివా=లేక; గ్రహీష్యామి=పట్టుకొనెదను. ద్రుతం=శీఘ్రముగా; మృగం=మృగమును ; ఆనయితుం (ఆనేతుం)=తెచ్చుటకు; గచ్ఛామి=పోయెదను "యావత్" అనునదివాక్యాలంకారార్థము.

లక్ష్మణుఁడా! నేను, ఈమృగమునుపట్టనైననుబట్టెదను ; లేకవధింపనైననువధించెదను ; నేనుబోయిమృగమునుదీసికొనిశీఘ్రంబునవచ్చెదను.

అని, తాత్పర్యము.

పశ్య లక్ష్మణ వైదేహిం మృగత్వచి గతస్పృహామ్. ౪౭
త్వచా ప్రధానయా హ్యేష మృగోద్య సభవిష్యతి

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! మృగత్వచి=మృగచర్మమునందు ; గతస్పృ




హాం= పొందఁబడినయాశగల; వైదేహీం=సీతను; పశ్య=చూడుము. ప్రధానయా=ముఖ్యమయిన; త్వచా=చర్మముచేత; అద్య=ఇప్పుడు; ఏషః=ఈ; మృగః=మృగము; నభవిష్యతిహి= జీవింపదుగదా!

లక్ష్మణుఁడా! ఈమృగచర్మమునందుసీతకాశగలిగియున్నది; కావున, దీనిచర్మమెమనకుముఖ్యముకాఁబట్టి, యీమృగమునువధించి , దీనిచర్మమునుదెచ్చెదను. అని, తాత్పర్యము.

అప్రమత్తేన తే భావ్య మాశ్రమస్థేన సీతయా. ౪౮
యావ త్పృషత మేకేన సాయకేన నిహన్మ్యహమ్

టీక॥యావత్ = ఎంతలోపల; అహం= నేను; పృషతం=మృగమును; ఏకేన=ఒక్కటైన; సాయకేన= బాణముచేత, నిహన్మి=వధింతునో, తావత్ (అధ్యాహృతము) = అంతవఱకు; సీతయా=సీతచేత; ఆశ్రమస్థేన = ఆశ్రమమునందుండునట్టి; తే(త్వయా) = నీచేత; అప్రమత్తేన= ఏమఱుపాటులేనివాఁడుగా; భావ్యం=ఉండఁదగినది.

నేనొక్కబాణంబుననీమృగమునువధించివచ్చువఱకు, నీవు, సీతకుఁగా, నీయాశ్రమంబున, ఎంతమాత్రమేమఱకకాచియుండవలయును.

అని, తాత్పర్యము.

పృషతం చర్మ ఆదాయ శీఘ్ర మేష్యామి లక్ష్మణ. ౪౯

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! పృషతం(పార్షతం) = మృగసంబంధియగు; చర్మ=తోలును; ఆదాయ (సంధియార్షము)=తీసికొని; శీఘ్రం=శీఘ్రముగా; ఏష్యామి=వచ్చెదను.

లక్ష్మణుఁడా! నేనుమృగచర్మమునుదీసికొని, శీఘ్రముగవచ్చెదను.

అని, తాత్పర్యము.

ప్రదక్షిణే నాతిబలేన పక్షిణా
జటాయుషా బుద్ధిమతాచ లక్ష్మణ
భవాప్రమత్తః పరిగృహ్య మైథిలీం

ప్రతిక్షణం సర్వతఏవ శంకితః. ౫౦

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! త్వం (అధ్యాహృతము)= నీవు; ప్రదక్షిణే న=మహాసమర్థుఁడును; అతిబలేన= అధికమయినబలముగలవాఁడును ; బుద్ధిమతా= అధికమయినబుద్ధిగలవాఁడు నగు; పక్షిణా=పక్షియయిన ; జటాయుషా=జటాయువుతో;మైథిలీం= సీతను;పరిగృహ్య = తీసికొని;సర్వతఏవ=అన్నిటివలననై;శంకితః = సంశ హించినవాఁడవై;అప్రమత్తః=ఏమఱుపాటులేనివాఁడవై;భవ=ఉండుము.

లక్ష్మణుఁడా!నీవు,మహాసమర్థుఁడును,మహాబలుండును బుద్ధిమంతుండునగు జటాయువుతోఁగూడ,సమస్తమునందును శంకగలవాఁడుండవలసినంతటి జాగ్రత్తతో, ఏమఱక, సీతనురక్షించుచుండుము. అని, రాముండు, లక్ష్మణుని తోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే,శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, ఆరణ్యకాండే,త్రిచత్వారింశస్సర్గః.

ఇది,స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు,అరణ్యకాండత్రిచత్వారింశసర్గటీక, ముగిసినది.



శ్రీః

## చతుశ్చత్వారింశసర్గప్రారంభః

తథాతు తం సమాదిశ్య భ్రాతరం రఘునందనః
బబంధాసిం మహాతేజా జాంబూనదమయత్సరుమ్. ౧.

టీక॥ మహాతేజాః= అధికమయినపరాక్రమముగల; రఘునందనః= రాముఁడు, తథా=అట్లు; తం=ఆ; భ్రాతరం= తమ్మునిఁ; సమాదిశ్యతు = ఆజ్ఞాపించినంతనె; జాంబూనదమయత్సరుం= బంగారువికారమయినపిడికిలిగల; అసిం=ఖడ్గమును; బబంధ=కట్టెను.

మహాతేజుండగు రాముండు, ఆప్రకారంబునఁదమ్మునితోఁజెప్పి, కాంచనమయంబగుపిడికిలిగలఖడ్గంబునుమొలనుబంధించెను. అని, తాత్పర్యము.

తతస్త్రివినతం చాపమాదాయాత్మవిభూషణమ్
ఆబధ్యచ కలాపౌ ద్వౌ జగామోదగ్రవిక్రమః. ౨

టీక॥ తతః= అంత; ఉదగ్రవిక్రమః= అధికమయిన పరాక్రమముగల రాముఁడు, ఆత్మవిభూషణం = తనకలంకారమయిన; త్రివినతం = మూఁడిటవంగిన, చాపం=ధనుస్సును; ఆదాయ=తీసికొని; కలాపౌ = అమ్ములపొదులను; ద్వౌ=రెంటిని; ఆబధ్యచ = కట్టుకొనియు; జగామ=పోయెను.

అంత, మహాపరాక్రమశాలియగు రాముఁడు, తనకలంకారమయినశార్ఙ్గధనుస్సుఁదీసికొని, అమ్ములపొదులరెంటినింగట్టుకొని, పోయెను. అని, తాత్పర్యము.

తం వంచయానో రాజేంద్ర మాపతంతం నిరీక్ష్య వై
బభూవాంతర్హితస్త్రాసాత్పున స్సందర్శనే భవత్. ౩

టీక॥ సః(అధ్యాహృతము) = ఆ మారీచుఁడు; ఆపతంతం=వచ్చుచున్న; తం=ఆ ; రాజేంద్రం=రాజశ్రేష్ఠుండగు రాముని; నిరీక్ష్యవై=చూచినంతనె; వంచయానః = మోసపుచ్చువాఁడై, త్రాసాత్=భయమువలన; అంతర్హితః=మఱుగుబడినవాఁడు; బభూవ=ఆయెను. పునః=మఱల; సందర్శనే = చూచుటయందు; అభవత్=ఆయెను.

ఆమారీచుండు, రాజశ్రేష్ఠుండగు నారాముండువచ్చుటంజూచి, యతని మోసపుచ్చఁదలంచి, భయంబునఁగొంతసేపంతర్హితుండైయుండి, మఱల నతనికింబొడసూపెను.

అని, తాత్పర్యము.

బద్ధాసి ర్ధను రాదాయ ప్రదుద్రావ యతో మృగః

టీక॥ సః(అధ్యాహృతము)=ఆరాముఁడు; బద్ధాసిః= కట్టఁబడినఖడ్గము గలవాఁడై; ధనుః=ధనుస్సును ; ఆదాయ=తీసికొని; యతః=ఎట్లు;మృగః = మృగము;అగచ్ఛత్(అధ్యాహృతము)= పోయెనో ; తతః(అధ్యాహృతము)= అట్లు; ప్రదుద్రావ=పరుగెత్తెను.

రాముండు, ఖడ్గంబు మొలయందు బంధించుకొని , ధనుస్సుచేతంగొని , మృగంబుపోయినదారింబట్టిపోయెను.

అని, తాత్పర్యము.

తం స్మ పశ్యతి రూపేణ ద్యోతమాన మివాగ్రతః. ౭
ఆవేక్ష్యావేక్ష్య ధావం తం ధనుష్పాణిం మహావనే
అతివృత్తమిషోః పాతా ల్లోభయానం కదాచన. ౮
శంకితంతు సముద్భ్రాంత ముత్పతంత మివాంబరే
దృశ్యమాన మదృశ్యంచ వనోద్దేశేషు కేషుచిత్. ౯
ఛిన్నాభ్రైరివ సంవీతం శారదం చంద్రమండలమ్

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాముఁడు;రూపేణ= కాంతిచేత; అగ్రతః= ముందట; ద్యోతమానమివ (స్థితం)= ప్రకాశించుచున్నట్లున్నవాఁడును;మహావనే=పెద్దయడవియందు; ధనుష్పాణిం=విల్లుచేతంగల; తం=ఆధా

స ౪౪

మని, భావం= అభిప్రాయమున; ఆవేక్ష్యావేక్ష్య=చూచిచూచి; ఇషోః=బాణముయొక్క; పాతాత్ = పడుటవలన; అతివృత్తం = అతిక్రమించినవాఁడును; కదాచన=ఒకానొకప్పుడు; లోభయానం=ఆశింపఁజేయువాఁడును; శంకితం= భయపడినవాఁడును; సముద్భ్రాంతం= తిరుగుడువడుచున్నవాఁడును; అంబరే=ఆకాశమునందు; ఉత్పతంతమివ(స్థితం)= ఎగురుచున్నట్లున్నవాఁడును; దృశ్యమానం= చూడఁబడుచున్నవాఁడును; కేషుచిత్ = కొన్ని; వనోద్దేశేషు=అరణ్యప్రదేశములందు; అదృశ్యంచ= చూడనలవిగానివాఁడున, ఛిన్నాభ్రైః=ఖండింపఁబడిన మేఘములచేత; సంవీతం=కప్పఁడిన; శారదం= శరదృతువునందలి; చంద్రమండలమివ (స్థితం) = చంద్రమండలమువలెనున్నవాఁడునగు; తం = ఆమారీచుని; పశ్యతిస్మ=చూచెను.

అంత, కొంత్యతిశయంబునముందట నుండునట్లు తేజరిల్లుచు, ధనుష్పాణియగు రాముని యభిప్రాయంబు నెఱింగి, యతండు బాణంబు నేయు సమయంబున బాణంబు తగలకుండునట్లు దూరంబు పరుగెత్తుచు నేమఱియుండునప్పుడు సమీపించి యాశగల్గించుచు, భీతుండై భ్రాంతుండై, యాకాశంబున నెగసిపోవునట్లు అతివేగంబునంబరు గెత్తుచు , మేఘఖండంబులచేఁగప్పఁబడిన చంద్రమండలంబు పగిదిఁగొన్ని ప్రదేశంబులం బొడసూపుచుఁగొన్నిటనంతర్హితుండగుచు నీరీతినరణ్యంబున సంచరించుచున్న యమ్మారీచుని, రాముండు చూచెను.

అని, తాత్పర్యము.

ముహూర్తాదేవ దదృశే ముహు ర్దూరాత్ప్రకాశతే. ౭

టీక॥ముహూర్తాదేవ=స్వల్పకాలమువలననె ; సమీపే (అధ్యాహృతము)=సమీపమునందు; దదృశే=చూడఁబడెను. ముహుః = పలుమాఱు; దూరాత్ =దూరంబున; ప్రకాశతే=ప్రకాశించెను.

ఆమృగము, ముహూర్తమాత్రంబున, సమీపంబుననుండును; మఱల, నధిక దూరంబునందోఁచును.

అని, తాత్పర్యము.

దర్శనాదర్శనాదేవ సోఽపాకర్షత రాఘవమ్

సుదూర మాశ్రమస్యాస్య మారీచో మృగతాంగతః. ౮

టీక॥ మృగతాం = మృగమును; గతః = పొందిన; సః = ఆ; మారీచః = మారీచుఁడు; దర్శనాదర్శనా దేవ = అగపడుటవలనను అగపడకుండుటవలనను, రాఘవం = రాముని; అస్య = ఈ; ఆశ్రమస్య = ఆశ్రమమునకు; సుదూరం = మిక్కిలియుదూరముగా; అపాకర్షత = ఈడ్చుకొనిపోయెను.

మృగరూపధరుండగు మారీచుండు, అట్లు కొంచెము సేపు పొడసూపుచుఁ గొంచెము సేపంతర్హితుండగుచు, ఇట్లు, రాముని, ఆశ్రమంబునకు బహుదూరముగాఁ గొనిపోయెను.

అని, తాత్పర్యము.

ఆసీ త్క్రుద్ధస్తు కాకుత్స్థో వివశ స్తేన మోహితః
అథావతస్థే సంభ్రాన్త శ్ఛాయా మాశ్రిత్య శాద్వలే. ౯

టీక॥ కాకుత్స్థః = రాముండు; తేన = ఆమృగముచేత; క్రుద్ధస్తు = కోపము నొందినవాఁడును; వివశః = పరవశుండును; మోహితః = మోహమునొందిన వాఁడును; ఆసీత్ = ఆయెను. అథ = అంత; సంభ్రాన్తః = భ్రాన్తినొందినవాఁడై; ఛాయాం = నీడను; ఆశ్రిత్య = పొంది; శాద్వలే = పచ్చికనేలయందు; అవతస్థే = నిలిచెను.

రాముండు, ఆమృగచేష్టకుఁ గొంత సేపు కోపంబును, అంత దానిసౌందర్యంబునకు మోహితుండై, పరవశత్వంబునుం బొంది, యంత, సంభ్రాన్తచిత్తుండై, యొక చెట్టునీడయందుఁ బచ్చికనేలపై నిలుచుండెను.

అని, తాత్పర్యము.

స త మున్మాదయామాస మృగరూపో నిశాచరః
మృగైః పరివృతో వన్యై రదూరా త్ప్రత్యదృశ్యత. ౧౦

టీక॥ మృగరూపః = మృగముయొక్కరూపమువంటిరూపముగల; సః = ఆ; నిశాచరః = రాక్షసుఁడైనమారీచుండు; తం = ఆరాముని; ఉన్మాదయామాస = భ్రాన్తచిత్తునిఁగావించెను. వన్యైః = అడవియందుఁబుట్టిన; మృగైః =




మృగములచేత; పరివృతః=చుట్టఁబడిన వాఁడై, అదూరాత్=సమీపమున; ప్రత్యదృశ్యత=మాడఁబడెను.

అట్లుమృగరూపధరుండగుమారీచుండు, రాముసిబహుదూరముపరుగెత్తునట్లుచేసి, భ్రాంతచిత్తుంగావించెను; అంత, మఱల, నతనికాశగలుగుటకై, యామాయామృగము, వన్యమృగపరివృతంబై సమీపంబునం బొడసూపెను.

అని, తాత్పర్యము

గ్రహీతుకామం దృష్ట్వైనం పున రేవాభ్యధావత
తత్క్షణా దేవ సంత్రాసా త్పున రంతర్హితో ఽభవత్ ౧౧

టీక॥సః (అధ్యాహృతము)=ఆమృగము; గ్రహీతుకామం= పట్టుకొనఁగోరిన; ఏనం=ఈ రాముని; దృష్ట్వా= చూచి, పున రేవ=మఱల నే; అభ్యధావత= పరుగెత్తెను. పునః=మఱల; తత్క్షణాదేవ=ఆ క్షణమువలన నె, సంత్రాసాత్= మిక్కిలిభయమువలన; అంతర్హితః= మఱుఁగు పడినది ; అభవత్ = ఆయెను.

ఆమృగంబు, రాముండుతన్నుఁబట్టుకొనవచ్చుటంజూచి, మఱలంబరుగెత్తెను; అంత, క్షణమాత్రమున, మఱల, భయమువలన, నంతర్హితంబయ్యెను.

అని, తాత్పర్యము.

పున రేవ తతో దూరా ద్వృక్షషండా ద్వినిస్సృతమ్
దృష్ట్వా రామో మహాతేజా స్తం హంతుం కృతనిశ్చయః ౧౨

టీక॥తతః=అంత, మహాతేజాః=అధికమయినపరాక్రమముగల; రామః= రాముఁడు; పున రేవ = మఱల నే; వృక్షషండాత్ = వృక్షసమూహముననుండి; వినిస్సృతం= వెడలిన; తం = ఆమృగమును; దృష్ట్వా=చూచి; హంతుం= వధించుటకు; కృతనిశ్చయః=చేయఁబడిన నిశ్చయముగలవాఁడయ్యెను.

అంత, మహాతేజుండగురాముండు, మఱల, నామృగంబాక వృక్షసమూహంబుననుండి వెడలుటఁజూచి, యామృగంబునువధింపవలెనని, నిశ్చయించెను. అని, తాత్పర్యము.

భూయస్తు శర ముద్ధృత్య కుపిత స్తత్ర రాఘవః




టీక॥ రాఘవః=రాముఁడు; తత్ర=అప్పుడు; శరం=బాణమును; ఉద్ధృత్య=ఎత్తి; భూయస్తు=మిక్కిలియు; కుపితః=కోపమునొందినవాఁడయ్యెను.

రాముఁడట్లు బాణంబెత్తి పరమకుపితుఁడైయుండెను. అని, తాత్పర్యము.

సూర్యరశ్మిప్రతీకాశం జ్వలంత మరిమర్దనః. ౧౩
సంధాయ సుదృఢే చాపే వికృష్య బలవ ద్బలీ
త మేవ మృగ ముద్దిశ్య శ్వసంతమివ పన్నగమ్. ౧౪
ముమోచ జ్వలితం దీప్త మస్త్రం బ్రహ్మవినిర్మితమ్

టీక॥ అరిమర్దనః = శత్రువులమర్దించునట్టి; బలీ=అధికమయినబలముఁగలరాముఁడు; సూర్యరశ్మిప్రతీకాశం=సూర్యకిరణముతోసమానమును; జ్వలంతం= మండుచున్నదియునగు బాణమును; సుదృఢే=మిక్కిలియు దృఢమయిన; చాపే=ధనస్సునందు; సంధాయ=కూర్చి; బలవత్ = బలాత్కారముగా; వికృష్య=ఈడ్చి; శ్వసంతం=నిట్టూర్పువుచ్చుచున్న; పన్నగమివ (స్థితం)=సర్పమువలెనున్న; తం=ఆ; మృగమేవ=మృగమునే; ఉద్దిశ్య=ఉద్దేశించి; జ్వలితం=మండుచున్నదియు; దీప్తం= ప్రకాశించుచున్నదియు; బ్రహ్మవినిర్మితం=బ్రహ్మచేఁ నిర్మింపఁబడినదియునగు; అస్త్రం=అస్త్రమును; ముమోచ=విడిచెను.

శత్రువుల మర్దించువాఁడును బలవంతుండునగు రాముండు, సూర్యప్రకాశంబయి జ్వలించుచున్న దివ్యబాణంబును దృఢంబగు ధనుస్సున సంధించి, యాకర్ణాంతంబాకర్షించి, భయంబువ సర్పంబువలె నిట్టూర్పులు వుచ్చుచున్న యామృగము నుద్దేశించి, జ్వలించుచున్న బ్రహ్మనిర్మితంబగు నద్దివ్యాస్త్రంబు నేసెను. అని, తాత్పర్యము.

సదృశం మృగరూపస్య వినిర్భిద్య శరోత్తమః. ౧౫
మారీచస్యైవ హృదయం బిభేదాశనిసన్నిభః

టీక॥ అశనిసన్నిభః = పిడుగుతోసమానమయిన; శరోత్తమః = బాణశ్రేష్ఠము; మృగరూపస్య= మృగరూపమునకు; సదృశం=సమానమయిన; రూపం




(అధ్యాహృతము)= రూపమును; వినిర్భిద్య=భేదించి;మారీచస్య = మారీచునియొక్క;హృదయమేవ = హృదయమునే.బిభేద=భేదించెను.

పిడుగువంటిదైనయా బాణోత్తమము, మొదట , నమ్మారీచుండుధరించిన మృగ శరీరమునుభేదించి , యంత,నతనిహృదయమునేభేదించెను.

అని,తాత్పర్యము.

తాలమాత్ర మథో త్ప్లుత్య న్యపత త్స శరాతురః. ౧౬
వినదన్ భైరవం నాదం ధరణ్యా మల్పజీవితః

టీక॥అథ=అంత;సః= ఆమారీచుండు;శరాతురః=బాణపీడితుండై; తాలమాత్రం = తాటిచెట్టుప్రమాణము; ఉత్ప్లుత్య=ఎగిరి; భైరవం = భయంకరమయిన;నాదం= ధ్వనిని; వినదన్= అఱచుచు;అల్పజీవితః= కొంచెమయినప్రాణముగలవాఁడై ; ధరణ్యాం= భూమియందు;న్యపతత్ =పడెను.

అంత, నామారీచుండు , బాణపీడితుండై , తాటిచెట్టంత పొడవెగిరి,భయంకరంబుగానఅఱచుచు, హీనజీవితుండై,భూమింబడెను.

అని, తాత్పర్యము.

మ్రియమాణస్తు మారీచో జహౌ తాం కృత్రిమాం తనుమ్

టీక॥మారీచః = మారీచుఁడు;మ్రియమాణస్తు=మృతిఁబొందుచును;కృత్రిమాం=కృత్రిమమయిన;తాం = ఆ;తనుం=మృగరూపమును;జహౌ = విడిచెను.

మారీచుండు , మృతిఁబొందువాఁడై,కృత్రిమంబగునామృగరూపంబువిడిచి,నిజరూపంబుదాల్చెను.

అని, తాత్పర్యము.

స్మృత్వా తద్వచనం రక్షో దధ్యౌ కేనతు లక్ష్మణమ్. ౧౭
ఇహ ప్రస్థాపయే త్సీతా శూన్యే తాం రావణో హరేత్

టీక॥రక్షః = మారీచుఁడు;తద్వచనం=ఆరావణునిమాటను; స్మృత్వా=




తలంచుకొని; కేనతు= ఏయుపాయము చేతమాత్రము;సీతా=సీత;ఇహ= ఇచ్చటికి;లక్ష్మణం=లక్ష్మణుని; ప్రస్థాపయేత్=పంపును? రావణః= రావణుండు;శూన్యే=ఎవ్వరు లేనికాలమునందు; తాం=ఆసీతను;హరేత్=హరించును? ఇతి(అధ్యాహృతము)=అని;దధ్యౌ=తలంచెను.

మారీచుండు, రావణుండు చెప్పిన మాటనుదలంచుకొని "ఏయుపాయంబుచేత,సీతాదేవి,లక్ష్మణునిచ్చటికిఁబంపి, యెవ్వరునులేనికాలమునందు , రావణుండు,సీతనుహరించును?" అని , యాలోచించెను. అని, తాత్పర్యము.

స ప్రాప్తకాల మాజ్ఞాయ చకారచ తత స్స్వరమ్. ౧౮
సదృశం రాఘవస్యైవ హా సీతే లక్ష్మణేతిచ

టీక॥ సః=ఆమారీచుఁడు; ప్రాప్తకాలం=పొందఁబడినకాలముగలదానిఁగా; ఆజ్ఞాయ=తెలిసి; తతః=అంత ; రాఘవస్య=రామునకు; సదృశమేవ=సమానముగానే; "హా= అయ్యో! సీతే=సీతా! లక్ష్మణ = లక్ష్మణుఁడా!" ఇతిచ=అనియు; స్వరం=ధ్వనిని; చకారచ=చేసెను.

అమ్మారీచుండు , ఇదిసమయంబని తెలిసికొని , రామునికంఠధ్వని ననుసరించి,"అయ్యో! సీతా!లక్ష్మణుఁడా!" అని, యఱచెను. అని,తాత్పర్యము.

తేన మర్మణి నిర్విద్ధ శ్శరేణా నుపమేనచ. ౧౯
మృగరూపంతు తం త్యక్త్వా రాక్షసం రూప మాత్మనః
చక్రే స సుమహాకాయో మారీచో జీవితం త్యజన్ ౨౦

టీక॥ సుమహాకాయః = మిక్కిలియుగొప్పదగు దేహముగల; సః= ఆ; మారీచః=మారీచుఁడు; తేన= ఆరామునిచేత; అనుపమేన=సరిలేని; శరేణ చ=బాణముచేతను; మర్మణి = జీవస్థానమునందు; నిర్విద్ధః=కొట్టఁబడినవాఁడై ; జీవితం=ప్రాణమును ; త్యజన్=విడుచుచు; తం=ఆ ; మృగరూపంతు=జింకరూపును; త్యక్త్వా = విడిచి; రాక్షసం=రాక్షససంబంధియగు ; ఆత్మనః=తనయొక్క; రూపం= రూపమును; చక్రే=చేసెను.

మహాకాయుండగునమ్మారీచుండు, రామునిచేదివ్యబాణంబున మర్మస్థానమునందుఁగొట్టఁబడినవాఁడై,మృగరూపమునువిడిచి, తనరాక్షసరూపమును గైకొని,ప్రాణంబులువిడిచెను.

అని,తాత్పర్యము.

తతో విచిత్రకేయూర స్సర్వాభరణభూషితః
హేమమాలీ మహాదంష్ట్రో రాక్షసో భూచ్ఛరాహతః. ౨౧

టీక॥తతః=అంత;శరాహతః=బాణముచేఁగొట్టఁబడినమృగము; విచిత్రకేయూరః= నానావర్ణమయిన బాహుపురులుగలవాఁడును ; సర్వాభరణభూషితః= సమస్తములయిన భూషణములచేతనలంకరింపఁబడిన వాఁడును;హేమమాలీ = బంగారుమాలగలవాఁడును;మహాదంష్ట్రః = పెద్దకోఱలుగలవాఁడునగు;రాక్షసః = రాక్షసుఁడు;అభూత్=అయ్యెను.

అంత , రామబాణహతంబయిన యమ్మాయామృగంబు , విచిత్రంబులగుబాహుపురులుదాల్చిసమస్తాభరణంబులతో నొప్పుచుఁ గాంచనమాలధరియించి భయంకరంబులగు కోఱలతోఁ గూడియున్న రాక్షసశరీరంబు నొందెను. అని,తాత్పర్యము.

తం దృష్ట్వా పతితం భూమౌ రాక్షసం ఘోరదర్శనమ్
రామో రుధిరసిక్తాంగం వేష్టమానం మహీతలే. ౨౨
జగామ మనసా సీతాం లక్ష్మణస్య వచ స్స్మరన్

టీక॥రామః= రాముఁడు ; భూమౌ=నేలయందు;పతితం= పడినవాఁడును,ఘోరదర్శనం = భయంకరమయిన చూచుటగలవాఁడును ; రుధిరసిక్తాంగం=నెత్తుటందడుపఁబడిన దేహముగలవాఁడును;మహీతలే= భూతలమునందు;వేష్టమానం = పొరలుచున్నవాఁడునగు;తం=ఆ;రాక్షసం = రాక్షసుని;దృష్ట్వా=చూచి ; లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క;వచః =మాటను;స్మరన్=తలంచుచు;మనసా=మనస్సుచేత;సీతాం=సీతాదేవిని;జగామ=పొందెను.

రాముండు, నేలంబడినెత్తుటందోఁగుచుఁబొరలాడుచున్న భయంకరాకా

రునారాక్షసుండని, లక్ష్మణుండు చెప్పినమాటలందలఁపోసి,మనస్సున,సీతాదేవిందలంచుకొనెను.అని,తాత్పర్యము.

మారీచస్యే తి మాయైషా పూర్వోక్తం లక్ష్మణేనతు. ౨౩
త త్తథా హ్యభవ చ్చాద్య మారీచో యం మయా హతః

టీక॥ ఏషా=ఇది;మారీచస్య=మారీచునియొక్క; మాయా=మాయ. ఇతి=అని; లక్ష్మణేనతు = లక్ష్మణునిచేతనె; పూర్వోక్తం=మున్నుచెప్పఁబడినది. తత్=అది; అద్య=ఇప్పుడు ; తథాచ=అట్లె; అభవత్ = ఆయెను. మయా=నాచేత; హతః= చంపఁబడిన; అయం = ఈతఁడు ; మారీచః=మారీచుఁడు.

ఇదిమారీచునిమాయయేగాని వేఱుగాదని, లక్ష్మణుండు,మున్నెచెప్పినాఁడు; అదియట్లెయాయినది ; నాచేనిప్పుడువధింపఁబడిన రాక్షసుండుమారీచుఁడె. అని,తాత్పర్యము.

హా సీతే లక్ష్మణే త్యేవ మాక్రుశ్యచ మహాస్వరమ్. ౨౪
మమార రాక్షస స్సో యం శ్రుత్వా సీతా కథం భవేత్
లక్ష్మణశ్చ మహాబాహుః కా మవస్థాం గమిష్యతి. ౨౫

టీక॥ సః=ఆ; అయం=ఈ; రాక్షసః=రాక్షసుఁడు; "హా= అయ్యో! సీతే=సీతా! లక్ష్మణ= లక్ష్మణుఁడా!" ఇత్యేవం=అనియిట్లు; మహాస్వరం = పెద్దధ్వనిగలుగునట్లు; ఆక్రుశ్యచ=అఱచియు; మమార=చచ్చెను. సీతా=సీత; శ్రుత్వా=విని; కథం=ఎట్లు ; భవిష్యతి=కాఁగలదో? మహాబాహుః=పెద్దచేతులుగల; లక్ష్మణశ్చ = లక్ష్మణుఁడును; కాం=ఏ; అవస్థాం=అవస్థను ; గమిష్యతి=పొందఁగలఁడు?

ఈరాక్షసుఁడు, నాకంఠధ్వనిననుసరించి"అయ్యో!సీతా!లక్ష్మణుఁడా!" అనిపెరెలుంగుననాక్రోశించి, ప్రాణంబులువిడిచెను; ఈమాటనువిని,సీతయేమిదలంచునో?మహాబాహుండగులక్ష్మణుండెంతదుఃఖపడునో? అని, రాముండెంచెను,అని, తాత్పర్యము.

ఇతి సంచింత్య ధర్మాత్మా రామో హృష్టతనూరుహః

స ౪౪




టీక॥ధర్మాత్మా = ధర్మబుద్ధియగు; రామః=రాముఁడు; ఇతి=అని; సంచింత్య = ఆలోచించి; హృష్టతనూరుహః = గగుర్పాటునొందిన వెండ్రుకలు గలవాఁడు; అభూత్ (అధ్యాహృతము)=ఆయెను.

ధర్మాత్ముండగు రాముండీప్రకారంబునందలపోసి, భయమువలన దేహమంతయుఁగగుర్పాటునొందెను.

అని, తాత్పర్యము.

తత్ర రామం భయం తీవ్రమావివేశ విషాదజమ్. ౨౬
రాక్షసం మృగరూపం తం హత్వా శ్రుత్వాచ తత్స్వరమ్

టీక॥తత్ర = అప్పుడు; మృగరూపం = మృగముయొక్క రూపమువంటి రూపముగల; తం=ఆ; రాక్షసం=మారీచుని; హత్వా = చంపియు; తత్స్వరం=ఆమారీచునిధ్వనిని; శ్రుత్వాచ=వినియు; రామం=రాముని; తీవ్రం=తీక్ష్ణమయిన; విషాదజం=దుఃఖమువలనఁగలిగిన; భయం=భయము; ఆవివేశ=పొందినది.

అట్లు, రాముఁడు, మారీచుండు, మృగరూపధరుండై వచ్చి హతుండగుటయు, నవ్విధంబునం బలుకుటయుఁ దలపోసి, యిదియంతయు నేమోదుఃఖంబునకుఁగారణంబని, మహాభయమునొందెను. అని, తాత్పర్యము.

నిహత్య పృషతం చాన్యం మాంస మాదాయ రాఘవః. ౨౭
త్వరమాణో జనస్థానం ససారాభిముఖ స్తదా

టీక॥ రాఘవః=రాముఁడు; తదా=అప్పుడు; అన్యం = ఇతరమయిన; పృషతంచ=మృగమును; నిహత్య = చంపి; మాంసం = మాంసమును; ఆదాయ= తీసికొని; త్వరమాణః = వేగిరపడుచున్నవాఁడై; జనస్థానం = జనస్థానమునుగూర్చి; అభిముఖః = ఎదురైకొన్నవాఁడై; ససార=పోయెను.

రాముఁడంత, మఱియొకజింకంజంపి, దానిమాంసముఁదీసికొని, యతివేగంబున, జనస్థానమధ్యంబుననున్నతనయాశ్రమంబుదారిఁ బట్టిపోయెను. అని, తాత్పర్యము.




ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అరణ్యకాండే, చతుశ్చత్వారింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము,

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అరణ్యకాండ చతుశ్చత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

పంచచత్వారింశసర్గప్రారంభః.

ఆర్తస్వరం తు తం భర్తు ర్విజ్ఞాయ సదృశం వనే
ఉవాచ లక్ష్మణం సీతా గచ్ఛ జానీహి రాఘవమ్. ౧

టీక॥ సీతా = సీత; వనే = అడవియం దు; భర్తుః = పెనిమిటికి; సదృశం = సరియయిన; ఆర్తస్వరం = దుఃఖధ్వనిని; విజ్ఞాయ = ఎఱింగి; లక్ష్మణం = లక్ష్మణునిగూర్చి; ఉవాచ = చెప్పెను గచ్ఛ = పొమ్ము. రాఘవం = రాముని, జానీహి = తెలిసికొనుము.

సీత, పెనిమిటికంఠధ్వనివంటియార్తధ్వనినివిని, లక్ష్మణుంజూచి, యిట్లని, చెప్పెను. నీవుపోయి రాముని జూడుము. అని, తాత్పర్యము.

న హి మే హృదయం స్థానే జీవితం వావతిష్ఠతి
క్రోశతః పరమార్తస్య శ్రుత శ్శబ్దో మయా భృశమ్. ౨

టీక॥ పరమార్తస్య = మిక్కిలియు దుఃఖితుండును; భృశం = మిక్కిలియు; క్రోశతః = అఱచుచున్నవాఁడునగు రాముని యొక్క; శబ్దః = ధ్వని; మయా = నాచేత; శ్రుతః = వినఁబడినది. మే = నా యొక్క; హృదయం = మనస్సు గాని; జీ

వితంవా=ప్రాణముగాని; స్థానే= స్వస్థానమునందు; నావతిష్ఠతిహి= నిలువదుగదా!

పరమార్తుఁడయి, రోదనంబు గావించిన రాముని కంఠధ్వనివింటిని; ఇంక, నామనసుగాని ప్రాణముగాని, దేహంబుననిలువఁజాలదు.

అని, తాత్పర్యము.

ఆక్రందమానం తు వనే భ్రాతరం త్రాతు మర్హసి

టీక॥ వనే=అడవియందు; ఆక్రందమానం=అఱచుచునున్న; భ్రాతరం తు=అన్నను మాత్రము; త్రాతుం = రక్షించుటకు; అర్హసి=తగుదువు.

అడవియందు దిక్కులేకరోదనంబు సేయుచున్ననీయన్ననుమాత్రమురక్షింపుము. అని, తాత్పర్యము.

తం క్షిప్ర మభిధావ త్వం భ్రాతరం శరణైషిణమ్. ౩
రక్షసాం వశ మాపన్నం సింహానా మివ గోవృషమ్

టీక॥ త్వం=నీవు; రక్షసాం=రాక్షసులయొక్క; వశం=అధీనతను; ఆపన్నం=పొందినవాఁడును; సింహానాం=సింహములయొక్క; వశం,ఆపన్నం(అధ్యాహృతము)=అధీనతనొందిన; గోవృషమివ(స్థితం)= ఆఁబోతువలెనున్నవాఁడును; శరణైషిణం=రక్షకునిగోరుచున్నవాఁడునగు; తం=ఆ; భ్రాతరం=అన్ననుగూర్చి; అభిధావ = పరుగెత్తుము.

సింహంబులచేతంజిక్కినయాఁబోతువలె రాక్షసులచేతం జిక్కిరక్షకుంగానక పరితపించుచున్న నీయన్నయొద్దకుశీఘ్రంబుగాఁబోయి యాయనను రక్షింపుము. అని, సీతలక్ష్మణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

న జగామ తథో క్తస్తు భ్రాతు రాజ్ఞాయ శాసనమ్. ౪

టీక॥ సః(అధ్యాహృతము)= ఆలక్ష్మణుఁడు; తథా=అట్లు; ఉక్తస్తు = చెప్పఁబడినవాఁడైనను; భ్రాతుః= అన్నయొక్క; శాసనం= ఆజ్ఞను; ఆజ్ఞాయ= తెలిసి; నజగామ= పోఁడయ్యె.

ఆలక్ష్మణుఁడు, సీతాదేవియంత

దూరము చెప్పినను, అన్నయాజ్ఞనుదలంచి, పోవఁజాల్లఁడయ్యె.

అని, తాత్పర్యము.

తమువాచ తత స్తత్ర కుపితా జనకాత్మజా

టీక॥ తతః=అంత; తత్ర = అప్పుడు; జనకాత్మజా= జనకమహారాజుకొమార్తెయగుసీతాదేవి; కుపితా=కోపమునొందినదై; తం=ఆలక్ష్మణునిగూర్చి; ఉవాచ=చెప్పెను.

అంత, జనకమహారాజ పుత్రియగు సీతాదేవి, కోపమునొందిలక్ష్మణుం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

సౌమిత్రే మిత్రరూపేణ భ్రాతు స్త్వ మసి శత్రువత్. ౫
య స్త్వ మస్యా మవస్థాయాం భ్రాతరం నాభిపత్స్యసే

టీక॥ సౌమిత్రే = లక్ష్మణుఁడా! యః=ఏ; త్వం=నీవు; అస్యాం=ఈ; అవస్థాయాం=దశయందు; భ్రాతరం=అన్నను; నాభిపత్స్యసే = పొందకున్నావో; సః (అధ్యాహృతము) = అట్టి; త్వం=నీవు; భ్రాతుః = అన్నకు; మిత్రరూపేణ=స్నేహితునిరూపములో; శత్రువత్=శత్రువువంటివాఁడవు.

లక్ష్మణుఁడా! నీవు, నీయన్న యిట్టిదురవస్థనొందినప్పుడుగూడ, నతనిరక్షింపఁబోవకున్నావు కావున, నీవతనికిమిత్రునియట్లునటించుచున్నావుగాని యథార్థంబునశత్రుండవు.

అని, తాత్పర్యము.

ఇచ్ఛసి త్వం వినశ్యంతం రామం లక్ష్మణ మత్కృతే. ౬
లోభా త్త్వం మత్కృతే నూనం నానుగచ్ఛసి రాఘవమ్

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! త్వం=నీవు; మత్కృతే=నాకుఁగా; రామం=రాముని; వినశ్యంతం= నశించుచున్నవానిఁగా; ఇచ్ఛసి=కోరుచున్నావు. త్వం=నీవు; నూనం = నిశ్చయముగా; మత్కృతే=నాకుఁగా; లోభాత్=ఆశవలన; రాఘవం=రాముని; నానుగచ్ఛసి=వెంబడింపకున్నావు.

లక్ష్మణుఁడా! నీవు, నాకుఁగా, రాముండు నశింపవలయుననికోరెదవు; నిశ్చయముగ, నీవు నాయందాశపడి, రాముండశ్లీనశించుఁగాక యని, యతని యొద్దకుంబోవకున్నావు.

అని, తాత్పర్యము.

వ్యసనం తే ప్రియం మన్యే స్నేహో భ్రాతరి నాస్తి తే. ౯
తేన తిష్ఠసి విస్రబ్ధ స్త మపశ్యన్ మహాద్యుతిమ్

టీక॥ భ్రాతుః (అధ్యాహృతము) = అన్నయొక్క; వ్యసనం = కష్టమును; తే = నీకు; ప్రియం = సంతోషకరమును గా; మన్యే = తలంచెదను. తే = నీకు; భ్రాతరి = అన్నయందు; స్నేహః = చెలిమి; నాస్తి = లేదు. తేన = అందుచేత; మహాద్యుతిం = అధికమయిన కాంతిగల; తం = ఆ రాముని; అపశ్యన్ = చూడనివాఁడవై; విస్రబ్ధః = నెమ్మదిగలవాఁడవై; తిష్ఠసి = ఉన్నావు.

రామునకుఁ గష్టము వచ్చుట నీకుఁ బ్రియమని తోఁచుచున్నది, నీకు రామునియం దెంతమాత్రము స్నేహము లేదు; కావుననే, యమ్మహాతేజునకు ఆపద గలిగిన ప్పుడు, నీవు, నెమ్మదిగా నున్నావు.

అని, తాత్పర్యము.

కిం హి సంశయ మాపన్నే తస్మి న్నిహ మయా భవేత్. ౧౦
కర్తవ్య మిహ తిష్ఠంత్యా యత్ప్రధాన స్త్వమాగతః

టీక॥ త్వం = నీవు; యత్ప్రధానః = ఎవ్వఁడు ప్రధానము గాఁగలవాఁడవై; ఇహ = ఇచ్చటకి; ఆగతః = వచ్చినావో; తస్మిన్ = ఆ రాముఁడు; సంశయం = సందేహమును; ఆపన్నే = పొందినవాఁడు కాఁగా; ఇహ = ఇచ్చట; తిష్ఠంత్యా = ఉన్న; మయా = నాచేత; కింహి = ఏమి; కర్తవ్యం = చేయఁబడవలసిన భవేత్ = అగును?

నీవు, రామునిఁ జూచి యిటకు వచ్చినాఁడవుగాని, నన్నుఁ జూచి రాలేదుగదా! అట్టి రాముఁడు, ప్రాణసందేహము నొందిన పిదప, నేనిచ్చట నీతోఁ గూడ నుండి చేయవలసిన పని యేమి యున్నది? కాఁబట్టి నీవింక నన్ను రక్షింపవలసినది లేదు అని, సీత లక్ష్మణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి బ్రువాణాం వైదేహీం బాష్పశోక పరిప్లుతామ్. ౯
అబ్రవీ ల్లక్ష్మణ స్త్రస్తాం సీతాం మృగవధూ మివ

టీక॥లక్ష్మణః=లక్ష్మణుఁడు; ఇతి=ఇట్లు;బ్రువాణాం= చెప్పుచున్నదియు; బాష్పశోకపరిప్లుతాం= కన్నీళ్లచేతను దుఃఖముచేతనుదడుపఁబడినదియు; త్రస్తాం=భయపడిన; మృగవధూమివ(స్థితాం)=ఆఁడుజింకవలెనున్నదియు; వైదేహీం=విదేహదేశమునందుఁబుట్టినదియునగు;సీతాం=సీతనుగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

లక్ష్మణుఁడు, ఈప్రకారంబునఁగోపముచేఁజెప్పుచున్నదియుఁ గన్నీళ్లుగా రోదనంబుసేయుచు భయంబునొందిన యాఁడుజింకకైవడి నతిచపలయయి యున్నదియునగుసీతంజూచి, యిట్లని, చెప్పెను అని, తాత్పర్యము.

పన్నగాసురగంధర్వ దేవమానుషరాక్షసైః. ౧౦
అశక్య స్తవ వైదేహి భర్తా జేతుం న సంశయః

టీక॥వైదేహి=సీతాదేవీ! తవ=నీయొక్క; భర్తా=పెనిమిటి; పన్నగాసురగంధర్వదేవమానుషరాక్షసైః=సర్పములచేతను అసురులచేతను గంధర్వులచేతను దేవతలచేతనుమనుష్యులచేతను రాక్షసులచేతను; జేతుం=జయించుటకు;అశక్యః= అలవికాఁడు. సంశయః=సందేహము;న=లేదు.

సీతాదేవీ!పన్నగలుగాని యసురులుగాని గంధర్వులుగాని దేవతలుగాని మనుష్యులుగాని రాక్షసులుగాని , నీ భర్తనురామునిజయింపఁజాలరు; ఇందుకుసందియము లేదు.

అని, తాత్పర్యము.

దేవి దేవమనుష్యేషు గంధర్వేషు పతత్రిషు. ౧౧
రాక్షసేషు పిశాచేషు కిన్నరేషు మృగేషుచ
దానవేషుచ ఘోరేషు న స విద్యేత శోభనే. ౧౨
యో రామం ప్రతియుధ్యేత సమరే వాసవోపమమ్

టీక॥శోభనే = మంగళరూపిణివగు; దేవి=సీతాదేవీ!సమరే = యుద్ధము




నందు; వాసవోపమం = ఇంద్రునితోఁ బోలిక గల; రామం ప్రతి = రామునిగూర్చి; యః = ఎవ్వఁడు; యుద్ధ్యేత = పోరునో; సః = అతఁడు; దేవమనుష్యేషు = దేవతలయందును మనుష్యులయందును, గంధర్వేషు = గంధర్వులయందను, పతత్రిషు = పక్షులయందను; రాక్షసేషు = రాక్షసులయందును; పిశాచేషు = పిశాచములయందును; కిన్నరేషు = కిన్నరులయందును; మృగేషుచ = మృగములయందును, ఘోరేషు = భయంకరులగు; దానవేషుచ = దానవులయందును; నవిద్యేత = ఉండఁడు.

మంగళస్వరూపిణివగు సీతాదేవీ! యుద్ధంబున దేవేంద్రతుల్య పరాక్రముఁడగు రామునితోఁబోరువాఁడు, దేవతలలోఁగాని, మనుష్యులలోఁగాని గంధర్వులలోఁగాని పక్షులలోఁగాని, రాక్షసులలోఁగాని పిశాచంబులలోఁగాని కిన్నరులలోఁగాని మృగంబులలోఁగాని, భయంకరాకారులగు దానవులలోఁగాని, యుండఁడు. అని, తాత్పర్యము.

అవధ్య స్సమరే రామో నైవం త్వం వక్తు మర్హసి. ౧౩
నత్వా మస్మి న్వనే హాతు ముత్సహే రాఘవం వినా

టీక॥ రామః = రాముఁడు; సమరే = యుద్ధమునందు; అవధ్యః = వధింపనలవిగానివాఁడు; త్వం = నీవు; ఏవం = ఇట్లు; వక్తుం = చెప్పుటకు; నార్హసి = తగవు. రాఘవంవినా = రాముఁడులేక; త్వాం = నిన్ను; అస్మిన్ = ఈ; వనే = అడవియందు; హాతుం = విడుచుటకు; నోత్సహే = ఉత్సహింపను.

రాముండు, యుద్ధంబునెట్టివారికిని వధ్యుండు కాఁడు; నీవిట్లు చెప్పవలదు; రాముండు లేకుండునప్పుడు, నిన్నొంటిమె యీ వనంబున విడిచిపోఁజాలను.

అని, తాత్పర్యము.

అనివార్యం బలం తస్య బలై ర్బలవతా మపి. ౧౪
త్రిభి ర్లోకై స్సముద్యుక్తై స్సేశ్వరై రపి సామరైః

టీక॥ బలవతామపి = అధికమయిన బలముగలవారలయొక్క; బలైరపి = బలములచేతనుగూడ; సముద్యుక్తైః = సన్నద్ధములగు, సేశ్వరైః = ఇంద్రునితోఁగూ



స ౪౫

డినవియు; సామరైః= దేవతలతోఁగూడినవియునగు; త్రిభిః = మూఁడైన; లోకైః=లోకములచేతను; తస్య = ఆరామునియొక్క; బలం = బలము; అనివార్యం=నివారింపఁదగినది కాదు.

ఇంద్రునితోను దేవతలతోనుం గూడ ముల్లోకంబులునొక్కటైవచ్చినను, ఎట్టిబలవంతులకును, రాము నెదిరింప నలవిగాదు. అని, తాత్పర్యము.

హృదయం నిర్వృతం తేస్తు సంతాప స్త్యజ్యతా మయమ్. ౧౫
ఆగమిష్యతి తే భర్తా శీఘ్రం హత్వా మృగోత్తమమ్

టీక॥ తే=నీయొక్క; హృదయం = మనస్సు; నిర్వృతం=దుఃఖము లేనిది, అస్తు= అగుఁగాక. అయం=ఈ; సంతాపః= దుఃఖము; త్యజ్యతాం = విడువఁబడుఁగాక. తే=నీయొక్క; భర్తా= పెనిమిటి; శీఘ్రం=శీఘ్రముగా ; మృగోత్తమం=మృగశ్రేష్ఠమును; హత్వా= వధించి; ఆగమిష్యతి=రాఁగలఁడు.

మనస్సును నెమ్మదిగఁజేసికొనుము; ఈపరితాపంబు విడువుము; నీపెనిమిటి రాముండు, ఆమృగశ్రేష్ఠంబును వధించి, శీఘ్రంబున వచ్చును. అని, తాత్పర్యము.

నచ తస్య స్వరో వ్యక్తం మాయయా కేనచి త్కృతః. ౧౬
గంధర్వనగరప్రఖ్యా మాయా సా తస్య రక్షసః

టీక॥ అయం(అధ్యాహృతము) చ= ఇదియు; తస్య=ఆరామునియొక్క; స్వరః=ధ్వని; న=కాదు కేనచిత్=ఒకానొకనిచేత; మాయయా= మాయచేత; కృతః=చేయబడినది. తస్య=ఆ; రక్షసః=మారీచునియొక్క; సా=ఆ; మాయా=మాయ; గంధర్వనగరప్రఖ్యా= గంధర్వనగరమువంటిది.

ఈధ్వనియు రామునికంఠధ్వని కాదు ; ఆమారీచుండు మాయచేనిట్టిధ్వనిని నిర్మించినాఁడు ; మారీచునిమాయ గంధర్వ నగరమువంటిది; అది విచిత్రముగా వ్యామోహము గలిగించును. అని, తాత్పర్యము.

న్యాసభూతాసి వైదేహి న్యస్తా మయి మహాత్మనా. ౧౭
రామేణ త్వం వరారోహే నత్వాం త్యక్తు మిహోత్సహే

టీక॥వరారోహే= శ్రేష్ఠములయిన పిఱుఁదులుగల; వైదేహి = సీతాదేవీ! త్వం=నీవు; న్యాసభూతా = దాఁచనుంచఁబడిన దానవు; అసి = అగుచున్నావు. మయి=నాయందు ; మహాత్మనా=అధికమయినప్రభావముగల; రామేణ=రాముని చేత; న్యస్తా = ఉంచఁబడినావు. త్వాం=నిన్ను; ఇహ = ఇచ్చట; త్యక్తుం=విడుచుటకు; నోత్సహే=కోరను.

సుందరములయిన పిఱుఁదులుగల సీతాదేవీ ! మహాత్ముండగు రాముండు "ఈబిడను రక్షించి నేనువచ్చినప్పుడు నాకప్పగింపుము" అని, నావశంబున, నిన్నుంచెను; కావున , నేనునిన్నీవనంబున నొంటిమెయి విడువంజాలను.

అని, తాత్పర్యము.

కృతవైరాశ్చ వైదేహి వయ మేతై ర్నిశాచరైః. ౧౮
ఖరస్య నిధనాదేవ జనస్థానవధం ప్రతి

టీక॥వైదేహి=సీతాదేవీ! ఖరస్య=ఖరునియొక్క; నిధనాదేవ=చావువలననే; జనస్థానవధంప్రతి= జనస్థానంబున వధించుటనుగూర్చి; వయం=మనము; ఏతైః=ఈ; నిశాచరైః=రాక్షసులతో; కృతవైరాశ్చ= చేయఁబడినవైరముగలవారలము.

సీతాదేవీ! మఱియు, ఖరునివధించుటవలన, జనస్థానయుద్ధంబు మొదలు, తమప్రభువును జంపినామనిమనమీఁద, నీరాక్షసులందఱుఁబగగొనియున్నారు;

అని, తాత్పర్యము.

రాక్షసా వివిధా వాచో విసృజంతి మహావనే. ౧౯
హింసావిహారా వైదేహి న చింతయితు మర్హసి

టీక॥వైదేహి=సీతాదేవీ! హింసావిహారాః = హింసచేవిహరించునట్టి; రాక్షసాః=రాక్షసులు; మహావనే=మహారణ్యమునందు; వివిధాః=నానావిధములయిన; వాచః=మాటలను; విసృజంతి = విడుచుచున్నారు. చింతయితుం=ఆలోచించుటకు; నార్హసి=తగవు.

సీతాదేవి! అట్లు, హింసాస్వభావులగు రాక్షసులు, మనపైవిరోధంబునమనకు భయమోహంబులు గలుగవలయు

నని, నానావిధములగుమాటలు చెప్పుచు న్నారు. అని,లక్ష్మణుండు, సీతాదేవి తోఁజెప్పెను. అని, తాత్పర్యము.

లక్ష్మణేనైవ ముక్తా సా క్రుద్ధా సంరక్తలోచనా. ౨౦
అబ్రవీత్పరుషం వాక్యం లక్ష్మణం సత్యవాదినమ్

టీక॥సా=ఆసీత; లక్ష్మణేన=లక్ష్మణునిచేత;ఏవం=ఇట్లు,ఉక్తా= చెప్పఁబడినదై;క్రుద్ధా=కోపమునొందినదై;సంరక్తలోచనా=ఎఱ్ఱనైనకన్నులుగలదై; సత్యవాదినం=సత్యమును జెప్పునట్టి; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; పరుషం=కఠినమయిన;వాక్యం = మాటను;అబ్రవీత్ =చెప్పెను.

ఆసీతాదేవి, లక్ష్మణుండు చెప్పిన మాటనువిని,కోపంబునొంది,కన్నులనెఱ్ఱఁదనంబుగదుర,సత్యవాదియగులక్ష్మణుంజూచి, పరుషవచనంబునసిట్లనియె. అని, తాత్పర్యము.

అకార్యకరణారంభ నృశంస కులపాంసన. ౨౧
అహం తవ ప్రియం మన్యే రామస్య వ్యసనం మహత్

టీక॥అకార్యకరణారంభ= చేయరానిపనిచేయుట యారంభించువాఁడవు;నృశంస=ఘాతుకుండవు; కులపాంసన=కులంబుఁ జెఱచువాఁడవునగులక్ష్మణుఁడా!అహం=నేను;రామస్య= రామునియొక్క;మహత్ = గొప్పదగు; వ్యసనం=కష్టము ; తవ = నీకు; ప్రియం=సంతోషకరమునుగా ; మన్యే= తలంచెదను.

చేయరానిపని చేయఁగోరినవాఁడవు క్రూరుండవుకులంబుఁ జెఱుపంబుట్టినవాఁడవునగులక్ష్మణుఁడా ! రామునకు మహావిపత్తుగలుగుటంతెయు , నీకుసంతోషంబని నాకుఁదోఁచుచున్నది. అని, తాత్పర్యము.

రామస్య వ్యసనం దృష్ట్వా తే నైతాని ప్రభాషసే. ౨౨

టీక॥త్వం(అధ్యాహృతము)=నీవు; తేన=అందుచేత; రామస్య = రాముని




యొకఁడు; వ్యసనం=ఆపదను; దృష్ట్వా=చూచి; ఏతాని; ఈమాటలను; ప్రభాషసే=చెప్పుచున్నావు.

అందువలననె, రామునకాపదగలిగినప్పుడు, అతనిరక్షింపంబోక, యీమాటంజెప్పుచున్నావు.

అని, తాత్పర్యము.

నైత చ్చిత్రం సపత్నేషు పాపం లక్ష్మణ యద్భవేత్
త్వద్విధేషు నృశంసేషు నిత్యం ప్రచ్ఛన్నచారిషు. ౨౩

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! ప్రచ్ఛన్నచారిషు = కపటముగలవారలయి సంచరించువారలును; సపత్నేషు = శత్రువులును; నిత్యం=ఎల్లప్పుడును; నృశంసేషు=ఘాతుకులునగు; త్వద్విధేషు=నీయట్టివారలయందు; పాపం=పాపము; భవేత్ (ఇతి) యత్=కలుగుననునదియేదిగలదో; ఏతత్=ఇది; నచిత్రం=ఆశ్చర్యకరముగాదు.

కపటంబునమిత్రవేషంబుతో వ్యవహరించువారలును యథార్థంబున శత్రువులునుగ్రూరులునగు నీయట్టివారలకిట్టిద్రోహబుద్ధిగలుగుట యెంతమాత్రమాశ్చర్యకరముగాదు.

అని, తాత్పర్యము.

సుదుష్ట స్త్వం వనే రామ మేక మేకోను గచ్ఛసి
మమ హేతోః ప్రతిచ్ఛన్నః ప్రయుక్తో భరతేన వా. ౨౪

టీక॥ సుదుష్టః= మిక్కిలియుదుష్టుండవగు; త్వం=నీవు; మమ హేతోః= నానిమిత్తమయి; ప్రతిచ్ఛన్నః = కప్పఁబడినవాఁడవై; భరతేన=భరతునిచేత; ప్రయుక్తోవా=పంపఁబడినవాఁడవైయో యేమొ; వనే=అడవియందు; ఏకం= ఒకఁడైన; రామం=రాముని; ఏకః=ఒకఁడవై; అనుగచ్ఛసి= వెంబడించుచున్నావు.

నీవుపరమదుష్టుండవు; నీకైయొ, లేక, భరతప్రేరితుండవైయొ, నానిమిత్తమయి, కపటంబున, నడవియందు, ఒకఁడవై, రాముని వెంబడించి వచ్చుచున్నావు. అని, తాత్పర్యము.

త న్నసిధ్యతి సౌమిత్రే తవవా భరతస్యవా

టీక॥సౌమిత్రే=లక్ష్మణుఁడా! తవ వా=నీకు గాని,భరతస్యవా=భరతునికిఁ గాని;తత్=అది;నసిధ్యతి=సిద్ధింపదు.

లక్ష్మణుఁడా! నీకుఁగాని భరతునికిఁ గాని,నన్నుఁబొందవలెనను కోరిక-మాత్రము సిద్ధింపదు. అని, తాత్పర్యము.

కథ మిందీవరశ్యామం పద్మపత్ర నిభేక్షణమ్. ౨౫
ఉపసంశ్రిత్య భర్తారం కామయేయం పృథగ్జనమ్

టీక॥ఇందీవరశ్యామం= నల్లకలువ వలెనల్లనివాఁడును ; పద్మపత్రనిభేక్షణం=తామరపూరేకులతో సమానంబులగుకన్నులుగలవాఁడునగురాముఁ; భర్తారం=పెనిమిటినిగా; ఉపసంశ్రిత్య=పొంది;కథం=ఎట్లు;పృథగ్జనం=అన్యుని;కామయేయం=కోరుదును?

నల్లనికలువలువలె నల్లనిమనోహర దేహముగలవాఁడును దామరపూరేకులంబోలె విశాలసుందరంబులగు కన్నులుగలవాఁడునగు రామునిభర్తనుగాఁ బొంది,అన్యపురుషు నెట్లుకామింతును? అని, తాత్పర్యము.

సమక్షం తవ సౌమిత్రే ప్రాణాం స్త్యక్ష్యే న సంశయః. ౨౬
రామంవినా క్షణమపి నహి జీవామి భూతలే

టీక॥సౌమిత్రే=లక్ష్మణుఁడా!తవ=నీయొక్క;సమక్షం=ఎదుట;ప్రాణాన్=ప్రాణములను; త్యక్ష్యే= విడిచెదను. సంశయః=సందేహము; న=లేదు;రామంవినా=రామునివిడిచి; క్షణమపి = క్షణమయినను; భూతలే=భూమియందు; నజీవామిహి = బ్రతుకనుగదా!

లక్ష్మణుఁడా! నీయెదుటఁబ్రాణంబులువిడిచెదను ; అందుకుసంశయములేదు ; రామునివిడిచి , క్షణమేనిభూమియందుజీవించియుండజాలను. అని, సీత,లక్ష్మణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్తః పరుషం వాక్యం సీతయా రోమహర్షణమ్. ౨౭
అబ్రవీ ల్లక్ష్మణ స్సీతాం ప్రాంజలి ర్విజితేంద్రియః




టీక॥ విజితేంద్రియః = జయింపఁబడినయింద్రియములుగలః; లక్ష్మణః = లక్ష్మణుఁడు, ఇతి = ఇట్లు; సీతయా = సీతచేత; పరుషం = కఠినమును; రోమహర్షణం = వెండ్రుకలగగుపాటునొందఁజేయునదియునగు, వాక్యం = మాటను; ఉక్తః = చెప్పఁబడినవాఁడై; ప్రాంజలిః = మంచిచేమోడ్పుగలవాఁడై; సీతాం = సీతనుగూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

జితేంద్రియుండగులక్ష్మణుండు, అట్లుసీతాదేవిచెప్పిన పరుషంబును గగుపాటుగలిగించునదియునగుమాటను విని, చేమోడ్పుగీలించి, సీతంజూచియిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

ఉత్తరం నోత్సహే వక్తుం దైవతం భవతీ మమ. ౨౮

టీక॥ ఉత్తరం = బదులుమాటను; వక్తుం = చెప్పుటకు; నోత్సహే = ఉత్సహింపను. భవతీ = నీవు; మమ = నాకు, దైవతం = దేవతవు.

నేనునీకుబదులుచెప్పనోల్లను; నీవు నాకుదేవతవు. అని, తాత్పర్యము.

వాక్యమప్రతిరూపంతు నచిత్రం స్త్రీషు మైథిలి
స్వభావ స్త్వేష నారీణా మేవం లోకేషు దృశ్యతే. ౨౯

టీక॥ మైథిలి = సీతాదేవీ! స్త్రీషు = స్త్రీలయందు; అప్రతిరూపం = అనుచితమయిన; వాక్యంతు = మాటమాత్రము; చిత్రంన = ఆశ్చర్యకరము గాదు. ఏషః = ఇది; నారీణాం = స్త్రీలయొక్క; స్వభావః = స్వభావము; ఏవం = ఇట్లు; లోకేషు = లోకములయందు; దృశ్యతే = చూడఁబడుచున్నది.

సీతాదేవీ! ఇట్లు, అనుచితమయిన మాటచెప్పుట, స్త్రీలయందెంతమాత్రము ఆశ్చర్యకరము గాదు; స్త్రీలకిది స్వభావము; లోకములందంతటను ఇట్లే యగపడుచున్నది. అని, తాత్పర్యము.

విముక్తధర్మా శ్చపలా స్తీక్ష్ణా భేదకరా స్త్రియః

టీక॥ స్త్రియః = స్త్రీలు; విముక్తధర్మాః = విడువఁబడిన ధర్మములుగల






వారలు. చపలాః=చంచలస్వభావలు, తీక్ష్ణాః= క్రూరలు. భేదకరాః= విరోధముగలిగించువారలు.

స్త్రీలు, ధర్మమంబువిడిచినవారలు, చంచలబుద్ధులు; క్రూరచిత్తలు; ఎట్టిస్నేహితులకేనివిరోధముగలిగింతురు.

అని, తాత్పర్యము.

స॰ సహే హీదృశం వాక్యం వైదేహీ జనకాత్మజే. ౩౦
శ్రోత్రయో రుభయో ర్మేఽద్య తప్తనారాచసన్నిభమ్

టీక॥జనకాత్మజే=జనకమహారాజుకొమార్తెవగు; వైదేహీ=సీతాదేవీ! అద్య=ఇప్పుడు; మే=నాయొక్క; శ్రోత్రయోః=చెవులకు; తప్తనారాచసన్నిభం= కాచఁబడినబాణముతోసమానమయిన; ఈదృశం=ఇట్టి; వాక్యం=మాటను; నసహేహి=సహింపఁజాలనుగదా!

జనకమహారాజుకొమార్తెవగు సీతాదేవీ! ఈమాట, నాచెవులకునిప్పులోఁగాచిన బాణమువలెనున్నది; ఇట్టిమాటను నేనుసహింపఁజాలను.

అని, తాత్పర్యము.

ఉపశృణ్వంతు మే సర్వే సాక్షిభూతా వనేచరాః. ౩౧
న్యాయవాదీ యథా ఽ న్యాయ్య ముక్తోఽహం పరుషం త్వయా

టీక॥యథా=ఎట్లు; న్యాయవాదీ=న్యాయమునుజెప్పునట్టి; అహం=నేను; త్వయా=నీచేత; అన్యాయ్యం = అన్యాయముగా; పరుషం = కఠినముగా; ఉక్తః=చెప్పఁబడినానో; తథా(అధ్యాహృతము)=అట్టిసంగతిని; వనేచరాః=వనచరదేవతలు; సర్వే=అందఱు; మే=నాకు; సాక్షిభూతాః= సాక్షులయినవారలయి; ఉపశృణ్వంతు = విందురుగాక.

నీవు, న్యాయవాదినగునన్నుఁజూచి, యిట్లన్యాయముగాఁ బరుషవాక్యంబులాడినసంగతిని, వనచరదేవతలందఱు, నాకుసాక్షులయివినియుందురుగాక.

అని, తాత్పర్యము.

ధిక్త్వా మద్య ప్రణశ్య త్వం యన్మా మేవం విశంకసే. ౩౨



స్త్రీత్వం దుష్టం స్వభావేన గురువాక్యే వ్యవస్థితమ్

టీక॥ యత్=ఎందువలన; గురువాక్యే=అన్నమాటయందు; వ్యవస్థితం=ఉన్నట్టి; మాం=నన్ను; ఏవం=ఇట్లు; విశంకసే = సందేహించుచున్నావో, తత్ (అధ్యాహృతము)=అందువలన; త్వాం=నిన్ను; ధిక్ = దహించుటయగుంగాక. త్వం=నీవు; అద్య=ఇప్పుడు; ప్రణశ్య=నశింపుము; స్త్రీత్వం= స్త్రీత్వము; స్వభావేన=స్వభావముచేత; దుష్టం=దోషముగలది.

అన్నగారియాజ్ఞనుశిరసావహించియున్ననామీఁదనిట్లుసందేహించి నిందమోపుచున్నావుకావుననీవుదహింపఁబడుదువుగాక; ఇప్పుడె నాశమునొందుము; స్త్రీలుస్వభావంబుననెదుష్టలు. అని, తాత్పర్యము.

గమిష్యే యత్ర కాకుత్స్థ స్వస్తి తేఽస్తు వరాననే. ౩౩

టీ॥ వరాననే= సుందరమయినముఖముగలసీతా! యత్ర=ఎచ్చట; కాకుత్స్థః=రాముఁడు; అస్తి(అధ్యాహృతము)=ఉన్నాఁడో; తత్ర(అధ్యాహృతము)=అచ్చటికి; గమిష్యే= పోయెదను. తే=నీకు; స్వస్తి=మంగళము; అస్తు=అగుఁగాక

సుందరమయినముఖముగల సీతాదేవీ! నేను రాముఁడు ఉన్నచోటికిఁ బోయెదను; నీకుమంగళమగుఁగాక. అని, తాత్పర్యము.

రక్షంతు త్వాం విశాలాక్షి సమగ్రా వనదేవతాః

టీక॥విశాలాక్షి= వెడల్పులయినకన్నులుగలసీతాదేవీ! వనదేవతాః=వనదేవతలు; సమగ్రాః=అందఱు; త్వాం=నిన్ను; రక్షంతు=కాపాడుదురుగాక

విశాలంబులగు కన్నులుగలసీతాదేవి! వనదేవతలందఱునిన్నురక్షింపుచుందురుగాక. అని, తాత్పర్యము.

నిమిత్తానిహి ఘోరాణి యాని ప్రాదుర్భవంతి మే. ౩౪
అపి త్వాం సహరామేణ పశ్యేయం పునరాగతః

నవే త్యేత న్నజానామి వైదేహి జనకాత్మజే

టీక॥ జనకాత్మజే= జనకమహారా
జుకొమార్తెవగు ; వైదేహి= సీతా
దేవీ! మే=నాకు;ఘోరాణి=భయంకర
ములగు;యాని=ఏ,నిమిత్తాని= శకున
ములు;ప్రాదుర్భవంతిహి= తోఁచుచు
నెయున్నవో; తైః(అధ్యాహృతము)=
వానిచేత; అహం(అధ్యాహృతము)=
నేను;పునః=మఱల;ఆగతః = వచ్చిన
వాఁడనై ; రామేణసహ=రామునితోఁ
గూడ;త్వాం= నిన్ను;అపిపశ్యేయం=
చూడఁగలనో;నవా=లేనో;ఏతత్ =దీని
ని;నజానామి=ఎఱుంగను.

జనకమహారాజుకొమార్తెవగు సీ
తాదేవీ!ఇప్పుడు,ఇట్లుభయంకరంబు ల
గుదుర్నిమిత్తంబులు తోఁచుటంజూడఁ
గా, నేనుమఱలవచ్చి, రామునితోఁగూడ
నిన్నుఁ జూతునోలేనో, అనునదిగూడ
సందేహముగానున్నది. అని,లక్ష్మణుం
డు,సీతాదేవితోఁజెప్పెను.

అని,తాత్పర్యము.

లక్ష్మణేనైవ ముక్తా సా రుదంతీ జనకాత్మజా. ౩౫
ప్రత్యువాచ తతో వాక్యం తీవ్రం బాష్పపరిప్లుతా

టీక॥తతః=అంత;జనకాత్మజా=జ
నకమహారాజుకొమార్తెయగు సీతా
దేవి;లక్ష్మణేన=లక్ష్మణునిచేత;ఏవం=
ఇట్లు;ఉక్తా=చెప్పఁబడినదై; రుదంతీ=
ఏడ్చుచు;బాష్పపరిప్లుతా=కన్నీళ్లచేఁద
డుపఁబడినదై;తీవ్రం=తీక్ష్ణమయిన;వా
క్యం=మాటను; ప్రత్యువాచ=బదులు
చెప్పెను.

అంత,నాసీతాదేవి, లక్ష్మణుండు
చెప్పినమాటనువిని, రోదనంబుసేయు
చుఁ,గన్నీళ్లుగాఱ, నాలక్ష్మణుంజూచి,
తీక్ష్ణంబగునీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

గోదావరీం ప్రవేక్ష్యామి వినారామేణ లక్ష్మణ. ౩౬

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! రామే
ణవినా=రామునివిడిచి; గోదావరీం=
గోదావరీనదిని;ప్రవేక్ష్యామి= ప్రవేశిం
చెదను.

లక్ష్మణుఁడా ! రామునివిడిచి నే
నునిమిషమేనిజీవింపఁజాలను; గోదావ

రీనదిలోఁబడిప్రాణంబులువిడిచెదను. అని, తాత్పర్యము.

ఆబంధిష్యేథ వా త్యక్ష్యే విషమే దేహ మాత్మనః
పిబామ్యహం విషం తీక్ష్ణం ప్రవేక్ష్యామి హుతాశనమ్. ౩౭

టీక॥అహం=నేను ; ఆబంధిష్యే= ఉరిఁబోసుకొనెదను. అథవా= లేక, విషమే=నిమ్నప్రదేశమునందు ; ఆత్మనః=నాయొక్క ; దేహం = దేహము ను;త్యక్ష్యే=విడిచెదను. తీక్ష్ణం= అధికమయినవేగముగల; విషం = విషము ను;పిబామి=త్రాఁగెదను హుతాశనం=అగ్నిహోత్రమును ; ప్రవేక్ష్యామి=ప్రవేశించెదను.

నేను,ఉరిఁబోసికొనినైనను , పర్వతంబుపైనుండిపడియయినను , ఉగ్రంబగువిషంబుద్రావియయినను , అగ్నిలోఁబడియయినను ప్రాణంబులు విడిచెదను. అని, తాత్పర్యము.

న త్వహం రాఘవా దన్యం పదాపి పురుషం స్పృశే

టీక॥అహం=నేను ; రాఘవాత్= రామునికన్న;అన్యం= ఇతరుఁడయిన; పురుషంతు=పురుషునిమాత్రము ; పదాపి=కాలిచేనైనను;నస్పృశే= తాఁకను.

నేను , రామునికన్ననితరపురుషునిమాత్రము,పాదముతోనైనను, స్పృశింపను.అని,సీతాదేవి, లక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇతి లక్ష్మణ మాక్రుశ్య సీతా దుఃఖసమన్వితా. ౩౮
పాణిభ్యాం రుదతీ దుఃఖా దుదరం ప్రజఘాన హ

టీక॥ సీతా=సీతాదేవి; ఇతి = ఇట్లు; లక్ష్మణం=లక్ష్మణుని; ఆక్రుశ్య= నిందించి; దుఃఖసమన్వితా= దుఃఖముతోఁగూడినదై; రుదతీ=ఏడ్చుచు ; దుఃఖాత్ =దుఃఖమువలన; పాణిభ్యాం = చేతులచేత; ఉదరం=కడుపును;ప్రజఘాన=కొట్టుకొనెను. "హ"అనునది పాదపూరణార్థము.

సీతాదేవి , ఈప్రకారంబునలక్ష్మణునినిందించి , పరమదుఃఖితయయి ,

దుఃఖాతిశయంబునఁ, జేతులతో నుదరంబు మోఁదుకొనుచు, రోదనముగావించెను. అని, తాత్పర్యము.

తా మార్తరూపాం విమనా రుదంతీం
సౌమిత్రి రాలోక్య విశాలనేత్రామ్. ౩౯
ఆశ్వాసయామాస నచైవ భర్తుః
స్తం భ్రాతరం కించి దువాచ సీతా

టీక॥ సౌమిత్రిః=లక్ష్మణుఁడు ; ఆర్తరూపాం=దుఃఖితయును; రుదంతీం=ఏడ్చుచున్నదియు; విశాలనేత్రాం=వెడల్పులయిన కన్నులు గలదియు నగు తాం=ఆసీతాదేవిని; ఆలోక్య=చూచి; విమనాః=దుఃఖమునొందిన మనస్సుగలవాఁడై; ఆశ్వాసయామాస=ఊఱడించెను. సీతా=సీత ; భర్తుః=పెనిమిటియొక్క ; భ్రాతరం=తమ్ముఁడగు; తం=ఆలక్ష్మణునిఁగూర్చి; కించిత్=కొంచెమైనను; నైవోవాచ=చెప్పనేలేదు.

లక్ష్మణుఁడు, సీతాదేవి యిట్లు దుఃఖితయై విశాలనేత్రంబులనుండి నీళ్లు గాఱ, రోదనంబు సేయుటం జూచి, దుఃఖితుండై, యూఱడించెను, సీతాదేవి, మఱఁదితో నేమియుఁ బలుకకుండెను. అని, తాత్పర్యము.

తతస్తు సీతా మభివాద్య లక్ష్మణః
కృతాంజలిః కించి దభిప్రణమ్య చ. ౪౦
అన్వీక్షమాణో బహుశశ్చ మైథిలీం
జగామ రామస్య సమీప మాత్మవాన్

టీక॥ తతస్తు = అంతను ; ఆత్మవాన్= అధికమయిన ధైర్యముగల; లక్ష్మణః=లక్ష్మణుఁడు; సీతాం=సీతను; అభివాద్య=నమస్కరించి ; కృతాంజలిః=చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై; కించిత్=కొంచెము; అభిప్రణమ్య చ=నమస్కరించియు; బహుశశ్చ=పెక్కుమాఱులును; మైథిలీం=సీతను; అన్వీక్షమాణః=వెనుకకుఁదిరిగిచూచుచు; రామస్య=రామునియొక్క; సమీపం=స

మీపమును; జగామ=పొందెను.

అంత, మహాత్ముండగు లక్ష్మణుండు, సీతాదేవికభివాదనంబు గావించి, మఱలఁగోపంబు దేటపడఁ జేమోడ్పు గీలించి, కొంచెము గానమస్కరించి, పెక్కుమాఱులు, వెనుకకుఁ దిరిగితిరిగిసీతాదేవిం జూచుచు, రాముని సమీపంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, ఆరణ్యకాండే, పంచచత్వారింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, ఆరణ్యకాండపంచచత్వారింశసర్గటీక, ముగిసినది.



౪౬

షట్చత్వారింశ సర్గ ప్రారంభః.

తయా పరుష ముక్తస్తు కుపితో రాఘవానుజః
స వికాంక్షన్ భృశం రామం ప్రతస్థే న చిరా దివ. ౧

టీక॥సః=ఆ;రాఘవానుజః.=రాముని తమ్ముఁడగు లక్ష్మణుఁడు;తయా=ఆసీత చేత;పరుషం=కఠినముగా ; ఉక్తస్తు = చెప్పఁబడిన వాఁడైనంతనే; కుపితః=కోపమునొందినవాఁడై ; భృశం=మిక్కిలియు;వికాంక్షన్= ఇచ్ఛించనివాఁడై;నచిరాదివ = శీఘ్రముగా వలెనే;రామం=రామునిఁగూర్చి ; ప్రతస్థే=తరలెను.

ఆలక్ష్మణుండు, సీతాదేవి చేసినట్లు పరుషంబుగాఁ బలుకంబడిన వాఁడై, ఎంతమాత్రమును మనంబున నిచ్ఛలేనివాఁడయ్యును , సీతనొంటిగా విడిచిపోవలయునేయని కాళ్ళు వెనుకకీడ్వఁగా, శీఘ్రింబునం బోవలెనని యతిప్రయత్నంబున రామునొద్దకుఁబోయెను.

అని, తాత్పర్యము.

తదా సాద్య దశగ్రీవః క్షిప్ర మంతర మాస్థితః
అభిచక్రామ వై దేహీం పరివ్రాజికరూపధృత్. ౨

టీక॥అంతరం=అవకాశమును;ఆస్థితః = ఎదురుచూచుచున్నట్టి ; దశగ్రీవః=రావణుఁడు;తత్ = ఆయవకాశమును;ఆసాద్య=పొంది; క్షిప్రం=శీఘ్రముగా;పరివ్రాజికరూపధృత్=సన్న్యాసిరూపమును ధరించినవాఁడై; వైదేహీం=సీతాదేవినిగూర్చి; అభిచక్రామ=పోయెను.

అవకాశము నెదురుచూచుచున్న రావణుండు, లక్ష్మణుండుగూడఁబోవుటయు సీతయొంటిమెయి నుండుటయుం గని,యిదెసమయంబని, శీఘ్రింబునసన్న్యాసి రూపంబుదాల్చి, సీతాదేవి యొద్దకుఁబోయెను.అని, తాత్పర్యము.

శ్లక్ష్ణ కాషాయసంవీత శ్శిఖీ ఛత్రీ ఉపానహీ

వామే చాంసేవసజ్యాథ శుభే యష్టికమండలూ. ౩
పరివ్రాజకరూపేణ వైదేహీ మన్వపద్యత

టీ॥ సః(అధ్యాహృతము)=ఆ రావణుఁడు; అథ=అంత, శ్లక్ష్ణకాషాయసంవీతః= సన్నకావివస్త్రముచేఁగప్పఁబడినవాఁడును; శిఖీ=జుట్టుగలవాఁడును; ఛత్రీ= గొడుగుగలవాఁడును; ఉపానహీ (సంధియార్షము) = పావకోళ్లుగలవాఁడును; వామే = ఎడమదైన; అంసే= భుజశిఖరమునందు ; శుభే=సుందరములైన; యష్టికమండలూ=దండకమండలువులను; అవసజ్య చ = ఉంచుకొనియు; పరివ్రాజకరూపేణ=సన్న్యాసిరూపముచేత; వైదేహీం=సీతను; అన్వపద్యత=పొందెను.

ఆ రావణుండు, సన్నకావి వస్త్రమునుధరించి, మంచిజుట్టుగలవాఁడై, ఛత్రంబునుబాదుకలను దాల్చి, వామభుజంబుమీఁద , దండమునకుఁగమండలువు దగిలించియుంచుకొని, యిట్లు సన్న్యాసిరూపంబు దాల్చి, సీతాదేవి యొద్దకుఁబోయెను. అని, తాత్పర్యము.

తామాససాదాతిబలో భ్రాతృభ్యాం రహితాం వనే. ౪
రహితాం చంద్రసూర్యాభ్యాం సంధ్యామివ మహత్తమః

టీక॥ అతిబలః=అధికమయినబలముగల రావణుఁడు; వనే=అడవియందు; భ్రాతృభ్యాం=రామలక్ష్మణులచేత; రహితాం=విడువఁబడిన; తాం= ఆసీతను; మహత్ =గొప్పదగు; తమః=చీఁకటి; చంద్రసూర్యాభ్యాం = చంద్రసూర్యులచేత; రహితాం = విడువఁబడిన; సంధ్యామివ = సంధ్యనువలె; ఆససాద=పొందెను.

చంద్రసూర్యులు లేకుండునప్పుడు, భయంకరంబగుచీఁకటిసంధ్యంబొందునట్లు, మహాబలుండగు రావణుండు, రామలక్ష్మణులు లేకుండుసమయంబున సీతయొద్దకుఁబోయెను. అని, తాత్పర్యము.

తామపశ్యత్తతో బాలాం రామపత్నీం యశస్వినీమ్. ౫
రోహిణీం శశినా హీనాం గ్రహవద్భృశదారుణః

టీక॥ తతః=అంత; సః(అధ్యాహృతము)=ఆ రావణుఁడు; బాలాం=చిన్నది